శ్రీరామాయనమః.



శ్రీమద్వాల్మీకిమహర్షి ప్రణీత

# శ్రీమద్రామాయణము.

## సుందర కాండము.

చెదలవాడ * సుందరరామశాస్త్రులచే

వ్రాయఁబడిన ప్రతిపదాంధ్రటీకాతాత్పర్యవిశేషార్థ

సమన్వితమగు

పరమార్థచంద్రికయను వ్యాఖ్యానముతో

వావిళ్ల * రామస్వామిశాస్త్రులవారిచే

పరిష్కరింపఁబడి ప్రతిమాయుతముగ

ఆదిసరస్వతీనిలయ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

౧౮౮౯, సం॥

శ్రీః

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్యపదవాక్య ప్రమాణ పారావారపారీణ యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధ్యష్టాంగ యోగానుష్ఠాన నిష్ఠ తపశ్చక్రవర్త్యనాద్యవిచ్ఛిన్న గురు పరంపరాప్రాప్తషడ్దర్శనస్థాపనాచార్య వ్యాఖ్యాన సింహాసనాధీశ్వర సకల నిగమాగమ సారహృదయసాంఖ్య త్రయ ప్రతిపాదక వైదికమార్గప్రవర్తక సర్వతంత్ర స్వతంత్రాది రాజధానీ విద్యానగర మహారాజధానీ కర్ణాటక సింహాసనప్రతిష్ఠాపనాచార్య శ్రీమద్రాజాధిరాజగురు భూమండలాచార్య ఋశ్యశృంగ పురవరాధీశ్వరతుంగభద్రాతీరవాసి శ్రీమద్విద్యాశంకర పాదపద్మారాధక శ్రీమన్నృసింహభారతీస్వామి గురు కరకమలసంజాత శృంగేరి శ్రీసచ్చిదానంద శివాభినవ నృసింహభారతీస్వామి చరణారవిందయోః,

అఖిలావగ్రహ నిగ్రహణవ్యగ్ర సమగ్రబలేన, శ్రీమతాఽనుగ్రహేణ, విజయతేతరామయమ్.

శ్రీరస్తు.

ప్రతిపదాంధ్రటీకావిశేషార్థతాత్పర్య ప్రతిమాదిసహిత

శ్రీమద్రామాయణము.

ప్ర ధా న పో ష కు లు.

శ్రీమన్మహారాజరాజాధిరాజా శ్రీమహారాజా సాహేబు

మెహర్బాన్ దోస్తాన్ ముష్ఫక్ ఖదరదాన్ కరంపమా

య మొగలిషాన్ మీర్జారాజాది హానరేబిల్ హిజ్ హైనస్

మన్నెసుల్తాన్ బహదూర్, కె, సి, ఐ, ఇ,

ఇత్యాద్యనేక బిరుదావళీ విరాజమానులగు

శ్రీమద్రాజాధిరాజమహారాజ

శ్రీమద్విజయనగరపట్టణాధీశ్వర

శ్రీమదానందగజపతిమహారాజులుం

గారు

రూ (౫౦౦) అయిదువందలురూపాయలువిరాళమిప్పించి

మహాసాహాయ్యముచేసి

ఈగ్రంథమునకుప్రధానపోషకత్వము నంగీకరించిరి.

మంగళమస్తు.

శ్రీః

## —(*) పోషకులు (*)—

బ్రహ్మశ్రీ, మహారాజరాజశ్రీ

౧ శ్రీ బ్రహ్మానందసరస్వతీస్వాములవారు, యోగానందేశ్వరమఠం, ఎడతొరె.

౨ శ్రీరంగస్థలం శ్రీపరాశరభట్టరైన శ్రీమాన్ మహామహోపాధ్యాయ శ్రీరంగరాజభట్టర్ అయ్యంగాలున్‌గారు.

౩ ది, హానరేబిల్, పల్లె, చెంచలరావుపంతులుగారు. సి-ఐ-ఇ.

౪ దివాన్ బహాదర్ పతికి, శ్రీనివాసరావుగారు స్మాల్ కాస్ కోర్టున్ జడ్జి.

౫ సి, జి-కుప్పుసామిఅయ్యర్, బి, ఏ, బి, ఎల్, మద్రాస్ ప్రసిడెన్సిమ్యాజస్ట్రీట్

౬ వెంబాకం, కృష్ణమాచార్యులుగారు, రిజిస్ట్రారాఫ్ బుక్సు.

౭ చివుకుల రామయ్యగారు. పింషన్ తాశీల్ దార్

౮ చివుకుల, సుబ్బయ్యశాస్త్రులుగారు, విజయనగరం మునసఫ్.

౯ రాజా-దిహానరేబిల్, టి, రామరావుగారు, హైకోర్టున్‌వకీల్.

౧౦ సి, వి, సుందరశాస్త్రులగారు, బి, ఏ, బి ఎల్, హైకోర్టున్‌వకీల్.

౧౧ రాయబహద్దూర్-పి, అనంతాచార్యులుగారు, బి, ఎల్, హైకోర్టున్‌వకీల్

౧౨ తల్లాప్రగడ, సుబ్బారావుగారు-బి, ఏ బి, ఎల్, హైకోర్టున్‌వకీల్.

౧౩ శ్రీరాజా, కావలి-వేంకటపెద్దసీతారామయ్యవారు-జాగీదార్ ఆఫ్ తిన్ననూర్.

౧౪ శ్రీరాజా, కావలి-వేంకటచిన్నసీతారామయ్యవారు, జమీందార్ ఆఫు విస్సన్నపేట.

౧౫ సాహుకార్, అంబాశంకరదవేజీవారు.

౧౬ మహాభాషి, విద్వాన్ వేంకటాచార్యులువారు.

౧౭ వి, కే, రంగాచార్యులవారు

౧౮ మందపాటి రామకృష్ణయ్యపంతులువారు.

౧౯ నాగరాజు వీరరాఘవరావువారు-నెల్లూరు రంగనాయకులపేట.

౨౦ అడివి, శ్రీరామపంతులవారు, బి, ఎ, గవర్నర్ మెంట్ సెక్రటేరిఆఫీస్ క్లర్కున్.

౨౧ జి, సుబ్బరామయ్యవారు, కొంగనపురం ముఠా శివశంకరిదుర్గమ్.

౨౨ జక్క-రాజు, లక్ష్మీనారాయణప్పగారు, నంజంపేట, పుంగనూరు.

౨౩ కున్నత్తూరు, తిరువేంగడాచార్యులగారు.

౨౪ నేలటూరు, వెంకటరంగాచార్యులు అయ్యంగారు, పడార్ పల్లె శ్రోత్రియదారులు

౨౫ విశ్వనాథయ్యర్‌వారు, బి ఏ, బి ఎల్ హైకోర్టున్‌వకీల్.

౨౬ జిడ్డుపూర్ణయ్యవారు, సబ్ రిజిస్ట్రార్, గుంటూరు.

౨౭ ఘూళిపాటి సుబ్బరాయలు అయ్యవారు-ఘూళిపాటి కృష్ణయ్యవారి అన్నకుమారులు.

౨౮ కోవి సుందరరామయ్యవారు-సూపరింటెండింగ్ ఇంజనియర్స్ ఆఫీస్.

౨౯ కుందవరం-సుందరయ్యవారు

౩౦ పిన్నపాకం సుందరాచార్యులువారు

౩౧ రామచంద్రరావుగారు-అంబూరుపేట ముఠా యిజారాదారుగారు, శిఆమూరివద్దతుత్తి

౩౨ పానగంటి, వెంకట్రామానాయనివారు కొమ్మాలపేటజాగీర్ దార్ (కట్టు-

౩౩ మోకా, వెంకటాద్రిశాస్త్రులవారు.

౩౪ కొప్పరపు, రామరావుగారు-మునసఫ్.

౩౫ సోమేశ్వరతర్వాడిగారు.

౩౬ ముడియం నాగేశ్వరరావుగారు. వకీలు గుత్తి

౩౭ కలిచెలన్, వెంకటరెడ్డివారు, మదనపల్లె

౩౮ తంబళ్లపల్లె, సుబ్బారెడ్డివారు- మదనపల్లె

౩౯ బొజ్జిరెడ్డివారి సీతారామరెడ్డివారు.
౪౦ శ్రీనివాసరంగాచార్యులవారు, దేవస్థానం సంస్కృతపాఠశాల, తిరుపతి
౪౧ ఇంగంకోట శ్రీనివాసరావు గారు-
౪౨ నాగేశ్వరయ్యర్ వకీలు తిరుత్తిర పూండి
౪౩ జిడ్డు నారాయణయ్యవారు సబ్ కలెక్టరాఫీసు హెడ్ క్లర్కు
౪౪ వ, సామయ్యవారు-రివిన్యూఇనిస్పెక్టర్
౪౫ వంకాయల కృష్ణస్వామిశెట్టివారు
౪౬ నాగేశ్వరశాస్త్రులవారు, మిడిల్ స్కూల్ హెడ్ మాస్టరు, పుంగనూరు.
౪౭ బాహాల శ్రీనివాసయ్యవారు-తాలూకా కచ్చేరిగుమస్తా, వాదిల్ పాడు-

మహారాజరాజశ్రీ

౪౮ కొల్లా వెంకటకన్నయ్యసెట్టివారు-
౪౯ సాహుకార్, కృష్ణదాస్ బాలముకుందదాసువారు.
౫౦ సాహుకారు చతుర్భుజదాసు కుశాల్ దాస్ వారు.
౫౧ సమ్మర్ రంగయ్యసెట్టిగారు, బి-ఎ, ప్రొఫెసర్ క్రిష్టియన్ కాలేజ్.
౫౨ పి, కృష్ణస్వామిసెట్టివారు; బి: ఎ; బి; ఎల్ హైకోర్టు వకీలు.
౫౩ ఆజ్జి షణ్ముఖప్పవారు; ఎమ్ప్రెస్ ఆఫ్ ఇండియా ప్రెస్
౫౪ తెల్లనాకుల మల్లయ్యసెట్టివారు-
౫౫ విడవలపాటి సుబ్బరామయ్యసెట్టివారు.
౫౬ నాళం; అప్పలరాజువారు-
౫౭ శిరంకోటిలింగంవారు-
౫౮ సూరంపల్లి రెడ్డివారు
౫౯ తాటికొండ నంబెరుమాళ్ సెట్టివారు; బి; ఎ
౬౦ పిట్టి; త్యాగరాయసెట్టివారు-బి, ఎ
౬౧ గొనుగుంట్ల; నారాయణవారు-
౬౨ కామిసెట్టి; చిన్నకొండయ్యసెట్టివారు-
౬౩ శ్రీరేకం మనవాళయ్యవారు-యేలూరు సబ్ జడ్జి
౬౪ మాంబళం-వెంకటస్వామినాయుడువారు - తంజావూరి రామానాయుడి సత్రవు (యజమానులు
౬౫ పి-రంగయ్యనాయుడువారు- హైకోర్టు వకీల్-
౬౬ బి-బాలయ్యనాయుడువారు-హైకోర్టు-
౬౭ వంకాయల కుప్పయ్యసెట్టివారు-
౬౮ రాయబహదూర్ ఆర్కాడు-ధనకోటిమొదలియారివారు-మేల్పాకం-జమీందారు
౬౯ బండ్ల రామస్వామినాయుడువారు-వేలూరు డిస్ట్రిక్టు మునసబ్-
౭౦ అల్లత్తూరు-నారాయణసెట్టివారు-
౭౧ పురుచ్చేరి తిరువేంగడస్వామిపిళ్లవారు-అటర్నీ-
౭౨ మణ్ణూరుపేట-రామస్వామినాయుడువారు-తంజావూరు రామానాయుడి ధర్మ
౭౩ యస్-రామస్వామిమొదలారిగారు-హైకోర్టు వకీల్- (మానేజర్
౭౪ యస్-గోపాలస్వామిమొదలారివారు-మిరాదార్-సేలం-
౭౫ ది-ఆనరేబిల్ శ్రీ రాజా గోడె నారాయణగజపతిరాయనింగారు-విశాఖపట్నం-
౭౬ గ్రంధి-రామయ్యసెట్టివారు-
౭౭ దొడ్డి-యోగప్పగారు-పింఛను మునసబు-
౭౮ పి; వి; కృష్ణస్వామిశెట్టివారు బి.ఎ అకౌంటెంటుజనరల్ ఆఫీసు.

౭౯ మధుర-రంగరావువారు-
౮౦ ధర్మపురి-వెంకోబరావువారు వకీ
౮౧ మండి-శ్రీసరాఫువరదప్పశెట్టిగారు-
౮౨ నంబూరు-సుబ్బారావుగారు-
౮౩ పుదుచ్చేరి-లక్ష్మణస్వామిశెట్టిగారు-
౮౪ పి-సాంబయ్యగారు-నందలూరుమునసఫు

—(*) చందాదారులు- (*)—

మహారాజరాజశ్రీ.

సి-వి-సుందరంశాస్త్రులుగారు-
కోపల్లె-కృష్ణరావుగారు-
ముట్లూరుఆదినారాయణయ్యగారు-
ఆమంచెర్ల-సూరయ్యగారు-
నెమలి-మాడభూషిసుబ్రహ్మణ్యయ్యగారు
కొప్పరపు-రంగరావుగారు-
పువ్వాడ-సూర్యనారాయణరావుగారు-
పిడుగు-సుబ్బరామయ్యగారు-
పడకల్-కేశవరావుగారు.
మాచవరం-రామకృష్ణయ్యగారు-
వనంగురుస్వామయ్యగారు-
దేవళ్ల-రామస్వామయ్యగారు-
వి-లక్ష్మణరావుగారు-
ఆ-పరశురామయ్యగారు.
ధూళిపాటి-కృష్ణయ్యగారు-
క-సీతాపతయ్యగారు.
టి-వెంకటకన్నయ్యగారు-
పులుగు-వెంకట్రామయ్యగారు-
ధూళిపాటిసుబ్బరామయ్యగారు.
పేరత్తూరు-శ్రీనివాసాచార్యులుగారు-
దిగవిల్లి-తిమ్మరాజుగారు-
జనమంచి-వెంకట్రామయ్యగారు-
పడసాల-సుబ్బరామయ్యగారు-
ఎల్-రాఘవయ్యగారు-
కోదూరు-వెంకటకన్నయ్యగారు-
అద్దంకి-రఘునాథరావుగారు-
ములుకుట్ల-వెంకటప్పయ్యగారు-
మైసూరువెంకట్రావువారు-
పరహాభట్ల-అణ్ణాజిరావుగారు-
పి-అనంతాచార్యులగారు-
మాంబట్టు-లక్ష్మీనరసయ్యగారు-
చివుకులజానకీరామయ్యవారు-

మహారాజరాజశ్రీ.

గుండ్లపూడి-రామకృష్ణయ్యగారు-
వీరకుర్తి-సుబ్బరావు-
ముంగమూర్-నరసింహాపంతులు-
వెంపటి-వెంకటాచలంపంతులు-
వెన్నలగంటి-హనుమంతరావు-
బ్రహ్మసముద్రం-శేషగిరిరావు-
నెమలి-పట్టాభిరామరావు-
ఎ-త్యాగరాజయ్యగారు-
దేశిరాజు-కృష్ణయ్యగారు-
వరికుంటి-వెంకటసుబ్బారావు-
భోగిరాజు-రామచంద్రరావు-
గుడిపాటి-వెంకట్రావు-
గుండావఝల-రామకృష్ణయ్యగారు-
కోరంకి-రామలింగయ్యగారు-
వైడిపాటి-వీరాస్వామయ్యగారు-
మహాంకాళి-సుబ్బరాయలుగారు-
యు-అప్పయ్యపంతులు-
నరసరాజువారు-
వడిగెపల్లి-శేషయ్యగారు
హుల్లూరువాసుదేవప్పగారు-
మలిరెడ్డికొండప్రాయుడుగారు-
బుర్రా-శంకరశాస్త్రులుగారు-
గుండు-గురుస్వామయ్యవారు-
గురుజాడశ్రీరామమూర్తివారు-
ఓరుగంటి-లక్ష్మీనారాయణప్పవారు-
నెడామారుపీరరాఘవాచార్యులు-
కూనపరాజు-శేషాద్రిరావువారు-
రోజుకుర్తి-తిరుమలరావుగారు-
రేవూరులక్ష్మీనరసుపంతులవారు-
కృత్తివెంటి-కృష్ణమూర్తివారు-
శంకవరంవరదాచార్యులవారు-
నాచేరిరామానుజాచార్యులువారు-

మహారాజరాజశ్రీ

పొటుపల్లి-వెంకటఅప్పారావువారు-
అక్కిరాజు-చెంగల్రావువారు-
[illegible]వరాజు-రంగయ్యవారు-
మామగోలు-నాగేశ్వరరావువారు-
[illegible]మాల [illegible]రసింహాచార్యులవారు-
[illegible] వెంకట్రావువారు
శ్రీపూసపాటి-వెంకటపతిరాజువారు-
అద్దంకికేశవాచార్యులవారు-
వళాంకుప్పం కృష్ణమాచార్యులవారు-
రావుసాహేబు-పోరూరుకోటయ్యవారు-
అరింబాకం-సామయ్యవారు.
యన్-సుబ్రహ్మణ్యయ్యర్ వారు-
వి గోపాలాచార్యులవారు-
ఉప్పలధడియం-వెంకయ్యవారు-
వేలామూరు-శింగరాచార్యులవారు-
గొడవర్తి-కృష్ణయ్యవారు-
యమ్-పార్థసారథిఅయ్యంగారు-
కరణం-వెంకోబరావు-
లక్ష్మణశర్మన్ గారు-
కే-రామానుజాచార్యులువారు-
మ-విశ్వనాథశాస్త్రిలవారు.
తిరుమలనల్లాన్ చక్రవర్తి- శ్రీనివాసవెంక
టారాఘవచక్రవర్తిగారు-
పంగులూరుమునుస్వామిసెట్టివారు-
కరాలపాటి-రామానుజయ్యవారు-
చింతమత్తూరు-నంజేరుమాళ్లసెట్టిగారు-
వంకాయల-కృష్ణస్వామిసెట్టివారు-
మున్నలూరు-నరసింహులుసెట్టివారు
ఘనగిరి-చెన్నకేశవులుసెట్టివారు-
సత్రసాల-వెంకటకృష్ణమసెట్టి[illegible]రు-
నాగులకొండ-శ్రీరాములు
మాఘం వెంకట్రామానుజశ్రేష్ఠివారు-
వేమూరు వెంకటకృష్ణమశ్రేష్ఠిగారు-
ఉంపటిసెట్టి [illegible] శ్రేష్ఠిగారు-
యమ్-వెంకట్రామయ్యగారు-
కామిసెట్టి-శేషయ్యగారు-
పాలూరు-రాజంసెట్టివారు-
మన్నారు-వెంకట్రామస్వామిశ్రేష్ఠిగారు-
చల్లా గురుస్వామిశ్రేష్ఠివారు-
చుండూరు-పురుషోత్తమశ్రేష్ఠిగారు-

మహారాజరాజశ్రీ.

పోకూరు-తిరువెంగడత్తాన్ శ్రేష్ఠిగారు-
గంధపాడి-చెంగల్రాయశ్రేష్ఠిగారు-
కలవల-తిరువెంగడత్తాన్ శ్రేష్ఠిగారు-
సి-సాంబశివశ్రేష్ఠిగారు-
ఎస్-సుబ్బయ్యశ్రేష్ఠిగారు-
జి-విజయరాఘవులుశ్రేష్ఠిగారు-
మద్దిఅప్పయ్యగారు-
శింగరి-భాష్యంశ్రేష్ఠిగారు-
కోటానందమాళ్వారయ్యగారు-
టి-రామశింగుగారు-
మాధవరాజుగారు-
టి-రామయ్యశ్రేష్ఠిగారు-
కాకాణి-కృష్ణయ్యశ్రేష్ఠిగారు-
శ్రీరాజా శ్రీరంగభూపాలబాళేరావుగారు-
కంబినాయనిజవ్వాజి-రామప్పనాయనింగారు
(కంగొందిజమీందారు-
కుప్పాలకృష్ణస్వామినాయుండుగారు-
వి-వాసుదేవనాయుడుగారు-
కోటిబోయిన-భాష్యంపిళ్ల గారు-
సిలింగన్నాయకులునాయుడుగారు-
కానమూరుమంత్రాలపద్మనాభరెడ్డిగారు-
శేషాసులవరదరాజులశ్రేష్ఠిగారు-
సైదాపేట-అప్పసామిశ్రేష్ఠిగారు-
పంపి-చిన్నస్వామిశ్రేష్ఠిగారు-
వ-తిరువేంగడస్వామినాయుడువారు.
మైలాపూరు-ధనికాచలమొదలారిగారు-
అనంతయ్యనాయుడువారు-
పి-గోపాలరాజులునాయుడువారు-
మొం[illegible]రామస్వామినాయుడువారు-
చిట్టి[illegible] కృష్ణరావునాయుడువారు-
కుప్పసామిసెట్టివారు-
కుమారస్వామినాయుడువారు-
పి-గోవిందనాయుడువారు-
మాంబలం-తిరువేంగడత్తాన్ నాయుడుగారు
బండ్ల కృష్ణయ్యనాయుడుగారు- (రు
గడ్డిపాటి-కోటప్పనాయుడుఅండుసన్ గా
ఇసుకపల్లి-చిన్నయ్యనాయుండువారు.
ఆ-రామానుజయ్యవారు-
ముద్దం-కేశవులునాయుడుగారు-
మద్దిరి-వరదరాజులునాయుడుగారు-

### మహారాజరాజశ్రీ.

కు-రామస్వామినాయుడుగారు-
నిశ్చింత-ఎంబారయ్యగారు-
యమ్-రామాంజులనాయుండుగారు-
టి-గోవిందరాజులునాయుడుగారు-
టి-ఎల్-రంగయ్యనాయుడుగారు-
జమ్మి-కుప్పుసామినాయుడుగారు-
ముద్దుకృష్ణపిళ్లగారు-
చిన్నికృష్ణమనాయుడుగారు-
కరణం-హరివెంకటారామయ్యగారు-
కర్వదిరాఘవయ్యగారు-
అణ్ణంగారా నెల్లూరుకృష్ణస్వామయ్యగారు-
వి-వెంకటారావుగారు-ప్రఫసర్ ఆఫ్ మోరల్స మహారాజాస్ కాలేజీ విజయనగరం-
ధారాపురం-కొండలుసెట్టిగారు-
శాత్తునూరు-కల్యాణసుందరశాస్త్రులు-
చిరివెళ్ల - గుర్వరాజుగారు - బోరివాళ్లపల్లె గ్రామకరణం.
వెలివతి-భాస్కరప్పగారు- బొమ్మయ్యగారిపల్లెకరణం-
రామచంద్రరావుగారు అసిస్టాంటుకమీషనర్
సదాశివశాస్త్రులగారు- తిరువది-
కృష్ణస్వామినాయుడువారు - కుంభకోణం-పోలీసుయినస్పెక్టరు-
జిడ్డుకృష్ణస్వామయ్యగారు
అయ్యగారిత్రియంబకంగారు - నర్సాపురం-
టి-చిదంబరరావుగారు- ఏనూరు-
టి-నాగేశ్వరయ్యర్- కోట
జి-కృష్ణయ్యర్ - సేందమంగళం-
మేకలపార్థసారథినాయుడువారు కావలి-
కే-వెంకటరావుగారు-
యం-సి-కాశిరామయ్యగారు-పంద్రపట్టి
ముంగమూరునరహరిరావుపంతులగారు-డిప్టి తాశీల్ దార్ అల్లూరు.
పి-సుబ్బరామయ్యగారుకావలి
వొవ్వేటివెంకట్రాజుగారు-పిఠాపురం.
సి-హనుమంతరావుగారు-గుత్తి
కోవూరుకృష్ణరావుపంతులగారు-తహశీల్దారు
స్వయంపాకులవెంకటసుబ్బారావుగారు- నెల్లూరు-

### మహారాజరాజశ్రీ

మోదరపురామస్వామినాయుండుగారు-(?)
మేకలబాలకృష్ణమనాయుండుగారు-మదనప
గడ్డంనారప్పగారు-మదనపల్లె
డా-నారాయణరెడ్డిగారు-కదిరి-
యం-రామచంద్రరావుగారు-పలవనేరి-
యల్లాప్రగడ-వెంకటకృష్ణరావుగారు-కొత్తపేటగుంటూరు-
బి-యల్లప్పగారుగుత్తి
ఎస్-అంబాజిరావుగారు-వకీలుగుత్తి-
వల్లూరుజగన్నాథరావుగారు-బొబ్బిలి-
చెన్నారెడ్డిగారు-కమ్మెత్తపాటిల్
కోనా-వరదయ్యశ్రేష్ఠిగారు
ఏ-రామానుజాచార్యులుగారు సిద్ధవటం,
శ్యామజిరాఘవేంద్రరావుగారుఅనంతపురం
గోపాలకృష్ణయ్యగారు- రేపల్లె
పాపాశాస్త్రులుగారు- గుత్తి
తోటచెర్లపిరేశలింగంశాస్త్రులుగారు-
కనకరాయమొదలారిగారు-పొన్నేరి
కృష్ణరాజుగారు-కోడూరుగ్రామం శ్రోత్రియదారుపొన్నేరి
యేకామ్రయ్యగారు- శిరస్తెదార్ పొన్నేరి-
దీనదయాళునాయుడుగారు-
మోటుపల్లి వాసుదేవనాయుడుగారు - కడలూరు
బాలకృష్ణదాసుగారు-
ధర్మపురిసర్వోత్తమరావుగారు-వకీలు చిత్తూరు-
టి-దేశికాచార్యులుగారు- సబ్ రిజిస్ట్రార్ వేలూరు-
చిలకలమర్రి లక్ష్మణాచార్యులురాజమంద్రి-
మంగిపూడిరామశాస్త్రులువారు
శ్రీనివాసులమొదలియారుగారు తహశీలుదారువేలూరు-
రాళ్ళపల్లి ఆదిశేషయ్యగారు-
కృష్ణంవెంకటసుబ్బయశెట్టివారు-
ఆదుర్తివిశ్వంరాజుగారు-వకీల్ కడప-
కరణంశింగరాజుపాపరాజుగారు-
తుమ్మలపల్లి వరదరావుగారు హెడ్ అసిస్టాండుకలక్టరు-

**మహారాజ రాజశ్రీ.**

సరిపెల్లగోపాలకృష్ణమ్మగారు-
శ్రీపాదం నాగయ్యగారు-
వెంకటేశ్వరరావుగారు-
గొల్లాపిన్నినరసింహయ్యగారు-
పాలపూడి-శివరామయ్యవారు-
అరుణాచలయ్యగారిసుబ్రహ్మణ్య శాస్త్రులువారు-
కప్పగంతుల-సావిత్రిపంతులువారు-
హనుమంతుఅప్పళనాయుడుగారు-
సుబ్బారెడ్డివారు-జూటూరుతాటిపర్తి
వేలూరునరసింహంగారు-భీమవరం-
వల్లభశేషయ్యవారు-తహశీల్దారు
శిష్టాసూర్యనారాయణశాస్త్రులువారు
యన్-రాఘవేంద్రరావుపంతులుగారు- పెన్షన్ తహశ్శీల్దార్ గుత్తి

**మహారాజ రాజశ్రీ**

టి-రామచంద్రరావుగారుడిస్త్రిక్టు మునసఫ్ నెలూరు
పి-భీమరావుగారు-ఆత్మకూరుకర్నూలు
కొమ్మిలక్ష్మీనరసునాయుడుగారు-
శంకరప్పగారుకరణం- గుంతకల్లు
డి-శ్యామరావుగారు-తిరుకోవిలూరు
కొప్పలకొండనరసప్పరెడ్డిగారు-
ఉదరపికొండపొడ్డననాయుడుగారు
తాకరాజుసుబ్బన్నగారు-
కరణంతిమ్మప్పగారు-
కరణంకేశవరాజువారు-
కరణంరంగప్పవారు-
పరిగెహనుమంతరావువారు
తెంగుళూరు-పట్టాసాని-
బళ్లారి-రంగాసాని-

శ్రీరామచంద్రశ్శ్రితపారిజాతః, సమస్తకల్యాణగుణాభిరామః
సీతాముఖాంభోరుహచంచరీకో, నిరంతరంమంగళమాతనోతు.





శ్రీ

# సుందరకాండవిషయానుక్రమణిక.

సర్గసంఖ్య. విషయములు.

సర్గసంఖ్య. విషయములు.

సర్గసంఖ్య. విషయములు.

సర్గసంఖ్య,　　విషయములు.

ఇట్లు సుందరకాండ సర్గ విషయానుక్రమణిక, ముగిసినది.

---

శ్రీరామాయనమః.

శ్రీలక్ష్మణస్వామి. శ్రీరామస్వామి. శ్రీసీతాదేవి.

వేద వేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షాద్రామాయణాత్మనా.

## అథాంజనేయస్తోత్రప్రారంభః.

౧ శృణు దేవి ప్రవక్ష్యామి స్తోత్రం సర్వభయాపహమ్
సర్వకామ ప్రదం నృణాం హనుమత్ స్తోత్రముత్తమమ్. ౧
౨ తప్తకాంచన సఙ్కాశం నానారత్న విభూషితమ్

ఉద్యద్బాలార్క వదనం త్రిణేత్రం కుండలోజ్జ్వలమ్.

౩ మౌఞ్జీకౌపీన సంయుక్తం హేమయజ్ఞోపవీతినమ్
పింగళాక్షం మహాకాయం టఙ్కశైలేన్ద్ర ధారిణమ్.

౪ శిఖానిక్షిప్త వాలాగ్రం మేరుశైలాగ్ర సంస్థితమ్
మూర్తిత్రయాత్మకం పీనం మహావీరం మహాహనుమ్

౫ హనూమంతం వాయుపుత్రం నమామి బ్రహ్మచారిణమ్
త్రిమూర్త్యాత్మక మాత్మస్థం జపాకుసుమ సన్నిభమ్.

౬ నానాభూషణ సంయుక్త మాఞ్జనేయం నమామ్యహమ్
పఞ్చాక్షర స్థితం దేవం నీలనీరద సన్నిభం.

౭ పూజితం సర్వదేవైశ్చ రాక్షసాన్తం నమామ్యహం
అచలద్యుతి సంకాశం సర్వాలంకార భూషితం

౮ షడక్షరస్థితం దేవం నమామి కపినాయకం
తప్తస్వర్ణమయం దేవం హరిద్రాభం సురార్చితం.

౯ సుందరం సాబ్జనయనం త్రిణేత్రం తం నమామ్యహమ్
అష్టాక్షరాధిపం దేవం హీరవర్ణ సముజ్జ్వలం
నమామి జనతా వంద్యం లఙ్కాప్రాసాదభంజనం
అతసీపుష్ప సంకాశం దశవర్ణాత్మకం విభుం.

౧౧ జటాధరం చతుర్బాహుం నమామి కపినాయకం
ద్వాదశాక్షర మన్త్రస్య నాయకం కున్తధారిణం.

౧౨ అఙ్కుశశ్చ దధానశ్చ కపివీరం నమామ్యహం
త్రయోదశాక్షరయుతం సీతాదుఃఖ నివారణం.
పీతవర్ణం లసత్కాయం భజే సుగ్రీవ మన్త్రిణం
మాలామన్త్రాత్మకం దేవం చిత్రవర్ణం చతుర్భుజం.

౧౪ పాశాఙ్కుశాభయకరం ధృతటఙ్కం నమామ్యహం
సురాసుర గణైస్సర్వైస్సంస్తుతం ప్రణమామ్యహం.

౧౫ ఏవంధ్యాయేన్నరో నిత్యం సర్వపాపైః ప్రముచ్యతే
ప్రయాతి చిన్తితంకార్యం శీఘ్రమేవ నసంశయః.

౧౬ అష్టమ్యాంవా చతుర్దశ్యాం మర్కవారే విశేషతః
సన్ధ్యాపూజాం ప్రకుర్వీత ద్వాదశ్యాఞ్చ విశేషతః.
౧౭ అర్కమూలేన కుర్వీత హనుమత్ప్రతిమాంసుధీః
పూజయేత్తత్ర విద్వాన్ యో రక్తవస్త్రేణ వేష్టయేత్.
౧౮ బ్రాహ్మణాన్భోజయేత్పశ్చాత్తత్ప్రీత్యై సర్వకామదాం
యఃకరోతి నరోభక్త్యా పూజాం హనుమతస్సుధీః.
౧౯ నశత్రుభయమాప్నోతి భయంవాప్యన్తరిక్షజం
అక్షాదిరాక్షస హరం దశకణ్ఠదర్ప
నిర్మూలనంరఘువరాంఘ్రిసరోజభక్తం
సీతావిషహ్య ఘనదుఃఖ నివారకంతం
వాయోస్సుతం గలిత భాను మహం నమామి.
౨౦ మాంపశ్యపశ్య హనుమన్ నిజ దృష్టిపాతైః
మాంరక్షరక్ష పరితో రిపుదుఃఖపుంజాత్
వశ్యాం కురుత్రిజగతీం వసుధాధిపానాం
మేదేహిదేహి మహతీం వసుధాంశ్రియంచ
౨౧ ఆపద్భ్యోరక్ష సర్వత్ర ఆంజనేయ నమోస్తుతే
బన్ధనం ఛేదయాజస్రం కపివీర నమోస్తుతే.
౨౨ దుష్టరోగాన్ హనహన రామదూత నమోస్తుతే
ఉచ్చాటయ రిపూన్సర్వాన్మోహనం కురు భూభుజాం.
౨౩ విద్వేషిణో మారయత్వం త్రిమూర్త్యాత్మక సర్వదా
సఞ్జీవపర్వతోద్ధార మనోదుఃఖం నివారయ.
౨౪ ఘోరానుపద్రవాన్ సర్వాన్ నాశయాక్షాసురాన్తక
ఏవం స్తుత్వా హనూమన్తం నర శ్శ్రద్ధాసమన్వితః.
౨౫ పుత్రపౌత్రాదిసహితస్సర్వసౌఖ్య మవాప్నుయాత్.

ఇత్యుమాసంహితాయాంఆంజనేయ
స్తోత్రంసమ్పూర్ణం.

---

శ్రీ

సీతాదేవ్యై నమః.

అగస్త్యసంహితాయాం

సుందరకాండవైభవ ప్రారంభః.

ఋషయః॥—సంకటేవిషయే ప్రాప్తేకిముపాయం వదస్వనః
ఇత్యుక్తః కుంభజోహృష్టో ఋషీన్ ప్రోవాచపూర్ణధీః. ౧
అగస్త్యః॥—పశుపుత్ర ప్రదం పౌత్ర వృద్ధిదం కల్మషాపహం
ధనమాయుష్య మారోగ్య దాయకం పుణ్య వర్ధనం. ౨
జ్ఞానభక్తి ప్రదం నృణాం ముక్తివైరాగ్యదాయకం
దుర్భిక్షభేదనం సద్య స్సువృష్టిప్రదమవ్యయం. ౩
క్షయాపస్మారకుష్ఠాది సర్వరోగ నివారణం
కామధేను సమం భూమౌ కల్పవృక్ష సమంభువి. ౪
గృహవృద్ధికరం పుంసాం చింతార్థఫలదాయకం
దుర్నిమిత్తహరంశుద్ధం వాక్పటుత్వ ప్రదాయకం. ౫
సర్వవశ్యకరంప్రోక్తం విశేషకనిదర్శనం
బ్రహ్మతేజోభి వృద్ధించ దుర్ఘటార్థ ప్రదాయకం. ౬
భూతభేతాళ కూష్మాండ భేదకం సర్వసిద్ధిదం
రాజద్వారానుకూలంచ సర్వకష్టనివారణం. ౭
వాదార్థసిద్ధిదంలోకే సర్వవశ్యప్రదాయకం
సర్వమంగళదంనృణాం దారిద్ర్యభయనాశనం. ౮
సౌందర్య కాండమఖిలం కృత్వాపారాయణం సకృత్
కృత్వాన్యాసంవిధానేన ధ్యాత్వావాయుసుతంహృది. ౯
పారాయణంచరేద్ధీమాన్ సౌందర్యంసర్వదాయకం

న్యాసహీనే హరేదాయు ర్ధ్యానహీనేన నిష్ఫలం. ౧౦
కీలకేన వినా రోగీ శక్తిహీనే దరిద్రతాం
కోశపూజనహీనేతు సర్వనాశో భవేద్ధ్రువం ౧౧
బీజహీనే జ్ఞానహీనో భవేన్నాత్రతు సంశయః
షడ్వర్ణజపహీనేతు మూలమంత్ర విహీనతః. ౧౨
నింద్యో భవేత్కళత్రాణాం నాశమేతి నసంశయః
గురుభక్తి విహీనేతు నిష్ఫలం నాత్రసంశయః. ౧౩
హనుమద్విజయం కాండం యః పారాయణ మాచరేత్
విధినా సర్వసిద్ధించ ప్రాప్నోతిచ నసంశయః. ౧౪
అంతం పారాయణం నిత్యంద్విముహూర్తాదినోదయాత్
మండలాంతంచరేద్యస్తు మండలాధిపతి ర్భవేత్. ౧౫
సౌందర్యకాండం సకలంచతుర్వింశతివాసరే
పారాయణంచరేద్భక్త్యా లభేత్పుత్రాంశ్చ సుందరాన్. ౧౬
హనుమద్విజయం కాండం శుద్ధః పారాయణంచరేత్
ద్విషడ్దినాని యక్షేశ మిత్రోభవతినాన్యథా. ౧౭
వృష్టికామస్సప్తరాత్రం జ్ఞానకామస్తథైవచ
జయకామో మండలాంతం భూకామీతు తథైవచ. ౧౮
పశుకామః పంచరాత్రం శంకీ వైమండలంశుభం
అన్నార్థీతు చతుర్వింశ ద్దినానిచ నసంశయః. ౧౯
ఆయురారోగ్య మైశ్వర్యం భవేత్పారాయణేసదా
పారాయణం సదాయస్తు కుర్యాద్భక్తి సమన్వితః. ౨౦
నిష్కామీవా ఋషిశ్రేష్ఠా నియమంతు యథోచితం
సకామే నియమేనైవ చరేత్పారాయణం శుభం. ౨౧
అక్షారలవణాశీచ తాంబూలం వర్జయేద్బుధః
నతైలాభ్యంగనం ప్రోక్తం సకామస్య విశేషతః. ౨౨
క్షౌరంసంగం వృథావార్తా కండూతిం పరదూషణం

తంద్రీప్రమాదౌ నిద్రాంచ హాస్యం స్త్రీభాషణంతథా. ౨౩
మధురం చైవ భక్ష్యంచ కేవలంసక్తుభక్షణం
నిస్సంగీభూమిశయన శ్చరేత్పారాయణంశుభం. ౨౪
మధ్యే పారాయణేయస్తు లోకవార్తాముదాహరేత్
పారాయణంతుసకలం నిష్ఫలంనాత్రసంశయః. ౨౫
మౌనీపారాయణం కృత్వా సర్వాభీష్టానవాప్నుయాత్
యదిస్యా జ్జృంభణాదీని శరీరేతు మహర్షయః. ౨౬
ద్విరాచమ్య ప్రమృజ్యాథ నేత్రే పారాయణంచరేత్
స్వయంకర్తుమశక్తశ్చే ద్బ్రాహ్మణైః కారయేచ్ఛుభం. ౨౭
ఆశురోగ ప్రశమనం త్రిదినాత్సప్తవారకం
పారాయణంతు కృతుత్వా రోగశాంతి ర్భవిష్యతి. ౨౮
ప్రథమేద్విఃద్వితీయేత్రిఃత్రితీయేతు ద్వివారకం
ఆవర్తనస్య చైకస్య ద్విఃషట్కం పుష్పమీరితం. ౨౯
దత్వా నిషాట్కని సద్భక్త్యా యథా శక్త్యా మహర్షయః
నిత్యంయః పాఠయే త్కాండం హనుమ ద్విజయాంకితం. 30
సురేశ పదమాప్యాథ పూజితస్తేన భక్తితః
సత్యలోకాధిపోభూయా న్నాత్రకార్యావిచారణా. 3౧
కృత్వాతు సుందర కాండం పారాంయణమఘాపహం
సిద్ధోభూయాన్న సందేహః కిముతాఖిల సంసదః. 3౨
జన్మప్రభృతి యత్పాపం యత్పాపం పూర్వజన్మని
నశ్యత్యేవనసందేహః సకృత్పారాయణేనచ. 33
అస్య సుందర కాండస్య సమంమంత్రం నవిద్యతే
తత్పారాయణ తత్సిద్ధి ర్యదినైవ భవేద్భువి. 3౪
న కేనాపి భవేత్సిద్ధి రితిబ్రహ్మాను శాసనం
మస్తమంత్రరాజంత న్నాత్రసంశయమస్తిచ. 3౫
బీజకాండ మితిప్రోక్తం సర్వరామాయణేష్వపి

తస్మా త్పారాయణంకృత్వా ధన్యాభవథ తత్వతః. ౩౬

ఇత్యగస్త్య సంహితాయాం సుందరకాండ ఫలనిరూప

ణంనామపంచ మోధ్యాయః॥శ్రీరస్తు॥నమః॥

ఉమాసంహితాయాం.

సుందరకాండవైభవప్రారంభః.

శ్రుత్వైవమం సుందరం కాండం పురావాల్మీకి నాకృతం
యత్రప్రవృత్తిః సీతాయా రామస్యచ నివేదనం. ౧
సంతా నార్థీధనార్థీవా సామ్రాజ్యార్థీచ మానవః
రాజబంధ విమోక్షార్థీ మోక్షార్థీ వాపి యోభవేత్. ౨
తత్తత్ఫలమ వాప్నోతి సీతారామ ప్రసాదతః

ఆవృత్త్యాచైక వింశత్యా పుత్ర సంతాన మాప్నుయాత్. ౩
పంచ వింశతి సర్గాంశ్చ ప్రత్యహం పఠతేతుయః
మహద్ధనమ నాప్నోతి గ్రహ ధాన్యాది కంచసః. ౪

ప్రత్యహం సప్తసర్గాంశ్చ పఠిత్వా వత్సరంనరః
మహాత్మా మాజ్య మాప్నోతి పృథ్వీందైశ్చ ప్రపూజ్యతే. ౫
చతుస్త్రింశతి సర్గాంశ్చ పఠిత్వా యుగ్మకే దినే
తావత్యాం చైవ చావృత్యా రాజబంధా ద్విముచ్యతే. ౬
యథాశక్తి పఠి త్వాతు యావజ్జీవం నరోత్తమః
ఐహికంతు సుఖం ప్రాప్య మోక్షమీయా త్పరత్రచ. ౭

అనావృష్ట్యాం ప్రవృత్తాయా మవగ్రహ నివర్తయే
పఠేచ్చ సుందరం కాండం సువృష్టిశ్చ తతోభవేత్. ౮
కింబహూక్తేన విధినా సర్వాభీష్ట ప్రదాయకం

నాతో న్యద్విద్యతే లోకే ఇహాముత్ర ఫల ప్రదం. ౯
విప్ర శ్రేష్ఠా దిదం శ్రుత్వా శక్త్యా బ్రాహ్మణ భోజనం
పూజయేచ్చైవ చాచార్యం గోభూవస్త్రాది భూషణైః. ౧౦

ఇతి సుందర కాండమాహాత్మ్యమ్.














శ్రీగురుభ్యోనమః.

శ్రీ రా మ చం ద్ర ప ర బ్ర హ్మ ణే న మః.



దేవతాప్రార్థన.

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే.
రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయేనమః.

వాల్మీకిప్రార్థన.

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్




ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్.
వాల్మీకేర్మునిసింహస్య కవితావనచారిణః
శృణ్వ న్రామకథానాదం కో న యాతి పరాం గతిమ్.

ఆంజనేయప్రార్థన.

అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్.
గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్.
మనోజవం మారుతతుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్
వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శిరసా నమామి.

శ్రీరామాయణప్రశంస.

వేద వేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా.
శ్రీమద్బ్రహ్మ తదేవ బీజ మమలం యస్యాఙ్కుర శ్చిన్మయః
కాండైస్స ప్తభి రన్వితో తివితతో బుష్యాలవాలోదితః.
పత్రై స్తత్త్వసహస్రకై స్సువిలసచ్ఛాఖాశతైః పంచభిః
స్వాత్మప్రాప్తిఫలప్రదో విజయతే రామాయణ స్స ద్రుమః.
యః కర్ణాఞ్జలిసంపుటై రహరహ స్సమ్యక్పిబత్యాదరా
ద్వాల్మీకే ర్వదనారవిందగళితం రామాయణాఖ్యం మధు.
జన్మవ్యాధిజరావిపత్తిమరణై రత్యన్తసోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమా న్విష్ణోః పదం శాశ్వతమ్.
వాల్మీకిగిరిసంభూతా రామాంభోనిధిసంగతా
శ్రీమద్రామాయణీ గంగా పునాతు భువనత్రయమ్.



శ్రీః

# సుందరకాండప్రారంభః.

తతో రావణనీతాయా స్సీతాయ శ్శత్రుకర్శనః
ఇయేష పద మన్వేష్టుం చారణాచరితే పథి. ౧

టీక॥తతః= అటుపిమ్మట; శత్రుకర్శనః = శత్రువులసన్నగిల్ల జేయునట్టిహనుమంతుఁడు; రావణనీతాయాః=రావణునిచేఁగొనిపోఁబడిన; సీతాయాః=సీతయొక్క; పదం = స్థానమును; అన్వేష్టుం=వెదకుటకు; చారణాచరితే=చారణులచేతసంచరింపఁబడిన; పథి=మార్గమయిన యాకాశమునందు; గంతుం(అధ్యాహృతము)=పోవుటకు ; ఇయేష=ఇచ్ఛించెను.

జాంబవంతుండు , పురికొల్పినంతట, శత్రువులరూపుమాపంజాలుహనుమంతుండు,రావణుఁడు, సీతంగొనిపోయియుంచియున్నస్థలంబువెదకుటకై , యాకాశంబునంబోవ,నిచ్ఛించెను.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— కిష్కింధాకాండంబున , "శ్రీరాముండుమిత్రులరక్షించుట మొదలగునెల్లకల్యాణగుణంబులంగలవాఁడు"అని, తెల్పఁబడినది; ఇప్పుడు,అట్లు, "సర్వంబునుసంహరింపఁగలవాఁడు"అని, తెల్పబడుచున్నది. మఱియుః, గిష్కింధాకాండంబున"ఎట్లయిన మిత్రులసంరక్షింపవలయును"అని , చెప్పబడినది; ఇచ్చట, "దూతయుఁబతివ్రతయు నుండవలసినక్రమంబుచెప్పఁబడుచున్నది. కిష్కింధాకాండంబున , విష్ణుదేవుండుజనులరక్షించుటకు, ద్వారభూతుండగు నాచార్యుండనుపురుషకారంబుఁగల్గినట్లు, ప్రతిపాదింపఁబడినది; ఇచ్చట , నాచార్యుండుచేయవలసినకార్యంబు ప్రతిపాదింపఁబడుచున్నది. అందు,మొదటి, సర్గమందు, శిక్షింపఁదగినశిష్యుల వెదకుట , సూచింపఁబడుచున్నది.— తతః= అటుపిమ్మట, సముద్రనిచ్ఛిభగవంతుం డనుజ్ఞయొసంగినపిదప; శత్రుకర్శనః ="గుశబ్ద స్త్వంధకారస్స్యా ద్రుశబ్ద స్తన్నిరోధకః, అంధకారనిరోధిత్వాద్గురురిత్యభిధీయతే"("గు"అనఁగా, అంధకారము, "రు" అనఁగా , దానిఁబోఁగొట్టువాఁడు ; అంధకారమునుబోఁగొట్టుటంజేసి, గురువనంబడుచున్నాఁడు.) అనురీతిని, శత్రుభూతమయిన యజ్ఞానమును

సన్నగిల్లం జేయువాఁడయిన గురువు; చారణాచరితే; చారణ=ధర్మమును నడిపెడిపూర్వాచార్యులచేత, ఆచరితే=చేయఁబడిన; పథి=మార్గమునందు; రావణనీతాయాః, రావణ=(రావయతీతి రావణః) అఱచునట్లు సేయునజ్ఞానముచే, నీతాయాః=పొందింపఁబడిన; సీతాయాః = (సీతాశబ్దమును ప్రయోగించుటచేతను, అయోనిజత్వమును దానం జేసి, యనాదిత్వము, సూచింపఁబడుచున్నది.) అనాదియయిన మాయయొక్క; పదం=వ్యవసాయమును, కార్యమునను టః; అన్వేష్టుం=వెదకుటకు; ఇయేష=ఇచ్ఛించెను.

భగవంతునివలన, ముద్రికదీసికొని శిష్యులబోధింప ననుజ్ఞ నొంది, శత్రుభూతంబగు నజ్ఞానంబుఁ బోఁగొట్టం జాలునాచార్యుండు, ఇదివఱకిట్టిధర్మముం బ్రవర్తింపఁ జేయుచుండిన పూర్వాచార్యులేర్పఱచిన మార్గమునను సరించి, లేనివానిం బలికించు నజ్ఞానంబునం జేసి, దోఁచుచుండున నాదియగు మాయకార్యమునకు మోహించియుండువారలను, వెదకఁగోరెను. అని, తాత్పర్యము (ఇది కేవలాద్వైతమతమునను సరించినది.)

రావణనీతాయాః= అజ్ఞానముచేఁ గొనిపోఁబడిన, తనవశముగాఁ జేయఁబడినయనుట; సీతాయాః= ("స్త్రీప్రాయమితరత్సర్వం" (దేవునికన్న నితరమంతయు స్త్రీప్రాయము) అనియుండుటవలన స్త్రీలింగము ప్రయోగింపఁబడినది.) అనాదియగు జీవునియొక్క; పదం=వ్యవసాయమును; అన్వేష్టుం; ఇయేష.

ఆచార్యుండు, పూర్వాచార్యమార్గమునను సరించి, యజ్ఞానంబునవశముతప్పి జ్ఞానసిద్ధికై ప్రయత్నము సేయు జీవుని (పురుషుని) వెదకఁగోరెను. అని, తాత్పర్యము. తక్కినది సమానము. (ఇది, విశిష్టాద్వైతమతమునను సరించినది). "తతో రావణ" అనుచోట, నాలవయక్షరమగు వకారముచే, గాయత్రి పండ్రెండవ యక్షరమయిన వకారము గ్రహింపబడినది. అట్లు పండ్రెండవగ్రంథసహస్రము, ఆరంభింపఁబడినది.

దుష్కరం నిష్ప్రతి ద్వంద్వం చికీర్షన్ కర్మ వానరః
సముద్రశిరోగ్రీవో గవాం పతి రివా బభౌ. ౨

టీక॥ దుష్కరం=చేయఁగూడని; కర్మ=కార్యమును; నిష్ప్రతిద్వంద్వం= అ

డ్డములేనట్లుగా; చికీర్షన్ = చేయఁగోరువాఁడును; సముదగ్రశిరోగ్రీవః= పొడవుగానుండుతలయును మెడయును గలవాఁడునగు, కావుననే; వానరః= కోఁతియగుహనుమంతుఁడు; గవాంపతిరివ=ఆవులకుఁ బెనిమిటియయిన, లేక, వృషభములలో శ్రేష్ఠమయిన, ఆఁబోతువలె; ఆబభౌ=ప్రకాశించెను.

ఎవ్వనికినింజేయనశక్యమయిన సముద్రలంఘనమును, ఎదురులేనట్లుగాఁ, జేయఁగోరి, యున్నతంబులగుతలయును మెడయునుంగలిగి, యొప్పుచుండు, నా హనుమంతుండు, ఆఁబోతెద్దుంబోలి, ప్రకాశించెను. అని, తాత్పర్యము.

అథ వైడూర్య వర్ణేషు శాద్వలేషు మహాబలః
ధీర స్సలిలకల్పేషు విచచార యథాసుఖమ్. ౩

టీక॥ అథ=అటుపిమ్మట; మహాబలః=అధికమయినబలముగలవాఁడును; ధీరః= ధైర్యముగలవాఁడునగు హనుమంతుండు; వైడూర్యవర్ణేషు= మరకతమణులవన్నెవంటి వన్నెగలవియు; సలిలకల్పేషు=నీటితో సరివచ్చునవియునగు; శాద్వలేషు = లేఁతపచ్చికగల ప్రదేశములందు; యథాసుఖం= సుఖమునతిక్రమింపక; విచచార=తిరిగెను.

అంత, గొప్పబలంబును ధైర్యంబునుంగలహనుమంతుండు, మరకతమణులకుంబోలెవన్నెకలిగి, జలంబువలె చల్లగానుండు, లేఁత పచ్చికభూములందు, సుఖంబుగా సంచరించెను.

అని, తాత్పర్యము.

ద్విజా న్విత్రాసయ న్ధీమా న్నురసా పాదపాన్ హరన్
మృగాంశ్చ సుబహూ న్నిఘ్నన్ ప్రవృద్ధ ఇవ కేసరీ. ౪

టీక॥ ధీమాన్= మంచిబుద్ధిగలహనుమంతుండు; ద్విజాన్=పక్షులను; విత్రాసయన్=వెఱపించుచు; ఉరసా= ఱొమ్ముచేత; పాదపాన్= వృక్షములను; హరన్ = అడఁచుచు; సుబహూన్= అనేకములయిన; మృగాంశ్చ=మృగంబులను; నిఘ్నన్= చంపుచు; ప్రవృద్ధః=వృద్ధిఁబొందిన; కేసరీవ=సింహమువలె; విచచార= (అధ్యాహృతము) తిరిగెను.

బుద్ధిమంతుండగు హనుమంతుండు, పక్షులవెఱపించుచు, ఱొమ్మునవృక్షంబులఁద్రోయుచు, పెక్కుమృగంబులం జంపుచు, బలిసినసింహంబుంబోలి, సం

చరించెను. అని, తాత్పర్యము.

నీలలోహితమాంజిష్ఠపత్రవర్ణైః సితాసితైః
స్వభావవిహితైశ్చిత్రైః ధాతుభిస్సమలంకృతమ్. ౫
కామరూపిభి రావిష్ట మభీక్ష్ణం సపరిచ్ఛదైః
యక్షకిన్నరగంధర్వైః దేవకల్పైశ్చ పన్నగైః. ౬

టీక॥గిరితలం= (అధ్యాహృతము) మహేంద్రపర్వతముక్రిందిభాగము; నీలలోహితమాంజిష్ఠపత్రవర్ణైః=నల్లనివియు నెఱ్ఱనివియుఁబసపు వన్నెగలవియు నాకు వన్నె గలవియు; సితాసితైః=తెలుపును నలుపునుగలసిన వన్నె గలవియు; చిత్రైః=పలువిధంబులగు అంగులుగలవియు; స్వభావవిహితైః=తమంతటనే సిద్ధములయినవియునగు; ధాతుభిః=పర్వతమునందలి ధాతువుల చేత; సమలంకృతం= చక్కగా నలంకరింపఁబడినది గాను; కామరూపిభిః=ఇచ్ఛకువచ్చినరూపంబుగలవారలును; అభీక్ష్ణం=మిక్కిలియును; సపరిచ్ఛదైః=అలంకారముతోఁగూడినవారలు నగు; యక్షకిన్నరగంధర్వైః= యక్షులచేతనుగిన్నరులచేతనుగంధర్వులచేతను; దేవకల్పైః= దేవతలతోసరివచ్చునట్టి; పన్నగైశ్చ = సర్పములచేతను; ఆవిష్టం=అధిష్ఠింపఁబడినదిగాను; ఆసీత్= (అధ్యాహృతము)=ఉండెను.

ఆమహేంద్రపర్వతముక్రిందిభాగము, నల్లనివియు నెఱ్ఱనివియుఁ బసుపువన్నె గలవియునాకువన్నెగలవియుఁ దెలుపు నలుపుంజేరినవన్నెగలవియుఁ జిత్రంబులనగుస్వతస్సిద్ధంబులయిన మణిసినమున్నగుగైరికధాతువులనలంకరింపఁబడి, కామరూపులునుఅలంకరించికొనియుండువారలునగు, యక్షులచేతనుగిన్నరులచేతనుగంధర్వులచేతను దేవతలంబోలుసర్పంబులచేతను,ఒప్పుచుండెను. అని, తాత్పర్యము.

స తస్య గిరివర్యస్య తలే నాగవరాయుతే
తిష్ఠన్ కపివర స్తత్ర హ్రదే నాగ ఇవా బభౌ. ౭

టీక॥సః = ఆ; కపివరః=వానరశ్రేష్ఠుండగుహనుమంతుండు; గిరివర్యస్య=పర్వతములలో శ్రేష్ఠమయిన; తస్య=ఆ మహేంద్రపర్వతముల యొక్క; నాగవరాయుతే= ఏనుఁగులలో మేటివయిన వానితోఁగూడిన; తత్ర=ఆ; తలే=క్రింది

స౧

భాగమందు; తిష్ఠన్=ఉండుచు; హ్రదే=కొలంకునందు; నాగఇవ=ఏనుఁగువలె;ఆబభౌ=ప్రకాశించెను.

వానరశ్రేష్ఠుండగు నాహనుమంతుండు, శ్రేష్ఠంబులగు నేనుంగులతోఁగూడియుండు నామహేంద్రపర్వతము క్రింది భాగమునందుండి, కొలంకునందలియేనుంగుంబోలి,ప్రకాశించెను.

అని, తాత్పర్యము.

స సూర్యాయ మహేంద్రాయ పవనాయ స్వయంభువే
భూతేభ్యశ్చాంజలిం కృత్వా చకార గమనే మతిమ్. ౮

టీక॥సః=ఆహనుమంతుఁడు; సూర్యాయ=సూర్యునికొఱకును; మహేంద్రాయ=దేవేంద్రునికొఱకును;పవనాయ=వాయువుకొఱకును; స్వయంభువే=బ్రహ్మదేవునికొఱకును; భూతేభ్యశ్చ= దేవయోనులగుభూతములకొఱకొను;అంజలిం = చేమోడ్పును; కృత్వా = చేసి;గమనే=పోవుటయందు; మతిం=తలంపును;చకార=చేసెను.

ఆహనుమంతుండు, సూర్యునకు దేవేంద్రునకువాయువునకు బ్రహ్మదేవునకుభూతంబులకును, చేతులుమొగిడ్చి,నమస్కరించి,పోవందలంచెను.

అని, తాత్పర్యము.

అంజలిం ప్రాఙ్ముఖః కృత్వా పవనాయాత్మయోనయే
తతో హి వవృధే గంతుం దక్షిణో దక్షిణాం దిశమ్. ౯

టీక॥దక్షిణః = సమర్థుండగుహనుమంతుఁడు ; ప్రాఙ్ముఖః=తూర్పుమొగంబుగలవాఁడై; ఆత్మయోనయే=తనకుకారణమయిన; పవనాయ=వాయువుకొఱకు;అంజలిం=చేమోడ్పును; కృత్వా=చేసి; తతః = అటుపిమ్మట; ("హి" అనునదిపాదపూరణార్థము) దక్షిణాం=దక్షిణపు; దిశం=దిక్కునుగూర్చి; గంతుం=పోవుటకు ; వవృధే=వృద్ధిఁబొందెను.

సమర్థుండగు హనుమంతుండు, తూర్పు మొగంబుగాఁదిరిగి తనతండ్రియయినవాయువునకుఁ జేతులుమోడ్చి నమస్కరించి,యంత, దక్షిణపుదిక్కునకుఁబోవుటకై, దేహంబుఁ బెంచెను.

అని, తాత్పర్యము.

ప్లవంగప్రవరైర్దృష్టః ప్లవనే కృతనిశ్చయః
వవృధే రామవృద్ధ్యర్థం సముద్రఇవ పర్వసు. ౧౦

స ౧

 

టీక॥ సః (అధ్యాహృతము) = ఆహనుమంతుండు; ప్లవంగప్రవరైః = వానరశ్రేష్ఠులచేత; దృష్టః = చూడఁబడినవాఁడై; ప్లవనే = ఎగురుటయందు; కృతనిశ్చయః = చేయఁబడిన యేర్పాటుగలవాఁడై; రామవృద్ధ్యర్థం = రాముని మేలుకొఱకు; పర్వసు = పౌర్ణములందు; సముద్రఇవ = సముద్రమువలె; వవృధే = వృద్ధిఁబొందెను.

ఆహనుమంతుండు, వానరులలో మేటియగువారలు సూచుచుండఁగా, సముద్రము దాఁటనిశ్చయించి, రామునకు మేలుగల్గుటకై, పౌర్ణములందు సముద్రముంబోలెఁ, బెరిఁగెను. అని తాత్పర్యము.



నిష్ప్రమాణశరీరస్సన్ లిలంఘయిషు రర్ణవమ్
బాహుభ్యాం పీడయామాస చరణాభ్యాంచ పర్వతమ్. ౧౧

టీక॥ సః (అధ్యాహృతము) = ఆహనుమంతుఁడు; నిష్ప్రమాణశరీరః = కొలఁతలేని దేహముగలవాఁడు; సన్ = అవుచు; అర్ణవం = సముద్రమును; లిలంఘయిషుః = దాఁటనిచ్ఛించువాఁడై; బాహుభ్యాం = చేతులచేత; చరణాభ్యాంచ = పాదములచేతను; పర్వతం = మహేంద్రపర్వతమును; పీడయామాస = మర్దించెను.

ఆహనుమంతుండు, అట్లుకొలంతలేనట్లు దేహముఁ బెంచి, సముద్రముదాఁటఁగోరి, యామహేంద్రపర్వతంబును జేతులనుంగాళ్లను మర్దించెను.

అని, తాత్పర్యము.

 

స చచాలా చలశ్చాపి మహూర్తం కపిపీడితః
తరూణాం పుష్పితాగ్రాణాం సర్వం పుష్ప మశాతయత్. ౧౨

టీక॥సః=ఆమహేంద్ర పర్వతము; అచలశ్చాపి = కదలనిది యయినను; కపిపీడితః=కోఁతియగు హనుమంతుని చేఁ బీడింపఁబడినదై; ముహూర్తం= రెండుగడియలకాలము; చచాల=కదలెను; పుష్పితాగ్రాణాం=పూచినకొనలుగల; తరూణాం = వృక్షములయొక్క; పుష్పం=పువ్వును; సర్వం= అంతను; అశాతయత్=రాల్చెను.

ఆమహేంద్రపర్వతము "కదలనిది" అని, పేరొందఁబడినదైనను, హనుమంతుండుపీడింపఁగా, రెండుగడియలకాలముకదలుచుండెను; అట్లు, చలించుటంజేసి, పుష్పించియుండువృక్షంబులపూలన్నియు రాలినవి. అని, తాత్పర్యము.

తేన పాదపముక్తేన పుష్పౌఘేణ సుగంధినా
సర్వత స్సంవృత శ్శైలో బభౌ పుష్పమయో యథా. ౧౩

టీక॥శైలః = మహేంద్రపర్వతము; పాదపముక్తేన=వృక్షములచే విడువఁబడిన; సుగంధినా= మంచివాసనగల; తేన=ఆ; పుష్పౌఘేణ= పూలసమూహముచేత; సర్వతః=అంతటను, సంవృతః=కప్పఁబడినదై; పుష్పమయో యథా=పుష్పవికారమయినదనునట్టు; బభౌ=ప్రకాశించెను.

మహేంద్రపర్వతము, వృక్షంబులనుండి రాలిపడినమంచి వాసనగలపూలనంతటంగప్పఁబడి, పూలకొండయనందగియొప్పుచుండెను.

అని, తాత్పర్యము.

తేన చోత్తమ వీర్యేణ పీడ్యమాన స్స పర్వతః
సలిలం సంప్రసుస్రావ మదం మత్త ఇవ ద్విపః. ౧౪

టీక॥సః=ఆ; పర్వతః= మహేంద్రపర్వతము; ఉత్తమవీర్యేణ= శ్రేష్ఠంబగు పరాక్రమంబుగల ; తేన=ఆహనుమంతునిచేత; పీడ్యమానశ్చ= పీడింపఁబడుచున్నదియునై ; సలిలం=జలమును; మత్తః=క్రొవ్విన; ద్విపః=ఏనుఁగు; మదమివ= మదజలమునువలె ; సంప్రసుస్రావ=చక్కఁగా కార్చెను.

ఎప్పుడును, దనంతనె, సెలయేఱుల వలనజలంబులు విడుచుచుండు నామ




హేంద్రపర్వతంబు, మహాబలుండగుహనుమంతునిచేఁబీడింపఁబడి, మదంబునం జేసిశసంతసె మదజలంబు విడుచుచుం డుమదపుటేనుంగు, మావటివానిచేఁ గొట్టంబడియినుమడిగా మదజలము విడుచునట్లు, మఱియునెచ్చుగా జలంబువిడిచెను. అని, తాత్పర్యము.

పీడ్యమానస్తు బలినా మహేంద్ర స్తేన పర్వతః
రీతీ ర్నిర్వర్తయామాస కాంచనాంజనరాజతీః. ౧౫

టీక॥ మహేంద్రః=మహేంద్రమనెడు; పర్వతః=కొండ; బలినా = బలిమిగల; తేన=ఆహనుమంతునిచేత; పీడ్యమానస్తు=మర్దింపఁబడుచున్నది కావుననే; కాంచనాంజనరాజతీః = బంగారువియును గాటుకవియును వెండివియునగు; రీతీః=రేఖలను ; నిర్వర్తయామాస=కలిగించెను.

మహేంద్రపర్వతంబు, నట్లు, బలవంతుండగుహనుమంతుండుపీడింపఁగా ; బంగారుఱాళ్లు నీలం ఱాళ్లు వెండిరాళ్లు నుం బగులుటంజేసి , వానిరేఖ లగపడెను. అని, తాత్పర్యము.

ముమోచ చ శిలా శ్శైలో విశాలా స్సమనశ్శిలాః
మధ్యమే నార్చిషా జుష్టో ధూమరాజీరి వానలః. ౧౬

టీక॥ శైలః=మహేంద్రపర్వతము; సమనశ్శిలాః=మణిసిలలతోఁగూడిన; విశాలాః=వెడల్పుగల; శిలాశ్చ=ఱాళ్లను; మధ్యమేన=నడిమిదైన; అర్చిషా=మంటతో; జుష్టః=కూడిన ; అనలః=నిప్పు; ధూమరాజీరివ=పొగలయొక్క పఱ్ఱలనువలె; ముమోచ=విడిచెను.

కాళి, కరాళి, విస్ఫులింగిని, ధూమ్రవర్ణ, విశ్వరుచి, లోహిత, మనోజవ, యనుపేర్లుగల, సప్తజ్వాలలలో, నగ్నినడుమనుండి వెలుంగు "ధూమ్రవర్ణ" యనుజ్వాలతోఁగూడినయనిప్పునుండి పొగలపఱ్ఱలు బయలువెడలునట్లు , హనుమంతునిచేఁ బీడింపఁబడిన యామహేంద్రపర్వతమునుండి, పొగవలె నల్లనిదైన మణిసిలలం గలిగియుండు గొప్పఱాళ్లు వెడలెను.

అని, తాత్పర్యము.

గిరిణా పీడ్యమానేన పీడ్యమానాని సర్వతః
గుహావిష్టాని భూతాని వినేదు ర్వికృతై స్స్వరైః. ౧౭




టీక॥గుహావిష్టాని=గొప్పబిలంబుల నధిష్ఠించిన; భూతాని=భూతంబులు; పీడ్యమానేన=మర్దింపఁబడుచున్న;గిరిణా=మహేంద్రపర్వతముచేత; సర్వతః=అంతటను;పీడ్యమానాని= మర్దింపఁబడుచున్నవై; వికృతైః=వికారముగల;స్వరైః= ధ్వనులతో;వినేదుః=ఏడ్చినవి.

మహేంద్రపర్వతమునందలి గుహలందున్నభూతంబులును,హనుమంతుండాపర్వతంబునుమర్దింపఁగా,నవియునుఆపర్వతముచేమర్దింపఁబడి,దైన్యంబునంజేసి, వికృతంబగుస్వరంబున, నేడ్చినవి. అని,తాత్పర్యము.

స మహాసత్త్వసన్నాదశ్శైలపీడానిమిత్తజః
పృథివీం పూరయామాస దిశశ్చోపవనానిచ. ౧౮

టీక॥శైలపీడానిమిత్తజః=మహేంద్రపర్వతముయొక్క-మర్దించుటయను కారణమువలనంగలిగిన;సః=ఆ; మహాసత్త్వసన్నాదః (ఇదిమహేశ్వరతీర్థపాఠము)= గొప్పభూతములయొక్క-ధ్వని; మహాన్(ఇదిగోవిందరాజపాఠము)=గొప్పదైన; సత్త్వసన్నాదః=భూతములయొక్క-ధ్వని;పృథివీం=భూమిని;దిశశ్చ=దిక్కు-లను;ఉపవనానిచ=తోఁటలను;పూరయామాస = నిండించెను.

ఇట్లు, మహేంద్రపర్వతంబును మర్దించుటంగలిగిన, యాగొప్పభూతంబులరోదనధ్వని,భూమియు , దిక్కు-లును,సమీపముననుండుతోఁటలును,నిండివినంబడినది.అని,తాత్పర్యము.

శిరోభిః పృథుభిస్సర్పా వ్యక్తస్వస్తికలక్షణైః
వమంతః పావకం ఘోరం దదంశుర్దశనైశ్శిలాః. ౧౯

టీక॥సర్పాః = పాములు;పృథుభిః=పెద్దవియు; వ్యక్తస్వస్తికలక్షణైః; వ్యక్త=తెలియఁబడిన , స్వస్తికలక్షణైః= పడగమీఁదివంపైన మొనలుగల యర్ధచంద్రాకారపునల్లనిరేఖలనెడు గుఱుతులుగలవియునైన; శిరోభిః=తలలతో; ఘోరం=భయంకరమయిన; పావకం=నిప్పును;వమంతః = కక్కు-చు;దశనైః=పండ్లచేత;శిలాః= ఱాళ్లను;దదంశుః=కొఱికినవి.

హనుమంతుండా మహేంద్రపర్వతంబును బీడించుటంజేసి, యాపర్వతమునందుండు, సర్పంబులలుఁగుడువడి, పడగమీఁదవంపైన మొనలుగలయర్ధచం

ద్రాకారపునల్లనిరేఖలుగల గొప్పతల లతో, వెలికివచ్చి, కోపంబున నాకొండ తాళ్లంగఱచినవి. అని, తాత్పర్యము.

తా స్తదా సవిషై ర్దష్టాః కుపితై స్తై ర్మహాశిలాః
జజ్వలుః పావకోద్దీప్తా బిభిదుశ్చ సహస్రధా. ౨౦

టీక॥ తదా = అప్పుడు; తాః = ఆ; మహాశిలాః = గొప్పతాళ్లు; కుపితైః = కోపంబునొందిన; సవిషైః = విషముతోఁగూడిన; తైః = ఆసర్పంబులచేత; దష్టాః = కఱవఁబడినవై; పావకోద్దీప్తాః = నిప్పుచే వెలిగింపఁబడినవై; జజ్వలుః = మండినవి, సహస్రధా = వేయితునకలుగా; బిభిదుశ్చ = పగిలినవియు.

అప్పుడాగొప్ప రాళ్లు, కుపితంబులయినయావిషసర్పంబులచేఁ గఱవంబడి, నిప్పువగిలిమండుచు, వేయితునకలుగాఁబగిలినవి. అని, తాత్పర్యము.

యాని చౌషధజాలాని తస్మి జ్జాతాని పర్వతే
విషఘ్నాన్యపి నాగానాం న శేకు శ్శమితుం విషమ్. ౨౧

టీక॥ తస్మిన్ = ఆ; పర్వతే = మహేంద్రపర్వతమునందు; యాని = ఏ; ఔషధజాలాని = ఔషధములసమూహము లు; జాతాని = పుట్టినవో; తాని (అధ్యాహృతము) చ = అవియు; విషఘ్నాన్యపి = విషమును హరించునవియయినను; నాగానాం = సర్పములయొక్క; విషం = విషమును; శమితుం = అడఁచుటకు; న శేకుః = చాలవయ్యె.

ఆమహేంద్రపర్వతమునందుఁ బుట్టినయౌషధంబులసమూహంబులు, విషములహరించునవయ్యును, అప్పుడాసర్పంబులవిషంబునడంపంజాలవయ్యె. అని, తాత్పర్యము.

భిద్యతే యంగిరి ర్భూతై రితి మత్వా తపస్వినః

టీక॥ తపస్వినః = ప్రశస్తమగుతపస్సుగలఋషులు; "అయం = ఈ; గిరిః = పర్వతము; భూతైః (సహ) = భూమిమొదలగుపంచభూతములతోఁగూడ; భిద్యతే = పగులుచున్నది." ఇతి = అని; మత్వా = తలఁచి; ఉత్పేతుః (అధ్యాహృతము) = ఎగిరిరి.

ఈపర్వతంబుదీనికి సంబంధించిన పృథివ్యప్తేజో వాయ్వాకాశంబులతోఁగూడ, నిప్పుపగులుచున్నది" అనిత

లంచి, అచ్చోనుండుఋషు, లాపర్వతంబువిడిచి, యాకాశంబుఁబొందిరి.

అని, తాత్పర్యము.

త్రస్తా విద్యాధరా స్తస్మాదుత్పేతు స్త్రీగణైస్సహ. ౨౨
పానభూమిగతం హిత్వా హైమ మాసవభాజనమ్
పాత్రాణిచ మహార్హాణి కరకాంశ్చ హిరణ్మయాన్. ౨౩
లేహ్యా నుచ్చావచా న్భక్ష్యాన్ మాంసాని వివిధాని చ
ఆర్షభాణిచ చర్మాణి ఖడ్గాంశ్చ కనకత్సరూన్. ౨౪

టీక॥ విద్యాధరాః=విద్యాధరులు; త్రస్తాః=భయముపడినవారలై; స్త్రీగణైస్సహ = ఆఁడువాండ్రసమూహములతోఁగూడ; పానభూమిగతం= త్రాగుడుస్థలమునుబొందిన; (ఇది "హిత్వా" అనువానికిఁ గర్మములుగానున్నవాని కన్నిటికిని విశేషణములు. లింగవచనములనుమాత్రము భేదించును") హైమం = బంగారువికారమయిన; ఆసవభాజనం; సారాయిపాత్రను, మహార్హాణి=శ్రేష్ఠములయిన; పాత్రాణిచ = పాత్రలను; హిరణ్మయాన్ = బంగారువికారములయిన; కరకాంశ్చ = గండివంటి పాత్రలను; లేహ్యాన్ = నాకఁదగిన తేనెమొదలగువానిని; ఉచ్చావచాన్ = నానావిధములయిన; భక్ష్యాన్= పిండివంటలను; వివిధాని= పలుదెఱంగులయిన; మాంసానిచ=మాంసములను; ఆర్షభాణి= ఎద్దుతోలులతోఁ జేయఁబడిన; చర్మాణిచ=డాలువాఱులను; కనకత్సరూన్=బంగారుపిళ్లుగల; ఖడ్గాంశ్చ=కత్తులను; హిత్వా=విడిచి; తస్మాత్=ఆపర్వతమునుండి; ఉత్పేతుః= ఎగిరిరి.

విద్యాధరులును, భయంబునఁ, దమస్త్రీలంగూడి, పానభూమియందున్న, బంగారుసారాయిపాత్రమును, గొప్పవిలువగలపాత్రంబులను, బంగారుతోఁజేసినగిండివంటిపాత్రంబులను, తేనెమొదలగులేహ్యంబులను, నానావిధంబులగుపిండివంటలను, వివిధంబులగుమాంసంబులను ఎద్దుచర్మముతోఁజేసినడాలువాఱులను, బంగారుపిళ్లఖడ్గంబులను, విడిచి, యాపర్వతంబుననుండి, పైకెగిరిరి. అని, తాత్పర్యము.

కృతకంఠగుణాః క్షీబా రక్తమాల్యానులేపనాః
రక్తాక్షాః పుష్కరాక్షాశ్చ గగనం ప్రతిపేదిరే.

టీక॥ కృతకంఠగుణాః= చేయఁబడిన మేడయందుఁబూదండలుగల వారలును; క్షీబాః=మదించినవారలును; రక్తమాల్యానులేపనాః = ఎఱ్ఱనిపుష్పమాలికలును మైపూఁతలుంగలవారలును; రక్తాక్షాః = ఎఱ్ఱనికండ్లుగలవారలును; పుష్కరాక్షాశ్చ= తామరపూలవంటికండ్లుగలవారలునగు; తే (అధ్యాహృతము)=ఆవిద్యాధరులు; గగనం=ఆకాశమును; ప్రతిపేదిరే=పొందిరి.

కంఠంబునఁ బూదండలు ధరించిశిరంబున నెఱ్ఱనిపుష్పమాలికల నలంకరించికొని, దేహంబున నెఱ్ఱనిగంధంబుసలందికొని, సారాయిమదంబునం జేసియెఱ్ఱగానుండు తామరపూలంబోలు కండ్లతోనుండునావిద్యాధరు లందఱు, ఆకాశంబుఁజేరిరి.

అని, తాత్పర్యము.

హారనూపురకేయూరపారిహార్యధరాః స్త్రియః
విస్మితా స్సస్మితా స్తస్థు రాకాశే రమణైస్సహ. ౧౮

టీక॥ హారనూపురకేయూరపారిహార్యధరాః= హారంబులను అందెలను బాహుపురులను కడియములనుధరించిన; స్త్రియః = ఆఁడువాండ్రు; విస్మితాః=ఆశ్చర్యమునొందినవారలై; సస్మితాః= చిఱునగవుతోఁగూడినవారలై; రమణైస్సహ=ప్రియులతోగూడ; ఆకాశే=ఆకాశమునందు; తస్థుః= ఉండిరి.

హారంబులునందెలు బాహుపురులుఁ గంకణంబులును ధరించి యొప్పుచుండువిద్యాధరస్త్రీలు, ఆపర్వతంబట్లుపగులుటకాశ్చర్యముపడి చిఱునగవుసేయుచు; రమణులతోఁగూడ, నాకాశంబునందుండిరి.

అని, తాత్పర్యము.

దర్శయంతో మహావిద్యాం విద్యాధరమహర్షయః
సహితా స్తస్థురాకాశే వీక్షాంచక్రుశ్చ పర్వతమ్. ౧౯

టీక॥ విద్యాధరమహర్షయః = పూజ్యులయిన ఋషులవంటివిద్యాధరులు, విద్యాధరులలో మేటియగువారలనుట; సహితాః=కూడుకొనినవారలై; మహావిద్యాం=అణిమాదిసిద్ధిని; దర్శయంతః=చూపుచున్నవారలై; ఆకాశే=ఆకాశమునందు; తస్థుః=ఉండిరి. పర్వతం=కొండను; వీక్షాంచక్రుశ్చ=చూచిరియు.

విద్యాధరులలో శ్రేష్ఠులగువారంద

స ౧

ఋ,నొకటిగాగూడి, నిరాధారంబుగ నాకాశంబునందుండుట మొదలగు నణిమాదిసిద్ధులంజూపుచు, నాకాశంబునందుండి, పర్వతంబుఁజూచుచుండిరి.

అని, తాత్పర్యము.

శుశ్రువుశ్చ తదా శబ్దమృషీణాం భావితాత్మనామ్

చారణానాంచ సిద్ధానాం స్థితానాం విమలేం బరే. ౨౮

టీక॥ తే(అధ్యాహృతము) = ఆవిద్యాధరులు; తదా=అప్పుడు; విమలే=స్వచ్ఛమయిన; అంబరే= ఆకాశమునందు; స్థితానాం=ఉన్న; భావితాత్మనాం=ధ్యానింపఁబడినపరమాత్మగల; ఋషీణాం=ఋషులయొక్కయు; చారణానాం=చారణులయొక్కయు, సిద్ధానాంచ = సిద్ధులయొక్కయు; శబ్దం=పలుకును; శుశ్రువుశ్చ=వినిరియు.

అప్పుడావిద్యాధరులు, స్వచ్ఛంబగు నాకాశంబునఁ, బరమాత్మధ్యానంబు సేయుచుండు ఋషులను జారణులును సిద్ధులునుబలుకుకొనుమాటలనువినిరి.

అని, తాత్పర్యము.

ఏష పర్వతసంకాశో హనూమా న్మారుతాత్మజః

తితీర్షతి మహావేగ స్సముద్రం మకరాలయం. ౨౯

టీక॥ పర్వతసంకాశః=కొండకు సరివచ్చువాఁడును; మహావేగః= అధికమయినవడిగలవాఁడును; మారుతాత్మజః = వాయుదేవునికొడుకునైన; ఏషః=ఈ; హనూమాన్= హనుమంతుఁడు; మకరాలయం = మొసళ్లకునికిపట్టైన; సముద్రం=సముద్రమును; తితీర్షతి=దాటనిచ్ఛించుచున్నాఁడు.

కొండంతటిదేహంబుగలవాఁడునధికంబగువేగముగలవాఁడు వాయుదేవునికుమారుండునగు నీహనుమంతుండు, ఎచ్చుగామొసళ్లుగలిగి భయంకరంబుగనుండుసముద్రమును దాఁటఁగోరుచున్నాడు. అని, తాత్పర్యము.

రామార్థం వానరార్థంచ చికీర్షన్ కర్మదుష్కరం

సముద్రస్య పరంపారం దుష్ప్రాపం ప్రాప్తు మిచ్ఛతి. ౩౦

టీక॥ ఏషః(అధ్యాహృతము) = ఈ హనుమంతుఁడు; రామార్థం=రామునికొరకును; వానరార్థంచ=కోఁతులకొఱకును; దుష్కరం = చేయఁగూడని; కర్మ=పనిని; చికీర్షన్=చేయఁగోరుచు; సముద్రస్య=సముద్రముయొక్క;

దుష్ప్రాపం=పొందఁగూడని; పరం = అవ్వలిదైన; పారం=గట్టును; ప్రాప్తుం=పొందుటకు; ఇచ్ఛతి=కోరుచున్నాఁడు.

హనుమంతుఁడు, రామునికొఱకును, అట్లు రామకార్యంబునందభిమానించియుండు వానరులకొఱకును, ఎవ్వరికినింజేయనలవిగాని పనింజేయఁబూని, ఎట్టివారికినింబోవ నశక్యమయినసముద్రంబునవ్వలిగట్టునకుఁ బోవఁదలంచియున్నాఁడు. అని, ఋషులుమున్నగువారలుచెప్పుకొనఁగా, విద్యాధరులు,వినిరి. అని, తాత్పర్యము.

ఇతి విద్యాధరాః శ్రుత్వా వచ స్తేషాం మహాత్మనామ్
త మప్రమేయం దదృశుః పర్వతే వానరర్షభమ్. ౩౧

టీక॥ విద్యాధరాః=విద్యాధరులు; మహాత్మనాం= పూజ్యమయినస్వభావముగల; తేషాం=ఆఋషులుమున్నగువారియొక్క; వచః=మాటను; ఇతి=ఇట్లు; శ్రుత్వా=విని; పర్వతే=మహేంద్రపర్వతమందు; అప్రమేయం = కొలఁతపెట్టరాని; తం = ఆ; వానరర్షభం= వానరశ్రేష్ఠుండగుహనుమంతుని; దదృశుః=చూచిరి.

విద్యాధరు, లిట్లుమహాత్ములగునాఋషులుమొదలయినవారిమాటనువిని, మహేంద్రపర్వతంబునఁ గొలంతకురానిదేహంబుతోఁగాన్పిలుచుండు హనుమంతునింబూచిరి. అని, తాత్పర్యము.

దుధువేచ సరోమాణి చకంపే చాచలోపమః
ననాద సుమహానాదం సుమహానివ తోయదః. ౩౨

టీక॥ అచలోపమః=కొండఁబోలుపొడవుగల; సః=ఆహనుమంతుఁడు; రోమాణి=వెండ్రుకలను; దుధువేచ=విదిర్చెను. చకంపేచ = కదలెను. సుమహాన్=మిక్కిలియుగొప్పదైన; తోయదః ఇవ=మేఘమువలె; సుమహానాదం=మిక్కిలియుగొప్పధ్వనిగల్గునట్లుగా; ననాద=అఱచెను.

కొండంతటిమేనుగలయాహనుమంతుండు,ఉత్సాహంబున, వెండ్రుకలువిదిర్చెను;అట్టిట్టుకదలెను; గొప్పమేఘంబువలె, మహాధ్వనిగల్గునట్లుగానఱచెను. అని,తాత్పర్యము.

అనుపూర్వ్యేణ వృత్తంచ లాంగూలం రోమభిశ్చితమ్
ఉత్పతిష్యన్ విచిక్షేప పక్షిరాజ ఇవోరగమ్. ౩౩

టీక॥సః(అధ్యాహృతము)= ఆహనుమంతుఁడు;ఉత్పతిష్యన్=ఎగురఁబోవుచు;ఆనుపూర్వ్యేణ=క్రమముచేత; వృత్తం= చుట్టుకొని యుండినదియు; లోమభిః=వెండ్రుకలచేత;చితం=వ్యాపింపఁబడినదియునగు; లాంగూలంచ= తోఁకను; పక్షిరాజః=పక్షులకుఁబ్రభువైనగరుత్మంతుఁడు ; ఉరగమివ=సర్పమునుబోలె;విచిక్షేప=విదిర్చెను.

ఆహనుమంతుఁడు , ఎగురఁబోవువాఁడై,క్రమముగాఁజుట్టుకొనివెండ్రుకలతోనిండియుండుతనతోఁకను , గరుత్మంతుండు,సర్పమునువిదుర్చునట్లు, విదిర్చెను.అని, తాత్పర్యము.

తస్య లాంగూల మావిద్ధ మాత్తవేగస్య పృష్ఠతః
దదృశే గరుడే నేవ హ్రియమాణో మహోరగః. ౩౪

టీక॥ఆత్తవేగస్య= పొందఁగలవేగముగల;తస్య = ఆహనుమంతునియొక్క;పృష్ఠతః = వెనుకను; ఆవిద్ధం= వంకఱగానున్న; లాంగూలం=తోఁక; గరుడేన=గరుత్మంతునిచేత; హ్రియమాణః=కొనిపోఁబడుచున్న; మహోరగఇవ=గొప్పసర్పమువలె; దదృశే చూడఁబడినది.

వేగవంతుండగు నాహనుమంతుని వెనుకతట్టువంకఱగా వ్రేలుకాడుచుండువాలంబు,గరుడుండు గొప్పసర్పంబును గాళ్లందన్నుకొని పోఁగానదియతని వెనుకను వ్రేలాడునట్లు కన్పట్టినది. అని, తాత్పర్యము.

బాహూ సంస్తంభయామాస మహాపరిఘసన్నిభౌ
ససాద చ కపిః కట్యాం చరణౌ సంచుకోచ చ. ౩౫

టీక॥కపిః=హనుమంతుండు; మహాపరిఘసన్నిభౌ=గొప్పయినుపకట్లగుదియలతోసమానములయిన;బాహూ= చేతులను;సంస్తంభయామాస = బిగియఁబట్టెను.కట్యాం=నడుమునందు;ససాదచ=సన్నగిల్లెను.చరణౌ = పాదములను;సంచుకోచచ = ముడుచుకొనెను.

ఆహనుమంతుండు, గొప్పయినుపగుదియలుంబోలు తనబాహువుల స్తంభించి,యూపిరినూర్ధ్వముఖంబుగా బిగియఁబట్టినడుముసన్నముగాఁజేసి, పా

దంబులముడుచుకొని, సముద్రంబుదాటనుద్యుక్తుండయ్యెను. అని, తాత్పర్యము.

సంహృత్య చ భుజౌ శ్రీమాన్ తథైవచ శిరోధరామ్
తేజ స్సత్త్వం తథా వీర్య మావివేశ స వీర్యవాన్. ౩౬

టీక॥శ్రీమాన్ = అందఱికన్ననధికుండును; వీర్యవాన్ = పరాక్రమంబుగలవాఁడునగు; సః = ఆహనుమంతుఁడు; భుజౌచ = చేతులను; తథైవ = ఆలాగే; శిరోధరాంచ = మెడను; సంహృత్య = సంకోచింపఁజేసి; తేజః = ఇతరులనెదిరించుశక్తి; సత్త్వం = బలమును; తథా = అట్లు; వీర్యం = గొప్పకార్యములుసేయుసామర్థ్యమును; ఆవివేశ = పొందెను.

అందఱికన్నఁనధికుండును బరాక్రమశాలియునయిన యాహనుమంతుండు, భుజంబులను మెడనుబిగియఁబట్టి, తనకున్న, తేజంబు బలంబు వీర్యంబునంతయుం, బూనెను. అని, తాత్పర్యము.

మార్గ మాలోకయ న్దూరా దూర్ధ్వం ప్రణిహితేక్షణః
రురోధ హృదయే ప్రాణా నాకాశ మవలోకయన్. ౩౭

టీక॥సః(అధ్యాహృతము) = ఆహనుమంతుఁడు; దూరాత్ = దూరమునుండి; మార్గం = దారిని; ఆలోకయన్ = చూచుచును; ఊర్ధ్వం = పైగా; ప్రణిహితేక్షణః = ఉంచఁబడిన చూపుగలవాఁడై; ఆకాశం = ఆకాశమును; అవలోకయన్ = చూచుచును; హృదయే = ఱొమ్మునందు; ప్రాణాన్ = శ్వాసములను; రురోధ = బిగియఁబట్టెను.

ఆహనుమంతుండు, దూరముగా మార్గంబుఁజూచుచు, ఊర్ధ్వంబుగా దృష్టినుంచి, యాకాశంబుఁజూచుచు, ఱొమ్మునను చ్ఛ్వాసనిశ్వాసంబుల బిగియఁబట్టెను. అని, తాత్పర్యము.

పద్భ్యాం దృఢ మవస్థానం కృత్వా స కపికుంజరః
నికుంచ్య కర్ణౌ హనుమా నుత్పతిష్య న్మహాబలః. ౩౮
వానరా న్వానరశ్రేష్ఠ ఇదం వచన మబ్రవీత్

టీక॥కపికుంజరః = కోఁతులలో శ్రేష్ఠుఁడును; మహాబలః = అధికమయినబలముగలవాఁడునగు; సః = ఆ; హనుమాన్ = హనుమంతుఁడు; పద్భ్యాం = కాళ్ల చేత; దృఢం = బలమయిన; అవస్థానం = ఊనికను; కృత్వా = చేసి; క

కౌ=చెవులను; నికుంచ్య=ముడుచుకొని; ఉత్పతిష్యన్ = ఎగురఁబోవుచు; వానరశ్రేష్ఠః=వానరులలో మేటియగు హనుమంతుఁడు; ("కృత్వా" మొదలగు వాని చేవ్యవహితమగుటంజేసి, మఱలఁ గర్త చెప్పఁబడినది); వానరాన్=కోఁతులనుగూర్చి; ఇదం=ఈ; వచనం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

వానరశ్రేష్ఠుండు గొప్పబలంబుగలవాఁడునగుహనుమంతుండు, కాళ్లను, దృఢంబుగానూనుకొని, చెవులముడుచుకొని, యెగురఁబోవువాఁడై, తనసమీపంబుననున్న జాంబవంతుండు మొదలగువానరులంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.



యథా రాఘవనిర్ముక్త శ్శర శ్శ్వసనవిక్రమః. ౩౯
గచ్ఛే త్తద్వ ద్గమిష్యామి లంకాం రావణపాలితామ్

టీక॥ యథా=ఎట్లు; రాఘవనిర్ముక్తః=రామునిచే విడువఁబడిన; శరః=బాణము; శ్వసనవిక్రమః = వాయుదేవునివేగమువంటివేగముగలదై; గచ్ఛేత్=పోవునో; తద్వత్=దానివలె; అహం(అధ్యాహృతము)=నేను; రావణపాలితాం = రావణునిచే నేలఁబడిన; లంకాం=లంకాపట్టణమును గూర్చి; గమిష్యామి=పోయెదను.

రాముండువిడిచినబాణం బెట్లు వాయువేగంబునంబోవునో, అట్లతివేగంబున నేను,ఎచ్చటను, ఎంతమాత్రము నుజాగుసేయక, యప్రతిహతంబుగా, రావణునిచేఁబాలింపఁబడుచుండు లం

కకుంబోయెదను. అని, తాత్పర్యము.

నహి ద్రక్ష్యామి యదితాం లంకాయాం జనకాత్మజామ్. ౪౦
అనేనైవహి వేగేన గమిష్యామి సురాలయమ్

టీక॥ అహం (అధ్యాహృతము)= నేను; లంకాయాం = లంకయందు; తాం=ఆ; జనకాత్మజాం= జనకునికొమార్తెయయినసీతను ; నద్రక్ష్యామి యది=చూడనైతినేని("హి" అనునది పాదపూరణార్థము); అనేన = ఈ; వేగేనైవ=వేగముతోనే("హి" అనునదిపాదపూరణార్థము ) ; సురాలయం=స్వర్గమునుగూర్చి ; గమిష్యామి=పోయెదను.

నేనులంకాపురియందాసీతం జూడనేని, యీ వేగంబుతోనే, స్వర్గంబునకుంబోయెదను. అని, తాత్పర్యము.

యదివా త్రిదివే సీతాం నద్రక్ష్యామ్యకృతశ్రమః. ౪౧
బద్ధ్వా రాక్షసరాజాన మానయిష్యామి రావణమ్

టీక॥అహం (అధ్యాహృతము)= నేను; త్రిదివే=స్వర్గమునందును ; సీతాం=సీతను; నద్రక్ష్యామియదివా=ఒకవేళచూడనైతినేని; అకృతశ్రమః=చేయఁబడని, యనఁగా, పొందఁబడని, యలసటగలవాఁడనై ; రాక్షసరాజానం (రాక్షసరాజం)=రాక్షసులకుఁ బ్రభువయిన; రావణం=రావణుని; బద్ధ్వా= కట్టి; ఆనయిష్యామి= తెచ్చెదను.

స్వర్గంబునందునుసీత నాకగపడదేని, యంత నలసటనొందక, మఱలం కకుంబోయి, రాక్షసులకుఁబ్రభుండగు రావణునిబంధించి, యిచ్చటికిఁ దెచ్చెదను. అని, తాత్పర్యము.

సర్వథా కృతకార్యోఽహ మేష్యామి సహసీతయా. ౪౨
ఆనయిష్యామి వా లంకాం సముత్పాట్య సరావణామ్

టీక॥సర్వథా=అన్నివిధంబులను; అహం=నేను; కృతకార్యః = చేయఁబడినపనిగలవాఁడనై ; సీతయాసహ=సీతతోఁగూడ; ఏష్యామి=వచ్చెదను. వా= లేక; సరావణాం= రావణునితోఁగూడిన; లంకాం=లంకాపట్టణమును ; సముత్పాట్య=పెల్లగించి; ఆనయిష్యామి= తెచ్చెదను.

నే నేవిధంబుననైనను, కృతార్థుండనై, సీతంగొనివచ్చెదను; కాదేని, రావణునితోఁగూడ లంకం బెల్లగించి, యిచ్చటికిం దెచ్చెదను, అని, హనుమంతుండు జాంబవంతుండు మున్నగు వానరులతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వాతు హనుమా న్వానరా న్వానరోత్తమః. ౪౪
ఉత్పపాతాథ వేగేన వేగవా నవిచారయన్

టీక॥వానరోత్తమః = వానరశ్రేష్ఠుండును; వేగవాన్ = అధికమయినవడిగలవాఁడునగు; హనుమాన్ = హనుమంతుఁడు; వానరాన్ = జాంబవంతుండు మున్నగు వానరులను గూర్చి; ఏవం = ఇట్లు; ఉక్త్వాతు = చెప్పినంతనె; అథ = అటుపిమ్మట; అవిచారయన్ = చింతింపుచుండనివాఁడై; వేగేన = వడిచేత; ఉత్పపాత = ఎగిరెను.

వానరశ్రేష్ఠుండయిన యాహనుమంతుండట్లు జాంబవంతుండు మున్నగు వానరులం జూచి పలికి, యంతమిగుల వేగంబుగలవాఁడు కావున నెంతమాత్రమును సంశయము నుంచక, వేగంబుగ నాకాశంబున కెగిరెను. అని, తాత్పర్యము.



సువర్ణమివ చాత్మానం మేనే స కపికుంజరః. ౪౫

టీక॥కపికుంజరః = వానరశ్రేష్ఠుండగు; సః = ఆహనుమంతుఁడు; ఆత్మానం = తన్ను; సుపర్ణమివ = గరుత్మంతుని వలె" ("చ" అనునది పాదపూరణార్థ

ము)మేనే=తలంచుకొనెను.

వానరులలో మేటియయిన యాహనుమంతుండు, అప్పుడు, "తానుగరుత్మంతుఁడుబోలె, నాకాశంబునం బోవసమర్థుఁడ"ని,తలంచెను.

అని, తాత్పర్యము.

సముత్పతతి తస్మింస్తు వేగాత్తేనగరోహిణః
సంహృత్య విటపాన్ సర్వాన్ సముత్పేతుః సమంతతః. ౪౫

టీక॥తస్మిన్=ఆహనుమంతుండు; సముత్పతతితు=ఎగురఁగానే; వేగాత్=వేగమువలన; తే=ఆ;నగరోహిణః=పర్వతమునందు మొలిచినవృక్షంబులు;విటపాన్=కొమ్మలను; సర్వాన్=అన్నిటిని;సంహృత్య=తీసికొని;సమంతతః=అంతటను; సముత్పేతుః=ఎగిరెనవి.

ఆహనుమంతుండెగురఁగానే, యతనివేగమువలన, నాపర్వతంబునందలి వృక్షంబులన్నియుఁ, దమకొమ్మలతోఁగూడ,నంతటనుండి యెగిరెనవి.

అని, తాత్పర్యము.

సమత్తకోయష్టిమకాన్ పాదపాన్ పుష్పశాలినః
ఉద్వహన్నూరువేగేన జగామ విమలేంబరే. ౪౬

టీక॥సః(అధ్యాహృతము)=ఆహనుమంతుండు;ఊరువేగేన = తొడలవేగంబుచేత; సమత్తకోయష్టిమకాన్ = మదించినచీకుఁ గొంకెరలనుపక్షులతోఁగూడినవియు ; పుష్పశాలినః = పూలచేఁబ్రకాశించుచున్నవియు నగు, పాదపాన్ = వృక్షంబులను; ఉద్వహన్=ఎత్తిపట్టుకొనుచు; విమలే=స్వచ్ఛమయిన;అంబరే=ఆకాశమునందు; జగామ=పోయెను.

ఆహనుమంతుండుమదించిన చీకుఁ గొంకెరలంగల్గి పుష్పంబులతో నొప్పుచుండు వృక్షంబులఁ, దనతొడలవేగంబున నెగఁబట్టి.యీడ్చికొని,యాకాశంబునం,బోయెను.అని, తాత్పర్యము.

ఊరువేగోద్ధతా వృక్షా ముహూర్తం కపి మన్వయుః
ప్రస్థితం దీర్ఘ మధ్వానం స్వబంధుమివ బాంధవాః. ౪౭

టీక॥ఊరువేగోద్ధతాః=తొడల వేగముచే నెగరగొట్టఁబడిన,వృక్షాః = వ్రాఁకులు;కపిం=హనుమంతుని;బాంధవాః=చుట్టములు; దీర్ఘం=దూరమయిన;అధ్వానం = మార్గమునుగూర్చి=ప్రస్థితం=బయలుదేరిన; స్వబం

ధుమివ=తమచుట్టమునువలె; ముహూర్తం=కొంచెముసేపు; అన్వయుః = వెంబడించినవి.

ఇట్లూరువేగంబున నెగిరిన వృక్షంబులు, బంధువులు, చాలదూరము పోఁదలంచిన తమబంధుజనమును, దారివిడుచు నట్లు, కొంచెముసేపు, హనుమంతుని వెంబడించినవి. అని, తాత్పర్యము.

త మూరువేగోన్మథితా స్సాలా శ్చాన్యే నగోత్తమాః
అనుజగ్ము ర్హనూమంతం సైన్యా ఇవ మహీపతిమ్. ౪౮

టీక॥ఊరువేగోన్మథితాః= తొడల వేగముచే నెగరఁగొట్టఁబడిన ; సాలాశ్చ=మద్దిచెట్లును;అన్యే = ఇతరములయిన;నగోత్తమాః= వృక్షములలో మేటివైనవియును;తం = ఆ;హనూమంతం=హనుమంతుని;సైన్యాః = దండులోనివారలు; మహీపతిమివ=రాజునువలె;అనుజగ్ముః=వెంబడించినవి.

మద్దిచెట్లును మఱియు నితరములై నగొప్పవృక్షంబులును, హనుమంతుని యూరువేగంబునం బైకెగిరి , సైనికులు రాజునుంబోలె, నాహనుమంతుని వెంబడించినవి.

అని, తాత్పర్యము.

సుపుష్పి తాగ్రై ర్బహుభిః పాదపై రన్వితః కపిః
హనుమా న్పర్వతాకారో బభూవా ద్భుతదర్శనః. ౪౯

టీక॥కపిః=కోఁతియును ; పర్వతాకారః = కొండవంటి దేహముగలవాఁడునగు;హనుమాన్ = హనుమంతుండు;బహుభిః=పెక్కులయిన; సుపుష్పితాగ్రైః = చక్కగాఁబుష్పించినకొనలుగల;పాదపైః= చెట్లతో;అన్వితః = కూడినవాఁడై; అద్భుతదర్శనః=ఆశ్చర్యకరంబగుచూచుటగలవాఁడు; బభూవ=ఆయెను.

పర్వతంబువంటి దేహంబుగల యాహనుమంతుండు , చక్కగాఁబూచియుండు పెక్కువృక్షంబుల నడుమనుండి , చూచివారలకాశ్చర్యంబుగలిగించెను. అని, తాత్పర్యము.

సారవంతోఽథ యే వృక్షా న్యమజ్జన్ లవణాంభసి
భయాదివ మహేంద్రస్య పర్వతా వరుణాలయే. ౫౦

టీక॥అథ=అటుపిమ్మట; యే=ఏ;వృక్షాః=చెట్లు; సారవంతః = బరువుగ

లవో, తే(అధ్యాహృతము) = అవి; మహేంద్రస్య = దేవేంద్రునియొక్క; భయాత్ = వెఱపువలన; వరుణాలయే = సముద్రమునందు; పర్వతాఇవ = కొండలువలె; లవణాంభసి = ఉప్పునీళ్లుగలసముద్రమునందు; న్యమజ్జన్ = మునిఁగినవి.

అంత, దేవేంద్రునిభయంబునఁబర్వతంబులుసముద్రంబునంబడునట్లు, అందు, బరువుగలవృక్షంబులు సముద్రంబునంబడి, మునింగినవి. అని, తాత్పర్యము.

సనానాకుసుమైః కీర్ణః కపి స్సాంకురకోరకైః
శుశుభే మేఘసంకాశః ఖద్యోతై రివ పర్వతః. ౫౧

టీక॥ మేఘసంకాశః = మబ్బులోసమానమయిన; సః = ఆ; కపిః = హనుమంతుండు; సాంకురకోరకైః = మొలకలతోనుమొగ్గలతోనుంగూడిన; నానాకుసుమైః = పలువెంగులయినపుష్పంబులచే; కీర్ణః = వ్యాపింపఁబడినవాఁడై; ఖద్యోతైః = మిడుఁగుఱుఁబురుగులచే; కీర్ణః (అధ్యాహృతము) = వ్యాపింపఁబడిన; పర్వత ఇవ = కొండవలె; శుశుభే = ప్రకాశించెను.

ఆకాశంబున గొప్ప శరీరముతోఁ బోవుటంజేసి, మేఘంబువలెఁ గనుపట్టుచుండు నాహనుమంతుని దేహంబంతయు, నెఱ్ఱని మొలకలును మొగ్గలునుబుష్పంబులును వ్యాపింపఁగా, నతండు, రాత్రియందుమిణుంగుఱుఁబురుగులతో నొప్పుచుండుపర్వతంబుంబోలెఁ బ్రకాశించెను. అని,, తాత్పర్యము.

విముక్తా స్తస్య వేగేన ముక్త్వా పుష్పాణి తే ద్రుమాః
అవశీర్యంత సలిలే నివృత్తా స్సుహృదో యథా, ౫౨

టీక॥ తే = ఆ; ద్రుమాః = చెట్లు; తస్య = ఆహనుమంతునియొక్క; వేగేన = వేగముచేత; ముక్తాః = విడువఁబడినవై; పుష్పాణి = పూలను; ముక్త్వా = విడిచి; సలిలే = నీటియందు, (సుహృత్పక్షమున) నీటిసమీపమునందు; సుహృదోయథా = స్నేహితులువలె; నివృత్తాః = మఱలినవై; అవశీర్యంత (అవాశీర్యంత) = పడినవి.

హనుమంతుండు క్రమముగాదూరముపోవుటచేనతనివేగముతోటి సంబంధము, ఆవృక్షంబులకు వదలుటంజేసి, యవి, పుష్పంబులవిడిచి (పుష్పంబులుచెట్లకన్నఁదేలికయయినవి కావున నవియాకాశంబునందే మఱికొంత సేపుండినవి) "ఓదకాంతాత్స్నిగ్ధోబంధుమనువ్రజేత్" (నీటిసమీపము వఱకు

స్నేహితుండు తనబంధువును వెంబడిం పవలయును) అని చెప్పఁబడినరీతిని, పయనంబై పోవు బంధువును వెంబడించినీటిసమీపంబున మఱలు స్నేహితులు వలె, మఱలి, సముద్రజలంబులం బడినవి అని, తాత్పర్యము.

ఇచ్చట, "హనుమంతునివదలి పుష్పంబులువిడిచినీటంబడినవి" అనియుండుటచే, "బంధువులు, పయనంబై పోవు తమబంధువును వెంబడించియతని విడిచి, వియోగదుఃఖంబునఁ, గన్నీళ్లు విడుచుచు, దుఃఖసముద్రమునమునుంగునట్లు, ఆవృక్షంబులు, హనుమంతుని వదలి, పుష్పంబుల విడిచి, సముద్రజలంబులంబడినవి." అని, వ్యంజితమగుచున్నది.

లఘుత్వే నోపపన్నం త ద్విచిత్రం సాగరే పతత్
ద్రుమాణాం వివిధం పుష్పం కపివాయుసమీరితమ్. ౫౩

టీక॥లఘుత్వేన=తేలికతో; ఉపపన్నం=కూడినవియు; కపివాయుసమీరితం=హనుమంతునివలనంగలిగిన గాలిచే నెగురఁగొట్టఁబడినవియు; వివిధం=పలుదెఱంగులుగలవియునగు; తత్=ఆ; ద్రుమాణాం=వృక్షంబులయొక్క; పుష్పం=పూలు; విచిత్రం=ఆశ్చర్యము గలుగునట్లుగా; సాగరే=సముద్రమునందు; అపతత్=పడెను.

ఆవృక్షంబులనానావిధంబులగు పుష్పంబులు, హనుమంతునివేగంబునంగలిగినగాలిచే నెగయఁగొట్టఁబడి, తేలికయగుటంజేసి, చాలదూరమతని వెంబడించి, యాశ్చర్యంబుగసముద్రంబునంబడినవి. అని, తాత్పర్యము.

తారాచిత మివాకాశం ప్రబభౌ చ మహార్ణవః

టీ॥మహార్ణవశ్చ=పూజ్యంబగు సముద్రమును; తారాచితం=నక్షత్రముల చేవ్యాపింపఁబడిన; తారాశతం (ఇట్లు మూలమునందుమాత్రమున్నది)=నక్షత్రములయొక్క నూఱులుగల; ఆకాశమివ=ఆకాశమువలె; ప్రబభౌ=చక్కఁగాఁబ్రకాశించెను.

అట్లు, రాలినపుష్పంబులతోఁగూడినసముద్రంబు, నక్షత్రంబులం గలిగినయాకాశమువలెనొప్పుచుండెను. అని, తాత్పర్యము.

పుష్పౌఘేణాను బద్ధేన నానావర్ణేన వానరః. ౫౪

బభౌ మేఘ ఇవా కాశే విద్యుద్గణవిభూషితః

టీ॥ఆకాశే=ఆకాశమునందు;వానరః=హనుమంతుండు;అనుబద్ధేన;తనదేహంబును,అంటియుండు; నానావర్ణేన=పలువిధంబులగురంగులుగల ; పుష్పౌఘేన=పూలసమూహముచేత; విద్యుద్గణవిభూషితః = మెఱపులసమూహముచేనలంకరింపఁబడిన; మేఘఇవ=మబ్బువలె;అబభౌ=ప్రకాశించెను.

ఆకాశంబునందు,హనుమంతుండు, ఇంకను విడువక దనదేహంబు నంటియుండు విచిత్రంబులయిన పుష్పంబులతోఁగూడి, మెఱపులతోఁగూడిన మేఘంబుఁబోలెనొప్పుచుండెను.

అని, తాత్పర్యము.

తస్య వేగసమాధూతైః పుష్పై స్తోయ మదృశ్యత. ౫౫
తారాభి రభిరామాభి రుదితాభి రివాంబరమ్

టీక॥ తస్య=ఆహనుమంతుని యొక్క;వేగసమాధూతైః=వేగముచే నెగురఁగొట్టఁబడిన;పుష్పైః=పూలతో ; సహితం(అధ్యాహృతము)=కూడిన ; తోయం=సముద్రమునందలి జలము ; ఉదితాభిః=ఉదయించిన; అభిరామాభిః=సుందరములయిన; తారాభిః=నక్షత్రములతో; సహితం(అధ్యాహృతము)=కూడిన; అంబరమివ=ఆకాశమువలె;అదృశ్యత=చూడఁబడెను.

ఆహనుమంతునివేగంబున నెగురఁగొట్టఁబడిరాలినపుష్పంబులతోఁగూడిన సముద్రజలంబు, సుందరంబులగు నక్షత్రంబులతోఁగూడినయాకాశంబువలెనగపడెను. అని, తాత్పర్యము.

తస్యాంబరగతౌ బాహూ దదృశాతే ప్రసారితౌ. ౫౬
పర్వతాగ్రా ద్వినిష్క్రాంతౌ పంచాస్యావివ పన్నగౌ

టీక॥తస్య=ఆహనుమంతునియొక్క; అంబరగతౌ = ఆకాశమునుబొందినవియును;ప్రసారితౌ = చాపఁబడినవియునగు;బాహూ=చేతులు; పర్వతాగ్రాత్ = కొండశిఖరమునుండి; వినిష్క్రాంతౌ=బయలువెడలిన; పంచాస్యౌ = అయిదుమొగంబులుగల;పన్నగావివ=సర్పంబులువలె; దదృశాతే=చూడఁబడినవి.

ఆకాశమునం జాఁపఁబడి గొప్పవయినవ్రేళ్లుగలవియగు పర్వతాకారుండయినయాహనుమంతునిబాహువులు,

పర్వతశిఖరంబునుండి బయలువెడలిన, యయిదుతలలపాములుంబోలె, నగప డినవి.

అని, తాత్పర్యము.

పిబన్నివ బభౌ చాపి సోర్మిజాలం మహార్ణవమ్. ౫౭
పిపాసురివ చాకాశం దదృశే స మహా కపిః

టీక॥సః=ఆ ; మహాకపిః= గొప్ప కోఁతియయిన హనుమంతుండు ; సోర్మిజాలం = అలలసమూహముతోఁ గూడిన; మహార్ణవంచ= గొప్పసముద్రమును;పిబన్నివ= త్రాఁగువాఁడువోలె;బభౌ=ప్రకాశించెను. ఆకాశంచ= ఆకాశమును; పిపాసురివ = త్రాగనిచ్ఛించువాఁడువోలె ; దదృశే=చూడఁబడెను.

ఆహనుమంతుండు, సముద్రంబున కుదగ్గిఱఁగాఁబోవునపుడు, అలలతోఁ గూడసముద్రమును ద్రాఁగునోయనందగియొప్పెను;అట్లు, దూరముగాఁబోవునపుడు;ఆకాశమునుమ్రింగునట్లు చూపట్టెను.అని, తాత్పర్యము.

తస్య విద్యుత్ప్రభాకారే వాయుమార్గానుసారిణః. ౫౮
నయనే విప్రకాశేతే పర్వతస్థా వివానలౌ

టీక॥వాయుమార్గానుసారిణః= వాయువుయొక్క దారియయిన యాకాశముననుసరించుచున్న;తస్య=ఆహనుమంతునియొక్క;విద్యుత్ప్రభాకరే= మెఱపుకాంతివంటిరూపముగల ; నయనే=కండ్లు;పర్వతస్థౌ = కొండయందున్న;అనలావివ= నిప్పులవలె;విప్రకాశేతే=(భూతార్థమందులట్)వెలింగినవి.

ఆకాశంబునంబోవుచున్న పర్వతాకారుండగునా హనుమంతుని మెఱపులుంబోలెమెఱయునేత్రంబులు రెండును, పర్వతంబుపైనున్న రెండగ్నిహోత్రంబులువలెనుండినవి.

అని, తాత్పర్యము.

పింగే పింగాక్షముఖ్యస్య బృహతీ పరిమండలే. ౫౯
చక్షుషీ సంప్రకాశేతే చంద్రసూర్యా వివోదితౌ

టీక॥పింగాక్షముఖ్యస్య= కోఁతులలో శ్రేష్ఠుఁడయిన హనుమంతుని యొక్క;పింగే = గోరోజనపురంగుగలవియును; బృహతీ=గొప్పవియును; పరి




మండలే = అంతటను గుండ్రములుగా నుండునవియునగు, చక్షుషీ=కండ్లు ; ఉదితౌ=ఉదయించిన; చంద్రసూర్యావివ= చంద్రుండును సూర్యుండును బోలె; సంప్రకాశేతే=(భూతార్థమందు లట్) ప్రకాశించినవి.

వానరశ్రేష్ఠుండగు నాహనుమంతుని, పింగళంబులై యంతటను గుండ్రములుగా నుండు, పెద్దకండ్లు రెండును, ఏకకాలంబున నుదయించిన చంద్రసూర్యులనందగి యొప్పుచుండినవి.

అని, తాత్పర్యము.

ముఖం నాసికయా తస్య తామ్రయా తామ్ర మాబభౌ. ౬౦
సంధ్యయా సమభిస్పృష్టం యథా తత్సూర్య మండలమ్

టీక॥ తస్య=ఆహనుమంతుని యొక్క; తామ్రయా= ఎఱ్ఱనైన ; నాసికయా=ముక్కుతోc ; సహితం (అధ్యాహృతము)=కూడిన ; తామ్రం=ఎఱ్ఱనైన; ముఖం=మొగము, సంధ్యయా=సంజచేత; సమభిస్పృష్టం=వ్యాపింపc బడిన; తత్సూర్యమండలం యథా = ఆసంధ్యాకాలపు సూర్యమండలమువలె ; ఆబభౌ=ప్రకాశించెను.

ఆహనుమంతుని యెఱ్ఱని ముఖంబు, ఎఱ్ఱని ముక్కు గలిగి, సంధ్యాకాలంబున, సంధ్యారాగంబుతోc గూడిన సూర్యమండలంబువోలెc బ్రకాశించెను.

అని, తాత్పర్యము.

లాంగూలం చ సమావిద్ధం ప్లవమానస్య శోభతే. ౬౧
అంబరే వాయుపుత్రస్య శక్రధ్వజ ఇవోచ్ఛ్రితః

టీక॥ ప్లవమానస్య= ఎగురుచున్న ; వాయుపుత్రస్య= వాయుదేవుని కొడుకైన హనుమంతుని యొక్క; అంబరే = ఆకాశమునందు ; సమావిద్ధం=ఉన్నతముగాc జేయcబడిన ; లాంగూలంచ = తోcకయును; ఉచ్ఛ్రితః=ఎత్తcబడిన; శక్రధ్వజ ఇవ=ఇంద్రుని టెక్కెము వలె; శోభతే=(భూతార్థమందు లట్) ప్రకాశించెను.

ఆకాశంబునందు, ఎగిరిపోవుచున్న హనుమంతుని యున్నతముగా నిలిచి యుండు వాలంబు, పూజార్థంబుగా నెత్తcబడి యుండు నింద్రధ్వజంబువలెన గపడినది. అని, తాత్పర్యము.

లాంగూలచక్రేణ మహాన్ శుక్లదంష్ట్రో నిలాత్మజః. ౬౨
వ్యరోచత మహాప్రాజ్ఞః పరివేషీవ భాస్కరః




టీక॥మహాన్ = గొప్పదేహముగలవాఁడును; శుక్లదంష్ట్రః = తెల్లనికోఱలు గలవాఁడును; మహాప్రాజ్ఞః = గొప్ప పండితుండునగు ; అనిలాత్మజః = వాయుపుత్రుఁడుకయిన హనుమంతుండు ; లాంగూలచక్రేణ = చక్రమువంటితోఁక చేత, పరివేషీ = గాలిగుడిగల (సూర్యునకుఁగాని చంద్రునకుఁగాని చుట్టుగుండ్రముగా నేర్పడెడుమండలము, "పరివేషము" తెనుంగున "గాలిగుడి" యనంబడును); భాస్కరఇవ = సూర్యుఁడువలె; వ్యరోచత = ప్రకాశించెను.

తెల్లనికోఱలు గలిగి గొప్పదేహంబుతో నుండుమహా పండితుండగు నాహనుమంతుండు, చక్రమువలె గుండ్రముగా నుండుతోఁక గలిగియుండునపుడు, పరివేషంబునొందిన సూర్యుండుం బోలె నొప్పుచుండెను. అని, తాత్పర్యము.

స్ఫిగ్దేశే నాభితామ్రేణ రరాజ స మహాకపిః. ౬౩
మహతా దారితేనేవ గిరి ర్గైరికధాతునా

టీక॥సః = ఆ; మహాకపిః = గొప్పకోఁతియగుహనుమంతుండు; అభితామ్రేణ = అంతటనెఱ్ఱనయిన ; స్ఫిగ్దేశేన = పిఱుఁదులప్రదేశముచేత; దారితేన = పగలఁజేయఁబడిన; మహతా = గొప్పదగు; గైరికధాతునా = పర్వతమునందలిధాతువుచేత ; గిరిరివ = పర్వతమువలె, రరాజ = ప్రకాశించెను.

ఆహనుమంతుండు, అంతటను ఎఱ్ఱగానుండు గొప్పపిఱుఁదులు గలిగి యొంటంజేసి, రెండుబ్రద్దలుగాఁ జేయఁబడిన గొప్పధాతుశిలం గలిగియుండు పర్వతంబువలెఁ బ్రకాశించెను.

అని, తాత్పర్యము.

తస్య వానరసింహస్య ప్లవమానస్య సాగరమ్. ౬౪
కక్షాంతరగతో వాయు ర్జీమూత ఇవ గర్జతి

టీక॥సాగరం = సముద్రమును ; ప్లవమానస్య = దాఁటుచున్న; తస్య = ఆ; వానరసింహస్య = వానరశ్రేష్ఠుండగు హనుమంతుని యొక్క; కక్షాంతరగతః = చంకలనడుమునొందిన; వాయుః = గాలి; జీమూత ఇవ = మేఘమువలె ; గర్జతి = (భూతార్థమందులట్) అఱచెను.

ఇట్లు, సముద్రమును దాఁటుచున్న యాహనుమంతుని చంకల నడుమం గలిగిన గాలి, మేఘంబు గర్జించునట్లు, ధ్వనిం

పుచుండెను. అని, తాత్పర్యము.

ఖే యథా నిపతంత్యుల్కా హ్యుత్తరాంతాద్వి నిస్సృతా. ౬౫
దృశ్యతే సానుబంధాచ తథా స కపికుంజరః

టీక॥ ఖే=ఆకాశమునందు; ఉత్తరాంతాత్=ఉత్తరపుకొననుండి; వినిస్సృతా=బయలు దేరినదియు; నిపతంతీ=పడుచున్నదియును; సానుబంధాచ=సంబంధముతోఁగూడినదియునగు, (సంబంధమనుటచే, సంబంధముగలమఱియొక్కటియాక్షిప్తమగుచున్నది) అనఁగా, వెనుకవ్రేలాడుచుండు సూక్ష్మభాగమయిన తోఁకతోఁ గూడినదియునగు; ఉల్కా=తోఁకచుక్క ("హి" అనునది పాదపూరణార్థము); యథా=ఎట్లు; దృశ్యతే= చూడఁబడునో; తథా=అట్లు; సః=ఆ; కపికుంజరః=వానరశ్రేష్ఠుఁడగుహనుమంతుఁడు; అదృశ్యత (అధ్యాహృతము)= చూడఁబడెను.

ఆకాశమునందు, ఉత్తరపుదిక్కునుండిదక్షిణపుదిక్కుమొగముగాఁ దోఁకతోఁగూడినతోఁకచుక్క యాదేశంబునకుఁబీడనుసూచింపుచుఁ,బడునట్లు, ఆ హనుమంతుఁడు, తోఁకతోఁగూడిదక్షిణపుదిక్కుమొగముగా, రావణునకుఁగీడుదెచ్చుటకై,పోయెను.

అని, తాత్పర్యము.

పతత్పతంగసంకాశో వ్యాయత శ్శుశుభే కపిః ౬౬
ప్రవృద్ధ ఇవమాతంగః కక్ష్యయా బధ్యమానయా

టీక॥ పతత్పతంగసంకాశః=పోవుచున్నసూర్యునితోసమానుఁడును; వ్యాయతః=నిడుపయినవాఁడునగు; కపిః= హనుమంతుఁడు; బధ్యమానయా= కట్టఁబడుచున్న; కక్ష్యయా=ఏనుఁగునడుమునఁగట్టెడుమోకుచేత; ప్రవృద్ధః= నిడుపయిన; మాతంగఇవ= ఏనుఁగువలె; శుశుభే= ప్రకాశించెను.

సూర్యునితోసమానుఁడుగా నాకాశంబునంబోవుచున్న, దీర్ఘదేహుఁడగునాహనుమంతుఁడు, నడుమునమోకుతోఁగట్టఁగాదీర్ఘముగా దేహముఁబెంచినయేనుంగువలెనుండెను.

అని, తాత్పర్యము.

ఉపరిష్టా చ్ఛరీరేణ ఛాయయా చావ గాఢయా. ౬౭

సాగరే మారుతావిష్టా నౌ రివాసీ త్త దాకపిః

టీక॥ తదా=అప్పుడు; కపిః= హనుమంతుండు; ఉపరిష్టాచ్ఛరీరేణ= పైగానుండు దేహము చేతను; అవగాఢయా= సముద్రంబున మునింగియున్న; ఛాయయాచ=నీడచేతను; సాగరే=సముద్రమునందు; మారుతావిష్టా=గాలిచేనధిష్ఠింపఁబడిన; నౌరివ=ఓడవలె; ఆసీత్=ఉండెను.

అప్పుడు, హనుమంతుని దేహం బాకాశంబునను దానినీడ సముద్రంబునను, రెండునేకాకారంబుగాఁ జూపట్టుటంజేసి, యట్లు, సముద్రంబునఁ గ్రింది భాగంబు మునింగియుఁ, బై భాగం బాకాశంబు నావరించియునుండఁగా, వాయువశంబునం బోవుచున్న యోడవలె, హనుమంతుండు, కనుపట్టెను.

అని, తాత్పర్యము.

యం యం దేశం సముద్రస్య జగామ సమహా కపిః. ౬౮
స స తస్యోరు వేగేన సోన్మాద ఇవ లక్ష్యతే

టీక॥ సః=ఆ; మహాకపిః= గొప్పకోఁతియయినహనుమంతుండు; సముద్రస్య=సముద్రముయొక్క; యంయం; ఏమే; దేశం=ప్రదేశమును; జగామ= పొందెనో; సః సః=ఆయాప్రదేశము; తస్య=ఆహనుమంతునియొక్క; ఊరువేగేన=తొడలవేగముచేత ; సోన్మాదఇవ= పిచ్చితోఁగూడినదివలె; లక్ష్యతే=(భూతార్థమందులట్) చూడఁబడెను.

ఆహనుమంతుఁడు, సముద్రమునందు, యేప్రదేశములకుఁబోయెనో, ఆయాప్రదేశములన్నియు, నతనియూరువేగంబునఁ, దిరుగుడువడినురుఁగు విడుచుచుఁ బైకెగురుచున్న జలంబుగలిగి, చిత్తభ్రమంబునొందినట్లగపడినవి.

అని, తాత్పర్యము.

సాగరస్యోర్మిజాలానా మురసా శైల వర్ష్మణామ్. ౬౯
అభిఘ్నంస్తు మహావేగః పుప్లువే స మహా కపిః

టీక॥ మహావేగః=అధికమయినవేగముగల; సః=ఆ; మహాకపిః = హను

మంతుఁడు; సాగరస్య = సముద్రము యొక్క, శైలవర్ష్మణాం — పర్వతం బంతటి ప్రమాణముగల; (ఇది గోవింద రాజపాఠము) ఊర్మిజాలానాం (ఊర్మిజాలాని) — అలలసమూహముల ను; శైలవర్ష్మణా (ఇదిమహేశ్వర తీర్థ పాఠము, ఇప్పుడు ఉరశ్శబ్దము నకువిశేషణము) = పర్వతంబంతటి ప్రమాణము గల; ఉరసా = ఱొమ్ము చేత; (లక్షణచే) ఱొమ్మునఁబుట్టిన గాలిచేత; అభిఘ్నన్ = కొట్టుచునె; వుప్లువే = దాఁటెను.

ఆహనుమంతుండు, సముద్రమును దాఁటుచుండఁగా, సముద్రము నందలి గొప్పయలలు, అతని విశాలంబగు ఱొమ్ము సంగతిగినవాయువువలననినుమడిగాఁ గదలినవి. అని, తాత్పర్యము.

కపివాతశ్చ బలవాన్ మేఘవాతశ్చ నిస్సృతః. ౭౦
సాగరం భీమ నిర్ఘోషం కంపయామాసతు ర్భృశమ్

టీక॥ నిస్సృతః = బయలుదేఱిన; బలవాన్ = బలముగల; కపివాతశ్చ = హనుమంతునివలనఁ గలిగినవాయువును; మేఘవాతశ్చ = మబ్బుకొఱకైన, వాయువును; సాగరం = సముద్రమును; భీమనిర్ఘోషం = భయంకరమగు ధ్వని గల్గునట్లుగా; భృశం = మిక్కిలియు; కంపయామాసతుః = కదలించినవి.

అప్పుడు, హనుమంతుం డెగిరిపోవుటవలనంగలిగినవాయువు, మేఘమువచ్చుటకై గొట్టుచుత్తరపుగాలియును, బలవంతంబులగునీరెండువాయువులునుం గూడి, సముద్రమును, అధికమయిన ధ్వని గలుగునట్లుగాఁ, గలంచినవి.

అని, తాత్పర్యము.

విశేషార్థము. — దక్షిణపు దిక్కునుగూర్చిపోవు హనుమంతునకు, శుభ సూచకంబుగా ననుకూలమయి నయుత్తరపు గాలికొట్టినట్లు వర్ణించుట, నతనికిజయంబును సూచింపు చున్నది.

వికర్షన్నూర్మిజాలాని బృహంతి లవణాంభసి. ౭౧
పుప్లువే కపిశార్దూలో వికిరన్నివ రోదసీ

టీక॥ కపిశార్దూలః = వానర శ్రేష్ఠుండగుహనుమంతుండు; లవణాంభసి = సముద్రమునందు; బృహంతి = గొప్పవియైన; ఊర్మిజాలాని = అలలసమూహములను; వికర్షన్ = ఈడ్చుకొనుచు; రోదసీ = ఆకాశమునుభూమిని;

స ౧




వికిరన్నివ=విభాగించువాఁడువలె; పుప్లువే=దాఁటెను.

వానరశ్రేష్ఠుండగుహనుమంతుండు సముద్రముదాఁటునపుడు, వేగంబునను, సముద్రమునందలియలలు, అతండు వానినీడ్చుకొనిపోవునట్లు, అతనివెనుకొనిపోఁగా, నని, హనుమంతుండు, భూమియు నాకాశమును విభాగింపఁదలంపుగొని, వానినావరించికొని యుండుసముద్రమునందలి యలలనీడ్చుకొనిపోవునట్లు, అగపడెను.

అని, తాత్పర్యము.

మేరుమందరసంకాశా నుద్ధతాన్స మహార్ణవే. ౭౨
అతిక్రామ న్మహావేగ స్తరంగాన్ గణయన్నివ

టీక॥ మహావేగః = అధికమయినవేగముగల; సః=ఆహనుమంతుఁడు; మహార్ణవే=గొప్పసముద్రమునందు; ఉద్ధతాన్=ఎగురఁగొట్టబడిన; మేరుమందరసంకాశాన్ = మేరుపర్వతముతోను మందర పర్వతముతోను సమానమయిన; తరంగాన్=అలలను; గణయన్నివ=లెక్కించు వాఁడువోలె; అతిక్రామత్ (అత్యక్రామత్)=దాఁటెను.

మహావేగుండగు నాహనుమంతుండు, సముద్రమునం, దసవేగంబుచే లేచిన మేరుమందరపర్వతంబులకు సరివచ్చుతరంగంబులలెక్క పెట్టువాఁడువలె. దాఁటెను. అని, తాత్పర్యము.

తస్య వేగసముద్ధూతం జలం స జలదం తదా. ౭౩
అంబరస్థం విబభ్రాజ శారదాభ్రమివా తతమ్

టీక॥ తదా=అప్పుడు; తస్య= అహనుమంతునియొక్క; వేగసముద్ధూతం= వేగముచే నెగురఁగొట్టబడినదియును, కావుననే; అంబరస్థం=ఆకాశమునందుండునదియును, కావుననే; సజలదం= మేఘములతోఁ గూడినదియునగు; జలం=నీరు; ఆతతం=వ్యాపించియుండు; శారదాభ్రమివ= శరదృతువునందలిమబ్బువలె; విబభ్రాజ=ప్రకాశించెను.

అప్పుడాహనుమంతుని యూరువేగంబునఁబైకిలేచి, యాకాశంబునొందియచ్చటనుండు మేఘంబులతోఁగలసి, స్వచ్ఛంబుగానుండుసముద్రజలంబు, ఆకాశంబునంగ్రమ్ముకొనిన, తెల్లని, శరత్కాలమేఘమువలెఁబ్రకాశించినది.

అని, తాత్పర్యము.

తిమినక్రఝషాః కూర్మా దృశ్యంతే వివృతా స్తదా. ౭౪




వస్త్రాపకర్షణేనేవ శరీరాణి శరీరిణామ్

టీక॥తదా = అప్పుడు;తిమినక్రఝషాః= నూఱుయోజనములుపొడవుగల చేఁపలును మొసళ్లును చేఁపలును ; కూర్మాః= తాఁబేళ్లును;వివృతాః= తెఱవఁబడినవై;వస్త్రాపకర్షణేన=వస్త్రముయొక్క-తొలఁగఁజేయుటచేత;శరీరిణాం = మనుష్యులయొక్క-; శరీరాణీవ=అవయవములువలె ; దృశ్యంతే = (భూతార్థమందులట్) చూడఁబడినవి-

అప్పుడు, సముద్రంబునందు , హనుమంతునివేగంబున నీళ్లన్నియుఁ బైకెగురుటంజేసి, పెద్దచేఁపలును జేఁపలును మొసళ్లును దాఁబేలును , వస్త్రంబునువిడిచినవుడు , మనుష్యులయవయవంబులుం బోలె,నగపడినవి- అని, తాత్పర్యము-

ప్లవమానం సమీక్ష్యాథ భుజంగా స్సాగరాలయాః. ౭౫
వ్యోమ్ని తం కపిశార్దూలం సుపర్ణ ఇతి మేనిరే

టీక॥అథ=అంతః;సాగరాలయాః= సముద్రంబు నికిపట్టుగాఁగల ; భుజంగాః=సర్పములు; వ్యోమ్ని=ఆకాశమునందు;ప్లవమానం= ఎగిరిపోవుచున్న ; తం=ఆ;కపిశార్దూలం = వానరశ్రేష్ఠుండగుహనుమంతుని ; సమీక్ష్య=చూచి;సుపర్ణఇతి=గరుత్మంతుఁడని;మేనిరే=తలఁచినవి.

అంత, సముద్రంబుననున్నసర్పంబులు, ఆకాశంబుననెగసిపోవుచున్నవానరశ్రేష్ఠుండగునాహనుమంతునింజూచి, గరుత్మంతుండనితలంచి,భయంపడినవి- అని, తాత్పర్యము-

దశయోజనవిస్తీర్ణా త్రింశద్యోజన మాయతా. ౭౬
ఛాయా వానరసింహస్య జలే చారుతరా భవత్

టీక॥జలే=నీటియందు ; వానరసింహస్య = వానరశ్రేష్ఠుండగుహనుమంతునియొక్క-; దశయోజనవిస్తీర్ణా= పదియామడలువెడల్పుగలదియును;త్రింశద్యోజనం=ముప్పదియామడలు ; ఆయతా=నిడుపైనదియునగు ; ఛాయా=నీడ; చారుతరా=మిక్కిలియును సుందరముగా;అభవత్=అయినది-

సముద్రమునందు, వానరశ్రేష్ఠుండగుహనుమంతునిమైనీడ, పదియోజనము

లవెడల్పును ముప్పదియోజనములనిడుపునుంగలదియై, యతిసుందరంబుగాఁగను పట్టినది. అని, తాత్పర్యము.

శ్వేతాభ్రఘనరాజీవ వాయుపుత్త్రానుగామినీ. ౭౭
తస్య సా శుశుభే ఛాయా వితతా లవణాంభసి

టీక॥వాయుపుత్త్రానుగామినీ= వాయుపుత్త్రుఁడునైన హనుమంతుని వెంబడించునదియును;లవణాంభసి = సముద్రమునందు;వితతా=వ్యాపించి యుండునదియునగు; తస్య=ఆహనుమంతుని యొక్క;సా=ఆ;ఛాయా=నీడ ; శ్వేతాభ్రఘనరాజీవ=స్వచ్ఛములయినమేఘములయొక్క పట్టమయినపఙ్క్తివలె; శుశుభే=ప్రకాశించెను.

హనుమంతుని వెంబడించుచు సముద్రమునందు వెడల్పుగావ్యాపించియుండు, నాహనుమంతునినీడ, దట్టంబుగాఁ గూడుకొనినసనిర్మలములయిన మేఘంబులపఙ్క్తివలెఁ,బ్రకాశించెను.

అని, తాత్పర్యము.

శుశుభే స మహాతేజా మహాకాయో మహాకపిః. ౭౮
వాయుమార్గే నిరాలంబే పక్షవా నివ పర్వతః

టీక॥నిరాలంబే=పోయినయూఁతగల;వాయుమార్గే= ఆకాశమునందు; మహాతేజాః=అధికమయిన పరాక్రమముగలవాఁడును;మహాకాయః=గొప్పదేహముగలవాఁడునగు;సః=ఆ; మహాకపిః=హనుమంతుఁడు; పక్షవాన్=ఱెక్కలుగల;పర్వతఇవ=కొండవలె; శుశుభే=ప్రకాశించెను.

ఎంతమాత్రమునాధారములేనియాకాశంబునఁబోవుచున్న,మహాతేజుండునుగొప్పశరీరంబు గలవాఁడునగు నాహనుమంతుండు, ఱెక్కలుగలిగినపర్వతంబుంబోలె,నొప్పుచుండెను.

అని, తాత్పర్యము.

యేనా సౌ యాతి బలవాన్ వేగేన కపికుంజరః. ౭౯
తేన మార్గేణ సహసా ద్రోణీకృత ఇవార్ణవః

టీక॥అసౌ=ఈ;బలవాన్=అధికమయినబలముగల; కపికుంజరః = వాన

రశ్రేష్ఠుండగుహనుమంతుండు; వేగేన=వేగములో; యేన=ఏమార్గముచేత; యాతి=(భూతార్థమందులట్) పోయెనో; అర్ణవః = సముద్రము; సహసా=శీఘ్రముగా; తేన=ఆ; మార్గేణ=దారిచేత; ద్రోణీకృతఇవ=తొట్టిగాఁజేయఁబడినదివలె; ఆసీత్(అధ్యాహృతము)=అయినది.

బలవంతుండగు హనుమంతుండు, వేగంబున, నేమార్గముఁ బట్టిపోయెనో, నామార్గమందలిసముద్రంబు, ఆక్షణంబుననె, వేగవశంబున, నీళ్లుముందుకుబ్బుటంజేసి, తొట్టిగాఁజేయఁబడినట్లు, చూపట్టినది. అని, తాత్పర్యము.

ఆపాతే పక్షిసంఘానాం పక్షిరాజఇవ వ్రజన్. ౮౦
హనుమాన్మేఘజాలాని ప్రకర్షన్ మారుతో యథా

టీక॥హనుమాన్ = హనుమంతుఁడు; మారుతోయథా = వాయువువలె; మేఘజాలాని= మబ్బులసమూహములను; ప్రకర్షన్ = ఈడ్చుకొనుచు; పక్షిసంఘానాం = పక్షులసమూహములయొక్క; ఆపాతే=దారియయినయాకాశమునందు; పక్షిరాజఇవ=పక్షులకుఁబ్రభువయినగరుత్మంతుఁడువలె; వ్రజన్ = పోవుచు; ఆసీత్(అధ్యాహృతము)=ఉండెను-

హనుమంతుఁడు, వాయువుంబోలె, వేగంబున మేఘంబుల నాకర్షించుచు, నాకాశమార్గమునందు, గరుత్మంతుఁడువోవునట్లు, లీలగాఁబోవుచుండెను-

అని, తాత్పర్యము-

పాండురారుణవర్ణాని నీలమాంజిష్ఠకానిచ. ౮౧
కపినాకృష్యమాణాని మహాభ్రాణి చకాశిరే

టీక॥పాండురారుణవర్ణాని= తెలుపుఎఱుపురంగులుగలవియును; నీలమాంజిష్ఠకానిచ= నలుపుపసుపువన్నెలుగలవియును; కపినా = హనుమంతునిచేత; కృష్యమాణాని=ఈడ్వఁబడుచున్నవియునగు; మహాభ్రాణి= గొప్పమేఘంబులు; చకాశిరే=ప్రకాశించినవి.

హనుమంతుండీడ్చుకొనిపోవుచున్న, తెలుపు నెఱుపు నలుపు పసుపు వన్నెలం గలగొప్పమేఘంబులు, చూచువారికాశ్చర్యంబుగల్గించుచుండినవి-

అని, తాత్పర్యము-

ప్రవిశన్నభ్రజాలాని నిష్పతంశ్చ పునఃపునః. ౮౨
ప్రచ్ఛన్నశ్చ ప్రకాశశ్చ చంద్రమా ఇవ లక్ష్యతే

టీక॥ సః(అధ్యాహృతము)= ఆహనుమంతుఁడు; పునఃపునః= మాటిమాటికిని; అభ్రజాలాని= మేఘముల సమూహములను; ప్రవిశన్= చొచ్చుచును; నిష్పతంశ్చ= బయలు వెడలుచును; ప్రచ్ఛన్నశ్చ= మూఁయఁబడినవాఁడును; ప్రకాశశ్చ= బయలుపడినవాఁడునగు; చంద్రమాఇవ= చంద్రుఁడువలె ; లక్ష్యతే= (భావార్థమందు లట్) = చూడఁబడెను.

ఆహనుమంతుండు, దాఁటునపుడు మేఘంబులు దగులునప్పుడు, వానిలోమఱుఁగుపడుచు, మఱల, నామేఘంబులు గడచినపిమ్మట, వెలికివచ్చుచు, మేఘంబులచే మూఁయఁబడిమఱలబయలు పడుచుండు చంద్రుండుంబోలె, నగపడుచుండెను. అని, తాత్పర్యము.

ప్లవమానం తు తం దృష్ట్వా ప్లవంగం త్వరితం తదా. ౮౩
వవర్షుః పుష్పవర్షాణి దేవగంధర్వదానవాః

టీక॥ తదా= అప్పుడు; త్వరితం= వేగముగలుగునట్లు; ప్లవమానం= దాఁటుచున్న; తం = ఆ; ప్లవంగం= కోఁతియయినహనుమంతుని; దృష్ట్వాతు= చూచినంతనె; దేవగంధర్వదానవాః= దేవతలునుగంధర్వులునుదానవులును; పుష్పవర్షాణి= పూలవానలను; వవర్షుః= కురిసిరి.

అప్పుడుత్వరితంబుగా సముద్రంబు దాఁటుచున్నహనుమంతుంజూచి, దేవతలునుగంధర్వులును దానవులును, పూలవానలంగురిపించిరి. అని, తాత్పర్యము.

తతాప నహి తం సూర్యః ప్లవంతం వానరోత్తమమ్. ౮౪
సిషేవే చ తదా వాయూ రామకార్యార్థసిద్ధయే

టీక॥ తదా= అప్పుడు; రామకార్యార్థసిద్ధయే= రామునికార్యం బనియెడుప్రయోజనముయొక్క సిద్ధించుటకొఱకు; సూర్యః = సూర్యుఁడు; ప్లవంతం= దాఁటుచున్న; తం= ఆ; వానరోత్తమం = కోఁతులలోశ్రేష్ఠుండగునా హనుమంతుని; నతతాపహి = వేడిమి నొందఁజేయలేదుగదా! వాయుశ్చ=

వాయుదేవుఁడును; సిషేవే = సేవించెను,

అప్పుడు, సీతను వెదకుట యనెడు రామకార్యంబుసిద్ధించుకొఱకై, సూర్యుండు, సముద్రంబు దాఁటుచున్న హనుమంతునిపై వేఁడిమిచూపఁడయ్యె; వాయువును, హనుమంతుండుతనపుత్రుండయ్యును, రామకార్యంబం దుద్యోగించియుంటం జేసి, పూజ్యుండని తలంచి, యారామకార్యంబు సిద్ధించుటకై, యతని, సేవించెను-

అని, తాత్పర్యము-

ఋషయ స్తుష్టువు శ్చైనం ప్లవమానం విహాయసా. ౫౫
జగు శ్చ దేవగంధర్వాః ప్రశంసంతో మహౌజసమ్

టీక॥ విహాయసా = ఆకాశముచేతను; ప్లవమానం = పోవుచున్న; ఏనం = ఈ హనుమంతుని; ఋషయశ్చ = ఋషులును; తుష్టువుః = పొగడిరి- దేవగంధర్వాశ్చ = దేవతలునుగంధర్వులును; మహౌజసం = అధికపరాక్రమంబుగల నాహనుమంతుని; ప్రశంసంతః = పొగడుచున్నవారలై; జగుః = పాడిరి-

ఇట్లు, ఆకాశమార్గంబునం బోవుచున్నహనుమంతుని, ఋషులునుంబొగడిరి; దేవతలుగంధర్వులు, అతనిపరాక్రమంబుఁ బ్రశంసించుచుఁ, బాడిరి-

అని, తాత్పర్యము-

నాగాశ్చ తుష్టువు ర్యక్షా రక్షాంసి విబుధాః ఖగాః. ౫౬
ప్రేక్ష్య సర్వే కపివరం సహసా విగతక్లమమ్

టీక॥ నాగాశ్చ = సర్పంబులును; యక్షాః = యక్షులును; రక్షాంసి = రాక్షసులును; ఖగాః = పక్షులును ; విబుధాః = దేవతలును; సర్వే = అందఱును; విగతక్లమం; పోయినబడలికగల; కపివరం = వానరశ్రేష్ఠుండగుహనుమంతుని; ప్రేక్ష్య = చూచి; సహసా = శీఘ్రముగా ; తుష్టువుః = పొగడిరి-

సర్పంబులునుయక్షులునుదిక్పాలుండగు నిరృతికిసంబంధించినరాక్షసులునుబక్షులును దేవతలును, అందఱును, శ్రమంబునొందక, యాకాశంబునం బోవుచున్న హనుమంతునింజూచి, సంతోషంబుపట్టలేక, యాక్షణంబ, ప్రస్తుతించిరి-

అని, తాత్పర్యము-

తస్మిన్ ప్లవగశార్దూలే ప్లవమానే హనూమతి. ౮౭
ఇక్ష్వాకుకులమానార్థీ చింతయామాస సాగరః

టీక॥ప్లవగశార్దూలే= వానరశ్రేష్ఠుండగు; తస్మిన్= ఆ; హనూమతి= హనుమంతుండు; ప్లవమానే= దాటుచుండఁగా; సాగరః= సగరునిచే వృద్ధిఁ బొందిన, సముద్రుఁడు, కావుననే; ఇక్ష్వాకుకులమానార్థీ = ఇక్ష్వాకు వంశము యొక్క గౌరవమునుగోరువాఁడై; చింతయామాస= ఆలోచించెను.

వానరశ్రేష్ఠుండగునాహనుమంతుండు సముద్రంబు దాఁటుచుండఁగా, సముద్రుండు, మున్నిక్ష్వాకువంశంబునంబుట్టిన సగరుని చే వృద్ధిఁబొందినవాఁడు కావున, "నిక్ష్వాకువంశము సన్మానమునొందవలె" నని కోరి, యిట్లని, యాలోచించెను.

అని, తాత్పర్యము.

సాహాయ్యం వానరేంద్రస్య యది నాహం హనూమతః; ౮౮
కరిష్యామి భవిష్యామి సర్వవాచ్యో వివక్షతామ్

టీక॥ అహం= నేను ; వానరేంద్రస్య = వానరశ్రేష్ఠుండగు; హనూమతః= హనుమంతునకు ; సాహాయ్యం= తోడ్పాటును; నకరిష్యామియది = చేయనేని; వివక్షతాం= మాటలాడఁగోరువారలకు , నోరుగలవారలకనుట; సర్వవాచ్యః= అన్నిటచేతనుఁనిందింపఁదగినవాఁడను; భవిష్యామి= అయ్యెదను,

నేనిప్పుడు, వానరశ్రేష్ఠుండగుహనుమంతునకుఁదోడ్పడనేని, నోరుగలవారలందఱు, నన్ను, అన్నివిధంబులను, నిందింతురు. అని, తాత్పర్యము.

అహ మిక్ష్వాకునాథేన సగరేణ వివర్ధితః. ౮౯
ఇక్ష్వాకుసచివ శ్చాయం నావసీదితు మర్హతి

టీక॥అహం= నేను; ఇక్ష్వాకునాథేన= ఇక్ష్వాకువంశమునఁ బుట్టిన వారలకుఁబ్రభువయిన; సగరేణ = సగరునిచేత; వివర్ధితః= వృద్ధినొందఁజేయఁబడినాఁడను; అయంచ= ఈహనుమంతుండును; ఇక్ష్వాకుసచివః= ఇక్ష్వాకువంశమునఁబుట్టినవానికిసహాయుఁడు; కావున, అవసీదితుం= అలసటనొందుటకు ; నాహతి= తగఁడు.

ఇక్ష్వాకుకులమునందుఁబెంపువహిం

చినసగరుండు, నన్ను వృద్ధిఁబొందునట్లు చేసెను; ఈహనుమంతుఁడు, ఇక్ష్వాకు కులంబునఁ బుట్టిన రామునకుఁ దోడ్పడి నాఁడు; కావుననితండు శ్రమపడకుండు నట్లు సేయవలయును.

అని, తాత్పర్యము.

తథా మయా విధాతవ్యం విశ్రమేత యథా కపిః. ౯౦
శేషంచ మయి విశ్రాంత స్సుఖేనా తిపతిష్యతి

టీక॥కపిః = హనుమంతుఁడు; యథా=ఎట్లు; విశ్రమేత=అలసటదీర్చుకొనునో; తథా=అట్లు, మయా= నాచేత; విధాతవ్యం=చేయఁబడవలసినది ; అయం(అధ్యాహృతము)=ఇతఁడు ; మయి=నాయందు; విశ్రాంతః= డొఉట నొందినవాఁడై; శేషంచ= మిగిలినమార్గమునుగూడ ; సుఖేన=సౌఖ్యముచేత; అతిపతిష్యతి=దాఁటును.

కావున, హనుమంతుండలసటదీర్చుకొనుటకవకాశముగల్గునట్లు , నేనుజేయవలయును; ఇతండు, నావలననూఱటంజెంది, యంత, మిగతదారినిగూడ , నాయాసంబులేక దాఁటిపోవును.

అని, తాత్పర్యము.

ఇతి కృత్వా మతిం సాధ్వీం సముద్ర శ్ఛన్న మంభసి. ౯౧
హిరణ్యనాభం మైనాక మువాచ గిరిసత్తమమ్

టీక॥సముద్రః=సముద్రుఁడు; ఇతి=ఇట్లు; సాధ్వీం=మంచిదైన; మతిం=తలంపును; కృత్వా= చేసి; అంభసి = నీటియందు; ఛన్నం= మూయఁబడినవాఁడును; గిరిసత్తమం = పర్వతంబులలో శ్రేష్ఠుండును; హిరణ్యనాభం = బంగారమె ప్రధానముగాఁ గలవాఁడునగు ; మైనాకం=మైనాకంబనెడు పర్వతమునుగూర్చి; ఉవాచ=పలికెను.

సముద్రుండట్లుమంచియాలోచన చేసి, నీటిలోమునింగియున్నపర్వత శ్రేష్ఠుండును స్వర్ణమయుండునగు మైనాకముంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

త్వ మిహా సురసంఘానాం పాతాళతలవాసినామ్. ౯౨
దేవరాజ్ఞా గిరిశ్రేష్ఠ పరిఘ స్సన్నివేశితః

టీక= గిరిశ్రేష్ఠ=పర్వతములలో మేటివయినమైనాకమా! త్వం = నీవు;ఇహ=ఇచ్చట : దేవరాజ్ఞా (దేవరాజేన)=దేవేంద్రునిచేత? పాతాళతలవాసినాం = పాతాళలోకమునం దుండునట్టి ; అసురసంఘానాం = అసురులసమూహములకు; పరిఘః =గడియగ్రామనుగా;సన్నివేశితః=ఉంచఁబడితివి.

పర్వతశ్రేష్ఠుండవగు మైనాకమా! దేవేంద్రునిచేత నిన్నిచటఁ, పాతాళమునందున్న యసురులు పైకిరాకుండుటకై, గడియగ్రామానుగానుంచెను. అని, తాత్పర్యము.

త్వమేషాం జాతవీర్యాణాం పునరేవో త్పతిష్యతామ్. ౯౩
పాతాళస్యా ప్రమేయస్య ద్వార మావృత్య తిష్ఠసి

టీక॥ జాతవీర్యాణాం = కలిగినపరాక్రమంబుగల ; ఏషాం=ఈయసురులు;పునరేవ = మఱలను ; ఉత్పతిష్యతాం=ఎగురఁబోవఁగా; త్వం=నీవు;అప్రమేయస్య= కొలఁతపెట్టరాని; పాతాళస్య= పాతాళముయొక్క ; ద్వారం=దారిని;ఆవృత్య=మూసికొని ; తిష్ఠసి=ఉన్నావు.

ఈయసురులుమఱలఁ బరాక్రమంబునొంది పైకివచ్చుటకు యత్నింపఁగా, నీవు,అప్రమేయంబగు పాతాళముదారినావరించుకొని , వారినిపైకిరానీయకున్నావు. అని, తాత్పర్యము.

తిర్య గూర్ధ్వ మధశ్చైవ శక్తిస్తే శైల వర్ధితుమ్. ౯౪
తస్మా త్సంచోదయామి త్వా ముత్తిష్ఠ గిరిసత్తమ

టీక॥ శైల=మైనాకపర్వతమా! తే=నీకు;తిర్యక్=అడ్డముగాను; ఊర్ధ్వం=పైఁగాను;అధశ్చైవ=క్రిందుగాను; వర్ధితుం= పెరుఁగుటకు ;శక్తిః=సామర్థ్యము;అస్తి(అధ్యాహృతము)= కలదు.గిరిసత్తమ=పర్వతశ్రేష్ఠుండవగుమైనాకమా! తస్మాత్ = అందువలన; త్వాం=నిన్ను; సంచోదయామి=ప్రేరేపించెదను.ఉత్తిష్ఠ=లెమ్ము.

పర్వతశ్రేష్ఠుండవగుమైనాకమా!నీకు, అడ్డముగానుమీఁదుగానుగ్రిందుగానుమేనుపెంచుటకుసత్తిగలదు;కావున, నీకుఁజెప్పెదను ; నీవిప్పుడుపైకిలేవవలయును.అని, తాత్పర్యము.

స ఏష కపిశార్దూల స్త్వా ముపర్యేతి వీర్యవాన్. ౯౫
హనుమాన్ రామకార్యార్థం భీమకర్మా ఖ మాప్లుతః

టీక॥కపిశార్దూలః = వానరశ్రేష్ఠుండును;వీర్యవాన్ = పరాక్రమముగలవాఁడును; భీమకర్మా = వెఱపుఁబుట్టించుకార్యముగలవాఁడునగు ; సః= ఆ;ఏషః=ఈ ; హనుమాన్=హనుమంతుఁడు ; రామకార్యార్థం=రామునికార్యముకొఱకు; ఖం = ఆకాశమునుగూర్చి ; ఆప్లుతః = ఎగిరినవాఁడై; త్వాం=(షష్ఠ్యర్థమందుఁద్వితీయ) నీయొక్క;ఉపరి=పైఁగా; ఏతి=పోవుచున్నాఁడు.

వానరశ్రేష్ఠుండును బరాక్రమశాలియునగునట్టియీహనుమంతుఁడు , రామకార్యార్థంబుగా, భయంకరంబగు కార్యంబుసేయువాఁడై , యాకాశమునం, దెగిరి, నీపైఁగాఁబోవుచున్నాఁడు. అని, తాత్పర్యము.

అస్య సాహ్యం మయా కార్య మిక్ష్వాకుకులవర్తినః. ౯౬
మమ హీక్ష్వాకవః పూజ్యాః పరం పూజ్యతమా స్తవ

టీక॥మయా=నాచేత ; ఇక్ష్వాకుకులవర్తినః= ఇక్ష్వాకువంశముననుసరించుచున్నట్టి;అస్య=ఈహనుమంతునకు; సాహ్యం=తోడ్పాటు;కార్యం = చేయఁదగినది.ఇక్ష్వాకవః = ఇక్ష్వాకువంశమునందుఁబుట్టినవారలు;మమ= నాకు;పూజ్యాహి= పూజింపఁదగినవారలుకదా!తవ=నీకును ; పరం=మిక్కిలియును;పూజ్యతమాః= ఎచ్చుగాఁబూజింపఁదగినవారలు.

ఈతండిక్ష్వాకువంశమునకు సేవసేయువాఁడగుటం జేసి, యితనికి నేనుసాహాయ్యంబుసేయవలయును; నాకు, ఇక్ష్వాకువంశస్థులు , వృద్ధిగలిగించుటంజేసి,పూజ్యులని నీకునుం దెలియును, వారిచే వృద్ధిఁబొందిననాయందు సుఖంబున్నావుకావున , నీకునువారుమిక్కిలియుఁబూజ్యులు.అని, తాత్పర్యము.

కురు సాచివ్య మస్మాకం న నః కార్య మతిక్రమేత్. ౯౭
కర్తవ్య మకృతం కార్యం సతాంమన్యు ముదీరయేత్

టీక॥అస్మాకం=మాకు;సాచివ్యం=సాహాయ్యమును; కురు = చేయుము.

నః=మాయొక్క; కార్యం = పని; నాతిక్రామేత్ = అతిక్రమింపకుండుఁగాక, కర్తవ్యం= చేయఁబడవలసినదియును; అకృతం=చేయఁబడనిదియునగు ; కార్యం=పని;సతాం=పెద్దలకు;మన్యుం=కోపమును;ఉదీరయేత్ = కలిగించును.

కావున, మాకార్యముమీఱిపోవుటకు మునుపే , మాకుసాహాయ్యముసేయుము;అట్లుచేయవలసినకార్యమును జేయవేని,పెద్దలకుఁగోపముగలుగును.

అని, తాత్పర్యము.

సలిలా దూర్ధ్వ ముత్తిష్ఠ తిష్ఠత్వే ష కపి స్త్వయి. ౯౮
అస్మాక మతిథి శ్చైవ పూజ్యశ్చ ప్లవతాం వరః

టీక॥సలిలాత్ =నీటినుండి; ఊర్ధ్వం=పైకి;ఉత్తిష్ఠ=లెమ్ము;అస్మాకం= మాకు;అతిథిః=అతిథియును; పూజ్యశ్చ = పూజింపఁదగినవాఁడును;ప్లవతాం =ఎగురువారిలోపల;వరః= శ్రేష్ఠుఁడునగు; ఏషః=ఈ;కపిః=హనుమంతుఁడు; త్వయి=నీయందు;తిష్ఠతు=ఉండుఁగాక.

నీవునీటినుండిపైకిలెమ్ము, మనకతిథియుఁబూజనీయుండునుఎగురువారిలో శ్రేష్ఠుండునగునీహనుమంతుండునీశిఖరములపైవిశ్రమించుఁగాక.

అని, తాత్పర్యము.

చామీకరమహానాభ దేవగంధర్వసేవిత. ౯౯
హనుమాం స్త్వయి విశ్రాంత స్తత శ్శేషం గమిష్యతి

టీక॥దేవగంధర్వసేవిత= దేవతలచేతనుగంధర్వులచేతను సేవింపబడిన; చామీకరమహానాభ= స్వర్ణమయములయిన గొప్పశిఖరములుగల మైనాకపర్వతమా! హనుమాన్= హనుమంతుండు;త్వయి=నీయందు;విశ్రాంతః = డాటనొందినవాఁడై;తతః= అంతట; శేషం=మిగతదారిని; గమిష్యతి= పోంఁగలఁడు.

నీవు, దేవతులచేతను గంధర్వులచేతను సేవింపఁ బడినవాఁడవు,బంగారు శిఖరంబులు గలవాఁడవు, హనుమంతుండు,నీశిఖరములపైవిశ్రమించి, యంతమిగతదారిని సుఖంబుగాఁగడవఁగలఁడు.

అనితాత్పర్యము

కాకుత్థ్సస్యా నృశంస్యంచ మైథిల్యా శ్చ వివాసనమ్. ౧౦౦

శ్రమంచ ప్లవగేంద్రస్య సమీక్ష్యోత్థాతు మర్హసి.

టీక॥ కాకుత్స్థస్య = రామునియొక్క; అనృశంస్యంచ = క్రూరుఁడుకాకుండుటను; మైథిల్యాః = సీతయొక్క; వివాసనంచ = విదేశమునందుండునట్లుసేయుటను; ప్లవగేంద్రస్య = వానరశ్రేష్ఠుండగుహనుమంతునియొక్క; శ్రమంచ = అలసటను; సమీక్ష్య = చూచి; ఉత్థాతుం = లేచుటకు; అర్హసి = తగుదువు.

రామునిమంచిస్వభావమును; సీతరావణునిచేఁజిక్కుటను, హనుమంతుండు సేయు శ్రమంబునుజూచి, యుక్తమనితలంతువేని, పైకిలెమ్ము. అనిసముద్రుండు మైనాక పర్వతమ్మునకుఁజెప్పెను. అని, తాత్పర్యము.

హిరణ్యనాభో మైనాకో నిశమ్య లవణాంభసః. ౧౧
ఉత్పపాత జలా త్తూర్ణం మహాద్రుమలతాయుతః

టీక॥ మహాద్రుమలతాయుతః = గొప్పవృక్షంబులతోనుతీఁగలతోనుం గూడినవాఁడును; హిరణ్యనాభః = బంగారువికారంబులయిన శిఖరంబులుగలవాఁడునగు; మైనాకః = మైనాకపర్వతము; లవణాంభసః = సముద్రునియొక్క; వచనం (అధ్యాహృతము) = మాటను; నిశమ్య = విని; జలాత్ = నీటినుండి; తూర్ణం = శీఘ్రముగా; ఉత్పపాత = ఎగిరెను,

గొప్పవృక్షములను దీఁగెలనుంగలిగి బంగారుశిఖరంబులతోఁగూడియున్నమైనాకపర్వతంబును, సముద్రునిమాటవిని, నీళ్లనుండి, శీఘ్రముగాఁ, పైకిలేచెను. అని, తాత్పర్యము

స సాగరజలం భిత్త్వా బభూవా భ్యుత్థిత స్తదా. ౧౨
యథా జలధరం భిత్త్వా దీప్తరశ్మి ర్దివాకరః

టీక॥ తదా = అప్పుడు; సః = ఆమైనాకము; సాగరజలం = సముద్రపునీటిని; భిత్త్వా = భేదించుకొని; జలధరం = మబ్బును; భిత్త్వా = భేదించుకొని ; దీప్తరశ్మిః = ప్రకాశించుకిరణంబులుగల; దివాకరోయథా = సూర్యుఁడువలె, అభ్యుత్థితః = లేచినవాఁడు; అగపడినవాఁడు; బభూవ = ఆయెను.

అప్పుడుసూర్యుండుమబ్బునుభేదించికొనిబయలువెడలునట్లు, ఆమైనాకముసముద్రజలమునుభేదించుకొనిపైకిలేచెను. అని తాత్పర్యము.

స ౧

స మహాత్మా ముహూర్తేన సర్వత స్సలిలావృతః. ౧౦౩
దర్శయామాస శృంగాణి సాగరేణ నియోజితః
శాతకుంభమయై శ్శృంగై స్సకిన్నరమహోరగైః. ౧౦౪
అదిత్యోదయసంకాశై రాలిఖద్భిరివాంబరమ్

టీక॥ మహాత్మా=గొప్పదేహముగలవాఁడును; సర్వతః=అంతటను; సలిలావృతః=నీటిచేఁగప్పఁబడిన వాఁడునగు; సః=ఆమైనాకము; సాగరేణ = సముద్రముచేత; నియోజితః=ఆజ్ఞాపింపఁబడినవాఁడై; శాతకుంభమయైః= బంగారువికారములును; సకిన్నర మహోరగైః=కిన్నరులతోనుగొప్ప సర్పములతోనుగూడినవియును; ఆదిత్యోదయ సంకాశైః=సూర్యోదయముతోసమానములును; అంబరం=ఆకాశమును; ఆలిఖద్భిరివ (స్థితైః)=ఒరయుచున్నవివలె నున్నవియునగు; శృంగైః= శిఖరములతో; సహితః=(ఆ ధ్యాహృతము) కూడినవాఁడై; శృంగాణి=శిఖరములను; దర్శయామాస=చూపెను.

నీటిలో [illegible] డేసి [illegible] త్ముండగునామైనాకుండు, [illegible] ద్రునియాజ్ఞనొంది, కిన్నరులతోనుగొప్ప సర్పంబులతోనుంగూడి సూర్యోదయంబులచాడ్పన వెలుంగుచు [illegible] కాశంబునొరయుచున్నవిపోలెన [illegible] తంబులై యుండు తనబంగారుశిఖరంబులం జూపెను.

అని, తాత్పర్యము.

తప్తజాంబూనదై శ్శృంగైః పర్వతస్య సముత్థితైః. ౧౦౫
ఆకాశం శస్త్రసంకాశ మభవ త్కాంచనప్రభమ్

టీక॥ పర్వతస్య= మైనాకపర్వతముయొక్క; సముత్థితైః=పైకిలేచిన; తప్తజాంబూనదైః = కరఁగింపఁబడినబంగారువికారములయిన; శృంగైః=శిఖరములచేత; శస్త్రసంకాశం=ఇనుముతో సమానమయిన; ఆకాశం= ఆకాశము; కాంచనప్రభం = బంగారు యొక్క కాంతివంటికాంతిగలది; అభవత్ = అయినది.

అట్లు, ఆమైనాకుని, కరఁగింపఁబడినస్వచ్ఛమయినబంగారు శిఖరములు పైకి లేవఁగానే, వానికాంతులచే, నినుమువలె నల్లగానుండునాకాశంబును, బంగారుకాంతివంటికాంతిగలదయ్యె.

అని, తాత్పర్యము.

జాతరూపమయై శ్శృంగై ర్భ్రాజమానై స్స్వయంప్రభైః. ౧౦౬
ఆదిత్యశతసంకాశ స్సోఽభవ ద్గిరిసత్తమః

టీక. జాతరూపమయైః=బంగారువికారంబు లయినవియు ; భ్రాజమానైః = ప్రకాశించుచున్నవియు; స్వయంప్రభైః= తమంతనెకాంతిగలిగినవియునగు;శృంగైః = శిఖరములచేత; సః=ఆ; గిరిసత్తమః=పర్వతశ్రేష్ఠుండగుమైనాకుండు; ఆదిత్యశతసంకాశః= సూర్యులయొక్క నూటితో సమానుండు;అభవత్=ఆయెను.

స్వర్ణమయంబులై యితరాపేక్ష లేకతమంతనె కాంతిగలిగి ప్రకాశించుచున్నట్టి శిఖరంబు లనేకంబులు గలిగి యుండుటంజేసి,పర్వతశ్రేష్ఠుండగు నామైనాకుండు, నూరుగురు సూర్యులుంబోలెంబ్రకాశించెను. అని, తాత్పర్యము.

త ముత్థిత మసంగేన హనుమా నగ్రత స్థ్సితమ్. ౧౦౭
మధ్యే లవణతోయస్య విఘ్నోఽయ మితి నిశ్చితః

టీక॥హనుమాన్ = హనుమంతుండు;అసంగేన=సంబంధములేమిచేత;ఉత్థితం=లేచినవాండును; అగ్రతః=ముందట;స్థితం=ఉన్నవాండునగు; తం=ఆమైనాకుని;“అయం=ఇది ; లవణతోయస్య=ఉప్పునీళ్లుగల సముద్రము యొక్క; మధ్యే=నడుమునందు;విఘ్నః=అడ్డి;” ఇతి=అని;నిశ్చితః = నిశ్చయించినాండు.

హనుమంతుండు,అట్లు లేచితనముందటంజూపట్టినయామైనాకునిం జూచి, “ఇట్టి పర్వతమిప్పుడడ్డ పడుట కెంత మాత్రమును గారణంబుగానరాదు, కావున,నిది,నాకుసముద్రమధ్యంబున , విఘ్నముసేయవచ్చినది.” అని,నిశ్చయించెను, అని, తాత్పర్యము.

స త ముచ్ఛ్రిత మత్యర్థం మహావేగో మహాకపిః. ౧౦౮
ఉరసా పాతయామాస జీమూతమివ మారుతః

టీక॥మహావేగః=అధికమయిన వేగముగల;సః=ఆ;మహాకపిః = హనుమంతుండు;అత్యర్థం = మిక్కిలియును;ఉచ్ఛ్రితం = ఉన్నతమయిన;తం=

ఆమైనాకమును; ఉరసా = ఱొమ్ముచేత; మారుతిః = వాయువు; జీమూతమివ = మేఘమునుబోలె ; పాతయామాస = పడద్రోసెను.

మహావేగుండగు నాహనుమంతుండు, మిక్కిలియు, నున్నతంబయిన యామైనాకపర్వతమును, తనఱొమ్ముచేత, వాయుదేవుండు మేఘమును బాఁఁదోలునట్లు, అనాయాసంబుగాఁబడఁ ద్రోసెను. అని, తాత్పర్యము.

స తథా పాతిత స్తేన కపినా పర్వతోత్తమః. ౧౦౯
బుద్ధ్వా తస్య కపే ర్వేగం జహర్షచ ననందచ

టీక॥ తథా = అట్లు; సః = ఆ; పర్వతోత్తమః = పర్వతశ్రేష్ఠుండగు మైనాకుండు; తేన = ఆ; కపినా = హనుమంతుని చేత; పాతితః = పడద్రోయఁబడినవాఁడై; తస్య = ఆ; కపేః = హనుమంతునియొక్క; వేగం = వేగమును; బుద్ధ్వా = తెలిసికొని; జహర్షచ = గగుపాటు గొనెను; ననందచ = సంతసించెను.

పర్వతశ్రేష్ఠుండగు నామైనాకుండు, అట్లు, తన్నుహనుమంతుండు పడఁద్రోయఁగా నతనివేగంబు తెలిసికొని, చాల సంతసించి, పులకాంకితుండయ్యెను. అని, తాత్పర్యము.

త మాకాశగతం వీర మాకాశే సముపస్థితః. ౧౧౦
ప్రీతో హృష్టమనా వాక్య మబ్రవీ త్పర్వతః కపిమ్
మానుషం ధారయన్ రూప మాత్మన శ్శిఖరే స్థితః. ౧౧౧

టీ॥ పర్వతః = మైనాకుఁడు; ప్రీతః = సుఖమునొందినవాఁడై; హృష్టమనాః = సంతసించినమనస్సుగలవాఁడై ; మానుషం = మనుష్యసంబంధియగు, రూపం = ఆకారమును; ధారయన్ = ధరించుచు ; ఆత్మనః = తనయొక్క ; శిఖరే = శిఖరమునందు, స్థితః = ఉన్నవాఁడై ; ఆకాశే = ఆకాశమునందు ; సముపస్థితః = డగ్గఱినవాఁడై; ఆకాశగతం = ఆకాశమునుబొందినవాఁడును; వీరం = పరాక్రమంబుగలవాఁడునగు; తం = ఆ; కపిం = హనుమంతునిగూర్చి; వాక్యం = మాటను; అబ్రవీత్ = పలికెను.

అంతమైనాకుండు, సుఖంబునొంది, సంతసించి, మనుష్యరూపము ధరించి, తనశిఖరంబుమైనుండి, యాకాశంబున




దున్నపరాక్రమ శాలియగు నాహనుమంతునిడగ్గఱి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

దుష్కరం కృతవాన్కర్మ త్వమిదం వానరోత్తమ
నిపత్య మమ శృంగేషు విశ్రమస్వ యథా సుఖమ్. ౧౧౨

టీక॥ వానరోత్తమ = కోఁతులలో శ్రేష్ఠుండవగుహనుమంతుఁడా! త్వం= నీవు; దుష్కరం = చేయఁగూడని; ఇదం= ఈ; కర్మ = కార్యమును; కృతవాన్= చేసినవాఁడవు. మమ= నాయొక్క; శృంగేషు = శిఖరములందు; నిపత్య= పడి; యథాసుఖం= సుఖమునతిక్రమింపక; విశ్రమస్వ= అలసటదీర్చుకొనుము.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! నీవెవ్వరికినిం జేయనలవిగానియీసముద్రలంఘనమును జేయుచున్న వాఁడవైనను, ఎంతమాత్రమలసట నొందక, నావంటిగొప్పపర్వతమును, ఱొమ్మునవలీలగాఁబడఁద్రోసినాఁడవు; నాశిఖరంబులందుండి. సుఖంబుగా, విశ్రమింపుము. అని, తాత్పర్యము.

రాఘవస్య కులే జాతై రుదధిః పరివర్ధితః
స త్వాం రామహితే యుక్తం ప్రత్యర్చయతి సాగరః. ౧౧౩

టీక॥ ఉదధిః= సముద్రము; రాఘవస్య= రామునియొక్క; కులే= వంశమునందు; జాతైః= పుట్టినవారలచేత; పరివర్ధితః = వృద్ధినొందఁజేయఁబడెను. సః= అట్టి; సాగరః= రామవంశస్థుఁడయినసగరునిచే వృద్ధిబొందిన , సముద్రుఁడు; రామహితే= రామునిమేలునందు; యుక్తం = ఆసక్తుఁడయిన ; త్వాం= నిన్ను; ప్రత్యర్చయతి= బదులుపూజించుచున్నాఁడు,

పూర్వము రామునివంశంబునఁ బుట్టిన సగరునిచేతను; అతనికొడుకులచేతను, సముద్రుండు, చాలనభివృద్ధినొందెను; నీవు, వారివంశంబునందుఁబుట్టినరామునకు మేలుసేయఁగడంగినావుకావున, సముద్రుఁడునీకుఁబూజచేసి, యందువలన, సగరవంశస్థులకుఁ బ్రతిపూజచేసినవాఁడుకాఁగోరుచున్నాఁడు.

ఆని, తాత్పర్యము.







కృతేచ ప్రతికర్తవ్య మేష ధర్మ స్సనాతనః
సోఽయం త్వత్ప్రతికారార్థీ త్వత్త స్సమ్మాన మర్హతి. ౧౧౪

టీక॥ కృతేచ = చేయఁబడఁగానే; ప్రతికర్తవ్యం = బదులు చేయఁబడవలసినది; ఏషః = ఇది; సనాతనః = శాశ్వతమగు; ధర్మః = ధర్మము. త్వత్ప్రతికారార్థీ = నీకు బదులుపకారమును గోరుచున్న; సః = ఆ; అయం = ఈ సముద్రుఁడు; త్వత్తః = నీవలన; సమ్మానం = గౌరవమును; అర్హతి = పొందఁదగును.

ఒకండు తనకుపకారము సేయఁగా, అతనికిఁ దాను బ్రత్యుపకారము సేయవలెను; ఇది శాశ్వతంబగు ధర్మము; కావున; సగరుని వలన వృద్ధిఁ బొందిన యీ సముద్రుఁడు, సగరవంశమునఁ బుట్టిన రాముని సహాయుఁడవైన నీకుఁ బూజ యొనర్చి, యందువలన, సగరునకుఁ బ్రత్యుపకారము సేసినవాఁడు కాఁదలంచుచున్నాఁడు; నీవు, దీని నంగీకరింపవలయును. అని, తాత్పర్యము.

త్వన్నిమిత్త మనే నాహం బహుమానా త్ప్రచోదితః
తిష్ఠ త్వం కపిశార్దూల మయి విశ్రమ్య గమ్యతామ్. ౧౧౫
యోజనానాం శతంచాపి కపి రేష సమాప్లుతః
తవ సానుషు విశ్రాంత శ్శేషం ప్రక్రమతా మితి. ౧౧౬

టీక। ఏషః = ఈ; కపిః = హనుమంతుఁడు; యోజనానాం = ఆమడలయొక్క; శతంచాపి = నూటిని గూర్చియు; సమాప్లుతః = ఎగిరినాఁడు; తవ = నీయొక్క; సానుషు = సమప్రదేశములందు, నెత్తములందు; విశ్రాంతః = ఊఱటనొందినవాఁడై; శేషం = మిగత దారిని; ప్రక్రమతాం = దాఁటుఁగాక;" ఇతి = అని; త్వన్నిమిత్తం = నీకొఱకు; అహం = నేను; అనేన = ఈ సముద్రునిచేత; బహుమానాత్ = గౌరవమువలన; ప్రచోదితః = ప్రేరేపింపఁబడినాఁడను. కావున; కపిశార్దూల = వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! త్వం = నీవు; తిష్ఠ = నిలువుము. మయి = నాయందు; విశ్రమ్య = అలసట దీర్చుకొని; గమ్యతాం = పోఁబడుఁగాక.

"ఈ హనుమంతుండు, నూఱామడలొకపెట్టున నెగుర నారంభించి యున్నాఁడు; ఇతండు, నీ నెత్తములందుఁ గొంతసేపు విశ్రమించి మిగత దారి దాఁటునట్లు సేయుము" అని, నీకుఁగా, నీ సము




దుగ్రించు, గౌరవంబుననను బ్రేరేపించెచు, కావున,నీవు,నిలిచి, నాయందుండి యలసటదీర్చుకొని,పొమ్ము.

అని, తాత్పర్యము.

తదిదం గంధవత్స్వాదు కందమూలఫలం బహు
తదా స్వాద్య హరిశ్రేష్ఠ విశ్రాంతో నుగమిష్యసి. ౧౧౭

టీక॥హరిశ్రేష్ఠ= వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా!తత్ =అందువలన; గంధవత్= మంచివాసనగలదియును; స్వాదు = మధురమయినదియును; బహు= అనేకములయిన;తత్=అట్టి; ఇదం= ఈ; కందమూలఫలం=కందగడ్డ మొదలయినగడ్డలనుపండ్లను ; ఆస్వాద్య=అనుభవించి;విశ్రాంతః =ఊఱడినొందినవాఁడవై;అను=ఆపిమ్మట; గమిష్యసి=పోఁగలవు.

కావున,మంచివాసనయును మాధుర్యమునుంగల యీకందమూలంబులను ఫలంబులను,ఆరగించి , యలసటదీర్చుకొని,యాపిమ్మటంబొమ్ము.

అని, తాత్పర్యము.

అస్మాక మపి సంబంధః కపిముఖ్య త్వయా స్తివై
ప్రఖ్యాత స్త్రిషు లోకేషు మహాగుణపరిగ్రహః. ౧౧౮

టీక॥కపిముఖ్య= వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా!త్వయా= నీతోడ; అస్మాకమపి=మాకును;సంబంధః=సంబంధము:అస్తి=కలదు("వై") అనునది పాదపూరణార్థము). మహాగుణపరిగ్రహః = గొప్పగుణములు గలవారియొక్క;స్వీకరించుటయనగా సేవించుట; త్రిషు = మూఁడైన; లోకేషు= లోకంబులందును;ప్రఖ్యాతః= వినుతికెక్కినది.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా!నీతోటిసంబంధము , నీకాతిథ్యమియ్యవలయుననునది,మాకునుం గలదు, నీవంటిసద్గుణములుగలవారిం బూజించుట, ముల్లోకంబులందును, ఆదరణీయంబైయున్నది.అని, తాత్పర్యము.

వేగవంతః ప్లవంతో యే ప్లవగా మారుతాత్మజ
తేషాం ముఖ్యతమం మన్యే త్వా మహం కపికుంజర. ౧౧౯

టీక॥మారుతాత్మజ = వాయుదేవుని పుత్రుండవగుహనుమంతుఁడా!యే = ఏ;ప్లవగాః=వానరులు; వేగవంతః= వేగముగలవారుగాను;ప్లవంతః = ఎగురువారుగాను ; సంతి (అధ్యాహృతము)=ఉన్నారో;కపికుంజర= వానరశ్రేష్ఠుండవగుహనుమంతుఁడా! అహం= నేను; త్వాం=నిన్ను ; తేషాం=వారిలోపల;ముఖ్యతమం= అందఱికన్నను శ్రేష్ఠునిఁగా;మన్యే = తలంచుచున్నాను

వానరశ్రేష్ఠుండవువాయుపుత్రుండవునగుహనుమంతుఁడా ! వానరులలో నెవ్వరు వేగముగలిగి యెగుర నేర్చియున్నారో,వారిలోనందఱికన్నను నీవు శ్రేష్ఠుండవని తలంచుచున్నాను.

అని, తాత్పర్యము.

అతిథిః కిల పూజార్హః ప్రాకృతోపి విజానతా
ధర్మం జిజ్ఞాసమానేన కింపున స్త్వాదృశో మహాన్. ౧౨౦

టీక॥ధర్మం=ధర్మమును ; జిజ్ఞాసమానేన= ఎఱుఁగఁగోరిన,(ధాతువులనేకార్థంబులు కావున) పొందఁగోరిన;విజానతా=పండితునిచేత;అతిథిః = అభ్యాగతుండగువాఁడు ; ప్రాకృతోపి=మూఢుఁడైనను;పూజార్హః కిల= పూజించుటకొఱకుఁ దగినవాఁడు గదా! త్వాదృశః=నీవంటివాఁడైన ; మహాన్ =పూజ్యుఁడు;(పూజార్హఇతి= పూజింపఁదగినవాఁడని)కింపునః (వక్తవ్యం)ఇంకను జెప్పవలయునా!

పండితుండగువాఁడు , ధర్మము గోరునేని,యతిథిమూఢుండైనను, అతనింబూజింపవలయును;ఇంక, నీవంటి మహాత్ముండయినచోఁ, బూజింపవలయునని,చెప్పనేల?అని, తాత్పర్యము.

ఇచ్చట,మఱియొకవిధంబుగాను, అర్థముదోఁచెడిని.

విజానతా=పండితునిచేతను ; అతిథిః=అతిథి;ప్రాకృతోపి= మూఢుఁడయినను;పూజార్హఃకిల = పూజించుటకొఱకుఁదగినవాఁడుకదా!ధర్మః = ధర్మమును;జిజ్ఞాసమానేన = తెలిసికొనఁగోరువానిచేత, పండితుఁడుకానివాఁడై, పండితుండు కాఁగోరువానిచేత ననుట;త్వాదృశః=నీవంటివాఁడైన; మహాన్=గొప్పవాఁడు; (పూజార్హఇతి) కింపునః (వక్తవ్యం) = పూజార్హుఁడని చెప్పవలయునా?

తానుబండితుండయినను, తనయొద్దకువచ్చునతిథిమూఢుండైనను, అతనివలనందనకేమాత్రంబును బ్రయోజనంబు

 

లేదైనను, అతనికిందాను బూజసేయవలయుననుటశాస్త్రసిద్ధంబుగదా! అట్లుండ,నపండితుండైధర్మంబు నెఱుంగుటకై పెద్దలసహవాసంబుగోరు నావంటివానికినీవంటిసమస్తధర్మంబుల నెఱింగినవాఁడు, దొరకొనె నేని , యతండట్టియతిథిని బూజింపవలయునని చెప్పనేల? అని, తాత్పర్యము.

త్వం హి దేవవరిష్ఠస్య మారుతస్య మహాత్మనః
పుత్ర స్తస్యైవ వేగేన సదృశః కపికుంజర. ౧౨౧

టీక॥కపికుంజర = వానరశ్రేష్ఠుండవగుహనుమంతుఁడా!త్వం=నీవు ; దేవవరిష్ఠస్య=దేవతలలోశ్రేష్ఠుండును; మహాత్మనః=పూజ్యమయిన స్వభావముగలవాఁడునగు;మారుతస్య = వాయుదేవునియొక్క; వేగేన=వేగముచేత; తస్యైవ=ఆవాయుదేవునకే, సదృశః=సమానుండవగు;పుత్రోహి = కుమారుండవుగదా!

వానరశ్రేష్ఠుండ వగు హనుమంతుఁడా! ఇదిగాక, నీవు! దేవతలలో మేటియును మహాత్ముండునగు వాయుదేవునకుఁబుత్తుండవు; వేగంబున; నతనికిసరి వచ్చువాఁడవు. అని, తాత్పర్యము.

పూజితే త్వయి ధర్మజ్ఞ పూజాం ప్రాప్నోతి మారుతః
తస్మా త్త్వం పూజనీయో మే శృణుచాప్య త్ర కారణమ్. ౧౨౨

టీక॥ధర్మజ్ఞ=ధర్మంబుల నెఱింగినహనుమంతుఁడా!త్వయి=నీవు; పూజితే=పూజింపఁబడఁగా;మారుతః = వాయువు;పూజాం = పూజను;ప్రాప్నోతి=పొందుచున్నాఁడు;తస్మాత్ = అందువలన;త్వం=నీవు ; మే=నాకు; పూజనీయః=పూజింపఁదగినవాఁడవు; అత్ర=ఈవిషయమందు ; కారణంచాపి=హేతువును; శృణు=వినుము.

ధర్మంబులనెఱింగిన వాఁడవైన హనుమంతుఁడా! నేనునిన్నుఁ బూజింతునేని,నీతండ్రియగు వాయుదేవునింబూజించినవాఁడనగుదును; నేను, వాయుదేవునకుఁబూజచేయవలసినవాఁడను, గావున,నిన్నవశ్యము బూజచేయవలసినవాఁడనగుచున్నాను, నేను? వాయువునుబూజింపవలసినందుకుఁగారణంబు సెప్పెదను,వినుము. అని, తాత్పర్యము.

పూర్వం కృతయుగే తాత పర్వతాః పక్షిణో భవన్

 

స ౧

తే హి జగ్ము ర్దిశ స్సర్వా గరుడానిలవేగినః. ౧౨౩

టీక॥ తాత=నాయనా! పూర్వం=మునుపు; కృతయుగే = కృతయుగమునందు; పర్వతాః=కొండలు; పక్షిణః=ఱెక్కలుగలవిగా; అభవన్=ఉండినవి. తే=అవి ("హి" అనునది పాదపూరణార్థకము); గరుడానిలవేగినః= గరుత్మంతునియొక్కయు వాయువు యొక్కయు వేగంబువంటి వేగముగలవై; దిశః=దిక్కులను; సర్వాః= అన్నిటినిగూర్చి; జగ్ముః=పోయినవి.

మునుపు, కృతయుగంబునందుఁ బర్వతంబులకు ఱెక్కలుండినవి; అప్పుడా పర్వతంబులు, గరుడుండును వాయువును బోలె, వేగంబుగలిగి, యెల్లదిక్కుల సంచరించుచుండినవి.

అని, తాత్పర్యము.

తత స్తేషు ప్రయాతేషు దేవసంఘా స్సహర్షిభిః

భూతానిచ భయం జగ్ము స్తేషాం పతనశంకయా. ౧౨౪

టీక॥ తతః=అంతట; తేషు=ఆపర్వతములు; ప్రయాతేషు=తిరుగఁగా; దేవసంఘాః= దేవతలసమూహంబులును; భూతానిచ=భూతంబులును; ఋషిభిస్సహ=ఋషులతోఁగూడ; తేషాం=ఆపర్వతముల యొక్క; పతనశంకయా=పడుటనుగుఱించిన సందేహముచేత; భయం=వెఱపును; జగ్ముః= పొందినవి.

అంతనాపర్వతంబు లట్లు సంచరించుచుండఁగా, నవిక్రిందఁబడునేమో యనితలంచి, దేవతలును భూతంబులును, ఋషులును, భయంబునొందిరి.

అని, తాత్పర్యము.

తతః క్రుద్ధ స్సహస్రాక్షః పర్వతానాం శతక్రతుః

పక్షాన్ చిచ్ఛేద వజ్రేణ తత్రతత్ర సహస్రశః. ౧౨౫

టీక॥ తతః=అంతట; శతక్రతుః= నూఱుయాగములుగల; సహస్రాక్షః= వేయికండ్లుగలయింద్రుండు; క్రుద్ధః= కోపమునొందినవాఁడై; తత్రతత్ర= అచ్చటచ్చట; సహస్రశః = వేనవేలుగా; పర్వతానాం=కొండలయొక్క; పక్షాన్=ఱెక్కలను; వజ్రేణ = వజ్రాయుధముచేత; చిచ్ఛేద=నఱికెను.

అంతనన్నుపర్వతంబులువిడువక తిరుగుచుండుటను దేవతలు మున్నగువారలుభయంబునొందుటనుజూచి, దేవేంద్రుండు, కోపించి, యిచ్చటచ్చట, వేననేలుగాఁబర్వతంబుల ఱెక్కలను వజ్రాయుధంబునఖండించెను.

అని, తాత్పర్యము.

స మాముపాగతః క్రుద్ధో వజ్రముద్యమ్య దేవరాట్
తతో హం సహసా క్షిప్త శ్శ్వసనేన మహాత్మనా. ౧౨౮

టీక॥ సః=ఆ; దేవరాట్ = దేవేంద్రుండు; క్రుద్ధః=కోపంబునొందినవాఁడై; వజ్రం=వజ్రాయుధమును ; ఉద్యమ్య= ఎత్తుకొని; మాం=నన్ను ; ఉపాగతః=డగ్గఱినాఁడు తతః=అంతట; అహం=నేను; మహాత్మనా = పూజ్యమయినస్వభావముగల; శ్వసనేన= వాయువుచేత; సహసా=శీఘ్రముగా; క్షిప్తః=త్రోయఁబడినాఁడను.

ఆ దేవేంద్రుండు, కోపంబున, వజ్రాయుధంబు నెత్తికొని , నాయొద్దకువచ్చెను, అప్పుడు, మహాత్ముండగువాయుదేవుండు, శీఘ్రంబున నన్నుదూరముగానెట్టుకొనిపోయెను. అని, తాత్పర్యము

అస్మిన్ లవణతోయే చ ప్రక్షిప్తః ప్లవగోత్తమ
గుప్తపక్షసమగ్రశ్చ తవ పిత్రాభిరక్షితః. ౧౨౯

టీక॥ ప్లవగోత్తమ= వానరశ్రేష్ఠుండవగుహనుమంతుఁడా! తవ = నీయొక్క; పిత్రా= తండ్రియయినవాయుదేవునిచేత; అహం (అధ్యాహృతము) = నేను; అస్మిన్= ఈ; లవణతోయే చ= ఉప్పునీళ్లుగలసముద్రమునందును ; ప్రక్షిప్తః=త్రోయఁబడినవాఁడనై; గుప్తపక్షసమగ్రశ్చ=రక్షింపఁబడినసమస్తములయినఱెక్కలుగలవాఁడనునై; అభిరక్షితః= కాపాడఁబడినాఁడను.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! నీతండ్రియగువాయుదేవుండు , నన్నుసముద్రమునందుఁ బడఁద్రోసి , నాఱెక్కలుపోకుండునట్లు, గాపాడెను.

అని, తాత్పర్యము.

తతో హం మానయామి త్వాం మాన్యోహి మమ మారుతః

త్వయా మే హ్యేష సంబంధః కపిముఖ్య మహాగుణః. ౧౨౮

టీక॥ తతః=అందువలన; అహం=నేను; త్వాం=నిన్ను; మానయామి=పూజించెదను. మారుతః=వాయుదేవుండు; మమ=నాకు; మాన్యోహి=పూజింపఁదగినవాఁడుగదా! కపిముఖ్య=వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! త్వయా=నీతో; మమ=నాకు; ఏషః=ఈ; మహాగుణః=గొప్పగుణముగల; సంబంధః=సంబంధము; అస్తి (అధ్యాహృతము)హి=ఉన్నదిగదా!

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! అందువలన, నాకువాయుదేవుండు పూజనీయుండగుటంజేసి, యతనింబూజించినవాఁడనగుటకై, యతనిపుత్రుండవైన నిన్నుఁబూజించెదను; "నీతండ్రి నన్నురక్షించెను; నన్నురక్షించినవాని పుత్రుండవు నీవు" నీకును నాకు నీసంబంధమున్నదిగదా! అని, తాత్పర్యము.

అస్మిన్నేవం గతే కార్యే సాగరస్య మమైవచ
ప్రీతిం ప్రీతమనాః కర్తుం త్వ మర్హసి మహాకపే. ౧౨౯

టీక॥ మహాకపే=హనుమంతుఁడా! ఏవం=ఇట్లు; గతే=కాఁగా; త్వం=నీవు; ప్రీతమనాః=సంతసించిన మనస్సుగలవాఁడవై; సాగరస్య=సముద్రునియొక్క; మమైవచ=నాయొక్కయు; అస్మిన్=ఈ; కార్యే=పనియందు; ప్రీతిం=ఇష్టమును; కర్తుం=చేయుటకు; అర్హసి=తగుదువు.

హనుమంతుఁడా! ఇట్లునడిచియుండుటంజేసి, నీవు, సంతోషంబున, నేనును సముద్రుండును జేయు నాతిథ్యమునంగీకరింపవలయును. అని, తాత్పర్యము.

శ్రమం మోక్షయ పూజాంచ గృహాణ కపిసత్తమ
ప్రీతించ బహుమన్యస్వ ప్రీతోస్మి తవదర్శనాత్, ౧౩౦

టీక॥ కపిసత్తమ= వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! శ్రమం=అలసటను; మోక్షయ=విడువుము. పూజాంచ=పూజను; గృహాణ=స్వీకరింపుము. ప్రీతించ = మేముచూపు, ప్రేమను; బహుమన్యస్వ = అధికముగాఁదలంపుము, తవ=నీయొక్క; దర్శనాత్=చూచుటవలన; ప్రీతః= సంతసించినవాఁడ

ను;అస్మి=అగుచున్నాను.

వానరశ్రేష్ఠుండవగుహనుమంతుండా! నీవిచ్చోటనలసటదీర్చుకొని, మేముచేయుపూజను గ్రహించి, మాకునీయందుఁ గలిగియుండు ప్రేమంబునుబహుమానింపుము;నిన్నుఁజూచుటంజేసి, నాకుఁజాలసంతోషంబుకల్గినది. అని, మైనాకుండు, హనుమంతునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్తః కపిశ్రేష్ఠ స్తం నగోత్తమ మబ్రవీత్

టీక॥ కపిశ్రేష్ఠః=వానరులలోమేటియగుహనుమంతుండు;ఏవం=ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడై;నగోత్తమం=పర్వతశ్రేష్ఠుండగు;తం — ఆమైనాకునిగూర్చి;అబ్రవీత్=పలికెను.

వానరశ్రేష్ఠుండగు హనుమంతుండిట్లుమైనాకుండుచెప్పినమాటవిని, పర్వతశ్రేష్ఠుండగున మ్మైనాకుంజూచి యిట్లని, చెప్పెను.అని, తాత్పర్యము.

ప్రీతోస్మి కృత మాతిథ్యం మన్యు రేషో పనీయతామ్. ౧౩౧

టీక॥అహం (అధ్యాహృతము) = నేను;ప్రీతః= సంతసించినవాఁడను;అస్మి=అగుచున్నాను.ఆతిథ్యం = అతిథిపూజ;కృతం=చేయఁబడినవి. ఏషః = ఈ;మన్యుః= కోపము;అపనీయతాం= తొలఁగఁజేయఁబడుఁగాక.

నేనుసంతసించినాఁడను; ఇట్టిమాటలచేతనే, యాతిథ్యంబుచేసినట్లెయగుచున్నది; నేనుమీరుసేయుపూజంబ్రతిగ్రహింపలేదని కోపంబునొంద వలదు. అని, తాత్పర్యము.

త్వరతే కార్యకాలో మే అహశ్చాప్య తివర్తతే
ప్రతిజ్ఞాచ మయా దత్తా నస్థాతవ్య మిహాంతరే. ౧౩౨

టీక॥మే=నాయొక్క; కార్యకాలః= పనివేళ; త్వరతే— వేగిరపడుచున్నది. అహశ్చాపి=పగలును; అతివర్తతే— అతిక్రమించుచున్నది. ప్రతిజ్ఞాచ=ప్రతినయును;మయా=నాచేత; దత్తా=ఇయ్యఁబడినది;ఇహ=ఇచ్చట;అంతరే— మధ్యమందు;నస్థాతవ్యం=నిలుచుటకారాదు.

నాకిదిచాలపనివేళగనున్నది, యెంత మాత్రమును, ఇప్పుడు, జాగుసేయుటొప్పదు; లంకకుఁబ్రొద్దుండఁగానే చేరవలయును, ఇప్పుడు, పొద్దుమీఱిపోవుచున్నది; ఇదిగాక; "రామునిబాణంబుపోవునట్లుగా, నెచ్చటనునిలువక, యప్రతిహతంబుగాఁబోయెద" ననివానరులముందటం, బ్రతిజ్ఞ చేసినాను, కావున, సముద్రమధ్యమునసేనునిలువరాదు. అనిహనుమంతుండుఁ మైనాకమునకుఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా పాణినాశైల మాలభ్య హరిపుంగవః
జగామాకాశ మావిశ్య వీర్యవాన్ ప్రహసన్నివ. ౧౩౩

టీక॥ వీర్యవాన్ = పరాక్రమంబుగలః; హరిపుంగవః — వానరశ్రేష్ఠుండగు హనుమంతుండు; ఇతి=ఇట్లు, ఉక్త్వా = చెప్పి; పాణినా = హస్తముచేత; శైలం=పర్వతమును; ఆలభ్య=తాఁకి; ఆకాశం=ఆకాశమును; ఆవిశ్య=పొంది; ప్రహసన్ =నవ్వుచు, (లక్షణచే)సంతసించుచు; ("ఇవ" అనునదివాక్యాలంకారార్థము); జగామ=పోయెను.

పరాక్రమశాలియగు హనుమంతుండు, ఈప్రకారముమైనాకునితోఁ జెప్పి, యతనిహస్తంబునస్పృశించి, మఱలనాకాశంబునొంది, నిర్విఘ్నంబుగఁదనప్రతిజ్ఞ చొప్పునఁ బ్రయాణంబుజరగుటంజేసి, ప్రసన్నముఖుండై, పోయెను. అని, తాత్పర్యము.

స పర్వతసముద్రాభ్యాం బహుమానా దవేక్షితః
పూజిత శ్చోపపన్నాభి రాశీర్భి రనిలాత్మజః. ౧౩౪

టీక॥ సః=ఆ; అనిలాత్మజః=వాయుపుత్రుడుకయినహనుమంతుఁడు; పర్వతసముద్రాభ్యాం= మైనాకపర్వతముచేతను సముద్రునిచేతను ; బహుమానాత్=గౌరవమువలన ; అవేక్షితః= చూడఁబడినవాఁడై; ఉపపన్నాభిః= కార్యసిద్ధికియుక్తములయిన; ఆశీర్భిః = దీవనలచేత ; పూజితశ్చ=పూజింపఁబడినవాఁడును; అభూత్=(అధ్యాహృతము)—అయ్యెను.

మైనాకుండునుసముద్రుండును, వాయుపుత్రుఁడైనహనుమంతుని, గౌరవంబుతోఁజూచి, "నీకుఁగార్యసిద్ధియగుఁగాక" యనియాశీర్వదించి, పూజించిరి. అని, తాత్పర్యము.




అథోర్ధ్వం దూర ముత్ప్లుత్య హిత్వా శైల మహార్ణవౌ
పితుః పంథాన మాస్థాయ జగామ విమలేంబరే. ౧౩౫

టీక॥ అథ=అటుపిమ్మట; సః(అధ్యాహృతము)=ఆహనుమంతుఁడు; శైలమహార్ణవౌ=మైనాకునిసముద్రుని, హిత్వా=విడిచి; ఊర్ధ్వం=పైగా; దూరం=దూరము; ఉత్ప్లుత్య=ఎగిరి; పితుః= తండ్రియయిన వాయువుయొక్క; పంథానం= మార్గమగు నాకాశమును; ఆస్థాయ=పొంది; విమలే= స్వచ్ఛమయిన; అంబరే=ఆకాశమునందు; జగామ=పోయెను.

అంత, నాహనుమంతుఁడు, మైనాకునిసముద్రునివిడిచి, యూర్ధ్వముగా దూరముపోయి, వాయుమార్గంబునొంది, యయ్యాకాశమార్గంబునం బోయెను.

అని, తాత్పర్యము.

భూయశ్చోర్ధ్వం గతిం ప్రాప్య గిరిం త మవలోకయన్
వాయుసూను ర్నిరాలంబే జగామ విమలేంబరే. ౧౩౬

టీక॥ వాయుసూనుః= వాయుపుత్రుఁడైనహనుమంతుఁడు; భూయశ్చ=ఇంకను; ఊర్ధ్వగతిం = పైగాఁబోవుటను; ప్రాప్య=పొంది; తం=ఆ; గిరిం=మైనాకపర్వతమును; అవలోకయన్=చూచుచు; నిరాలంబే=పట్టులేనట్టి; విమలే=స్వచ్ఛమయిన; అంబరే= ఆకాశమునందు, జగామ=పోయెను.

వాయుదేవపుత్రుఁడగు హనుమంతుఁడు, అట్లింకను పైకెగిరి, ఆమైనాకపర్వతంబుచూచుచు, నెంతమాత్రము నాధారములేని యాకాశమార్గంబు నంబోవుచుండెను.

అని, తాత్పర్యము.

తద్ద్వితీయం హనుమతో దృష్ట్వా కర్మ సుదుష్కరమ్
ప్రశశంసు స్సురా స్సర్వే సిద్ధాశ్చ పరమర్షయః. ౧౩౭

టీక॥ సురాః= దేవతలును; సిద్ధాశ్చ=సిద్ధులును; పరమర్షయశ్చ = శ్రేష్ఠులయినఋషులును; హనుమతః= హనుమంతుని యొక్క; సుదుష్కరం=మిక్కిలియుఁజేయఁగూడనిదియు; ద్వితీయం = రెండవదియునగు; తత్=




ఆ; కర్మణా=మైనాకమునందువిశ్రమింపనొప్పుకొనకుండుటయనెడు కార్యమును,(మొదటిదిసముద్రముదాఁటం జూచుట);దృష్ట్వా=చూచి; ప్రశశంసుః=పొగడిరి.

ఇట్లుహనుమంతుండు, మైనాకపర్వతమునందువిశ్రమింప నొప్పుకొనకుండుటంజూచి, యదిదెవ్వరికిసేయ నలవిగానిదగుటంజేసి, దేవతలును సిద్ధులునుమహర్షులునుహనుమంతుం బొగడిరి. అని, తాత్పర్యము.

దేవతాశ్చాభవన్ హృష్టాస్తత్రస్థాస్తస్య కర్మణా
కాంచనస్య సునాభస్య సహస్రాక్షశ్చ వాసవః. ౧౩౭

టీక॥తత్రస్థాః=అచ్చటనున్నట్టి; దేవతాశ్చ=దేవతలును ; కాంచనస్య=బంగారువికారమయిన; సునాభస్య=మంచిశిఖరములుగల; తస్య=ఆమైనాకముయొక్క; కర్మణా=కార్యముచేత;హృష్టాః=సంతసించినవారలు; అభవన్=అయిరి. సహస్రాక్షః= వేయికండ్లుగల;వాసవశ్చ = ఇంద్రుఁడును; హృష్టఃఅభవత్ (అధ్యాహృతము)=సంతసించినవాఁడయ్యెను.

అచ్చోనుండిన దేవతలు, స్వర్ణమయుండునుమంచిశిఖరములు గలవాఁడు నగువాఁడైన మైనాకుండుహనుమంతునకు సాహయ్యముసేయ యత్నించుటంజూచి, చాలసంతసించిరి; దేవేంద్రుండును, మైనాకుండుచేసినకార్యమునకుంజాల సంతసించెను. అని, తాత్పర్యము.

ఉవాచ వచనం ధీమాన్ పరితోషాత్సగద్గదమ్
సునాభం పర్వతశ్రేష్ఠం స్వయమేవ శచీపతిః. ౧౩౮

టీక॥ ధీమాన్=ప్రశస్తంబగుబుద్ధిగల; శచీపతిః=శచీదేవికిఁబెనిమిటియయినదేవేంద్రుండు; స్వయమేవ=తానె;పర్వతశ్రేష్ఠం= పర్వతములలోమేటియయిన; సునాభం=మంచిశిఖరములుగల మైనాకముంగూర్చి ; పరితోషాత్=సంతోషమువలన; సగద్గదం=డగ్గుత్తికతోఁగూడిన;వచనం= మాటను;ఉవాచ=చెప్పెను.

దేవేంద్రుండు, బుద్ధిమంతుండుగావున, "రామకార్యార్థముగాఁబ్రయాసపడునీహనుమంతునకు సాహాయ్యము




సేయంబూనిన, యీమైనాకమును మన్నింపు నేని,యితరులును,అట్లు, సాహాయ్యముసేయంబూనుదురు" అని, యాలోచించి,తానే, పర్వతశ్రేష్ఠుండగునామైనాకునింజూచి,సంతోషంబునంజేసి, డగ్గుత్తికతోఁగూడినపలుంగున, నిట్లని,చెప్పెను. అని,తాత్పర్యము.

హిరణ్యనాభ శైలేంద్ర పరితుష్టోస్మి తే భృశమ్
అభయం తే ప్రయచ్ఛామి తిష్ఠ సౌమ్య యథాసుఖమ్. ౧౩౦

టీక॥ శైలేంద్ర=పర్వతశ్రేష్ఠుండవగు;హిరణ్యనాభ=బంగారు శిఖరంబులుగలమైనాకమా! తే=నీకు; భృశం=మిక్కిలియును; పరితుష్టః= సంతసించినవాఁడను;అస్మి = అగుచున్నాను; తే=నీకు; అభయం=వెఱపులేకుంటను; ప్రయచ్ఛామి=ఇచ్చెదను; సౌమ్య=తిన్ననివాఁడవైనమైనాకుఁడా! యథాసుఖం=సుఖమునతిక్రమింపక;తిష్ఠ=ఉండుము.

పర్వతశ్రేష్ఠుండవు,సౌమ్యుండవునగుమైనాకుండా!నీవుచేసిన కార్యమునకు, నేనుజాలసంతసించితిని ; నీకభయంబొసంగెదను; నీవింక నావలని భయంబువిడిచి, సుఖంబుగా నుండుము. అని, తాత్పర్యము.

సాహ్యం కృతం తే సుమహ ద్విక్రాంతస్య హనూమతః
క్రమతో యోజనశతం నిర్భయస్య భయే సతి. ౧౩౧

టీక॥అస్మాకం(అధ్యాహృతము) = మాకు;భయేసతి=వెఱపుగలుగఁగా ; యోజనశతం = ఆమడలయొక్కనూటిని;క్రమతః= దాఁటుచున్నవాఁడును; విక్రాంతస్య= పరాక్రమించి యున్నవాఁడును;నిర్భయస్య=వెఱపులేని వాఁడునగు;హనూమతః = హనుమంతునకు; తే=నీయొక్క;సుమహత్ = మిక్కిలియధికమయిన;సాహ్యం=తోడ్పాటు; కృతం=చేయఁబడినది.

"హనుమంతుండుపరాక్రమించి నిర్భయుండై నూఱుయోజనంబుల సముద్రమును దాఁటుచున్నాఁడు, అతివిశాలంబగుసముద్రంబున, నితనికేమికష్టము సంభవించినో" యని, మేముభయంపడుచుండగా,నట్టిహనుమంతునకు, నీవు




స ౧

గొప్పసాహాయ్యముచేసినాఁడవు.

అని,గోవిందరాజులువ్యాఖ్యానము చేసిరి.

భయే సతి=భయముండఁగా ; భయంబుగల్గుటకుఁ గారణముండఁగానను ట;నిర్భయస్య=వెఱపులేనివాఁడును ; విక్రాంతస్య = పరాక్రమించియున్న వాఁడును; యోజనశతం = ఆమడల యొక్క నూటిని;క్రమతః= దాఁటుచు న్నవాఁడనగు;హనూమతః = హను మంతునకు; తే=నీయొక్క ; సుమహత్ = మిక్కిలియధికమయిన ; సాహ్యం= తోడ్పాటు;కృతం=చేయఁబడినది.

అతివిశాలంబగు సముద్రంబునంబోవునపుడు, భయంబుగల్గుటకుఁ బెక్కు కారణంబులున్నను,నిర్భయుండై ; పరాక్రమించి,నూఱుయోజనంబుల సముద్రంబును దాఁటుచున్న హనుమంతునకు, నీవు , గొప్పసాహాయ్యముచేసినాఁడవు.

అని,రామానుజీయ వ్యాఖ్యానంబునందున్నది.

తే(అధ్యాహృతము)=నీకు; భయే సతి=వెఱపుండఁగా;నిర్భయస్య = వెఱపులేనివాఁడును;విక్రాంతస్య= పరాక్రమించియున్నవాఁడును ; యోజనశతం=ఆమడలయొక్క నూటిని ; క్రమతః= దాఁటుచున్నవాఁడనగు;హనూమతః=హనుమంతునకు; తే = నీయొక్క;సుమహత్ = మిక్కిలియధికమయిన;సాహ్యం=తోడ్పాటు; కృతం= చేయఁబడినది.

బైటకివచ్చినట్టియునసేన పెక్కులు నఱుకుదునని నీకు భయంబున్నను , నిర్భయుండై పరాక్రమంబుగలిగి , నూఱు యోజనంబులసముద్రంబును దాఁటుచున్నహనుమంతునకు , అతండు సన్నాపేక్షింపకున్నను, రామహితంబుదలంచి , నీశక్తికన్నహెచ్చుగా సాహాయ్యంబుఁ జేసినాఁడవు. అని, తాత్పర్యము.

అని, మహేశ్వరతీర్థులు, వచించిరి.

రామస్యైవ హి దూత్యేన యాతి దాశరథే హరిః
సత్క్రియాం కుర్వతా తస్య తోషితో స్మి దృఢం త్వయా. ౧౩౨

టీక॥ హరిః=హనుమంతుండు; దాశరథేః=దశరథునికొడుకైన;రామస్యైవ=

రామునియొక్క—యే; దౌత్యేన= రాయబారముచేత; యాతిహి=పోవుచున్నాఁడు. గదా! తస్య = అట్టిహనుమంతునకు; సత్క్రియాం=పూజను; కుర్వతా=చేయుచున్న; త్వయా — నీచేత; దృఢం=మిక్కిలియును; తోషితః = సంతసింపఁజేయఁబడినవాఁడను ; అస్మి= అగుచున్నాను.

హనుమంతుండు , దశరథునికొడుకైనరామునికై యేకదా ! రాయబారమునువహించిపోవుచున్నాఁడు ; కావున,నట్టిహనుమంతునకు నీవుతోడ్పడుటం జేసి , నాకుఁజాలసంతోషంబు చేసినవాఁడవైతివి. అని, యింద్రుండుమైనాకునితోఁజెప్పెను.అని, తాత్పర్యము.

తతః ప్రహర్షమగమ ద్విపులం పర్వతోత్తమః
దేవతానాం పతిం దృష్ట్వా పరితుష్టం శతక్రతుమ్. ౧౪౩

టీక॥ తతః — అంతట; పర్వతోత్తమః—పర్వతశ్రేష్ఠుండగుమైనాకుండు ; పరితుష్టం = సంతసించిన ; దేవతానాం=దేవతలకు; పతిం — ప్రభువయిన; శతక్రతుం=ఇంద్రుని; దృష్ట్వా— చూచి; విపులం=అధికమయిన; ప్రహర్షం= సంతోషమును; అగమత్=పొందెను.

అంతఁ, బర్వతశ్రేష్ఠుండగుమైనాకుండు, తనముందట సంతోషంబుతోనున్న దేవేంద్రుంజూచి , యధికముగాసంతసించెను.

అని, తాత్పర్యము.

స వై దత్తవర శ్శైలో బభూవా వస్థిత స్తదా
హనుమాంశ్చ ముహూర్తేన వ్యతిచక్రామ సాగరమ్. ౧౪౪

టీక॥ తదా—అప్పుడు; దత్తవరః=ఇయ్యఁబడినవరముగల; సః=ఆ("వై" అనునది పాదపూరణార్థము); శైలః = మైనాకుఁడు; అవస్థితః=స్వస్థుఁడు; అభవత్ —అయ్యెను. హనుమాంశ్చ—హనుమంతుండును; ముహూర్తేన= కొంచెముకాలముచేత; సాగరం = మైనాకపర్వతముండు, సముద్రమును, సముద్రప్రదేశమునుట; వ్యతిచక్రామ = దాఁటెను.

అప్పుడు, ఆమైనాకుండు వరంబునొంది, స్వస్థంబుగానుండెను; హనుమంతుండునుస్వల్పకాలంబుననె, మైనాకంబుండుసముద్రప్రదేశమును దాఁటెను.

అని, తాత్పర్యము.

తతో దేవా స్సగంధర్వా స్సిద్ధా శ్చ పరమర్షయః
అబ్రువ న్సూర్యసంకాశాం సురసాం నాగమాతరమ్. ౧౪౫

టీక॥ తతః=అంతట; సగంధర్వాః=గంధర్వులతోఁగూడిన; దేవాః=దేవతలును; సిద్ధాః= సిద్ధులును; పరమర్షయశ్చ= శ్రేష్ఠులయినఋషులును; సూర్యసంకాశాం=సూర్యునితో సమానురాలును; నాగమాతరం= సర్పంబులకుఁదల్లి యునగు; సురసాం= సురసనుగూర్చి; అబ్రువన్=పల్కిరి.

అంత, దేవతలునుగంధర్వులును సిద్ధులునుమహర్షులును, సూర్యునిఁబోలె వెలుంగుచున్నసర్పంబుల తల్లియయినసురసంజూచి, యిట్లని, చెప్పిరి.

అని, తాత్పర్యము.

అయం వాతాత్మజ శ్శ్రీమా న్ప్లవతే సాగరోపరి
హనుమాన్నామ తస్య త్వ ముహూర్తం విఘ్నమాచర. ౧౪౬
రాక్షసం రూప మాస్థాయ సుఘోరం పర్వతోపమమ్
దంష్ట్రాకరాళం పింగాక్షం వక్త్రం కృత్వా నభస్సమమ్. ౧౪౭

టీక॥ శ్రీమాన్ = అందఱికన్నవధికుండును; హనుమాన్నామ= హనుమంతుఁడనిప్రసిద్ధుండునగు ; అయం=ఈ వాతాత్మజః=వాయువుకొడుకు; సాగరోపరి=సముద్రముపైని; ప్లవతే= ఎగురుచున్నాఁడు. త్వం=నీవు; సుఘోరం=మిక్కిలియుభయంకరమును; పర్వతోపమం=కొండతోఁ బోలికగలదియునగు; రాక్షసం=రక్షస్సంబంధి యయిన; రూపం=ఆకారమును; ఆస్థాయ=పొంది; దంష్ట్రాకరాళం=కోఱలచేభయంకరంబయినదియును; పింగాక్షం=గోరోచనంపువన్నెగలకన్నులుగలదియును; నభస్సమం=ఆకాశముతో సరియయినదియునగు; వక్త్రం = నోరును ; కృత్వా=చేసికొని; తస్య = ఆహనుమంతునకు; ముహూర్తకాలం= స్వల్పకాలము; విఘ్నం=అడ్డిని; ఆచర= చేయుము.

శ్రీమంతుండగునీవాయుపుత్రుండు హనుమంతుండనువాఁడు, సముద్రంబుపైనెగిరిపోవుచున్నాఁడు; నీవు, మిక్కిలి

యు భయంకరంబయిన కొండంతటి రాక్షసరూపంబు వాల్చి, పెద్దకోఱలునుగోరోచనంపుఁ గన్నెఁ గలకండ్లును గలిగియాకాశంబునకుసరవచ్చుచు భయంకరంబై యుండు నోటితోఁ బోయి, యాహనుమంతునకుం గొంత కాలంబు, విఘ్నము సేయుము.

అని, తాత్పర్యము.

బలం మిచ్ఛామహే జ్ఞాతుం భూయశ్చాస్య పరాక్రమమ్
త్వాం విజేష్యత్యుపాయేన విషాదం వా గమిష్యతి. ౧౪౮

టీక॥ భూయశ్చ=ఇంకను; అస్య=ఈహనుమంతుని యొక్క; బలం= బలిమిని; పరాక్రమం=శత్రువులనోర్చుశక్తిని; జ్ఞాతుం= తెలిసికొనుటకు; ఇచ్ఛామహే=కోరుచున్నాము. త్వాం=నిన్ను; ఉపాయేన=ఉపాయము చేత; విజేష్యతి=జయించునా? వా= లేక ; విషాదం=దుఃఖమును; గమిష్యతి = పొందునా? ఏతత్, జ్ఞాతుం, ఇచ్ఛామః(అధ్యాహృతము= దీని ; తెలిసికొనుటకుఁ, గోరుచున్నాము.

ఇంకను, ఈహనుమంతుని బలంబును బరాక్రమంబును దెలియఁ గోరెదము; నిన్నుపాయంబున జయించిపోవునో, లేక, నిన్నుఁజూచి భయంపడి దుఃఖంబు నొందునో, ఇది మాకుఁ దెలియవలెను. అని, దేవతలు మున్నుగువారలు సురసకుఁ జెప్పిరి. అని, తాత్పర్యము.

ఏవ ముక్తాతు సా దేవీ దైవతై రభిసత్కృతా
సముద్రమధ్యే సురసా బిభ్రతీ రాక్షసం వపుః. ౧౪౯
వికృతంచ విరూపంచ సర్వస్యచ భయావహమ్
ప్లవమానం హనూమంత మావృత్యేద మువాచహ. ౧౫౦

టీక॥ దేవీ=అమ్మవారయిన; సా = ఆ; సురసాతు= సురసయును ; దైవతైః= దేవతలచేత; ఏవం= ఇట్లు ; ఉక్తా= చెప్పఁబడినదై; అభిసత్కృతా = పూజింపఁబడినదై ; సముద్రమధ్యే= సముద్రపునడుమునందు; వికృతంచ = వికారముగలిగినదియును; విరూపంచ= వికృతమగురూపముగలదియును; సర్వస్యచ=అందఱకును; భయావహం= వెఱపుగలిగించునదియును; రాక్షసం= రక్షస్సంబంధియైనదగు; వపుః = దేహమును; బిభ్రతీ=ధరించుచు; ప్లవమానం=

దాఁటుచున్న; హనూమంతం= హనుమంతుని; ఆవృత్య=అడ్డగించి; ఇదం= ఈమాటను; ఉవాచ=చెప్పెను; "హ" అనునది పాదపూరణార్థము.

ఆసురసా దేవి, యిట్లు దేవతలు చెప్పినమాటవిని, వారలు సేయు ప్రాజంబ్రతిగ్రహించి, సముద్రమధ్యమునందు, వికృతంబును విరూపంబును, ఎట్టివానికిని వెరపుఁ బుట్టించునదియునగు రాక్షస దేహంబుధరించి, దాఁటుచున్న హనుమంతునడ్డగించి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

మమ భక్షః ప్రదిష్ట స్త్వ మీశ్వరై ర్వానర ర్షభ
అహం త్వాం భక్షయిష్యామి ప్రవిశేదం మమాననమ్. ౧౫౧

టీక॥ వానరర్షభ= వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! త్వం=నీవు; మమ=నాకు; భక్షః=ఆహారముగా! ఈశ్వరైః= ప్రభువులయిన దేవతలచేత; ప్రదిష్టః=నిర్దేశింపఁ బడినవాఁడవు. అహం=నేను; త్వాం=నిన్ను; భక్షయిష్యామి=తినెదను. మమ= నాయొక్క; ఇదం=ఈ; ఆననం= నోటిని; ప్రవిశ= ప్రవేశింపుము.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! నాకాహారంబుగా నిన్ను దేవతలొసంగిరి; నేనునిన్ను భక్షించెదను; ఇదిగో! నానోరు ప్రవేశింపుము. అని, సురస హనుమంతునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త స్సురసయా ప్రాంజలి ర్వానరర్షభః
ప్రహృష్ట వదన శ్శ్రీమా నిదం వచన మబ్రవీత్. ౧౫౨

టీక॥ శ్రీమాన్= అందటికన్ననధికుండగు ; వానరర్షభః=వానరశ్రేష్ఠుండయిన హనుమంతుండు ; సురసయా=సురసచేత; ఏవం= ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; ప్రాంజలిః= మంచిచేమోడ్పుగలవాఁడై; ప్రహృష్టవదనః= సంతసించిన ముఖముగలవాఁడై; ఇదం=ఈ; వచనం=మాటను; అబ్రవీత్=పలికెను.

శ్రీమంతుండగుహనుమంతుండు, సురసచెప్పినమాటవిని, చేతులు మొగిడ్చి సంతోషంబున వెలుంగు ముఖంబుతో, నిట్లని, చెప్పెను

అని, తాత్పర్యము.

రామోదాశరథిర్నామ ప్రవిష్టో దండకావనం
లక్ష్మణేన సహభ్రాత్రా వైదేహ్యాచాపి భార్యయా. ౧౫౩

టీక॥ రామోనామ=రాముఁడని ప్రసిద్ధుఁడైన; దాశరథిః= దశరథునికొడుకు; భ్రాత్రా=తోఁబుట్టువైన; లక్ష్మణేనసహ=లక్ష్మణునితోను; భార్యయా=పెండ్లామయిన; వైదేహ్యాచాపి= సీతతోను; దండకావనం= దండకారణ్యమును; ప్రవిష్టః=చొచ్చెను.

దశరథపుత్త్రుఁడు రాముఁడను వాఁడు, లక్ష్మణుండనుతమ్మునిఁ సీతయను భార్యనుంగూడి, దండకారణ్యముప్రవేశించెను. అని, తాత్పర్యము.

అన్యకార్యవిషక్తస్య బద్ధవైరస్య రాక్షసైః
తస్య సీతా హృతా భార్యా రావణేన యశస్వినీ. ౧౫౪

టీక॥ రాక్షసైః=రాక్షసులతోఁ; బద్ధవైరస్య=కట్టఁబడిన యనఁగా స్థిరమైన పగగలవాఁడును ; అన్యకార్యవిషక్తస్య= వేరుకార్యమునందాసక్తుండును; తస్య=ఆరామునియొక్క; యశస్వినీ=మంచికీర్తి గలదియును ; భార్యా=పెండ్లామునగు; సీతా=సీత; రావణేన=రావణునిచేత; హృతా=కొనిపోఁబడినది.

ఆరాముండు, రాక్షసులతోఁబద్ధవైరంబుగల్గియుండి, యొకప్పుడువేఱుకార్యమునందుఁ దగిలియుండఁగా, రావణుండతనిభార్యయయిన పతివ్రతయగు సీతను,గొనిపోయెను.

అని, తాత్పర్యము.

తస్యాస్సకాశం దూతోఽహం గమిష్యేరామశాసనాత్
కర్తుమర్హసి రామస్య సాహ్యం విషయవాసిని. ౧౫౫

టీక॥ అహం=నేను ; రామశాసనాత్=రామునియాజ్ఞవలన; దూతః=రాయబారినై; తస్యాః=ఆసీతయొక్క; సకాశం = సమీపమునుగూర్చి; గమిష్యే=పోయెదను. విషయవాసిని= రామునియొక్క, రాజ్యమునందుండుదానా! రామస్య=రామునకు; సాహ్యం=తోడ్పాటును; కర్తుం= చేయుటకు; అర్హసి=తగుదువు.

నేను, రామునిపంపున, దూతనై,

యాసీతయొద్దకుఁబోయెదను ; నీవును రామునిరాజ్యంబుననుండుదానవు, రామునకు సాహాయ్యంబు సేయవలయును. అని, తాత్పర్యము.

అథవా మైథిలీం దృష్ట్వా రామం చాక్లిష్టకారిణమ్
ఆగమిష్యామి తే వక్త్రం సత్యం ప్రతిశృణోమి తే. ౧౪౮

టీక॥ అథవా= అటుకాకేని; మైథిలీం= సీతను; అక్లిష్టకారిణం= శ్రమములేకచేయునట్టి; రామంచ= రాముని; దృష్ట్వా= చూచి; తే= నీయొక్క ; వక్త్రం= నోటిని; ఆగమిష్యామి= పొందెదను. ఇదం(అధ్యాహృతము)= ఇది; సత్యం= అనృతముగానిది; తే= నీకొఱకు; ప్రతిశృణోమి= అంగీకరించెదను.

అటుగాదేని, సీతనుజూచి, ఆయాసములేక నేయెంత గొప్పకార్యమునైనను జేయంగలయట్టిరాముని, సందర్శించి, నీనోటియొద్దకువచ్చెదను; ఇదిసత్యము; నే , నొప్పుకొనుచున్నాను . అని, హనుమంతుఁడుసురసకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తా హనుమతా సురసా కామరూపిణీ
అబ్రవీ న్నాతివర్తేత కశ్చి దేష వరో మమ. ౧౪౯
"అబ్రవీన్నాతివర్తేన్మాం" అని, పాఠాంతరము.

టీక॥ కామరూపిణీ= ఇచ్ఛకువచ్చినరూపంబుగల; సురసా= సురస; హనుమతా= హనుమంతునిచేత ; ఏవం= ఇట్లు; ఉక్తా= చెప్పఁబడినదై; కశ్చిత్ =ఒకానొకండును; నాతివర్తేత= నన్ను, అతిక్రమింపలేఁడు. మాం= నన్ను; నాతివర్తేత్ =అతిక్రమింపలేఁడు; (అనిపాఠాంతరము)= ఏషః= ఇది; మమ= నాకు; వరః= వరము; ఇతి (అధ్యాహృతము)= అని; అబ్రవీత్ = చెప్పెను.

కామరూపిణియగు సురసహనుమంతుఁడుచెప్పినమాటనువిని ; "నన్నతిక్రమించి యెవ్వండును బోలేఁడు, ఇట్లు, నాకువరమున్నది, "అని, హనుమంతునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తం ప్రయాంతం సముద్వీక్ష్య సురసా వాక్య మబ్రవీత్

బలం జిజ్ఞాసమానా వై నాగమాతా హనూమతః.

టీక॥ నాగమాతా= సర్పంబులకుం దల్లియయిన; సురసా=సురస ; హనుమతః=హనుమంతునియొక్క; బలం=బలిమిని; జిజ్ఞాసమానా = ఎఱుంగఁగోరుచున్నదై; ("వై" అనునది పాద పూరణార్థము); ప్రయాంతం = పోవుచున్న; తం= ఆహనుమంతుని ; సముద్వీక్ష్య=చూచి; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

సర్పంబులకుందల్లియయిన సురస, హనుమంతునిబలమెఱుంగఁగోరినది, కావున, నాహనుమంతుండు, తన్నువిడిచిపోవుటంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

ఈశ్లోకంబుమొదట, "తంద్రుష్ట్వా వ్యాదితంత్వాస్యం" అను శ్లోకమునకు ముందున్న శ్లోకంబులన్నియుం బ్రక్షిప్తంబులని గోవిందరాజులుచెప్పిరి; మహేశ్వరతీర్థులుమాత్రమువానినుదాహరించిరి; రామానుజీయ వ్యాఖ్యానమందును "వ్రాయువారి ప్రమాదంబున నీశ్లోకంబులు కొన్నికోశంబులందుమాత్రముపడియున్నవి" అనివక్కాణింపఁబడియున్నది. కావున, నిచ్చోట, నవి లెక్కింపఁబడవయ్యె.

ప్రవిశ్య వదనం మేద్య గంతవ్యం వానరోత్తమ
వర ఏష పురా దత్తో మమ ధాత్రేతి సత్వరా.
వ్యాదాయ విపులం వక్త్రం స్థితా సా మారుతేః పురః

టీక॥ సా=ఆసురస; "వానరోత్తమ=వానరశ్రేష్ఠుండవగు హనుమంతుండా! అద్య=ఇప్పుడు; మే=నాయొక్క; వదనం=నోటిని; ప్రవిశ్య=చొచ్చి; గంతవ్యం=పోఁబడవలసినది; ఏషః=ఈ; వరః=వరము; పురా=మునుపు ; మమ= నాకు; ధాత్రా=బ్రహ్మదేవునిచే; దత్తః=ఇవ్వఁబడినది;" ఇతి=అని; ఉక్త్వా (అధ్యాహృతము)=చెప్పి; సత్వరా=వేగిరపాటుగలదై; విపులం=విశాలమయిన; వక్త్రం=నోటిని; వ్యాదాయ=తెఱచి; మారుతేః= హనుమంతునియొక్క; పురః=ముందట; స్థితా=నిలిచినది.

"వానరశ్రేష్ఠుండవగు హనుమంతుండా! నీవిప్పుడునానోటిలోఁజొచ్చిపోవలసినది; ఇట్లు, నానోటిముందటనుం[illegible]వాఁడు, నానోటినతిక్రమించిపోలేఁ

డనినాకుమున్ను బ్రహ్మదేవుండు వరం బొసంగెను;"అని, చెప్పి, యాసురస,విశాలంబగుతనవోరు దెఱచి, హనుమంతునిముందటనిలిచెను.అని తాత్పర్యము.

ఏవముక్తస్సురసయా క్రుద్ధో వానరపుంగవః।
అబ్రవీత్కురు వై వక్త్రం యేన మాం విషహిష్యసే॥

టీక॥ వానరపుంగవః= వానరశ్రేష్ఠుండగుహనుమంతుండు; సురసయా= సురసచేత;ఏవం= ఇట్లు;ఉక్తః = చెప్పఁబడినవాఁడై; క్రుద్ధః= కోపించినవాఁడై;"యేన=ఏనోటిచేత; మాం= నన్ను; విషహిష్యసే= ఓర్వఁగలవో, తత్ (అధ్యాహృతము) = అట్టి; వక్త్రం=నోటిని; కురు = చేయుము ("వై" అనునది పాదపూరణార్థకము);"ఇతి) అధ్యాహృతము)=అని;అబ్రవీత్=చెప్పెను.

వానరశ్రేష్ఠుండగు హనుమంతుండు,ఇట్లుసురసచెప్పుటవిని, కోపించి "నన్ను మ్రింగగల్గునట్లుగా నోరుదెఱవుము".అని,చెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా సురసాం క్రుద్ధో దశయోజనమాయతః।
దశయోజనవిస్తారో బభూవ హనుమాం స్తదా॥

టీక॥ హనుమాన్=హనుమంతుఁడు;సురసాం=సురసనుగూర్చి; ఇతి= అని; ఉక్త్వా=చెప్పి; క్రుద్ధః=కోపము నొందినవాఁడై; తదా=అప్పుడు; దశయోజనం=పదామడలు; ఆయతః=నిడుపు గలవాఁడును; దశయోజనవిస్తారః=పదామడల వెడల్పుగలవాఁడును గా;బభూవ=అయ్యెను.

హనుమంతుం, డప్పుడిట్లు, సురసతోఁజెప్పి, క్రుద్ధుండై పదియోజనంబులనిడుపును బదియోజనంబుల వెడల్పునుంగల దేహంబుగలవాఁడయ్యెను.

అని, తాత్పర్యము.

పూర్వము"పదియోజనంబుల వెడల్పును, ముప్పదియోజనంబులనిడుపును, హనుమంతునినీటిలోని నీడకుఁగల్గియుండె"నని చెప్పఁబడియుండుటవలన "హనుమంతుఁడు,సురసంజూచినప్పుడే, తనమునుపటిరూపమును జిన్నది చేసికొనె"నని.తోఁచెడిని.

తం దృష్ట్వా మేఘసంకాశం దశయోజన మాయతం.
చకార సురసాచాస్యం వింశద్యోజన మాయతం

టీక॥ మేఘసంకాశం=మబ్బుతోసమానుండువాడును; దశయోజనం= పదిఆమడలు; ఆయతం= నిడుపయినవాడును అగు; తం=ఆహనుమంతుని; దృష్ట్వా= చూచి; సురసా చ=సురసయును; వింశద్యోజనం=ఇరువదిఆమడలు; ఆయతం= నిడుపైన; ఆస్యం=నోటిని; చకార=చేసెను.

ఇట్లు, పదియోజనంబులు నిడుపైన శరీరంబుదాల్చి; మేఘంబువలె నున్న యాహనుమంతునిం జూచి, సురసయును, ఇరువదియామడలు నిడుపయిననోరుధరించెను.

అని, తాత్పర్యము.

హనుమాం స్తు తతః క్రుద్ధ స్త్రింశద్యోజనమాయతః.

టీక॥ తతః=అంతట; హనుమాంస్తు= హనుమంతుడును; క్రుద్ధః = కోపించినవాడై; త్రింశద్యోజనం= ముప్పదియామడలు; ఆయతః=నిడుపుగలవాడు; బభూవ (అధ్యాహృతము)=ఆయెను.

అంత, హనుమంతుండు, కోపించి, ముప్పదియోజనంబులు నిడుపైన దేహముధరించెను, అని, తాత్పర్యము.

చకార సురసా వక్త్రం చత్వారింశ త్తథోచ్ఛ్రితమ్
బభూవ హనుమాన్వీరః పంచాశద్యోజనోచ్ఛ్రితః.

టీక॥ సురసా=సురస; తథా=అట్లు; చత్వారింశత్ = నలువదియామడలు; ఉచ్ఛ్రితం=నిడుపయిన; వక్త్రం=నోరును; చకార=చేసెను; వీరః=పరాక్రమశాలియగు; హనుమాన్=హనుమంతుండు; పంచాశద్యోజనోచ్ఛ్రితః=ఏబదియామడలునిడుపైనవాడు; బభూవ=ఆయెను.

సురసయును, అట్లు, నలువదియోజనంబులనిడుపుగలనోరుధరించెను; పరాక్రమశాలియగు హనుమంతుండు, ఏబదియోజనంబులునిడుపైన, దేహంబునొందెను.

అని, తాత్పర్యము.

చకార సురసా వక్త్రం షష్టియోజన మాయతం

తథైవ హనుమాన్వీర స్సప్తతీ యోజనోచ్ఛ్రితః.

టీక॥ సురసా=సురస; షష్టి యోజనం = అఱువదియామడలు; ఆయతం= నిడుపైన; వక్త్రం=నోరును; చకార= చేసెను. తథైవ=ఆలాగే; వీరః=పరాక్రమశాలియగు ; హనుమాన్= హనుమంతుఁడు ; సప్తతీయోజనోచ్ఛ్రితః(సప్తతియోజనోచ్ఛ్రితః)=డెబ్బది యామడలునిడుపైనవాఁడు ; బభూవ (అధ్యాహృతము)=ఆయెను.

సురస, యఱువది యోజనంబులనిడుపుగలనోరుధరించెను; ఆలాగే, పరాక్రమశాలియగుహనుమంతుఁడును, డెబ్బది యోజనంబులనిడుపుగల దేహంబు వహించెను. అని, తాత్పర్యము.

చకార సురసా వక్త్ర మశీతీ యోజనాయతమ్
హనుమా నచల ప్రఖ్యో నవతీ యోజనోచ్ఛ్రితః.

టీక॥ సురసా=సురస; అశీతీయోజనాయతం(అశీతియోజనాయతం)= ఎనుబదియామడలునిడుపైన; వక్త్రం=నోరును; చకార=చేసెను. హనుమాన్= హనుమంతుండు; నవతీయోజనోచ్ఛ్రితః(నవతియోజనోచ్ఛ్రితః)= తొంబది యామడలునిడుపైనవాఁడై ; అచలప్రఖ్యః=కొండవంటివాఁడు ; బభూవ= (అధ్యాహృతము) ఆయెను.

సురస; యెనుబదియోజనముల నిడుపైననోరుధరించెను, హనుమంతుండును, తొంబదియోజనంబులు నిడుపుగల, దేహంబుధరించి, కొండవలెనగపడెను. అని, తాత్పర్యము.

చకార సురసా వక్త్రం శతయోజన మాయతం

టీక॥ సురసా= సురస ; శతయోజనం=నూఱామడలు; ఆయతం= నిడుపైన; వక్త్రం=నోరును; చకార= చేసెను.

అప్పుడు, సురస, నూఱుయోజనంబులునిడుపుగా, నోరుఁదెఱచెను. అని, తాత్పర్యము.

తద్దృష్ట్వా వ్యాదితం త్వాస్యం వాయుపుత్ర స్సుబుద్ధిమాన్
దీర్ఘజిహ్వం సురసయా సుఘోరం నరకోపమమ్
సుసంక్షిప్యాత్మనః కాయం బభూవాంగుష్ఠమాత్రకః. ౧౫౮

టీక॥ సుబుద్ధిమాన్=మిక్కిలియును బుద్ధిగల; వాయుపుత్రః= వాయుదేవుని కొడుకైన హనుమంతుఁడు; సురసయా=సురసచేత; వ్యాత్తం (వ్యాత్తం)=తెఱవఁబడినదియును; దీర్ఘజిహ్వం=నిడుపైననాలుక కలదియును; సుఘోరం=మిక్కిలియు భయంకరమయినదియు; నరకోపమం = నరకముతోఁబోల్కి గలదియునగు; తత్=ఆ; ఆస్యం=నోరును; దృష్ట్వా = చూచినంతనె; ఆత్మనః=తనయొక్క = కాయం=దేహమును; సుసంక్షిప్య=మిక్కిలియుఁజిన్నదిచేసి; అంగుష్ఠమాత్రకః= బొటనవ్రేలంతటివాఁడు; బభూవ= ఆయెను.

వాయుపుత్రుండగు హనుమంతుండట్లు సురసనూఱుయోజనంబులనిడుపు గాఁజెంచి తెఱచియున్ననిడుపైననాలుకగలిగిభయంకరంబై నరకంబుం బోలియున్న నోరుచూచి! బుద్ధిమంతుండు, కావున, "ఇప్పుడు సురసనోరు మిక్కిలివిశాలంబుగానున్నది, నాదేహంబు చిన్నదగునేని, తటాలునంజొచ్చిబయలు వెడలందగును" అని, యాలోచించి, తనదేహంబు, నంగుష్ఠంబంతటిదిగాఁ జేసెను.

అని, తాత్పర్యము.

ఇచ్చట, "దీర్ఘజిహ్వం" అనునర్ధశ్లోకంబు, వ్యాఖ్యానంబులందుఁ, గానకుండుటం జేసి, లెక్కింపఁబడదయ్యె.

సోభిపత్యాశు తద్వక్త్రం నిష్పత్యచ మనోజవః
అంతరిక్షే స్థిత శ్శ్రీమా నిదం వచన మబ్రవీత్. ౧౪౯

టీక॥ శ్రీమాన్= అందఱికన్ననధికుండును; మహాజవః=అధికమయిన వేగముగలవాఁడునగు; సః=ఆహనుమంతుండు; తద్వక్త్రం = ఆసురసయొక్కనోటిని; ఆశు=శీఘ్రముగా; అభిపత్య= ప్రవేశించి; నిష్పత్య చ=బయలువెడలియు; అంతరిక్షే=ఆకాశమునందు; స్థితః=ఉన్నవాఁడై; ఇదం=ఈ; వచనం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

శ్రీమంతుండగు నా హనుమంతుండు, గొప్పవేగంబుగలవాఁడు, కావున, శీఘ్రంబుగా, నాసురసనోటిలోపలికిఁబోయియుమఱలవెలువడియు, నాకాశంబునందుండి, యాసురసతో, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ప్రవిష్టో స్మిహి తే వక్త్రం దాక్షాయణి నమో స్తు తే
గమిష్యే యత్ర వైదేహీ సత్యం చాసీ ద్వర స్తవ. ౧౬౦

టీక॥ తే=నీయొక్క; వక్త్రం=నోటిని;ప్రవిష్టః=ప్రవేశించినవాఁడను; అస్మిహి=అయితినిగదా!దాక్షాయణి=దక్షప్రజాపతికిఁ గూఁతురయిన సురసా! తే=నీకొఱకు;నమః=నమస్కారము; అస్తు= అగుఁగాక. తవ=నీయొక్క;వరంచ=వరమును; సత్యం=దబ్బఱకానిది;ఆసీత్=అయినది. యత్ర=ఎచ్చట;వైదేహీ=సీత;అస్తి(అధ్యాహృతము)=ఉన్నదో; తత్ర(అధ్యాహృతము)=అచ్చటికి;గమిష్యే=పోయెదను.

నీనోటిలోనికింబోతినిగదా!దక్షప్రజాపతికిఁ గొమార్తెవయినసురసా! నీకునమస్కారముచేసెదను;నీకు "నీవు తలంచితివేని,ఎవ్వఁడైననునీ నోటిలోనికిఁబ్రవేశింపవలయును" అని, బ్రహ్మదేవుండొసంగినవరంబునుసత్యంబయ్యెను ఇఁకనన్నువిడువుము; నేను సీతయున్న చోటికింబోయెదను. అని, హనుమంతుండుసురసతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తం దృష్ట్వా వదనా న్ముక్తం చంద్రం రాహుముఖా దివ
అబ్రవీ త్సురసా దేవీ స్వేన రూపేణ వానరమ్. ౧౬౧

టీక॥ వదనాత్=నోటినుండి; ముక్తం=వెలువడినవాఁడును; రాహుముఖాత్= రాహువుయొక్కనోటినుండి; ముక్తం (అధ్యాహృతము)=వెలువడిన;చంద్రమివ(స్థితం)=చంద్రుండు వోలెనున్నవాఁడునగు; తం=ఆ; వానరం=హనుమంతుని; దృష్ట్వా=చూచి; దేవీ=అమ్మవారయిన; సురసా= సురస; స్వేన=తనదైన; రూపేణ=ఆకారముతో; సహితా(అధ్యాహృతము)=కూడుకొన్నదై;అబ్రవీత్=పలికెను.

అట్లు,తనముఖంబునుండి వెలువడి రాహుముఖంబుననుండివెలువడిన చంద్రుంబోలుచున్నయాహనుమంతుంజూచియాసురస, రాక్షసరూపంబువిడిచి, నిజరూపంబునొంది,యిట్లనిచెప్పెను.,

అని, తాత్పర్యము.

అర్థసిద్ధ్యై హరిశ్రేష్ఠ గచ్ఛ సౌమ్య యథాసుఖమ్

సమానయస్వ వైదేహీం రాఘవేణ మహాత్మనా. ౧౬౨

టీక॥ సౌమ్య=చిన్నవాఁడవయిన; హరిశ్రేష్ఠ = వానరశ్రేష్ఠుండవగుహనుమంతుఁడా! అర్థసిద్ధ్యై= కార్యముయొక్క-సిద్ధించుటకొఱకు; యథాసుఖం=సుఖమునతిక్రమింపక; గచ్ఛ=పొమ్ము. మహాత్మనా= పూజ్యమయినస్వభావముగల; రాఘవేణ=రామునితో; వైదేహీం=సీతను; సమానయస్వ=కూర్పుము.

సౌమ్యుండవగు హనుమంతుఁడా! నీవుసుఖంబుగాఁబొమ్ము;నీకుఁగార్యసిద్ధియగుఁగాక; మహాత్ముండగురామునితోసీతంజేర్పుము.

అని, తాత్పర్యము.



తత్తృతీయం హనుమతో దృష్ట్వా కర్మ సుదుష్కరమ్
సాధుసాధ్వితి భూతాని ప్రశశంసు స్తదా హరిమ్. ౧౬౩

టీక॥హనుమతః = హనుమంతునియొక్క-;తృతీయం=మూఁడవదియయిన;సుదుష్కరం = మిక్కిలిచేయనలవిగాని; తత్ = ఆ;కర్మ=సురసనోటినుండిబయలువెడలుటను;దృష్ట్వా=చూచి;తదా=అప్పుడు; భూతాని=భూతంబులు; హరిం=హనుమంతుని; సాధుసాధు=బళే!బళే!ఇతి=అని;ప్రశశంసుః=పొగడిరి.

అట్లు మూఁడవమాటు హనుమం

తుండు చేసిన, మఱియెవ్వరికినిం జేయనలవి గాని,సురసనోటినుండి బయలువెడలుటనుబూచి,ఘూతంబులు, సాధువాక్యంబుల, హనుమంతునిం బ్రశంసించిరి. అని,తాత్పర్యము.

స సాగర మనాధృష్య మభ్యేత్య వరుణాలయమ్
జగా మాకాశ మావిశ్య వేగేన గరుడోపమః. ౧౬౪

టీక॥ వేగేన = వేగముచేత; గరుడోపమః = గరుత్మంతునితోఁబోలిక గల; సః = ఆహనుమంతుఁడు; అనాధృష్యం = ఎదిరింపఁగూడని; వరుణాలయం = వరుణునకునిక్కపట్టయిన; సాగరం = సముద్రమును; అభ్యేత్య = పొంది. ఆకాశం = ఆకాశమును; ఆవిశ్య = పొంది; జగామ = పోయెను.

అంత, వేగంబున గరుత్మంతునకు సాటియగు నాహనుమంతుండు; ధర్షింపఁగూడని సముద్రంబుమీఁదుగా, నాకాశమార్గంబునం,బోయెను.

అని,తాత్పర్యము.

సేవితే వారిధారాభిః పతగైశ్చ నిషేవితే
చరితే కైశికాచార్యై రైరావతనిషేవితే. ౧౬౫
సింహకుంజరశార్దూలపతగోరగవాహనైః
విమానై స్సంపతద్భిశ్చ విమలై స్సమలంకృతే. ౧౬౬
వజ్రాశనిసమాఘాతైః పావకై రుపశోభితే
కృతపుణ్యై ర్మహాభాగై స్స్వర్గజిద్భి రలంకృతే. ౧౬౭
వహతా హవ్యమత్యర్థం సేవితే చిత్రభానునా
గ్రహనక్షత్ర చంద్రార్కతారాగణవిభూషితే. ౧౬౮
మహర్షిగణగంధర్వనాగయక్షసమాకులే
వివిక్తే విమలే విశ్వే విశ్వావసునిషేవితే. ౧౬౯
దేవరాజ గజాక్రాంతే చంద్రసూర్యపథే శివే
వితానే జీవలోకస్య వితతే బ్రహ్మనిర్మితే. ౧౭౦
బహుశ స్సేవితే వీరై ర్విద్యాధరగణై ర్వరైః
జగామ వాయుమార్గేతు గరుత్మా నివ మారుతిః. ౧౭౧

టీక॥ మారుతిః=వాయువుకొడుకై నహనుమంతుండు; గరుత్మానివ=గరుత్మంతుడుబోలె; వారిధారాభిః = జలములధారలచేత; సేవితే=సేవింపబడినదియును; పతగైశ్చ=పక్షులచేతను; నిషేవితే=సేవింపబడినదియు ; కైశికాచార్యైః;కైశిక = నృత్తము మొదలగువానికి; ఆచార్యైః= గురువులయినతుంబురువుమొదలగు వారిచేత;చరితే=సంచరింపబడినదియును; ఐరావతనిషేవితే; ఐరావత=వంకరగాకదీర్ఘమై యెట్టుగానుండునింద్ర ధనువుచేత, నిషేవితే=సేవింపబడినదియును; సింహకుంజరశార్దూలపతగోరగవాహనైః=సింహంబులు,ఏనుగులు,పెద్దపులులు,పక్షులు, సర్పములు, ఇవి మోయునవిగాఁగలవియు; విమలైః=స్వచ్ఛంబులును;సంపతద్భిః=తిరుగుచున్నవియునగు; విమానైశ్చ=విమానములచేతను; సమలంకృతే=చక్కఁగానలంకరింపఁబడినదియు ; వజ్రాశనిసమాఘాతైః= వజ్రమునకును పిడుగునకును సరియయిన వ్రేటుగల; పావకైః= అగ్నులచేత ; ఉపశోభితే=అలంకరింపఁబడినదియు; కృతపుణ్యైః=చేయఁబడినపుణ్యముగలవారును; మహాభాగైః=పూజ్యమయినభాగ్యముగలవారలును;స్వర్గజిద్భిః=స్వర్గమునుజయించినవారలునగు వారలచేత; అలంకృతే=అలంకరింపఁబడినదియును; హవ్యం= హవిస్సును;వహతా=మోయుచున్న; చిత్రభానునా= అగ్నిహోత్రునిచేత; అత్యర్థం=మిక్కిలియు ; సేవితే=సేవింపఁబడినదియును; గ్రహ నక్షత్రచంద్రార్కతారాగణవిభూషితే= అంగారకాదిగ్రహములచేతను అశ్విన్యాదినక్షత్రములచేతను జంద్రునిచేతనుసూర్యునిచేతను ఇతరనక్షత్రముల సమూహముచేతను అలంకరింపఁబడినదియును;మహర్షిగణగంధర్వనాగయక్షసమాకులే= పూజ్యులయిన ఋషులసమూహముచేతను గంధర్వులచేతనుసర్పములచేతను యక్షులచేతనునిండినదియును; వివిక్తే=పరిశుద్ధమైనదియును;విమలే=స్వచ్ఛమైనదియును; విశ్వే= అన్నిటనువ్యాపించియుండునదియు;విశ్వావసునిషేవితే= విశ్వావసువను గంధర్వరాజుచేత సేవింపఁబడినదియును; దేవరాజగజాక్రాంతే=దేవేంద్రునియేనుఁగైన యైరావతముచేసంచరింపఁబడినదియును; చంద్రసూర్యపథే= చంద్రసూర్యులమార్గమైనదియు;శివే=మంగళకరమయినదియును;జీవలోకస్య= ప్రాణిలోకముయొ

క్క-: బ్రహ్మనిర్మితే = బ్రహ్మదేవుని చే నేర్పఱుపఁబడిన ; వితతే = విశాలమగు; వితానే = మేలుకట్టయినది యును ; వీరైః = పరాక్రమముగలవియు;వరైః=శ్రేష్ఠములయినవియు నగు; విద్యాధరగణైః= విద్యాధరుల యొక్క-సమూహముల చేత;బహుశః= అధికముగా; సేవితే= సేవింపఁబడినది యునగు;వాయుమార్గే తు=వాయువు దారియయినయాకాశమందును; జగామ=పోయెను.

ఆహనుమంతుండు, మేఘంబులువిడుచువారిధారలచేనొప్పుచుఁ, బక్షులకాటపట్టై,తుంబురువుమొదలగుగానాచార్యులకుసంచారస్థానంబైవంకరలేకదీర్ఘంబయియెట్టగానుండునింద్రధనువునకుస్థానంబై, సింహంబులేనుంగులుపెద్దపులులుపక్షులుసర్పంబులు వీనిచేనిద్దఁబడితిరుగుచుండు స్వచ్ఛంబులయినవిమానంబులచేనలంకృతంబై, వజ్రంబునకునుబిడుగునకుం బోలె వ్రేటుగలయగ్నులందేజరిల్లుచు, భూలోకంబునం బుణ్యకార్యంబులాచరించి స్వర్గలోకంబునొంది మహాభాగులై నక్షత్రరూపంబున వెలుంగుచుండు పుణ్యపురుషులతోఁగూడి,యెల్లప్పుడును దేవతార్థంబుగా భూమిలోకంబునుండి హవ్యంబుగొనివచ్చుచుండు నగ్నిహోత్రునకుమార్గంబై , యంగారకాదిగ్రహంబులునశ్విన్యాది నక్షత్రంబులుఁజంద్రుండు సూర్యుండునితర నక్షత్రంబులునుంగల్గి,మహర్షులచేతనుగంధర్వులచేతనుసర్పంబులచేతనుయక్షులచేతను సంపూర్ణంబై,పరిశుద్ధంబునుస్వచ్ఛంబునఁ అన్నిటనువ్యాపించి యుండునదియునై ,గంధర్వరాజుండగు విశ్వావసువుచే సేవింపఁబడుచు, దేవేంద్రునిగజంబగునైరావతంబునకుఁగ్రీడాస్థానంబై, చంద్రునకును సూర్యునకునుదారియై, మంగళకరంబై , జీవలోకంబునకుబ్రహ్మదేవునిచేనిర్మింపఁబడిన విస్తీర్ణంబగు మేలుకట్టనందగి, పరాక్రమశాలులును త్తములునగు విద్యాధరులచే సేవింపఁబడుచుండు,నాకాశమార్గంబునందు,గరుత్మంతుండుంబోలెఁ,బోయెను. అని, తాత్పర్యము.

ప్రదృశ్యమాన స్సర్వత్ర హనుమాన్మారుతాత్మజః
భేజేంబరం నిరాలంబం లంబపక్ష ఇవాద్రిరాట్. ౧౭౨

టీక॥ మారుతాత్మజః=వాయువుకొడుకైన; హనుమాన్ = హనుమ్మం

తుండు; సర్వత్ర=అంతటను; ప్రదృశ్యమానః=చూడఁబడుచుండువాఁడై; లంబపక్షః=వ్రేలుకాడుటెక్కలుగల; అద్రిరాడివ(స్థితః) = పర్వతరాజమువలె నున్నవాఁడై; నిరాలంబం=పట్టులేని;అంబరం=ఆకాశమును; భేజే=పొందెను.

వాయుపుత్రుఁడైన, హనుమంతుండు, అచ్చటచ్చటనిలిచియుండు, దేవతలుమొదలగువారు సూచుచుండఁగాఁ, జేతులుఁగాళ్లుఁగ్రిందికి ముడుచుకొనియుంటంజేసి, వ్రేలుకాడుటెక్కలుగలపర్వతరాజంబుభంగిఁ బొపట్టుచు,నాకాశంబునంబోయెను.

అని, తాత్పర్యము.

ప్లవమానంతు తం దృష్ట్వా సింహికా నామ రాక్షసీ
మనసా చింతయామాస ప్రవృద్ధా కామరూపిణీ. ౧౭౩

టీక॥ప్లవమానం = ఎగిరిపోవుచున్న;తం=ఆహనుమంతుని;దృష్ట్వాతు=చూచినంతనె;కామరూపిణీ= ఇచ్ఛాధీనంబగురూపముగల;సింహికానామ=సింహికయనెడు ; రాక్షసీ=రక్కసి; ప్రవృద్ధా= వృద్ధిఁబొందినదై ; మనసా=మనసుచేత ; చింతయామాస=ఆలోచించెను.

అట్లు, ఆకాశమునం బోవుచున్నయాహనుమంతుంజూచి, సింహికయనురాక్షసి, యిచ్ఛకువచ్చినరూపంబుగొనంజాలినది, గావున, దేహంబుఁబెంచికొని, మనంబున,నిట్లని, యాలోచించెను.అని,తాత్పర్యము.

అద్య దీర్ఘస్య కాలస్య భవిష్యా మ్యహ మాశితా
ఇదం హి మే మహ త్సత్త్వం చిరస్య వశ మాగతమ్.౧౭౪

టీక॥అద్య=ఇప్పుడు; దీర్ఘస్య= అధికమయిన; కాలస్య=కాలముకాఁగా;అహం=నేను; ఆశితా(ఆశిత్రీ)= భుజించుదానను; భవిష్యామి= కాఁగలను. చిరస్య= బహుకాలమునకు; ఇదం=ఈ; మహత్=గొప్పదగు; సత్త్వం=జంతువు; మే=నాయొక్క; వశం=అధీనతను; ఆగతంహి= పొందినదిగదా!

బహుకాలముగా నేను భోజనము సేయలేదు; ఇంతకాలమునకు, ఈగొప్పజంతువునాబారిం బడినది ; కావు

న, నింక, భుజించెదను. అని, సింహికయాలోచించెను, అని, తాత్పర్యము.

ఇతి సంచింత్య మనసా ఛాయా మస్య సమాక్షిపత్

టీక॥ సింహికా (అధ్యాహృతము)= సింహిక; ఇతి=ఇట్లు; మనసా= మనసుచేత; సంచింత్య=ఆలోచించి; అస్య=ఈహనుమంతుని యొక్క; ఛాయాం=నీడను; సమాక్షిపత్=గ్రహించెను.

సింహిక, యిట్లుమనంబున నాలోచించి, యాహనుమంతునిమైనీడను బట్టియీడ్చెను.

అని, తాత్పర్యము.

ఛాయాయాం గృహ్యమాణాయాం చింతయామాస వానరః. ౧౭౫

టీక॥ ఛాయాయాం=మైనీడ; గృహ్యమాణాయాం = ఈడ్వఁబడుచుండఁగా; వానరః=హనుమంతుండు; చింతయామాస=ఆలోచించెను.

సింహికచేనట్లు, దనమైనీడ, యీడ్వఁబడుచుండఁగా, హనుమంతుండు, ఇట్లని, యాలోచించెను.

అని, తాత్పర్యము.

సమాక్షిప్తో స్మి సహసా పంగూకృతపరాక్రమః
ప్రతిలోమేన వాతేన మహానౌ రివ సాగరే. ౧౭౬

టీక॥ అహం(అధ్యాహృతము)=నేను; సాగరే=సముద్రమునందు; ప్రతిలోమేన= ఎదురైన; వాతేన= గాలిచేత; మహానౌరివ=పెద్దయోడవలె; పంగూకృతపరాక్రమః= తక్కువగాఁజేయఁబడినపరాక్రమంబుగలవాఁడనై; సహసా=వేగముగా; సమాక్షిప్తః=ఈడ్వఁబడినవాఁడను; అస్మి=అగుచున్నాను.

నేనిప్పుడు, సముద్రమునందు, ఎదురుగాలిచేగొప్పయోడ యీడ్వఁబడునట్లు, ఎవ్వరిచేతనో, నాపరాక్రమముపనికిరాకుండునట్లు, ఈడ్వఁబడుచున్నాను, అని, హనుమంతుండాలోచించెను.

అని, తాత్పర్యము.

తిర్య గూర్ధ్వ మధశ్చైవ వీక్షమాణ స్తతః కపిః
దదర్శ స మహ త్సత్త్వ ముత్థితం లవణాంభసి. ౧౭౭

టీక॥ తతః=అటుపిమ్మట; సః=ఆ; కపిః=హనుమంతుండు; తిర్యక్=అడ్డముగాను; ఊర్ధ్వం=పైఁగాను; అధశ్చైవ=క్రిందుగాను; వీక్షమాణః=చూచుచు; లవణాంభసి=ఉప్పునీళ్లుగల సముద్రమునందు; ఉత్థితం=పైకిలేచిన; మహత్=గొప్పదైన; సత్వం=జంతువయినసింహికను; దదర్శ=చూచెను.

అంత, నాహనుమంతుండు, ఈప్రక్కనాప్రక్కను పైని క్రిందనుం జూచి, సముద్రంబునఁ బైకిలేచియున్న, మహాజంతువగు సింహికం జూచెను.

అని, తాత్పర్యము.

తద్దృష్ట్వా చింతయామాస మారుతి ర్వికృతాననమ్

టీక। మారుతిః=వాయుపుత్రుండగు హనుమంతుండు; వికృతాననం=వికారముతోఁగూడిననోరుగల; తత్=ఆజంతువును; దృష్ట్వా=చూచి; చింతయామాస=ఆలోచించెను.

వాయుపుత్రుండగు హనుమంతుండు, వికృతంబగు పెద్దనోరుగల యాసింహికంజూచి, యిట్లని, యాలోచించెను. అని, తాత్పర్యము.

కపిరాజేన కథితం సత్వ మద్భుత దర్శనమ్. ౧౭౮
ఛాయాగ్రాహి మహావీర్యం తదిదం నాత్ర సంశయః

టీక॥ తత్=ఆ; ఇదం=ఈజంతువు; కపిరాజేన=వానరులకుఁబ్రభుండగు సుగ్రీవునిచేత; కథితం=చెప్పఁబడినదియు; అద్భుతదర్శనం=ఆశ్చర్యకరంబగు చూపుటగలదియు; ఛాయాగ్రాహి=నీడంబట్టుకొనునదియు; మహావీర్యం=అధికమయినపరాక్రమంబుగలదియునగు; సత్వం=జంతువు. సంశయః=సందేహము; న=లేదు.

ఇదిముందు, వానరప్రభుండగు సుగ్రీవుండు, "దక్షిణసముద్రమునందు, మైనీడఁబట్టుకొనంగలిగి మహా పరాక్రమశాలియయిచూపరులకాశ్చర్యంబు పుట్టించునట్టి యొకజంతువుగలదు" అని, చెప్పియుండినదే; ఇందుసందేహంబులేదు. అని, హనుమంతుండాలోచించెను. అని, తాత్పర్యము.

సతాం బుద్ధ్వార్థతత్త్వేన సింహికాం మతిమాన్కపిః. ౧౮౯
వ్యవర్ధత మహాకాయః ప్రావృషీవ వలాహకః

టీక॥మతిమాన్=ప్రశస్తంబగుబుద్ధిగల; సః=ఆ; కపిః = హనుమంతుండు; తాం=ఆ; సింహికాం=సింహికను; అర్థతత్త్వేన= కార్యముచేతఁగలిగినసిద్ధాంతముచేత; బుద్ధ్వా = ఎఱింగి; ప్రావృషి=వర్షాకాలమునందు; మహాకాయః= అధికమయినశరీరముగల; వలాహక ఇవ=మేఘమువలెఁ; వ్యవర్ధత=పెరిఁగెను.

ఆహనుమంతుండు, బుద్ధిమంతుండు కావునఁ, నాసింహికను, దానికార్యంబుచేఁదత్త్వంబుగా నెఱింగి, వర్షాకాలమందు మేఘంబు వృద్ధిఁబొందునట్లు, మేనుఁబెంచెను. అని, తాత్పర్యము.

తస్య సా కాయ ముద్వీక్ష్య వర్ధమానం మహాకపేః. ౧౯౦
వక్త్రం ప్రసార యామాస పాతాళాంతర సన్నిభమ్

టీక॥సా=ఆసింహిక; తస్య=ఆ; మహాకపేః= గొప్పకోఁతియగుహనుమంతునియొక్క; వర్ధమానం= పెరుఁగుచున్న; కాయం= దేహమును; ఉద్వీక్ష్య= చూచి; వక్త్రం=నోరును; పాతాళాంతరసన్నిభం= పాతాళరంధ్రముతోసమానంబగునట్లుగా; ప్రసారయామాస=తెఱచెను.

ఆసింహిక, హనుమంతుండు దేహముం బెంచుటంజూచి, తననోటిని, పాతాళమునకు సరియగునట్లుగా, విచ్చెను. అని, తాత్పర్యము.

ఘనరాజీవ గర్జంతీ వానరం సమభిద్రవత్. ౧౯౧

టీక॥సా(అధ్యాహృతము)=ఆసింహిక; ఘనరాజీవ=మేఘంబులపఙ్క్తివలెఁ; గర్జంతీ = అఱచుచు; వానరం= హనుమంతుని; సమభిద్రవత్ (సమభ్యద్రవత్)=తఱిమెను.

ఆసింహిక, మేఘపఙ్క్తియుంబోలె గర్జించుచు, హనుమంతుఁదఱిమి, పట్టుకొనఁబోయెను. అని, తాత్పర్యము.

స దదర్శ తత స్తస్యా వివృతం సుమహ న్ముఖమ్




కాయమాత్రంచ మేధావీ మర్మాణి చ మహాకపిః. ౧౮౨

టీక॥ తతః=అటుపిమ్మట ; మేధావీ=బుద్ధిమంతుండగు=సః ఆ=మహాకపిః=గొప్పకోఁతియగు హనుమంతుండు; తస్యాః=ఆసింహికయొక్క ; వివృతం=తెఱవఁబడినదియు ; సుమహత్=మిక్కిలియుఁబెద్దదియు ; కాయమాత్రం=తనదేహమంతటిదియు నైన; ముఖంచ=నోటిని; మర్మాణిచ=జీవస్థానంబులను ; దదర్శ = చూచెను.

ఆహనుమంతుండు, తెఱవఁబడి తన దేహము మ్రింగుటకుంజాలియుండు, నాసింహిక గొప్పనోరుచూచి, బుద్ధిమంతుండు, గావున, దానిజీవస్థానంబులనుంగనిపెట్టెను. అని, తాత్పర్యము.

స తస్యా వివృతే వక్త్రే వజ్రసంహననః కపిః
సంక్షిప్య ముహు రాత్మానం నిష్పపాత మహాబలః. ౧౮౩

టీక॥ మహాబలః= అధికమయినబలముగలవాఁడును; వజ్రసంహననః=వజ్రమువంటిదేహముగలవాఁడునగు; సః=ఆ; కపిః=హనుమంతుండు; ముహుః=పలుమాఱు; ఆత్మానం=దేహమును; సంక్షిప్య=చిన్నదిచేసి; తస్యాః=ఆసింహికయొక్క; వివృతే = తెఱవఁబడిన; వక్త్రే=నోటియందు; నిష్పపాత=పడెను.

మహాబలుండు, వజ్రముంబోలెనతికఠినమయినదేహంబుగలవాఁడునగు హనుమంతుండు, తనదేహంబునుమిక్కిలియుఁజిన్నదిగాఁజేసికొని, తెఱచియుండు, నాసింహికవక్త్రంబుఁజొచ్చెను.

అని, తాత్పర్యము.

ఆస్యే తస్యా నిమజ్జంతం దదృశు స్సిద్ధచారణాః
గ్రస్యమానం యథాచంద్రం పూర్ణం పర్వణి రాహుణా. ౧౮౪

టీక॥ సిద్ధచారణాః= సిద్ధులునుజారణులును; తస్యాః=ఆసింహికయొక్క; ఆస్యే=నోటియందు ; నిమజ్జంతం=మునుంగుచున్న; హనుమంతం (అధ్యాహృతము) = హనుమంతుని ; పర్వణి=పూర్ణిమయందు; రాహుణా=




రాహువుచేత; గ్రస్యమానం=మ్రింగఁబడుచున్న; పూర్ణం=నిండిన; చంద్రంయథా=చంద్రునింబోలె ; దదృశుః=చూచిరి.

హనుమంతుండాసింహిక వక్త్రింబుచొచ్చినపుడు, పూర్ణిమయందు, రాహువుచేఁగ్రహింపఁబడుచుండు నిండుచందురుండుంబోలె, సిద్ధచారణులు మున్నగుచూపరులకుఁజూపట్టెను.

అని, తాత్పర్యము.



తత స్తస్యా నఖై స్తీక్ష్ణై ర్మర్మాణ్యుత్కృత్య వానరః
ఉత్పపాతాథ వేగేన మనస్సంపాతవిక్రమః. ౧౮౫

టీక॥ అథ=అటుతర్వాత; వానరః=హనుమంతుండు; మనస్సంపాతవిక్రమః=మనసుయొక్క గమనమువంటి నడకగలవాఁడై; తీక్ష్ణైః=కఱకుగల; నఖైః=గోళ్లచేత; తస్యాః=ఆసింహికయొక్క; మర్మాణి=జీవస్థానములను; ఉత్కృత్య=చీల్చి; వేగేన=వేగముచేత; తతః=ఆనోటనుండి; ఉత్పపాత=పైకెగిరెను, బయలు వెడలెననుట.

అంత, హనుమంతుఁడు, మనంబునకుంబోలె వేగంబుగలిగి, కఱకుగోళ్లచే, నాసింహికమర్మంబులఁజీలిచి, యది నోరుమూయుటకుమున్నె, వేగంబున, నానోటనుండి, వెడలెను.

అని, తాత్పర్యము.

తాంతు దృష్ట్వాచ ధృత్యాచ దాక్షిణ్యేన నిపాత్యచ
స కపిప్రవరో వేగా ద్వవృధే పున రాత్మవాన్. ౧౮౬

టీక॥ కపిప్రవరః=వానరశ్రేష్ఠుండును; ఆత్మవాన్=ప్రశస్తంబగుబుద్ధిగల

వాఁడునగు; సః=ఆహనుమంతుండు; తాం=ఆసింహికను. దృష్ట్వాచ=చూచుటచేతను; ధృత్యాచ=ధైర్యముచేతను; దాక్షిణ్యేనచ=సామర్థ్యముచేతను; నిపాత్యతు=పడఁద్రోసినంతనె; పునః=మఱల; వేగాత్=వేగమున; వవృధే=పెరిఁగెను.

వానరశ్రేష్ఠుండగు నాహనుమంతుండు, సూక్ష్మంబుకనిపెట్టి, ధైర్యంబునను సామర్థ్యంబునను, ఆసింహికం బడఁద్రోసి, బుద్ధిమంతుండు, కావున, వేగంబునమఱల దేహంబుఁబెంచికొనెను.

అని, తాత్పర్యము.

హృతహృత్సా హనుమతా పపాత విధురాంభసి

టీక॥ సా=ఆసింహిక; హనుమతా=హనుమంతునిచేత; హృతహృత్=హరింపఁబడినగుండెగలదై; విధురా=స్మృతిదప్పినదై; అంభసి= నీటియందు; పపాత=పడెను.

అట్లు, హనుమంతుండుసింహికగుండెనలియఁగొట్టఁగాఁ, నది, స్మృతిదప్పి నీటంబడినది. అని, తాత్పర్యము.

తాం హతాం వానరేణాశు పతితాం వీక్ష్య సింహికామ్. ౧౮౭
భూతాన్యాకాశచారీణి తమూచుః ప్లవగోత్తమమ్

టీక॥వానరేణ= హనుమంతునిచేత; ఆశు=శీఘ్రముగా; హతాం=చంపఁబడినదియును; పతితం=పడినదియునగు; సింహికాం=సింహికను; వీక్ష్య=చూచి; ఆకాశచారీణి=ఆకాశమునందుఁదిరుగునట్టి; భూతాని=భూతములు; ప్లవగోత్తమం=వానరశ్రేష్ఠుండగు; తం=ఆహనుమంతునిగూర్చి; ఊచుః=పలికిరి.

అట్లు, హనుమంతునిచేఁ జంపఁబడి నీటంబడియున్నసింహికంజూచి, యాకాశంబునందు సంచరించు భూతంబులు, సంతోషంబున, వానరశ్రేష్ఠుండగు హనుమంతుంజూచి, యిట్లని, చెప్పిరి.

అని, తాత్పర్యము.

భీమమద్య కృతం కర్మ మహత్సత్వం త్వయా హతమ్. ౧౮౮
సాధయార్థమభిప్రేత మరిష్టం ప్లవతాం వర

యస్య త్వేతాని చత్వారి వానరేంద్ర యథా తవ. ౧౯౯
ధృతి ర్దృష్టి ర్మతి ర్దాక్ష్యం స్వకర్మసు న సీదతి

టీక॥ వానరేంద్ర=వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! యస్య=ఏజంతువునకు; తవయథా=నీకువలె; ధృతిః=ధైర్యమును; దృష్టిః = సూక్ష్మములనెఱుంగుటయు; మతిః= బుద్ధియు, నిశ్చయించుశక్తియుననుట; దాక్ష్యం=సామర్థ్యమును; ఏతాని=ఈ; చత్వారి=నాల్గును; స్వకర్మసు= తనపనులందు; నసీదతి(సీదంతి)=తగ్గవో; తత్(అధ్యాహృతము)=అట్టి; మహత్=గొప్పదగు; సత్వంతు=జంతువును ; త్వయా=నీచేత; హతం=చంపఁబడినది; అద్య=ఇప్పుడు; భీమం=భయంకరమయిన; కర్మ=పని; కృతం=చేయఁబడినది, ప్లవతాం=వానరులలోపల; వర=శ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! అభిప్రేతం=కోరఁబడిన; అర్థం=కార్యమును; అరిష్టం= మంగళమగునట్లుగా; సాధయ=సాధింపుము.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! నీకుంబోలె, నెట్టికష్టంబులందైన మొక్కవోవని ధైర్యమును సూక్ష్మదృష్టియుఁదత్త్వనిశ్చయశక్తియుఁ బనులయందు నేర్పునుంగలయీమహాసత్త్వంబును, నీవు చంపితివి; నీవిప్పుడు వినువారలకుం గూడ వెఱపుఁబుట్టించు కార్యంబు గావించితివి; ఇంక, నీకోరినకార్యంబు సాధించుకొనుము; నీకు మంగళంబగుఁగాక. అని, యాభూతంబులు, హనుమంతునితోఁ జెప్పినవి. అని, తాత్పర్యము.

స తై స్సంభావితః పూజ్యః ప్రతిపన్నప్రయోజనః. ౨౦౦
జగా మాకాశ మావిశ్య పన్నగాశనవ త్కపిః

టీక॥ పూజ్యః = పూజింపఁదగిన; సః=ఆ; కపిః=హనుమంతుండు; తైః=ఆభూతంబులచే; సంభావితః = గౌరవింపఁబడినవాఁడై; ప్రతిపన్నప్రయోజనః=పొందఁబడినపనిగలవాఁడై; ఆకాశం=ఆకాశమును; ఆవిశ్య=పొంది; పన్నగాశనవత్=సర్పంబాహారంబుగాఁగలగరుత్మంతుండుంబోలె; జగామ=పోయెను.

పూజనీయుండగు నాహనుమంతుండు, ఆభూతంబులచేఁబూజింపఁబడి, ప్రకృతంబగుసింహికావధరూపంబయి

న కార్యంబుసిద్ధినొంది, యాకాశమార్గంబున, గరుత్మంతుండుంబోలెఁ బోయెను.

అని, తాత్పర్యము.

ప్రాప్తభూయిష్ఠపారస్తు సర్వతః ప్రతిలోకయన్. ౧౯౧
యోజనానాం శతస్యాంతే వనరాజిం దదర్శ సః

టీక॥సః=ఆహనుమంతుఁడు; ప్రాప్తభూయిష్ఠపారస్తు=పొందఁబడినగొప్పగట్టుగలవాఁడైనంతనె,పొందఁబడినట్లయిన గొప్పగట్టుగలవాఁడైనంతనె, యనుట;సర్వతః=అంతటను;ప్రతిలోకయన్=చూచుచు; యోజనానాం=ఆమడలయొక్క;శతస్య=నూటియొక్క; అంతే=కొనయందు; వనరాజిం=అడవులపఙ్క్తిని;దదర్శ=చూచెను.

ఆహనుమంతుండు, అవ్వలిసముద్రతీరముదగ్గిఱకువెళ్లి, యంతటంగలయఁజూచుచుండఁగా, నూఱామడలకవ్వల, నడవులగుంపొకటి,యతనికగపడెను.

అని, తాత్పర్యము.

దదర్శ చ పతన్నేవ వివిధద్రుమభూషితమ్. ౧౯౨
ద్వీపం శాఖామృగశ్రేష్ఠో మలయోపవనానిచ

టీక॥శాఖామృగశ్రేష్ఠః=వానరులలోమేటియగుహనుమంతుండు; పతన్నేవ=పోవుచునే; వివిధద్రుమభూషితం=నానావిధంబులగువృక్షంబులచేనలంకరింపఁబడిన; ద్వీపం=లంకాద్వీపమును;మలయోపవనానిచ= మలయపర్వతమునందలితోఁటలను; దదర్శచ=చూచెను.

వానరశ్రేష్ఠుండగుహనుమంతుండు, ఆకాశంబునంబోవుచునే, నానావిధవృక్షంబులనొప్పుచున్న లంకాద్వీపంబునుమలయపర్వతమునందలి వనంబులనుంజూచెను.

అని, తాత్పర్యము.

సాగరం సాగరానూపం సాగరానూపజాన్ ద్రుమాన్. ౧౯౩
సాగరస్యచ పత్నీనాం ముఖాన్యపి విలోకయన్
స మహామేఘసంకాశం సమీక్ష్యాత్మాన మాత్మవాన్. ౧౯౪
నిరుంధంతమివాకాశం చకార మతిమాన్మతిమ్

టీక॥ఆత్మవాన్= ప్రశస్తమగుధైర్యముగలవాఁడును; మతిమాన్= ప్రశస్తమగుబుద్ధిగలవాఁడునగు; సః=ఆహనుమంతుఁడు;సాగరం=సముద్రమును; సాగరానూపం= సముద్రముయొక్క-సమీపంబుననుండుజవుకు నేలను, సముద్రపు గట్టుననుట ; సాగరానూపజాన్=సముద్రముసమీపంబున నుండు జవుకు నేలంబుట్టిన; ద్రుమాన్=వృక్షములను; సాగరస్య= సముద్రముయొక్క; పత్నీనాంచ=భార్యలయిననదులయొక్కయు; ముఖాన్యపి=మొగములను; సముద్రసంగమస్థానములననుట; విలోకయన్=చూచుచు, మహామేఘసంకాశం=గొప్పమబ్బుతో సమానమయినదియు; ఆకాశం=ఆకాశమును; నిరుంధంతమివ (స్థితం)=అడ్డగించునదిపోలెనున్నదియునగు; అత్మానం= దేహమును;సమీక్ష్య=చూచి; మతిం=ఆలోచనమును;చకార=చేసెను.

ధైర్యవంతుండగు నాహనుమంతుండు,సముద్రమును సముద్రతీరమును సముద్రతీరమందలివృక్షంబులను నదులుసముద్రంబునం గలియు స్థానంబులనుంజూచుచు, తనదేహంబు, మహామేఘంబుంబోలి యాకాశము నడ్డగించునట్లుండుటంగని , బుద్ధిమంతుండు కావున,నిట్లని,యాలోచించెను.

అని, తాత్పర్యము.

కాయవృద్ధిం ప్రవేగంచ మమ దృష్ట్వైవ రాక్షసాః. ౧౯౫

మయి కౌతూహలం కుర్యు రితి మేనే మహాకపిః

టీక॥"రాక్షసాః=రాక్షసులు; మమ=నాయొక్క; కాయవృద్ధిం= దేహముయొక్క పెరుఁగుటను; ప్రవేగంచ=అధికమయినవడిని; దృష్ట్వైవ=చూచినంతనే; మయి=నాయందు;కౌతూహలం=కోర్కిని; కుర్యుః=చేయుదురు." ఇతి=ఇట్లు; మహాకపిః = గొప్పకోఁతియగుహనుమంతుండు ; మేనే=తలంచెను.

"రాక్షసులు,నాదేహమిట్లుపెరిగియుండుటనునావేగంబునుంజూచి రేని, యాశ్చర్యంబునొంది,నన్నుంజూచిహా,హాకారంబులుసేయుదురు, అంతఁగార్యభంగంబగును"అని,యాలోచించెను

అని, తాత్పర్యము.

తత శ్శరీరం సంక్షిప్య త న్మహీధర సన్నిభమ్.౯౯
పునః ప్రకృతి మాపేదే వీతమోహ ఇవాత్మవాక్

టీక॥సః(అధ్యాహృతము)=ఆహనుమంతుండు;తతః=అంతట;మహీధర సన్నిభం= కొండతోసమానమయిన; తత్=ఆ,సముద్రముదాఁటుటకైధరించిన;శరీరం=దేహమును; సంక్షిప్య=చిన్నదిచేసి;వీతమోహః= విడువఁబడినయజ్ఞానముగల;ఆత్మవానివ = శరీరముగలజీవుండుఁబోలె; పునః=మఱల; ప్రకృతిం=స్వభావమును;ఆపేదే=పొందెను.

అంత, హనుమంతుండు, పర్వతాకారంబగునాదేహంబు చిన్నదిగాఁజేసి, శరీరియగుజీవుండజ్ఞానంబువీడి తనవాస్తవరూపంబగు పరబ్రహ్మంబయగునట్లు, తనమునుపటిరూపంబుగైకొనెను.అని, యద్వైతమతానుసారితాత్పర్యము.

అంత, హనుమంతుండు, పర్వతాకారంబగునాదేహంబు చిన్నదిగాఁజేసి, శరీరియగుజీవుండు అజ్ఞానంబువీడి తనస్వభావంబగుపరమేశ్వరకైంకర్యంబునొందునట్లు,తనమునుపటిరూపంబునొందెను. అని,విశిష్టాద్వైతమతానుసారితాత్పర్యము. ఇట్లె,ద్వైతమతానుసారితాత్పర్యంబు.

ఇచ్చట,పైవ్రాయఁబడిన టీకవలననె,విభిన్న తాత్పర్యంబులుద్భృతంబులగుచున్నవి, కావున,టీక,భిన్నంబుగా, వ్రాయుటయనావశ్యకంబగుటంజేసి , మఱల,టీక,వ్రాయంబడదయ్యె.

త ద్రూప మతిసంక్షిప్య హనుమా న్ప్రకృతౌ స్థితః.౯౭
త్రీ నక్రమానివ విక్రమ్య బలివీర్యహరో హరిః

టీక॥ హనుమాన్=హనుమంతుండు;తత్=ఆ;రూపం=ఆకారమును;అతిసంక్షిప్య= మిక్కిలియుఁజిన్నదిచేసి; త్రీన్=మూఁడయిన; క్రమాన్=అడుగులను;విక్రమ్య=త్రొక్కి; బలివీర్యహరః= బలియనురాక్షసునియొక్కపరాక్రమమునుహరించునట్టి;హరిరివ=విష్ణుదేవుండువలె;ప్రకృతౌ=స్వభావమునందు;స్థితః = ఉన్నవాఁడు;అభూత్(అధ్యాహృతము)=ఆయెను.

హనుమంతుండు,పర్వతాకారంబగునారూపంబును మిగులఁజిన్నదిగాఁ

జేసికొని, త్రివిక్రమావతారంబున, మూఁడడుగులుంచి, బలిచక్రవర్తి పరాక్రమంబుహరించిన విష్ణుదేవుండు మఱలఁబూర్వపువామనరూపంబు నొందినట్లు, తనదు, పూర్వరూపంబునొందెను. అని, తాత్పర్యము.

స చారునానావిధరూపధారీ
పరం సమాసాద్య సముద్రతీరమ్. ౧౯౮
పరై రశక్యః ప్రతిపన్నరూప
స్సమీక్షితాత్మా సమవేక్షితార్థః

టీక॥ చారునానావిధరూపధారీ=సుందరములును బలు దెఱంగులయినవి యునగునాకారములనుధరించువాఁడును; పరైః=శత్రువులచేత; అశక్యః=ఓర్వఁగూడనివాఁడునగు; సః=ఆహనుమంతుఁడు; పరం=అవ్వలిదైన; సముద్రతీరం=సముద్రపుగట్టును; సమాసాద్య=పొంది; సమీక్షితాత్మా=చూడఁబడినదేహము గలవాఁడై; సమవేక్షితార్థః=ఆలోచింపఁబడినకార్యము గలవాఁడై; ప్రతిపన్నరూపః=పొందఁబడినయెప్పటియాకారము గలవాఁడు; లేక, పొందఁబడినపిల్లియంతటి యాకారముగలవాఁడు; (ఈయర్థము చెప్పఁబోవుకథాభాగంబు ననుసరించినది); అభూత్=ఆయెను.

ఆహనుమంతుండు, అర్థ్యేకాలంబులకుందగినట్లుసుందరంబుగా, నానావిధరూపంబులుధరించుచు, సింహికమున్నగుశత్రువులకులోఁబడక, యవ్వలిసముద్రతీరంబుఁజేరి, మిక్కిలి గొప్పదిగానుండుతనదేహంబుఁ జూచుకొని, "ఇంకనింతటిదేహంబుతోనుండరాదు; ఉండినచోరాక్షసులునన్నుంజూచి యాశ్చర్యంపడి కలకలంబుసేయుదురు; దానంజేసికార్యభంగంబగు" అనియాలోచించి, తనయెప్పటి రూపంబుఁదాల్చెను. (పిల్లియంతటిరూపంబుదాల్చెను. అనికొందఱు.) అని, తాత్పర్యము.

తత స్స లంబస్య గిరే స్సమృద్ధే
విచిత్రకూటే నిపపాత కూటే. ౧౯౯
సకేతకోద్దాలకనాళికేరే

మహాద్రికూటప్రతిమో మహాత్మా

టీక॥తతః=అటుపిమ్మట; మహాద్రికూటప్రతిమః=గొప్పకొండ యొక్క శిఖరంబుతోఁబోల్కి-గలిగిన వాఁడును; మహాత్మా=అధికమయిన బుద్ధిగలవాఁడునగు; సః=ఆహనుమంతుండు; లంబస్య=లంబమను; గిరేః= పర్వతముయొక్క; సమృద్ధే= వృద్ధిఁబొందినదియును; విచిత్రకూటే= నానావిధంబులగునవాంతరశిఖరంబులుగలదియును; సకేతకోద్దాలకనాళికేరే= మొగలిపొదలతోనువిరిగిచెట్లతోను టెంకాయలచెట్లతోనుంగూడినదియునగు; కూటే=శిఖరమునందు ; నిపపాత=వ్రాలెను.

అంత,గొప్పకొండ శిఖరంబునకుం బోలెధైర్యంబు గలవాఁడును మిక్కిలియు బుద్ధిమంతుండునగు నాహనుమంతుండు,అన్నిటనుసమృద్ధంబై నానావిధంబులగునవాంతరశిఖరంబులు గలిగి మొగలిపొదలతోవిరిగిచెట్లతో నాళికేరవృక్షంబులతోనుంగూడియున్న యాలంబపర్వతశిఖరంబునందు,వ్రాలెను.

అని, తాత్పర్యము.

తతస్తు సంప్రాప్య సముద్రతీరమ్
సమీక్ష్య లంకాం గిరివర్యమూర్ధ్ని. ౨౦౦
కపిస్తు తస్మిన్ నిపపాత పర్వతే
విధూయ రూపం వ్యథయ న్మృగద్విజాన్

టీక॥తతస్తు=అటుపిమ్మటను ; కపిస్తు=హనుమంతుండును ; సముద్రతీరం=సముద్రపుగట్టును , సముద్రపుగట్టుపైనుండునాకాశముననుట;సంప్రాప్య=పొంది; గిరివర్యమూర్ధ్ని= పర్వతశ్రేష్ఠంబగుత్రికూటముయొక్క-శిఖరమునందు,ఉన్న; లంకాం=లంకాపురిని; సమీక్ష్య=చూచి; రూపం=దేహమును; విధూయ=విదిచిఁకొని; మృగద్విజాన్=జింకలనుబక్షులను ; వ్యథయన్=భయపఱచుచు;తస్మిన్=ఆ; పర్వతే=లంబపర్వతమునందు ; నిపపాత=వ్రాలెను.

అంత,నాహనుమంతుండు,సముద్రతీరంబునొద్దకుఁబోయి,త్రికూటపర్వతశిఖరంబునందున్నలంకంజూచుచుఁ, దనదేహమును విదిర్చికొని జింకలనుబక్షులనుభయంపడునట్లుసేయుచు, నాలం

బపర్వతముపైవ్రాలెను.అని, తాత్పర్యము.

స సాగరం దానవపన్నగాయుతమ్
బలేన విక్రమ్య మహోర్మిమాలినమ్
నిపత్య తీరే చ మహోదధే స్తదా
దదర్శ లంకా మమరావతీ మివ. ౨౦౫

టీక॥సః=ఆహనుమంతుఁడు; దానవపన్నగాయుతం= దానవులతోను సర్పములతోనుం గూడినదియును; మహోర్మిమాలినం=గొప్పయలలయొక్క పఙ్క్తులుగలదియునగు;సాగరం=సముద్రమును;బలేన =బలిమిచేత;విక్రమ్య=దాఁటి; మహోదధేః=సముద్రముయొక్క;తీరే=గట్టునందు; నిపత్య చ=వ్రాలియును;తదా=అప్పుడు; అమరావతీమివ(స్థితాం)= దేవేంద్రునిపట్టణంబగు నమరావతివలెనున్న; లంకాం=లంకాపురిని; దదర్శ=చూచెను.

ఆహనుమంతుండు, బలంబున,దానవులతోను సర్పంబులతోనునిండిగొప్పయలలుగలిగియున్న సముద్రంబుదాఁటి, తీరంబునవ్రాలి, యమరావతింబోలియున్నలంకాపురింబూచెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, ప్రథమస్సర్గః.

ఇది,స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు , శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండప్రథమసర్గటీక,
ముగిసినది.



శ్రీ

ద్వితీయసర్గప్రారంభః.

స సాగర మనాధృష్య మతిక్రమ్య మహాబలః
త్రికూటశిఖరే లంకాం స్థితాం స్వస్థో దదర్శ హ. ౧

టీక॥ మహాబలః=అధికమయినబలముగల; సః=ఆహనుమంతుండు; అనాధృష్యం=ఎదిరింపఁగూడని; సాగరం=సముద్రమును; అతిక్రమ్య=దాఁటి; స్వస్థః=నెమ్మదిగానున్నవాఁడై; త్రికూటశిఖరే= త్రికూటపర్వతముయొక్క—శిఖరమునందు; స్థితాం=ఉన్న; లంకాం=లంకాపట్టణమును; దదర్శ=చూచెను. హకారము పాదపూరణార్థము.

మహాబలుండగు నాహనుమంతుండు, ఎవ్వరికినింగాలువెట్టనలవిగాని సముద్రంబు దాఁటి, యంత, స్వస్థుండై, త్రికూటశిఖరంబున నున్న లంకాపురింజూచెను. అని, తాత్పర్యము.

తతః పాదపముక్తేన పుష్పవర్షేణ వీర్యవాన్
అభివృష్ట స్థ్సిత స్తత్ర బభౌ పుష్పమయో యథా. ౨

టీక॥ తతః=అటుపిమ్మట; తత్ర=ఆపర్వతమునందు; స్థితః = ఉన్నవాఁడును; పాదపముక్తేన= చెట్లచేవిడువఁబడిన; పుష్పవర్షేణ= పూలవానచేత; అభివృష్టః=తడుపఁబడినవాఁడును, కప్పఁబడినవాఁడుననుట; వీర్యవాన్=పరాక్రమశాలియు నగు హనుమంతుండు; పుష్పమయోయథా=పూలతోఁజేయఁబడినవానరుండువోలె; బభౌ=ప్రకాశించెను.

అంతఁ, బరాక్రమశాలియగునాహనుమంతుండు, ఆపర్వతమునందలి వృక్షంబులనుండి యొడతెగక రాలినపూలచేఁ గప్పఁబడుటంజేసి, పువ్వులకోఁతియనందగి, యొప్పెను. అని, తాత్పర్యము.

యోజనానాం శతం శ్రీమాం స్తీర్త్వా ప్యుత్తమవిక్రమః
అనిశ్శ్వసన్ కపి స్తత్ర నగ్లాని మధిగచ్ఛతి. ౩

టీక॥ఉత్తమవిక్రమః= శ్రేష్ఠమయిన పరాక్రమము గలవాఁడును ; శ్రీమాన్=అధికుండునగు; కపిః= హనుమంతుండు; యోజనానాం= ఆమడల యొక్క;శతం=నూటిని; తీర్త్వాఽపి= దాఁటియును;అనిశ్శ్వసన్=నిట్టూర్పు విడువనివాఁడై;తత్ర=ఆనిమిత్తమయి; గ్లానిం = యలసటను; నాధిగచ్ఛతి=(నాధ్యగచ్ఛత్)పొందలేదు.

హనుమంతుండట్లు, నూఱు యోజనంబులసముద్రంబుదాఁటినవాఁడయ్యును,అందఱికన్నన్నధికుండునునుమహాపరాక్రమశాలియుఁగావున, రొజునొందక, యెంతమాత్రము నలసటఁ బొందఁడయ్యె.

అని, తాత్పర్యము.

శతాన్యహం యోజనానాం క్రమేయం సుబహూన్యపి
కిం పున స్సాగరస్యాంతం సంఖ్యాతం శతయోజనమ్. ౪

టీక॥ "అహం=నేను; యోజనానాం=ఆమడలయొక్క; సుబహూని=మిక్కిలియునేకములయిన; శతాన్యపి=నూఱులనుగూడ; క్రమేయం=దాఁటుదును.శతయోజనం=నూఱామడలు గల్గునట్లుగా;సంఖ్యాతం=లెక్కింపఁబడిన; సాగరస్య=సముద్రముయొక్క; అంతం = గట్టును; క్రమేయమితి=(అధ్యాహృతము)దాఁటుదునని;కింపునః(వక్తవ్యం)=ఇంకను జెప్పఁబడవలయునా?" ఇతి,అమన్యత (అధ్యాహృతము)=అని,తలంచెను.

"నేను, పెక్కు నూఱామడలదూరమునైనను దాఁటంగలను; అట్టినేను, నూఱామడలుగల యీసముద్రముదాఁటితినని యేమియాశ్చర్యము?" అని,హనుమంతుండుతలంచెను.

అని, తాత్పర్యము.

స తు వీర్య వతాం శ్రేష్ఠః ప్లవతామపి చోత్తమః
జగామ వేగవాన్ లంకాం లంఘయిత్వా మహోదధిమ్. ౫

టీక॥వీర్యవతాం= పరాక్రమముగలవారిలోపల; శ్రేష్ఠః= మేటియయినవాఁడును; ప్లవతామపి= ఎగురువారిలోపలను;ఉత్తమశ్చ=శ్రేష్ఠుఁడును; వేగవాన్=అధికమయినవడిగలవాఁడునగు; సతు=ఆహనుమంతుండు మాత్ర

ము; మహోదధిం=గొప్ప సముద్రమును; లంఘయిత్వా=దాటి ; లంకాం=లంకను;జగామ=పొందెను.

అందఱువానరులున్నను, ఎవ్వరును సాహసింపకుండఁగా,నాహనుమంతుండుమాత్రము, పరాక్రమ వంతులలో శ్రేష్ఠుండు నెగురువారిలో నుత్తముండు వేగవంతుండుఁగావున , మహాసముద్రంబును దాఁటి,లంకఁజేరంగలిగెను.

అని, తాత్పర్యము.

శాద్వలానిచ నీలాని గంధవంతి వనానిచ
గండవంతిచ మధ్యేన జగామ నగవంతిచ. ౬

టీక॥సః(అధ్యాహృతము)=ఆహనుమంతుఁడు;నీలాని=నల్లనివయిన;శాద్వలానిచ=లేఁతపచ్చికగల నేలలను ; గంధవంతి=మంచివాసనగలవియు;గండవంతి=పెద్దఱాళ్లుగలవియును ; నగవంతిచ=పర్వతములు (చిన్నకొండ లనుట) గలవియునగు;వనానిచ=అడవులను; మధ్యేన=నడిమిమార్గము చేత; జగామ=పొందెను.

ఆహనుమంతుండు,నల్లని లేఁత పచ్చికభూములను, మంచివాసనగలిగి పెద్దఱాళ్లను జిన్నకొండలనుగలిగియుండునడవులను,మధ్యమార్గంబునం బూచుచుఁ,బోయెను.అని, తాత్పర్యము.

శైలాంశ్చ తరుసంఛన్నాన్ వనరాజీశ్చ పుష్పితాః
అభిచక్రామ తేజస్వీ హనుమాన్ ప్లవగర్షభః. ౭

టీక॥ తేజస్వీ=గొప్పపరాక్రమము గలవాఁడును; ప్లవగర్షభః= వానరశ్రేష్ఠుండునగు;హనుమాన్=హనుమంతుండు; తరుసంఛన్నాన్= వృక్షముల చేఁ గప్పఁబడిన;శైలాంశ్చ=పర్వతములను (శిఖరంబులననుట); పుష్పితాః= పూచియుండు; వనరాజీశ్చ=అడవుల పఙ్క్తులను;అభిచక్రామ=దాటెను.

మహాపరాక్రమశాలియువానరశ్రేష్ఠుండనగు హనుమంతుండు,దట్టముగా వృక్షంబులుగలిగిన శిఖరంబులను , జక్కఁగాఁ బూచి యుండు నడవులను, దాఁటిపోయెను.

అని, తాత్పర్యము.

స తస్మిన్నచలే తిష్ఠన్ వనాన్యుపవనానిచ

స ౨

టీక॥సః = ఆహనుమంతుండు;తస్మిన్=ఆ; అచలే=లంబపర్వతమందు; తిష్ఠన్=ఉండుచు; వనాని=అడవులను; ఉపవనానిచ=ఉద్యానంబులను;దదర్శ (అధ్యాహృతము)=చూచెను.

ఆహనుమంతుండాలంబపర్వతంబునందుండి,యడవులను, లంకాపట్టణమునకుం జేరిన యుద్యాన వనంబులనుం, జూచెను.

అని, తాత్పర్యము.

స నగాగ్రే చ తాం లంకాం దదర్శ పవనాత్మజః. ౮

టీక॥సః=ఆ;పవనాత్మజః = వాయువుకొడుకైన హనుమంతుండు; స నగాగ్రే=త్రికూటపర్వతముయొక్క,శిఖరమందు; స్థితాం(అధ్యాహృతము)=ఉన్న; లంకాంచ=లంకాపురినింగూడ; దదర్శ=చూచెను.

వాయుదేవునికుమారుండగునాహనుమంతుండు, ఆలంబపర్వతమునందుండి,త్రికూటపర్వతముశిఖరమందున్నలంకాపట్టణమునుంజూచెను.

అని, తాత్పర్యము.

సరళాన్ కర్ణికారాంశ్చ ఖర్జూరాంశ్చ సుపుష్పితాన్
ప్రియాళా న్ముచుళిందాంశ్చ కుటజా న్కేతకానపి. ౯
ప్రియంగూన్ గంధపూర్ణాంశ్చ నీపాన్ సప్తచ్ఛదాం స్తథా
అసనాన్ కోవిదారాంశ్చ కరవీరాంశ్చ పుష్పితాన్. ౧౦
పుష్పభారనిబద్ధాంశ్చ తథా ముకుళితానపి
పాదపాన్ విహగా కీర్ణాన్ పవనాధూతమస్తకాన్. ౧౧
హంసకారండవాకీర్ణాః వాపీః పద్మోత్పలాయుతాః
ఆక్రీడాన్ వివిధాన్ రమ్యాన్ వివిధాంశ్చ జలాశయాన్. ౧౨
సంతతాన్ వివిధైర్వృక్షై స్సర్వర్తు ఫలపుష్పితైః
ఉద్యానానిచ రమ్యాణి దదర్శ కపికుంజరః. ౧౩

టీక॥కపికుంజరః= వానరశ్రేష్ఠుండగుహనుమంతుండు; సరళాన్=సరళ

వృక్షంబులను; కర్ణికారాంశ్చ=కొండగోఁగుచెట్లను; సుపుష్పితాన్ = చ

క్కఁగాఁబూచియుండు; ఖర్జూరాంశ్చ = ఖర్జూరవుచెట్లను ; ప్రియాళ్ఞాః=మోరటిచెట్లను; ముచుళిందాంశ్చ=నిమ్మచెట్లను;కుటజాః=కొండమల్లెచెట్లను;కేతకానపి= మొగలిచెట్లను; గంధపూర్ణాః= వాసనతోనిండిన ; ప్రియంగూంశ్చ = పిప్పలిచెట్లను; నీపాః=మంకెనచెట్లను; సప్తచ్ఛదాంస్తథా=ఏడాకులయరఁటిచెట్లను; అసనాః=వేఁగిసచెట్లను ; కోవిదారాంశ్చ=కాంచనచెట్లను ; పుష్పితాః= పూచిన;కరవీరాంశ్చ= గన్నేరుచెట్లను; పుష్పభారనిబద్ధాంశ్చ=పూలబరువుచేఁగట్టఁబడినవియు (వంగినవియుననుట);తథా=అట్లు; ముకుళితానపి= మొగ్గలుగల్గినవియును ; విహగాకీర్ణాః=పక్షులచే వ్యాపింపఁబడినవియు;పవనాధూతమస్తకాః = గాలిచేఁగదలింపఁబడినశిఖరములుగలవియునగు; పాదపాః= చెట్లను; హంసకారండవాకీర్ణాః = హంసలచేతను, కన్నెలేళ్లచేతను వ్యాపింపఁబడినవియును; పద్మోత్పలాయుతాః = తామరపూలతోనుగలువలతోను గూడినవియునగు; వాపీః = నడబావులును; వివిధాః = నానావిధములును; రమ్యాః=మనోహరంబులునగు ; అక్రీడాః = పట్టణవాసులయుద్యానవనంబులను; సర్వర్తుఫలపుష్పైః=సమస్తములయినఋతువులయందుఁగల్గుఫలములుగలవియుఁబూచినవియును ; వివిధాః = నానావిధంబులునగు;వృక్షైః=చెట్లచేత; సంతతాః=వ్యాపింపఁబడినవియు;వివిధాః=నానావిధంబులునగు;జలాశయాంశ్చ= కోనేటులను;రమ్యాణి = సుందరంబులయిన;ఉద్యానానిచ= రాజుయొక్కయుద్యానవనంబులను;దదర్శ=చూచెను.

వానరశ్రేష్ఠుండగుహనుమంతుండు, ఆలంబపర్వతంబునందుండి,లంకాపురిచుట్టునుండు,సరళంబులుఁగొండ గోఁగులుఁజక్కఁగాఁ బూచియున్న ఖర్జూరంబులు మోరటులుజంబీరంబులుఁగొండమల్లెలు మొగలులుమంచివాసన గల పిప్పళ్లుమంకెనలు నేఁడాకులయరంటులువేఁగిసలుఁగాంచనములుఁ బుష్పితంబులగు గన్నేరులు మొదలగు వృక్షంబులను, మఱియుఁజక్కఁగాఁ బూచియున్నందునఁ బూలబరువునంజేసివంగినవియునట్లుమొగ్గలువిడిచి యుండినవియుఁబక్షులచే నాశ్రయింపఁబడి గాలికింగదలుకొమ్మలుగలవియునగు వృక్షంబులను,హంసలుఁగారండవంబులు మొదలగుపక్షులచేమనోహరంబులై కమలం

లంబులుఁగలువలుంగలిగియొప్పుచుండు నడబావులను,నానావిధంబులగు సుందరంబులయిన పౌరజనోద్యానంబులను, సమస్తఋతువులంగలుగుఫలంబులును పుష్పంబులునుంగల నానావిధంబులగు వృక్షంబులచేనొప్పుచుండు పలుదెఱంగులయినకోనేఱులను,మఱియు మనోహరంబులగు రాజోద్యానంబులనుం, జూచెను. అని, తాత్పర్యము.

సమాసాద్య చ లక్ష్మీవాన్ లంకాం రావణపాలితామ్
పరిఖాభి స్సపద్మాభి స్సోత్పలాభి రలంకృతామ్. ౧౪
సీతాపహరణార్థేన రావణేన సురక్షితామ్
సమంతా ద్విచరద్భిశ్చ రాక్షసై రుగ్రధన్విభిః. ౧౫
కాంచనేనా వృతాం రమ్యాం ప్రాకారేణ మహాపురీమ్
గృహైశ్చ గ్రహసంకాశై శ్శారదాంబుదసన్నిభైః. ౧౬
పాండురాభిః ప్రతోళీభి రుచ్చాభి రభిసంవృతామ్
అట్టాలకశతాకీర్ణాం పతాకాధ్వజమాలినీమ్. ౧౭
తోరణైః కాంచనై ర్దివ్యై ర్లతాపఙ్క్తి విచిత్రితైః
దదర్శ హనుమాన్ లంకాం దివి దేవపురీం యథా. ౧౮

టీక॥లక్ష్మీవాన్=కాంతిగలు; హనుమాన్=హనుమంతుండు;రావణపాలితాం = రావణునిచేఁబాలింపఁబడిన; లంకాం=లంకాపట్టణమును; సమాసాద్యచ=చేరియు;సపద్మాభిః = తామరపూలతోఁ గూడినవియును; సోత్పలాభిః=కలువలతోఁగూడినవియునగు;పరిఖాభిః=అగడ్తలచేత; అలంకృతాం= అలంకరింపఁబడినదియును; సీతాపహరణార్థేన= సీతయొక్కయపహరించుటయనెడుప్రయోజనముచేత; రావణేన=రావణునిచేతను; సమంతాత్= అంతటను;విచరద్భిః=తిరుగుచుండు;ఉగ్రధన్విభిః=భయంకరంబులగువిండ్లుగల;రాక్షసైశ్చ=రాక్షసులచేతను; సురక్షితాం= చక్కఁగాఁగాపాడఁబడినదియును;కాంచనేన=బంగారువికారమయిన;ప్రాకారేణ=ప్రహరిచేత; ఆవృతాం=చుట్టఁబడినదియును; శారదాంబుదసన్నిభైః = శరదృతువునందలిమే

ఘుంబులతోసమానములైనవియు; గ్రహసంకాశైః= చంద్రుండుమొదలగు గ్రహంబులతోసమానములునగు; గృహైశ్చ=ఇండ్లచేతను; పాండురాభిః=తెల్లనివియును; ఉచ్చాభిః=ఉన్నతములునగు(వీధులయందుఁదెల్లఁదనమునౌన్నత్యములేకున్ననువాని ప్రక్కనుండుగృహంబుల సంబంధంబునంజేసి యారోపింపఁబడినవి); ప్రతోళీభిః=వీధులచేత; అభిసంవృతాం = అంతటనుగప్పఁబడినదియును, వ్యాపింపఁబడినదియునను ట; అట్టాలకశతాకీర్ణాం=కోటబురుజులయొక్క నూఱులచేవ్యాపింపఁబడినదియును; పతాకాధ్వజమాలినీం, పతాకా=చిత్తరువువ్రాసినటెక్కెములయొక్కయు, ధ్వజ=మత్స్యమకరాదులచేనంకితంబులయిన రాజచిహ్నంబులగు టెక్కెములయొక్కయు, మాలినీం=పఙ్క్తులుగలదియును; కాంచనైః=బంగారువికారములును; దివ్యైః = శ్రేష్ఠములును; లతాపఙ్క్తివిచిత్రితైః=తీఁగెలవంటిరేఖలచేఁజిత్తరువులువ్రాయఁబడినవియునగు; తోరణైః= ద్వారములతో; యుతాం(అధ్యాహృతము)=కూడినదియునగు; దివి=స్వర్గమునందు; స్థితాం(అధ్యాహృతము)=ఉన్న; దేవపురీంయథా= దేవతలపట్టణమగునమరావతివలె నున్నదియునగు; మహాపురీం= గొప్పపట్టణమయిన; లంకాం= లంకను; దదర్శ=చూచెను.

విజయసూచకంబగుకాంతి నొంది యుండునాహనుమంతుండు, అట్లురావణునిచేఁబాలింపఁబడులంకాపురిం జేరి, కమలంబులను గలువలనుంబోలుచున గడ్డలచేఁజుట్టఁబడి, సీతనపహరించి యుండుటంజేసి, యుద్ధంబునకు రాముండువచ్చుననుశంకవలన, రావణుని చేతను, భయంకరంబులగుధనువులు ధరించియంతటనుండిరుగుచుఁ గాచుచుండురాక్షసులచేతను, ఎవ్వరును లోనికిం జొరకుండునట్లు చక్కఁగా రక్షింపఁబడుచుఁ, గాంచనమయంబగు ప్రాకారంబుచేనావృతంబై, రమణీయంబై, తెల్లగానత్యున్నతంబులయి యుంటంజేసి శరత్కాలంబునందలి మేఘంబులను జంద్రశుక్రాది గ్రహంబులనుం బోలు గృహంబుల నొప్పు చుండు వీధులం బూర్ణంబై, లెక్కలేనికోటబురుజులు గలిగి, సాధారణములగు టెక్కెములను రాజకీయంబులగుధ్వజంబులనుం బోలుచుచు, హిరణ్మయంబులై దివ్యంబులై తీఁగెలంబోలు రేఖలం జిత్రితంబులై యుండుద్వారంబులనలంకృతంబై, స్వర్గంబుననుండు నమరావతియుంబోలెఁ

జూపట్టుచుండు,లంకాపురిం జూచెను. అని, తాత్పర్యము.



గిరిమూర్ధ్ని స్థితాం లంకాం పాండురై ర్భవనై శ్శుభైః
దదర్శ స కపిశ్రేష్ఠః పుర మాకాశగం యథా. ౧౯

టీక॥ కపిశ్రేష్ఠః=వానరులలో మేటియగు; సః=ఆహనుమంతుండు; పాండురైః=తెల్లనివియును; శుభైః=మంగళకరంబులునగు; భవనైః = గృహంబులతో; యుక్తాం(అధ్యాహృతము)=కూడినదియును; గిరిమూర్ధ్ని=త్రికూటపర్వతముయొక్క శిఖరమునందు; స్థితాం=ఉన్నదియును, కావుననే; ఆకాశగం=ఆకాశమునుబొందియున్న; పురంయథా(స్థితాం)= పట్టణమువలెనున్నదియునగు; లంకాం=లంకాపట్టణమును; దదర్శ=చూచెను.

వానరశ్రేష్ఠుండగు నాహనుమంతుండు, సున్నముపూసియుంటంజేసి తెల్లనివై మంగళకరంబులైనగృహంబులుగలిగి పొడవైనత్రికూట శిఖరంబునందుండునదికావున, ఆకాశమునందుండు పట్టణంబనందగి యొప్పుచున్నలంకాపట్టణంబుంజూచెను. అని, తాత్పర్యము.

“లంకంజూచెను” అని పలుమాఱు చెప్పుట, లంకలోనున్నయితరవిశేషంబులం జెప్పుటకును, మఱికొన్ని యుప

మానంబులుం జెప్పుటకును, అని, తెలియునది.

పాలితాం రాక్షసేంద్రేణ నిర్మితాం విశ్వకర్మణా
ప్లవమానా మివాకాశే దదర్శ హనుమా న్పురీమ్. ౨౦
("హనుమాన్కపిః" అనిపాఠాంతరము.)

టీక॥ కపిః (పాఠాంతరమందు)= కోఁతియయిన; హనుమాన్= హనుమంతుఁడు; రాక్షసేంద్రేణ= రాక్షసులకుఁబ్రభువయిన రావణుని చేత; పాలితాం=రక్షింపఁబడినదియు; విశ్వకర్మణా= విశ్వకర్మ చేత; నిర్మితాం= చేయఁబడినదియును; ఆకాశే=ఆకాశమునందు; ప్లవమానామివ (స్థితాం)= తేలుచున్నది వలెనున్నదియునగు; పురీం=లంకాపట్టణమును; (పాఠాంతరమందు) పురీం(అధ్యాహృతము)= లంకాపట్టణమును; దదర్శ=చూచెను.

ఆహనుమంతుండు, రాక్షసులకం దఱకుఁబ్రభువయిన రావణునిచేరక్షింపఁబడుచు, విశ్వకర్మచే నిర్మింపఁబడి, పర్వతశిఖరంబున నున్నదగుటం జేసి, యాకాశంబునం దేలుచుండునట్లు చూపట్టుచున్నలంకాపట్టణంబుఁ జూచెను. అని, తాత్పర్యము.

వప్రప్రాకారజఘనాం విపులాంబునవాంబరామ్
శతఘ్నీశూలకేశాంతా మట్టాలకవతంసకామ్. ౨౧
మనసేవ కృతాం లంకాం నిర్మితాం విశ్వకర్మణా

టీక॥ హనుమాన్= (అధ్యాహృతము)=హనుమంతుండు; వప్రప్రాకారజఘనాం=కోటకొంతడును గోటగోడయునెమొలక్రింది భాగముగాఁగలదియును; విపులాంబునవాంబరాం= అధికమయినసీళ్లుగలసముద్రంబె నూతనవస్త్రముగాఁగలదియును; శతఘ్నీశూలకేశాంతాం= నాలుగుమూరల నిడివిగలయినుపముండ్లకఱ్ఱలును శూలంబులునె వెండ్రుకలునువాని మొనలును గాఁగలదియును; అట్టాలకవతంసకాం= కోటబురుజులె చెవిమీఁదియలంకార పుష్పంబులు గాఁగలదియును; విశ్వకర్మణా= విశ్వకర్మ చేత; నిర్మితాం=చేయఁబడినదియును; మనసా=మనసుచేత; కృతామివ(స్థితాం)=చేయఁబడినదివోలె

నున్నదియగు; లంకాం=లంకను; దదర్శ (అధ్యాహృతము)=చూచెను.

హనుమంతుండు, కోటకొఱడులును కోటగోడలును జఘనముగాను, సముద్రంబునూతనవస్త్రంబుగాను, నాలుగుమూరలనిడివిగల యినుపముండ్ల కఱ్ఱలు శూలంబులును దల వెండ్రుకలుగాను, గోటబురుజులు చెవిమీఁదియలంకారపుష్పంబులుగాను, ఒప్పుచుండఁగా, సుందరవనితయుంబోలె శోభిల్లుచు, వాస్తవంబుగా విశ్వకర్మచే నిర్మింపఁబడినదయ్యు, మహానుభావుండెవ్వండో మనంబునసె సృజించియుండును" అని మెచ్చందగియుండు, నాలంకాపురిం జూచెను. అని, తాత్పర్యము.

ద్వార ముత్తర మాసాద్య చింతయామాస వానరః. ౨౨

టీక॥ వానరః=హనుమంతుండు; ఉత్తరం= ఉత్తరపుదిక్కునందు; ద్వారం=వాకిలిని; ఆసాద్య=పొంది; చింతయామాస=ఆలోచించెను.

హనుమంతుండు, అట్టులాలంకాపురియుత్తరపు దిక్కునందలిద్వారంబుఁ జేరి, యాలోచించెను.

అని, తాత్పర్యము.

కైలాసశిఖరప్రఖ్యా మాలిఖంతీ మివాంబరమ్
డీయమానా మి వాకాశ ముచ్ఛ్రితై ర్భవనోత్తమైః. ౨౩
సంపూర్ణాం రాక్షసై ర్ఘోరై ర్నాగై ర్భోగవతీ మివ
అచింత్యాం సుకృతాం స్పష్టాం కుబేరా ధ్యుషితాం పురా. ౨౪
దంష్ట్రిభి ర్బహుభి శ్శూరై శ్శూలపట్టసపాణిభిః
రక్షితాం రాక్షసై ర్ఘోరై ర్గుహా మాశీవిషైరివ. ౨౫
తస్యాశ్చ మహతీం గుప్తిం సాగరంచ నిరీక్ష్యసః
రావణంచ రిపుం ఘోరం చింతయామాస వానరః. ౨౬

టీక॥ సః=ఆ; వానరః = హనుమంతుండు; కైలాసశిఖరప్రఖ్యాం= కైలాసపర్వతముయొక్క శిఖరముతోసమానమయినదియును; ఉచ్ఛ్రితైః=ఉన్నతములయిన; భవనోత్తమైః=గృహశ్రేష్ఠములచేత; అంబరం=ఆకాశమును ; ఆలిఖంతీమివ(స్థితాం) = ఒరయుచున్నదిపోలెనున్నదియును; ఆకాశం= ఆకా




శమునుగూర్చి; డీయమానామివ (స్థితాం) = ఎగురుచున్నదివోలెనున్నదియును; ఘోరైః= భయంకరులగు; రాక్షసైః=రాక్షసులచేత ; సంపూర్ణాం=నిండినదియును, కావుననే; నాగైః=సర్పములచేత; సంపూర్ణాం (అధ్యాహృతము)=నిండిన; భోగవతీమివ(స్థితాం)=భోగవతీపురివలెనున్నదియును;అచింత్యాం= ఎన్నఁగూడనిదియును;సుకృతాం=చక్కఁగా నిర్మింపఁబడినదియును; స్పష్టాం=వెల్లడియయినదియును;పురా=మున్ను;కుబేరాధ్యుషితాం=కుబేరునిచేనధిష్ఠింపఁబడినదియును;దంష్ట్రిభిః=కోఱలుగలవారును; బహుభిః=అనేకులును;శూరైః=యుద్ధమునందుభయములేని వారును; శూలపట్టిసపాణిభిః=శూలములును అడ్డకత్తులును హస్తములందుఁగలవారును;ఘోరైః=భయంకరులగు;రాక్షసైః=రక్కసులచేత; రక్షితాం=కాపాడఁబడినదియును, కావున; ఆశీవిషైః=సర్పములచేత;రక్షితాం= (అధ్యాహృతము)కాపాడబడిన; గుహామివ(స్థితాం)=గుహయుంబోలె నున్నదియునగు;లంకాం (అధ్యాహృతము)=లంకను; తస్యాః=ఆలంకయొక్క; మహతీం=గొప్పదియగు; గుప్తించ=కాపాడువిధమును;సాగరంచ= సముద్రమును; ఘోరం=భయంకరుండును;రిపుం=శత్రువునగు;రావణంచ= రావణునిని; నిరీక్ష్య=చూచి ; చింతయామాస=ఆలోచించెను.

ఆహనుమంతుండు, తెల్లగానత్యున్నతంబై యుంటంజేసి, కైలాసశిఖరంబుంబోలుచు నున్నతంబులగు మేలయినగృహంబులుగలుగుటంజేసి, యాకాశంబునొరయుచున్నదివోలె నాకాశంబునకెగిరిపోవునదివోలెఁ జూపట్టుచు, భయంకరులగురాక్షసులచేసంపూర్ణంబై సర్పంబులనిండియుండు భోగవతీపురియుంబోలెఁబ్రకాశించుచు,మనంబుననెన్నుటకునలవిగానిదై, విశ్వకర్మచేఁజక్కఁగానిర్మింపఁబడి,యన్నిటనుస్పష్టంబై, పూర్వము కుబేరున కునికిపట్టైనదై, యిప్పుడా కుబేరునకుంగూడలోనికింజొరనలవిగానిదై, కోఱలుగల్గి శూలంబులఁ బట్టిసంబులఁగేలందాల్చియుండుశూరులగుననేకరాక్షసులచేరక్షితంబై,సర్పంబులచేరక్షింపఁబడుగుహయుంబోలెవెలుఁగుఁ బుట్టించుచున్న, యాలంకాపట్టణంబుఁజూచి, దానిరాక్షసులురక్షించురీతినరసి దాఁటనలవిగానిసముద్రముఁదలంచుకొని, రావణునిభయంకరుండగు, శత్రునిగాఁదెలిసికొని,




యిట్లని,యాలోచించెను. అని, తాత్పర్యము.

ఆగత్యాపీహ హరయో భవిష్యంతి నిరర్థకాః
నహి యుద్ధేన వై లంకా శక్యా జేతుం సురైరపి. ౨౭

టీక॥హరయః=వానరులు; ఇహ= ఇచ్చటికి;ఆగత్యాపి=వచ్చియును; నిరర్థకాః=ప్రయోజనములేనివారలు;భవిష్యంతి=కాఁగలరు. లంకా=లంకాపట్టణము; యుద్ధేన = యుద్ధముచేత; ("వై" అనునది పాదపూరణార్థము) సురైరపి= దేవతలచేతనుంగూడ; జేతుం=జయించుటకు; శక్యానహి=అలవియయినదికాదుగదా!

వానరులు, దుస్తరంబగు నీసముద్రంబు దాఁటి యిచ్చటికివచ్చుటయేదులభంబు; ఈలంకను దేవతలుఁ గూడ యుద్ధంబునజయింపంజాలరు గావున, అట్లురాఁగలిగి వచ్చినను ప్రయోజనంబులేదు.

అని, తాత్పర్యము.

ఇమాంతు విషమాం దుర్గాం లంకాం రావణపాలితామ్
ప్రాప్యాపి స మహాబాహుః కిం కరిష్యతి రాఘవః. ౨౮

టీక॥విషమాం=కష్టమయినదియు; దుర్గాం= ప్రవేశింపఁగూడనిదియును; రావణపాలితాం= రావణునిచేర క్షింపఁబడినదియునగు; ఇమాం=ఈ; లంకాంతు=లంకను; ప్రాప్యాపి=పొందియును; మహాబాహుః=పెద్దచేతులుగల; సః=అట్టి, ఏడుసాలవృక్షంబులఁ బర్వతంబునుభూమినిఒక్కబాణంబున ఛేదించిన,యనుట; రాఘవః=రాముఁడు;కిం=ఏమి; కరిష్యతి= చేయఁగలఁడు?

రాముఁడు,మహాబాహుండయ్యును సప్తసాలంబులఁ బర్వతంబు భూమినొక్కబాణంబునవిదళించినమహాపరాక్రమశాలియయ్యును,నిచ్చటికి,దుస్తరంబగుసముద్రంబు దాఁటివచ్చుటయేయసాధ్యంబు; అట్లురాఁగలిగివచ్చినను, అతివిషమంబై,లోనికింజొరనశక్యంబై, రావణునిచేఁబాలింపఁబడుచున్న యీలంకయం,దేమిసేయఁగలఁడు?

అని, తాత్పర్యము.

అవకాశో న సాంత్వస్య రాక్షసేష్వభిగమ్యతే
నదానస్య నభేదస్య నైవయుద్ధస్య దృశ్యతే. ౨౯

టీక॥ సాంత్వస్య=మంచిమాటకు; అవకాశః= ఎడము; రాక్షసేషు = రాక్షసులయందు; నాభిగమ్యతే= తెలియఁబడదు. దానస్య=ఈవికిని;న(అవకాశః)= ఎడములేదు . భేదస్య=ఒండొరులకుఁగలహముఁబుట్టించుటకును , న=లేదు; యుద్ధస్య=యుద్ధమునకు ; నైవదృశ్యతే=చూడఁబడనేలేదు, అగపడనేలేదనుట.

రాక్షసులు అతిక్రూరులు కావున , వారలయందుసామోపాయము పనికిరాదు; వారలకుధనంబు పుష్కలంబుగానున్నది కావున, దానోపాయము నుపయోగించదు,బలగర్వితులు కావున, భేదోపాయంబునను బ్రయోజనంబులేదు;అతిబలిష్ఠులు, కావున, యుద్ధంబునకవకాశంబె లేదు.అని, తాత్పర్యము.

చతుర్ణామేవ హి గతి ర్వానరాణాం మహాత్మనామ్
వాలిపుత్రస్య నీలస్య మమ రాజ్ఞశ్చ ధీమతః. ౩౦

టీక॥మహాత్మనాం= అధికమయిన పరాక్రమముగల; వానరాణాం=వానరులలోపల; వాలిపుత్రస్య= వాలియొక్కకొమరుఁడయినయంగదునకును; నీలస్య=నీలునకును;మమ=నాకును; ధీమతః=అధికమయినబుద్ధిగల; రాజ్ఞశ్చ= రాజయినసుగ్రీవునకును;చతుర్ణామేవ=నల్వురకే; గతిః=ఇక్కడికి, వచ్చుట; సంభావితా(అధ్యాహృతము)=చక్కఁగాఁదలంపఁబడినది.

మహాపరాక్రమశాలులగువానరులలోపల,వాలికుమారుండగు నంగదుండును నీలుండును నేనునుబుద్ధిమంతుండగువానరరాజుండైన సుగ్రీవుండును, ఈనల్వురుమాత్రంబె, సముద్రంబు దాఁటియిచ్చటికి రాఁగలరు;మఱియెవ్వరికినలవిగాదు.అని, తాత్పర్యము.

యావజ్జానామి వైదేహీం యది జీవతివా నవా
తత్రైవ చింతయిష్యామి దృష్ట్వా తాం జనకాత్మజామ్. ౩౧

టీక॥ "యదిజీవతివా= ("యది" యనునది సందేహవాచకము. "వా" అనునది పక్షవాచకము.) బ్రతికియున్నదా? లేదా? ఇదం(అధ్యాహృతము)= దీనిని; వైదేహీం=సీతనుగూర్చి; జానామియావత్ = (భవిష్యదర్థమందు లట్) తెలిసికొనఁబోవుచునెయున్నాను. యదిజీవతి(అధ్యాహృతము)= బ్రతుకియుండునేని; తాం=ఆ; జనకాత్మజాం=జనకునికూఁతురయినసీతను; దృష్ట్వా=చూచి; తత్రైవ=అప్పుడె; చింతయిష్యామి=ఆలోచించెదను.

ఇప్పుడెందుకీవిచారము? సీతబ్రతికియున్నాదా? లేదా? యని తెలిసికొనఁబోవుచునేయున్నాను; బ్రతికియుండునేని, యాసీతంజూచి, యప్పుడె, యాలోచించెదను.

అని, తాత్పర్యము.

తత స్సంచింతయామాస ముహూర్తం కపికుంజరః
గిరిశృంగే స్థిత స్తస్మిన్ రామస్యాభ్యుదయే రతః. ౩౨

టీక॥ తతః=అటుపిమ్మట; కపికుంజరః=వానరశ్రేష్ఠుండగు హనుమంతుండు; తస్మిన్=ఆ; గిరిశృంగే=లంబపర్వతముయొక్క శిఖరమునందు; స్థితః=ఉన్నవాఁడై; రామస్య=రామునియొక్క; అభ్యుదయే=అభివృద్ధియందు; రతః=ఆసక్తుఁడై; ముహూర్తం=కొంచెము సేపు; సంచింతయామాస=చక్కఁగా నాలోచించెను.

అటుపిమ్మట, వానరశ్రేష్ఠుండగుహనుమంతుండు, ఆలంబపర్వతశిఖరంబునందుండి, రాముని యభ్యుదయంబుఁగోరి, మఱల, నిట్లని, చక్కఁగా నాలోచించెను. అని, తాత్పర్యము.

అనేన రూపేణ మయా న శక్యా రక్షసాం పురీ
ప్రవేష్టుం రాక్షసై ర్గుప్తా క్రూరై ర్బలసమన్వితైః. ౩౩

టీక॥ క్రూరైః=దయలేనివారును; బలసమన్వితైః=బలముతోఁ గూడినవారునగు; రాక్షసైః=రాక్షసులచేత; గుప్తా=రక్షింపఁబడిన; రక్షసాం=రాక్షసులయొక్క; పురీం=పట్టణమైన లంకను; మయా=నాచేత; అనేన=ఈ; రూపేణ=ఆకారముతో; ప్రవేష్టుం=ప్రవేశించుటకు; శక్యా న=అలవికాదు.




రాక్షసపట్టణంబగు నీలంకాపురిని, క్రూరులును బలిష్ఠులునగు రాక్షసు లంత టనురక్షించుచున్నారు; కావున, నేను, ఈరూపంబుతోనే, దీనిం బ్రవేశింపనలవి గాదు.

అని, తాత్పర్యము.

ఉగ్రౌజసో మహావీర్యా బలవంతశ్చ రాక్షసాః
వంచనీయా మయా సర్వే జానకీం పరిమార్గతా. ౩౪

టీక॥ఉగ్రౌజసః= భయంకరంబగు నుత్సాహముగలవారలును ; మహావీర్యాః=అధికమయిన పరాక్రమముగల వారలును; బలవంతశ్చ= అధికమయి నబలముగలవారలునగు; రాక్షసాః= రాక్షసులు; సర్వే=అందఱును; జానకీం=సీతను; పరిమార్గతా= వెదకు చున్న; మయా = నాచేత; వంచనీయాః= మోసపుచ్చఁదగినవారలు.

నేను, సీతను వెదకునపుడు, భయంకరంబగు నుత్సాహంబుగలవారు మహాపరాక్రమశాలులు బలవంతులునగు రాక్షసులకెవ్వరికిని, గనుపడక, వారలనందఱను, మోసపుచ్చవలయును.

అని, తాత్పర్యము.

లక్ష్యాలక్ష్యేణ రూపేణ రాత్రౌ లంకా పురీ మయా
ప్రవేష్టుం ప్రాప్తకాలం మే కృత్యం సాధయితుం మహత్. ౩౫

టీక॥మే=నాయొక్క; మహత్= గొప్పదైన; కృత్యం=కార్యమును; సాధయితుం=సాధించుటకై ; మయా= నాచేత; లక్ష్యాలక్ష్యేణ= చూడఁదగినదియుఁజూడఁదగనిదియునైన, మిక్కిలియుఁ బెద్దదియుమిక్కిలియుఁ జిన్నదియుఁగానియనుట; రూపేణ=ఆకారముతో; రాత్రౌ=రాత్రియందు; లంకా=లంకాపట్టణము; ప్రవేష్టుం=ప్రవేశించుటకు; ప్రాప్తకాలం= ఉచితము.

నేను, మిక్కిలియుఁ బెద్దరూపముతో లంకం బ్రవేశింతునేని, నన్నురాక్షసులుపట్టుకొందురు, మిక్కిలియుఁ జిన్నరూపముతోఁ బ్రవేశింతునేని, లంకాపురియంతయుఁ గలయందిరుగుటకువీలు కాదు; కావున, సీతను వెదకుట యనెడు నాదుగొప్పకార్యమును సాధించుకొనుటకై, నేను, రాత్రియందు, మిక్కి-




లియుఁ బెద్దదియుమిక్కిలియుఁ జిన్నదియుఁగాని శరీరంబువహించి,లంకంబ్రవేశించుటయుక్తము.అని, హనుమంతుండాలోచించెను. అని,తాత్పర్యము.

తాం పురీం తాదృశీం దృష్ట్వా దురాధర్షాం సురాసురైః
హనుమాన్ చింతయామాస వినిశ్చిత్య ముహుర్ముహుః. ౩౬

టీక॥హనుమాన్ = హనుమంతుఁడు; తాదృశీం=అట్టిదియును; సురాసురైః=దేవతలచేత నసురులచేతను; దురాధర్షాం=ఎదిరింపఁగూడనిదియునగు; తాం=ఆ; పురీం=లంకాపట్టణమును;దృష్ట్వా=చూచి;వినిశ్చిత్య = నిశ్చయించి;ముహుర్ముహుః=మాటిమాటికి;చింతయామాస=ఆలోచించెను.

హనుమంతుండు, పైఁజెప్పఁబడినట్లుచక్కఁగారక్షింపఁబడి దేవతలకునసురులకునెదిరింపనలవిగాకుండునాలంకాపురింబూచి, సీతనువెదకురీతినినిశ్చయించియుఁ, గార్యంబు సెడుననుభయంబునంజేసి, మాటిమాటికి, నిట్లని, యాలోచించెను.

అని,తాత్పర్యము.

కేనోపాయేన పశ్యేయం మైథిలీం జనకాత్మజాం
అదృష్టో రాక్షసేంద్రేణ రావణేన దురాత్మనా. ౩౭

టీక॥అహం (అధ్యాహృతము)= నేను; రాక్షసేంద్రేణ=రాక్షసులకుఁబ్రభువును;దురాత్మనా=దుష్టమగుస్వభావంబుగలవాఁడునగు; రావణేన=రావణునిచేత; అదృష్టః=చూడఁబడనివాఁడనై;జనకాత్మజాం= జనకునికూఁతురయిన;మైథిలీం=మిథిలయందుఁబుట్టినసీతను;కేన=ఏ;ఉపాయేన = ఉపాయముచేత;పశ్యేయం=చూతును?

రావణుం,డతిబలవంతులనివినుతికెక్కినరాక్షసులకందఱకును బ్రభుండు, దురాత్ముండును,గావున, ననుంజూచునేని,యూరకుండఁడు, దూతయనివదలఁడు,మఱి, పట్టుకొనిబంధించినానాప్రకారంబులంగాఁజేయపెట్టును; దానంజేసి,కార్యభంగంబగు;కాఁబట్టి, నేనతనికండ్లంబడకయే,జనకునికూఁతురగుసీతను,వెదకవలయును; దానికేమియుపాయంబు?

అని,తాత్పర్యము.

న వినశ్యేత్కథం కార్యం రామస్య విదితాత్మనః
ఏకామేకశ్చ పశ్యేయం రహితే జనకాత్మజామ్. ౩౮

టీక॥ విదితాత్మనః=తెలియఁబడిన పరమాత్మగల; రామస్య=రామునియొక్క; కార్యం=పని; కథం=ఎట్లు; నవినశ్యేత్=చెడకుండును? అహం(అధ్యాహృతము)=నేను; ఏకః=ఒక్కఁడనై; ఏకాం=ఒక్కతెయయిన; జనకాత్మజాం=జనకునికూఁతురయినసీతను; రహితే=ఏకాంతమునందు; (కథం)పశ్యేయంచ=ఎట్లుచూతును?

పరమాత్మజ్ఞానియగు రామునికార్యంబు సెడకుండుటకేమి యుపాయంబు? నే, నెవ్వరులేకుండునప్పుడు, ఒక్కఁడుగా నే, యేకాంతమందు, ఒక్కతేగా నేయున్నసీతఁ జూచుట, యెట్లు, పొసఁగును. అని, తాత్పర్యము.

భూతాశ్చార్థా విపద్యంతే దేశకాలవిరోధితాః
విక్లబం దూతమాసాద్య తమస్సూర్యోదయే యథా. ౩౯

టీక॥భూతాః=సిద్ధములయిన, సిద్ధప్రాయములైన, కొంచెముతక్కువగా నెఱవేఱిన, యనుట, అర్థాశ్చ=పనులును; విక్లబం=ధైర్యములేని, వివేకములేనియనుట; దూతం=భృత్యుని; ఆసాద్య=పొంది; దేశకాలవిరోధితః=దేశముచేతను గాలముచేతను విరోధముగలిగినవై; సూర్యోదయే=సూర్యునియొక్కపొడుచుటయందు; తమోయథా=చీఁకటివలె; విపద్యంతే=నశించుచున్నవి.

ఉపాయంబులచే, సిద్ధప్రాయంబులుగాఁ జేయఁబడినకార్యంబులుఁ గూడ, నాలోచించి చేయం జేతఁగానివివేకశూన్యుఁడగు దూతచేనదుపఁబడునేని, దేశకాలవిరోధంబునొంది, సూర్యోదయకాలంబునఁ జీఁకట్లు నశించునట్లు, నశించును. అని, తాత్పర్యము.

అర్థానర్థాంతరే బుద్ధిర్నిశ్చితాపి న శోభతే
ఘాతయంతి హి కార్యాణి దూతాః పండితమానినః. ౪౦

టీక॥అర్థానర్థాంతరే= కార్యాకార్యవిషయమందు; నిశ్చితా=నిర్ణ

యింపఁబడిన; బుద్ధిరపి= ఉపాయము గూడ; విక్లబం,దూతం, అసాద్య (అధ్యాహృతము)=వివేకములేనిదూతను బొంది;నశోభతే=ప్రకాశింపదు.పండితమానినః=పండితునియొక్క యహంకారముగల, తాముపండితులు కాకపోయినను బండితులకుండు నహంకారము మాత్రము గలవారైన యనుటః దూతాః=భృత్యులు; కార్యాణి=పనులను; ఘాతయంతిహి = చెఱుపుచున్నారు గదా!

తమకుఁబాండిత్యములేకపోయినను దామపండితులని యహంకరించియుండునవివేకులయినదూతలు, ఆలోచించిచేయంజేతఁగానివారలై, తమకాజ్ఞాపింపఁబడిన కార్యములను జెఱుచుదురు; కావున, రాజునుమంత్రులునుంజేరి, "ఇదికార్యము, ఇదియకార్యము" అని, యెంత యాలోచించి నిశ్చయించినను, వారినిశ్చయము, దూతయవివేకుఁడైనచో, నెంతమాత్రమునుపయోగింపదు.అని, తాత్పర్యము.

న వినశ్యే త్కథం కార్యం వైక్లబ్యం న కథం భవేత్
లంఘనంచ సముద్రస్య కథం ను న వృథా భవేత్. ౪౧

టీక॥ కార్యం=రామునిపని; కథం= ఎట్లు; నవినశ్యేత్=చెడకుండును? మమ(అధ్యాహృతము)=నాకు ; వైక్లబ్యం=వివేకములేమి; కథం=ఎట్లు; నభవేత్=కలుగకుండును? సముద్రస్య= సముద్రముయొక్క; లంఘనంచ=దాఁటుటయును; కథంను=ఎట్లు;("ను" అనునది ప్రశ్నార్థకము;వృథా = వ్యర్థము; నభవేత్=కాకుండును?

నేను,ఇప్పుడపరాహ్ణకాలంబున నెలంకంబ్రవేశింతునా? పెద్దశరీరంబుతో లంకలోనికింబోదునా?లేక , చిన్నదేహంబుదాల్చిపోదునా!ఎట్లుచేసిన రామకార్యంబుచెడకుండు? నాకువివేకశూన్యుండను పేరు రాకుండు? దుస్తరంబగునీసముద్రంబు దాఁటుట వ్యర్థంబుగాకుండు? అని, తాత్పర్యము.

మయి దృష్టేతు రక్షోభీ రామస్య విదితాత్మనః
భవే ద్వ్యర్థ మిదం కార్యం రావణానర్థ మిచ్ఛతః. ౪౨

టీక॥ మయా = నేను; రక్షోభిః = రాక్షసులచేత; దృష్టేతు = చూడఁబడినంతనె; విదితాత్మనః = తెలియఁబడినపరమాత్మగలవాఁడును; రావణానర్థం = రావణునియొక్క కీడును; ఇచ్ఛతః = కోరువాఁడునగు; రామస్య = రామునియొక్క; ఇదం = ఈ, కార్యం = పని; వ్యర్థం = ప్రయోజనములేనిది; భవేత్ = అగును.

నేను రాక్షసులకగపడుదునేని, రావణునికీడుగోరుచుండు పరమాత్మజ్ఞానియగు రామునికార్యంబంతయు, నిష్ప్రయోజనంబై, నశించును.

అని, తాత్పర్యము.

నహి శక్యం క్వచి త్స్థాతు మవిజ్ఞాతేన రాక్షసైః
అపి రాక్షసరూపేణ కిముతాన్యేన కేనచిత్. ౪౩

టీక॥ రాక్షసైః = రాక్షసులచేత; అవిజ్ఞాతేన = తెలిసికొనఁబడని; మయా (అధ్యాహృతము) = నాచేత; రాక్షసరూపేణాపి = రాక్షసులరూపముతో నైనను; క్వచిత్ = ఒకానొకచోటను; స్థాతుం = ఉండుటకు; నశక్యంహి = అలవిగాదుగదా! అన్యేన = ఇతరమయిన; కేనచిత్ = ఒకానొకరూపముతో; స్థాతుం, నశక్యమితి (అధ్యాహృతము) = ఉండుట కలవిగాదని; కిముత (వక్తవ్యం) = చెప్పఁబడవలయునా!

నేను, రాక్షసరూపముధరించిరాక్షసులలోఁగలసి, ఈలంకలోనే ప్రక్కనున్నను, రాక్షసులునన్నుంగనుఁగొందురు, అట్లుండఁగా, నింకనితరమయినవానరరూపముమొదలగునదిధరించి, వారలకుఁదెలియకుండ, నిచ్చట, నెట్లుండనేర్తుఁ? అని, తాత్పర్యము.

వాయురప్యత్ర నాజ్ఞాత శ్చరే దితి మతి ర్మమ
న హ్యస్త్య విదితం కించి ద్రాక్షసానాం బలీయసామ్. ౪౪

టీక॥ "అత్ర = ఈలంకయందు; వాయురపి = వాయువునుగూడ; అజ్ఞాతః = తెలియఁబడనివాఁడై; నచరేత్ = తిరుగఁడు." ఇతి = అని; మమ = నాయొక్క; మతిః = నిశ్చయము. బలీయసాం = అధికమయిన బలముగల; రాక్షసానాం = రాక్షసులకు; అవిదితం = తెలియఁబడనిది; కించిత్ = కొంచెమయిన

సుః నాస్తిహి=లేదుగదా!

"బలవంతులగు నీరాక్షసులకుఁ దెలియని దేదియు లేదు; కావున, వాయువుఁగూడ, రూపములేనివాఁడయ్యు, నీరాక్షసులెఱుంగకుండ నీలంకం దిరుగలేఁడని నాయభిప్రాయము.

అని. తాత్పర్యము.

లేక; ఈరాక్షసులు చాలబలవంతులు, వీరలకుఁ దెలియని దేదియు లేదు; కావున, వాయువుఁగూడ, వారలకుఁ దెలియకుండ దొంగతనముగా నీలంకం దిరుగనేరక, మఱియు వారలు బలవంతులు, కావునఁ, దన్నెఱింగిపట్టుకొని శిక్షింతురని, భయంబునఁ, దనరాక వీరలకుఁ దెల్పి, వీరలయనుమతి నొందియే, యీలంకలో, సంచరించునని, నాయభిప్రాయము. అని, తాత్పర్యము.

ఇహాహం యది తిష్ఠామి స్వేన రూపేణ సంవృతః
వినాశ ముపయాస్యామి భర్తు రర్థశ్చ హీయతే. ౪౫

టీక॥ అహం=నేను; స్వేన=నాదైన; రూపేణ=దేహముచేః సంవృతః=కప్పఁబడినవాఁడనై, కూడినవాఁడనైయనుట. ఇహ=ఈలంకయందు; తిష్ఠామియది=ఉందు నేని; వినాశం=చెఱుపును; ఉపయాస్యామి=పొందఁగలను. భర్తుః=ప్రభువగు, రాముని యొక్క; అర్థశ్చ=కార్యమును; హీయతే=చెడుచున్నది.

నేనిచ్చట, నాస్వాభావికంబగు రూపముతోఁ గూడియుందు నేని, నాకుఁగీడు వాటిల్లును; రాముని కార్యంబును జెడిపోవును.

అని, తాత్పర్యము.

త దహం స్వేన రూపేణ రజన్యాం హ్రస్వతాం గతః
లంకా మభిపతిష్యామి రాఘవ స్యార్థసిద్ధయే. ౪౬

టీక॥ తత్=అందువలన; అహం=నేను; రాఘవస్య=రాముని యొక్క; అర్థసిద్ధయే=కార్యముయొక్క నెఱవేఱుటకొఱకు; రజన్యాం=రాత్రియందు; హ్రస్వతాం=చిన్నశరీరముగలవాఁడగుటను; గతః=పొందినవాఁడనై; స్వేన=నాదైన; రూపేణ = వానరరూపముతోః యుక్తః(అధ్యాహృత

ము) = కూడినవాఁడనై; లంకాం= లంకాపురిని; అభిపత్స్యామి = ప్రవేశించెదను.

కావున, నేను, రామునికార్యంబునెఱవేఱుటకై, రాత్రియందు, సూక్ష్మంబగురూపముధరించి, నాదైన వానరరూపంబుతోనే, లంకంబ్రవేశించెదను. అని, తాత్పర్యము.

రావణస్య పురీం రాత్రౌ ప్రవిశ్య సుదురాసదామ్
విచిన్వన్ భవనం సర్వం ద్రక్ష్యామి జనకాత్మజామ్. ౪౭

టీక॥ అహం (అధ్యాహృతము)= నేను; సుదురాసదాం= ఎంతమాత్రమును బవేశింపఁగూడని; రావణస్య= రావణునియొక్క; పురీం= పట్టణమును; రాత్రౌ=రాత్రియందు; ప్రవిశ్య= చొచ్చి; సర్వం=సమస్తమయిన; భవనం=ఇంటిని; విచిన్వన్=వెదకుచు; జనకాత్మజాం=జనకునికూఁతురయిన సీతను; ద్రక్ష్యామి=చూచెదను.

నేను, ఎంతమాత్రమునుబ్రవేశింపనలవిగానిరావణునిపట్టణంబగులంకనురాత్రియందుఁబ్రవేశించి, అన్నియిండ్లనుం గలయవెదకి, సీతంజూచెదననిహనుమంతుండాలోచించెను. అని, తాత్పర్యము.

ఇతి సంచింత్య హనుమాన్ సూర్యస్యాస్తమయం కపిః
ఆచకాంక్షే తదా వీరో వైదేహ్యా దర్శనోత్సుకః. ౪౮

టీక॥ వీరః=పరాక్రమశాలియును; కపిః=కోఁతియునగు; హనుమాన్= హనుమంతుండు; ఇతి=ఇట్లు; సంచింత్య=ఆలోచించి; తదా=అప్పుడు; వైదేహ్యాః=సీతయొక్క; దర్శనోత్సుకః=చూచుటయందుత్సాహంబు గలవాఁడై; సూర్యస్య= సూర్యునియొక్క; అస్తమయం=అస్తమించుటను; ఆచకాంక్షే=కోరెను.

పరాక్రమశాలియగుహనుమంతుం, డిట్లాలోచించి, సీతంబూడఁగోరుచు, సూర్యాస్తమయంబు నెదురుసూచుచుండెను. అని, తాత్పర్యము.

సూర్యేచాస్తంగతే రాత్రౌ దేహం సంక్షిప్య మారుతిః
పృషదంశకమాత్రస్సన్ బభూవాద్భుతదర్శనః. ౪౯

టీక॥ మారుతిః=వాయువుయొక్క కొడుకైనహనుమంతుఁడు; సూర్యే=సూర్యుఁడు; అస్తంగతేచ=అస్తమింపఁగానే; రాత్రౌ=రాత్రియందు; దేహం = శరీరమును; సంక్షిప్య=చిన్నదిచేసికొని; పృషదంశకమాత్రః=పిల్లియొక్క ప్రమాణమువంటి ప్రమాణము గలవాఁడు;సన్ = అయి;అద్భుతదర్శనః=ఆశ్చర్యంబు కలిగించునట్టి చూచుట కలవాఁడు;బభూవ=ఆయెను.

వాయుదేవుని కుమారుండగు హనుమంతుండు,సూర్యుండస్తమింపఁగానే, రాత్రియందుఁ దనదేహంబునుజిన్నదిగాఁజేసి, పిల్లియంతటి ప్రమాణంబునొంది, చూపరులకాశ్చర్యంబుఁబుట్టించుచుండెను. అని, తాత్పర్యము.

ప్రదోష కాలే హనుమాం స్తూర్ణ ముత్ప్లుత్య వీర్యవాన్
ప్రవివేశ పురీం రమ్యాం సువిభక్త మహాపథామ్. ౫౦

టీక ॥ వీర్యవాన్=అధికమయినపరాక్రమముగల; హనుమాన్= హనుమంతుండు;ప్రదోషకాలే=మునిమాపుకాలంబునందు, రాత్రియారంభించుకాలంబునందనుట; తూర్ణం=శీఘ్రముగా; ఉత్ప్లుత్య=ఎగిరి; రమ్యాం= సుందరంబైనదియు; సువిభక్తమహాపథాం=చక్కఁగావిభజింపఁబడినరాజమార్గములుగలదియునగు; పురీం=లంకాపట్టణమును; ప్రవివేశ=ప్రవేశించెను, ప్రవేశింపనారంభించెననుట.

పరాక్రమశాలియగు హనుమంతుండు, ప్రదోషకాలమునందు, శీఘ్రముగాఁ, గోతులుపరుగులిడునట్లు, ఎగిరి యెగిరినడుచుచు, సుందరంబై చక్కఁగానేర్పఱుపఁబడిన రాజమార్గంబులుగలదైయుండులంకంబ్రవేశించెను. అని, తాత్పర్యము.

ప్రాసాదమాలావితతాం స్తంభైః కాంచనరాజతైః
శాతకుంభమయై ర్జాలై ర్గంధర్వ నగరోపమామ్. ౫౧
సప్తభౌమాష్టభౌమైశ్చ స దదర్శ మహాపురీమ్
తలై స్స్ఫటికసంకీర్ణైః కార్తస్వరవిభూషితైః. ౫౨

టీక॥ సః=ఆహనుమంతుఁడు;ప్రాసాదమాలావితతాం=మేడలయొక్కప

ర్ముకలచేవ్యాపింపఁబడినవియును; కాంచనరాజతైః=బంగారువికారములును వెండివికారములునగు; స్తంభైః=కంబములతోను; శాతకుంభమయైః=బంగారువికారములయిన; జాలైః=కిటికీలతోను; యుక్తాం(అధ్యాహృతము)= కూడినదియును; గంధర్వ నగరోపమాం=గంధర్వనగరముతోఁ బోలికగలదియును (నానావిధములగుమణులతోఁజేయఁబడినగోపురములు మేడలుం గలిగి యాకాశమునందుఁ దోఁచుపట్టణము,గంధర్వనగరంబనంబడును.); సప్తభౌమాష్టభౌమైశ్చ= ఏడంతస్తులుగలమేడలతోనుఎనిమిదంతస్తులు గలమేడలతోను;యుక్తాం(అధ్యాహృతము)= కూడినదియు; స్ఫటికసంకీర్ణైః=స్ఫటికమణులతోవ్యాపింపఁబడినవియును; కార్తస్వరవిభూషితైః= బంగారుచే నలంకరింపఁబడినవియునగు; తలైః= ప్రదేశములతో; యుక్తాం(అధ్యాహృతము) = గూడినదియునగు; మహాపురీం= పెద్దపట్టణమయినలంకను; దదర్శ=చూచెను.

ఆహనుమంతుండు, ఎచ్చోటంజూచినను బ్రాసాదంబులుగలిగి, బంగారుస్తంభంబులచేతను వెండిస్తంభంబులచేతను అలంకృతంబై, బంగారువికారంబులగు కిటికీలచేఁ బ్రకాశించుచు, గంధర్వనగరంబుతో సాటిసేయందగి, యేడంతస్తుల మేడలు నెనిమిదంతస్తుల మేడలును సాధారణంబుగాఁగలిగి,స్ఫటికమణులతోనిర్మింపఁబడినప్రదేశంబులను,బంగారుచే నలంకరింపఁబడిన భూములను,ఒప్పుచుండు, లంకాపురిం జూచెను.

అని, తాత్పర్యము.

వైడూర్యమణిచిత్రైశ్చ ముక్తాజాలవిభూషితైః
తలైశ్శుశుభిరే తాని భవనాన్యత్ర రక్షసామ్. ౪౩

టీక॥ అత్ర = ఈలంకయందు;రక్షసాం=రాక్షసులయొక్క; తాని=ఆ;భవనాని=గృహంబులు; వైడూర్యమణిచిత్రైశ్చ= వైడూర్యమణులచే నాశ్చర్యముగలిగించుచుండునవియును; ముక్తాజాలవిభూషితైః=ముత్తెములయొక్క సమూహముచే నలంకరింపఁ బడినవియునగు;తలైః=ప్రదేశములచేత; శుశుభిరే=ప్రకాశించినవి.

లంకాపురియందుండు రాక్షసులగృహంబులన్నియు, వైడూర్యమణులచే నొప్పుపఁబడి,ముత్తెములచేనలంకరింపఁ

బడియున్న ప్రదేశంబులచే నెంతయు నొప్పుచుండినవి. అని, తాత్పర్యము.

కాంచనానిచ చిత్రాణి తోరణానిచ రక్షసాం
లంకా ముద్ద్యోతయామాసు స్సర్వత స్సమలంకృతామ్. ౫౪

టీక॥ రక్షసాం=రాక్షసుల యొక్క; కాంచనానిచ= బంగారువికారములును; చిత్రాణి=నానావిధముల గురంగులు గలవియునగు; తోరణానిచ= వెలుపలిద్వారములును; సర్వతః=అంతటను; సమలంకృతాం= చక్కఁగా నలంకరింపఁబడిన; లంకాం=లంకాపురిని; ఉద్ద్యోతయామాసుః=ప్రకాశింపఁజేసినవి.

బంగారువికారంబులై పలుదెఱంగుల గురంగులు దీర్చియుండు నా రాక్షసుల బహిర్ద్వారములును, అంతటను అలంకరింపఁబడియుండు నా లంకను, మ అంత ప్రకాశముకలుగఁజేసినవి.

అని, తాత్పర్యము.

అచింత్యా మద్భుతా కారాం దృష్ట్వా లంకాం మహాకపిః
ఆసీ ద్విషణ్ణో హృష్టశ్చ వై దేహ్యా దర్శనోత్సుకః. ౫౫
స పాండురోద్విద్ధవిమానమాలినీం
మహార్హజాంబూ నదజాలతోరణాం
యశస్స్వినీం రావణబాహుపాలితాం
క్షపాచరై ర్భీమబలై స్సమావృతామ్. ౫౬

టీక॥ వైదేహ్యాః=సీతయొక్క; దర్శనోత్సుకః=చూచుటయందు త్సాహము గల; సః=ఆ; మహాకపిః=పెద్దకోఁతియగు హనుమంతుండు; అచింత్యాం= ఎన్నఁదగనిదియును; అద్భుతాకారాం= ఆశ్చర్యము గలిగించునాకారముగలదియును; పాండురోద్విద్ధవిమాన మాలినీం=తెల్లనివియు నన్నతములు నైన మేడంతస్తుల మేడలయొక్క పఙ్క్తులు గలదియును; మహార్హ జాంబూనదజాలతోరణాం= శ్రేష్ఠములయిన బంగారువికారములుగల కిటికీలుగల వెలుపలిద్వారములుగలదియును; యశస్స్వినీం = మంచికీర్తిగలదియును; రావణబాహుపాలితాం=రావణునియొక్క భుజముచే రక్షింపఁబడినదియును; భీమబలైః=

భయంకరమయినబలముగలః తుపాచరైః=రాక్షసులచేత; సమావృతాం=చుట్టఁబడినదియునగు;లంకాం=లంకాపట్టణమును;దృష్ట్వా=చూచి;విషణ్ణః=దుఃఖముగలవాఁడును; హృష్టశ్చ=సంతసించినవాఁడును;ఆసీత్=ఆయెను.

ఆహనుమంతుండు,ఎన్నుటకుంగూడనలవిగానిదై, చూపరుల కాశ్చర్యంబుఁబుట్టించునదై, తెల్లగానున్నతములయియుండు నేడంతస్తుల మేడలంబూర్ణంబై, మంచిబంగారముతోఁజేయబడినకిటికీలనొప్పుచుండు తోరణంబులనలంకృతంబయి,కీర్తిసంపన్నంబై,రావణునిచేభుజబలంబునఁ బాలింపఁబడుచు,నంతటనువ్యాపించియుండు భయంకరబలులగురాక్షసులచే రక్షింపఁబడుచున్న,లంకంబూచి,“ఆహా! దీనివానరులెట్లులోఁగొనుదురు?” అనిదుఃఖంబును సీతంజూడఁ గోరువాఁడు కావున, “సీతంజూడఁగలనుగదా!” యని, సంతోషంబునుం,బొందెను.

అని, తాత్పర్యము.

చంద్రోపి సాచివ్య మివాస్య కుర్వ౯
తారాగణై ర్మధ్యగతో విరాజ౯
జ్యోత్స్నావితానేన వితత్య లోక
ముత్తిష్ఠతే నైకసహస్రరశ్మిః. ౫౭

టీక॥ చంద్రోపి=చంద్రుఁడును;నైకసహస్రరశ్మిః=పెక్కు-వేల కిరణంబులుగలవాఁడై;జ్యోత్స్నావితానేన= వెన్నెలయొక్క-యతిశయముచేత ; లోకం=ప్రపంచమును; వితత్య=విరివిగాజేసి; అస్య=ఈహనుమంతునకు; సాచివ్యం=తోడ్పాటును ; కుర్వన్నివ=చేయువాఁడువోలె ; విరాజ౯=ప్రకాశించుచు ; మధ్యగతః= నడుముఁబొందినవాఁడై; తారాగణైః (సహ)=నక్షత్రములయొక్క-సమూహములతోఁగూడ;ఉత్తిష్ఠతే=లేచుచున్నాఁడు; లేచెననుట.

చంద్రుండును పెక్కు-వేలకిరణంబులుగలిగి,చంద్రికచేలోకంబులకుఁ బ్రకాశంబుగలిగించి, యీహనుమంతునకు, మైనాకసముద్రులుం బోలె , సాహాయ్యంబుసేయువాఁడువోలె, నక్షత్రంబులనడుమవెలుంగుచు, నుదయించెను.

అని, తాత్పర్యము.

శంఖప్రభం క్షీరమృణాళవర్ణ
ముద్గచ్ఛమానం వ్యవభాసమానమ్
దదర్శచంద్రం స హరిప్రవీరః
పోప్లూయమానం సరసీవ హంసమ్. ౫౮

టీక॥హరిప్రవీరః=వానరులలో మిక్కిలియుఁబరాక్రమశాలియగు; సః=ఆహనుమంతుండు; శంఖప్రభం= శంఖము యొక్క కాంతివంటి కాంతిగల వాఁడును; క్షీరమృణాళవర్ణం= పాలయొక్కయుఁ దామరతూండ్లయొక్కయు రంగువంటిరంగుగలవాఁడును; ఉద్గచ్ఛమానం= పైకిలేచుచున్నవాఁడును;వ్యవభాసమానం=మిక్కిలియుఁబ్రకాశించుచున్నవాఁడును;సరసి = కొలంకునందు; పోప్లూయమానం =ఎగురుచున్న; హంసమివ(స్థితం)= హంసపక్షియుం బోలెనున్నవాఁడునగు; చంద్రం=చంద్రుని; దదర్శ=చూచెను.

వానరవీరుండగు నాహనుమంతుండు, శంఖంబునకుం బోలెఁ గాంతిగలిగి పాలును దామరతూండ్లునుం బోలెఁ దెల్లనివర్ణంబునం బ్రకాశించుచునప్పుడ యుదయించుచుఁ గొలంకు నుండి యెగురుచున్నహంసయుంబోలెఁజూపట్టుచున్న, చంద్రునింజూచెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, ద్వితీయస్సర్గః.
ఇది,స్పష్టార్థము.
ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు , శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండద్వితీయసర్గటీక,
ముగిసినది.



శ్రీః

## తృతీయసర్గప్రారంభః.

స లంబశిఖరే లంబే లంబతోయదసన్నిభే
సత్త్వమాస్థాయ మేధావీ హనూమాన్మారుతాత్మజః. ౧
నిశి లంకాం మహాసత్త్వో వివేశ కపికుంజరః
రమ్యకాననతోయాఢ్యాం పురీం రావణపాలితామ్. ౨

టీక॥ మహాసత్త్వః= అధికమయిన బలముగలవాఁడును ; కపికుంజరః= వానరశ్రేష్ఠుండును; మారుతాత్మజః= వాయుదేవునికొమరుండును ; మేధావీ=బుద్ధిమంతుండునగు;సః=ఆ;హనూమాన్=హనుమంతుండు;లంబే=వంగినదియును, వంగినట్లున్నదియనుట;లంబతోయదసన్నిభే=వంగియున్న మేఘముతోసమానమయినదియానగు; లంబశిఖరే=లంబపర్వతముయొక్క-శిఖరమునందు; సత్త్వం = వ్యవసాయమును; ఆస్థాయ=అవలంబించి;నిశి= రాత్రియందు;రమ్యకాననతోయాఢ్యాం= సుందరములయిన యడవులతోను నీళ్లతోనుగూడినదియును ; రావణపాలితాం = రావణునిచే రక్షింపఁబడినదియైనగు; లంకాం=లంకయనెడు; పురీం=పట్టణమును;వివేశ=ప్రవేశించెను

మహాబలశాలియు వానరశ్రేష్ఠుండు వాయుదేవుని కుమారుండునగు హనుమంతుండు, వంగినట్లున్నది కావున,వంగియుండు మేఘుంబుం బోలెఁ జూపట్టుచున్న యాలంబపర్వతశిఖరంబునం,దిట్లు ధైర్యమవలంబించి, బుద్ధిమంతుండు కావున,రాత్రియందు, సుందరములగు నడవులునుదకంబునుం గలిగి యొప్పుచు రావణునిచేఁ బాలింపఁబడుచుండు, లంకాపురిం బ్రవేశింపసాగెను. అని, తాత్పర్యము.

శారదాంబుధరప్రఖ్యై ర్భవనై రుపశోభితామ్
సాగరోపమనిర్ఘోషాం సాగరానిలసేవితామ్. ౩
సుపుష్టబలసంఘుష్టాం యథైవ విటపావతీమ్

స ౩

చారుతోరణ నిర్యూహాం పాండురద్వారతోరణామ్. ౪
భుజగాచరితాం గుప్తాం శుభాం భోగవతీమివ
తాం స విద్యుద్ఘనాకీర్ణాం జ్యోతిర్మార్గనిషేవితామ్. ౫
మందమారుతసంచారాం యథేంద్ర స్యామరావతీమ్
శాతకుంభేన మహతా ప్రాకారేణాభిసంవృతామ్. ౬
కింకిణీజాలఘోషాభిః పతాకాభిరలంకృతామ్
ఆసాద్య సహసా హృష్టః ప్రాకారమభిపేదివాన్. ౭

టీక॥ సః=ఆహనుమంతుఁడు; శారదాంబుధరప్రఖ్యైః=శరదృతువునందలి మేఘంబులతో సమానములయిన; భవనైః=ఇండ్లచేత; ఉపశోభితాం = ప్రకాశింపఁజేయఁబడినదియును; సాగరోపమనిర్ఘోషాం=సముద్రునిధ్వనితోఁబోలికగలధ్వనిగలదియును; సాగరానిలసేవితాం= సముద్రపుగాలిచే సేవింపఁబడినదియును; సుపుష్టబలసంఘుష్టాం= చక్కఁగాఁ బోషింపఁబడిన సేనచేఁగలిగినధ్వనిగలదియును ; విటపావతీంయథైవ (స్థితాం)=అలకాపట్టణముంబోలెనున్నదియును; చారుతోరణ నిర్యూహాం= సుందరములయినబహిర్ద్వారంబులందలి మదపుటేనుంగులు గలదియును; పాండుర ద్వారతోరణాం = తెల్లని ద్వారములు బహిర్ద్వారములునుగలదియును; గుప్తాం= రక్షింపఁబడినదియును; శుభాం=మంగళకరంబైనదియును; భుజగాచరితాం=సర్పంబులచేసంచరింపఁబడిన; భోగవతీమివ(స్థితాం)= భోగవతీపట్టణముంబోలెనున్నదియును; విద్యుద్ఘనాకీర్ణాం=మెఱపులతోఁగూడిన మేఘములచే వ్యాపింపఁబడినదియును; జ్యోతిర్మార్గనిషేవితాం= నక్షత్రమార్గంబగు నాకాశముచే సేవింపఁబడినదియును (ఈ రెండు విశేషణంబులును, అత్యున్నతంబులగు గృహంబుల సంబంధంబునం, గలిగినవి); మందమారుతసంచారాం= తిన్నని గాలియొక్క తిరుగుటగలదియును; ఇంద్రస్య = ఇంద్రునియొక్క; అమరావతీంయథా(స్థితాం)= అమరావతియుంబోలెనున్నదియును; మహతా= గొప్పదియును; శాతకుంభేన= బంగారువికారమయినదియునగు; ప్రాకారేణ = ప్రహరిచేత ; అభిసంవృతాం = చుట్టఁబడినదియును;

కింకిణీజాలఘోషాభిః = చిఱుగంటలసమూహములయొక్క ధ్వనిగల; పతాకాభిః = టెక్కెములచేత; అలంకృతాం = అలంకరింపఁబడినదియగు; తాం = ఆ లంకాపురిని; ఆసాద్య = పొంది; సహసా = శీఘ్రముగా; ప్రాకారం = ప్రహరిని, ప్రహరిసమీపమునను అట; అభిపేదివాన్ = పొందినవాఁడై; హృష్టః = సంతసించినవాఁడు; అభూత్ (అధ్యాహృము) = ఆయెను.

శరత్కాలంబునందుఁ దెల్లగానుండు మేఘంబులుంబోలె భాసిల్లుచుండు గృహంబులవిలసిల్లుచు, జనుల కలకలంబునం జేసి, సముద్రంబునకుంబోలె ధ్వనిగలిగి, సముద్రపుగాలిచే సేవింపఁబడుచు బలవంతులగు సైనికులు సేయుసింహనాదంబులుగల్గి, కుబేరునియలకాపురింబోలుచు, ద్వారంబులం గట్టఁబడినసుందరంబులగు మదపుటేనుంగులుగల్గి, సున్నము పూసియుంటం జేసి తెల్లగానుండు ద్వారంబులును బహిర్ద్వారంబులునుగల్గి, రాక్షసులచే రక్షింపఁబడి మంగళకరంబై, సర్పంబులచే రక్షింపఁబడిన భోగవతియుంబోలెఁ దేజరిల్లుచు, నత్యున్నతంబులై మెఱుపులతోడం గూడిన మేఘంబులనునక్షత్రంబులనుం దాఁకుచుండు హర్మ్యంబులనొప్పుచు, రావణుభయంబున నెప్పుడు నుమందంబుగ సేవించుచుండు మారుతంబుచేన లరుచునిం ద్రునియమరావతికై వడినతిరమణీయంబై, హిరణ్మయంబగుగొప్పప్రాకారంబుగల్గి, వాయువశంబునధ్వనించుచుండు చిఱుగంటలుగట్టియుండు టెక్కెంబుల నలంకృతంబై, యుండు, నాలంకాపురింబొంది, హనుమంతుండు శీఘ్రంబుగా ప్రాకారంబు సమీపంబునకుంబోయి, సంతోషంబునొందెను.

అని, తాత్పర్యము.

విస్మయావిష్టహృదయః పురీ మాలోక్య సర్వతః

టీక॥ సః (అధ్యాహృతము) = ఆహనుమంతుండు; పురీం = లంకాపట్టణమును; సర్వతః = అంతటను; ఆలోక్య = చూచి; విస్మయావిష్టహృదయః = ఆశ్చర్యముచేఁ బొందఁబడిన మనసుగలవాఁడు; అభూత్ (అధ్యాహృతము) = ఆయెను.

ఆహనుమంతుండు, ఆలంకాపురినంతటంగలయఁజూచి, మనంబున, నాశ్చర్యపడెను, అని, తాత్పర్యము.

జాంబూనదమయైర్ద్వారై ర్వైడూర్య కృతవేదికైః ౮

వజ్రస్ఫటికముక్తాభి ర్మణికుట్టిమభూషితైః
తప్తహాటకనిర్యూహై రాజతామలపాండురైః. ౯
వైడూర్యకృతసోపానై స్స్ఫాటికాంతరపాంసుభిః
చారుసంజవనోపేతైః ఖ మివోత్పతితై శ్శుభైః. ౧౦
క్రౌంచబర్హిణసంఘుష్టై రాజహంసనిషేవితైః
తూర్యాభరణనిర్ఘోషైః సర్వతః ప్రతినాదితామ్. ౧౧
వస్వోకసారాప్రతిమాం తాం వీక్ష్య నగరీం తతః
ఖ మివోత్పతితుం కామాం జహర్ష హనుమాన్ కపిః. ౧౨

టీక॥ తతః = అటుపిమ్మట; కపిః = కోఁతియైన; హనుమాన్ = హనుమంతుఁడు; జాంబూనదమయైః = బంగారువికారములయినవియును; వైడూర్యకృతవేదికైః = వైడూర్యమణులతోఁ జేయఁబడిన తిన్నెలుగలవియును; వజ్రస్ఫటికముక్తాభిః = వజ్రములచేతను స్ఫటికములచేతను ముత్తెములచేతను; భూషితైః = (అధ్యాహృతము) అలంకరింపఁబడినవియును; మణికుట్టిమభూషితైః = రత్నములతోఁ గట్టఁబడిన నేలచే నలంకరింపఁబడినవియును; తప్తహాటకనిర్యూహైః = కాచఁబడినబంగారువికారములైన మదపుటేనుఁగులుగలవియు, మేలైనబంగారముతోఁ జేయఁబడిన యేనుంగుబొమ్మలుగలవియు ననుట; రాజతామలపాండురైః = వెండివికారములును నిర్మలములును దెల్లనివియునగు ప్రదేశములుగలవియును; వైడూర్యకృతసోపానైః = వైడూర్యమణులతోఁ జేయఁ బడినపడికట్లు గలవియును; స్ఫాటికాంతరపాంసుభిః = స్ఫటికమణులతోఁ జేయఁబడిన లోపలియిసుక గలవియును; చారుసంజవనోపేతైః = సుందరంబులగు నాలుగిండ్లబవంతులతోఁ గూడినవియును; ఖం = ఆకాశమునుగూర్చి; ఉత్పతితైరివ (స్థితైః) = ఎగిరినవివోలె నున్నవియును; శుభైః = మంగళకరంబులును; క్రౌంచబర్హిణసంఘుష్టైః = క్రౌంచపక్షులయొక్కయు నెమళ్లయొక్కయు ధ్వనులుగలవియును; రాజహంసనిషేవితైః = రాజహంసపక్షులచే సేవింపఁబడినవియునగు; ద్వారైః = ద్వారములతో; యుక్తాం (అధ్యాహృతము) = కూడినదియును; తూర్యాభరణనిర్ఘోషైః = వాద్యములయొక్క సొమ్ములయొక్కయు ధ్వనుల

చేత; సర్వతః=అంతటను; ప్రతినాదితాం=ప్రతిధ్వనిగలుగఁ జేయఁబడినదియును;వస్వౌకసారాప్రతిమాం=తూర్పుదిక్కునందుండునింద్రునివస్వౌకసారయనుపట్టణముతోఁ బోల్కిగలదియును;ఖం=ఆకాశమునుగూర్చి;ఉత్పతితుంకామామివ (స్థితాం)=ఎగురఁగోరునదివోలెనున్నదియునగు; తాం=ఆ;నగరీం=లంకాపట్టణమును;వీక్ష్య=చూచి; జహర్ష=సంతసించెను.

అంత,నాహనుమంతుండు, బంగారువికారంబులై, వైడూర్యమణులతోఁ జేయఁబడినతిన్నెలుగలిగి, వజ్రములచేతస్ఫటికమణులచేతను ముత్తెములచేతనుఅలంకరింపఁబడె, మణులతోఁగట్టఁబడినసేలనొప్పుచు, మేలైనబంగారముతోఁజేయఁబడిమదవుటేనుంగుప్రతిమలతోఁగూడి,వెండితోఁగట్టఁబడిస్వచ్ఛంబులై తెల్లగానుండుప్రదేశంబులుగల్గి, వైడూర్యమణులతోఁజేసిన, సోపానంబులునుగల్గి, స్ఫటికంపుమణులతోనిర్మింపఁబడినయునుకచేఁబ్రకాశించుచు,సుందరంబులగుచతుశ్శాలగృహంబులతోఁగూడి, యత్యున్నతంబులగుటం జేసి, యాకాశంబున కెగిరిపోవునోయనియెన్నందగి,మంగళకరంబులయి,మధురంబుగాఁగూయుచుండుక్రౌంచంబులును నెమళ్లునురాయంచలునుంగలిగి తేజరిల్లుచుండుద్వారంబులుగలదియై, అంతటను వాద్యధ్వనులనాభరణధ్వానంబులనుం బ్రతినాదితంబై, యిందునితూర్పుదిక్కునందలిపట్టణంబయినవస్వౌకసారయను పట్టణంబుంబోలెనతిసుందరంబై యత్యున్నత గృహంబులచే,నాకాశంబునకుద్గమించుమాడ్కిం జూపట్టుచున్న,యాలంకాపురింబూచి, సంతోషంబునొందెను.

అని, తాత్పర్యము.

తాం సమీక్ష్య పురీం రమ్యాం రాక్షసాధిపతే శ్శుభామ్
అనుత్తమా మృద్ధియుతాం చింతయామాస వీర్యవాన్. ౧౩

టీక॥ వీర్యవాన్=పరాక్రమముగలహనుమంతుఁడు; రమ్యాం=సుందరమైనదియును; శుభాం=మంగళకరమైనదియును; అనుత్తమాం= తనకన్నశ్రేష్ఠములేనిదియును;ఋద్ధియుతాం=వృద్ధితోఁగూడినదియునగు; తాం=ఆ; రాక్షసాధిపతేః= రాక్షసులకుఁబ్రభువయినరావణునియొక్క; పురీం=పట్ట

ణమయినలంకను; సమీక్ష్య=చూచి; చింతయామాస=ఆలోచించెను.

పరాక్రమశాలియగు హనుమంతుఁడు, సుందరమునుమంగళకరంబును అన్నిటికన్న శ్రేష్ఠంబునువృద్ధిగలదియును రాక్షసేంద్రుండగు రావణునిచేఁ బాలింపఁబడునదియునగు నాలంకాపురింజూచి, యచ్చెరువంది, యిట్లని, యాలోచించెను.

అని, తాత్పర్యము.

నేయ మన్యేన నగరీ శక్యా ధర్షయితుం బలాత్
రక్షితా రావణబలై రుద్యతాయుధ ధారిభిః. ౧౪

టీక॥ఉద్యతాయుధధారిభిః=పైకెత్తఁబడిన యాయుధముల ధరించియున్న; రావణబలైః = రావణునిసైన్యములచేత; రక్షితా=కాపాడఁబడిన; ఇయం=ఈ; నగరీ=లంకాపట్టణము; అన్యేన=ఇతరునిచేత; బలాత్ = బలిమివలన; ధర్షయితుం=ఎదిరించుటకు; శక్యాన=అలవియయినదికాదు.

ఈలంకాపట్టణము, ఆయుధములఁ బైకెత్తిపట్టుకొనియంతటనుందిరుగుచున్న రావణసైన్యంబులచేత రక్షింపఁబడుచున్నది, కావున, దీని , నితరుండెవ్వండును, బలంబున, నెదిరింపఁ జాలఁడు. అని, తాత్పర్యము.

కుముదాంగదయోర్వాపి సుషేణస్య మహాకపేః
ప్రసిద్ధేయం భవే ద్భూమి ర్మైందద్వివిదయోరపి. ౧౫

టీక॥ప్రసిద్ధా=ఖ్యాతినొందిన ; ఇయం=ఈలంకాపట్టణము; కుముదాంగదయోర్వాపి=కుముదునకును అంగదునకును; మహాకపేః=పెద్దకోఁతియయిన; సుషేణస్య=సుషేణునకును ; మైందద్వివిదయోరపి=మైందునకునుద్వివిదునకును; భూమిః=విషయము; భవేత్=అగును.

ఈలంకాపట్టణము, లోనికిఁజొరనలవిగాదనివినుతినొందినదయ్యుఁ, గుముదుండు నంగదుండును మహాకపియగు సుషేణుండును మైందుండును ద్వివిదుండును, దీని, సాధింపఁగలరు.

అని, తాత్పర్యము.

వివస్వత స్తనూజస్య హరేశ్చ కుశపర్వణః

ఋక్షస్య కేతుమాలస్య మమచైవ గతి ర్భవేత్. ౧౮

టీక॥ఇయం (అధ్యాహృతము) = ఈలంకాపట్టణము; వివస్వతః= సూర్యునియొక్క; తనూజస్య=కొడుకైన సుగ్రీవునకును; కుశపర్వణః= కుశపర్వుండను; హరేశ్చ= వానరునకును; ఋక్షస్య=ఋక్షునకును ; కేతుమాలస్య= కేతుమాలునకును; మమచైవ= నాకును ; గతిః=విషయము; భవేత్=అగును.

సూర్యునికుమారుండగు సుగ్రీవునకును కుశపర్వుండనువానికిని ఋక్షునకును కేతుమాలునకును నాకును, ఈలంకాపురి, సాధ్యంబగును; అనియాలోచించెను. అని, తాత్పర్యము.

సమీక్ష్యతు మహాబాహూ రాఘవస్య పరాక్రమమ్
లక్ష్మణస్య చ విక్రాంత మభవ త్ప్రీతి మాన్కపిః. ౧౯

టీక॥మహాబాహుః= గొప్పచేతులుగల; కపిః=వానరుండయిన హనుమంతుండు; రాఘవస్య=రామునియొక్క; పరాక్రమం=శత్రువుల జయించుశక్తిని; లక్ష్మణస్య= లక్ష్మణునియొక్క; విక్రాంతంచ=పరాక్రమమును; సమీక్ష్యతు=చూచినంతనె, తలంచినంతనెయనుట ; ప్రీతిమాన్=సంతోషముగలవాఁడు; అభవత్=ఆయెను.

మహాబాహుండగు నాహనుమంతుండంత, రామునిపరాక్రమంబును లక్ష్మణునిపరాక్రమంబునుందలంచికొని, రామలక్ష్మణుల నాయాసంబున నీలంకాపురిని సాధింపంజాలుదురు, అని,చింతించి,సంతోషంబునొందెను.

అని, తాత్పర్యము.

తాం రత్నవసనోపేతాం కోష్ఠాగారావతంసకామ్
యంత్రాగారస్తనీ మృద్ధాం ప్రమదామివ భూషితామ్. ౨౦

టీక॥ హనుమాన్ (అధ్యాహృతము)= హనుమంతుఁడు; రత్నవసనోపేతాం=మణులనెడు(కాంతులనెడుననుఁ) వస్త్రములోఁగూడినదియు; కోష్ఠాగారావతంసకాం=సామగ్రులుంచెడుకొట్లెచెవిమీఁది యలంకారపుష్పములుగాఁగలదియును; యంత్రాగారస్తనీం= యంత్రములుంచెడుగృహంబులె

స్తనంబులు గాఁగలదియును; కావుననే, బుద్ధాం=వృద్ధిఁబొందిన, యౌవనము నొందిన, యనుట; భూషితాం= అలంకరింపఁబడిన; ప్రమదామివ(స్థితాం)= స్త్రీవలెనున్నదియునగు; తాం=ఆలంకాపట్టణమును; దదర్శ (అధ్యాహృతము)=చూచెను.

హనుమంతుండు, నానావిధంబుల గుమణుల కాంతులు వస్త్రంబు గతినుండఁగా, ఉన్నతములయిన సామగ్రులుం చెదుకొట్లు చెవిమీఁది యలంకార కుసుమంబు కాంతివహింప, యంత్రగృహంబులు బలిసిన స్తంబంబులకై వడి భాసిల్లఁ, జక్కఁగాఁ నలంకరింపఁబడియౌవనంబుతో నలరుచుండు యువతియుం బోలె, నొప్పుచున్న, యాలంకాపురిం జూచెను. అని, తాత్పర్యము.

తాం నష్టతిమిరాం దీప్తై ర్భాస్వరైశ్చ మహాగృహైః
నగరీం రాక్షసేంద్రస్య స దదర్శ మహాకపిః. ౧౯

టీక॥మహాకపిః=పెద్దకోఁతియయిన; సః=ఆహనుమంతుఁడు; దీప్తైః=మణులచేఁ, బ్రకాశింపఁ జేయఁబడనవియును; భాస్వరైశ్చ=సున్నముపూసియుండుటచేఁ, బ్రకాశించుచున్నవియునగు; మహాగృహైః= పెద్దయిండ్లచేత; నష్టతిమిరాం = పోయినచీఁకటిగల; తాం=ఆ; రాక్షసేంద్రస్య= రాక్షసులకుఁబ్రభువైన రావణునియొక్క; నగరీం=లంకాపట్టణమును; దదర్శ = చూచెను.

ఆహనుమంతుండు, రత్నంబులుగల్గుటం జేసివానికాంతులం బ్రకాశింపఁజేయఁబడినసున్నముపూసియుంటం జేసిప్రకాశించుచున్నగొప్పగృహంబుల కాంతివలనం, జీఁకటియె లేక తేజరిల్లుచు, రాక్షసరాజుండగు రావణునిచేఁబాలింపఁబడుచుండు, నాలంకాపురింజూచెను అని, తాత్పర్యము.

అథ సా హరిశార్దూలం ప్రవిశంతం మహాబలమ్
నగరీ స్వేన రూపేణ దదర్శ పవనాత్మజమ్. ౨౦

టీక॥అథ=అటుపిమ్మట; సా=ఆ; నగరీ=లంకాపట్టణము; ప్రవిశంతం=

ప్రవేశించుచున్న వాఁడును; మహాబలం= అధికమయినబలము గలవాఁడును; హరిశార్దూలం=వానరశ్రేష్ఠుండునగు; పవనాత్మజం=వాయుపుత్త్రుఁడయినహనుమంతుని; స్వేన=తనదైన; రూపేణ=ఆకారముతోఁ; ప్రదదర్శ=చూచెను.

అంత, లంకాపురిం బ్రవేశించుచున్నమహాబలుండును వానరశ్రేష్ఠుండును వాయుకుమారుండునగు హనుమంతుని, లంక, తనరూపంబుతోఁ జూచెను.

అని, తాత్పర్యము.

సా తం హరివరం దృష్ట్వా లంకా రావణపాలితా
స్వయమేవోత్థితా తత్ర వికృతాననదర్శనా. ౨౧

టీక॥ రావణపాలితా=రావణునిచేఁ బాలింపఁబడిన; సా=ఆ; లంకా=లంకాపురి; తం= ఆ; హరివరం=వానరశ్రేష్ఠుండగు హనుమంతుని; దృష్ట్వా=చూచి; తత్ర=అచ్చట; వికృతాననదర్శనా= వికారముగల నోరును గండ్లునుగలదియై; స్వయమేవ= తానే; ఉత్థితా = లేచినది; అభవత్=(అధ్యాహృతము)అయినది.

రావణునిచేఁ బాలింపఁబడుచుండు నాలంకాపురి, ప్రవేశించుచున్నవానరశ్రేష్ఠుండగు నా హనుమంతుంజూచి, యాహనుమంతుండున్నచోటనె, వికృతంబులగు నోరునుగండ్లునుంగలదియై, తానే, యతనిముందట, నగపడినది.

అని, తాత్పర్యము.



పురస్తాత్కపివర్యస్య వాయుసూనో రతిష్ఠత

టీక॥సా(అధ్యాహృతము)= ఆలంక ; కపివర్యస్య= వానరశ్రేష్ఠుండగు; వాయుసూనోః=వాయువుకొడుకైన హనుమంతునియొక్క ; పురస్తాత్= ముందట; అతిష్ఠత=ఉండెను.

ఆలంక, వానరశ్రేష్ఠుండును వాయుదేవునికుమారుండునగు నాహనుమంతుని ముందట, నుండెను.

అని, తాత్పర్యము.

ముంచమానా మహానాద మబ్రవీత్పవనాత్మజమ్. ౨౨

టీక॥సా(అధ్యాహృతము)= ఆలంక; మహానాదం= గొప్పధ్వనిని;ముంచమానా=విడుచుచున్నదై; పవనాత్మజం= వాయువుకొడుకైన హనుమంతునిఁగూర్చి;అబ్రవీత్=పలికెను.

ఆలంక, గొప్పధ్వనిగలుగునట్టులఱచుచు, వాయుదేవునికుమారుండగుహనుమంతుంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

కస్త్వం కేనచ కార్యేణ ఇహ ప్రాప్తో వనాలయ
కథయ స్వేహ యత్తత్త్వం యావత్ప్రాణా ధరంతి తే. ౨౩
"యావత్ప్రాణాన్ హరామి తే" అని, పాఠాంతరము,

టీక॥వనాలయ= అడివియందునిక్కగలహనుమంతుఁడా!త్వం=నీవు; కః= ఎవ్వఁడవు? కేన=ఏ; కార్యేణచ=పనిచేతను;ఇహ=ఇచ్చటికి; ప్రాప్తః=వచ్చినవాఁడవు ? యావత్ =ఎంతవఱకు; తే=నీయొక్క ; ప్రాణాః=ప్రాణములు;ధరంతి,(ధ్రియంతే)=ధరింపఁబడుచున్నవో;(పాఠాంతరమందు)యావత్ =ఎంతలోపల; తే=నీయొక్క ; ప్రాణాన్=ప్రాణములను ; హరామి=హరిస్యామి: తావత్ (అధ్యాహృతము)=అంతలోపలనె; యత్= ఏది; తత్త్వం= యథార్థమో; తత్(అధ్యాహృతము)=దాని; ఇహ= ఇచ్చట;కథయస్వ=చెప్పుము.

ఓరీ హనుమంతుఁడా!నీవెవ్వఁడవు? ఏమిపనిగానిచ్చటికివచ్చినాఁడవు? నేనునీప్రాణంబులంగొనుటకుమునుపే , యథార్థముగాఁజెప్పుము.

అని, తాత్పర్యము.

న శక్యం ఖల్వియం లంకా ప్రవేష్టుం వానర త్వయా
రక్షితా రావణబలై రభిగుప్తా సమంతతః. ౨౪

టీక॥ వానర= కోఁతివగు హనుమంతుఁడా! సమంతతః= అంతటను; అభిగుప్తా= మూయఁబడినదియు, కోటచేదారిలేనట్లు చుట్టఁబడినదియు ననుట; రావణబలైః= రావణుని సైన్యముల చే; రక్షితా = కాపాడఁబడినదియునగు; ఇయం= ఈ; లంకా= లంకాపట్టణము; త్వయా= నీచేత; ప్రవేష్టుం= చొచ్చుటకు; శక్యం న ఖలు= అలవిగాదుగదా!

హనుమంతుండా! నీవు కోఁతివి; అన్నిప్రక్కలను గోటచేదుష్ప్రవేశంబై రావణుని సైన్యంబుల చే నెవ్వరు లోనికిం జొరకుండునట్లు రక్షింపఁబడుచుండు నీ లంకం బ్రవేశింప, నీకలవిగాదు. అని, లంకహనుమంతునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

అథ తా మబ్రవీ ద్వీరో హనూమా నగ్రత స్థ్సితామ్

టీక॥ అథ= అటుపిమ్మట; వీరః= పరాక్రమశాలియగు; హనూమాన్ = హనుమంతుఁడు; అగ్రతః= ముందట; స్థితాం= ఉన్నదానిన్; తాం= ఆలంకఁగూర్చి; అబ్రవీత్= పలికెను.

అంతఁ బరాక్రమశాలియగు హనుమంతుండు, తనముందట నిలిచియుండు నాలంకం జూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

కథయిష్యామి తే తత్త్వం యన్మాం త్వం పరిపృచ్ఛసి. ౨౫

టీక॥ యత్= దేని; త్వం = నీవు; మాం= నన్ను; పరిపృచ్ఛసి= అడుగుచున్నావో; తత్ (అధ్యాహృతము)= ఆ; తత్త్వం= యథార్థమును; తే= నీకొఱకు; కథయిష్యామి= చెప్పెదను.

దానినీకు యథార్థముగాఁ జెప్పెదను.
నీవు దేని నడుగుచున్నావో,

అని, తాత్పర్యము.

కా త్వం విరూపనయనా పురద్వారే వతిష్ఠసి
కిమర్థం చాపి మాం రుద్ధ్వా నిర్భర్త్సయసి దారుణా. ౨౬

టీక॥విరూపనయనా = వికృతంబగునాకారముగలకండ్లుగల; త్వం = నీవు; కా=ఎవ్వతెవు? కిమర్థం (అధ్యాహృతము)=ఎందుకొఱకు; పురద్వారే=పట్టణపువాకిలియందు; అవతిష్ఠసి=ఉన్నావు? కిమర్థంచాపి=ఎందుకొఱకును; దారుణా=భయంకరవై; మాం=నన్ను; రుద్ధ్వా=అడ్డగించి; నిర్భర్త్సయసి=బెదరించుచున్నావు?

వికృతంబులగు కండ్లుగలిగియున్నావు; నీవెవ్వతెవు? ఎందుకీపట్టణపు వాకిలినావరించియున్నావు? నన్నేల భయంకరంబుగా బెదరించుచున్నావు? అని, హనుమంతుండులంకతోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

హనుమద్వచనం శ్రుత్వా లంకా సా కామరూపిణీ
ఉవాచ వచనం క్రుద్ధా పరుషం పవనాత్మజమ్. ౨౪

కామరూపిణీ=ఇచ్ఛాధీనంబగురూపముగల; సా=ఆ; లంకా=లంక; హనుమద్వచనం=హనుమంతుని యొక్క మాటను; శ్రుత్వా=విని; క్రుద్ధా=కోపంబునొందినదై; పవనాత్మజం=వాయువుయొక్క కొడుకైనహనుమంతునిగూర్చి; పరుషం=కఠినమయిన; వచనం=మాటను; ఉవాచ=చెప్పెను.

ఇచ్చకువచ్చినరూపంబుదాల్పంజాలినయాలంక, హనుమంతుండు చెప్పినమాటవిని, కోపంబునొంది, వాయుదేవునికుమారుండగుహనుమంతునింజూచి, పరుషంబుగా, నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

అహం రాక్షసరాజస్య రావణస్య మహాత్మనః
ఆజ్ఞాప్రతీక్షా దుర్ధర్షా రక్షామి నగరీమిమామ్. ౨౫

టీక॥అహం=నేను; రాక్షసరాజస్య=రాక్షసులకుఁ బ్రభువును; మహాత్మనః=అధికమయినపరాక్రమంబుగలవాఁడునగు; రావణస్య = రావణునియొక్క; ఆజ్ఞాప్రతీక్షా=ఆజ్ఞను ఎదురుచూచుదానను, కింకరిననుట, దుర్ధర్షా=ఎదిరింపనలవిగానిదానను. ఇమాం=ఈ; నగరీం=పట్టణమును; రక్షామి=కాపాడుచున్నాను.

నేను, మహాపరాక్రమశాలియగు

రాక్షసులకందఱకుఁ బ్రభుండయినరావణునికింకరిని; నన్నెదిరింపనేరికినలవిగాదు; రావణునిపనుపునంజేసి, నేను ఈలంకాపట్టణమును, రక్షించుచున్నాను.

అని, తాత్పర్యము.

న శక్యా మా మవజ్ఞాయ ప్రవేష్టుం నగరీ త్వయా

టీక॥ నగరీ=లంకాపట్టణము; త్వయా=నీచేత; మాం=నన్ను; అవజ్ఞాయ=అవమానించి; ప్రవేష్టుం=చొచ్చుటకు; శక్యా=న= అలవియయినదికాదు.

నన్నుజయించి, యీలంకాపట్టణంబుఁజొచ్చుటకు, నీకలవికాదు.

అని, తాత్పర్యము.

అద్య ప్రాణైః పరిత్యక్త స్స్వప్స్యసే నిహతో మయా. ౨౯

టీక॥ త్వం(అధ్యాహృతము) = నీవు; అద్య=ఇప్పుడు; మయా=నాచేత; నిహతః=కొట్టఁబడినవాఁడవయి; ప్రాణైః=ప్రాణములచేత; పరిత్యక్తః=విడువఁబడినవాఁడవయి; స్వప్స్యసే=నిదురింపఁగలవు.

నీవిప్పుడు, నాచేఁగొట్టఁబడి, ప్రాణంబులవిడిచి, దీర్ఘనిద్రం జెందఁగలవు.

అని, తాత్పర్యము.

అహం హి నగరీ లంకా స్వయమేవ ప్లవంగమ
సర్వతః పరిరక్షామి హ్యేత త్తే కథితం మయా. ౩౦

టీక ॥ ప్లవంగమ=వానరుండవగు హనుమంతుఁడా! అహం=నేను; నగరీ = పట్టణస్వరూపమయిన; లంకా హి=లంకయేగదా! స్వయమేవ=నేనే; సర్వతః=అంతటను; పరిరక్షామి=రక్షించుచున్నాను. మయా=నాచేత; తే=నీకొఱకు; ఏతత్=ఇది; కథితం హి=చెప్పఁబడినదిగదా!

హనుమంతుఁడా! పట్టణరూపంబుగాఁదోఁచుచుండులంకనే నేను ; నాకు నేనేయీపట్టణంబునంతయు రక్షించుకొనుచున్నాను; ఇదినాసమాచారము; నీకుఁజెప్పితిని; ఇంకనీవృత్తాంతంబుఁజెప్పుము. అని, లంక హనుమంతునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

లంకాయా వచనం శ్రుత్వా హనుమాన్మారుతాత్మజః
యత్నవాన్ స హరిశ్రేష్ఠ స్థ్సిత శ్శైలఇవా పరః. ౩౧

టీక॥ హరిశ్రేష్ఠః=వానరశ్రేష్ఠుండును; మారుతాత్మజః=వాయుదేవుని కొడుకునైన; సః=ఆ; హనుమాన్=హనుమంతుడు; లంకాయాః=లంకయొక్క; వచనం=మాటను; శ్రుత్వా=విని; యత్నవాన్=ప్రయత్నంబుగలవాఁడై; అపరః=వేఱయిన; శైలఇవ=పర్వతమువలె, స్థితః=ఉండినాఁడు.

వానరశ్రేష్ఠుండును వాయుదేవుని కుమారుండునగు నాహనుమంతుండు, లంక చెప్పినమాటనువిని, యుద్ధమునకు సన్నద్ధుండై, రెండవపర్వతంబుకరణిను స్థిరుండైయుండెను. అని, తాత్పర్యము.

స తాం స్త్రీరూప వికృతాం దృష్ట్వా వానర పుంగవః
ఆబభాషేథ మేధావీ సత్త్వవాన్ ప్లవగర్షభః. ౩౨

టీక॥ అథ=అటుతర్వాత; వానరపుంగవః=వానరశ్రేష్ఠుండగు; సః=ఆ హనుమంతుండు; స్త్రీరూప వికృతాం=వికారముగల స్త్రీశరీరముగల; తాం=ఆలంకను; దృష్ట్వా=చూచి; మేధావీ=బుద్ధిమంతుండును; సత్త్వవాన్=అధికమయినబలముగలవాఁడునగు; ప్లవగర్షభః=వానరశ్రేష్ఠుండగుహనుమంతుండు; ఆబభాషే=పలికెను.

బలవంతుండును బుద్ధిమంతుండు నగు నాహనుమంతుండు, వికృతంబగు స్త్రీరూపంబుధరించితనముందట నిలిచియుండు నాలంకంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

ద్రక్ష్యామి నగరీం లంకాం సాట్టప్రాకార తోరణామ్
ఇత్యర్థ మిహ సంప్రాప్తః పరం కౌతూహలం హి మే. ౩౩

టీక॥ సాట్టప్రాకారతోరణాం=కోటబురుజులతోను బహరులతోను బహిర్ద్వారంబులతోనుంగూడిన; లంకాం=లంకయను; నగరీం=పట్టణమును; ద్రక్ష్యామి=చూచెదను. ఇత్యర్థం=దీనికొఱకు; ఇహ=ఇచ్చటికి; సం

ప్రాప్తః = వచ్చినాఁడను. మే=నా కు; పరం=అధికమయిన ; కౌతూహలంహి=కోర్కెగదా!

కోటబురుజులుఁబ్రాకారంబులుబహిర్ద్వారంబులు గలిగిరమ్యంబై యుండు నీ లంకాపట్టణంబుఁజూచెదను; ఇందుకొఱకె నేనిటకువచ్చినాఁడను; నాకులంకంజూడవలెననిచాలఁగోర్కె యున్నది.

అని, తాత్పర్యము.

వనా న్యుప వనా నీహ లంకాయాః కాన నానిచ
సర్వతో గృహముఖ్యాని ద్రష్టు మాగమనంహిమే. ౩౪

టీక॥ఇహ=ఇచ్చటికి; మే=నాయొక్క; ఆగమనం = రాక ; లంకాయాః=లంకయొక్క; వనాని = సాధారణములగుతోఁటలను ; ఉపవనాని=ఉద్యానములను; కాననానిచ=అడవులను; గృహముఖ్యాని= ఇండ్లలోశ్రేష్ఠములయినవానిని; సర్వతః = అన్నిటిని; ద్రష్టుంహి = చూచుటకుఁగదా;

లంకాపట్టణమునందుండు వనంబుల నుపవనంబులనరణ్యంబులఁబెద్దపెద్ద మేడలనింకనితరచిత్రంబులనుంజూచుటకై, నేనిటకువచ్చినాను.అని, హనుమంతుఁడు,లంకతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తస్యత ద్వచనం శ్రుత్వా లంకాసా కామ రూపిణీ
భూయ ఏవ పున ర్వాక్యం బభాషే పరుషాక్షరమ్. ౩౫

టీక॥కామరూపిణీ=ఇచ్ఛాధీనమగు రూపముగల; సా=ఆ; లంకా=లంక; తస్య=ఆహనుమంతునియొక్క; తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; పునః=మఱల; భూయఏవ = మిక్కిలియు నేః పరుషాక్షరం = నిష్ఠురమ యినయక్షరములుగల; వాక్యం=మాటను; బభాషే=పలికెను.

ఇచ్ఛకువచ్చిన రూపంబు ధరింపంజాలినయాలంక , యాహనుమంతుండుచెప్పినమాటనువిని,మఱల, మిక్కిలియుఁబరుషంబుగా,నిట్లని, చెప్పెను.అని, తాత్పర్యము.

మాం ఇనిర్జిత్య దుర్బుద్ధే రాక్షసేశ్వర పాలితా
నశక్య మద్య తే ద్రష్టుం పురీయం వానరా ధమ. ౩౬

టీక॥దుర్బుద్ధే=దుష్టంబగు బుద్ధిగలవాడా; వానరాధమ=కోతులలోఁదక్కువయినవాఁడవగుహనుమంతుఁడా! అద్య=ఇప్పుడు, మాం=నన్ను; అనిర్జిత్య=జయింపక; రాక్షసేశ్వరపాలితా=రాక్షసులకుఁబ్రభువైనరావణునిచేఁ బాలింపఁబడిన; ఇయం=ఈ పురీ=లంకాపట్టణము; తే=నీకు; ద్రష్టుం=చూచుటకు; శక్యం న=అలవి గాదు.

దుర్బుద్ధివి వానరాధముండవగుహనుమంతుఁడా! ఇప్పుడు, నీవు,నన్నుజయింపక, రాక్షసేశ్వరుఁడగు రావణునిచేరక్షింపఁబడు నీలంకా పట్టణముం జూడఁజాలవు. అని,లంకహనుమంతునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తత స్స కపిశార్దూల స్తా మువాచ నిశాచరీమ్

టీక॥తతః = అటుపిమ్మట;కపిశార్దూలః=వానరశ్రేష్ఠుండగు; సః=ఆహనుమంతుండు; తాం = ఆ; నిశాచరీం=రాక్షసస్త్రీయయినలంకనుగూర్చి; ఉవాచ=పలికెను.

అంత, వానరశ్రేష్ఠుండగుహనుమంతుండు, రాక్షసస్త్రీరూపము ధరించియుండు,నాలంకాపురింజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

దృష్ట్వా పురీ మిమాం భద్రే పున ర్యాస్యే యథాగతమ్. ౩౭

టీక॥భద్రే=మంగళకరివగులంకా! ఇమాం=ఈ;పురీం = లంకాపట్టణమును;దృష్ట్వా=చూచి;పునః=మరల; యథాగతం=వచ్చినట్లు;యాస్యే=పోయెదను.

మంగళస్వరూపమగులంకా! నేనీలంకాపట్టణమంతయుఁజూచి, మరల, వచ్చినట్లుపోయెదను; మరేమియుఁ జేయుటలేదు.అని,హనుమంతుఁడు, లంకతోఁజెప్పెను.అని, తాత్పర్యము.

తతః కృత్వా మహానాదం సా వై లంకా భయావహమ్

తలేన వానరశ్రేష్ఠం తాడయామాస వేగితా. ౩౮

టీక॥ తతః = అటుపిమ్మట; సా = ఆ ("వై" అనునది పాదపూరణార్థము); లంకా = లంక; భయావహం = భయంబుఁబుట్టించునట్టి; మహానాదం = గొప్ప ధ్వనిని; కృత్వా = చేసి; వేగితా = వేగము గలదై; తలేన = చాఁచిన వ్రేళ్లుగలయఱచేయి చేత; వానరశ్రేష్ఠం = కోఁతులలో మేఁటియయినహనుమంతుని; తాడయామాస = కొట్టెను.

అంత, నాలంక, వినువారలకుభయంబుగలుగు నట్లు, గట్టిగా నఱచి, వేగంబువహించి, వానరశ్రేష్ఠుండగు హనుమంతుని, చాఁచినవ్రేళ్లుగలయఱచేతం గొట్టెను. అని, తాత్పర్యము.

తత స్స కపిశార్దూలో లంకయా తాడితో భృశమ్
ననాద సుమహానాదం వీర్యవాన్ పవనాత్మజః. ౩౯

టీక॥ తతః = అటుపిమ్మట; కపిశార్దూలః = వానరశ్రేష్ఠుండును; వీర్యవాన్ = అధికమయినపరాక్రమముగలవాఁడును; పవనాత్మజః = వాయుదేవునికొడుకునగు; సః = ఆహనుమంతుఁడు; లంకయా = లంక చేత; భృశం = మిక్కిలియు; తాడితః = కొట్టఁబడినవాఁడై; సుమహానాదం = మిక్కిలియునధికమయిన ధ్వనిగలుగునట్లుగా; ననాద = అఱచెను.

అంత, వానరశ్రేష్ఠుండును, బరాక్రమశాలియును వాయుదేవునికుమారుండునగు హనుమంతుండు, లంకచేఁగొట్టఁబడినవాఁడై, గొప్పధ్వనిగలుగునట్లు, అఱచెను. అని, తాత్పర్యము.

తత స్సంవర్తయామాస వామహస్తస్య సోఙ్గుళీః
ముష్టినాభిజఘానైనాం హనూమాన్ క్రోధమూర్ఛితః. ౪౦

టీక॥ తతః = అటుపిమ్మట; హనూమాన్ = హనుమంతుఁడు; క్రోధమూర్ఛితః = కోపముచే వ్యాపింపఁబడినవాఁడై; వామహస్తస్య = ఎడమచేతియొక్క; అంగుళీః = వ్రేళ్లను; సంవర్తయామాస = మడిచెను. ఏనాం = ఈలంకను; ముష్టినా = పిడికిలిచేత; అభిజఘాన = కొట్టెను.

అంత, హనుమంతుండు, మిక్కిలియుఁగోపంబునొంది, యెడమచేతివ్రే

ళ్లుమడిచి; ముష్టియలవరించికొని, దానిచేనాలంకం,గొట్టెను.అని, తాత్పర్యము.

స్త్రీ చేతి మన్యమానేన నాతిక్రోధ స్స్వయం కృతః

టీక॥"లంకా (అధ్యాహృతము)= లంక; స్త్రీ=ఆడుది; ఇతిచ=అనియు న; మన్యమానేన=తలంచుచున్న; హనుమతా(అధ్యాహృతము)=హనుమంతునిచేత; స్వయం=తనచేతనే; అతిక్రోధః=మిక్కిలియగుఁగోపము; నకృతః=చేయఁబడినదికాదు.

ఆహనుమంతుండు," లంక స్త్రీజాతి, చంపరాదు" అని,తలంచి, అధికకోపంబు,సేయఁడయ్యె.

అని, తాత్పర్యము.



సాతు తేన ప్రహారేణ విహ్వలాంగీ నిశాచరీ. ౪౧
పపాత సహసా భూమౌ వికృతానన దర్శనా.

టీక॥సా=ఆ; నిశాచరీతు=రాక్షసస్త్రీయగులంకయును; తేన=ఆ; ప్రహారేణ=దెబ్బచేత; విహ్వలాంగీ= వివలవిలంబోవునవయవంబులుగలదై; వికృతాననదర్శనా= వికారమునొంది ననోరునుకండ్లునుగలదిమై; సహసా= శీఘ్రముగా; భూమౌ= నేలయందు; పపాత=పడెను.

రాక్షసస్త్రీరూపంబు దాల్చియుండునాలంకయు నాహనుమంతుండుకొట్టినదెబ్బకు, అవయవంబులన్నియువిలవిలంబోవఁగా, బాధవలనవికారంబునొందిననోరునుగండ్లునుంగలిగి, నేలంబడెను. అని, తాత్పర్యము.

తతస్తు హనుమాన్ ప్రాజ్ఞ స్తాం దృష్ట్వా వినిపాతితామ్. ౪౨
కృపాం చకార తేజస్వీ మన్యమానః స్త్రియంతు తామ్

టీక॥ తతస్తు = ఆపిమ టనుమాత్రము; ప్రాజ్ఞః = పండితుండును; తేజస్వీ = అధికమయినపరాక్రమంబుగలవాఁడునగు; హనుమాన్ = హనుమంతుఁడు; వినిపాతితాం = పడఁద్రోయఁబడిన; తాం = ఆలంకను; దృష్ట్వా = చూచి; తాం = ఆ; లంకను; స్త్రియం = స్త్రీనిగా; మన్యమానస్తు = తలంచువాఁడైనే; కృపాం = దయను; చకార = చేసెను.

అంత, హనుమంతుండు, తనదెబ్బకు నేలంబడియుండు లంకంజూచి, పండితుండు కావున, "ఇది స్త్రీ, దీనిం జంపుట యుక్తంబుగా" దనియుఁ, బరాక్రమశాలి కావున, "ఆఁడుదానిం జంపుట వీరధర్మంబుగా" దనియుఁ, దలంచి, దయగలవాఁడయ్యెను. అని, తాత్పర్యము.

తతో వై భృశసంవిగ్నా లంకా సా గద్గదాక్షరమ్. ౪౩
ఉవాచా గర్వితం వాక్యం హనూమంతం ప్లవంగమమ్

టీక॥ తతః = అటుపిమ్మట; ("వై" అనునది పాదపూరణార్థకము) సా = ఆ; లంకా = లంక; భృశసంవిగ్నా = మిక్కిలియును భయము నొందినదై; ప్లవంగమం = కోఁతియగు; హనూమంతం = హనుమంతునిఁగూర్చి; గద్గదాక్షరం = డక్కుత్తికగలయక్షరములుగలదియును; అగర్వితం = గర్వములేనిదియునునగు; వాక్యం = మాటను; ఉవాచ = చెప్పెను.

అంత, నాలంక, మిక్కిలియు భయంబునొంది, హనుమంతుంజూచి, గర్వంబు విడిచి, డక్కుత్తికతో, సవినయంబుగ, నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

ప్రసీద సుమహాబాహో త్రాయస్వ హరిసత్తమ. ౪౪
సమయే సౌమ్య తిష్ఠంతి సత్త్వవంతో మహాబలాః

టీక॥ సుమహాబాహో = మిక్కిలియుఁ గొప్పవైనచేతులుగల హనుమంతుఁడా! ప్రసీద = కోపంబు విడువుము. హరిసత్తమ = వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! త్రాయస్వ = రక్షింపుము; సౌమ్య = తిన్ననివాఁడవగుహను

మంతుఁడా! సత్త్వవంతః=ధైర్యముగలవారలును; మహాబలాః=అధికమయినబలిమిగలవారలును;సమయే = స్త్రీలం జంపఁగూడదనెడు, సంకేతమునందు;తిష్ఠంతి=ఉన్నారు.

హనుమంతుఁడా! నీవు మహాబాహుండవు;మహాపరాక్రమశాలివి;నేను నీపరాక్రమంబునకుఁ జాలినదాననుగానుఁ,ప్రసన్నుండవుగమ్ము; నీవువానరశ్రేష్ఠుండవు; నేనురాక్షసస్త్రీలలో నధమను,నన్నురక్షింపుము;నీవుస్వభావంబున సౌమ్యుండవు; ధైర్యశాలులుమహాబలులునగువారలు, స్త్రీలంజంపఁగూడదను నియమంబువదలరు;కావున,నను౦జంపకుము. అని, తాత్పర్యము.

అహంతు నగరీ లంకా స్వయమేవ ప్లవంగమ. ౪౫

టీక॥ప్లవంగమ= వానరుండగుహనుమంతుఁడా!అహంతు=నేను;స్వయమేవ=నేనే;నగరీ= పట్టణస్వరూపముగు;లంకా=లంకను.

వానరుండవగుహనుమంతుఁడా!ఇప్పుడుపట్టణస్వరూపంబుననగపడుచుండు,లంకనేనేను.

అని, తాత్పర్యము.

నిర్జితాహం త్వయా వీర విక్రమేణ మహాబల

టీక॥వీర=పరాక్రమశాలివి; మహాబల = అధికమయినబలిమిగలవాఁడవగు,హనుమంతుఁడా!అహం=నేను;త్వయా=నీచేత; విక్రమేణ=పరాక్రమంబుచేత; నిర్జితా=జయింపఁబడినదానను;అస్మి (అధ్యాహృతము)=అగుచున్నాను.

నీవుపరాక్రమశాలివి, మహాబలుండవు;నీవునన్నుఁ బరాక్రమంబునజయించినావు. అని, తాత్పర్యము.

ఇదంతు తథ్యం శృణు వై బ్రువంత్యా మే హరీశ్వర. ౪౬
స్వయంభువా పురా దత్తం వరదానం యథా తవ

టీ॥హరీశ్వర= వానరశ్రేష్ఠుండవగుహనుమంతుఁడా!మమ=నాకు;పురా=మున్ను;స్వయంభువా=బ్రహ్మదేవునిచేత;యథా=ఎట్లు; వరదానం=వరము




యొక్క—యిమ్మట; దత్తం=ఇవ్వఁబడినదో, చేయఁబడినదో యనుట; తథా=(అధ్యాహృతము) అట్లు; బ్రువంత్యాః=చెప్పుచున్న; మే=నాయొక్క; తథ్యం=యథార్థమయిన; ఇదంతు=ఈమాటను మాత్రము; శృణు=వినుము "వై" అనునది పాదపూరణార్థము.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! నాకుమున్ను బ్రహ్మదేవుండొసంగినవరంబు విధమును జెప్పెదను; ఇదియథార్థము; ఈమాటను వినుము.

అని, తాత్పర్యము.

యదా త్వాం వానరః కశ్చి ద్విక్రమా ద్వశ మానయేత్. ౪౭
తదా త్వయా హి విజ్ఞేయం రక్షసాం భయ మాగతమ్

టీక॥ యదా=ఎప్పుడు; కశ్చిత్=ఒకానొక; వానరః=కోఁతి; త్వాం=నిన్ను; విక్రమాత్=పరాక్రమము వలన; వశం=లోఁబడుటను; ఆనయేత్=పొందించునో; తదా=అప్పుడు; త్వయా=నీచేత; "రక్షసాం=రాక్షసులకు; భయం=ఆపద; ఆగతం=వచ్చినది" ఇతి (అధ్యాహృతము)=అని; విజ్ఞేయం=ఎఱుంగఁదగినది.

ఎప్పుడు వానరుండొకండు వచ్చి నిన్నుఁ బరాక్రమంబున జయించునో, అప్పుడు రాక్షసులకు భయంబు వచ్చినదని, నీవు దెలిసికొనుము; అని, బ్రహ్మదేవుండు నాతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

సహి మే సమయ స్సౌమ్య ప్రాప్తోద్య తవ దర్శనాత్. ౪౮
స్వయంభువిహిత స్సత్యో న తస్యా స్తి వ్యతిక్రమః

టీక॥ సౌమ్య=తిన్ననివాఁడవగు హనుమంతుఁడా! అద్య=ఇప్పుడు; తవ=నీయొక్క; దర్శనాత్=చూచుటవలన; మే=నాకు; సః=ఆ; సమయః=సంకేతకాలము; ప్రాప్తః=పొందఁబడినది. సః (అధ్యాహృతము)=అది; స్వయంభువిహితః=బ్రహ్మదేవునిచేఁ జేయఁబడినది. సత్యః=దబ్బఱకానిది; తస్య=దానికి; వ్యతిక్రమః=తిరుగుపాటు; న=లేదు.

సౌమ్యుండవగు హనుమంతుఁడా! నీవు వచ్చుటం జేసి, నాకా సంకేతకాలము ప్రాప్తించినది; అది బ్రహ్మదేవునిచేఁ జేయఁబడినది, సత్యంబు; దానికిఁ దిరుగు




పాటుండదు. అని, తాత్పర్యము.

సీతానిమిత్తం రాజ్ఞస్తు రావణస్య దురాత్మనః. ౪౯
రక్షసాం చైవ సర్వేషాం వినాశ స్సముపాగతః

టీక॥సీతానిమిత్తం=సీతవలన; దురాత్మనః=దుష్టస్వభావముగల; రాజ్ఞః=రాజయిన; రావణస్యతు= రావణునకును;రక్షసాంచైవ= రాక్షసులకును; సర్వేషాం=అందఱకును;వినాశః=చేటు; సముపాగతః=వచ్చినది; సమీపించినదనుట.

సీతనపహరించుటంజేసి, దురాత్ముండయినరాక్షసరాజుండగు రావణునకు, రాక్షసులకందఱుకును, జేటు రాఁబోవుచున్నది.

అని, తాత్పర్యము.

తత్ప్రవిశ్య హరిశ్రేష్ఠ పురీంరావణపాలితామ్. ౫౦
విధత్స్వ సర్వకార్యాణి యాని యానీహ వాంఛసి

టీక॥హరిశ్రేష్ఠ=వానరులలో మేటివగుహనుమంతుఁడా! తత్ =అందువలన;త్వం(అధ్యాహృతము)=నీవు; రావణపాలితాం=రావణునిచేఁ బాలింపఁబడిన;పురీం=లంకాపట్టణమును ;ప్రవిశ్య=చొచ్చి; యానియాని= ఏయేకార్యములను; వాంఛసి= కోరుచున్నావో; తాని(అధ్యాహృతము)=ఆ; సర్వకార్యాణి=అన్నిపనులను; విధత్స్వ= చేసికొనుము.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా!అందువలన,రావణునిచేఁ బాలింపఁబడుచున్నయీలంకా పట్టణంబును యథేచ్ఛంబుగాఁ బ్రవేశించి, నీవు కోరుకార్యంబులనన్నింటిని, జేసికొనుము.

అని, తాత్పర్యము.

ప్రవిశ్య శాపోపహతాం హరీశ్వర
శుభాం పురీం రాక్షసముఖ్యపాలితామ్
యదృచ్ఛయా త్వం జనకాత్మజాం సతీమ్
విమార్గ సర్వత్ర గతో యథాసుఖమ్. ౫౧




టీక॥హరీశ్వర= వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! త్వం=నీవు; శాపోపహతాం=నందికేశ్వరుని శాపముచేఁ గొట్టఁబడినదియును; శుభాం=మంగళకరంబును; రాక్షసముఖ్యపాలితాం=రాక్షసులలో మొదటివాఁడయిన రావణునిచేఁబాలింపఁ బడినదియునగు; పురీం = లంకాపట్టణమును; యదృచ్ఛయా=స్వేచ్ఛచేత; ప్రవిశ్య=చొచ్చి; యథాసుఖం=సుఖము నతిక్రమింపక; సర్వత్ర=అంతటను ; గతః=పోయినవాఁడవై; సతీం=పతివ్రతయగు; జనకాత్మజాం=జనకునికూఁతురయినసీతను; విమార్గ=వెదకుము.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! అట్లునందికేశ్వరునిశాపంబునంజేసి దుర్బలం బైన, రావణునిచేఁబాలింపఁబడినదియుమంగళకరంబునగు నీలంకాపట్టణంబును, నీవు, స్వేచ్ఛంబ్రవేశించి, సుఖముగా, నష్టిలేక, కావలసినచోట్లకుంబోయి, పతివ్రతయగు సీతను వెదకుము. అని, లంక హనుమంతునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, తృతీయస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇవి, పరమార్థ చంద్రికాఖ్యానంబగు , శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండతృతీయసర్గటీక,
ముగిసినది.



శ్రీ.

చతుర్థసర్గప్రారంభః.

స నిర్జిత్య పురీం శ్రేష్ఠాం లంకాం తాం కామరూపిణీమ్
విక్రమేణ మహాతేజా హనూమా న్కపిసత్తమః. ౧
అద్వారేణ మహాబాహుః ప్రాకార మభి పుప్లువే

టీక॥ మహాతేజాః=అధికమయినపరాక్రమముగలవాఁడును; కపిసత్తమః=






వానరశ్రేష్ఠుండును; మహాబాహుః = పెద్దచేతులుగలవాఁడునగు; సః = ఆ; హనూమాన్ = హనుమంతుఁడు; శ్రేష్ఠాం = ఉత్తమమయిన; పురీం = పట్టణస్వరూపయయినదియును; కామరూపిణీం = ఇచ్ఛాధీనంబగురూపంబుగలదియునగు; తాం = ఆ; లంకాం = లంకను; విక్రమేణ = పరాక్రమముచేత; నిర్జిత్య = జయించి; అద్వారేణ = ద్వారముగానిప్రదేశముచేత; ప్రాకారం = ప్రహరిని; అభిపుప్లువే = దాఁటెను.

మహాపరాక్రమశాలియు వానరశ్రేష్ఠుండునగు నాహనుమంతుండు, ఉత్తమపట్టణస్వరూపమై, కామరూపిణియయియుండు, నాలంకం బరాక్రమంబున లోఁగొని, "గ్రామం వా నగరం వాపి పత్తనం వా పరస్య హి। విశేషాత్సమయే సౌమ్య న ద్వారేణ విశేన్నృప" (రాజా! శత్రువుని గ్రామంబును గాని నగరంబును గాని పట్టణంబును గాని ద్వారంబుచేఁ బ్రవేశింపఁగూడదు; విశేషించి, శత్రువును జయింపనిచ్చగొనియుండు సమయంబునం గూడదు.) అని, శత్రుపట్టణంబును ద్వారంబుదారినిఁ బ్రవేశింపఁగూడదని చెప్పఁబడియుండుటం జేసి, దానినెఱింగినవాఁడు, కావున, ద్వారంబునం బోక, కోటప్రాకారంబునే దాఁటెను.

అని, తాత్పర్యము.

ప్రవిశ్య నగరీం లంకాం కపిరాజహితంకరః. ౨
చక్రేథ పాదం సవ్యం చ శత్రూణాం సతు మూర్ధని

టీక॥ కపిరాజహితంకరః = వానరప్రభుండగు సుగ్రీవునకు మేలుసేయునట్టి; సతు = ఆహనుమంతుఁడును; లంకాం = లంకయనెడు; నగరీం = పట్టణమును; ప్రవిశ్య = చొచ్చి; అథ = అటుపిమ్మట; శత్రూణాం = శత్రువులయొక్క; మూర్ధని = తలయందు; సవ్యం = ఎడమదైన; పాదంచ = కాలును; చక్రే = చేసెను, ఉంచెననుట, "శత్రుదేశమును బ్రవేశించు కాలంబున మొదట నెడమకాలుంచుట, శత్రువుశిరస్సునందుంచినట్లగుచున్నది" అని రాజశాస్త్రమునందున్నది, కావున, శత్రువులశిరస్సునందు వామపాదంబుంచెననటచే, లంకాపురియందు మొదట వామపాదంబుంచెనని, సిద్ధమగుచున్నది.

ఆహనుమంతుండు, వానరరాజుండగు సుగ్రీవునకు మేలుసేయువాఁడును, రావణునకుఁగీడుసేయఁ గోరువాఁడును గావున, "ప్రయాణకాలే చ గృహప్ర



వేశేవివాహకాలేపిచ దక్షిణాంఘ్రిం। కృత్వాగ్రతశ్శత్రుపురప్రవేశేవామంనిదధ్యాత్పురతోనృపాలః" (రాజుపయనంబగునపుడును, గృహప్రవేశమునందును, వివాహంబగునపుడును, మొదటఁగుడికాలుంచవలయును; శత్రుపట్టణమునుప్రవేశించునపుడు, మొదటవామపాదంబునుంచవలయును)అని, బృహస్పతి చెప్పినచొప్పున, రావణునకుఁగీడుగల్గుటకై, మొదటవామపాదంబుంచి, లంకంబ్రవేశించెను. అని, తాత్పర్యము.

ప్రవిష్ట స్సత్త్వసంపన్నో నిశాయాం మారుతాత్మజః. ౩
స మహాపథ మాస్థాయ ముక్తా పుష్పవిరాజితమ్

టీక॥ సత్త్వసంపన్నః=బలముతోఁగూడిన; సః=ఆ; మారుతాత్మజః=వాయుదేవునికొడుకయిన హనుమంతుండు; నిశాయాం=రాత్రియందు; ముక్తాపుష్పవిరాజితం = ముత్తెములచేతను బూలచేతనుంబ్రకాశింపఁజేయఁబడిన; మహాపథం=రాజమార్గమును; ఆస్థాయ=అవలంబించి; ప్రవిష్టః=ప్రవేశించినాఁడు.

బలవంతుండును వాయుకుమారుండునగు నాహనుమంతుండు, ముత్తెములుఁబూలుఁజల్లియుంటంజేసి ప్రకాశించుచుండు రాజమార్గంబునంబోయెను, అని, తాత్పర్యము.

తతస్తు తాం పురీం లంకాం రమ్యా మభియయౌ కపిః. ౪

టీక॥ తతస్తు = అపిమ్మటను; కపిః = కోఁతియగుహనుమంతుండు; రమ్యాం=మనోహరమయిన; తాం=ఆ; లంకాం= లంకయనెడు; పురీం=పట్టణమును; అభియయౌ=పొందెను.

అంత, నాహనుమంతుండు, రమణీయంబగు నాలంకాపట్టణంబులోఁబోవుచుండెను. అని, తాత్పర్యము.

హసితోత్కృష్టనినదై స్తూర్యఘోషపురస్సరైః
వజ్రాంకుశనికాశైశ్చ వజ్రజాలవిభూషితైః. ౫
గృహమేఘైః పురీ రమ్యా బభాసే ద్యౌరివాంబుదైః
("గృహముఖ్యైఃపురీ" అని పాఠాంతరము)

టీక॥ తూర్యఘోషపురస్సరైః = వాద్యధ్వనులు ముందునడుచునవి గాఁగల; హసితోత్కృష్టనినదైః = నవ్వులచేఁగలిగిన యధికమయిన ధ్వనులతోఁ; యుక్తైః (అధ్యాహృతము) = కూడినవియు; వజ్రాంకుశనికాశైశ్చ = వజ్రాయుధముతోను అంకుశముతోను సమానములయినవియు; వజ్రజాలవిభూషితైః = వజ్రమణులయొక్క సమూహములచేన లంకరింపఁబడినవియు నగు; గృహమేఘైః = గృహశ్రేష్ఠములచేత; గృహముఖ్యైః (పాఠాంతరము) = గృహశ్రేష్ఠములచేత; రమ్యా = సుందరమయిన; పురీ = లంకాపట్టణము; అంబుదైః = మేఘములచేత; ద్యౌరివ = ఆకాశమువలెఁ; బభాసే = ప్రకాశించెను.

రమణీయమయిన యాలంకాపట్టణము, ఎడతెగక మ్రోయుచున్న వాద్యములధ్వనులును నవ్వుటవలనం గలిగినధ్వనులునుం గలిగి యొప్పుచు వజ్రాయుధమునంకుశమునుంబోలె నతికఠినంబులై నవజ్రములచేనలంకరింపఁబడియుండు గృహశ్రేష్ఠంబులతోఁగూడి, మేఘంబులతోఁగూడిన యాకాశంబుకైవడిఁ బ్రకాశించెను. అని, తాత్పర్యము.

ప్రజజ్వాల తదా లంకా రక్షోగణగృహైః శుభైః. ౬
సితాభ్రసదృశైశ్చిత్రైః పద్మస్వస్తికసంస్థితైః
వర్ధమానగృహైశ్చాపి సర్వతస్సువిభూషితా. ౭

టీక॥ శుభైః = మంగళకరంబులగు; రక్షోగణగృహైః = రాక్షసులసమూహముయొక్క, యిండ్లతోను; సితాభ్రసదృశైః = తెల్లని మేఘంబులతో సమానములును; చిత్రైః = ఆశ్చర్యము గలిగించునవియునగు; పద్మస్వస్తికసంస్థితైః = పద్మము స్వస్తికము అను సంస్థానభేదములతోఁగూడియున్న గృహంబులతోను; వర్ధమానగృహైశ్చాపి = వర్ధమానమను గృహలక్షణముతోఁ గూడిన యిండ్లతోను; యుక్తం = కూడిన; లంకా = లంకాపట్టణము; తదా = అప్పుడు; సర్వతః = అంతటను; సువిభూషితా = చక్కఁగా నలంకరింపఁ బడినదియై; ప్రజజ్వాల = ప్రకాశించెను.

అప్పుడు, మంగళకరంబులగు రాక్షసులగృహంబులతోను దెల్లని మేఘంబులకు సాటిసేయందగి చూపరులకాశ్చర్యం

బులిగించుచున్న "పద్మము స్వస్తికము వర్ధమానము" అనుసంస్థానభేదంబులఁ గట్టఁబడియుండు రాజగృహంబులతోనుంగూడియున్న యీలంకాపురి యంతటను జక్కఁగా నలంకరింపఁబడియుంటంజేసి, ప్రకాశించుచుండెను.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— "చతుశ్శాలా చతుర్ద్వారా సర్వతో భద్ర సంజ్ఞితా। పశ్చిమద్వారరహితా మధ్యావర్తాహయాననా।దక్షిణద్వారరహితా వర్ధమానాధనప్రదా। ప్రాగ్ద్వారరహితా స్వస్తి కాఖ్యాపుత్ర ధనప్రదా" (నాలుగిండ్లుకలదియై నాలుగు ప్రక్కలను ద్వారములుగలది సర్వతోభద్రము, దీనికిఁబద్మమని నామాంతరము. పడమటితట్టు ద్వారము లేక, నడుమబైలుగలిగినది హాయాననము; దక్షిణపు ద్వారము లేనిది వర్ధమానము, అదిధనమునిచ్చునది ; తూర్పువాకిలి లేనిది స్వస్తికము, అదికొడుకులధనమునిచ్చును.) అనిపద్మాదిగృహసంస్థానలక్షణములు.

తాం చిత్రమాల్యాభరణాం కపిరాజహితంకరః
రాఘవార్థం చరన్ శ్రీమాన్ దదర్శచ ననందచ. ౮

టీక॥ కపిరాజహితంకరః=వానరులకుఁబ్రభువయిన సుగ్రీవునకు మేలుసేయువాఁడును; శ్రీమాన్=స్వామికార్యమనుకూలించుట వలనంగలిగిన కాంతిగలవాఁడునగుహనుమంతుండు; రాఘవార్థం=రామునికొఱకు; చరన్=తిరుగుచు; చిత్రమాల్యాభరణాం = నానావర్ణంబులగు పుష్పమాలికలెసొమ్ములుగాఁగల; తాం = ఆలంకను; దదర్శచ=చూచెను. ననందచ=సంతసించెను.

వానరరాజుండగుసుగ్రీవునకు మేలుసేయునాహనుమంతుండు, స్వామికార్యంబనుకూలించుటంజేసి యధికకాంతి నొందినవాఁడై రామకార్యార్థంబుగాఁ దిరుగుచు, విచిత్రవర్ణంబులగుపుష్పమాలికలచేనలంకరింపఁబడియుండు నాలంకంజూచి, "ఎవ్వరికినిం బ్రవేశింపనలవిగానియీలంకను, అనాయాసంబునంబ్రవేశించినాఁడను, ఇంకసీతంజూడవచ్చును" అని, యెంతయుసంతోషించెను.

అని, తాత్పర్యము.

భవనా ద్భవనం గచ్ఛన్ దదర్శ పవనాత్మజః
వివిధాకృతిరూపాణి భవనాని తత స్తతః. ౯




టీక॥ పవనాత్మజః = వాయుదేవునికొడుకైనహనుమంతుండు ; భవనాత్=ఇంటినుండి; భవనం=ఇంటిని; గచ్ఛన్=పొందుచు; తత స్తతః=అంతకంతకు;వివిధాకృతిరూపాణి= నానావిధంబులయినయాకారంబులునురంగులునుగల;భవనాని=ఇండ్లను; దదర్శ=చూచెను.

వాయుదేవుని కుమారుండగుహనుమంతుండు,ఇంటింటికింబోవుచు, నంతకంతకు, నానావిధంబులగునాకారంబులును,బలుదెఱంగులయినరంగులునుంగల,గృహంబులంజూచెను.

అని, తాత్పర్యము.

శుశ్రావ మధురం గీతం త్రిస్థానస్వరభూషితమ్
స్త్రీణాం మదసమృద్ధానాం దివిచాప్సరసామివ. ౧౦

టీక॥ హనుమాన్ (అధ్యాహృతము) = హనుమంతుఁడు;మదసమృద్ధానాం=వృద్ధిబొందినమదముగల; స్త్రీణాం=స్త్రీలయొక్క ;త్రిస్థానస్వరభూషితం,త్రిస్థాన=హృదయముకంఠముశిరస్సుఅనుమూఁడైన స్థానంబులంగల్గిన, స్వర=మంద్రమధ్యమతారంబులను స్వరంబులచేఁ;భూషితం= అలంకరింపఁబడినదియు;మధురం=మనోహరంబును ; దివి=స్వర్గమునందు, ఉన్న; అప్సరసాం=అచ్చరలయొక్క;గీతం (అధ్యాహృతము)ఇవ (స్థితం)= గానమువలెనున్నదియునగు ; గీతం=గానమును; శుశ్రావ=వినెను.

అచ్చట,హనుమంతుఁడు, స్త్రీలు, మద్యంబుద్రావిమదించి,యురః కంఠశిరంబులనెడు స్థానంబులం బుట్టిన మంద్రమధ్యమతారస్వరంబులనలంకృతంబగునట్లుగా, స్వర్గమునందున్నయప్సరసలుంబోలె మధురంబుగాఁ బాడు, గానంబు,నాలకించెను.

అని, తాత్పర్యము.

శుశ్రావ కాంచీనినదం నూపురాణాంచ నిస్స్వనమ్
సోపాననినదాంశ్చైవ భవనేషు మహాత్మనామ్. ౧౧
ఆస్ఫోటితనినాదాంశ్చ క్ష్వేళితాంశ్చ తత స్తతః

టీ॥హనుమాన్ (అధ్యాహృతము)= హనుమంతుండు;తత స్తతః= అంతకంతకు;మహాత్మనాం=అధికమయినధైర్యముగలరాక్షసులయొక్క; భవనేషు=



ఇండ్లయందు; కాంచీనినదం=ఆడవాండ్రమొలనూళ్లధ్వనిని; నూపురాణాం=అందెలయొక్క; నిస్స్వనంచ=ధ్వనిని; సోపాననినదాంశ్చైవ=పడికట్లెక్కునప్పుడు దిగునపుడుగలిగినధ్వనులను; ఆస్ఫోటితనినాదాంశ్చ= చేతులుతట్టుటచేతంగలిగినధ్వనులను; క్ష్వేళితాంశ్చ=సింహనాదంబులను; శుశ్రావ=వినెను.

ఆహనుమంతుండు, అంతకంతకు, మహైశ్వర్యశాలులగు రాక్షసులయిండ్లయందు, స్త్రీలునడుచునపుడు గలుగు మొలనూలిధ్వనిని, అందెలశబ్దంబును, బడికట్లెక్కునపుడుదిగునపుడుగలుగుధ్వనులను, చేతులుతట్టుటవలనంగలుగుధ్వనులను, భటులసింహనాదంబును, వినెను. అని, తాత్పర్యము.

శుశ్రావ జపతాం తత్ర మంత్రాన్ రక్షోగృహేషు వై. ౧౨

టీక॥ సః(అధ్యాహృతము)= ఆహనుమంతుఁడు; రక్షోగృహేషు= రాక్షసులయిండ్లయందు ("వై" అనునదిపాదపూరణార్థము); మంత్రాన్= వేదమంత్రములను; జపతాం=జపించుచున్నవారలయొక్క; నినదం (అధ్యాహృతము)=ధ్వనిని; శుశ్రావ=వినెను.

ఆహనుమంతుండు, రాక్షసుల గృహంబులలో వేదమంత్రంబులజపించుచున్నవారికంఠధ్వనిని, వినెను. అని, తాత్పర్యము.

స్వాధ్యాయనిరతాంశ్చైవ యాతుధానాన్ దదర్శ సః
రావణస్తవసంయుక్తాన్ గర్జతో రాక్షసానపి. ౧౩

టీక॥ సః=ఆహనుమంతుఁడు; స్వాధ్యాయనిరతాన్= వేదాధ్యయనమందాసక్తులగు; యాతుధానాంశ్చైవ= రాక్షసులను; రావణస్తవసంయుక్తాన్= రావణునియొక్క స్తోత్రములతోఁగూడిన, రావణుని స్తుతించుచున్నయనుట; గర్జతః=అఱచుచున్న; రాక్షసానపి=రాక్షసులను; దదర్శ=చూచెను.

ఆహనుమంతుండు, వేదాధ్యయనంబుసేయుచుండు రాక్షసులను, గట్టిగానఱచుచు, రావణునింబొగడుచున్నరాక్షసులనుంజూచెను. అని, తాత్పర్యము.

స ౪

రాజమార్గం సమావృత్య స్థితం రక్షోబలం మహత్
దదర్శ మధ్యమే గుల్మే రావణస్య చరా న్బహూన్. ౧౪

టీక॥సః(అధ్యాహృతము)=ఆహనుమంతుండు; రాజమార్గం = పెద్దత్రోవను; సమావృత్య = వ్యాపించి; స్థితం=ఉన్న; మహత్ = గొప్పదైన; రక్షోబలం= రాక్షససైన్యమును; మధ్యమే=నడుముదైన; గుల్మే= సేనాభాగమునందు; రావణస్య = రావణునియొక్క; బహూన్ = అనేకులయిన; చరాన్=దూతలను; దదర్శ=చూచెను.

ఆహనుమంతుండు, పోవుచుంబోవుచు, రాజమార్గంబునందు విడిసియున్నగొప్పదియగు రాక్షససైన్యమును, ఆ సైన్యపు మధ్యభాగంబునందుం దిరుగులాడుచుండు, రావణునిదూతలననేకులనుం, జూచెను. అని, తాత్పర్యము.

దీక్షితా న్జటిలా న్ముండా న్గోజినాంబరవాససః
దర్భముష్టిప్రహరణా నగ్నికుండాయుధాం స్తథా. ౧౫
కూటముద్గరపాణీంశ్చ దండాయుధధరానపి
ఏకాక్షా నేకకర్ణాంశ్చ లంబోదరపయోధరాన్. ౧౬
కరాళా న్భుగ్నవక్త్రాంశ్చ వికటా న్వామనాం స్తథా
ధన్వినః ఖడ్గినశ్చైవ శతఘ్నీముసలాయుధాన్. ౧౭
పరిఘోత్తమహస్తాంశ్చ విచిత్రకవచోజ్జ్వలాన్
నాతిస్థూలా న్నాతికృశా న్నాతిదీర్ఘాతిహ్రస్వకాన్. ౧౮
నాతిగౌరా న్నాతికృష్ణా న్నాతికుబ్జా న్న వామనాన్
విరూపా న్బహురూపాంశ్చ సురూపాంశ్చ సువర్చసః. ౧౯
ధ్వజీ న్పతాకినశ్చైవ దదర్శ వివిధాయుధాన్

టీక॥సః(అధ్యాహృతము)=ఆహనుమంతుండు; దీక్షితాన్=యాగదీక్షనొందినవారలను; జటిలాన్=జడలుగలవారలను; ముండాన్=జుట్టులేనివారలను; గోజినాంబరవాససః; గోజిన=యెద్దుతోలును, అంబర=ఆకాశమును, వాసః=వస్త్రముగాగలవారలను, ఎద్దుతోలుకట్టుకొనియుండువారలనుదిగంబరు

లునుననుట; దర్భముష్టిప్రహరణాన్ = దర్భలపిడికిలెయాయుధముగాఁ గలవారలును పిడికెఁడుదర్భలచేనభిమంత్రించియనిష్టమును బోఁగొట్టువారలననుట; అగ్నికుండాయుధాన్ తథా = నిప్పుకుండమె యాయుధముగాఁ గలవారలను, అగ్నిహోత్రములో హోమముచేసి యాభిచారికకర్మములచే శత్రులంజంపువారలననుట; కూటముద్గరపాణీంశ్చ = కూటమనెడు నాయుధమును ముద్గర (ఇనుపగుదియ) అనెడు నాయుధమును హస్తమునందుగలవారలను; దండాయుధధరానపి = దండమనెడు నాయుధమును ధరించినవారలను; ఏకాక్షీన్ = ఒకకన్నుగలవారలను; ఏకకర్ణాంశ్చ = ఒక్కచెవిగలవారలను; లంబోదరపయోధరాన్ = వంగుచున్నకడుపును చండ్లను గలవారలను; కరాళాన్ = వికృతమగు రూపముగలవారలను; భుగ్నవక్త్రాంశ్చ = వంకరయగుముఖముగలవారలను; వికటాన్ = సమముగాని దేహముగలవారలను; వామనాంస్తథా = పొట్టివాండ్రను; ధన్వినః = విలుకాండ్రను; ఖడ్గినశ్చైవ = కత్తిగలవారలను; శతఘ్నీముసలాయుధాన్ = నాలుగుమూరలనిడివి గలయినుపముండ్లకఱ్ఱలును ఇనుపరోఁకళ్లనుఆయుధంబులుగాఁగలవారలను; పరిఘోత్తమమహాస్త్రాంశ్చ = పరిఘమనెడు నాయుధములలోఁ శ్రేష్ఠములైనవి చేతులందు గలవారలను; విచిత్రకవచోజ్జ్వలాన్ = నానావిధవర్ణములుగల కవచముచేఁ బ్రకాశించుచున్న వారలన; నాతిస్థూలాన్ = మిక్కిలియు లావుగానివారలన; నాతికృశాన్ = మిక్కిలియుసన్నగిల్లి యుండనివారలను; నాతిదీర్ఘాతిహ్రస్వకాన్ (నాతిదీర్ఘాతిహ్రస్వకాన్) = మిక్కిలియుఁబొడవుగానివారలను మిక్కిలియుఁగుఱచగానివారలను; నాతిగౌరాన్ = మిక్కిలియును తెల్లగానుండని వారలను; నాతికృష్ణాన్ = మిక్కిలియునల్లగా నుండనివారలను; నాతికుబ్జాన్ = మిక్కిలియు గూను లేకుండు వారలను; నవామనాన్ = పొట్టిగాకుండు వారలను; విరూపాన్ = వికృతమయిన రూపముగలవారలను; బహురూపాంశ్చ = అనేకరూపములు కలవారలను; సురూపాంశ్చ మంచి రూపముగలవారలను; సువర్చసః = మంచికాంతిగలవారలను; ధ్వజీన్ (ధ్వజినః) రాజచిహ్నములు వ్రాసియుండు టెక్కెములుగలవారలను, టెక్కెములఁ బట్టుకొని యుండువారలననుట; పతాకినశ్చైవ = పట్టుటెక్కెంబులుగలవారలను; వివిధాయుధాన్ =

నానావిధములగు నాయుధములను ధరించి యుండువారలను; దదర్శ = చూచెను.

ఆహనుమంతుఁడు, అంతకంతకుఁబోవుచుఁబోవుచు, దీక్షితులై జటాధారులముండితశిరస్కులనెద్దుతోలుగట్టుకొనినవారలదిగఁబరుల దర్భముష్టిచేనస్త్రమునివారించువారల నగ్నిహోత్రంబునహోమము గావించి యాభిచారిక క్రియలచే శత్రువులంజంపువారలఁగూటమనునాయుధమును ధరించినవారల ముద్గరమునుధరించి యుండువారలదండపాణులనేకాక్షుల నేకకర్ణులవంగుచుండు కడుపు గలవారల వ్రేలుకాడు చండ్లుగలవారల వికృతశరీరులవంకర ముఖంబుగల వారల విషమ దేహులఁబొట్టివారల ధనుర్ధరులఖడ్గధరులనాలుగుమూరలు నిడివి గలయినుపముండ్ల కట్టెఁబట్టుకొనియుండు వారలను సలంబెయాయుధంబుగాఁ గొనియుండువారలఁబరిఘంబుచేతఁగల వారలఁ బలువన్నెలయినరంగులు దీప్తియుండుకవచంబు ధరించినవారల నతిస్థూలురుకానివారలనతికృశులుకానివారలమిక్కిలియుఁబొడవుగానివారల మిక్కిలియుఁ గుఱుచగానివారలమఱితెల్లగానుండని వారల మఱినలుపుగానివారలనధికము గాగూనులేనివారలఁబొట్టిగాని వారల వికృతరూపులననేక రూపులమంచిరూపంబుగలవారలమంచికాంతిగలవారల రాజచిహ్నంబులు వ్రాసియుండుధ్వజంబులుపట్టుకొనియుండువారలఁజిత్రితంబగు పెక్కెంబులు ధరించి యుండువారలనానాయుధపాణులగు వారల నందఱ, వేర్వేఱం జూచెను.

అని తాత్పర్యము.

శక్తివృక్షాయుధాంశ్చైవ పట్టిసాశనిధారిణః. ౨౦
క్షేపణీపాశహస్తాంశ్చ దదర్శ సమహాకపిః
సగ్విణస్త్వనులిప్తాంశ్చ వరాభరణభూషితాన్. ౨౧
నానావేషసమాయుక్తాన్ యథాస్వైరగతాన్బహూన్
తీక్ష్ణశూలధరాంశ్చైవ వజ్రిణశ్చ మహాబలాన్. ౨౨

టీక॥ మహాకపిః= పెద్దకోఁతియగు; సః=ఆహనుమంతుండు ; శక్తివృక్షాయుధాంశ్చైవ= చిల్లకోలలును చెట్లునుఆయుధంబులుగాఁగల వారలను;

 

పట్టిసాశనిధారిణః=అడ్డకత్తిరిబిడుగు నుధరించియుండువారలను; క్షేపణీపాశహస్తాంశ్చ = ఒడసడపుగడలును బాశములును జేతులందుఁగలవారలను, స్రగ్విణస్తు=పుష్పమాలికలుగల వారలను; అనులిప్తాన్=మైపూఁతగల వారలను; వరాభరణభూషితాన్=శ్రేష్ఠములయినసొమ్ములచేతనలంకరింపఁబడిన వారలను; నానావేషసమాయుక్తాన్=పలు తెఱంగులయిన యలంకారములతోఁగూడినవారలను; యథాస్వైరగతాన్=యథేష్టమగుగమనముగలవారలను; తీక్ష్ణశూలధరాంశ్చైవ = కఱకుశూలములనుధరించినవారలను; వజ్రిణశ్చ=వజ్రాయుధమునుధరించిన వారలను; మహాబలాన్=అధికమయిన బలముగలవారలను; బహూన్=అనేకులను; దదర్శ=చూచెను.

ఆహనుమంతుండు, చిల్లకోలలధరించినవారలను వృక్షములనెయాయుధముగాఁగొనినవారలను అడ్డకత్తులధరించినవారలను బిడుగులధరించినవారలనుఒడసడపుగడలఁబాశంబులంబట్టుకొనియుండువారలను, బుష్పమాలికలధరించినవారలను జందనంబు మేనంబూసికొనియుండువారలను మేలయినసొమ్ములచే నలంకరింపఁబడియుండువారలను బలుతెఱంగులగు నలంకారంబులుచేసికొనియుండువారలను యథేష్టముగాఁ దిరుగులాడువారలనుగఱకుశూలంబులధరించినవారలను వజ్రాయుధపాణులను మహాబలులను, అనేకులం జూచెను. అని, తాత్పర్యము.

శతసాహస్రమవ్యగ్ర మారక్షం మధ్యమం కపిః
రక్షోధిపతినిర్దిష్టం దదర్శాంతఃపురాగ్రతః. ౨౩

టీక॥ కపిః=హనుమంతుఁడు; అంతఃపురాగ్రతః=లోపలి పట్టణము ముందట, పట్టణములోపలిభాగముననుట; రక్షోధిపతినిర్దిష్టం=రాక్షసులకుఁ బ్రభువైనరావణునిచేతనాజ్ఞాపింపఁబడినదియును; అవ్యగ్రం= ఏమఱుపాటులేనిదియును; శతసాహస్రం= నూఱువేలసంఖ్యగలదియునగు; మధ్యమం=నడుమనుండు; ఆరక్షం= సేనాభాగమును; దదర్శ=చూచెను.

అంత, హనుమంతుండు, రాక్షసప్రభుండగు రావణునియాజ్ఞంజేసి, పట్టణంబులోపలిభాగంబున నేమఱుపాటులేక యెచ్చరికతోఁ గావలియున్న, లక్ష

 

సంఖ్యగల మధ్యమగుల్మమును (సేనాభాగమును)జూచెను. అని, తాత్పర్యము.

స తదా తద్గృహం దృష్ట్వా మహాహాటకతోరణమ్
రాక్షసేంద్రస్య విఖ్యాత మద్రిమూర్ధ్ని ప్రతిష్ఠితమ్. ౨౪
పుండరీకావతంసాభిః పరిఖాభి రలంకృతమ్
ప్రాకారావృత మత్యంతం దదర్శ స మహాకపిః. ౨౫

టీక॥ సః=ఆహనుమంతుండు ; తదా=అప్పుడు ; తత్ = ఆసేనాభాగమును ; దృష్ట్వా=చూచి ; మహాకపిః=పెద్దకోఁతియగు ; సః=హనుమంతుఁడు ; మహాహాటకతోరణం= పెద్దబంగారువికారమగుబహిర్ద్వారము గలదియును ; విఖ్యాతం=ప్రసిద్ధమయినదియును ; అద్రిమూర్ధ్ని=పర్వతశిఖరమునందు ; ప్రతిష్ఠితం=ప్రతిష్ఠింపఁబడినదియును ; పుండరీకావతంసాభిః= తెల్ల తామరపుష్పంబులె చెవిమీఁదియలంకార పుష్పంబులుగాఁ గల ; పరిఖాభిః=అగడ్తలచేత ; అలంకృతం= అలంకరింపఁబడినదియును ; అత్యంతం= మిక్కిలియును ; ప్రాకారావృతం= ప్రహరిచేఁజుట్టఁబడినదియునగు ; రాక్షసేంద్రస్య=రాక్షసులకుఁ బ్రభువయిన రావణునియొక్క ; గృహం= ఇంటిని ; దదర్శ=చూచెను.

ఆహనుమంతుండు, అప్పుడా మధ్యమగుల్మముఁ జూచి, యంతబంగారుతోఁ గట్టఁబడిన పెద్దబహిర్ద్వారంబు గలిగి, పర్వతశిఖరంబునం బ్రతిష్ఠితంబై, తెల్లతామరపూలతో నిండియుండు నగడ్తలచేఁ నలంకృతంబై, చుట్టును బ్రాకారంబు చేఁజుట్టఁబడియుప్పుచుండు రాక్షసేంద్రుండగు రావణుని గృహంబుఁ జూచెను. అని, తాత్పర్యము.

త్రివిష్టపనిభం దివ్యం దివ్యనాదవినాదితమ్
వాజిహ్రేషితసంఘుష్టం నాదితం భూషణై స్తథా. ౨౬
రథై ర్యానై ర్విమానైశ్చ తథా హయగజై శ్శుభైః
వారణైశ్చ చతుర్దంతై శ్శ్వేతాభ్రనిచయోపమైః. ౨౭
భూషితం రుచిరద్వారం మత్తైశ్చ మృగపక్షిభిః
రక్షితం సుమహావీర్యై ర్యాతుధానై స్సహస్రశః. ౨౮

రాక్షసాధిపతేర్గుప్త మావివేశ మహాకపిః

టీక॥ మహాకపిః=పెద్దకోఁతియగు హనుమంతుండు; త్రివిష్టపనిభం=స్వర్గముతోసమానమైనదియును; దివ్యం=శ్రేష్ఠమును; దివ్యనాదవినాదితం=శ్రేష్ఠమైన పాటలచేత ధ్వనింపఁజేయఁబడినదియు; వాజిఘోషితసంఘుష్టం= గుఱ్ఱములకూఁతలచే ధ్వనింపఁజేయఁబడినదియు; తథా=అట్లు; భూషణైః = సొమ్ములచే; నాదితం=ధ్వనింపఁజేయఁబడినదియు; రథైః = రథములతోను; యానైః=మేనాలు మొదలగువానితోను; విమానైః= ఆకాశమునందుఁబోవుయానంబులతోను; తథా=అట్లు; శుభైః=మంగళకరంబులగు; హయగజైః=గుఱ్ఱములతోను ఏనుఁగులతోను; చతుర్దంతైః=నాలుగుదంతములుగల; శ్వేతాభ్రనిచయోపమైః= తెల్లనిమబ్బుల సమూహంబులతోఁబోల్కిగల; వారణైశ్చ = ఏనుఁగులతోను; యుక్తం(అధ్యాహృతము) = కూడినదియు; మత్తైః = మదించియుండు; మృగపక్షిభిశ్చ= మృగములచేతను బక్షులచేతను; భూషితం = అలంకరింపఁబడినదియును; రుచిరద్వారం=మనోహరమయిన వాకిలిగలదియును; సుమహావీర్యైః= మిక్కిలియు నధికమయిన పరాక్రమము గల; సహస్రశః=వేనవేలయిన; యాతుధానైః=రాక్షసులచేత; రక్షితం=కాపాడఁబడినదియు; రాక్షసాధిపతేః= రాక్షసులకుఁబ్రభువైన రావణునియొక్క; గృహం(అధ్యాహృతము)= ఇంటిని; గుప్తం=దాఁచఁబడినట్లుగా, రహస్యముగానను; ఆవివేశ= ప్రవేశించెను.

హనుమంతుండు, స్వర్గంబుతోసమానంబై, శ్రేష్ఠంబై, యుత్తమంబులగుగానంబులచేఁ బ్రతినాదితంబై, గుఱ్ఱంబుల హేషితంబులచే నాదితంబై, భూషణధ్వనులుగలిగి, రథంబులతో శిబికాదియానంబులతో విమానంబులతో మంగళలక్షణలక్షితంబులగు హయంబులతో గజంబులతోఁ దెల్లనిమేఘంబులంబోలుచతుర్దంతగజంబులతోఁగూడి, మదించినమృగపక్షులచే నలంకరింపఁబడి, మనోహరంబగుద్వారంబుఁగలిగి మహాపరాక్రమశాలు లగు రాక్షసులచే రక్షింపఁబడుచున్న రావణునిగృహంబు, నెవ్వరికినిం దెలియనట్లుగాఁ, బ్రవేశించెను.

అని, తాత్పర్యము.

స హేమజాంబూనదచక్రవాళం
మహార్హముక్తామణిభూషితాంతమ్
పరార్థ్యకాలాగరుచందనాక్తం
సరావణాంతఃపుర మావివేశ. ౨౯

టీక॥సః = ఆహనుమంతుఁడు; సహేమ= బంగారముతోఁగూడినదియు; జాంబూనదచక్రవాళం = బంగారువికారమైన ప్రాకారమండలముగలదియును; మహార్హముక్తామణిభూషితాంతం=శ్రేష్ఠమయినముత్తెములనుమణులచేనలంకరింపఁబడిన కొనగలిగినదియు; పరార్థ్యకాలాగరుచందనాక్తం=శ్రేష్ఠమయిననల్లనియగరు చందనములచేఁ బూయఁ బడినదియునగు; రావణాంతఃపురం = రావణునిలోపలిపట్టణమును; ఆవివేశ=ప్రవేశించెను.

ఆహనుమంతుండు, బంగారపుఁగట్టడములుగలిగి, బంగారువికారమయిన ప్రాకారము చుట్టునుంగలిగి, చివరల యందుమేలయిన ముత్తెపుసరములచేనలంకరింపఁబడి, యంతటనుమంచికృష్ణాగరుగంధజలముచల్లియుండు, రావణుని, యంతఃనగరముఁబ్రవేశించెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, చతుర్థస్సర్గః.
ఇది,స్పష్టార్థము.
ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు , శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండచతుర్థసర్గ టీక,
ముగిసినది.



శ్రీ

పంచమసర్గప్రారంభః.

తత స్స మధ్యంగత మంశుమంతం
జ్యోత్స్నా వితానం మహ దుద్వమంతమ్
దదర్శ ధీమాన్ దివి భానుమంతం
గోష్ఠే వృషం మత్త మివ భ్రమంతమ్. ౧

టీక॥తతః=అటుపిమ్మట;ధీమాన్= బుద్ధిమంతుండగు; సః=ఆహనుమంతుండు;దివి=ఆకాశమందు; మధ్యంగతం= నడుమునుబొందినవాడును;మహత్= గొప్పదైన;జ్యోత్స్నావితానం = వెన్నెలయొక్క-యతిశయమును;ఉద్వమంతం=క్రక్కుచున్నవాఁడును; గోష్ఠే= ఆవులమందయందు;భ్రమంతం=తిరుగుచున్న; మత్తం=మదించిన; వృషమువ (స్థితం) = తెల్లటియెద్దుఁబోలెనున్నవాఁడును;భానుమంతం = కాంతిగలవాఁడునగు; అంశుమంతం=కిరణములుగలవానిని;దదర్శ=చూచెను.

అంత, బుద్ధిమంతుండగు నాహనుమంతుండు,ఆకాశమునడుమనుండి, సర్వప్రదేశంబులను జంద్రికంబఱపుచు, కాంతియుక్తుండై, యావులమందయం దుఁదిరుగులాడు తెల్లటి యాఁబోతుం బోలెఁజూపట్టుచున్న, చంద్రునింజూచెను. అని, తాత్పర్యము.

లోకస్య పాపాని వినాశయంతం
మహోదధిం చాపి సమేధయంతమ్
భూతాని సర్వాణి విరాజయంతం
దదర్శ శీతాంశు మథాభియాంతమ్, ౨

టీక॥అథ=అటుపిమ్మట; సః (అధ్యాహృతము)= ఆహనుమంతుఁడు; లోకస్య=ప్రపంచముయొక్క; పాపాని= దుఃఖములను ; వినాశయంతం= పోఁగొట్టువాఁడును; మహోదధిం= సముద్రమును ; సమేధయంతంచాపి= వృద్ధినిబొందించువాఁడును ; భూతాని= పృథివ్యప్తేజో వాయ్వాకాశముల

స ౫

ను; సర్వాణి=అన్నిటిని; విరాజయంతం=ప్రకాశింపఁజేయువాఁడును; అభియాంతం=తిరుగుచున్నవాఁడునగు; శీతాంశుం=చంద్రుని;దదర్శ=చూచెను.

అంత,నాహనుమంతుండు, చల్లనివాఁడగుటచే,లోకులదుఃఖములఁ బోఁగొట్టువాఁడును, సముద్రమునువృద్ధిఁ బొందించువాఁడునై,పృథివ్యప్తేజోవాయ్వాకాశంబులనన్నింటినిం బ్రకాశింపఁజేయుచు, నాకాశంబునందిరుగుచున్న చంద్రునిం,జూచెను.అని,తాత్పర్యము.

యా భాతి లక్ష్మీ ర్భువి మందరస్థా
తథా ప్రదోషేషుచ సాగరస్థా
తథైవ తోయేషుచ పుష్కరస్థా
రరాజ సా చారునిశాకరస్థా. ౩

టీక॥యా=ఏ;లక్ష్మీః=కాంతి; భువి=భూమియందు; మందరస్థా=మందరపర్వతమందున్నదై; భాతి=ప్రకాశించుచున్నదో; తథా=అట్లు; యాలక్ష్మీః(అధ్యాహృతము)=ఏకాంతి; ప్రదోషేషుచ = సాయంకాలములయందు; సాగరస్థా=సముద్రమునందున్నదై;భాతి(అధ్యాహృతము) = ప్రకాశించుచున్నదో;తథైవ=అట్లే; యాలక్ష్మీః(అధ్యాహృతము)=ఏకాంతి; తోయేషుచ=నీళ్లయందును;పుష్కరస్థా=కమలంబులందున్నదై;భాతి =(అధ్యాహృతము) ప్రకాశించుచున్నదో;సా=ఆకాంతి;నిశాకరస్థా=చంద్రునియందున్నదై; చారు=సుందరముగా; రరాజ=ప్రకాశించెను.

భూమియందు,మంద[illegible]తంబున నేకాంతియుండునో; ప్రదో[illegible]లములయందు సముద్రంబున నేకాంతియుండునో; అట్లుజలంబులందుఁ గమలంబులనేకాంతియుండునో;అట్టికాంతి,చంద్రునియందప్పుడు, సుందరంబుగాఁబ్రకాశించినది.అని,తాత్పర్యము.

విశేషార్థము.— ఈసర్గమందుఁ బ్రతిశ్లోకమందు, ఛేకానుప్రాసమను శబ్దాలంకారము.ఈశ్లోకమునందు,మందరాదులయందుండు లక్ష్మీ చంద్రునియందుండినదని,చెప్పుటచే , చంద్రునియందులక్ష్మీమందరాదులందుండులక్ష్మీవంటిది," అని; సాదృశ్యము అనుమితంబగుటంజేసి,నిదర్శనాలంకారము.

హంసో యథా రాజతపంజరస్థ
స్సింహో యథా మందరకందరస్థః
వీరో యథా గర్వితకుంజరస్థ
శ్చంద్రో విబభ్రాజ తథాంబరస్థః. ౪

టీక॥ రాజతపంజరస్థః=వెండిపంజరమునందున్న; హంసః = అంచ; యథా=ఎట్లో; మందరకందరస్థః=మందరపర్వతముయొక్క గుహయందున్న; సింహః=సింహము; యథా=ఎట్లో; గర్వితకుంజరస్థః = మదించిన యేనుంగునందున్న; వీరః=పరాక్రమశాలియగువాఁడు; యథా=ఎట్లో; తథా=అట్లు; అంబరస్థః=ఆకాశమునందున్న; చంద్రః=చంద్రుఁడు; విబభ్రాజ=అధికముగాఁ ప్రకాశించెను. ఇందుపమాలంకారము.

ఎట్లుస్వభావంబుననె తెల్లఁగానుండు హంసము వెండిపంజరమునందుంచఁబడినదై మెచ్చుగాఁ బ్రకాశించునో, ఎట్లు మందరపర్వతము గుహయందుండుసింహము, అధికముగా రాజిల్లునో, ఎట్టుమదపుటేనుంగుపైఁ గూర్చున్నవీరుండుమిక్కిలియు, భాసిల్లునో, అట్లు, ఆకాశమునందున్నచంద్రుండు, అధికముగాఁ, బ్రకాశించుచుండెను. అని, తాత్పర్యము.

స్థితః కకుద్మానివ తీక్ష్ణశృంగో
మహాచల శ్శ్వేత ఇవోచ్చశృంగః
హస్తీవ జాంబూనదబద్ధశృంగో
రరాజ చంద్రః పరిపూర్ణశృంగః. ౫

టీక॥ పరిపూర్ణశృంగః=నిండినకలలుగల; చంద్రః=చంద్రుఁడు; తీక్ష్ణశృంగః స్థితః = కఱకుకొమ్ములుగలవాఁడైయున్న; కకుద్మానివ=తెల్లటి యెద్దువలెను; ఉచ్చశృంగః= ఉన్నతములైనశిఖరములుగల; శ్వేతః=తెల్లని; మహాచలఇవ=గొప్పకొండవలెను; జాంబూనదబద్ధశృంగః=బంగారముచేఁ గట్టఁబడినదంతములుగల; హస్తీవ= తెల్లటిపెనుంగువలెను; రరాజ=ప్రకాశించెను, ఉపమాలంకారము.

కఱకుశృంగంబులు (కొమ్ములు,) గల తెల్లనియెద్దుంబోలె, ఉన్నతశృంగములు(శిఖరములు) గల తెల్లకొండయుం

బోలె, బంగారపుఁదొడుగుగల శృంగములదంతములతోఁగూడిన తెల్లయేనుగుంబోలెఁ, సంపూర్ణ శృంగంబుల (కళల) తోఁగూడిన చంద్రుండుప్రకాశించెను. అని, తాత్పర్యము.

వినష్టశీతాంబుతుషారపంకో
మహాగ్రహగ్రాహవినష్టపంకః
ప్రకాశలక్ష్మ్యాశ్రయనిర్మలాంకో
రరాజ చంద్రో భగవాన్ శశాంకః. ౬

టీ॥ వినష్టశీతాంబుతుషారపంకః, వినష్ట=అగపడని, శీతాంబు=చల్లనీళ్ల యొక్క; తుషార=తుంపురలనెడు, పంకః=మాలిన్యముగలవాఁడును; మహాగ్రహగ్రాహవినష్టపంకః, మహాగ్రహ=పెద్దగ్రహములయిన శుక్రాదులయొక్క, గ్రాహ=గ్రహించుటచేత, కప్పుటచేతననుట, వినష్ట = అగపడని, పంకః=మాలిన్యముగలవాఁడును; లేక, మహాగ్రహ=పెద్దగ్రహమయినసూర్యునియొక్క, గ్రాహ=గ్రహించుటచేత, అతనికిరణములగ్రహించుటచేననుట, వినష్టపంకః=అగపడనిమాలిన్యముగలవాఁడును; ప్రకాశలక్ష్మ్యాశ్రయనిర్మలాంకః=వెల్తురుయొక్క యతిశయము యొక్క పొందుటచేస్వచ్ఛమైన గుఱుతుగలవాఁడును; శశాంకః=భూచ్ఛాయారూపమైన కుందేలు గుఱుతుగాఁగలవాఁడును; భగవాన్ = మాహాత్మ్యముగలవాఁడునగు; చంద్రః=చంద్రుండు; రరాజ=ప్రకాశించెను.

భగవంతుండును భూచ్ఛాయారూపమయిన శశమును ధరించినవాఁడునగుచంద్రుండు, మంచులేనివాఁడై, శుక్రాది గ్రహంబులఁ బ్రకాశింపనీయక, (సూర్యకిరణంబులు తనయందు నతిక్రమించుటంజేసియధికకాంతిగలిగి) యధికకాంతింజేసి, స్వచ్ఛమయియుండు, చిహ్నంబుగలిగి, ప్రకాశించెను.
అని, తాత్పర్యము.

శిలాతలం ప్రాప్య యథా మృగేంద్రో
మహారణం ప్రాప్య యథా గజేంద్రః
రాజ్యం సమాసాద్య యథా నరేంద్ర

స్తథా ప్రకాశో విరరాజ చంద్రః. ౭

టీక॥ మృగేంద్రః=మృగరాజైనసింహము; శిలాతలం=రాతిప్రదేశమును; ప్రాప్య=పొంది; యథా(రాజేత్)=ఎట్లుప్రకాశించునో; గజేంద్రః=ఏనుఁగులలో మేటియయినది; మహారణం=గొప్పయుద్ధమును; ప్రాప్య= పొంది; యథా(రాజేత్) = ఎట్లుప్రకాశించునో ; నరేంద్రః=రాజు ; రాజ్యం=దొరతనమును; సమాసాద్య=పొంది; యథా(రాజేత్)=ఎట్లు ప్రకాశించునో; తథా=అట్లు; ప్రకాశః=వెలుంగుచున్న; చంద్రః=చంద్రుండు ; విరరాజ= ప్రకాశించెను . ఉపమాలంకారము.

సింహమున్నతంబగుశిలాతలంబున నుండునేని యెట్లధికముగాఁబ్రకాశించునో,మత్తగజంబు,గొప్పయుద్ధంబు సేయునప్పుడు, ఎట్లెచ్చుగాఁబ్రకాశించునో,రాజుదొరతనము నొందునేని యెట్లుప్రకాశించునో, చంద్రుండట్లధికముగాఁబ్రకాశించెను.అని, తాత్పర్యము.

ప్రకాశచంద్రోదయనష్టదోషః
ప్రవృత్తరక్షః పిశితాశదోషః
రామాభిరామేరితచిత్తదోష
స్స్వర్గప్రకాశో భగవాన్ ప్రదోషః. ౮

టీక॥ప్రకాశచంద్రోదయనష్టదోషః=ప్రకాశించుచున్నచంద్రునిపొడుచుటచే బోయిన చీఁకటిగలదియును;ప్రవృత్తరక్షఃపిశితాశదోషః= జరగుచున్నరాక్షసులయొక్క మాంసభక్షణమనెడు దోషముగలదియును;రామాభిరామేరితచిత్తదోషః=స్త్రీలచేతను ప్రియులచేతనువిడువఁబడినమనస్సునందలికోపరూపమైనదోషముగలదియును; స్వర్గప్రకాశః=స్వర్గముతో సమానమయినదియును; భగవాన్=కాంతిగలదియునగు;ప్రదోషః=ప్రదోషకాలము;గతః(అధ్యాహృతము)=కడచినది.

వెల్తురుగలిగించుచంద్రోదయంబునఁ జీఁకటింబోఁగొట్టి, రాక్షసులకు మాంసభక్షణము సేయఁ దగినకాలమయి, కామినులకును గాముకులకును మానం బనం గలిగిన కోపాదుల

మాన్చి, స్వర్గలోకంబునుంబోలె నానందముగలిగించు, ప్రదోషకాలంబు, కడచినది.

అని, తాత్పర్యము.

తంత్రీస్వనాః కర్ణసుఖాః ప్రవృత్తా
స్స్వపంతి నార్యః పతిభి స్సువృత్తాః
నక్తంచరాశ్చాపి తథా ప్రవృత్తా
విహర్తు మత్యద్భుతరౌద్రవృత్తాః. ౯

టీక॥ కర్ణసుఖాః=చెవులకుసుఖంబుగలిగించునట్టి; తంత్రీస్వనాః=వీణెతంతులధ్వనులు; ప్రవృత్తాః = ప్రవర్తించినవి. సువృత్తాః=మంచి యాచారముగల, పతివ్రతలగునటువంటి; నార్యః=స్త్రీలు; పతిభిః(సహ)= పెనిమిటులతోఁగూడ; స్వపంతి=నిదురించుచున్నారు. తథా=అట్లు; నక్తంచరాశ్చాపి= రాక్షసులును ; అత్యద్భుత రౌద్రవృత్తాః=మిక్కిలియునాశ్చర్యంబుగలిగించుభయంకరములయిన నడతలుగలవారలై; విహర్తుం=క్రీడించుటకు; ప్రవృత్తాః=అరంభించిరి.

అంతట, చెవులకుసుఖంబు గల్గునట్లుగా, వీణెలువాయింప నారంభించిరి; పతివ్రతలగుస్త్రీలు తాముభర్తలతోఁగూడసుఖంబుగనిదురించిరి; అట్లు, రాక్షసులును, వెఱఁగును వెఱపును గలిగించుచర్యలతో విహరింప నారంభించిరి. అని, తాత్పర్యము.

మత్తప్రమత్తాని సమాకులాని
రథాశ్వభద్రాసనసంకులాని
వీర శ్రియా చాపి సమాకులాని
దదర్శ ధీమా న్స కపిః కులాని. ౧౦

టీక॥ వీరః=పరాక్రమశాలియును; ధీమాన్=అధికమయినబుద్ధిగలవాఁడునగు; సః=ఆ; కపిః=హనుమంతుండు; మత్తప్రమత్తాని= మదించినవారునుఏమఱుపాటుగలవారునగు జనులుగలవియును; సమాకులాని=ఇఱుకటముగలవియును; రథాశ్వభద్రాసనసంకులాని= రథములచేతను గుఱ్ఱములచేతనుభద్రమను




జాతిలోని యేనుంగులచేతను సింహాసనములచేతను నిండినవియును; శ్రియా చాపి=సంపదచేతను; సమాకులాని=పూర్ణములయినవియునగు; కులాని=గృహములను;దదర్శ=చూచెను.

పరాక్రమశాలియు బుద్ధిమంతుండునగు హనుమంతుండు, మదించియే మలుపాటుతోఁగూడియుండు జనంబులుగల్గి, జనులునిండియుంటంజేసియిబుక్కై, రథములును గుఱ్ఱములునుభద్రగజంబులును సింహాసనంబులునుమెండుగాఁగల్గి,సంపదచేనిండియున్న, గృహంబులం,జూచెను. అని, తాత్పర్యము.

పరస్పరం చాధిక మాక్షిపంతి
భుజాంశ్చ పీనా నధినిక్షిపంతి
మత్తప్రలాపా నధికం క్షిపంతి
మత్తాని చాన్యోన్య మధిక్షిపంతి. ౧౧
రక్షాంసి వక్షాంసి చ విక్షిపంతి
గాత్రాణి కాంతాసుచ విక్షిపంతి
రూపాణి చిత్రాణిచ విక్షిపంతి
దృఢాని చాపానిచ విక్షిపంతి. ౧౨

టీక॥ సః(అధ్యాహృతము)= ఆహనుమంతుండు; అధికంచ=మిక్కిలియును;పరస్పరం=ఒండొరులను; ఆక్షిపంతి=పరిహసించుకొనుచున్నవారును; పీనాన్=బలిసియున్న;భుజాంశ్చ = చేతులను;అధినిక్షిపంతి= వేసికొనువారును;అధికం=మిక్కిలియును;మత్తప్రలాపాన్ = మదించువారుసేయునసర్థకంబులగు కూఁతలను;క్షిపంతి=విడుచువారును,చేయువారలుననుట; మత్తాని చ=మదించినవారును; అన్యోన్యం=ఒండొరులను;అక్షిపంతి=ఆధిక్షేపించుచున్నవారును;వక్షాంసి=ఱొమ్ములను;విక్షిపంతిచ=విదిర్చుకొనువారును; కాంతాసు=భార్యలయందు;గాత్రాణి=అవయవములను;విక్షిపంతిచ= వేయుచున్నవారులును; చిత్రాణి=నానావిధములయిన;రూపాణి=ఆకారములను;విక్షిపంతిచ=నెఱపుచున్నవారలును;దృఢాని=గట్టివైన; చాపాని=విండ్లను;విక్షి




పంతి=మోపెట్టుచున్నవారలునగు; రక్షాంసి=రాక్షసులను;దదర్శ (అధ్యాహృతము)=చూచెను.

ఆహనుమంతుండు,మఱియనేకంబు సంజేసి, యొండొరులం బరిహసించుకొనుచు, నొండొరులపైబలిసినభుజంబులవేసికొనుచు, నర్థములేకుండునట్లువదరుచు,నొడలువిఱచి, యొండొరులనిందించుకొనుచు,వక్షస్స్థలంబులవిస్తరిల్లంజేయుచు,భార్యలపైఁగాళ్లంజేతులవేయుచుఁ,గామరూపులుకావున, నానావిధరూపంబులధరించుచు, దృఢంబులగుధనువులనుమోపెట్టువిహరించుచున్న,రాక్షసులంజూచెను.

అని, తాత్పర్యము.

దదర్శ కాంతాశ్చ సమాలభంత్యః
"కాంతాశ్చసమాలపంత్యః"అనిపాఠాంతరము.
స్తథా పరాస్తత్ర పున స్స్వపంత్యః
సురూపవక్త్రాశ్చ తథా హసంత్యః
క్రుద్ధాః పరాశ్చాపి వినిశ్శ్వసంత్యః. ౧౩

టీక॥సః(అధ్యాహృతము)= ఆహనుమంతుండు, తత్ర=అచ్చటఁ;పునః=ఇంకను; సమాలభంత్యః= (సమాలభంతీః)చందనాదులఁబూసికొనుచున్న సమాలపంత్యః,సమాలపంతీః(అని,పాఠాంతరము)=వినోదముగా మాటలాడుచున్న; కాంతాశ్చ=స్త్రీలను ; తథా=అట్లు;స్వపంత్యః(స్వపంతీః)=నిదురించుచున్న; పరాః= ఇతరస్త్రీలను; తథా=అట్లు;హసంత్యః (హసంతీః)=నవ్వుచున్న; సురూపవక్త్రాశ్చ= మంచిసౌందర్యముగలస్త్రీలను ; క్రుద్ధాః=కోపించినవారును; వినిశ్శ్వసంత్యః(వినిశ్శ్వసంతీః)నిట్టూర్పువిడుచుచున్నవారునగు ; పరాశ్చాపి=ఇతరస్త్రీలను; దదర్శ=చూచెను.

ఆహనుమంతుం,డచ్చోటఁ, జందనాదివిలేపనంబులమేనలందుకొనుచున్నస్త్రీలను, నిదురించుచున్నయువతులను, నవ్వుచున్న,మిక్కిలియు సుందరంబగుముఖంబుగలవనితలను, గోపంబుననిట్టూర్పులువుచ్చుచుండుకామినులను, వేఱ్వేఱంజూచెను.

అని, తాత్పర్యము.




మహాగజైశ్చాపి తథా నదద్భి
స్సుపూజితైశ్చాపి తథా సుసద్భిః
రరాజ వీరైశ్చ వినిశ్శ్వసద్భి
ర్హ్రదో భుజంగైరివ నిశ్శ్వసద్భిః. ౧౪

టీక॥సా(అధ్యాహృతము)= ఆపట్టణము; తథా=అట్లు;నదద్భిః= అఱచుచున్న ; మహాగజైశ్చాపి=పెద్దయేనుంగులచేతను; తథా=అట్లు;సుపూజితైః=చక్కఁగాఁబూజింపఁబడిన;సుసద్భిశ్చాపి==మిక్కిలియుఁబెద్దలచేతను;వినిశ్శ్వసద్భిః=నిట్టూర్పులు వుచ్చుచున్న; వీరైః = పరాక్రమశాలులగువారలచేతను ; నిశ్శ్వసద్భిః=నిట్టూర్పులువుచ్చుచున్న;భుజంగైః= సర్పములచేత;హ్రదఇవ = కోనేఱువలె; రరాజ=ప్రకాశించెను.

ఆపట్టణము, గర్జించుచున్న గొప్ప యేనుంగులును చక్కఁగాఁ బూజింపఁబడిన సత్పురుషులును , ప్రతివీరులు లేకుంటంజేసి,నిట్టూర్పులు వుచ్చుచున్న వీరులునుం,గలిగి,యట్లు నిట్టూర్పులు వుచ్చుసర్పంబులతోఁగూడిన , కోనేఱుంబోలెఁ, ప్రకాశించెను.

అని, తాత్పర్యము.

బుద్ధిప్రధానాన్ రుచిరాభిధానాన్
సంశ్రద్ధధానాన్ జగతః ప్రధానాన్
నానావిధానాన్ రుచిరాభిధానాన్
దదర్శ తస్యాం పురి యాతుధానాన్. ౧౫

టీక॥సః(అధ్యాహృతము)= ఆహనుమంతుఁడు;తస్యాం=ఆ;పురి=పట్టణమునందు; బుద్ధిప్రధానాన్=శ్రేష్ఠమయిన బుద్ధిగలవారును; రుచిరాభిధానాన్= మనోహరమయిన మాటలుగలవారును; సంశ్రద్ధధానాన్=శ్రద్ధలేనివారలును;జగతః = లోకమునకు ; ప్రధానాన్=ముఖ్యులయినవారును; నానావిధానాన్= పలుతెఱంగులయినయాచారములుగలవారలును; రుచిరాభిధానాన్= మనోహరములయిన పేరుగలవారునగు;యాతుధానాన్= రాక్షసులను;దదర్శ=చూచెను.

ఆహనుమంతుండు, ఆలంకాపట్టణ




మునందు,మహాబుద్ధిసంపన్నులును, మనోహరంబుగామాటలాడువారును,మతమునందుశ్రద్ధగలవారలును,లోకంబులందుముఖ్యులయినవారును,నానావిధములయిన యాచారము గలవారలును మంచిమంచిపేరులుగలవారలునగ,రాక్షసులంజూచెను.అని, తాత్పర్యము.

ననంద దృష్ట్వా సచ తాన్ సురూపా
న్నానాగుణా నాత్మగుణానురూపాన్
విద్యోతమానా న్స తదా నురూపాన్
దదర్శ కాంశ్చిచ్చ పున ర్విరూపాన్. ౧౬

టీక॥సచ=ఆహనుమంతుఁడు; సురూపాన్=మంచిరూపముగలవారలును;నానాగుణాన్=పలుదెఱంగులయినగుణములుగలవారలును; ఆత్మగుణానురూపాన్ = తమగుణములకుఁ దగిన వ్యవహారములు గలవారలునగు; తాన్=ఆరాక్షసులను; దృష్ట్వా=చూచి;ననంద=సంతోషించెను. సః=ఆహనుమంతుఁడు;తదా=అప్పుడు; పునః=మఱలను;విద్యోతమానాన్=ప్రకాశించుచున్నవారును;అనురూపాన్=తగినవారలును;విరూపాన్=వికృతమగురూపముగలవారలునగు;కాంశ్చిచ్చ= కొందఱను;దదర్శ=చూచెను.

ఆహనుమంతుండు, మంచిరూపంబుగలిగి, నానావిధగుణంబులుగలవారలయి, తమతమగుణంబులకుందగినవ్యవహారంబులు గల్గియున్న యారాక్షసులంజూచి,సంతసించెను;మఱియుఁ, దమయాకారంబులకుందగిన గుణంబులు గలిగి ప్రకాశించుచున్నవికృతరూపులఁ గొందఱం,జూచెను.అని, తాత్పర్యము.

తతో వరార్హా స్సువిశుద్ధభావా
స్తేషాం స్త్రియ స్తత్ర మహానుభావాః
ప్రియేషు పానేషుచ సక్తభావా
దదర్శ తారా ఇవ సుప్రభావాః. ౧౭

టీక॥తతః = అటుపిమ్మట; సః (అధ్యాహృతము) = ఆహనుమంతుఁ

మః; తత్ర=ఆలంకాపట్టణమందు; వరార్హాః=శ్రేష్ఠములయినయాభరణాదులకుఁదగినవారలును; సువిశుద్ధభావాః=పెనిమిటులవిషయమయి పరిశుద్ధమయినహృదయముగలవారలును; మహానుభావాః = శ్రేష్ఠములయినకటాక్షములు మొదలగు ననుభావములుగల వారలును; ప్రియేషు=భర్తలందున; పానేషు=త్రాగుటలందును; సక్తభావాః=తగిలినమనసుగలవారలును; సుప్రభావాః=అధికమయిన ప్రభావము గలవారలును; తారాఇవ(స్థితాః)= నక్షత్రములుంబోలె నున్నవారలునగు; తేషాం=ఆరాక్షసులయొక్క; స్త్రియః=భార్యలను; దదర్శ=చూచెను.

అంత, నాహనుమంతుండు, అచ్చట, శ్రేష్ఠములయినయాభరణములధరించి, పతుల విషయమయి పరిశుద్ధంబయియుండు హృదయంబుగలిగి, సుందరంబులగు కటాక్షవిక్షేపాదిశృంగారచేష్టల నెఱపుచుఁ, బతిభక్తిగలిగి, మద్యపానంబునందాసక్తలై మహాప్రభావంబున నక్షత్రంబులుంబోలెఁ దేజరిల్లుచున్న, యారాక్షసులభార్యలం జూచెను. అని, తాత్పర్యము.

శ్రియా జ్వలంతీ స్త్రపయోపగూఢా
నిశీథకాలే రమణోపగూఢాః
దదర్శ కాశ్చిత్ప్రమదోపగూఢా
యథా విహంగాః కుసుమోపగూఢాః. ౧౮

టీక॥ సః(అధ్యాహృతము)=ఆహనుమంతుఁడు; శ్రియా= కాంతిచేత; జ్వలంతీః=ప్రకాశించుచున్నవారలును; త్రపయా=సిగ్గుచేత; ఉపగూఢాః=కప్పఁబడినవారలును; నిశీథకాలే= అర్ధరాత్రకాలమునందు ; రమణోపగూఢాః=భర్తలచేఁగౌఁగిలింపఁబడినవారలును; ప్రమదోపగూఢాః= సంతోషముచేతఁగౌఁగిలింపఁబడినవారలును; సంతోషముచేనిండినవారలుననుట; కుసుమోపగూఢాః=పుష్పములచేఁగప్పఁబడినవారలును; విహంగాఃయథా(విహంగీఃయథాస్థితాః)= పక్షిస్త్రీలుంబోలెనున్నవారలునగు ; కాశ్చిత్ = కొందఱుస్త్రీలను; దదర్శ = చూచెను.

ఆహనుమంతుండు, అచ్చట, సౌందర్యముచేఁ బ్రకాశించుచు, నర్ధరాత్రమునందుఁ బ్రియులచేఁగౌఁగిలింపఁబడి సిగ్గునొందుచు , సంతోషంబునం దేలు

డుఁ, బుష్పంబులచే నలంకరించికొని, యాఁడుపక్షులుంబోలె రాజిల్లుచుండు, మతికొందఱుస్త్రీలం, జూచెను.

అని, తాత్పర్యము.

అన్యాః పునర్హర్మ్యతలోపవిష్టా
స్తత్ర ప్రియాంకేషు సుఖోపవిష్టాః
భర్తుః ప్రియా ధర్మపరా నివిష్టా
దదర్శ ధీమాన్మదనాభివిష్టాః. ౧౯

టీక॥ధీమాన్ = బుద్ధిమంతుండగు హనుమంతుండు; తత్ర= ఆపట్టణమునందు; పునః=ఇంకను; హర్మ్యతలోపవిష్టాః= మేడలయందుఁగూర్చుండినవారలును; ప్రియాంకేషు= పెనిమిటులయొక్క తొడలయందు; సుఖోపవిష్టాః=సుఖముగల్గునట్లుగాఁ గూర్చుండిన వారలును; భర్తుః=పెనిమిటికి; ప్రియాః= సంతోషముగలిగించువారలును; ధర్మపరాః=ధర్మమునందాసక్తలును; నివిష్టాః=పెండ్లాడఁబడినవారలును; మదనాభివిష్టాః= మన్మథునిచేనావేశింపఁబడినవారలునగు; అన్యాః=ఇతరలయిన స్త్రీలను; దదర్శ=చూచెను.

బుద్ధిమంతుండగు నాహనుమంతుండు, ఆపట్టణమందు, మేడలయందుఁ, బ్రియులతొడలపైసుఖంబుగాఁ గూర్చుండి, భర్తలకుఁబ్రియులయి, ధర్మపత్నులయి, ధర్మమునందు శ్రద్ధగలిగి, మన్మథావేశముతోఁగూడి, యున్నస్త్రీలనుగొందఱం, జూచెను.

అని, తాత్పర్యము.

అప్రావృతాః కాంచనరాజివర్ణాః
కాశ్చిత్పరార్థ్యా స్తపనీయవర్ణాః
పునశ్చ కాశ్చిచ్ఛశలక్ష్మవర్ణాః
కాంతప్రహీణా రుచిరాంగవర్ణాః. ౨౦

టీక॥సః(అధ్యాహృతము)= ఆహనుమంతుఁడు; అప్రావృతాః = వస్త్రము లేనివారలును; కాంచనరాజివర్ణాః = బంగారురేఖయొక్కవన్నె

వంటివన్నె గలవారునగు; కాశ్చిత్ = కొందఱును; పరార్ధ్యాః = శ్రేష్ఠులును; తపనీయవర్ణాః = కాచఁబడినబంగారముయొక్క వన్నెవంటివన్నెగలవారలునగు; కాశ్చిత్ (అధ్యాహృతము) = కొందఱును; పునశ్చ = ఇంకను; కాంతప్రహీణాః = పెనిమిటిచేత లేనివారలును, భర్తృవిరహము నొందినవారలు ననుట; కావున నే, శశలక్ష్మవర్ణాః = చంద్రునియొక్క వన్నెవంటివన్నెగలవారలును; సుచిరాంగవర్ణాః = మనోహరంబగు మేనిచాయగలవారలునగు; కాశ్చిత్ = కొందఱను; దదర్శ (అధ్యాహృతము) = చూచెను.

ఆ హనుమంతుండు, భర్తృసంగమంబునం జేసి దిగంబరలై బంగారురేఖ కుంబోలెఁ గాంతిగలవారలఁ గొందఱు స్త్రీలను, తప్తకాంచనవర్ణంబుగలిగి నయుత్తమ స్త్రీలఁ గొందఱును, మఱియు, మనోహరంబగు మేనిచాయగల వారయ్యు, భర్తృవిరహంబునం జేసి తెల్లఁబాఱి చంద్రుండుంబోలె పాండురకాంతిం జెజరిల్లుచుండు స్త్రీలఁ గొందఱునుం, జూచెను. అని, తాత్పర్యము.

తతః ప్రియాన్ప్రాప్య మనోభిరామాః
స్సుప్రీతియుక్తాః ప్రసమీక్ష్య రామాః
గృహేషు హృష్టాః పరమాభిరామాః
హరిప్రవీర స్సదదర్శ రామాః. ౨౧

టీక॥ హరిప్రవీరః = వానరులలో మిక్కిలియుఁబరాక్రమశాలియగు; సః = ఆహనుమంతుండు; తతః = అటుపిమ్మట; ప్రియాన్ = మనసునకిష్టులయినపురుషులను; ప్రాప్య = పొంది, వారలవెదకుచుఁబోయి వారలం బొందియనుట; సుప్రీతియుక్తాః = మిక్కిలియు సంతోషముతోఁ గూడియున్న; మనోభిరామాః = మనసును రమింపఁజేయునట్టి; రామాః = స్త్రీలను; ప్రసమీక్ష్య = చూచి; గృహేషు = ఇండ్లయందు; హృష్టాః = సంతోషముతోఁగూడియున్న; పరమాభిరామాః = మిక్కిలియు సౌందర్యముగల; రామాః = స్త్రీలను; దదర్శ = చూచెను.

అంత, వానరశ్రేష్ఠుండగు నాహనుమంతుండు, తమతమ ప్రియుల యొద్దకుం బోయి రతులం దేలి సంతోషంబు నొంది

యందు రూపవతులగు నభిసారికలను, గృహంబులయందుఁ దమతమభర్తలంగూడిసుఖంబనుభవించుచుండు సౌందర్యవతులయిన, పతివ్రతలనుం, జూచెను. అని, తాత్పర్యము.

చంద్రప్రకాశా శ్చహి వక్త్రమాలా
వక్రాక్షిపక్ష్మా శ్చ సునేత్రమాలాః
విభూషణానాంచ దదర్శమాలా
శ్శతహ్రదానా మివ చారుమాలాః. ౨౨

టీక॥సః(అధ్యాహృతము)=ఆహనుమంతుఁడు; చంద్రప్రకాశాః= చంద్రునియొక్క-కాంతివంటికాంతిగల; వక్త్రమాలాశ్చ=ముఖములయొక్క-పఙ్క్తులను; వక్రాక్షిపక్ష్మాశ్చ= వంకరలయినకండ్లఱెప్పలలోనివెండ్రుకలుగల; సునేత్రమాలాశ్చ=మంచికండ్లయొక్క-పఙ్క్తులను; శతహ్రదానాం= మెఱపులయొక్క-; చారుమాలాఇవ(స్థితాః)= సుందరములయిన పఙ్క్తులుంబోలె నున్న; విభూషణానాం= సొమ్ములయొక్క-; మాలాశ్చ = పఙ్క్తులను; దదర్శహి=చూచెనుగదా!

ఆహనుమంతుండు, రాక్షసస్త్రీల లోఁగలసిమనుష్యస్త్రీయున్నదోలేదోయని గనుంగొనుటకై, చంద్రునకుం బోలెకాంతిగలిగియుండు నాస్త్రీలముఖంబులను, వంకరలయిన ఱెప్పలలోని వెండ్రుకలుగలవారికండ్లనుఁ, జక్కఁగాఁబరీక్షించెను; మఱియు, రాముండు, చెప్పిన, సీతసొమ్ములయానవాలేమైనఁ గానవచ్చునోయని, మెఱపు సమూహములుంబోలె వెలుంగుచుండు, వారలసొమ్ములనుం, బరీక్షించి, చూచెను. అని, తాత్పర్యము.

న త్వేవ సీతాం పరమాభిజాతామ్
పథి స్థితే రాజకులే ప్రజాతామ్
లతాం ప్రఫుల్లా మివసాధుజాతామ్
దదర్శ తన్వీం మనసాభిజాతామ్

టీక॥సః(అధ్యాహృతము) = ఆహనుమంతుండు ; పరమాభిజాతాం=

స ౫

ముక్కటిసుందరియయినదియును; పథి=మంచిమార్గమునందు; స్థితే=ఉన్న; రాజకులే=రాజవంశమునందు; ప్రజాతాం=పుట్టినదియును; తన్వీం=కృశించునదియును; మనసా= మనసుచేత; తనసంకల్పముచేతనే; అభిజాతాం=పుట్టినదియును ; పరిఫుల్లాం=వికసించిన; సాధుజాతాం=సుందరమయిన; లతామివ(స్థితాం)=తీఁగెయుంబోలెనుండునదియునగు; సీతాం=సీతను; నత్వేవదదర్శ=చూడనేలేదు.

చూచినను, పరమసౌందర్యవతియై; సన్మార్గప్రవృత్తులగు రాజులవంశంబునంబుట్టినదియై, కృశాంగియై, రావణుండుతన్ను వేదవతీరూపంబుననున్నపుడు, బలాత్కారంబునంబట్టుటం జేసి, యతనితో "నినుంజంపుటకై ముఱల నే నవతరింతు" నని చెప్పినచొప్పున, స్వసంకల్పంబుననే యయోనిజయయి వెలసి సుందరంబయినతీఁగెయుంబోలె రాజిల్లుచుండు, నాసీతం, జూడనేలేదు.

అని, తాత్పర్యము.

ఆహనుమంతుం, డిట్లుపరీక్షించి

సనాతనే వర్త్మని సన్నివిష్టాం
రామేక్షణాం తాం మదనాభివిష్టామ్
భర్తుర్మనశ్శ్రీ మదనుప్రవిష్టాం
స్త్రీభ్యోవరాభ్యశ్చ సదావిశిష్టామ్. ౨౪

ఉష్ణార్దితాం సానుసృతాస్రకంఠీం
పురా వరార్హోత్తమనిష్కకంఠీమ్
సుజాతపక్ష్మా మభిరక్తకంఠీం
వనే ప్రనృత్తా మివ నీలకంఠీం. ౨౫

అవ్యక్తరేఖా మివ చంద్రరేఖాం
పాంసుప్రదిగ్ధా మివ హేమరేఖామ్
క్షతప్రరూఢా మివ బాణరేఖాం
వాయుప్రభిన్నా మివ మేఘరేఖామ్. ౨౬

సీతా మపశ్యన్మనుజేశ్వరస్య
రామస్యపత్నీం వదతాం వరస్య
బభూవ దుఃఖాభిహత శ్చిరస్య
ప్లవంగమో మంద ఇవాచిరస్య. ౨౭




టీక॥ప్లవంగమః= కోఁతియగుహనుమంతుండు;సనాతనే= పురాతనముయిన;వర్త్మని=మార్గమునందు,పాతివ్రత్యమునందనుట; సన్నివిష్టాం = ఉన్నదియును; రామే క్షణాంతాం= రామునిచూచుటయందునిశ్చయముగలదియును; మదనాభివిష్టాం=మన్మథునిచేనావేశింపఁబడినదియును;భర్తుః= పెనిమిటియయినరామునియొక్క; శ్రీమత్ =కాంతిగల;మనః=మనస్సును; అనుప్రవిష్టాం=ప్రవేశించినదియును; సదా=ఎల్లప్పుడును;వరాభ్యః = ఉత్తమలయిన; స్త్రీభ్యశ్చ=స్త్రీలకన్నను; విశిష్టాం = అధికయయినదియును;ఉష్ణార్దితాం = విరహతాపముచేఁబీడింపఁబడినదియును;సానుసృతాస్రకంఠీం = అనుసరించియుండుకన్నీళ్లతోఁగూడినకంఠముగలదియును, పురా = మునుపు రామునితోఁగూడ నున్నప్పుడు; వరార్హోత్తమ నిష్కకంఠీం, వరార్హ = అధికమయినవెలకుఁదగిన, ఉత్తమ = శ్రేష్ఠమయిన, నిష్క= పతకము, కంఠీం=కంఠమందుఁగలదియును; సుజాతపక్ష్మాం = సుందరములయిన కంటిఱెప్పమీఁదివెండ్రుకలుగలదియును; అభిరక్తకంఠీం= స్నేహముతోఁగూడినకంఠముగలదియును, తిన్నగామాటలాడునదియుననుట; వనే=అడవియందు; ప్రనృత్తాం=మంచినృత్తముగలనీలకంఠీమివ(స్థితాం)= ఆఁడునెమలియుంబోలెనున్నదియును; అవ్యక్తరేఖాం = తెలియఁబడని రేఖగల; చంద్రరేఖామివ(స్థితాం)= చంద్రుని రేఖయుంబోలె నున్నదియును; పాంసుప్రదిగ్ధాం= దుమ్ముచేఁగప్పఁబడిన;హేమరేఖామివ(స్థితాం)=బంగారుకడ్డీవలె నున్నదియును; క్షతప్రరూఢాం=గాయముదగిలికొంతపైఁగానాటియుండు;బాణరేఖామివ(స్థితాం)= బాణముచేనైనగీఱయుంబోలె నున్నదియును;వాయుప్రభిన్నాం= గాలిచే భేదింపఁబడిన;మేఘరేఖామివ(స్థితాం)= మేఘములపఙ్క్తియుఁబోలె నుండునదియును; వదతాం=మాటలాడువారలలో;వరస్య=శ్రేష్ఠుఁడును; మనుజేశ్వరస్య=మనుష్యులకుఁబ్రభుండునగు; రామస్య=రామునియొక్క; పత్నీం=భార్యయునగు;సీతాం=సీతను; చిరస్య= బహుకాలమునకుఁగూడ; అపశ్యన్= చూడనివాఁడై;అచిరస్య=శీఘ్రముగా, అప్పుడెయనుట;మందఇవ= మూఢుఁడుంబోలె;దుఃఖాభిహతః = దుఃఖముచేఁగొట్టఁబడినవాఁడు;బభూవ = అయెను.




అనాదిసిద్ధంబగుపాతివ్రత్యమువం దుస్థిరంబుగానుండి, రాముంజూడఁగోరుచు, మన్మథావేశముఁనొంది, శ్రీమంతంబగురామునిహృదయంబునధ్యానింపఁబడుచును త్తమస్త్రీలలోపలను త్తమయయి, భర్తృవిరహంబునంబరితపించుచు, ప్రతిమాటకునుగండ్లనీళ్లుగార్చుకొనుచు, మున్నురామునితోఁగూడియున్నవేళ, యుత్తమంబుపతకంబుచేఁ గ్రాలుచుండు కంఠంబుగలిగియుండునదైయిప్పుడుకన్నీళ్లెయాభరణంబుగాఁగలిగినకంఠంబుగలిగి, సుందరంబులగుతెప్ప వెండ్రుకలు గలదై, తిన్నగా మాటలాడునదై, వనంబునన్నృత్యంబుసేయునెమలియుంబోలెనున్నదై, మేఘంబుచేనావరింపఁబడిన చంద్రరేఖయుంబోలె బంగారుచేఁగప్పఁబడియుండు బంగారుకడ్డియుంబోలెస్వభావంబునఁగాంతిగలదయ్యు సంస్కారంబులేమింజేసి మాలిన్యంబునొందిన దేహంబుగలిగి, పైఁగామాత్రము కొంచెమాత్రిలోపల బాధగలిగియుండు బాణంబుచేఁగలిగిన గాయంబుం బోలెఁ దైనిసమాధానంబునంజేసి గంభీరంబుగానున్నను, అంతర్వేదనచే బాధింపఁబడుచు, వాయువుచేఁబాఱఁద్రోలంబడిన మేఘపఙ్క్తివడిఁ గృశత్వంబునొందిన, యుక్తయుక్తంబుగా మాటలాడువారలలోనుత్తముండయిన మనుజేశ్వరుండగు రామునకుం బత్నియైన, సీతను, బహుకాలంబు వెదకియుంజూడ నేరక, హనుమంతుండు, మందుండుం బోలె, దుఃఖంబునొందెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

సుందరకాండే, పంచమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, సుందరకాండపంచమసర్గటీక,

ముగిసినది.



శ్రీ

షష్ఠసర్గప్రారంభః.

స నికామం విమానేషు విషణ్ణః కామరూపధృత్
విచచార పున ర్లంకాం లాఘవేన సమన్వితః. ౧

టీక॥కామరూపధృత్=ఇచ్ఛాధీనంబగురూపంబుదాల్చునట్టి;సః=ఆహనుమంతుఁడు;విమానేషు=ఏడంతస్తులమేడలందు;నికామం=మిక్కిలియును;విషణ్ణః=దుఃఖమునొందినవాఁడై;లాఘవేన=చులుకనతో, వేగముతోననుట;సమన్వితః=కూడినవాఁడై; పునః=మఱల; లంకాం=లంకను,లంకయందనుట;విచచార=తిరిగెను.

ఇచ్ఛనువచ్చినరూపంబుదాల్పంజాలిన, యాహనుమంతుండు,విమానంబులందుసీత యగపడకుంటంజేసి, మిక్కిలియు,దుఃఖమునొంది,యంత, మఱల, వేగంబున,లంకలోఁదిరుగ నారంభించెను. అని, తాత్పర్యము.

ఆససాదాథ లక్ష్మీవా న్రాక్షసేంద్రనివేశనమ్
ప్రాకారేణా ర్కవర్ణేన భాస్వరేణాభిసంవృతమ్. ౨

టీక॥అథ = అటుపిమ్మట; లక్ష్మీవాన్ = ప్రశస్తంబగుకాంతిగలహనుమంతుండు;భాస్వరేణ=ప్రకాశించుచున్నదియు;అర్కవర్ణేన= సూర్యునియొక్క వన్నెవంటివన్నెగలదియునగు;ప్రాకారేణ=ప్రహరిచేత; అభిసంవృతం=చుట్టఁబడిన; రాక్షసేంద్రనివేశనం=రాక్షసులకుఁబ్రభువైనరావణునియొక్కగృహంబును;ఆససాద= పొందెను.

అంతఁ, గాంతిసంపన్నుండగు నాహనుమంతుండు, సూర్యుండుం బోలె నెఱుపువన్నెగలిగి ప్రకాశించు చున్న ప్రాకారంబుచేఁ జుట్టఁబడి యుండు రావణుగృహంబునకుంబోయెను. అని, తాత్పర్యము.

రక్షితం రాక్షసై ర్ఘోరై స్సింహై రివ మహ ద్వనమ్

సమీక్షమాణో భవనం చకాశే కపికుంజరః. ౩
"చచారకపికుంజరః" అని పాఠాంతరము.

టీక॥కపికుంజరః=వానర శ్రేష్ఠుం డగుహనుమంతుండు ; ఘోరైః=భయంకరులగు; రాక్షసైః= రక్కసులచేత ; రక్షితాం= కాపాడఁబడినదియును; సింహైః=సింహములచేత; రక్షితం (అభ్యాహ్యాతము)=కాపాడఁబడిన;మహత్ =గొప్పదగు;వనమివ(స్థితం)=అడవియుంబోలె నున్నదియునగు; భవనం=రాజగృహమును; సమీక్షమాణః=చూచుచు; చకాశే=ప్రకాశించెను,చచార (అని , పాఠాంతరము)= తిరిగెను.

వానరశ్రేష్ఠుండగు నాహనుమంతుండు, చూపరులకు వెఱపుఁ బుట్టించునట్టి రాక్షసులచే రక్షింపఁబడుచు సింహంబులచే రక్షింపఁబడు మహావనంబుకైవడి,దుష్ప్రవేశంబై, యొప్పుచుండు,నారావణగృహంబును జక్కఁగాఁ జూచుచు,నాశ్చర్యంబునొందెను. (పాఠాంతరపక్షమున,సంచరించెను.)

అని, తాత్పర్యము.

రూప్యకోపహితై శ్చిత్రై స్తోరణై ర్హేమభూషితైః
విచిత్రాభిశ్చ కక్ష్యాభి ర్ద్వారైశ్చ రుచిరై ర్వృతమ్. ౪
గజాస్థితై ర్మహామాత్రైః శూరైశ్చ విగతశ్రమైః
ఉపస్థిత మసంహార్యై ర్హయై స్స్యందనయాయిభిః. ౫
సింహవ్యాఘ్రతనుత్రాణై ర్దాంతకాంచనరాజతైః
ఘోషవద్భి ర్విచిత్రైశ్చ సదా విచరితం రథైః. ౬
బహురత్నసమాకీర్ణం పరార్ధ్యాసనభాజనమ్
మహారథ సమావాసం మహారథ మహాసనమ్. ౭
"మహారథసమావాసం" అని పాఠాంతరము.
దృశ్యైశ్చ పరమోదారై స్తైస్తైశ్చ మృగపక్షిభిః
వివిధై ర్బహుసాహస్రైః పరిపూర్ణం సమంతతః. ౮
వినీతై రంతపాలైశ్చ రక్షోభిశ్చ సురక్షితమ్

ముఖ్యాభిశ్చ వరస్త్రీభిః పరిపూర్ణాం సమంతతః. ౯
ముదితప్రమదారత్నం రాక్షసేంద్రనివేశనమ్
వరాభరణసంహ్రాదైః స్సముద్రస్వననిస్వనమ్. ౧౦
తద్రాజగుణసంపన్నం ముఖ్యైశ్చాగరుచందనైః
మహాజనైః స్సమాకీర్ణాం సింహైరివ మహద్వనమ్. ౧౧
భేరీమృదంగాభిరుతం శంఖఘోషనినాదితమ్
నిత్యార్చితం పర్వహుతం పూజితం రాక్షసైస్సదా
("నిత్యార్చితంసర్వసుఖమూర్జితం" అనిపాఠాంతరము.)
సముద్రమివ గంభీరం సముద్రమివ నిస్స్వనమ్
మహాత్మనో మహద్వేశ్మ మహారత్నపరిచ్ఛదమ్. ౧౩
మహారత్నసమాకీర్ణాం దదర్శ స మహాకపిః. ౧౪

టీక॥రూప్యకోపహితైః = వెండిచేఁ జేయఁబడినవియును ; చిత్రైః= నానావిధవర్ణములుగలవియును; హేముభూషితైః= బంగారముచే నలంకరింపఁబడినవియునగు; తోరణైః = బహిర్ద్వారముల చేతను; విచిత్రాభిః= నానావిధములయిన ; కక్ష్యాభిశ్చ= తొట్టికట్లచేతను; రుచిరైః=మనోహరములయిన; ద్వారైశ్చ=వాకిళ్ల చేతను; వృతం=చుట్టఁబడినదియు; గజాస్థితైః=ఏనుంగులనధిష్ఠించిన వారును ; శూరైః=యుద్ధమునందు భయపడనివారును; విగతశ్రమైః=పోయిన యలసటగలవారునగు; మహామంత్రైశ్చ= ప్రధానులచేతను; వృతం(అధ్యాహృతము)= చుట్టఁబడినదియును ; అసంహార్యైః=చంపఁగూడనట్టి ; స్యందనయాయిభిః = రథముచేఁ బోవునవియయిన; హయైః=గుఱ్ఱములచేత;ఉపస్థితం=అధిష్ఠింపఁబడినదియు; సింహవ్యాఘ్రతనుత్రాణైః= సింహములయొక్కయు పులులయొక్కయు చర్మము లేకవచములుగాఁ గలవియు; దాంతకాంచనరాజతైః = దంతవికారములును బంగారు వికారములును వెండి వికారములునైనవియు; ఘోషవద్భిః= అధికమయిన ధ్వని గలవియు ; విచిత్రైః=నానావిధము లయినవియు నగు; రథైశ్చ=రథముల చేతను;సదా= ఎల్లప్పుడు; విచరితం=సంచరింపఁ బ

స ౬

డినవియును;బహురత్నసమాకీర్ణం= అనేకములయినమణులచే వ్యాపింపఁబడినవియును ; పరార్ధ్యాసన భాజనం=శ్రేష్ఠములయినపీఠములునుపాత్రములును గలదియును; మహారథసమావాసం = పదునెకండు వేలమందివిలుకాండ్రతోఁ బోరెడుపీరులకునివాసస్థానమైనదియును; మహారథసమావాపం(పాఠాంతరము)= పదునొకండు వేలమందివిలుకాండ్రతోఁ బోరెడుపీరులకుజన్మస్థానమైనదియును, నివాసస్థానమునను; మహారథమహాసనం=గొప్పరథంబులుగలదియుగొప్పపీఠంబులుగలదియును; దృశ్యైః=చూడఁదగినవియు, సుందరములయినవియు ననుట; పరమోదారైశ్చ=మిక్కిలియుఁ బెద్దవైనవియు; వివిధైః= నానావిధములయినవియు; బహుసాహస్రైః= పెక్కువేలసంఖ్యగలవియు నగు ; తైః=ఆయా; మృగపక్షిభిః=మృగములచేతను బక్షులచేతను ; సమంతతః=అంతటను;పరిపూర్ణం=నిండినదియును; వినీతైః= శిక్షింపఁబడినవారును; అంతపాలైశ్చ=వెలుపలిభాగమును రక్షించువారునగు; రక్షోభిశ్చ=రాక్షసులచేతను;సురక్షితం=చక్కఁగా రక్షింపఁబడినదియును; ముఖ్యాభిః=ముఖ్యత్వముగల; వరస్త్రీభిః= శ్రేష్ఠస్త్రీలచేత; సమంతతః=అంతటను; పరిపూర్ణం=నిండినదియును; ముదితప్రమదారత్నం=సంతసించినస్త్రీలలో మేటియయినవారుగలదియును ; రాక్షసేంద్రనివేశనం = రాక్షసశ్రేష్ఠులకు నివాసస్థానమయినదియును ; వరాభరణసంహ్రాదైః = శ్రేష్ఠములయినయాభరణములయొక్క ధ్వనులచేత;సముద్రస్వననిస్వనం=సముద్రముయొక్కధ్వనివంటిధ్వనిగలదియును;రాజగుణసంపన్నం= రాజచిహ్నములైన ఛత్రచామరాదులతోఁగూడినదియును; ముఖ్యైః= శ్రేష్ఠములయిన;అగరుచందనైశ్చ= అగరుగంధములతోను శ్రీగంధముతోను; సంపన్నం (అధ్యాహృతము) = కూడినదియును;మహాజనైః= పూజ్యులయిన జనులచేత; సమాకీర్ణం=వ్యాపింపఁబడినదియును, కావుననే;సింహైః=సింహములచేత;సమాకీర్ణం(అధ్యాహృతము)=వ్యాపింపఁబడిన;మహత్=గొప్పదైన; వనమివ=(స్థితం)అడవియుంబోలెనున్నదియును;భేరీమృదంగాభిరుతం=భేరులయొక్కయు మృదంగములయొక్కయు ధ్వనులుగలదియును; శంఖఘోషనినాదితం= శంఖధ్వనిచే ధ్వనింపఁ జేయఁబడినదియు

ను; నిత్యార్చితం=ఎల్లప్పుడును గంధాదులం బూజింపఁబడినదియును; పర్వహుతం= పర్వపుదినములయందు హోమముగలదియును; రాక్షసైః=రాక్షసులచేత; సదా=ఎల్లప్పుడు; పూజితం= పూజింపఁబడినదియును; (పాఠాంతరపక్షమందు) సర్వసుఖం= అందఱకుసుఖంబుగలిగించునదియు; సదా=ఎల్లప్పుడు; రాక్షసైః= రాక్షసులచేత; ఊర్జితం=దృఢమయినదియును; గంభీరం=లోఁతుగల; సముద్రమివ(స్థితం)= సముద్రముంబోలెనున్నదియును; నిస్స్వనం=ధ్వనిలేని; సముద్రమిః స్థితం= సముద్రంబుంబోలెనున్నదియును; మహారత్నపరిచ్ఛదం= శ్రేష్ఠములయినరత్నములతోఁ జేయఁబడినకప్పుగలిగినదియును; మహారత్నసమాకీర్ణం= శ్రేష్ఠములయిన మణులచేవ్యాపింపఁబడినదియును; మహత్=గొప్పదియునగు; తత్= ఆ; మహాత్మనః=గొప్ప పరాక్రమంబుగలరావణునియొక్క; వేశ్మ= గృహమును; మహాకపిః= పెద్దకోఁతియయిన; సః=ఆహనుమంతుండు; దదర్శ= చూచెను.

వెండితోఁగట్టఁబడిబంగారు రేఖలచేనలంకరింపఁబడినానావిధవర్ణంబులుగలిగియుండు తోరణంబులనానావిధంబులగు తొట్టికట్టులసుందరంబులగు ద్వారంబులనలంకృతంబయి, యేనుంగులపైఁగూర్చుండిన వారయిశూరులయియలసటలేకుండుప్రధానులచేఁబాలితంబయి, రథంబులకుఁగట్టందగిన యవధ్యంబులగు గుఱ్ఱంబులతోఁగూడి, దంతమయంబులు రజతమయంబులు స్వర్ణమయంబులునైసింహచర్మంబుచేవ్యాఘ్రచర్మంబుచేఁగవచితంబులయి, యిటునటు కార్యవశంబునందిరుగుచుండువిచిత్రంబులగు రథంబులచేగొప్పధ్వనిఁగలిగియనేకరత్నంబులచేఁ ధగఁ ల్లుచువేలైనపీఠంబులతోఁబాత్రంబులతో నొప్పుచుఁ, బదునొకండు వేలమంది విలుకాండ్రతోఁబోరంజాలునట్టి వీరులకునివాసస్థానంబై, మేలయినరథంబులును మేలయినయాసనంబులునుంగలిగి, సుందరంబులుమిక్కిలియుఁ బెద్దవియు నానావిధంబులునగు పెక్కువేల మృగపక్షులచేఁ బరిపూర్ణంబై, యాయుధధారణాదులందుఁజక్కఁగా నేర్పుగలిగివెలుపటిభాగంబు రక్షింప నియుక్తులయిన రాక్షసవీరులచేసురక్షితంబై, సుందరస్త్రీలతోనిండి, మంచిసౌందర్యంబునంబ్రకాశించుచు నెల్లప్పుడు సంతోషంబునంబొందలుచుండువనితలుగలిగి, రాక్షసశ్రేష్ఠులకునికిపట్టయి, స్త్రీలుఁబురుష

సర్గ ౫

లుఁగార్యవశంబునందిరుగుచుండుటంజే సిధ్వనించుచుండు మంచిభూషణంబులధ్వ నులు గల్గుటవలన గొప్పధ్వనిగలసము ద్రంబునకుసాటిసేయందగినదై, రాజచి హ్నంబులగుఛత్రచామరాదులతోఁగూ డి, యగరుచందనాది గంధంబులసువా సితంబై, పురుషశ్రేష్ఠులుగల్గుటంజేసి, సింహంబులతోఁగూడిన మహావనంబుం బోలెఁజూపట్టుచు, భేరీధ్వనులమృదంగ శబ్దంబుల శంఖఘోషంబులం బ్రతినాది తంబై యెల్లప్పుడునుగంధపుష్పాదులన లంకరింపఁబడి, పర్వకాలంబులందుఁజే యఁబడు హోమంబుగలదియై (పాఠాంతరమందు, "అందఱకు సుఖకరంబై") రాక్షసులచేఁబూజింపఁబడుచు, (పాఠాంతరమందు, "రాక్షసులుకావలియుంటంజేసి, దుష్ప్రవేశంబై") గంభీరంబగు, సముద్రంబుంబోలెనున్నదై, యొక్కచోరాక్షసులునిద్రితులగుటంజే సినిశ్శబ్దంబగుసముద్రంబుకరణి నొప్పుచు, గొప్పమణులతోఁజేయఁబడినపై కప్పుకలిగి, గొప్పమణులతోనిండి, గొప్పదియయి, యుండు, మహాపరాక్రమశాలియగురావణునిగృహంబును, హనుమంతుండు, చూచెను. అని, తాత్పర్యము.

విరాజమానం వపుషా గజాశ్వరథసంకులమ్. ౧౪
లంకాభరణ మిత్యేవ సోమన్యత మహాకపిః

టీక॥ మహాకపిః= పెద్దకోఁతి యయిన; సః= ఆహనుమంతుండు; వపుషా= దేహముచేత; విరాజమానం= ప్రకాశించుచున్నదియును; గజాశ్వరథసంకులం= ఏనుంగులచేతను గుఱ్ఱములచేతను రథములచేతను నిండినదియునగు; తమ్ (అధ్యాహృతము)= ఆరావణుగృహమును; లంకాభరణం= లంకకుసొమ్ము, లంకకుసొమ్మువంటిది; ఇత్యేవ= అనియే; అమన్యత= తలంచెను.

రూపంబునంబ్రకాశించుచునేనుంగులునుగుఱ్ఱంబులునురథంబులును మెండుగాఁగలిగియొప్పుచున్న యారావణగృహంబుచూచి, యాహనుమంతుండు, "ఇది లంకకంతయు భూషణంబనందగియున్నది" అని, తలంచెను. అని తాత్పర్యము.

చచార హనుమాం స్తత్ర రావణస్య సమీపతః. ౧౫

టీక॥హనుమాన్= హనుమంతుండు;తత్ర=ఆరావణుని యింటియందు; రావణస్య=రావణునియొక్క; సమీపతః=దగ్గి అను;చచార=తిరిగెను.

హనుమంతుండు, ఆరావణమందిరంబున, రావణునిసమీపంబుననె, సీతనువెదకుచు, సంచరించెను.

అని, తాత్పర్యము.

గృహాద్గృహం రాక్షసానా ముద్యానానిచ వానరః
వీక్షమాణోహ్య సంత్రస్తః ప్రాసాదాంశ్చ చచార సః. ౧౬

టీక॥సః=ఆ;వానరః = హనుమంతుండు; రాక్షసానాం=రక్కసులయొక్క;గృహాత్=ఇంటినుండి; గృహం=ఇంటిని; ఉద్యానానిచ=ఉపవనంబులను; ప్రాసాదాంశ్చ=మేడలను ; వీక్షమాణః=చూచుచు;అసంత్రస్తః = భయంపడనివాఁడై ; చచార=సంచరించెను.

ఆహనుమంతుండు, భయముపడక, రాక్షసులప్రతిగృహంబును, ఉద్యానవనంబులను ప్రాసాదంబులనుం బరీక్షించుచు, సంచరించెను.అని, తాత్పర్యము.

అవప్లుత్య మహావేగః ప్రహస్తస్య నివేశనమ్
తతో న్య త్పుప్లువే వేశ్మ మహాపార్శ్వస్య వీర్యవాన్.౧౭

టీక॥ మహావేగః=అధికమయిన వేగముగలవాఁడును ; వీర్యవాన్=పరాక్రమముగలవాఁడునగు హనుమంతుండు; ప్రహస్తస్య=ప్రహస్తుండను రాక్షసునియొక్క; నివేశనం= గృహమును; అవప్లుత్య = పొంది ; తతః= అటుపిమ్మట ; అన్యత్ = ఇతరమయిన ; మహాపార్శ్వస్య = మహాపార్శ్వుండనువానియొక్క ; వేశ్మ= గృహమును;పుప్లువే=పొందెను.

అధికమయినవేగంబు గలవాఁడును బరాక్రమశాలియునగు హనుమంతుండు, ప్రహస్తునియింటికిం బోయి,యంతనచ్చటినుండిమహాపార్శ్వుని యింటికింబోయెను.అని, తాత్పర్యము.

అథ మేఘప్రతీకాశం కుంభకర్ణ నివేశనమ్
విభీషణస్య చ తదా పుప్లువే స మహాకపిః. ౧౮

టీక॥ అథ=అటుపిమ్మట; తదా=అప్పుడు; మహాకపిః=పెద్దకోఁతి యయిన; సః=ఆహనుమంతుండు; మేఘప్రతీకాశం=మబ్బుతోసమానమయిన; కుంభకర్ణనివేశనం = కుంభకర్ణునిగృహంబును; విభీషణస్య=విభీషణునియొక్క; నివేశనం (అధ్యాహృతము)=గృహమును; పుప్లువే=పొందెను.

అంతనప్పుడు,ఆహనుమంతుండు , మేఘంబునుంబోలెమిక్కిలియు గొప్పదైతలయెత్తిచూడఁదగియుండు,కుంభకర్ణునిగృహంబునకును , విభీషణునియింటికిని,బోయెను.

అని, తాత్పర్యము.

మహోదరస్యచ గృహం విరూపాక్షస్య చైవహి
విద్యుజ్జిహ్వస్య భవనం విద్యున్మాలే స్తథైవచ. ౧౯
వజ్రదంష్ట్రస్య చ తథా పుప్లువే స మహాకపిః

టీక॥ మహాకపిః=పెద్దకోఁతియయిన; సః=ఆహనుమంతుండు ; మహోదరస్య=మహోదరునియొక్క; గృహంచ=ఇంటిని; విరూపాక్షస్య= విరూపాక్షునియొక్క; గృహం (అధ్యాహృతము) చైవహి= ఇంటిని; విద్యుజ్జిహ్వస్య=విద్యుజ్జిహ్వుండనువానియొక్క; భవనం=ఇంటిని; తథైవ=అలాగే; విద్యున్మాలేః=విద్యున్మాలియనువానియొక్క; భవనం (అధ్యాహృతము) చ=ఇంటిని; తథా=అట్లు; వజ్రదంష్ట్రస్య=వజ్రదంష్ట్రుండను వానియొక్క; భవనం(అధ్యాహృతము) చ=ఇంటిని; పుప్లువే=పొందెను.

ఆహనుమంతుండు , మహోదరునిగృహంబునకుఁ బోయి,యంత, విరూపాక్షునియింటిలోనికిఁజని , యంత,విద్యుజ్జిహ్వునిభవనంబునకరిగి, యట్లు,విద్యున్మాలిగృహంబునకుంబోయి, యచ్చోటనుండివజ్రదంష్ట్రునియింటిలోనికింబోయెను.అని, తాత్పర్యము.

శుకస్య చ మహాతేజా స్సారణస్య చ ధీమతః. ౨౦
తథా చేంద్రజితో వేశ్మ జగామ హరియూథపః

టీక॥ మహాతేజాః=అధికమయినపరాక్రమముగల; హరియూథపః=వాన

రులసమూహములనుబాలించునట్టి, హనుమంతుండు; శుకస్య=శుకుండనువానియొక్క; వేశ్మ(అధ్యాహృతము)చ=ఇంటినిగూర్చియు;ధీమతః=అధికమయినబుద్ధిగల;సారణస్య = సారణునియొక్క; వేశ్మ(అధ్యాహృతము)చ= ఇంటినిగూర్చియును;తథా=అట్లు; ఇంద్రజితః=ఇంద్రజిత్తుయొక్క; వేశ్మచ=ఇంటినిగూర్చియు;జగామ=పోయెను.

మహాపరాక్రమశాలియు వానరసమూహంబులంబాలించువాఁడునగుహనుమంతుండు, శుకునియింటికినిబుద్ధిమంతుండగు సారణునిగృహంబునకును, అట్లు,ఇంద్రజిత్తు భవనంబునకునుం, బోయెను. అని, తాత్పర్యము.

జంబుమాలే స్సుమాలే శ్చ జగామ హరిసత్తమః. ౨౧

టీక॥ హరిసత్తమః=వానరశ్రేష్ఠుండగుహనుమంతుండు; జంబుమాలేః=జంబుమాలియనువానియొక్క; గృహం(అధ్యాహృతము)=ఇంటినిగూర్చియు; సుమాలేః = సుమాలియనువానియొక్క;గృహం(అధ్యాహృతము)చ=ఇంటినిగూర్చియు;జగామ=పోయెను.

వానరశ్రేష్ఠుండగు నా హనుమంతుండు,జంబుమాలియింటికిని,సుమాలిగృహంబునకునుం,బోయెను.

అని, తాత్పర్యము.

రశ్మికేతో శ్చ భవనం సూర్యకేతో స్తథైవచ
వజ్రకాయస్య చ తథా పుప్లువే స మహాకపిః. ౨౨

టీక॥మహాకపిః= పెద్దకోఁతియగు; సః=ఆహనుమంతుండు; రశ్మికేతోః=రశ్మికేతువనువానియొక్క;భవనంచ=గృహంబును;తథైవ=అట్లే; సూర్యకేతోః=సూర్యకేతువనువానియొక్క; భవనం(అధ్యాహృతము)చ=ఇంటిని; తథా=అట్లు;వజ్రకాయస్య = వజ్రకాయుండనువానియొక్క;భవనం(అధ్యాహృతము) చ=ఇంటిని; పుప్లువే=పొందెను.

ఆహనుమంతుండు, రశ్మికేతుగృహంబునకును సూర్యకేతుండను వానియింటికిని, వజ్రకాయుండనురాక్షసుని భవనంబునకునుం,బోయెను.

అని, తాత్పర్యము.

ధూమ్రాక్షస్య చ సంపాతే ర్భవనం మారుతాత్మజః
విద్యుద్రూపస్య భీమస్య ఘనస్య విఘనస్యచ. ౨౩

టీక॥ మారుతాత్మజః=వాయుదేవునికుమారుండగుహనుమంతుండు; ధూమ్రాక్షస్య=ధూమ్రాక్షునియొక్కయు; భవనం(అధ్యాహృతము)=ఇంటిని; సంపాతేః=సంపాతియొక్కయు; భవనంచ=ఇంటిని; భీమస్య = భయంకరుఁడైన; విద్యుద్రూపస్య= విద్యుద్రూపునియొక్కయు; ఘనస్య=ఘనుండనువానియొక్కయు; విఘనస్యచ = విఘనుండనువానియొక్కయు; భవనాని (అధ్యాహృతము)=ఇండ్లను; జగామ(అధ్యాహృతము)=పొందెను.

వాయుదేవుని కుమారుండగుహనుమంతుండు, ధూమ్రాక్షునియింటికిని, సంపాతి గృహంబునకును, భయంకరుండగు విద్యుద్రూపుని భవనంబునకును, ఘనుండనురాక్షసునియింటిలోనికిని, విఘనుండను రాక్షసునిగృహంబునకును,బోయెను.

అని, తాత్పర్యము.

శుకనాసస్య వక్రస్య శఠస్య వికటస్యచ
బ్రహ్మకర్ణస్య దంష్ట్రస్య రోమశస్య చ రక్షసః. ౨౪

టీక॥ సః(అధ్యాహృతము)=ఆహనుమంతుండు; శుకనాసస్య= శుకనాసుండనువాని యొక్కయు; వక్రస్య= వక్రుండనువానియొక్కయు; శఠస్య= శఠుఁడనువానియొక్కయు; వికటస్యచ=వికటుండనువానియొక్కయు; బ్రహ్మకర్ణస్య=బ్రహ్మకర్ణుని యొక్కయు; దంష్ట్రస్య=దంష్ట్రుండను వానియొక్కయు; రోమశస్య=రోమశుండను; రక్షసశ్చ = రాక్షసునియొక్కయు; భవనాని (అధ్యాహృతము)=ఇండ్లను;జగామ (అధ్యాహృతము)=పొందెను.

ఆహనుమంతుండు, శుకనాసుండను రాక్షసునియింటికిని,వక్రుండనువాని గృహంబునకును,వికటుండనువానియాలయంబునకును, బ్రహ్మకర్ణుండనువానిభవనంబునకును,దంష్ట్రుండనువానిగృహంబునకును,రోమశుండనురాక్షసునియింటికినింబోయెను.అని తాత్పర్యము.

యుద్ధోన్మత్తస్య మత్తస్య ధ్వజగ్రీవస్య నాదినః

విద్యుజ్జిహ్వేంద్రజిహ్వానాం తథా హస్తిముఖస్యచ. ౨౫

టీక॥సః(అధ్యాహృతము)= ఆహనుమంతుండు;యుద్ధోన్మత్తస్య= యుద్ధోన్మత్తుండనువానియొక్కయు;మత్తస్య=మత్తుండనువానియొక్కయు;ధ్వజగ్రీవస్య=ధ్వజగ్రీవుండను వానియొక్కయు; నాదినః= నాదియనువానియొక్కయు;విద్యుజ్జిహ్వేంద్రజిహ్వానాం= విద్యుజ్జిహ్వుఁడుఅనుపేరుగల వారలయొక్కయు, నింద్రజిహ్వుండుఅనుపేరు గలవారల యొక్కయు (ఆపేర్లుగలవారలుపెక్కుమందియున్నారుగావున బహువచనముచెప్పఁబడినది); తథా=అట్లు; హస్తిముఖస్యచ = హస్తిముఖుండనువానియొక్కయు; భవనాని(అధ్యాహృతము)=ఇండ్లను ; జగామ=పొందెను,

ఆహనుమంతుండు,యుద్ధోన్మత్తుని గృహంబునకును, మత్తునిగృహంబునకును,ధ్వజగ్రీవునిగృహంబునకును, నాదియనువాని గృహంబునకును , విద్యుజ్జిహ్వుండనుపేరుగలవారలగృహంబులకును ఇంద్రజిహ్వుండనుపేరుగలవారలగృహంబులకునుం,బోయెను.

అని, తాత్పర్యము.

కరాళస్య పిశాచస్య శోణితాక్షస్య చైవహి

టీక॥సః(అధ్యాహృతము)=ఆహనుమంతుఁడు;కరాళస్య=కరాళుఁడనువానియొక్కయు; పిశాచస్య = పిశాచుండనువానియొక్కయు; శోణితాక్షస్యచైవ = శోణితాక్షుండను వానియొక్కయు ; భవనాని(అధ్యాహృతము)=ఇండ్లను; జగామ (అధ్యాహృతము) హి=పొందెనుగదా!

ఆహనుమంతుండు, కరాళునియింటికిని,బిశాచునిగృహంబునకును, శోణితాక్షునిభవనంబునకునుంబోయి, చూచెను.అని, తాత్పర్యము.

క్రమమాణః క్రమేణైవ హనుమాన్మారుతాత్మజః. ౨౬
తేషు తేషు మహార్హేషు భవనేషు మహాయశాః
తేషామృద్ధిమతామృద్ధిం దదర్శ స మహాకపిః. ౨౭

టీక ॥ మహాయశాః=అధికమయినకీర్తిఁగలవాఁడునగు మారుతాత్మజః=

వాయుదేవునికుమారుండును; మహాకపిః=పెద్దకోతియనగు; సః=ఆహనుమంతుండు; క్రమేణైవ=వరుసచేతనే; క్రమమాణః=పోవుచు; మహాశ్లేషు=శ్రేష్ఠములయిన; తేషు తేషు=ఆయా; భవనేషు=ఇండ్లయందు; ఋద్ధిమతాం=అధికమయినసంపదగల; తేషాం= ఆరాక్షసులయొక్క; ఋద్ధిం= సంపదను; దదర్శ=చూచెను.

అధికమయినకీర్తిఁగలవాఁడును వాయుకుమారుండునగు నాహనుమంతుండు, ఇట్లువరుసగా నారాక్షసులయిండ్లకుంబోయి, యాయాగృహంబులందు, అధికమయినసంపదల నొందియుండు నారాక్షసుల,సంపత్తుం,జూచెను,

అని, తాత్పర్యము.

సర్వేషాం సమతిక్రమ్య భవనాని సమంతతః.
ఆససాదాథ లక్ష్మీవా న్రాక్షసేంద్రనివేశనమ్. ౨౮

టీక॥లక్ష్మీవాన్ = ప్రశస్తంబగు కాంతిగల హనుమంతుండు; సమంతతః=అంతటను;సర్వేషాం = అందఱియొక్క;భవనాని=ఇండ్లను;సమతిక్రమ్య=దాఁటి;అథ=అటుపిమ్మట; రాక్షసేంద్రనివేశనం=రాక్షసులకుఁబ్రభువయినరావణునియొక్క యింటిని;ఆససాద=పొందెను.

కాంతిసంపన్నుండగు నాహనుమంతుండు,అంతటందిరుగుచు, నందఱిగృహంబులనుంజూచి వానినతిక్రమించి, యంత, రాక్షసేశ్వరుండగురావణుని, యింటికిం,బోయెను.

అని, తాత్పర్యము.

రావణస్యోపశాయిన్యో దదర్శ హరిసత్తమః
విచరన్హరిశార్దూలో రాక్షసీర్వికృతేక్షణాః. ౨౯
శూలముద్గరహస్తాశ్చ శక్తితోమరధారిణీః

టీక॥హరిసత్తమః= వానరశ్రేష్ఠుండును;హరిశార్దూలః=వానరులయందుఁబెద్దపులివంటివాఁడునగు హనుమంతుండు;విచరన్ = తిరుగుచు;రావణస్య=రావణునకు; ఉపశాయిన్యః (ఉపశాయినీః)=సమీపమునందుఁబరుండియున్నవారును; వికృతేక్షణాః=వికారముగలకండ్లుగలవారలును; శూలము

ద్గరహస్తాశ్చ= శూలంబునుఇనుపగుదియయుచేతులందుఁ గలవారలును;శక్తితోమరధారిణీః= శక్తియనునాయుధమునుతోమరమను నాయుధమును ధరించియుండువారునగు; రాక్షసీః=రాక్షసస్త్రీలను;దదర్శ=చూచెను.

వానరశ్రేష్ఠుండగు హనుమంతుండు, ఆరావణగృహంబున సంచరించుచు, శూలముద్గరంబులఁ జేతులంబట్టుకొని,శక్తితోమరంబులనునాయుధంబులధరించిమెచ్చరికతో రావణునసమీపంబునంబరుండియున్న,వికృతంబులగుకండ్లుగలరాక్షసస్త్రీలం,జూచెను.

అని, తాత్పర్యము.

దదర్శ వివిధాన్ గుల్మాన్ తస్య రక్షఃపతే ర్గృహే. ౩౦
రాక్షసాంశ్చ మహాకాయా న్నానాప్రహరణోద్యతాన్

టీక॥సః (అధ్యాహృతము)=ఆహనుమంతుండు; రక్షఃపతేః=రాక్షసులకుఁబ్రభువయిన; తస్య= ఆరావణుని యొక్క; గృహే=ఇంటియందు; వివిధాన్ = పలుదెఱంగులయిన; గుల్మాన్= సేనలను; మహాకాయాన్= పెద్దదేహముగలవారలును; నానాప్రహరణోద్యతాన్=ఎత్తిపట్టుకొనఁబడినపలుదెఱంగులగు నాయుధంబులు గలవారలునగు; రాక్షసాంశ్చ= రక్కసులను;దదర్శ=చూచెను.

ఆ హనుమంతుండు, రాక్షసేశ్వరుండగునారావణునింటఁ గావలియుండు,నానావిధసేనలను, పలువిధంబులగునాయుధంబుల నాయితముగాఁ బట్టుకొనియుండుగొప్పదేహముగలరాక్షసులనుం,జూచెను.

అని, తాత్పర్యము.

రక్తాన్ శ్వేతాన్ సితాం శ్చాపి హరీంశ్చాపి మహాజవాన్. ౩౧
కులీనాన్ రూపసంపన్నాన్ గజా న్పరగజారుజాన్
నిష్ఠితాన్ గజశిక్షాయా మైరావతసమా న్యుధి. ౩౨
నిహంతౄ న్పరసైన్యానాం గృహే తస్మిన్ దదర్శ సః
క్షరతశ్చ యథా మేఘాన్ స్రవతశ్చ యథా గిరీన్. ౩౩
మేఘస్తనితనిర్ఘోషాన్ దుర్ధర్షాన్ సమరే పరైః




టీక॥సః—ఆహనుమంతుఁడు ; తస్మిక్=ఆ; గృహే=ఇంటియందు;సితాః—కట్టఁబడినవియు; రక్తాః= ఎఱ్ఱనివియు; శ్వేతాః= తెల్లనివియు; మహాజనాః=అధికమయిన వేగముగలవియునగు; హరింశ్చాపి= గుఱ్ఱంబులను; కులీనాః=మంచికులంబునంబుట్టినవియును;రూపసంపన్నాః= మంచిరూపంబుతోఁ గూడినవియును; పరగజారుజాః= శత్రువులయొక్క యేనుగులఁబీడించునవియును ; గజశిక్షాయాం=ఏనుఁగులకు నేర్పఁవలసిన విద్యయందు; నిష్ఠితాః= అనుభవముగలవియును;యుధి=యుద్ధమునందు;ఐరావతసమాః=ఐరావతమను నేనుంగుతోసరివచ్చునవియును ; పరసైన్యానాం=శత్రుసైనికులయొకరి ; నిహంతౄః=చంపునవియును ; క్షరతః=వర్షించుచున్న;మేఘాః చయథా(స్థితాః)=మబ్బులనుంబోలెనున్నవియును; స్రవతః=నీళ్లుకార్చుచున్న; గిరీః చయథా(స్థితాః)= పర్వతంబులుంబోలెనున్నవియునగు; మేఘస్తనిత నిర్ఘోషాః=మేఘంబులధ్వనివంటిధ్వనిగలవియును; సమరే= యుద్ధమునందు; పరైః—శత్రువులచేత ; దుర్ధర్షాః= ఎదిరింపఁగూడనివియునగు; గజాః=ఏనుంగులను; దదర్శ=చూచెను.

ఆహనుమంతుండు, రావణునింటఁ గట్టఁబడియుండు,నధికమైనవేగంబుగల యెఱుపువన్నెగుఱ్ఱంబులను, తెలుపువన్నెగుఱ్ఱంబులను,మఱియు సత్కులంబులంబుట్టినవియు, రూపసంపన్నంబులును, శత్రుగజంబులఁజంపునవియుఁ జక్కఁగాగజశిక్ష నేర్చినవియునై,యుద్ధమునందైరావతంబునకు సాటివచ్చుచు, శత్రుసైన్యంబులం జంపునవియై, గొప్పశరీరంబుగల్గి, యత్యున్నతంబులై మదజలంబు కార్చుచుండుటంజేసి, వర్షించుచున్న మేఘంబులుంబోలె, సెలయేఱులతోఁగూడిన పర్వతంబులకైవడిఁ జూపట్టుచు, మేఘంబువలెగర్జించుచు, యుద్ధంబున శత్రులకెదిరింపనలవిగానివై,యుండు, గజంబులనుం, జూచెను.

అని, తాత్పర్యము.

సహస్రం వాహినీ స్తత్ర జాంబూనద పరిష్కృతాః. ౩౪
హేమజాల పరిచ్ఛన్నా స్తరుణాదిత్య సన్నిభాః
దదర్శ రాక్షసేంద్రస్య రావణస్య నివేశనే. ౩౫

స ౬

టీక॥సః(అధ్యాహృతము)= ఆహనుమంతుఁడు; రాక్షసేంద్రస్య= రాక్షసులకుఁబ్రభుండైన ; రావణస్య= రావణునియొక్క; తత్ర=ఆ;నివేశనే= గృహంబునందు ; జాంబూనద పరిష్కృతాః=జంబూనదిలోఁ బుట్టినబంగారముచేనలంకరింపఁ బడినవియును; హేమజాలపరిచ్ఛన్నాః=ఇతరస్థలంబులంబుట్టిన బంగారములయొక్క సమూహములచేఁ గప్పఁబడినవియును; తరుణాదిత్యసన్నిభాః=యావనముగలసూర్యునితో సమానములయినవియునగు, మధ్యాహ్నకాలమునందలిసూర్యునితో సమానములయినవియు ననుట;వాహినీః= సేనలను, కాలిబంటుసేనలననుట ; సహస్రం=వేయింటిని, లెక్కలేని వానిననుట; దదర్శ = చూచెను.

ఆహనుమంతుండు, రాక్షసేశ్వరుండగు నారావణుగృహంబునం, గావలియుండువారల, జంబూనదింబుట్టినబంగారముతోనుఇతరస్థలంబులజనియించినబంగారముతోనుంజేయఁబడినయాభరణంబులధరించికొని మధ్యాహ్నసూర్యులుంబోలెఁ బ్రకాశించుచుండువారలఁ,గాలిబంటువులనసేకులం,జూచెను.

అని, తాత్పర్యము.

శిబికా వివిధాకారా స్స కపి మారుతాత్మజః
లతాగృహాణి చిత్రాణి చిత్రశాలాగృహాణిచ. ౩౬
క్రీడాగృహాణి చా న్యాని దారుపర్వతకా నపి
కామస్య గృహకం రమ్యం దివాగృహకమేవచ. ౩౭
దదర్శ రాక్షసేంద్రస్య రావణస్య నివేశనే

టీక॥ మారుతాత్మజః=వాయువుకొడుకైన;కపిః=కోఁతియగు; సః=ఆహనుమంతుండు;రాక్షసేంద్రస్య=రాక్షసులకుఁబ్రభువైన;రావణస్య=రావణునియొక్క;నివేశనే=ఇంటియందు;వివిధాకారాః=పలువిధములయినయాకారములుగల;శిబికాః =పల్లకీలను;చిత్రాణి= నానావిధవర్ణములుగల;లతాగృహాణి = తీఁగెల యల్లికతోఁజేయఁబడినయిండ్లను; చిత్రశాలాగృహాణిచ = చిత్తరువులువ్రాయఁబడియుండు,గదులులేనియిండ్లను;అన్యాని= ఇతరములయిన; క్రీడాగృహాణిచ=క్రీడింపయోగ్యములయినయిండ్లను; దారుప

స ౬

ర్వతకానపి=క్రీడార్థంబుగా, కొయ్యతోఁజేయఁబడిన చిన్నకొండలను; రమ్యం=సుందరమయిన; కామస్య = మన్మథునియొక్క; గృహకం=ఇంటిని, రతిగృహముననుట; దివాగృహక మేవచ= పగటియిండ్లను, పగలువినోదంబుగా నుండుటకై యేర్పఱుపఁబడిన గృహముననుట; దదర్శ=చూచెను.

వాయుదేవునికుమారుండగు నాహనుమంతుండు, రాక్షసేశ్వరుండగు రావణునిభవనంబునందుఁ, దిరుగుచు, నానావిధంబులయినపల్లకీలను జిత్రంబులగులతాగృహంబులను జిత్తరువులు వ్రాయఁబడియుండు, గదులులేని(హాల్) యిండ్లను, మఱియు నితరములయిన క్రీడాగృహంబులను , క్రీడార్థంబు లగువారు మయపర్వతములను, సుందరంబగురతిగృహంబులను, బగలువినోదంబుగానివసింపఁదగినగృహంబులను, వరుసగాఁజూచెను. అని, తాత్పర్యము.

స మందరగిరిప్రఖ్యం మయూరస్థానసంకులమ్. ౩౮
ధ్వజయష్టిభి రాకీర్ణం దదర్శ భవనోత్తమమ్
అనేకరత్నసంకీర్ణం నిధిజాలం సమంతతః. ౩౯
ధీరనిష్ఠితకర్మాంతం గృహం భూతపతే రివ

టీక॥ సః=ఆహనుమంతుండు; మందరగిరిప్రఖ్యం = మందరపర్వతముతోఁ సమానమయినదియును; మయూరస్థానసంకులం=నెమళ్లయొక్క స్థానములచే నిండినదియును; ధ్వజయష్టిభిః=పెక్కు ములకఱ్ఱలచే; ఆకీర్ణం=వ్యాపింపఁబడినదియును ; అనేకరత్నసంకీర్ణం= పెక్కుమణులచే వ్యాపింపఁ బడినదియును; సమంతతః=అంతటను ; నిధిజాలం=పాఁతఱలసమూహములుగలదియును; ధీరనిష్ఠితకర్మాంతం, ధీర=పండితులగు వారలచే, నిష్ఠిత=చేయఁబడిన, కర్మాంతం=పనులయొక్క తుదగలదియు, పనులన్నియుఁగలదియుననుట; లేక ధీరనిష్ఠితకర్మాంతం, ధీర=ధైర్యముగలవారలయొక్కయు, నిష్ఠిత=నియమముగలవారలయొక్కయు; కర్మ=తపస్సుయొక్క, అంతం=ఫలమయినదియును; భూతపతేః=భూతంబులకుఁబ్రభువయినశివునియొక్క; గృహమివ (స్థితం)=ఇల్లుంబోలె నున్నదియునగు; భవనోత్తమం=ఇండ్లలోఁ శ్రేష్ఠమయినదాని, ఉత్తమగృహమును; దదర్శ=చూచెను.

ఆహనుమంతుండు, వానింజూచుచుంబోయి, మందరపర్వతంబునకు సాటివచ్చునదియు, నెమళ్లునిలుచుట కేర్పఱుపంబడినస్థానంబులతో నిండినదియు నై, యంతటను ధ్వజంబులు కట్టంబడి, పెక్కు రత్నంబులుగల్గి, నిధులనేకంబులుగల్గి, పండితులగువారలచే నెంతోప్రయత్నంబున నిర్మింపంబడిన, (ప్రశాంతరమందు, ధైర్యంబునునియమంబునుంగలిగి కష్టపడి చేసినతపంబునకుఫలంబనందగి) భూతనాథుండగు శివుని గృహంబునకుసాటివచ్చుచున్న, యందలియుత్తమగృహంబుం, జూచెను.

అని, తాత్పర్యము.

అర్చిర్భిశ్చాపి రత్నానాం తేజసా రావణస్యచ. ౪౦
విరరాజాథ తద్వేశ్మ రశ్మిమా నివరశ్మిభిః

టీక॥ అథ=అటుపిమ్మట ; అప్పుడనుట; రత్నానాం=మణుల యొక్క; అర్చిర్భిశ్చాపి=కాంతులచేతను; రావణస్య=రావణునియొక్క ; తేజసాచ=కాంతిచేతను; తత్=ఆ; వేశ్మ=ఇల్లు; రశ్మిభిః=కిరణములచేత; రశ్మిమానివ=సూర్యుండుంబోలె; విరరాజ=ప్రకాశించెను.

అప్పుడు, ఆయుత్తమ గృహంబు, అందుంబొదిగియున్నమణులకాంతులను, రావణుని తేజంబును, అంతటం బర్వియుంటం జేసి, కిరణంబులుగల సూర్యుండుంబోలెం, బ్రకాశించుచుండినది. అని, తాత్పర్యము.

జాంబూనదమయా న్యేవ శయనా న్యాసనానిచ. ౪౧
భాజనానిచ ముఖ్యాని దదర్శ హరియూథపః

టీక॥ హరియూథపః=వానరుల సమూహములం బాలించునట్టి హనుమంతుండు; జాంబూనదమయాన్యేవ=బంగారువికారములుగానేయుండు; శయనాని=పాన్పులను; ఆసనానిచ=పీఠంబులను; ముఖ్యాని=శ్రేష్ఠంబులగు; భాజనానిచ=పాత్రములను ; దదర్శ=చూచెను.

వానరసమూహంబులంబాలించునా హనుమంతుం, డా రావణుని యుత్తమభవనంబునం, బాన్పులుం బీఠంబులుముఖ్యంబులగుపాత్రంబులు, నివియన్నియు

బంగారముతోఁ జేయఁబడినవిగా నేయుండుటంజూచెను. అని, తాత్పర్యము.

మధ్వాసవకృతక్లేదం మణిభాజనసంకులమ్. ౪౨
మనోరమ మసంబాధం కుబేరభవనం యథా
నూపురాణాంచ ఘోషేణ కాంచీనాం నినదేనచ. ౪౩
మృదంగతల ఘోషైశ్చ ఘోషవద్భి ర్వినాదితమ్
ప్రాసాదసంఘాతయుతం స్త్రీరత్నశతసంకులమ్. ౪౪
సువ్యూఢ కక్ష్యం హనుమా న్ప్రవివేశ మహాగృహమ్

టీక॥ హనుమాన్ = హనుమంతుఁడు; మధ్వాసవకృతక్లేదం = తేనెతోఁ జేయఁబడినమద్యములచేఁ జేయఁబడినతడుపుటగలదియును; మణిభాజనసంకులం = రత్నవికారములయిన పాత్రములచేనిండినదియును; మనోరమం = మనసును రమింపఁజేయునదియును; అసంబాధం = ఇఱుకులేనిదియును; కుబేరభవనంయథా (స్థితం) = కుబేరునియిల్లుంబోలె నున్నదియును; నూపురాణాం = అందెలయొక్క; ఘోషేణచ = ధ్వనిచేతను; కాంచీనాం = మొలనూళ్లయొక్క; నినదేనచ = ధ్వనిచేతను; ఘోషవద్భిః = నాదముగల, (మృదంగాదులువాయించు నపుడుగలుగు దీర్ఘశబ్దముముగియుసమయంబునఁ గలుగుధ్వని, నాదంబనంబడును); మృదంగతలఘోషైః = మద్దెలల యొక్కయు నఱచేతులయొక్కయుధ్వనుల చేతను, మద్దెలలవాయించుటవలనంగలుగు ధ్వనులచేతను; వినాదితం = ధ్వనింపఁ జేయఁబడినదియును; ప్రాసాద సంఘాతయుతం = మేడలయొక్క సమూహములతోఁగూడినదియును; స్త్రీరత్నశతసంకులం = స్త్రీలలో నుత్తమలయినవారలయొక్క నూఱులచే నిండినదియును; సువ్యూఢకక్ష్యం = మిక్కిలియు నువిశాలములయినతొట్టికట్లుగలదియునగు; మహాగృహం = గొప్పగృహమును; ప్రవివేశ = చొచ్చెను.

సారాయిచేఁదడుపంబడి, రత్నమయములైన పాత్రంబులనేకంబులుగల్గి, మనోహరంబై, విశాలమయి, కుబేరునిగృహంబుంబోలుచు, స్త్రీలుసంచరించుచుండుటంజేసి, యందెలధ్వనులును మొలనూళ్లశబ్దంబులును నాద సంపన్నం

బులగు మృదంగంబులనినదంబులును గల్గి, పెక్కుమేడలతోఁగూడి, యుత్తమరూపులగుస్త్రీలు పెక్కువేలు గల్గి, మిక్కిలియువిశాలంబులగు తొట్టికట్లుతోనొప్పుచున్న, యారావణుని యుత్తమగృహంబును, హనుమంతుండు, ప్రవేశించెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, షష్ఠస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇతి, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండ షష్ఠసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ.

సప్తమసర్గప్రారంభః.

స వేశ్మజాలం బలవాన్ దదర్శ
వ్యాసక్తవైడూర్యసువర్ణజాలమ్
యథా మహత్ప్రావృషి మేఘజాలం
విద్యుత్పినద్ధం సవిహంగజాలమ్. ౧

టీక॥ బలవాన్=అధికమయినబలముగల; సః=ఆహనుమంతుండు; వ్యాసక్తవైడూర్యసువర్ణజాలం= సంబంధించిన వైడూర్యమణులుగలబంగారువికారములయినకిటకీలుగలదియును; సవిహంగజాలం=పక్షులతోఁగూడినకిటకీలుగలదియును; కావుననే, ప్రావృషి=వర్షాకాలమునందు; విద్యుత్పినద్ధం=మెఱుపులచేమూయఁబడినదియు; సవిహంగజాలం(అధ్యాహృతము) = పక్షులయొక్క సమూహములతోఁగూడినదియును; మహత్=గొప్పదియునగు; మేఘజాలంయథా(స్థితం)=మబ్బులసమూహంబుంబోలె నున్నదియైన

గ; వేశ్మజాలం= గృహంబులసమూహమును; దదర్శ=చూచెను.

బలవంతుండగు నాహనుమంతుండచ్చట, వైడూర్యమణులు పొదిగియున్నబంగారు కిటికీలుగల్గి, యాకిటికీలయందువినోదార్థముగానుంచఁబడిన పక్షులుగలవై,యట్లు, వర్షాకాలంబున, మెఱపులధికంబుగాఁగల్గి,వానకురియునని తిరుగుచుండు పక్షులతోనొప్పుచున్న మేఘంబులుం బోలెఁ బొల్పుచుండెడు, గదులనేకంబులం,జూచెను. అని,తాత్పర్యము.

నివేశనానాం వివిధా శ్చశాలాః
"కక్ష్యాశ్చనానావిధకర్మశాలాః" అనిపాఠాంతరము.
ప్రధానశంఖాయుధచాపశాలాః
మనోహరా శ్చాపివున ర్విశాలా
దదర్శ వేశ్మాద్రిషు చంద్రశాలాః. ౨
"దదర్శవేశ్మాదిషు" అని,పాఠాంతరము.

టీక॥ సః(అధ్యాహృతము)=ఆహనుమంతుఁడు;నివేశనానాం=ఇండ్లయొక్క;వివిధాః=నానావిధంబులగు;శాలాశ్చ = గదులులేనిప్రదేశంబులను; (పాఠాంతరపక్షమునందు) నానావిధకర్మశాలాః=పలువిధములయినపనులుగలశాలలుగల;కక్ష్యాశ్చ=తొట్టికట్లు ప్రధాన శంఖాయుధ చాపశాలాః= శ్రేష్ఠములయిన శంఖములయొక్కయు నితరాయుధముల యొక్కయుధనువులయొక్కయు గృహంబులను;పునః=ఇంకను; వేశ్మాద్రిషు=పర్వతములం బోలు నిండ్లయందు; వేశ్మాదిషు(అనిపాఠాంతరము)= ఇండ్లుప్రాసాదములు మొదలగువానియందు; మనోహరాః= సుందరములయినవియు; విశాలాః = వెడల్పులయినవియునగు; చంద్రశాలాశ్చాపి = పైమేడలను;దదర్శ=చూచెను.

ఆహనుమంతుండు, అయ్యాగృహంబులకు సంబంధించినగదులులేని ప్రదేశంబులను,(పాఠాంతరపక్షమందు, పలువిధములయినపనులుచేసియుండుశాలలుగలతొట్టికట్లను,) శ్రేష్ఠములైనశంఖములు నితరాయుధంబులు ధనువునుంచు గృహంబులను, మఱియుం బర్వతంబులం బోలుగృహంబులందుండు, (పాఠాంతర పక్షమందు, గృహం

బులు (ప్రాసాదంబులు మొదలగువాని యందుండు) మనోహరంబులును సుందరంబులునగు పైమేడలనుం,జూచెను.

అని, తాత్పర్యము.

గృహాణి నానావసురాజితాని
దేవాసురైశ్చాపి సుపూజితాని
సర్వైశ్చ దోషైః పరివర్జితాని
కపి ర్దదర్శ స్వబలార్జితాని. ౩

టీక॥కపిః=హనుమంతుఁడు;నానావసురాజితాని= నానావిధములగు రత్నములచేఁ బ్రకాశింపఁజేయఁబడినవియు; దేవాసురైశ్చాపి= దేవతలచేతను అసురులచేతను; సుపూజితాని= చక్కఁగాఁబూజింపఁ బడినవియును; సర్వైః=సమస్తములయిన; దోషైశ్చ=దోషములచేతను; పరివర్జితాని=విడువఁబడినవియును; స్వబలార్జితాని=రావణునిచే,తనబలంబుచే సంపాదింపఁబడినవియునగు; గృహాణి= ఇండ్లను;దదర్శ=చూచెను.

హనుమంతుండు, నానావిధంబుల రత్నములచేఁ బ్రకాశించుచున్నదై, దేవతలచేతను అసురులచేతను బూజింపఁబడినదై, యెంత మాత్రమును దోషంబులేనిదైన, రావణుండు నిజ బలంబునంగు బేరుని జయించి సంపాదించిన, గృహంబులం,జూచెను.

అని, తాత్పర్యము.

తాని ప్రయత్నాభి సమాహితాని
మయేన సాక్షా దివ నిర్మితాని
మహీతలే సర్వగుణోత్తరాణి
దదర్శ లంకాధిపతే గృహాణి. ౪

టీక॥సః(అధ్యాహృతము)=ఆహనుమంతుండు;ప్రయత్నాభి సమాహితాని=ప్రయత్నముచేతనిర్మింపఁబడినవియును; మయేన= మయునిచేత; సాక్షాత్= ప్రత్యక్షముగా; నిర్మితానీవ(స్థితాని)=కట్టఁబడినవివలె నున్నవియును; మహీతలే = భూతలమునందు; సర్వగుణోత్తరాణి= సమ

స్తముగుణములచేతను శ్రేష్ఠంబులు నగు; లంకాధిపతేః=లంకకుంబ్రభువైనరావణునియొక్క, తాని=ఆ; గృహాణి=ఇండ్లను; దదర్శ=చూచెను.

ఆహనుమంతుండు, ఎంతోప్రయత్నంబుననిర్మింపఁబడి, విశ్వకర్మచే నిర్మింపఁబడినవయ్యుమయియుండు ప్రత్యక్షముగాఁ దానె భూమికే తెంచినిర్మించినాఁడోయనందగియొప్పుచు, సమస్తగుణంబులుగలుగుటంజేసి భూమండలంబుననన్నిగృహంబులలో శ్రేష్ఠంబులై, యుండు, లంకానాథుండగు రావణునిగృహంబులం, జూచెను.

అని, తాత్పర్యము.

తతో దదర్శోచ్ఛ్రితమేఘరూపం
మనోహరం కాంచనచారురూపమ్
రక్షోధిపస్యాత్మబలానురూపం
గృహోత్తమం హ్యప్రతిరూపరూపమ్. ౫

టీక॥ తతః = అటుపిమ్మట; సః(అధ్యాహృతము)=ఆహనుమంతుఁడు; ఉచ్ఛ్రితమేఘరూపం= ఉన్నతమయినదియు మేఘముయొక్క-రూపమువంటిరూపంబుగలదియును; మనోహరం=రమణీయమైనదియును; కాంచనచారురూపం=బంగారముచే సుందరమైన రూపముగలదియును; అప్రతిరూపరూపం= సరిలేనిసౌందర్యంబుగలదియు; ఆత్మబలానురూపం= తనబలమునకుఁదగునదియునగు; రక్షోధిపస్య=రాక్షసులకుఁ బ్రభువైనరావణునియొక్క; గృహోత్తమం= గృహశ్రేష్ఠరూపమైన పుష్పకవిమానమును; దదర్శహి=చూచెను.

అంత, నాహనుమంతుండు, ఉన్నతంబయి మేఘంబుకైవడిఁ బ్రకాశించుచు, మనోహరంబై, బంగారముతోఁజేయఁబడియుండుటంజేసి సుందరంబై, మెచ్చటనుసరిలేనిదై, మిక్కిలియుబలవంతుండగుకుబేరుని జయించితన్నుసంపాదింపఁబడినదియు నతిశ్రేష్ఠంబును గావున, రావణునిబలంబునకనురూపంబై యొప్పుచున్న, పుష్పకవిమానంబుం, జూచెను. అని, తాత్పర్యము.

మహీతలే స్వర్గమివ ప్రకీర్ణమ్
శ్రియా జ్వలంతం బహురత్నకీర్ణమ్

నానాతరూణాం కుసుమావకీర్ణం
గిరే రివాగ్రం రజసా వకీర్ణమ్. ౬
నారీప్రవేకై రివ దీప్యమానం
తటిద్భి రంభోదవ దర్చ్యమానమ్
హంసప్రవేకై రివ వాహ్యమానం
శ్రియా యుతం ఖే సుకృతాం విమానమ్. ౭
యథా నగాగ్రం బహుధాతుచిత్రం
యథా నభశ్చ గ్రహచంద్రచిత్రమ్
దదర్శ యుక్తీకృతమేఘచిత్రం
విమానరత్నం బహురత్నచిత్రమ్. ౮

టీక॥సః(అధ్యాహృతము)= ఆహనుమంతుఁడు; మహీతలే=భూతలమందు; ప్రకీర్ణం=పడియుండు; స్వర్గమివ(స్థితం) = స్వర్గముంబోలెనున్నదియును; శ్రియా — కాంతిచేత; జ్వలంతం=ప్రకాశించుచున్నదియును; బహురత్నకీర్ణం= పెక్కుమణులచేవ్యాపింపఁబడినదియు; నానాతరూణాం=నానావిధంబులగువృక్షంబులయొక్క; కుసుమావకీర్ణం= పుష్పములచేవ్యాపింపఁబడినదియును; కావుననె, రజసా— పుష్పములపరాగముచేత, లక్షణచే, పుష్పములచేననుట; అవకీర్ణం=వ్యాపింపఁబడిన; గిరేః=పర్వతముయొక్క; అగ్రమివ(స్థితం)— శిఖరముంబోలెనున్నదియును; నారీప్రవేకైః= స్త్రీశ్రేష్ఠలచేత; ("ఇవ"అనునదివాక్యాలంకారార్థము)దీప్యమానం= ప్రకాశింపఁజేయఁబడినదియును, కావుననే; తటిద్భిః— మెఱుపులచేత; దీప్యమానం(అధ్యాహృతము)— ప్రకాశింపఁజేయఁబడుచున్న; అంభోదవత్(స్థితం)= మేఘంబుంబోలెనున్నదియును; అర్చ్యమానం=పూజింపఁబడుచున్నదియును; హంసప్రవేకైః = హంసపక్షిశ్రేష్ఠములచేత; వాహ్యమానమివ(స్థితం)= మోయఁబడుచున్నదివోలెనున్నదియును; శ్రియా= కాంతితో; యుతం = కూడినదియును; ఖే=ఆకాశమునందు; సుకృతాం=పుణ్యముచేయువారలయొక్క; విమానం(ఇవస్థితం)=విమానంబుంబోలెనున్నదియును; బహురత్నచిత్రం=అనేకవిధంబులగుమణులచే నానావిధవర్ణంబులుగలదికావుననె; బహుధాతుచిత్రం=అనే

కములయినమణిసిలలోనగు ధాతువులచేనానావర్ణములుగల; నగాగ్రంయిథా(స్థితాం)= పర్వతశిఖరంబుంబోలెనున్నదియును; గ్రహచంద్రచిత్రం= శుక్రాదిగ్రహంబులచేతనుజంద్రునిచేతను చిత్రమయిన;నభశ్చయథా (స్థితం)= ఆకాశముంబోలెనున్నదియును; యుక్తీకృతమేఘచిత్రం = సమూహముగాఁజేయఁబడిన మేఘమువలె నానావర్ణములుగలదియునగు;లేక, యింద్రధనుస్సుతోఁగూడునట్లుచేయఁబడిన మేఘంబులంబోలె నానావర్ణంబులుగలదియునగు; విమానరత్నం=విమానశ్రేష్ఠంబగుపుష్పకమును;దదర్శ=చూచెను.

దైవయోగంబున, భూమికివచ్చినస్వరంబనందగి, కాంతిచేఁబ్రకాశించుచు,మణిమయంబై, నానావిధంబులగు వృక్షంబులపుష్పంబులచేసలంకరింపఁబడియున్నతంబై యుంటంజేసి,పుష్పంబులురాలియుండు పర్వతశిఖరంబుంబోలెఁజూపట్టుచు, నుత్తమసౌందర్యంబుగలస్త్రీలుగలుగుటంజేసి, మెఱపులతోఁగూడినమేఘంబుకైవడివెలుంగుచు, నందఱిచేతనుంబూజింపఁబడుచు, హంసలచేతనేమైనమోయఁబడుచున్నదోయనియెన్నందగి, పుణ్యవంతులుబహుపుణ్యములనార్జించిన విమానంబనందగి, నానావిధమణులు పొదిగియుండుటవలన, నానావిధధాతువులచేఁ జిత్రవర్ణంబగు పర్వతశిఖరంబుకైవడి, శుక్రాదిగ్రహంబులను జంద్రుండును గల్గుటవలనఁజిత్రంబగునాకాశంబుకరణినింద్రధనువుతోఁగూడియుండు మేఘంబుభంగి, భాసిల్లుచున్న, విమానశ్రేష్ఠంబగు పుష్పక విమానంబును, ఆహనుమంతుండు,జూచెను. అని, తాత్పర్యము.

మహీ కృతా పర్వతరాజిపూర్ణా
శైలాః కృతా వృక్షవితాన పూర్ణాః
వృక్షాః కృతాః పుష్పవితానపూర్ణాః
పుష్పం కృతం కే సరపత్రపూర్ణమ్. ౯

టీక॥తత్ర(అధ్యాహృతము)=ఆపుష్పకవిమానమందు; మహీ=భూమి;పర్వతరాజిపూర్ణా= పర్వతములయొక్కపఙ్క్తిచేతనిండినదిగా; కృతా=చేయఁబడినది. శైలాః=పర్వతములు; వృక్షవితానపూర్ణాః=చెట్లయొక్కయతిశయముచేనిండినవిగా; కృతాః=చేయఁబడినవి.వృక్షాః=చెట్లు;పుష్పవి

తానపూర్ణాః=పూలయొక్కయతిశయముచేనిండినవిగా; కృతాః=చేయఁబడినవి. పుష్పం=పుష్ప (జాత్యేకవచనము) పూలనుట; కేసరపత్రపూర్ణం=కింజల్కములచేతను ఱేకులచేతను,నిండినవిగా; కృతం=చేయఁబడినది.

ఇచ్చట,మునుపటిదానికన్నను వెనుకటిదానియందువిశేషంబువర్ణింపఁబడినందున,నధికాలంకారము.

ఆపుష్పక విమానంబునందు, పర్వతంబులుగలిగి సుందరంబగు నట్లుగా, భూమి, చిత్రరూపంబున వ్రాయఁబడినది; మంచిచెట్లతోనొప్పునట్టు, పర్వతంబులువ్రాయఁబడినవి; పుష్పంబులతోనిండియుండు నట్లుగావృక్షంబులు నిర్మింపఁబడినవి; అందులోనిపూలు, కింజల్కంబులు ఱేకులును గల్గి రమణీయంబులగునట్లుగా, నిర్మింపఁబడినవి. అని, తాత్పర్యము.

కృతాని వేశ్మాని చ పాండురాణి
తథా సుపుష్పాణ్యపి పుష్కరాణి
పునశ్చ పద్మాని సకేసరాణి
ధన్యాని చిత్రాణి తథా వనాని. ౧౦

టీక॥ తత్ర(అధ్యాహృతము)=ఆపుష్పకవిమానంబునందు; పాండురాణి=తెల్లనివైన; వేశ్మాని=గృహములు; కృతాని=చేయఁబడినవి. తథా=అట్లు; సుపుష్పాణి=మంచిపూలుగల; పుష్కరాణ్యపి=కోనేటులును; కృతాని(అధ్యాహృతము)=చేయఁబడినవి. పునశ్చ=ఇంకను; సకేసరాణి=కింజల్కంబులతోఁగూడిన; పద్మాని=తామరపూలు; కృతాని(అధ్యాహృతము)=చేయఁబడినవి. తథా=అట్లు; ధన్యాని=శ్రేష్ఠములయినవియును; చిత్రాణి=నానావిధములయినవియునగు; వనాని=అడవులు; కృతాని(అధ్యాహృతము)=చేయఁబడినవి.

ఆపుష్పకవిమానంబునందుఁ, దెల్లని గృహంబులు చిత్తరువున వ్రాయఁబడినవి; సుందరంబులగు పుష్పంబుల నొప్పుచుండు కోనేటులు వ్రాయఁబడినవి; మఱియుఁ, గింజల్కంబులతోఁగూడి రమణీయంబులయిన పద్మంబులు వ్రాయఁబడినవి; అట్లు, ఉత్తమంబులు నానావిధంబులునగు వనంబులు, నిర్మింపఁబడినవి.

అని, తాత్పర్యము.

పుష్పాహ్వయం నామ విరాజమానం
రత్నప్రభాభిశ్చ వివర్ధమానం
వేశ్మోత్తమానా మపి చోచ్చమానం
మహాకపి స్తత్ర మహావిమానమ్. ౧౧

టీక॥ మహాకపిః= పెద్దకోతియగు హనుమంతుండు; తత్ర=అచ్చట ; రత్నప్రభాభిః=మణులయొక్క కాంతులచేత; విరాజమానంచ= ప్రకాశించుచున్నదియును; వివర్ధమానం= వృద్ధిఁబొందుచున్నదియును; వేశ్మోత్తమానాం=(పంచమ్యర్థమందుషష్ఠి) గృహశ్రేష్ఠములకన్నను; ఉచ్చమానం = పొడవైనప్రమాణముగలదియును; పుష్పాహ్వయంనామ=పుష్పకమను పేరుగలదియును ; మహావిమానం=గొప్పవిమానమును; దదర్శ(అధ్యాహృతము)=చూచెను.

హనుమంతుండచ్చట, నట్లుసర్వగుణసంపన్నంబై , మణులకాంతులచేఁ బ్రకాశించుచున్నదై, యెందఱు కూర్చున్నను అందఱకుంజాలునట్లు వృద్ధిఁబొందునదై, చాల నున్నతంబులగు గృహంబులకన్నను బొడవై, పుష్పకంబను పేరుగల్గియుండు, విమాన శ్రేష్ఠంబును, జూచెను. అని, తాత్పర్యము.

కృతాశ్చ వైడూర్యమయా విహంగా
రూప్యప్రవాళైశ్చ తథా విహంగాః
చిత్రాశ్చ నానా వసుభి ర్భుజంగా
జాత్యానురూపా స్తురగా శ్శుభాంగాః. ౧౨

టీక॥ తత్ర(అధ్యాహృతము)= ఆపుష్పకవిమానంబునందు; వైడూర్యమయాః=వైడూర్యమణివికారములయిన; విహంగాశ్చ=పక్షులును ; కృతాః=చేయఁబడినవి ; తథా=అట్లు; రూప్యప్రవాళైశ్చ= వెండిచేతను బగడములచేతను; విహంగాః= పక్షులు; కృతాః(అధ్యాహృతము)= చేయఁబడినవి. నానావసుభిః=నానావిధంబులగుమణులచేత; చిత్రాః=నానావిధవర్ణంబులుగల; భుజంగాశ్చ = సర్పంబులును; కృతాః (అధ్యాహృత




ము)=చేయఁబడినవి; జాత్యా=గుఱ్ఱపు జాతితో; అనురూపాః= సమానములయినవియును; శుభాంగాః= మంగళకరములగు నవయవములు గలవియునగు; తురగాః=గుఱ్ఱములు; కృతాః(అధ్యాహృతము)=చేయఁబడినవి.

ఆపుష్పకవిమానంబునందు, వైడూర్యమణులతోఁ జేయఁబడిన పక్షులుండినవి; మఱియు వెండితోను బగడములతోను జేయఁబడినపక్షులుండినవి; నానావిధంబులరత్నంబులతోఁ జేయంబడిన వగుటం జేసినానావిధవర్ణంబులు గలిగినసర్పంబులుండినవి; అట్లునానావిధమణులతోఁ జేయఁబడి, సజాతీయంబులగు గుఱ్ఱంబులకు సాటివచ్చుచు శుభలక్షణసంపన్నంబులగు నవయవంబులతోఁ గూడియున్న, గుఱ్ఱంబులుండినవి.

అస, తాత్పర్యము.

ప్రవాళజాంబూనదపుష్పపక్షా
స్సలీల మావర్జిత జిహ్మపక్షాః
కామస్య సాక్షా దివ భాంతి పక్షాః
కృతా విహంగా స్సుముఖా స్సుపక్షాః. ౧౩

టీక॥తత్ర(అధ్యాహృతము) = ఆపుష్పకవిమానంబునందు ; కృతాః= చేయఁబడినవియును; సుముఖాః=మంచిముఖంబులుగలవియు; సుపక్షాః= మంచిరెక్కలుగలవియును ; ప్రవాళజాంబూనదపుష్పపక్షాః = పగడముతోను బంగారముతోను జేయఁబడినపూలు తెక్కలందుఁగలవియును; సలీలం= విలాసముతోఁగూడునట్లుగా; ఆవర్జితజిహ్మపక్షాః= వంచఁబడిన వంకరలయినతెక్కలుగలవియునగు ; విహంగాః=పక్షులు; కామస్య= మన్మథుని యొక్క; సాక్షాత్= ప్రత్యక్షములయిన; పక్షా ఇవ=సహాయములుం బోలె; భాంతి=ప్రకాశించుచున్నవి, ప్రకాశించుచుండినవనుట.

ఆపుష్పకవిమానంబున, మంచిముఖంబును సుందరంబులగు తెక్కలును గల్గి, పవడముతోను బంగారముతోను నిర్మింపఁబడినపుష్పంబులు తెక్కలందుఁగలవై, సొగసుగాఁ దమతెక్కలనువంకరలగునట్లు కొంత వంచికొనియుండునట్టునానావిధవర్ణములతోఁ జేయఁబడినవైయుండు, పక్షులు , ఆకా




రంబువహించి ప్రత్యక్షంబులైనవన్మథు నిసహాయంబులోయనందగి, చూపరు లకుమన్మథోద్రేకంబు కలిగించుచుండి నవి. అని, తాత్పర్యము.

నియుజ్యమానాస్తు గజా స్సుహస్తా
స్సకేసరా శ్చోత్పలపత్రహస్తాః
బభూవ దేవీ చ కృతా సుహస్తా
లక్ష్మీ స్తథా పద్మిని పద్మహస్తా. ౧౪

టీక॥ తత్ర=(అధ్యాహృతము) ఆ పుష్పక విమానంబున; పద్మిని= తామరకొలనునందు; నియుజ్యమానాః= (కర్మకర్తరియక్) తమకుంచామే ప్రవర్తించుచున్నవియు; సుహస్తాః= మంచితొండములు గలవియును; సకేసరాశ్చ = కింజల్కములతోఁ గూడినవియును; ఉత్పలపత్రహస్తాః=కలువలఱేకులతోఁ గలవియునగు; గజాస్తు=ఏనుఁగులును; కృతాః(అధ్యాహృతము)=చేయఁబడినవి. తథా=అట్లు; సుహస్తా= మంచిచేతులుగలదియును; పద్మహస్తా = తామరపూలుచేతులందుఁగలదియును; దేవీ = అమ్మవారును గు; లక్ష్మీః=లక్ష్మీ; కృతా=చేయఁబడినది; బభూవ=అయినది.

ఆపుష్పక విమానంబునఁ, దామరకొలంకునందు, సుందరంబు లగు తొండంబులుగల్గి, తామరకొలంకున విహారము సేయుటం జేసి, దేహలగ్నంబులగుపద్మకింజల్కంబులుగల్గి, కలువలఱేకులఁదొండంబులధరించి, సేవించుచుండు నేనుఁగులును, చిత్తరువునవ్రాయఁబడినవి, అట్లు, వానిచే సేవింపఁబడుచుఁ, జేతులం గమలంబులుధరించి, సుందరంబులగుహస్తంబులుగల్గియుండులక్ష్మీదేవియును, చిత్తరువున, వ్రాయఁబడినది. అని, తాత్పర్యము.

ఇతీవ తద్గృహ మభిగమ్య శోభనం
సవిస్మయో నగమివ చారు శోభనమ్
పునశ్చ తత్పరమసుగంధి సుందరం
హిమాత్యయే నగమివ చారు కందరమ్. ౧౫

టీక॥ సః(అధ్యాహృతము)=ఆహనుమంతుండు; ఇతీవ = ఈప్రకారము

గా; శోభనం = మంగళకరమును; చారు=సుందరమయిన; శోభనం=మంగళకరమగు; నగమివ(స్థితం)= పర్వతముంబోలెనున్నదియునగు; తత్ = ఆ; గృహం=ఉత్తమగృహంబున; అభిగమ్య= అంతటనుబొంది; సవిస్మయః=ఆశ్చర్యముతోఁగూడినవాఁడు; అభూత్(అధ్యాహృతము)=ఆయెను. పునశ్చ=మఱలను; పరమసుగంధి=మిక్కిలియునుమంచివాసనగలదియును; సుందరం=మనోహరంబును; కావున నె, హిమాత్యయే= శీతకాలముయొక్కతుదను, వసంతఋతువునందనుట; చారుకందరం=సుందరములయిన గుహాలుగల; నగమివ(స్థితం)= పర్వతముంబోలెనున్నదియునగు; తత్=ఆయుత్తమగృహమును; అభిగమ్య(అధ్యాహృతము) = అంతటనుబొంది; సవిస్మయఃఅభూత్ (అధ్యాహృతము)=ఆశ్చర్యముతోఁగూడినవాఁడయ్యెను.

ఆహనుమంతుండు, మంగళకరంబై సుందరంబై, యట్లుసుందరంబునుమంగళకరంబునగు పర్వతముంబోలెఁ జూపట్టుచున్న యారావణుని యుత్తమగృహంబుగలయందిరిగి, యెంతదిరిగినను రావణుండుండు స్థలంబుగానలేనైతి, ఇంకినెంత పెద్దదిగానున్నదో యనియాశ్చర్యముపడి, యంత, మఱలవసంతర్తువునందుఁజక్కఁగాఁ బుష్పించియుండుటంజేసి, మంచివాసనగలిగి సుందరంబులయినగుహాలుగలిగినపర్వతంబుంబోలె, సుందరంబై మంచివాసనగలిగియుండు, నా గృహంబుం జొచ్చిగలయంద్రిమ్మరి, "యెంతదిరిగినను, ఈగృహంబుతుదముట్టనైతిఁగదా" యనియాశ్చర్యమునొందెను. అని, తాత్పర్యము.

తత స్స తాం కపిరభిపత్య పూజితాం
చరన్ పురీం దశముఖ బాహుపాలితాం
అదృశ్య తాం జనకసుతాం సుపూజితాం
సుదుఃఖితః పతిగుణ వేగనిర్జితాం. ౧౬

టీ॥ తతః=అటుపిమ్మట; సః = ఆహనుమంతుఁడు; పూజితాం= పూజింపఁబడినదియును; దశముఖబాహుపాలితాం= రావణునియొక్క భుజముచేతఁ బాలింపఁబడినదియునగు; తాం=ఆ; పురీం=పట్టణమును; అభిపత్య= పొంది; చరన్=తిరుగుచు; సుపూజితాం= చక్కఁగాఁబూజింపఁబడినదియును;

పతిగుణవేగనిర్జితాం= జెనిమిటియొక్క గుణాతిశయముచేత జయింపఁబడినదియునగు; లోఁగొనఁబడినదియు ననుట; తాం=ఆ; జనకసుతాం=జనకమహారాజుకొమాతెఁయయిన సీతను;అదృశ్య(అదృష్ట్వా)=చూడక; సుదుఃఖితః=మిక్కిలియు దుఃఖుంబునొందినవాఁడు; అభూత్ (అధ్యాహృతము)=ఆయెను.

అట్లాహనుమంతుండు, పూజ్యంబును రావణునిచే భుజబలంబునం బాలింపఁబడునదియునగు నాలంకంజొచ్చి యన్నిచోట్లనుందిరిగినను,మిక్కిలియుఁ బూజ్యారాలును జెనిమిటియగు రాముని గుణాతిశయంబునంజేసి తదధీన యయియున్నదియునగు సీతయగపడకున్నందున, మిగులదుఃఖంబునొందెను.

అని, తాత్పర్యము.

తత స్తదా బహువిధభావితాత్మనః
కృతాత్మనో జనకసుతాం సువర్త్మనః
అపశ్యతో భవ దతిదుఃఖితం మన
స్సుచక్షుషః ప్రవిచరతో మహాత్మనః. ౧౭

టీక॥తతః=అటుపిమ్మట; తదా=అప్పుడు; బహువిధభావితాత్మనః=అనేకవిధములుగా నాలోచింపఁబడినమనసుగలవాఁడును, నానావిధములుగా నాలోచించినవాఁడుననుట; కృతాత్మనః=చేయఁబడిన ప్రయత్నముగలవాఁడును;సువర్త్మనః=మంచిమార్గము గలవాఁడును; సుచక్షుషః=మంచికండ్లుగలవాఁడును, దూరంబున నున్నవానింగూడఁజూడంజాలిన కండ్లుగలవాఁడుననుట;ప్రవిచరతః = తిరుగుచున్నవాఁడును;మహాత్మనః = అధికమయిన ధైర్యముగలవాఁడును; జనకసుతాం=జనకమహారాజుకూఁతురయిన సీతను; అపశ్యతః = చూడనట్టివాఁడునగు;తస్య(అధ్యాహృతము)= ఆహనుమంతునియొక్క;మనః = మనసు;అతిదుఃఖితం= మిక్కిలియుదుఃఖంబునొందినది; అభవత్=అయినది.

అంత,నపుడు, ఆహనుమంతుండు, తాను, మనంబుననానావిధంబులగునాలోచనంబులు చేసి,మంగళకరంబగునీతిమార్గంబవలంబించి, కండ్లుచెదరనీయక యతిజాగ్రత్తతోదూరంబుననున్న

వానిం గూడఁ జూడం జాలిన వాఁడై,మహాధైర్యంబువహించి, యెంతో ప్రయత్నంబున,లంకయంతయుం, దిరిగినను,సీతకనుపడకుండుటంజేసి,మిక్కిలియుదుఃఖంబునొందెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, సప్తమస్సర్గః.

ఇది,స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు , శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండ సప్తమసర్గటీక,
ముగిసినది.



శ్రీః

అష్టమసర్గప్రారంభః.

స తస్య మధ్యే భవనస్య సంస్థితం
మహద్విమానం మణివజ్రచిత్రితమ్
ప్రతప్తజాంబూనద జాలకృత్రిమం
దదర్శ వీరః పవనాత్మజః కపిః. ౧

టీక॥వీరః=పరాక్రమశాలియును; పవనాత్మజః=వాయుదేవునికుమారుండును; కపిః=కోఁతియునగు;సః=ఆ హనుమంతుండు;తస్య=ఆ;భవనస్య=ఉత్తమగృహముయొక్క; మధ్యే=నడుమునందు;సంస్థితం=ఉన్నదియును; మణివజ్రచిత్రితం=ఇతరమణులచేతను వజ్రములచేతను జిత్రవర్ణముగాఁ జేయఁబడినదియును; ప్రతప్త జాంబూనద జాలకృత్రిమం= కాఁచఁబడిన బంగారముయొక్క సమూహంబులతోఁ జేయఁబడినపనులుగలదియు;మహత్=గొప్పదియునగు; విమానం=పుష్పక విమానమును; దదర్శ=చూచెను.

పరాక్రమశాలియు, వాయుదేవునికుమారుండునగు నా హనుమంతుం



దు, ఆయుత్తమగృహంబు నడుమస్థాపింపఁబడి, వజ్రములుమొదలగు మణులచేఁ జిత్రవర్ణముగాఁ జేయఁబడినదై, యుత్తమంబగుబంగారముతోఁ జేయఁబడినకార్యవిశేషంబులు గలదైన, గొప్పదియగు, పుష్పకవిమానంబుం, జూచెను. అని, తాత్పర్యము.

తదప్రమేయా ప్రతికారకృత్రిమం
కృతం స్వయం సాధ్వితి విశ్వకర్మణా
దివం గతం వాయుపథ ప్రతిష్ఠితం
వ్యరాజతాదిత్య పథస్య లక్ష్మవత్. ౨

టీక॥ అప్రమేయాప్రతికారకృత్రిమం=కొలంతపెట్టఁగూడనట్టుగాను బదులులేనట్టుగాను జేయఁబడినదియును; విశ్వకర్మణా=విశ్వకర్మచేత; స్వయం=తానె; సాధు=మంచిది;ఇతి=అని;ఉక్త్వా(అధ్యాహృతము)= చెప్పి; కృతం=చేయఁబడినదియును;దివం=ఆకాశమును;గతం = పొందినదియును; వాయుపథప్రతిష్ఠితం = వాయుమార్గమైనయంతరిక్షమందుస్థాపింపఁబడినదియునగు; తత్= ఆపుష్పకవిమానము; ఆదిత్యపథస్య=సూర్యుని మార్గముయొక్క; లక్ష్మవత్= చిహ్నముఁబోలె;వ్యరాజత=ప్రకాశించెను.

విశ్వకర్మచే, చాలఁ బ్రయత్నంబునం, బ్రశంసాపూర్వకంబుగా, "ఇట్లుచేసియుండు" నని చెప్ప నలవి గాకుండునట్లుగా, నింతటిదనియెంచి మెచ్చుటను లేనట్లుగా, నిర్మింపఁబడినదై, ఆకాశంబునసంచరింపంజాలినదై, యంతరిక్షంబున నెయుంచఁబడినదై, యున్న,యాపుష్పకవిమానంబు,"సూర్యుని మార్గంబునకుంగల్గిన చిహ్నంబో" యనందగి,ప్రకాశించినది.

అని, తాత్పర్యము.

నతత్ర కించిన్న కృతం ప్రయత్నతో
నతత్ర కించిన్న మహార్హరత్నవత్
నతే విశేషా నియతా స్సురేష్వపి
నతత్ర కించిన్న మహావిశేషవత్. ౩




టీక॥ తత్ర=ఆపుష్పకవిమానమునందు; ప్రయత్నతః= యత్నముచేత; నకృతం= చేయఁబడనిది; కించిత్= ఏదియు; న=లేదు. తత్ర=ఆపుష్పకవిమానంబునందు; నమహార్హరత్నవత్= శ్రేష్ఠములైనమణులులేనిది; కించిత్= ఏదియును; న=లేదు. నియతాః= అందు, ప్రతిష్ఠింపఁబడిన; తే=ఆ; విశేషాః=అతిశయములు; సురేష్వపి= దేవతలయందును, దేవతలయిండ్లయందు ననుట; న=లేవు. తత్ర= ఆపుష్పకవిమానమునందు; నమహావిశేషవత్= మిక్కిలియునతిశయములేనిది; కించిత్= ఏదియు; న=లేదు.

ఆపుష్పకవిమానంబున, దేనిఁజూచినను, బహుప్రయత్నంబుననిర్మింపఁబడినదే కానివేఱు కాదు; అందెచ్చటఁ జూచినను, చాల వెలగల మణులుపొదిగియుండినవిగానేయుండును; అందున్న విశేషంబులు, దేవతలగృహంబులందునుంగానంబడవు; అందేదియు, చూపరులకుఁజాలనచ్చెరువుపుట్టింపనిది లేదు.

అని, తాత్పర్యము.

తపస్సమాధాన పరాక్రమార్జితం
మనస్సమాధాన విచారచారిణమ్
అనేకసంస్థాన విశేషనిర్మితం
తత స్తత స్తుల్యవిశేషదర్శనమ్. ౪

టీక॥ సః (అధ్యాహృతము)=ఆహనుమంతుఁడు; తపస్సమాధాన పరాక్రమార్జితం=తపసుయొక్క సేయుటచేతను బరాక్రమముచేతను సంపాదింపఁబడినదియును; మనస్సమాధానవిచారచారిణం= మనసుయొక్క నైశ్చల్యముచేతఁదలంపు గలిగినచోట సంచరించునదియు, తనపైనెక్కియుండువారిమనసు, ఎక్కడికిపోఁదలఁచునో యచ్చటికిం బోవునదియుననుట; అనేకసంస్థానవిశేషనిర్మితం, అనేక=పెక్కులయిన; సంస్థానవిశేష= విమానము గోపురము మొదలగువానియొక్క ప్రకారములచేత, నిర్మితం= చేయఁబడినదియును; తత స్తతః= అంతనంతను; తుల్యవిశేషదర్శనం=సమానంబులగు స



తిశయములయొక్క చూచుటగలదియు నగు; పుష్పకం(అధ్యాహృతము)= పుష్పకవిమానమును ; దదర్శ (అధ్యాహృతము)=చూచెను.

గొప్పతపంబుచేసియుఁబరాక్రమంబుచూపి యుసంపాదింపఁబడి , తన పైఁగూర్చుండువారిచ్చ్టటికిఁబోఁదలఁతురో యచ్చటికింబోఁగలిగి, విమానగోపురాదిసన్నివేశవిశేషంబుల, నొక్కొకచోనొక్కొకవిధంబుగా నిర్మింపఁబడి, అన్నిస్థలంబుల యందును సమంబుగా నిర్మాణ విశేషంబుగలిగి, చూపరులనేత్రంబులకువినోదంబుగలిగించుచుండు, నాపుష్పకవిమానంబుఁ, జూచెను. అని, తాత్పర్యము.

మన స్సమాధాయతు శీఘ్రగామినం
దురావరం మారుతతుల్యగామినమ్
మహాత్మనాం పుణ్యకృతాం మహర్ధినాం
యశస్వినా మగ్ర్యముదా మివాలయమ్. ౫

టీక॥సః(అధ్యాహృతము)= ఆహనుమంతుండు; మనః=తనకుఁబ్రభువైనవానిహృదయమును; సమాధాయతు= ఉంచుకొనినంతనె, తెలిసికొనినంతనె యనుట; శీఘ్రగామినం=వేగముగాఁబోవునదియును; దురావరం=అడ్డగింపఁగూడనదియును; మారుతతుల్యగామినం=వాయువుతోసమానంబగునట్లుగాఁబోవునదియును; మహాత్మనాం=అధికమయినపరాక్రమముగలవారలును; పుణ్యకృతాం=పుణ్యములుసేయువారలును; మహర్ధినాం(మహర్ధినాం)=అధికమయినసంపదగలవారలును; యశస్వినాం= అధికమయినకీర్తిగలవారలును; అగ్ర్యముదాం = శ్రేష్ఠమయిన యానందముగలవారలునగు నింద్రాదులయొక్క; ఆలయమివ (స్థితం)=వాసస్థలమయిన స్వర్గముంబోలె నున్నదియునగు; పుష్పకం(అధ్యాహృతము)= పుష్పకవిమానమును; దదర్శ (అధ్యాహృతము)=చూచెను.

స్వామిహృదయంబు గనుంగొనినమాత్రాన నతివేగంబునఁబోవునదియై యేరికినడ్డగింపఁగూడనిదై, వాయుదేవుండుంబోలె నతివేగంబుగాసంచరించునదియై, మహాపరాక్రమశాలులుఁబుణ్యవంతులు నధికమయిన సంపదగలవారలుఁ గీర్తిసంపన్నులు మహానంద




స ౮

మునొందియున్నవారలునగునింద్రాదులవాసస్థానమయిన స్వర్గముంబోలెనున్న, పుష్పకంబును, హనుమంతుండు, చూచెను. అని, తాత్పర్యము.

విశేష మాలంబ్య విశేషసంస్థితం
విచిత్రకూటం బహుకూటమండితమ్
మనోభిరామం శరదిందునిర్మలం
విచిత్రకూటం శిఖరం గిరేర్యథా. ౬

టీక॥ సః(అధ్యాహృతము)=ఆహనుమంతుండు; విశేషం=అతిశయమును; ఆలంబ్య = అవలంబించి; విశేషసంస్థితం= విశేషముతోఁగూడినసన్నివేశముగలదియును; విచిత్రకూటం=నానావిధంబులగు శిఖరంబులుగలదియును; బహుకూటమండితం=అనేకములయినశిఖరములచే నలంకరింపఁబడినదియును; మనోభిరామం=మనసునుసంతోషింపఁజేయునదియును; శరదిందునిర్మలం=శరదృతువునందలిచంద్రుండుంబోలెస్వచ్ఛంబైనదియును; గిరేః=పర్వతముయొక్క; విచిత్రకూటం= నానావిధములగు నవాంతరశిఖరములుగల; శిఖరంయథా (స్థితం)= శృంగముంబోలెనున్నదియునగు; పుష్పకం (అధ్యాహృతము)= పుష్పకవిమానమును; దదర్శ(అధ్యాహృతము)=చూచెను.

శ్రేష్ఠంబులగు రత్నంబులు మొదలగువస్తుసమూహంబుగొని శ్రేష్ఠంబయినసన్నివేశంబుననిర్మింపఁబడి, నానావిధంబులునేకంబులునగు శిఖరంబులు గలిగి, చూపరులమనంబునకు సంతోషంబు నెఱవుచు, శరత్కాలంబునందలిసంపూర్ణచందురుండుంబోలెనిర్మలంబై, నానావిధంబులగు నవాంతరశృంగంబులతోఁగూడినపర్వతశిఖరంబుభంగి భాసిల్లుచున్న, పుష్పకంబును, హనుమంతుండు, చూచెను. అని, తాత్పర్యము.

వహంతి యం కుండలశోభితాననా
మహాశనా వ్యోమచరా నిశాచరాః
వివృత్తవిధ్వస్తవిశాలలోచనా
మహాజవా భూతగణాః సహస్రశః. ౭

స ౮

టీక॥ యుః(యత్)= ఏవిమానము నుఁ; కుండలశోభితాననాః=కుండలముల చేనలంకరింపఁబడినముఖము గలవియు ను; మహాశనాః=గొప్పదేహము గల వియును; వ్యోమచర (ఇవస్థితాః)=ఆ కాశమునందు సంచరించునవివోలె ను న్నవియునగు; నిశాచరాః=రాక్షసు లును, రాక్షసాకారములగు ప్రతిమ లుననుట; వివృత్తవిధ్వస్తవిశాల లో చనాః; గుండ్రములయినవియు వంకర లయినవియు వెడల్పులయినవియునగు కండ్లుగలవియును; మహాజవాః (ఇవ స్థితాః)= అధికమయిన వేగము గలవి వలెనున్నవియునగు; భూతగణాః= భూతముల యొక్క సమూహములు ను, భూతాకారంబులగు ప్రతిమల సమూహంబులుననుట; సహస్రశః= వేనవేలుగా; వహంతి(ఇవ) = మో యునట్లున్నవో; తత్ పుష్పకం(అధ్యా హృతము)=ఆపుష్పకవిమానమును; సః (అధ్యాహృతము) = ఆహనుమంతుఁ డు; దదర్శ (అధ్యాహృతము)= చూ చెను.

కుండలంబులతో నొప్పుచున్నము ఖంబులును గొప్పశరీరంబులును గలిగి, యాకాశంబునందిరుగునవివోలె నిర్మిం పంబడిన రాక్షసాకారప్రతిమలచేతను, గుండ్రములువంకరలువెడల్పులునగుకం డ్లుగలిగి చూపరులకతి వేగంబుగలవివ లెనగపడునట్లు చేయఁబడిన వేనవేలభూ తాకారప్రతిమలచేతను, మోయఁబడు చున్నట్లుచూపట్టు, నాపుష్పకవిమానం బును, హనుమంతుండు, చూచెను.

అని, తాత్పర్యము.

వసంతపుష్పోత్కరచారుదర్శనం
వసంతమాసాదపి కాంతదర్శనమ్
స పుష్పకం తత్ర విమాన ముత్తమం
దదర్శ త ద్వానరవీరసత్తమః. ౮

టీక॥ వానరవీరసత్తమః=వానరులలోఁ బరాక్రమశాలులయినవారిలో శ్రేష్ఠుఁ డగు; సః=ఆహనుమంతుఁడు; తత్ర= అచ్చట; వసంతపుష్పోత్కరచారు ద ర్శనం=వసంతఋతువునందలిపుష్పము లయొక్కసమూహముచేత సుందరమ యిన చూచుటగలదియును; వసంత మాసాదపి=వసంతఋతువుకన్నను; కాం

తదర్శనం = మనోహరమయిన చూడుటగలదియును; ఉత్తమం = శ్రేష్ఠమయినదియునగు; తత్ = ఆ; పుష్పకం=పుష్పకవిమానమును ; దదర్శ = చూచెను.

వానరవీరులలో శ్రేష్ఠుండగు నాహనుమంతుండు, అచ్చట, వసంతఋతువునం గల్గుపూంలచేనలంకరింపఁబడి యుంటం జేసి,సుందరంబుగాఁ జూపట్టుచు, వసంతఋతువుకన్నను,అధికంబుగాఁజూపరులకువినోదంబునైఉపుచు,విమానంబులలో నుత్తమంబైయున్న పుష్పకవిమానంబుం,బూచెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, అష్టమస్సర్గః.
ఇది,స్పష్టార్థము.
ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు , శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండ అష్టమసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

నవమసర్గప్రారంభః.

తస్యాలయవరిష్ఠస్య మధ్యే విపుల మాయతమ్
దదర్శ భవనశ్రేష్ఠం హనూమా న్మారుతాత్మజః. ౧

టీక॥మారుతాత్మజః= వాయుదేవునికొడుకైన;హనూమాన్ = హనుమంతుండు;తస్య = ఆ;ఆలయవరిష్ఠస్య=గృహశ్రేష్ఠముయొక్క; మధ్యే=నడుమునందు;విపులం=విశాలమును; ఆయతం=నిడుపయినదియునగు; భవనశ్రేష్ఠం=గృహశ్రేష్ఠరూపమయిన, పుష్పకవిమానమును;దదర్శ=చూచెను.

వాయుదేవునికుమారుండగు నాహనుమంతుండు, గృహంబులలోనుత్తమంబగునా రావణుని గృహంబునడుమను, గృహశ్రేష్ఠంబనందగినపుష్పకవిమానం

బుం,జూచెను. అని, తాత్పర్యము.

అర్ధయోజనవిస్తీర్ణ మాయతం యోజనం హితత్
భవనం రాక్షసేంద్రస్య బహుప్రాసాద సంకులమ్. ౨

టీక॥ బహుప్రాసాదసంకులం=అనేకములయిన మేడలచేనిండిన; తత్=ఆ; రాక్షసేంద్రస్య=రాక్షసులకుఁబ్రభువైన రావణునియొక్క; భవనం=ఇల్లు; అర్ధయోజనవిస్తీర్ణం=అఱామడవెడల్పుగలదిగాను; యోజనం=ఆమడ; ఆయతం=నిడుపుగలదిగాను; ఆసీత్ (అధ్యాహృతము) హి=ఉండినదిగదా!

రాక్షసేశ్వరుండగు రావణునిగృహంబు, లెక్కలేనిమేడలుగల్గి, యఱామడవెడల్పును ఆమడనిడుపును గలదై యుండెను. అని, తాత్పర్యము.

మార్గమాణస్తు వైదేహీం సీతామాయతలోచనామ్
సర్వతః పరిచక్రామ హనూమా నరిసూదనః. ౩

టీక॥ అరిసూదనః=శత్రువులఁజంపునట్టి; హనూమాన్=హనుమంతుండు; ఆయతలోచనాం=నిడుపులయిన కండ్లుగలదియును; వైదేహీం=విదేహదేశమునందుఁబుట్టినదియునగు; సీతాం=సీతను; మార్గమాణస్తు=వెదకుచునే; సర్వతః=అంతటను; పరిచక్రామ=తిరిగెను.

శత్రువులఁజంపంజాలిన హనుమంతుండు, విశాలంబులగు నేత్రంబులుగల, విదేహదేశంబునంబుట్టిన, సీతను వెదకుచు, నాగృహంబునంతటను గలయందిరిగెను. అని, తాత్పర్యము.

ఉత్తమం రాక్షసావాసం హనూమా నవలోకయన్
ఆససాదాథ లక్ష్మీవాన్ రాక్షసేంద్ర నివేశనమ్. ౪
చతుర్విషాణై ర్ద్విరదై స్త్రివిషాణై స్తథైవచ
పరిక్షిప్త మసంబాధం రక్ష్యమాణ ముదాయుధైః. ౫

టీక॥ అథ=అంతట; లక్ష్మీవాన్=కాంతిగల; హనూమాన్=హనుమంతుండు;

అవలోకయన్ = చూచువాఁడై, సీత నువెదకుటకై యనుట; ఉత్తమం = శ్రేష్ఠంబును; రాక్షసావాసం=రాక్షసులనివాసస్థానమయినదియును; చతుర్విషాణైః = నాలుగుదంతములుగల యేనుంగులచేతను; ద్విరదైః=రెండు దంతములుగలయేనుంగులచేతను;తథైవ=అట్లె; త్రివిషాణైశ్చ= మూఁడు దంతములుగలయేనుంగులచేతను; పరిక్షిప్తం=చుట్టఁబడినదియును ; అసంబాధం=ఇఱుకులేనిదియును ; ఉదాయుధైః=ఎత్తఁబడినయాయుధములు గలరాక్షసులచేతను ; రక్ష్యమాణం= కాపాడఁబడుచున్నదియునగు; రాక్షసేంద్రనివేశనం=రాక్షసులకుఁ బ్రభువైనరావణునియొక్క-గృహంబును; ఆససాద=పొందెను.

అంతఁగాంతిసంపన్నుండగు హనుమంతుండు,సీతనువెదకుటకై, యన్నిగృహంబులలోనుత్తమంబై, రాక్షసులకునికిపట్టై,నాలుగుదంతంబులయేనుంగులును రెండుదంతముల యేనుంగులు ను మూడుదంతంబుల యేనుంగులును జుట్టునుంగలదై, యాయుధధారులగు రాక్షసులచే రక్షింపఁబడుచున్న, రాక్షసేశ్వరుండగురావణుని గృహంబుం బ్రవేశించెను. అని, తాత్పర్యము.

రాక్షసీభిశ్చ పత్నీభీ రావణస్య నివేశనం
ఆహృతాభిశ్చ విక్రమ్య రాజకన్యాభి రావృతమ్. ౭
తన్నక్రమకరాకీర్ణం తిమింగిల ఝషాకులం
వాయువేగ సమాధూతం పన్నగైరివ సాగరమ్. ౮

టీక॥సః(అధ్యాహృతము)= ఆహనుమంతుఁడు; పత్నీభిః= భార్యలయిన;రాక్షసీభిః=రాక్షసస్త్రీలచేతను;విక్రమ్య=పరాక్రమించి;ఆహృతాభిః= తేఁబడిన; రాజకన్యాభిః = రాచకొమాతెలచేతను; ఆవృతం=చుట్టఁబడినదియు, వ్యాపింపఁబడినదియును ; నక్రమకరాకీర్ణం=మొసళ్లచేతను బెద్దచేఁపలచేతను వ్యాపింపఁబడినదియును;తిమింగిల ఝషాకులం=తిమింగిలమనుగొప్పచేఁప చేతను సాధారణ మత్స్యములచేతను గలఁతనొందినదియును; వాయువేగసమాధూతం= గాలివేగముచేనెగురఁగొట్టఁబడినదియును;




పన్నగైః = సర్పములచేత; ఆవృతం (అధ్యాహృతము)= చుట్టఁబడినదియునగు; సాగరమివ (స్థితం)= సముద్రముంబోలెనుండునదియునగు; తత్ = ఆ; రావణస్య=రావణునియొక్క; నివేశనం=అంతఃపురమును; ఆససాద (అధ్యాహృతము)=పొందెను.

ఆహనుమంతుండు, రావణునిభార్యలయిన రాక్షసస్త్రీలును రావణుండు పరాక్రమంబునంగొని తెచ్చిన రాజకన్యలును బరుండియున్న, మొసళ్లును మహామత్స్యంబులును తిమింగిలంబులును మత్స్యంబులునుంగల్గి వాయువేగంబునం దూలుచు సర్పంబులతోఁ గూడినసముద్రంబుఁబోలెఁ జూపట్టుచున్న, రావణునియంతఃపురంబుం బొందెను. అని, తాత్పర్యము.

యాహి వైశ్రవణే లక్ష్మీర్యా చేంద్రే హరివాహనే
సా రావణగృహే సర్వా నిత్య మేవా నపాయినీ. ౮

టీక॥ వైశ్రవణే=కుబేరుని యందును; యా=ఏ; లక్ష్మీః=సంపద; అస్తి (అధ్యాహృతము)=ఉన్నదో; హరివాహనే = హరియను పేరుగలవిగుఱ్ఱములుగాఁగల; ఇంద్రే=ఇంద్రునియందు; యాచ=ఏలక్ష్మియును; అస్తి (అధ్యాహృతము)=ఉన్నదో; సా=ఆలక్ష్మి; సర్వా=అంతయును; రావణగృహే=రావణునియింటియందు; నిత్యమేవ=ఎల్లప్పుడునే; అనపాయినీ=నాశములేనిదై; ఆసీత్ (అధ్యాహృతము)= ఉండెను.

కుబేరునకు హరిహయుండగు నింద్రునకునుఏయేసంపదలుగలవో, ఆసంపదలన్నియును, రావణునింట నెల్లప్పుడును, నాశంబులేనివై, స్థిరంబులుగా, నుండినవి.

అని, తాత్పర్యము.

యాచ రాజ్ఞః కుబేరస్య యమస్య వరుణస్యచ
తాదృశీ తద్వి శిష్టావా బుద్ధీ రక్షోగృహే ష్విహ. ౯

టీక॥ రాజ్ఞః=రాజయిన ; కుబేరస్య=కుబేరునకును; యమస్య=యమునికిని; వరుణస్యచ = వరుణునకును; యాచ=ఏసంపద; అస్తి(అధ్యాహృ




తము)=ఉన్నదో; తాదృశీ= అట్టిది గాని; తద్విశిష్టావా=దానికన్ననధికమయినదిగాని; ఋద్ధిః=సంపద; ఇహ= ఈలంకయందు; రక్షోగృహేషు=రాక్షసులయిండ్లయందు; ఆసీత్=(అధ్యాహృతము) ఉండెను.

కుబేరునకుయమునికివరుణునకునెంతసంపదయుండునో, ఆలంకలోనిరాక్షసులందఱు, నంతటిసంపదగల వారలయియుండిరి.అని, తాత్పర్యము.

తస్య హర్మ్యస్య మధ్యస్థం వేశ్మచాన్యత్సునిర్మితం
బహునిర్యూహసంకీర్ణం దదర్శ పవనాత్మజః. ౧౦
బ్రహ్మణోర్థే కృతం దివ్యం దివి యద్విశ్వకర్మణా
విమానం పుష్పకం నామ సర్వరత్నవిభూషితమ్. ౧౧
పరేణ తపసా లేభే యత్కుబేరః పితామహాత్

టీక॥యత్=ఏది; దివి=స్వర్గమునందు; బ్రహ్మణోర్థే=బ్రహ్మదేవునికొఱకు; విశ్వకర్మణా=విశ్వకర్మచేత; కృతం=చేయఁబడినదియును; దివ్యం=శ్రేష్ఠంబును; సర్వరత్నవిభూషితం=సమస్తమణులచేత నలంకరింపఁబడినదియునగు; పుష్పకంనామ= పుష్పకమను పేరుగల; విమానం = విమానమో; యత్=దేని; కుబేరః=కుబేరుఁడు; పరేణ=అధికమయిన; తపసా=తపస్సుచేత; పితామహాత్=బ్రహ్మదేవునివలన; లేభే=పొందెనో; తత్(అధ్యాహృతము)=అట్టిదియును; తస్య= ఆ; హర్మ్యస్య=మేడయొక్క; మధ్యస్థం = నడుము నందున్నదియును; సునిర్మితం=చక్కఁగాఁ జేయఁబడినదియును; బహునిర్యూహసంకీర్ణం= అనేకములయినమదపుటేనుంగులచే వ్యాపింపఁబడినదియునగు; అన్యత్=ఇతరమయిన; వేశ్మచ=గృహమును; పవనాత్మజః=వాయుదేవునికొడుకైనహనుమంతుండు; దదర్శ=చూచెను.

పూర్వము బ్రహ్మదేవునికొఱకుస్వర్గంబునవిశ్వకర్మచే నిర్మింపఁబడినదై, సమస్తమణులచే నలంకృతంబై, మున్నుకుబేరునిచే గొప్పతపంబుసల్పి బ్రహ్మదేవునివలనం బొందఁబడి, పెక్కుమదపుటేనుంగులచేరక్షింపఁబడినదై, యీరావణునిగృహంబు నడుమ, మఱియొక్కగృహంబుంబోలెఁ జూపట్టుచున్న,పుష్పక విమానంబును, వాయుదేవుని కుమారుండగు, హనుమం

తుండు, చూచెను. అని, తాత్పర్యము.

కుబేర మోజసా జిత్వా లేభే త ద్రాక్షసేశ్వరః. ౧౨
ఈహామృగసమాయుక్తైః కార్తస్వరహిరణ్మయైః
సుకృతై రాచితం స్తంభైః ప్రదీప్త మివ చ శ్రియా. ౧౩
మేరుమందరసంకాశై రుల్లిఖద్భి రివాంబరం
కూటాగారై శ్శుభాగారై స్సర్వత స్సమలంకృతమ్. ౧౪

టీక॥ రాక్షసేశ్వరః= రాక్షసులకుఁ బ్రభుండగు రావణుండు; ఓజసా= పరాక్రమంబుచేత; కుబేరం=కుబేరుని; జిత్వా= జయించి; ఈహామృగసమాయుక్తైః= తోఁడేళ్లతోఁగూడినవియును, తోఁడేళ్లప్రతిమలతోఁ గూడినవియుననుట; కార్తస్వరహిరణ్మయైః=బంగారువికారములును, వెండివికారములును; సుకృతైః=చక్కఁగాఁ జేయఁబడినవియునగు; స్తంభైః=కంబములచేత; ఆచితం=వ్యాపింపఁబడినదియును; శ్రియా=కాంతిచేత; ప్రదీప్తం=ప్రకాశించునదియును; ("ఇవ" అనునది కావ్యాలంకారార్థము) మేరుమందరసంకాశైః=మేరుపర్వతముతోను మందరపర్వతముతోను సమానములును; అంబరం= ఆకాశమును; ఉల్లిఖద్భిరివ(స్థితైః)=ఒరయుచున్నట్లున్నవియును; శుభాకారైః=మంగళకరంబగు నాకారము గలవియునగు; కూటాగారైః= మేడమీఁది యిండ్లచేత; సర్వతః=అంతటను; సమలంకృతం=చక్కఁగాఁ నలంకరింపఁబడినదియునగు; తత్ = ఆపుష్పకవిమానమును; లేభే=పొందెను.

రాక్షసులకందఱకును బ్రభుండగు రావణుండు, పరాక్రమంబునం గుబేరుని జయించి, తోఁడేళ్లప్రతిమలు కట్టియుండు, బంగారముతోను వెండితోను సుందరంబుగాఁ జేయఁబడిన స్తంభంబులతోఁగూడినదై, కాంతిచేఁ బ్రకాశించుచు, మేరుమందరపర్వతంబులుం బోలె నత్యున్నతంబులై యాకాశంబు నొరయునట్లు చూపట్టుచున్న సుందరంబులగు మేడమీఁదిగృహంబు లనేకంబులుగల్గి, యొప్పుచుండు, నాపుష్పకవిమానంబుఁ, దీసికొనెను.

అని, తాత్పర్యము.

స ౯

జ్వలనార్కప్రతీకాశం సుకృతం విశ్వకర్మణా
హేమసోపానసంయుక్తం చారుప్రవరవేదికమ్. ౧౫
జాలవాతాయనై ర్యుక్తం కాంచనై స్స్ఫాటికై రపి
ఇంద్రనీలమహానీలమణిప్రవరవేదికమ్. ౧౬
విద్రుమేణ విచిత్రేణ మణిభిశ్చ మహాధనైః
నిస్తులాభిశ్చ ముక్తాభి స్తలే నాభివిరాజితమ్. ౧౭
చందనేనచ రక్తేన తపనీయనిభేనచ
సుపుణ్యగంధినా యుక్త మాదిత్యతరుణోపమమ్. ౧౮
కూటాగారై ర్వరాకారై ర్వివిధై స్సమలంకృతం
విమానం పుష్పకం దివ్య మారురోహ మహాకపిః. ౧౯

టీక॥ మహాకపిః=పెద్దకోఁతియగు హనుమంతుండు; జ్వలనార్కప్రతీకాశం=అగ్నితోను సూర్యునితోను సమానమైనదియును; విశ్వకర్మణా=విశ్వకర్మచేత; సుకృతం=చక్కగాఁ జేయఁబడినదియును; హేమసోపానసంయుక్తం=బంగారుతోఁ జేయఁబడిన పడికట్లతోఁ గూడినదియును; చారుప్రవరవేదికం=సుందరములును శ్రేష్ఠములునగు తిన్నెలు గలదియును; కాంచనైః=బంగారు వికారములును; స్ఫాటికైరపి=స్ఫటికంపుమణుల వికారములయినవియునగు; జాలవాతాయనైః, జాల=గోడలమీఁద నలంకారార్థము స్వస్తికాద్యాకారములుగాఁ బెద్దవిగాఁ జేయఁబడిన కిటికీలతోను, వాతాయనైః=సాధారణముగాఁ గాలివచ్చుటకుఁ జేయఁబడిన కిటికీలతోను; యుక్తం=కూడినదియును; ఇంద్రనీలమహానీలమణిప్రవరవేదికం=పాలలో వేసినంతనే పాలకు నైల్యము గల్గించు నింద్ర నీలమణుల చేతను సింహళద్వీపమందుఁ బుట్టిన మహానీలమణుల చేతనుం జేయఁబడిన శ్రేష్ఠములయిన తిన్నెలు గలదియును; విద్రుమేణ=పవడము చేతను; నిస్తులాభిః=సరిలేని; ముక్తాభిశ్చ=ముత్తెముల చేతను; నిర్మితేన (అధ్యాహృతము)=చేయఁబడిన; తలేన=క్రిందిభాగము చేత; అభివిరాజితం=ప్రకాశింపఁజేయఁబడినదియును; రక్తేన=ఎఱ్ఱనిదియు; తపనీయనిభేనచ=మంచిబంగారముతో సమానమయినదియును; సుపుణ్యగంధినా=మిక్కిలి

యుఁబరిశుద్ధమును మంచివాసనగలది యునగుఁచందనేనచ=చందనముతోను; యుక్తం= కూడినదియును; ఆదిత్యత రుణోపమం= మధ్యాహ్నకాలపుసూర్యునితోఁబోల్కిగలదియును; వరాకారైః=శ్రేష్ఠములయినయాకారములుగలదియు;వివిధైః=నానావిధములునగు; కూటాగారైః= మేఁడమీఁదియిండ్లచేత;సమలంకృతం=చక్కఁగానలంకరింపఁబడినదియును; దివ్యం=స్వర్గంబునందుఁబుట్టినదియునగు; పుష్పకం=పుష్పకమను; విమానం=విమానమును;ఆరురోహ=ఎక్కెను.

విశ్వకర్మచే సుందరంబుగానిర్మింపఁబడి,సూర్యాగ్నులంబోలె వెలుంగుచు,బంగారముతోఁజేసిన పడికట్లతోఁగూడి,గోడమీఁదన లంకారార్థము పెద్దవిగా స్వస్తికాద్యాకరములుగాఁ జేయఁబడిన జాలంబులను కిటికీలునువాయుసంచారార్థంబు చేయఁబడినసాధారణంబులగుకిటికీలునుంగలిగి, పాలలో వేసి నంతనె యాపాలనంతయు నల్లగాఁ జేయు నింద్రనీల మణులతోను సింహళద్వీపంబునం బుట్టిన మహానీలమణులతోనుం జేయఁబడి సుందరంబులయిన తిన్నెలు గల్గి, నానావిధంబులగుపగడములు గొప్ప వెలగలమణులును ఉత్తమంబులగుముత్తెంబులువీనితోఁ గట్టఁబడినకుట్టిమంబుతోనొప్పుచు, నెట్టగానుండునదికావున మంచిబంగారముతోసాటిసేయందగిన సుగంధిచందనంబుగల్గుటంజేసి వాసనలగుబాళించుచు, మధ్యాహ్న సూర్యనిభంగిభాసిల్లుచు, సుందరంబుగానేర్పఱుపఁబడినినానావిధంబులగుమేడమీఁది గృహంబులచేనలంకరింపఁబడియున్న, స్వర్గంబునం బుట్టిన,పుష్పకవిమానంబును,హనుమంతుండారోహించెను.అని తాత్పర్యము.

తత్రస్థ స్స తదా గంధం పానభక్ష్యాన్నసంభవం
దివ్యం సమ్మూర్ఛితం జిఘ్రే ద్రూపవంత మివానిలమ్. ౨౦

టీక॥తదా=అప్పుడు;సః=ఆహనుమంతుండు; తత్రస్థః = అచ్చటనున్నవాఁడై;దివ్యం=శ్రేష్ఠమును;సమ్మూర్ఛితం=వ్యాపించియున్నదియును; రూపవంతం= ఆకారముగల;అనిలమివ(స్థితం)= వాయుదేవుఁడుఁబోలెనున్నదియును; పానభక్ష్యాన్నసంభవం = త్రాఁగఁదగిన మద్యములవలనను పిండి

వంటలవలనను అన్నములవలననుపుట్టిన దియునగు; గంధం=వాసనను; జిఘ్రత్ (అజిఘ్రత్=ఆఘ్రాణించెను.

అప్పుడాహనుమంతుం, డచ్చటనుండి, దివ్యంబై యంతటను వ్యాపించి, పరాగ బహుళంబై యుంటంజేసి, యాకారమువహించిన వాయువో యనందగి, యొప్పుచున్న, మద్యములుఁబిండివంటలునన్నంబులు మొదలగు వానివలనంగలిగిన సుగంధంబు, నాఘ్రాణించుచుండెను.

అని, తాత్పర్యము.

స గంధస్తం మహాసత్త్వం బంధుర్బంధు మివోత్తమం
ఇత ఏహీత్యువాచేవ తత్ర యత్ర స రావణః. ౨౧

టీక॥సః=ఆ; గంధః=వాసన; తం=ఆ; మహాసత్త్వం = గొప్పబలముగల హనుమంతునిగూర్చి; ఉత్తమం=శ్రేష్ఠుండగు; బంధుం=బంధువునిగూర్చి; బంధురివ=బంధుండుంబోలె; యత్ర=ఎచ్చట; సః=ఆ; రావణః=రావణుఁడు; అస్తి (అధ్యాహృతము) = ఉన్నాఁడో; తత్ర=అచ్చటకి; "ఇతః=ఇటకు; ఏహి=రమ్ము" ఇతి=అని; ఉవాచేవ = చెప్పినట్లుండెను.

ఆవాసన, రావణుండుండు స్థలంబుననుండుపదార్థంబులవలనం గలిగినదగుటంజేసి, యట్టియుత్తమంబగుగంధంబునగల్గినచోటనె రావణుండుండునని బుద్ధిమంతుండగుహనుమంతుండూహింపఁదగియున్నది; కావున, నాగంధంబు, బంధుండు, తనకుఁగావలసినబంధువునకుఁజెప్పునట్లు, హనుమంతునకు, రావణుండుండుస్థలంబును, జెప్పినట్లుండెను.

అని, తాత్పర్యము.

తతస్తాం ప్రస్థితశ్శాలాం దదర్శ మహతీం శుభాం
రావణస్య మనఃకాంతాం కాంతామివ వరస్త్రియమ్. ౨౨
మణిసోపానవికృతాం హేమజాలవిభూషితాం
స్ఫాటికై రావృతతలాం దంతాంతరతరూపికాం. ౨౩
ముక్తాభిశ్చ ప్రవాళైశ్చ రూప్యచామీకరైరపి
విభూషితాం మణిస్తంభై స్సుబహుస్తంభ భూషితామ్. ౨౪

"సుబహుస్తంభభూషితైః" అనిపాఠాంతరము.

నమ్రైః ఋజుభి రత్యుచ్చై స్సమంతా త్సువిభూషితైః
స్తంభైః పక్షైరివాత్యుచ్చై ర్దివంసంప్రస్థితామివ. ౨౫
మహత్యా కుథయాస్తీర్ణాం పృథివీలక్షణాంకయా
పృథివీమివ విస్తీర్ణాం సరాష్ట్రగృహ మాలినీమ్. ౨౬
నాదితాం మత్తవిహగై ర్దివ్య గంధాధి వాసితాం
పరార్థ్యాస్తరణోపేతాం రక్షోధిప నిషేవితామ్. ౨౭
ధూమ్రా మగరుధూపేన విమలాం హంసపాండురాం
చిత్రాం పుష్పోపహారేణ కల్మాషీమివ సుప్రభామ్. ౨౮
మనస్సంహ్లాదజననీం వర్ణస్యాపి ప్రసాదినీం
తాం శోక నాశినీం దివ్యాం శ్రియ స్సంజన నీమివ. ౨౯

టీక॥ తతః = అటుపిమ్మట; సః (అధ్యాహృతము) = ఆహనుమంతుండు; తాం = ఆ రావణుండుండుస్థలమునుగూర్చి; ప్రస్థితః = బయలుదేఱినవాఁడై; మహతీం = గొప్పదియును; శుభాం = మంగళకరమయినదియును; రావణస్య = రావణునియొక్క; మనఃకాంతాం = మనసుచేఁగోరఁబడిన; కాంతాం = ప్రియురాలయిన; వరస్త్రీయమివ (స్థితాం) = శ్రేష్ఠయయినస్త్రీవలెనున్నదియును; మణిసోపానవికృతాం = చక్కఁగాఁజేయఁబడిన రత్నవికారములయినపడికట్లుగలదియును; హేమజాలవిభూషితాం = బంగారువికారములయినకిటికీలచే నలంకరింపఁబడినదియును; స్ఫాటికైః = స్ఫటికమణులచేత; ఆవృతతలాం = కప్పఁబడినక్రిందిభాగముగలదియును; దంతాంతరితరూపికాం = దంతములచే నడుమ నిర్మింపఁబడిన రూపముగలదియును, లేక, దంతములచేవిచ్ఛిత్తిగలదిగాఁజేయఁబడిన రూపముగలదియును, అచ్చటచ్చట నడుమ నతికింపఁబడి దంతపుఁబలకలుగలదియుననుట; ముక్తాభిశ్చ = ముత్తెములచేతను; ప్రవాళైశ్చ = పవడములచేతను; రూప్యచామీకరైరపి = వెండిచేతనుబంగారములచేతను; నిర్మితైః (అధ్యాహృతము) = చేయఁబడిన; స్తంభైః (అధ్యాహృతము) = కంబములచేతను; సుబహుస్తంభభూషితైః (పాఠాం

 

తరము)= మిక్కిలియనేకములయిన
చిన్నకంబములుగల ; మణిస్తంభైః=ర
త్నవికారములయిన కంబములచేతను;
సుభూషితాం = చక్కఁగానలంకరిం
పఁబడినదియును;సుబహుస్తంభభూషి
తాం = మిక్కిలియనేకములయిన
స్తంభములచే నలంకరింపఁబడినదియు
నగు;నమ్రైః= కొంచెమువంగినవియు
ను;ఋజుభిః=వంకరగానివియును; అ
త్యుచ్ఛ్రైః= మిక్కిలియున్నతములును;
సమంతాత్ = అంతటను; సువిభూషి
తైః = చక్కఁగానలంకరింపఁబడినవి
యునగు;అత్యుచ్ఛ్రైః = మిక్కిలియు
న్నతములగు;పక్షైరివ(స్థితైః)=ఱె
క్కలుంబోలె నున్నవియునగు; స్తం
భైః=కంబములచేతను; దివం=స్వర్గ
మునుగూర్చి; సంప్రస్థితామివ (స్థి
తాం)=బయలుదేఱినట్లున్నదియు; మ
హత్యా = పెద్దదియును;పృథివీలక్ష
ణాంకయా= భూమియొక్కలక్షణమె
గుఱుతుగాఁగలదియునగు; కుథయా=
చిత్రకంబళముచేత;ఆస్తీర్ణాం = ప
ఱపఁబడినదియును; సరాష్ట్రగృహ
మాలినీం= దేశములతోఁగూడినయిండ్ల
యొక్కపఙ్క్తిగల; విస్తీర్ణాం=వి
శాలమయిన; పృథివీమివ (స్థితాం)=
భూమియుంబోలెనున్నదియును; మత్త
విహగైః=మదించినపక్షులచేత; నాది
తాం= ధ్వనింపఁజేయఁబడినదియును;
దివ్యగంధాధివాసితాం=శ్రేష్ఠమయిన
వాసనచేత వాసనగొట్టునట్లుచేయఁబ
డినదియును; పరార్ధ్యాస్తరణోపే
తాం = శ్రేష్ఠమయిన పఱుపుకంబళి
తోఁగూడినదియును; రక్షోధిపనిషేవి
తాం = రాక్షసులకుఁబ్రభువైనరావ
ణునిచేతసేవింపఁబడినదియును; అగరు
ధూపేన=అగరుగంధముయొక్కపొగ
చేత;ధూమ్రాం=నలుపుమించఁగలసిన
యెఱుపు వర్ణము గలదియును; విమ
లాం=నిర్మలమయినదియును; హంస
పాండురాం= హంసపక్షివలెఁదెల్లన
యినదియును;పుష్పోపహారేణ=పూల
యొక్కకానుకచే, చల్లుటచేతననుట;
చిత్రాం = నానావర్ణములు గలది
యును;కల్మాషీమివ(స్థితాం)=కామధే
నువుంబోలెనున్నదియును;సుప్రభాం=
మంచికాంతిగలదియును;మనస్సంహ్లాద
జననీం= మనసునకుసంతోషముఁబుట్టిం
చునదియును; వర్ణస్యాపి=రంగుయొ
క్కయు; ప్రసాదినీం=ప్రసన్నముగాఁ
జేయునదియును, అతిశయము సేయున
దియుననుట;శోకనాశినీం=దుఃఖమును
బోఁగొట్టునదియును; దివ్యాం=శ్రేష్ఠ
మైనదియును;శ్రియః=సంపదయొక్క;

 

సంజననీమివ (స్థితాం)=పుట్టించునదివలెనున్నదియునగు; తాం=ఆ; శాలాం=గృహమును; దదర్శ=చూచెను.

ఆహనుమంతుం, డట్లు, రావణుండుండునట్టి గృహంబునకుఁ బయలు దేఱి, గొప్పదై మంగళకరంబై, రావణుని హృదయంబునకుఁ బ్రియమైనయుత్తమస్త్రీయనందగి, మణిమయంబులగుపడికట్లుగలిగి, బంగారుకిటికీలనలంకృతంబై, స్ఫటికమణులతోఁ గట్టఁబడినకుట్టిమంబుగలిగి, యచ్చటచ్చటనడుమసుందరంబుగానతికింపఁబడిన, దంతపుఁబలకలుగలదై, ముత్తెపుఁగంబంబులఁ బ్రవాళస్తంభంబుల వెండిస్తంభంబుల బంగారుస్తంభంబుల మణిమయస్తంభంబులననేకంబుల(యవాంతరస్తంభసంపన్నంబుల) నొప్పుచుఁ, గొంచెముగొననువంగినవై వంకరలుగాకయత్యున్నతంబులై యింతటనుంజక్కఁగానలంకరింపఁబడియున్నతంబులగు తెక్కలు కైవడిం దోఁచు స్తంభంబులు గల్గుటంజేసి, స్వర్గంబున కుద్గమించునదివోలెఁ జూపట్టుచు, సముద్రనదీ పర్వతవనాదులగు భూమిలక్షణంబులనంకితంబగుచిత్రకంబళంబునంగప్పఁబడిన నేలగలదై, నానాదేశములతోఁ గూడినభూమండలంబుంబోలెవిశాలంబై, మదంబునమధురంబుగాఁగూయుపక్షులుగలిగి, దివ్యగంధంబునంబరిమళించుచు, రాక్షసేశ్వరుండగు రావణునిచే సేవింపఁబడుచు, నగరుధూపంబుల వేసియుండుటంజేసి యొకచో ధూమ్రవర్ణంబై, యొకచోహంసయుంబోలె నిర్మలంబై తెల్లఁగాఁగనుపట్టుచు, నొక్కెడఁ బూలుచల్లఁబడినందునఁ, జిత్రవర్ణంబై, కామధేనువుంబోలె నెల్లకోర్కెలందీర్పఁగలదై, కాంతిచే వెలుంగుచుఁ, జూపరులహృదయంబునకు సంతోషంబునెఱపునదియై, సంతోషప్రదంబగుటంజేసిచూపరుల ముఖకాంతి వృద్ధిబొందించునదై, దుఃఖముఁబోఁగొట్టునదై, దివ్యంబై, లక్ష్మికిం బుట్టింటిభంగి భాసిల్లుచున్న, యారావణుండున్నగృహంబుం, జూచెను. అని, తాత్పర్యము.

ఇంద్రియాణీంద్రియార్థైస్తు పంచ పంచభిరుత్తమైః
తర్పయామాస మాతేవ తదా రావణపాలితా. ౩౦

టీక॥ తదా=అప్పుడు; రావణపాలితా = రావణునిచేఁబాలింపఁబడిన; సాశాలా(అధ్యాహృతము) = ఆయిల్లు; మాతేవ=తల్లివలె; హనుమతః

(అధ్యాహృతము)-హనుమంతునియొక్క; పంచ=అయిదయిన ; ఇంద్రియాణి=త్వక్కు (చర్మము) చక్షుస్సు (కన్ను) శ్రోత్రము (చెవి) జిహ్వ (నాలిక) ఘ్రాణము (ముక్కు) అను నింద్రియంబులను; ఉత్తమైః= శ్రేష్ఠంబులయిన; పంచ=అయిదగు; ఇంద్రియార్థైః=తు=ఇంద్రియంబులయొక్క విషయంబులగు, స్పర్శము (తాఁకుట) రూపము, శబ్దము, రసము, గంధము, అనువానిచేతను; తర్పయామాస=తృప్తినొందించెను.

రావణునిచేఁబాలింపఁబడిన యాగృహంబునందు, సుస్పర్శంబగువాయువును నేత్రంబులకు వినోదంబు నైయవు సుందరంబగురూపంబును జెవ్వులకునానందంబుగలిగించు మధురంబగు గానంబులును అతిరుచ్యంబులగు భక్ష్యాదులును మనోహరంబగుగంధంబును గలుగుటంజేసి, యాగృహంబు, అచ్చటికిఁబోయిన హనుమంతుని త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణంబులను పంచేంద్రియంబులకును, దనయందుండు స్పర్శరూపశబ్దరసగంధ విశేషంబుల చేతఁ, గన్నతల్లి తనపుత్రుని యింద్రియంబులకుంబోలెఁ, దృప్తిగలిగించెను.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— హనుమంతుని జిహ్వకు, రసంబుచేఁ, దృప్తిగలిగించెను" అనునది, హనుమంతుం డచ్చటనుండు భక్ష్యాదుల భక్షింపకున్నను, వానిరూపంబునను గంధంబునను "ఇవి, మంచిరుచిగలది" యనిభావించుటవలన నట్టి భక్ష్యాదుల ననుభవించియున్నం దునం గల్గువాసనంజేసి, యప్పుడతఁడు భక్ష్యాదిరసాస్వాద సౌఖ్యంబతనికిఁగలిగినది; అనునభిప్రాయంబునఁ జెప్పబడినది. ఆగృహము, రావణునిచేఁబాలింపబడినదగుటంజేసి, రావణుండే నాయకుండుగాఁ గలదయ్యెను, రావణునికె యనుకూలముగా నుండవలసిన దయ్యెను , హనుమంతుండట్టి రావణునకుశత్రుండగు రామునిదూత గావున హనుమంతునకుఁబ్రతికూలముగా నుండవలసినదయ్యెను, అట్లుగాక "తల్లికొడుకునుంబోలె హనుమంతుని దృప్తిపఱచె" ననివర్ణించుటచేఁ, బుష్పకవిమానంబును, రావణుండుసీతను హరించుటవలననె మృతుండైనవాఁడె కావున, నతనిందనకుఁ బ్రభునిగాఁ దలంచుట కార్యంబుగాదనియును, రాముండెతనకుఁ బ్రభుండుకాఁగలం డనియును, అతనికిహనుమంతుండుపుత్రప్రాయుండుకావునఁ, దాను, నట్లేయెం

చుట యుచితంబనియుం, దలంచినది" అని, వ్యంజితమగుచున్నది.

స్వర్గోఽయం దేవలోకోఽయ మింద్రస్యేయం పురీ భవేత్
సిద్ధి ర్వేయం పరాహిస్యా దిత్యమన్యత మారుతిః. ౩౧

టీక॥ "అయం=ఇది; స్వర్గః=స్వర్గమో! అయం=ఇది; దేవలోకః= దేవతలస్థానమో! ఇయం=ఇది; ఇంద్రస్య= దేవేంద్రునియొక్క; పురీ= పట్టణమయిన యమరావతి; భవేత్ = అగునో! పరా=ఉత్కృష్టమయిన; సిద్ధిః=తపస్సిద్ధిరూపమయినబ్రహ్మలోకము ; స్యాద్వా=అగునో! ("హి" అనునది పాదపూరణార్థము)" ఇతి=అని; మారుతిః=వాయువుకొడుకైన హనుమంతుఁడు; అమన్యత=తలంచెను.

వాయుదేవునికుమారుండగు హనుమంతుండు, ఆరావణునిస్థానంబుందు తెలంగుంజూచియచ్చెరువొంది, ఇది స్వర్గంబో! అందునుముఖ్యముగా దేవతలునివసింపఁదగినస్థానంబో! అందును, దేవతలకందఱకును ప్రభువైన యింద్రుండు నివసించునమరావతీపురియో! లేక, బ్రహ్మలోకమో!" యని, తలంచెను. అని, తాత్పర్యము.

ప్రధ్యాయత ఇవాపశ్య ప్రదీపాం స్తత్ర కాంచనాన్
"ప్రత్యాయత ఇవాపశ్యత్" అని, పాఠాంతరము.
ధూర్తాన్ నివ మహాధూర్తైః దేవనేన పరాజితాన్. ౩౨

టీక॥ సః(అధ్యాహృతము)=ఆహనుమంతుఁడు; తత్ర=అచ్చట; కాంచనాన్ = బంగారువికారములయినవియును, బంగారువికారములయిన స్తంభంబులనుంచఁబడినవియుననుట ; ప్రధ్యాయతఇవ(స్థితాన్) కదలకుండుటచేధ్యానము చేయుచున్నట్లున్నవియును; ప్రత్యాయతఇవ(స్థితాన్, అనిపాఠాంతరము)=మిక్కిలియును బ్రకాశముగలిగియుండుటచే, నెదుర్కొనున ట్లున్నవియును; మహాధూర్తైః= పెద్దజూదరులచేత; దేవనేన=జూదమాడుటచేత; పరాజితాన్=జయింపఁబడిన; ధూర్తాన్ ఇవ(స్థితాన్) = జూదరులుంబోలెనున్నవియునగు; ప్రదీపాన్=దీపంబులను; అపశ్యత్=చూచెను.

ఆహనుమంతుండచ్చట, నిశ్చలంబుగానుండుటంజేసి, యేమోధ్యానంబు

సేయుచున్నవివోలెఁజూపట్టుచు, నట్లు పెద్దజూదరులచే జూదంబునఁ బరాజయంబునొందియవమానంబున నిట్టట్టు కదలకుండుజూదరులచందంబున నందంబుగానున్న, దీపంబులంజూచెను. (పాఠాంతరపక్షమందు; "ఆహనుమంతుండు, ఎచ్చుగాఁ బ్రకాశంబుగలుగుటంజేసితన్నదిగొక్కనవియుంబోలెఁ జూపట్టుచు," శేషము సమానము).

అని, తాత్పర్యము.

దీపానాంచ ప్రకాశేన తేజసా రావణస్యచ
అర్చిర్భిర్భూషణానాంచ ప్రదీప్తేత్యభ్యమన్యత. ౩౩

టీక॥సః (అధ్యాహృతము)=ఆహనుమంతుండు; దీపానాం= దీపములయొక్క; ప్రకాశేనచ=కాంతిచేతను; రావణస్య=రావణునియొక్క; తేజసాచ=కాంతిచేతను; భూషణానాం = సొమ్ములయొక్క; అర్చిర్భిశ్చ=కాంతులచేతను; సాశాలా(అధ్యాహృతము)=ఆగృహము; "ప్రదీప్తా=మండినది" ఇతి=అని; అభ్యమన్యత= తలంచెను.

ఆహనుమంతుండు, ఆగృహంబున, దీపంబుల వెలుతురును, రావణుని తేజస్సును, సొమ్ముల కాంతులును, అంతటను బర్వియుంటంజూచి, "యీయిల్లు మండుచున్నదా యేమి? అనితలంచెను.

అని, తాత్పర్యము.

తతో పశ్యత్కుథాసీనం నానావర్ణాంబరస్రజం
సహస్రం వరనారీణాం నానావేష విభూషితమ్. ౩౪

టీక॥తతః = అటుపిమ్మట; సః(అధ్యాహృతము)=ఆహనుమంతుఁడు; కుథాసీనం = చిత్రకంబళమునందున్నదియును; నానావర్ణాంబరస్రజం=పలువిధములయినరంగులుగల వస్త్రంబులును బుష్పమాలికలుగలదియును; నానావేషవిభూషితం= నానావిధములయినయలంకారములచే నలంకరింపఁబడినదియునగు; వరనారీణాం= ఉత్తములగు స్త్రీలయొక్క; సహస్రం= వేయిని; అపశ్యత్ =చూచెను.

అంత, నాహనుమంతుం, డచ్చట, చిత్రకంబళంబుపైఁబరుండి, చిత్రవర్ణంబులగు వస్త్రంబులను బుష్పమాలికలను

ధరించి, పలు దెఱంగులగునలంకారంబు లనలంకరింపఁబడియుండు, స్త్రీలను, వేయుమందిని, జూచెను.

అని, తాత్పర్యము.

పరివృత్తేఽర్ధరాత్రే తు పాననిద్రావశంగతం
క్రీడిత్వోపరతం రాత్రౌ సుష్వాప బలవత్తదా. ౩౫

టీక॥ తత్ (అధ్యాహృతము)=ఆవేయి; రాత్రౌ=రాత్రియందు; క్రీడిత్వా=క్రీడించి; ఉపరతం=అలసటనుబొందినదై; పాననిద్రావశంగతం= మద్యంబు త్రాగుటను నిద్రకును లోఁబడినదై; అర్ధరాత్రే= నిశీథము; పరివృత్తేతు=తిరుగఁగానే; తదా=అప్పుడు; బలవత్= బలాత్కారముగా; సుష్వాప=నిదురించెను.

ఆవేయిమంది స్త్రీలు, రాత్రియందు వివిధంబులగు క్రీడలు సల్పి, యలసటనొంది, యర్ధరాత్ర మతిక్రమింపఁగానే, ఇంకను గ్రీడించుటయందుఁ బూర్ణము గాఁదృప్తినొందనివారయ్యును, మద్యంబు త్రావినందువంగల్గినకైపునకు నిద్రకును లోఁబడి, బలాత్కారంబున, నప్పుడే, నిద్రఁజెందిరి.

అని, తాత్పర్యము.

తత్ప్రసుప్తం విరురుచే నిశ్శబ్దాంతరభూషణం
నిశ్శబ్దహంసభ్రమరం యథా పద్మవనం మహత్. ౩౬

టీక॥ ప్రసుప్తం=నిదురించినదియును; నిశ్శబ్దాంతరభూషణం= పోయినశబ్దముగలనడుమునందలిసొమ్ము (అనఁగా మొలనూలు) గలదియునగు; తత్=ఆవేయి; నిశ్శబ్దహంసభ్రమరం= పోయినధ్వనిగలహంసలును దుమ్మెదలును గల; మహత్=పెద్దదియగు; పద్మవనం యథా=తామరవనముంబోలె; విరురుచే=ప్రకాశించెను.

అట్లు, నిశ్చలంబుగాఁ బరుండి, నిదురించియుండుటం జేసి, నిశ్శబ్దములయిన మొలనూలు మొదలగు విభూషణంబులు గలయా స్త్రీలసమూహము, అట్లు, రాత్రియందు, నిశ్శబ్దముగానుండు హంసలును భ్రమరములును గల, కమలవనంబు చందంబున, నందంబుగానుండినది.

అని, తాత్పర్యము,

తాసాం సంవృతదంతాని మీలితాక్షాణి మారుతిః
అపశ్య త్పద్మగంధీని వదనాని సుయోషితామ్. ౩౭

టీక॥ మారుతిః = వాయుదేవునికుమారుండగు హనుమంతుండు; తాసాం=ఆ; సుయోషితాం=మంచిస్త్రీలయొక్క; సంవృతదంతాని=మూయఁబడినదంతంబులుగలవియును; మీలితాక్షాణి=మూయఁబడినకండ్లుగలదియును; పద్మగంధీని=కమలముయొక్క వాసనవంటివాసనగలదియునగు; వదనాని=ముఖంబులను; అపశ్యత్=చూచెను.

వాయుదేవుని కుమారుండగుహనుమంతుండు, కండ్లుమూసికొనిపండ్లుకానరాకుండ పెదవులుమూసికొని, నిద్రించుచుండు, నాస్త్రీల, కమలంబులుంబోలెసుగంధంబుగలిగిన ముఖంబులం, జూచెను. అని, తాత్పర్యము.

ప్రబుద్ధానీవ పద్మాని తాసాం భూత్వాక్షపాక్షయే
పున స్సంవృత పత్రాణి రాత్రా వివ బభు స్తదా. ౩౮

టీక॥ తాసాం=ఆస్త్రీలయొక్క; వదనాని (అధ్యాహృతము)=ముఖములు; క్షపాక్షయే=రాత్రియొక్క నాశమునందు, సూర్యోదయమునందనుట; పద్మానీవ=తామరపూలుంబోలె; ప్రబుద్ధాని=వికసించినవి; భూత్వా=అయి; రాత్రౌ=రాత్రియందు; పునః=మఱల; సంవృతపత్రాణి=సంకోచమునొందినఱేకులుగల; పద్మాని (అధ్యాహృతము) ఇవ=తామరపూలుంబోలె; తదా=అప్పుడు; బభుః=ప్రకాశించినవి

ఆస్త్రీలముఖంబులు, ప్రాతఃకాలంబునుండి, కమలంబులంబోలె వికసితంబులయియుండి, మఱలరాత్రియందు, ముకుళితంబులయిన కమలంబులంబోలెఁ బ్రకాశించుచుండినవి.
అని, తాత్పర్యము.

ఇమాని ముఖపద్మాని నియతం మత్తషట్పదాః
అంబుజానీవ ఫుల్లాని ప్రార్థయంతి పునఃపునః. ౩౯

టీక॥ మత్తషట్పదాః=మదించిన తుమ్మెదలు; ఇమాని=ఈ; ముఖపద్మాని=

కమలంబులంబోలు ముఖంబులను; ఫుల్లాని=వికసించిన; అంబుజానీవ = కమలంబులంబోలె; పునఃపునః = మాటిమాటికిని; ప్రార్థయంతి= (లిజర్థ మందులట్) కోరును. నియతం=నిశ్చయము!

వీనిముఖంబులు కమలంబు లుండునట్లునున్నవి, గావున, మదంబున నోడలు దెలియనిభృంగంబులు, వికసించినకమలంబులఁగోరునట్లు, వీరిముఖంబులను, మాటిమాటికిని, గోరును. ఇదినిశ్చయము! అని, తాత్పర్యము.

ఇతీ వామన్యత శ్రీమా నుపపత్త్యా మహాకపిః
మేనే హి గుణత స్తాని సమాని సలిలోద్భవైః. ౪౦

టీక॥ఇతీవ=ఈప్రకారముగనే; శ్రీమాన్=కాంతిగలవాఁడును; మహాకపిః= పెద్దకోఁతియునగు హనుమంతుండు; ఉపపత్త్యా=యుక్తిచేత; అమన్యత = తలంచెను, సః(అధ్యాహృతము)= ఆహనుమంతుఁడు; తాని = ఆముఖంబులను; గుణతః = సుగంధము మొదలగు గుణంబుల వలన; సలిలోద్భవైః= కమలములతో; సమాని=సరియయినవిగా; మేనేహి= తలంచెనుగదా!

శ్రీమంతుండగు నాహనుమంతునకు, వారిముఖంబులు, సుగంధాదిగుణంబులఁ, గమలంబులతో సరివచ్చునని, దోఁచెను, గావున, పైఁజెప్పినట్లు, అతండు, "తుమ్మెదలీముఖంబులనుగోరు"నని, తలంచెను. అని, తాత్పర్యము.

సా తస్య శుశుభే శాలా తాభి స్త్రీభి ర్విరాజితా
శారదీవ ప్రసన్నా ద్యౌ స్తారాభి రభిశోభితా. ౪౧

టీక॥తస్య=ఆరావణుని యొక్క; తాభిః=ఆ; స్త్రీభి=స్త్రీలచే; విరాజితా=ప్రకాశింపఁజేయఁబడిన; సా= ఆ; శాలా=గృహము; తారాభిః= నక్షత్రములచేత; అభిశోభితా= ప్రకాశింపఁజేయఁబడినదియు; ప్రసన్నా= నిర్మలమయినదియును; శారదీ= శరదృతువునందలి; ద్యౌరివ = ఆకాశమువలె ; శుశుభే = ప్రకాశించెను.

స ౯

అట్లుత్తమస్త్రీలతోఁగూడినిర్మలం బైయున్నయారావణునిగృహంబు, అట్లు,నిర్మలంబై ,నక్షత్రంబులతోఁ గూడినశరత్కాలమునందలి యాకాశంబు చందంబునం,బ్రకాశించెను.

అని, తాత్పర్యము.

సచ తాభిః పరివృత శ్శుశుభే రాక్షసాధిపః
యథా హ్యుడుపతి శ్శ్రీమాం స్తారాభి రభిసంవృతః. ౪౨

టీక॥ రాక్షసాధిపః=రాక్షసులకుఁ బ్రభుండయిన;సచ=ఆరావణుండును; తాభిః=ఆస్త్రీలచేత;పరివృతః = చుట్టఁబడినవాఁడై;శ్రీమాన్=కాంతిసంపన్నుండును; తారాభిః=నక్షత్రములచేత; అభిసంవృతః=చుట్టఁబడినవాఁడునగు;ఉడుపతిర్యథా=చంద్రుండుంబోలె ("హి" అనునది పాదపూరణార్థకము);శుశుభే=ప్రకాశించెను.

రాక్షసేశ్వరుండగునారావణుండును, ఆయుత్తమస్త్రీలంగూడి, నక్షత్రంబులంగూడినశ్రీమంతుండగు చంద్రునిచందంబున,నందంబుగాఁ,బ్రకాశించెను.

అని, తాత్పర్యము.

యా శ్చ్యవంతేం బరా త్తారాః పుణ్యాశేషసమావృతాః
ఇమా స్తా స్సంగతాః కృత్స్నా ఇతి మేనే హరి స్తదా. ౪౩

టీక॥ "యాః=ఏ; తారాః=నక్షత్రములు; పుణ్యాశేషసమావృతాః=పుణ్యమునుయొక్కమిగతచేఁజుట్టఁబడినవై;చ్యవంతే=పడుచున్నవో; తాః=ఆనక్షత్రములు;కృత్స్నాః=అన్నియును; సంగతాః=చేరినవై;ఇమాః = ఈస్త్రీలుగా; అభూవన్(అధ్యాహృతము)=అయినవి!ఇతి=అని;హరిః=కోఁతియయినహనుమంతుండు;తదా=అప్పుడు; మేనే=తలంచెను.

హనుమంతుం,డప్పుడు, ఆస్త్రీలం జూచి, "యనుభవింపఁగామిగిలిన పుణ్యంబుతోఁగూడి యాకాశంబుననుండి, భూమిపై,నిదివఱకుఁబడిన, నక్షత్రంబులన్నియుఁజేరి,యీస్త్రీలరూపంబులవహించినవికాఁబోలు" అని, తలంచెను.

అని, తాత్పర్యము.

తారాణా మివ సువ్యక్తం మహతీనాం శుభార్చిషామ్

ప్రభావర్ణప్రసాదాశ్చ విరేజు స్తత్ర యోషితామ్.౪౪

టీక॥ తత్ర=అచ్చట; యోషితాం= స్త్రీలయొక్క; ప్రభావర్ణప్రసాదాశ్చ=కాంతియును రంగును నైర్మల్యంబును; మహతీనాం = పెద్దవియును; శుభార్చిషాం = మంగళకరంబులయిన కాంతిగలవియునునగు; తారాణాం=నక్షత్రములయొక్క; ప్రభావర్ణప్రసాదాః(అధ్యాహృతము)ఇవ = కాంతియును రంగును నైర్మల్యంబునుంబోలె; సువ్యక్తం = నిక్కిలియు స్పష్టముగా; విరేజుః=ప్రకాశించినవి.

అచ్చట, స్త్రీలమేనికాంతియును రంగును నైర్మల్యమును, గొప్పవియును గాంతిసంపన్నంబులునగు నక్షత్రంబుల కాంతియు రంగును నైర్మల్యంబునుం బోలి, ప్రకాశించుచుండినవి.

అని, తాత్పర్యము.

వ్యావృత్తగురుపీనస్రక్ప్రకీర్ణవరభూషణాః
పానవ్యాయామకాలేషు నిద్రాపహృతచేతసః. ౪౫

టీక॥ తాః (అధ్యాహృతము)= ఆస్త్రీలు; పానవ్యాయామకాలేషు=త్రాగుటకవాంతరము, జరిగినరతికాలములందు; నిద్రాపహృతచేతసః=నిదురచే నపహరింపఁబడిన మనసుగలవారలై; వ్యావృత్తగురుపీనస్రక్ప్రకీర్ణవరభూషణాః, వ్యావృత్తగురుపీనస్రక్= వ్యత్యస్తములయిన పెద్దవియు లావైనవియునగు పుష్పమాలికలుగలవారలును, ప్రకీర్ణవరభూషణాః= స్థానములు తప్పిన శ్రేష్ఠములయిన సొమ్ములుగలవారలునై; విరేజుః(అధ్యాహృతము)=ప్రకాశించిరి.

ఆస్త్రీలు, చక్కఁగా మద్యముఁ ద్రావి విరతిసేయు కాలంబున, నిద్రకులోఁబడుటం జేసి, వ్యత్యాసమునొందినపుష్పమాలికలు కలిగి స్థానములు తప్పిన భూషణములతోఁగూడి, ప్రకాశించుచుండెరి.

అని, తాత్పర్యము.

వ్యావృత్త తిలకాః కాశ్చిత్కాశ్చి దుద్భ్రాంతనూపురాః
పార్శ్వే గళితహారాశ్చ కాశ్చి త్పరమయోషితః. ౪౬

టీక॥కాశ్చిత్ = కొందఱుస్త్రీలు; వ్యావృత్తతిలకాః=కలసిపోయిన నుదుటమీఁది బొట్టుగలవారలయి ; కాశ్చిత్=కొందఱుస్త్రీలు; ఉద్భ్రాంతనూపురాః=స్థానముతప్పిన యందెలు గలవారలై; కాశ్చిత్=కొందఱు ; పరమయోషితః=ఉత్తమస్త్రీలు; పార్శ్వే=ప్రక్కయందు; గళితహారాశ్చ= జాఱిన హారముగలవారలయియున్న; ఆసన్(అధ్యాహృతము)= ఉండిరి.

కొందఱుస్త్రీలనుదుటిబొట్టుమాసియుండినది ; కొందఱికాలియందెలు, స్థానంబుతప్పియుండినవి; మఱికొందఱికంఠహారంబులు, ప్రక్కనజాఱిపడియుండినవి.

అని, తాత్పర్యము.

ముక్తాహారావృతాశ్చాన్యాః కాశ్చిద్విస్రస్తవాససః
వ్యావిద్ధరశనాదామాః కిశోర్య ఇవ వాహితాః.౪౭

టీక॥అన్యాః=ఇతరస్త్రీలు; ముక్తాహారావృతాశ్చ=ముత్యపుహారముచేఁ గప్పఁబడినవారలయ్యును, తెగినముత్యములహారపుఁదున్కలచేఁ జుట్టుకొనఁబడినవారలయ్యునను టు;కాశ్చిత్=కొందఱుస్త్రీలు; విస్రస్తవాససః=జాఱినవస్త్రములుగలవారలయి;కాశ్చిత్ (అధ్యాహృతము)=కొందఱుస్త్రీలు;వ్యావిద్ధరశనాదామాః=తెగినమొలనూలిదారముగలవారలయి ; కావున నే; వాహితాః=శ్రమముపోవుటకై , భూమియందుపొరలునట్లుచేయఁబడిన ; కిశోర్యఇవ(స్థితాః) = చిన్నయాఁడుగుఱ్ఱములుంబోలె నున్నవారలయి ; విరేజుః(అధ్యాహృతము)= ప్రకాశించిరి.

మఱికొందఱు, తెగిపోయి మేనంజుట్టుకొనినముత్యపుహారముగలిగియును, కొందఱువస్త్రముపిడియును , ప్రకాశించుచుండిరి , కొందఱు శయనించియుండుస్త్రీలు, మొలనూలిదారము , తెగిపోవుటచే, వదులయియుంటం జేసి,యట్లువదులుచేయఁబడిన నడుముకట్టుగలిగి శ్రమనాశనార్థము నేలం బొరలునట్లుచేయఁబడుచుండు , చిన్నయాఁడుగుఱ్ఱములుంబోలె,నొప్పుచుండెరి. అని, తాత్పర్యము.

సుకుండలధరాశ్చాన్యా విచ్ఛిన్నమృదితస్రజః
గజేంద్రమృదితాః ఫుల్లా లతాఇవ మహావనే. ౪౮

 

టీక॥ సుకుండలధరాః=మంచికుండలములను ధరించియుండునట్టి; అన్యాశ్చ=ఇతరస్త్రీలును; విచ్ఛిన్నమృదితస్రజః=తెంపఁబడినవియును లాఁగఁజేయఁబడినవియునగు పుష్పమాలికలుగలవారలయి; మహావనే= గొప్పయడవియందు; గజేంద్రమృదితాః= గజశ్రేష్ఠముచేనలంకరింపఁబడిన; ఫుల్లాః= పూచియుండు; లతాఇవ (స్థితాః) = తీఁగెలుంబోలెనున్నవారై ; విరేజుః= (అధ్యాహృతము)=ప్రకాశించిరి.

మంచికుండలంబులధరించియుండుమఱికొందఱుస్త్రీలు, పుష్పముపుష్పముగా తెగినలాఁగియుండు పుష్పమాలికలుగలవారలయిపరుండియుండుటంజేసి, యడవియందు, గజశ్రేష్ఠముచేనలఁగఁద్రొక్కఁబడినచక్కఁగాఁబుష్పించినతీఁగెలుంబోలెఁ, జూపట్టుచుండిరి.

అని, తాత్పర్యము.

చంద్రాంశుకిరణాభాశ్చ హారాః కాసాంచిదుత్కటాః
హంసా ఇవ బభుస్సుప్తా స్తనమధ్యేషు యోషితామ్.౪౯

టీక॥ కాసాంచిత్ = కొందఱిస్త్రీలయొక్క; చంద్రాంశుకిరణాభాశ్చ = చంద్రునికిరణంబులయొక్కకాంతివంటి కాంతిగలవియును; ఉత్కటాః=పెద్దవియునగు; హారాః= ముక్తాహారములు; యోషితాం=స్త్రీలయొక్క; స్తనమధ్యేషు=స్తనములనడుములయందు; సుప్తాః=నిదురించిన ; హంసాఇవ=హంసలుంబోలె; బభుః = ప్రకాశించినవి.

కొందఱుస్త్రీలు స్తనంబులనడుమ ధరించినహారంబులు, చంద్రునికిరణంబులుంబోలెఁదెల్లనివైపెద్దవిగాయుంటంజేసి, యట్లు తెల్లనివై స్త్రీల స్తనములనడుమఁబడియుండినిదురించు హంసలోయనందగి, యొప్పుచుండినవి.

అని, తాత్పర్యము.

అపరాసాంచ వైడూర్యాః కాదంబా ఇవ పక్షిణః
హేమసూత్రాణి చాన్యాసాం చక్రవాకా ఇవాభవన్.౫౦

టీక॥ అపరాసాం=ఇతరస్త్రీలయొక్క ; వైడూర్యాశ్చ= వైడూర్యమణు

 

లతోఁ జేయఁబడినహారములును; కాదంబాః = ధూమ్రవర్ణములయినముక్కుఁగాళ్లుతెక్కలుఁగలహంసలనెడు; పక్షిణ ఇవ = పక్షులుంబోలె; అభవన్ (అధ్యాహృతము) = ఉండినవి. అన్యాసాం = ఇతరస్త్రీలయొక్క; హేమసూత్రాణిచ = బంగారుదారములును; చక్రవాకా ఇవ = జక్కవలుంబోలె; అభవన్ = ఉండినవి.

మఱికొందఱు స్త్రీలు స్తనంబులధరించినవైడూర్యమణిహారంబులు, స్త్రీల స్తనములనడుమనిద్రించుచుండు, ధూమ్రవర్ణంబులగు ముక్కుఁగాళ్లు తెక్కలుఁగలకాదంబంబులనుహంసలనం దగియుండినవి; మఱికొందఱు స్త్రీలుధరించిన హేమసూత్రరూపములయిన హారములు, అట్లు, స్త్రీల స్తనమధ్యంబునంబడుండిన జక్కవలోయనందగియుండినవి. అని, తాత్పర్యము.

హంసకారండవాకీర్ణా శ్చక్రవాకోప శోభితాః
ఆపగా ఇవ తా రేజు ర్జఘనైః పులినైరివ. ౫౧

టీక॥ తాః = ఆస్త్రీలు; జఘనైః = మొలలచేత; పులినైః = ఇసుకదిన్నెలచేత; హంసకారండవాకీర్ణాః = హంసపక్షులచేతనుగన్నెలేడి పక్షులచేతను వ్యాపింపఁబడినవియును; చక్రవాకోపశోభితాః = జక్కవలచేఁబ్రకాశింపఁజేయఁబడినవియునగు; ఆపగా ఇవ = నదులుంబోలె; రేజుః = ప్రకాశించిరి.

ఆస్త్రీలు, విశాలంబులగుజఘనంబులు గలిగి, యట్లుపెద్దయిసుకదిన్నెలుగలిగి, హంసలుఁగారండవంబులుఁ జక్రవాకంబులుమున్నగు పక్షులతోఁ గూడియుండు, నదులుంబోలెఁ, బ్రకాశించుచుండిరి. అని, తాత్పర్యము.

కింకిణీజాలసంకోశా స్తా హైమవిపులాంబుజాః
భావగ్రాహా యశస్తీరా స్సుప్తా నద్య ఇవాబభుః. ౫౨

టీక॥ సుప్తాః = నిదురించియున్న; తాః = ఆస్త్రీలు; కింకిణీజాలసంకోశాః = గజ్జెలసమూహములెమొగ్గలు గాఁగలవారలై; హైమవిపులాంబుజాః = బంగారువికారములయినసొమ్ములెపెద్దవైనతామరపూలు గాఁగల

వారలై; భావగ్రాహాః=శృంగారచేష్టలెమొసళ్లు గాఁగలవారలై; యశస్త్రీరాః=కీర్తి మొగట్టు గాఁగలవారలయి (లక్షణచే) కీర్తికిఁ గారణమయిన దేహకాంతి మొగట్టు గాఁగలవారలయి; నద్య ఇవ=నదులుంబోలె; ఆబభుః= ప్రకాశించిరి.

నిదురించియున్నయాస్త్రీలు, గజ్జెలుమొగ్గలుగాను, బంగారుసొమ్ములుకమలంబులుగాను, శృంగారచేష్టలుమొసళ్లుగాను, దేహకాంతితీరంబుగాను, ఒప్పుచుండగా, నదులుంబోలెఁ, బ్రకాశించిరి. అని, తాత్పర్యము.

మృదుష్వంగేషు కాసాంచి త్కుచాగ్రేషుచ సంస్థితాః
బభూవు ర్భూషణానీవ శుభా భూషణరాజయః. ౨౩
"బభూవుర్భ్రమరాణీవ" అని, గోవిందరాజపాఠము.

టీక॥ కాసాంచిత్=కొందఱిస్త్రీలయొక్క; మృదుషు=మెత్తనివైన; అంగేషు=అవయవములయందును; కుచాగ్రేషుచ=స్తనములయొక్కకొనలయందును; సంస్థితాః = ఉన్నవియును; శుభాః=మంగళకరములునగు; భూషణరాజయః=సొమ్ములచేఁగలిగినగీఱలు; భూషణానీవ=సొమ్ములుంబోలె; భ్రమరాణీవ (ఇదిగోవిందరాజపాఠము. (భ్రమరా ఇవ)=కాముకులుంబోలె; బభూవుః=ఉండినవి.

నిద్రించుటకై సొమ్ములుదీసియున్న కొందఱిస్త్రీల మెత్తని యవయవంబులందును స్తనంబులందును, భూషణము లెడతెగకధరించుటచే, నేర్పడినగీఱలును, వారలకుభూషణంబులుంబోలె, నలంకారమునెఱపుచుండినవి.

(గోవిందరాజపక్షమందు) కొందఱుస్త్రీలు, మెత్తనియవయవంబులందు స్తనాగ్రంబులందునుధరించికొనిన భూషణంబులు, అవి, కాముకులకిష్టంబులయినస్థలంబులందుంచుటంజేసి, "యాస్త్రీలమీఁది మోహంబున, వారింగవుంగిలించుకొనియున్నవో, యని యెన్నందగి, యొప్పుచుండెనవి.

అని, తాత్పర్యము.

అంశుకాంతాశ్చ కాసాంచి న్ముఖమారుతకంపితాః
ఉపర్యుపరి వక్త్రాణాం వ్యాధూయంతే పునఃపునః. ౨౪

టీక॥ కాసాంచిత్ = కొందఱుస్త్రీల యొక్క ; ముఖమారుతకంపితాః = ముఖముయొక్క గాలిచేఁ గదలింపఁబడిన; అంశుకాంతాః = వస్త్రముయొక్క కొనలు; వక్త్రాణాం = ముఖముల యొక్క ; ఉపర్యుపరి = మీఁదుమీఁదుగా; పునఃపునః = మాటిమాటికిని; వ్యాధూయంతే = కొట్టుచున్నవి; కొట్టుచుండినవనుట.

కొందఱుస్త్రీలముఖంబు సమీపంబుననుండు సూక్ష్మములగువస్త్రములకొనలు, వారువిడుచునిట్టూర్పులకుం గదలుచు, మాటిమాటికి, ముఖంబుపైఁ గొట్టుచుండినవి. అని, తాత్పర్యము.

తాః పతాకా ఇవోద్ధూతాః పత్నీనాం రుచిరప్రభాః
నానావర్ణసువర్ణానాం వక్త్రమూలేషు రేజిరే. ౫౫

టీక। రుచిరప్రభాః = మనోహరమయినకాంతిగల; తాః = (స్త్రీలింగ మార్షము; తే) ఆవస్త్రములకొనలు; నానావర్ణసువర్ణానాం = నానావిధములయినమంచిరంగులుగల ; పత్నీనాం = రావణునిభార్యలయొక్క ; వక్త్రమూలేషు = ముఖంబుల మూలంబులయందు; ఉద్ధూతాః = గాలిచే నెగురఁగొట్టఁబడిన; పతాకా ఇవ = టెక్కెములువలె; రేజిరే = ప్రకాశించినవి.

మనోహరంబులయినవర్ణంబులనొప్పుచుండు, నావస్త్రాంతంబులు , నానావిధంబులగుమేలయిన పసిఁడిచాయలతోఁ గూడిన యారావణభార్యలముఖములసమీపంబున, నిట్టూర్పుగాలికిఁ గదలుచు, గాలికిఁ గదలు టెక్కెములంబోలెఁ, బ్రకాశించినవి.

అని, తాత్పర్యము.

వవల్గుశ్చాత్ర కాసాంచి త్కుండలాని శుభార్చిషామ్
ముఖమారుతసంసర్గా న్మందం మందం సుయోషితామ్. ౫౬

టీక॥ అత్ర = ఇచ్చట ; శుభార్చిషాం = మంగళకరమయిన కాంతిగల; కాసాంచిత్ = కొందఱయిన; సుయోషితాం = మంచిస్త్రీలయొక్క; కుండలాని = పోఁగులు; ముఖమారుతసంసర్గాత్ = ముఖముయొక్కగాలితోటి సంబం

ధముపలన; మందంమందం= మెల్లమెల్లగా; వవల్గుః=చలించినవి.

అచ్చట, కాంతిసంపన్నలగుకొందఱిస్త్రీలచెవిపోఁగులు,నిట్టూర్పుగాలిచే,మెల్లమెల్లఁగాఁ,జలించుచుండెనవి.

అని, తాత్పర్యము.

శర్కరాసవగంధైశ్చ ప్రకృత్యా సురభి స్సుఖః
తాసాం వదననిశ్శ్వాస స్సిషేవే రావణం తదా. ౫౭

టీక॥ శర్కరాసవగంధైః=చక్కెరతోఁజేయఁబడిన మద్యములవాసనల చేతను;ప్రకృత్యాచ=స్వభావముచేతను;సురభిః=మంచివాసనగలదియును; సుఖః=సౌఖ్యముగలిగించునదియునగు; తాసాం = ఆ స్త్రీలయొక్క; వదననిశ్శ్వాసః= ముఖముయొక్కనిట్టూర్పు; తదా=అప్పుడు; రావణం=రావణుని; సిషేవే=సేవించెను.

స్వభావంబుననె సుగంధంబుగలదియునుజక్కెరతోఁజేయఁబడినమద్యములఁద్రావుటచేమఱియుమనోహరంబగు గంధంబుతోనొప్పుచున్నదియునగు నాస్త్రీలనిట్టూర్పుగాలి,యప్పుడు, రావణునిపైఁబ్రసరించుచుండుటంజేసి, యది,యతని, సేవించునట్లు, చూపట్టుచుండెను. అని, తాత్పర్యము.

రావణాననశంకాశ్చ కాశ్చి ద్రావణయోషితః
ముఖాని స్మ సపత్నీనా ముపాజిఘ్రి న్పునః పునః. ౫౮

టీక॥ రావణయోషితః=రావణుని భార్యలు;కాశ్చిత్=కొందఱు; రావణాననశంకాః=రావణునిమొగంబులనుసందేహముగలవారలై; సపత్నీనాం=చవతులయొక్క; ముఖాని=మొగంబులను; ("స్మ" అనునది పాదపూరణార్థము)పునఃపునః=మాటిమాటికి; ఉపాజిఘ్రన్=ఆఘ్రాణించిరి.

అప్పుడు, కొందఱు రావణునిభార్యలు,మద్యమదంబునంజేసి, రావణునిముఖంబులనిభ్రమించి,తమచవతులముఖంబులం,బలుమాఱు,ఆఘ్రాణించిరి.

అని, తాత్పర్యము.

అత్యర్థం సక్తమనసో రావణే తా వరస్త్రియః
అస్వతంత్రా స్సపత్నీనాం ప్రియ మేవా చరం స్తదా. ౫౯

టీక॥రావణే= రావణునియందు; అత్యర్థం=మిక్కిలియు ; సక్తమనసః=తగిలినమనసుగల;తాః=ఆ;చవతులచేనాఘ్రాణింపఁ బడినముఖముగల ; వరస్త్రియః=శ్రేష్ఠస్త్రీలు; తదా = అప్పుడు; అస్వతంత్రాః=స్వాధీనత లేనివారలై; సపత్నీనాం = చవతులకు; ప్రియమేవ=ఇష్టమునే; ఆచరన్=చేసిరి.

అట్లుచవతులచేనాఘ్రాణింపఁ బడిన ముఖంబులుగలయాస్త్రీలును,సాధారణంబుగాఁ జవతులుతమకుశత్రువులగుటవలన,వారలుతమముఖము నాఘ్రాణింపఁగాఁ గోపంబునొందవలసినవారలయ్యును, రావణుని యందు మిగులఁ బ్రీతి మోహంబులు గలవారౌటఁ జేసి, చవతులును రావణునకుఁ బ్రియలు, కావునఁ, జవతులకుఁ బ్రియంబు సేయుట రావణునకుఁ బ్రియంబగునని తలంచి,స్వాతంత్ర్యంబు వహింపక,యం చవతులముఖంబు దామునాఘ్రాణించి, వారలకుఁబ్రియంబునే,యాచరించిరి.

అని,తాత్పర్యము.

లేక;రావణే=రావణునియందు;అత్యర్థం=మిగుల;సక్తమనసః=తగిలిన మనసుగల;తాః=ఆ ; వరస్త్రియః= శ్రేష్ఠస్త్రీలు;తదా=అప్పుడు; అస్వతంత్రాః=మద్యపానమదంబున,స్వాధీనత దప్పినవారలై;సపత్నీనాం= చవతులకు;ప్రియమేవ=ఇష్టమునే; ఆచరన్=చేసిరి.

అట్లు,చవతులచేనాఘ్రాణింపఁ బడినముఖంబులుగలయాస్త్రీలు,రావణునియందుమిక్కిలియుఁ బ్రీతిమోహంబులు గలవారలును, మద్యపానంబున మైమఱచిన, వారునగుటంజేసి, చవతులు తమ ముఖంబుల నాఘ్రాణించినను , దానిం దెలిసికొనలేక, రావణుండె యాఘ్రాణించెనని తలంచి, వారలముఖంబులఁ దాము నాఘ్రాణించి, వారలకుఁబ్రియంబునెయాచరించిరి.

అని, తాత్పర్యము.

బాహూనుపనిధాయాన్యాః పారిహార్యవిభూషితాః
అంశుకాని చ రమ్యాణి ప్రమదాస్తత్ర శిశ్యిరే. ౬౦

టీక॥తత్ర=అచ్చట;అన్యాః=ఇతరులయిన;ప్రమదాః=స్త్రీలు; పారిహార్య

విభూషితాః=కడియములచేనలంకరింపఁబడిన; బాహూః=భుజములను; గమ్యాణి=మనోహరములయిన; అంశుకానిచ=వస్త్రములను; ఉపనిధాయ=తలగడగాఁజేసికొని; శిశ్యిరే=పరుండిరి.

అప్పుడు, మఱికొందఱుస్త్రీలు, కడియంబులచేనలంకరింపఁబడియుండు భుజంబులను, రమణీయంబులగు వస్త్రంబులను దలగడగా నుంచుకొని, పరుండియుండిరి. అని, తాత్పర్యము.

అన్యా వక్షసి చాన్యస్యా స్తస్యాః కాశ్చి త్పునర్భుజమ్
అపరా త్వంక మన్యస్యా స్తస్యా శ్చాన్యా పరా భుజౌ. ౬౧

టీక॥ అన్యాచ = మఱియొకతెయు; అన్యస్యాః=మఱియొకతెయొక్క; వక్షసి=ఱొమ్మునందు; శిశ్యే (అధ్యాహృతము)=పరుండెను. తస్యాః పునః=ఆవిడయొక్కయు; భుజం=బాహువును; ఉపనిధాయ (అధ్యాహృతము)=తలగడగాఁజేసికొని; కాశ్చిత్ = కొందఱుస్త్రీలు; శిశ్యిరే (అధ్యాహృతము) = పరుండిరి. అపరాతు= మఱియొకతెయు; అన్యస్యాః=మఱియొకస్త్రీయొక్క; అంకం=తొడను; ఉపనిధాయ, శిశ్యే(అధ్యాహృతము)=తలగడగాఁజేసికొని, పరుండెను. అపరాశ్చ=మఱికొందఱుస్త్రీలును; తస్యాః=ఆవిడయొక్క; భుజౌ=బాహువులను; ఉపనిధాయ, శిశ్యిరే(అధ్యాహృతము)=తలగడగాఁజేసికొని, పరుండిరి.

మఱియొకతె యింకొకతెఱొమ్మమీఁదఁ దలయుంచుకొని పరుండియుండెను; ఆవిడభుజంబుపైఁదలయుంచుకొని, మఱికొందఱు, పరుండియుండిరి; మఱియొకస్త్రీ, మఱియొకదాని తొడపైఁ, దలపెట్టుకొనినిద్రించుచుండెను; ఆవిడభుజంబులపై మఱికొందఱుస్త్రీలు, తలలుంచుకొని, పరుండియుండిరి. అని, తాత్పర్యము.

ఊరుపార్శ్వకటీపృష్ఠ మన్యోన్యస్య సమాశ్రితాః
పరస్పరనివిష్టాంగ్యో మదస్నేహ వశానుగాః. ౬౨

టీక॥ కాశ్చిత్ (అధ్యాహృతము)= కొందఱుస్త్రీలు, అన్యోన్యస్య=ఒండొరులయొక్క ; ఊరుపార్శ్వ కటీపృష్ఠం=తొడలను ప్రక్కలను మొలను వీపు

స ౯

ను; సమాశ్రితాః=పొందినవారలై; పరస్పరసవిష్టాంగ్యః=ఒండొరులపై నుంచఁబడిన యవయవములు గల వారలై; మదస్నేహవశానుగాః= పానమదంబునంగల్గి నస్నేహంబుయొక్కలోఁ కువననుసరించువారలై; శిశ్యిరే(అధ్యాహృతము)=పరుండిరి.

మఱికొందఱుస్త్రీలు, ఒండొరులతోడలనుబ్రక్కలను, మొలనువీఁపును, దలగడఁగా జేసికొని, యొండొరులపైఁ జేతులుఁగాళ్లుమొదలగునవయవంబుల వేసికొనుచు, మొదటనంత స్నేహంబులేనివారయ్యును, పానమదంబునంజేసి, యతిస్నేహంబుగలవారలై, పరుండియుండిరి.

అని, తాత్పర్యము.

అన్యోన్యభుజసూత్రేణ స్త్రీమాలా గ్రథితాహిసా
మాలేవ గ్రథితా సూత్రే శుశుభే మత్తషట్పదా. ౬౪

టీక. అన్యోన్యభుజసూత్రేణ= ఒండొరులయొక్క భుజంబులను దారముచేత; గ్రథితా=కూర్పఁబడిన; సా=ఆ; స్త్రీమాలా=స్త్రీలమాలిక; సూత్రే= దారమునందు; గ్రథితా=కూర్పఁబడినదియు; మత్తషట్పదా= మదించినతుమ్మెదలుగలదియునగు; మాలేవ=పుష్పమాలికవలె; శుశుభే= ప్రకాశించినదిగదా!

దారంబువోలెఁ బూపట్టుచుండుపరస్పర భుజంబులఁ దుమ్మెదలం బోలు వెండ్రుకలుగల దలలుంచుకొని పరుండియుండు నాస్త్రీలసమూహము, దారంబునఁగూర్పంబడి భృంగంబులనొప్పుచుండుపుష్పమాలికయుంబోలెఁ, బ్రకాశించుచుండినది.

అని, తాత్పర్యము.

లతానాం మాధవే మాసి ఫుల్లానాం వాయుసేవనాత్
అన్యోన్య మాలాగ్రథితం సంసక్తకుసుమోచ్చయమ్. ౬౪
వ్యతివేష్టిత సుస్కంధ మన్యోన్య భ్రమరాకులమ్
ఆసీద్వన మివోద్ధూతం స్త్రీవనం రావణస్య తత్. ౬౫

టీక॥ అన్యోన్యమాలాగ్రథితం=పరస్పరముమాలికారూపముచేతఁగూర్పఁ

బడినదియును; సంసక్త కుసుమోచ్చ యం=తగులుకొనియుండుపుష్పసమూహముగలదియును; వ్యతివేష్టితస్కంధం= చుట్టుకొనఁబడినచెట్టుబోదెలుగలదియును, (అని,లతాపక్షమందు) చుట్టుకొనఁబడిన శరీరములుగలదియును; (అని,స్త్రీపక్షమునందు); అన్యోన్యభ్రమరాకులం= పరస్పరమునుతుమ్మెదలచే వ్యాకులమయినదియును, (అని,లతాపక్షమందు) పరస్పరము ముంగురులచే వ్యాకులమయినదియును(అని,స్త్రీపక్షమందు); వాయుసేవనాత్ =వాయువుయొక్క సేవించుటవలన, (అని,లతాపక్షమందు) నిట్టూర్పుగాలియొక్క సేవించుటవలన(అని,స్త్రీపక్షమందు); ఉద్ధూతం=ఎగురఁగొట్టఁబడినదియునగు;రావణస్య=రావణునియొక్క;తత్ =ఆ; స్త్రీవనం=స్త్రీలసమూహము; మాధవే=వైశాఖమనెడు; మాసి=మాసమునందు; ఫుల్లానాం=వికసించిన; లతానాం= తీఁగెలయొక్క; వనమివ=వనమువలె; ఆసీత్=ఉండెను.

అచ్చట, పరస్పరము మాలికవలెఁ గూడుకొని,పుష్పంబులుధరించి, యొండొరులపైఁజుట్టుకొని, వ్యాకులంబులగు ముంగురులుగలిగి, ముఖమారుతంబువలనఁ గదలుచున్న కొంకకొంగులుగలిగి యుండు, నారావణస్త్రీల సమూహము,అట్లు,వైశాఖమాసంబున, వికసించి,మాలికగానేర్పడి,పుష్పించి, చెట్టుబోదెలమీఁదనల్లుకొని,తుమ్మెదలచేవ్యాకులంబై, వాయువుచేఁగదలింపఁబడుచున్న,లతలవనంబుంబోలె, నొప్పుచుండినది. అని,తాత్పర్యము.

ఉచితేష్వపి సువ్యక్తం న తాసాం యోషితాం తదా
వివేకశ్శక్య ఆధాతుం భూషణాంగాంబరస్రజామ్. ౧౧

టీక॥తదా=అప్పుడు;ఉచితేష్వపి= తగినస్థానములందైనను; తాసాం=ఆ; యోషితాం = స్త్రీలయొక్క;భూషణాంగాంబరస్రజాం= సొమ్ములయొక్కయు, నవయవముల యొక్కయు వస్త్రముల యొక్కయుఁ బుష్పమాలికలయొక్కయు; వివేకః= విచారము; సువ్యక్తం=స్పష్టముగా;ఆధాతుం=చేయుటకు;నశక్యః=కూడినదికాదు.

అప్పుడు, ఆస్త్రీల సొమ్ములు నవయవంబులు వస్త్రములునుబుష్పమాలికలును, ఉచిత స్థానంబుల నుంచఁబడి యుండిన వయ్యును, ఆస్త్రీలు మాలాకారముగాఁ బరుండి యుండు

టంజేసి, "యివివీరివి, యివిమఱి యొకరివి" అని, విమర్శించి తెలిసికొనఁ గూడకుండినవి.

అని, తాత్పర్యము.

రావణే సుఖసంవిష్టే తాః స్త్రియో వివిధప్రభాః
జ్వలంతః కాంచనా దీపాః ప్రేక్షంతానిమిషా ఇవ ౬౭

టీక॥ రావణే=రావణుఁడు; సుఖసంవిష్టే=సుఖముగా నిద్రింపఁగా; జ్వలంతః=మండుచున్నవియును; కాంచనాః=బంగారు స్తంభములయందుంచఁబడినవియునగు; దీపాః = దీపములు; అనిమిషాః=తెప్పపాటులేనివై; వివిధప్రభాః = నానావిధకాంతులుగల; తాః= ఆ; స్త్రియః=స్త్రీలను; ప్రేక్షంతేవ=చూచుచున్నట్లుండెను.

రావణుండు మేల్కొనియుండఁగా నా స్త్రీలంజూడ నశక్యముగావున, నచ్చట బంగారు స్తంభంబులందుంచఁబడినదీపంబులు, రావణుండు సుఖనిద్రఁజెందఁగానే, నిశ్చలంబులయి, నానావిధకాంతులనొప్పుచుఁ డు నా స్త్రీలం, జూచుచున్నట్లుండెను. అని, తాత్పర్యము.

రాజర్షి పితృ దైత్యానాం గంధర్వాణాంచ యోషితః
రాక్షసానాంచ యాః కన్యా స్తస్య కామవశం గతాః. ౬౮

టీక॥ రాజర్షిపితృదైత్యానాం=రాజర్షులయొక్కయు, పితృదేవతలయొక్కయు, దైత్యుల యొక్కయు; గంధర్వాణాం = గంధర్వులయొక్కయు; యోషితశ్చ= స్త్రీలును; రాక్షసానాంచ = రాక్షసులయొక్కయు; కన్యాః= కొమార్తెలు; యాః= ఎవరో; తాశ్చ(అధ్యాహృతము)=వారును; తస్య=ఆ రావణునకు; కామవశం గతాః= మన్మథునిచేలోఁబడుటనుబొందినారు.

రాజర్షుల స్త్రీలును, పితృదేవతల స్త్రీలును, దైత్యవనితలును, గంధర్వస్త్రీలును, రాక్షసులకన్నియలును, అందఱును, ఆ రావణునియందు మన్మథమోహితలైయుండిరి. అని, తాత్పర్యము.

యుద్ధకామేన తాః సర్వా రావణేన హృతాః స్త్రియః

టీక॥ తాః=ఆ; స్త్రియః=స్త్రీలు; సర్వాః=అందఱును; యుద్ధకామేన=యుద్ధమునుగోరునట్టి; రావణేన=రావణునిచేత; హృతాః= అపహరిం

పఁబడినారు.

రావణుండు, ఎప్పుడును యుద్ధంబు గోరువాఁడు, కావున, ఆస్త్రీల నపహరించినచో, వారిబంధువులు యుద్ధంబునకువత్తురని, యుద్ధమునందలియాశంజేసి, యాస్త్రీలనందఱనపహరించినాఁడు.

అని, తాత్పర్యము.

సమదా మదనేనైవ మోహితాః కాశ్చిదాగతాః. ౬౯

టీక॥ సమదాః=మదముతోఁగూడినః; కాశ్చిత్=కొందఱు; మదనేనైవ=మన్మథునిచేతనే; మోహితాః=మోహింపఁజేయఁబడినవారలై; ఆగతాః=వచ్చినారు.

మఱికొందఱుస్త్రీలుయౌవనమదంబుగలవారలు, మన్మథమోహితలై, తమంతఁదామే, రావణు నాశ్రయించినారు.

అని, తాత్పర్యము.

న తత్ర కాచిత్ప్రమదా ప్రసహ్య
వీర్యోపపన్నేన గుణేన లబ్ధా
నచాన్యకామాపి నచాన్యపూర్వా
వినా వరార్హాం జనకాత్మజాం తామ్. ౭౦

టీక॥ తత్ర=అచ్చటఁ; వరార్హాం=శ్రేష్ఠయగు; తాం=ఆ; జనకాత్మజాంవినా=జనకునికూఁతురయినసీతనువిడిచి; కాచిత్=ఒకానొక; ప్రమదా=స్త్రీయును; వీర్యోపపన్నేన=పరాక్రమముతోఁగూడిన రావణునిచేత; ప్రసహ్య=బలాత్కరించి; న(లబ్ధా)=పొందఁబడలేదు. గుణేన=గుణముచేత; లబ్ధా=పొందఁబడినది. అన్యకామాచ=ఇతరునియందాసక్తిగలదియును; న=లేదు. అన్యపూర్వాచ=ఇతరుఁడుముందుభర్తగాఁగలదియును; న=లేదు.

అచ్చట, శ్రేష్ఠస్త్రీయయిన సీతదక్క, మఱియెవ్వతెయుఁ, బరాక్రమశాలియగు రావణునియందుఁగల సౌందర్య గుణంబులకు మోహించి వచ్చినదేగాని, వానిచే బలాత్కారంబునఁ జేఁబడినదికాదు; అచ్చటనుండు వారలందఱును, రావణునిమాత్రము మోహించియుండువారుగాని, మఱియొక్కనియందెచ్చటనుఆసక్తిగలవారుకారు; రావణునాశ్రయించుటకుమున్ను మఱియొ

క్కుడుభర్తఁగలిగియుండినదియు, నచ్చట, నెవ్వతెయు, లేదు. అని, తాత్పర్యము.

నచాకులీనా నచ హీనరూపా
నాదక్షిణా నానుపచారయుక్తా
భార్యాభవ త్తస్య న హీనసత్వా
న చాపి కాంతస్య న కామనీయా. ౨౦

టీక॥ తస్య=ఆరావణునకు; అకులీనా చ= మంచికులమునందుఁ బుట్టనిదియు; భార్యా=పెండ్లాముగా; నాభవత్=కాలేదు. హీనరూపాచ = విడువఁబడినరూపముగలదియును; (భార్యా) న=పెండ్లాముకాలేదు. అదక్షిణా=నేర్పుఁ లేనిదియు; (భార్యా) న=పెండ్లాముకాలేదు. అనుపచారయుక్తా=ఉపచారముతోఁ గూడినదికానిదియు; (భార్యా) న = పెండ్లాముకాలేదు. హీనసత్వా=విడువఁబడిన బలముగలదియు; (భార్యా) న= పెండ్లాముకాలేదు. కాంతస్య=పెనిమిటికి; న కామనీయా చ= కోరఁదగనిదియు; (భార్యా) న= పెండ్లాముకాలేదు.

ఆరావణుని భార్యలందఱును, మంచికులంబునంబుట్టినవారలై, మంచిసౌందర్యంబుగలవారలై, నేర్పుఁగలవారలై, సమస్తోపచారములతోఁ గూడిన వారలై, బలముగలవారలై, పెనిమిటికిఁ గోరఁదగినవారలై, యుండిరి.

అని, తాత్పర్యము.

బభూవ బుద్ధిస్తు హరీశ్వరస్య
యదీదృశీ రాఘవధర్మపత్నీ
ఇమా యథా రాక్షసరాజభార్యా
స్సుజాత మస్యేతి హి సాధుబుద్ధేః. ౨౧

టీక॥ ఇమాః=ఈ; రాక్షసరాజభార్యాః=రాక్షసులకుఁ బ్రభువైన రావణుని భార్యలు, యథా=ఎట్లో; రాఘవధర్మపత్నీ=రాముని ధర్మపత్నియగు సీత; ఈదృశీయది (స్యాత్)=ఇట్టిదగునేని; అస్య=ఈ రావణునకు; సుజాతం= మంచిది. ఇతి=అని; సాధుబుద్ధేః= మంచిబుద్ధిగల; హరీశ్వరస్య= కోఁతులలో

ముఖ్యుఁడైనహనుమంతునకు; బుద్ధిస్తు = తలంపుమాత్రము ; బభూవహి=కలిగెనుగదా!

"ఈరావణుని భార్యలెట్లు పెనిమిటిని గూడియున్నారో అట్లు, సీతయును, రాముతోఁ గూడియుండునట్లు, ఈ రావణుఁడు, సీతను రామునకప్పగించునేని, వీనికి, మంగళంబుగలుగును" అని, మంచిబుద్ధిశాలియగుహనుమంతుండు, తలంచెను. అని, తాత్పర్యము.

లేక; ఈదృశీ=ఇట్టి గుణవంతురాలైన; రాఘవధర్మపత్నీ=సీత ; యథా=ఎట్లో ; తథా (అధ్యాహృతము)=అట్లు; ఇమాః=ఈ; రాక్షసరాజభార్యాః=రావణుని భార్యలు; యది (స్యుః)=అగుదురేని ; హరీశ్వరస్య=కోఁతులకుఁ బ్రభువైనసుగ్రీవునకు; సుజాతం=మంచిది. ఇతి=అని; సాధుబుద్ధేః=మంచిబుద్ధిగల హనుమంతునకు; బుద్ధిస్తు=తలంపు; బభూవహి=కల్గినది గదా!

"ఇట్టిగుణవంతురాలయినసీతను, రావణుండపహరించినట్లు, ఈరావణభార్యలనందఱను సుగ్రీవుండపహరించునేని, యప్పటికి, సుగ్రీవునకు మంగళంబగును" అనిమంచిబుద్ధి గలిగియున్నహనుమంతుండుతలంచెను.

అని తాత్పర్యము.

లేక; ఇమాః, రాక్షసరాజభార్యాః యథా = ఈ రావణునిభార్యలెట్లో; తథా=అట్లు; రాఘవధర్మపత్నీ ఈదృశీ (స్యాత్) యది=రామునిభార్యయగుసీతయునిట్టిదగునేని; అస్య=ఈ రావణునకు; సుజాతంహి=మంచిదాఁకాదనుట. ఇతి = అని; సాధుబుద్ధేః హరీశ్వరస్య= మంచిబుద్ధిగలహనుమంతునకు; బుద్ధిస్తు బభూవ=తలంపుగలిగెను.

"రావణుండు, ఈభార్యలనపహరించినట్లు, రామునిభార్యయయినసీతనుగూడనపహరించెనేని, యితనికెంతమాత్రమునుమంగళంబుగలుగదు" అని, మంచిబుద్ధిశాలియగుహనుమంతుండు, తలంచెను.

అని, తాత్పర్యము.

లేక; ఇమాః రాక్షసరాజభార్యాః యథా=ఈరావణునిభార్యలెట్లో; తథా=అట్లు; రాఘవధర్మపత్నీ ఈదృశీ యది=సీతయిట్టిదగునేని; అస్య=ఈ; మమ(అధ్యాహృతము)=నాకు; సుజాతం=మంచిజన్మము. ఇతి=అని; సాధుబుద్ధేః హరీశ్వరస్య= మంచిబుద్ధిగలహనుమంతునకు; బుద్ధిస్తుబభూవహి = తలంపుగలిగెనుగదా!

"నేని రావణుని భార్యలను జూచినట్లు, రాముని భార్యయగు సీతనుం జూతునేని, యిప్పటికి, నా జన్మము సఫలంబగును" అని మంచిబుద్ధిశాలియగు హనుమంతుండు తలంచెను.

అని, తాత్పర్యము.

లేక; అస్య=ఈ; యంగదుండు మొదలగు వానరసమూహమునకు; (శేషము. పై.)

"నేని రావణుని భార్యలం జూచినట్లు రాముని భార్యయగు సీతనుం జూచెద నేని, యిప్పుడు, "సీత యగపడదను" భయంబునం బ్రాయోపవేశనంబుచేసి ప్రాణంబులు విడువనున్న యంగదాదివానరులు, ప్రాణంబుతో సుఖంబుగా నుందురు" అని, మంచిబుద్ధి శాలియగు హనుమంతుండు తలంచెను.

అని, తాత్పర్యము.

లేక; ఇమాః రాక్షసరాజభార్యాః యథా=ఈ రావణునిభార్యలెట్లో; తథా=అట్లు; రాఘవధర్మపత్నీ = సీతయగు నేని; అస్య= ఈ రామునకు; సుజాతం=మంచిది. ఇతి; సాధుబుద్ధేః హరీశ్వరస్య=మంచిబుద్ధిగల హనుమంతునకు; బుద్ధిస్తుబభూవహి = తలంపుగలిగినదిగదా!

"ఈ రావణుని భార్యలు జీవించియుండునట్లు, సీతయు జీవించియుండునేని, యిప్పుడు, "సీత జీవించియుండునో లేమో" యని సంశయించి, "సీత జీవింపకున్న నేను జీవింపలేను" అని నాతోఁ జెప్పిన, రామునకు దుఃఖంబునఁ బ్రాణహానిగలుగక, సంతోషంబుగలుగును" అని, మంచిబుద్ధిశాలియగు హనుమంతుండు తలఁచెను. అని, తాత్పర్యము.

లేక; రాక్షసరాజ= రావణుఁడా! ఇమాః=ఈ స్త్రీలు; యథా భార్యాః= ఎట్లు భార్యలో; తథా=అట్లు; రాఘవధర్మపత్నీ ఈదృశీయది= రాముని భార్యయగు సీత యిట్టిదగు నేని; అస్య (తవ)= ఈనీకు; సుజాతంహి= మంచిదా? కాదనుట. ఇతి=అని; సాధుబుద్ధేః హరీశ్వరస్య బుద్ధిస్తుబభూవ=మంచి బుద్ధిగల హనుమంతునకు తలంపుగలిగినది.

"రావణుఁడా! నీవీ స్త్రీలను భార్యలనుగాఁ జేసికొనునట్లు, మహాపరాక్రమశాలియగు రాముని భార్యయగు సీతనుగూడ భార్యగాఁ జేసికొందువేని, నీకు మంగళంబుగలుగదు; పుత్రపౌత్రాది సహితముగా, రాముండు, నిన్నుఁ జంపును." అని, మంచిబుద్ధిశాలియగు హనుమంతుఁడు, రావణునుద్దేశించి, తలం




చెను. అని, తాత్పర్యము.

లేక;ఇమాఃరాక్షసరాజ భార్యాః యథా=ఈరావణుని భార్యలెట్టివార లో; రాఘవధర్మపత్నీ ఈదృశీయది= ఇట్టిదా యేమిః కాదనుట;ఇతి=అని;సా ధుబుద్ధేఃహరీశ్వరస్యబుద్ధిస్తు ; బభూవ హి=మంచిబుద్ధిగలహనుమంతునకు త లంపుగల్గినదిగదా!

"సీత యీరావణుభార్య లంతటి స్వల్పసౌందర్యముగలదిగాదు; త్రిలోక సుందరియైనది; కావుననే,యిచ్చటసీత యగపడలేదు" అని, మంచిబుద్ధిశాలి యగుహనుమంతుండు తలంచెను.

అని తాత్పర్యము.

పునశ్చ సో చింతయ దార్తరూపో
ధ్రువం విశిష్టా గుణతో హి సీతా
అథా య మస్యాం కృతవాన్ మహాత్మా
లంకేశ్వరః కష్ట మనార్యకర్మ. 23

టీక॥సీతా=సీత;గుణతః=పాతివ్ర త్యాదిగుణంబులవలన; ధ్రువం=నిశ్చ యముగా; విశిష్టాహి=అధికమయినది గదా! అథ=అట్లును;మహాత్మా=అ ధికపరాక్రమశాలియును;లంకేశ్వరః= లంకాధిపతియునగు;అయం=ఈరావ ణుండు;అస్యాం=ఈసీతవిషయమయి; అనార్యకర్మ=దుష్టకృత్యమును; కృ తవాన్=చేసినాఁడు. కష్టం=అయ్యో! ఇతి(అధ్యాహృతము)=అని;సః=ఆహ నుమంతుఁడు;ఆర్తరూపః =దుఃఖము నొందిన రూపముగలవాఁడై;పునశ్చ= మఱలను;అచింతయత్ =ఆలోచించెను

"ఈస్త్రీలకన్నను సీత పాతివ్రత్యా దిగుణంబులనెంతోయధికురాలు;అట్టిసీ తనుగూడ, ఈరావణుండపహరించినాఁ డు; ఇట్టిదుష్టకృత్యముచేసినాఁడే! అ య్యో!" అనిమఱల,హనుమంతుండు, దుఃఖంబునం,జింతించెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే,నవమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.




ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండనవమసర్గటీక,
ముగిసినవి.

శ్రీ

దశమసర్గప్రారంభః.

తత్ర దివ్యోపమం ముఖ్యం స్ఫాటికం రత్నభూషితమ్
అవేక్షమాణో హనుమాన్ దదర్శ శయనాసనమ్. ౧
దాన్తకాఞ్చనచిత్రాఙ్గై ర్వైడూర్యైశ్చ వరాసనైః
మహార్హాస్తరణోపేతై రుపపన్నం మహాధనైః. ౨

టీక॥ తత్ర=అచ్చట; హనుమాన్=హనుమంతుఁడు; అవేక్షమాణః = చూచుచు; దివ్యోపమం=స్వర్గమునందుఁ బుట్టినదానితోఁ బోలిక-గలదియును; ముఖ్యం=శ్రేష్ఠమును; స్ఫాటికం=స్ఫటికమణులతోఁ జేయఁబడినదియును; రత్నభూషితం=మణులచేనలంకరింపఁబడినదియును; దాన్తకాఞ్చనచిత్రాఙ్గైః=దంతవికారములును బంగారువికారములునగుటచే నానావర్ణములుగల యవయవములుగలవియును; వైడూర్యైః=వైడూర్యమణులతోఁ జేయఁబడినవియును; మహార్హాస్తరణోపేతైః=శ్రేష్ఠములైన కంబళములతోఁ గూడినవియును; మహాధనైః=అధికమైన వెలగలవియునగు; వరాసనైః=మేలయినపీఠములతో; ఉపపన్నం=కూడినదియునగు; శయనాసనం= పాన్పుండెడుగృహమును; దదర్శ=చూచెను.

హనుమంతుండచ్చటఁ గలయంబూచుచు, స్వర్గంబుననుండు దేవేంద్రునిశయనగృహముతో సమానంబై, శ్రేష్ఠంబై, స్ఫటికమణులతోఁ జేయఁబడి, యితరమణులచేనలంకరింపఁబడి, కొంతవఱకు దంతముతోను గొంతవఱకుబంగారముతోను మిగత వైడూర్యమణులతోను జేయఁబడియుంటంజేసి నానావర్ణంబులుగలవై శ్రేష్ఠములగు కంబళములతోఁ గప్పఁబడి యధికంబుగా విలువ గలిగియుండుపీఠంబులతోఁ గూడియున్న, శ

యనగ్రహంబును, జూచెను. అని, తాత్పర్యము.

తస్య చైకతమే దేశే సోఽగ్ర్యమాలావిభూషితమ్
దదర్శ పాండురం ఛత్రం తారాధిపతిసన్నిభమ్. ౩

టీ॥ సః = ఆహనుమంతుఁడు; తస్య = ఆశయనముయొక్క; ఏకతమే = ఒక్కటైన; ప్రదేశే = స్థలమునందు; అగ్ర్యమాలావిభూషితం = శ్రేష్ఠమయినమాలికచేనలంకరింపఁబడినదియు; తారాధిపతిసన్నిభం = చంద్రునితోసరియయినదియును; పాండురం = తెల్లనైనదియునగు; ఛత్రం = గొడుగును; దదర్శ = చూచెను.

ఆహనుమంతుండు, ఆశయనంబునవశిరోభాగంబునందు, మేలయినముత్తెములమాలచేనలంకరింపఁబడినదియుఁ, జంద్రుండుంబోలెఁదెల్లగా నున్నదియునగు శ్వేతచ్ఛత్రంబుఁజూచెను.
అని, తాత్పర్యము.

జాతరూపపరిక్షిప్తం చిత్రభానుసమప్రభమ్
అశోకమాలావితతం దదర్శ పరమాసనమ్. ౪
వాలవ్యజనహస్తాభి ర్వీజ్యమానం సమంతతః
గంధైశ్చ వివిధై ర్జుష్టం వరధూపేన ధూపితమ్. ౫
పరమాస్తరణాస్తీర్ణ మావికాజినసంవృతమ్
దామభి ర్వరమాల్యానాం సమంతా దుపశోభితమ్. ౬

టీక ॥ జాతరూపపరిక్షిప్తం = బంగారముతోఁజేయఁబడినదియును; చిత్రభానుసమప్రభం = సూర్యునితోసరియయినకాంతిగలదియును; అశోకమాలావితతం = అశోకపుష్పమాలికలచే వ్యాపింపఁబడినదియును; వాలవ్యజనహస్తాభిః = చామరంబులుచేతులందుఁగల స్త్రీలచేత; సమంతతః = అంతటను; వీజ్యమానం = వీవఁబడుచున్నదియును; వివిధైః = నానావిధములయిన; గంధైః = వాసనలతో; జుష్టంచ = కూడినదియును; వరధూపేన = శ్రేష్ఠమయినధూపముచే; ధూపితం = పొగగలదిగాఁజేయఁబడినదియు; పరమాస్తరణాస్తీర్ణం = శ్రే

స౧౦

ష్టంబులయినయాస్తరణంబులచేఁగప్పఁబడినదియు;ఆవికాజినసంవృతం= మేకపోతులచేఁగప్పఁబడినదియును; సమంతాత్ = అంతటను; పరమమాల్యానాం = శ్రేష్ఠములయినపూలయొక్క; దామభిః=మాలికలచేత;ఉపశోభితం=ప్రకాశింపఁజేయఁబడినదియునగు; పరమాసనం = శ్రేష్ఠమయినయాసనంబును; సః(అధ్యాహృతము)=ఆహనుమంతుండు;దదర్శ=చూచెను.

బంగారముతోఁ జేయఁబడి, సూర్యుండుంబోలెఁ దేజరిల్లుచు, నశోకపుష్పమాలికలచేనలంకరింపఁబడి, చామరంబులు చేతులం బట్టుకొనియుండు స్త్రీలచే సేవింపఁబడుచు, నానావిధసుగంధంబులు గలిగి, సుగంధిధూపంబుల గుబాళించుచు, మేలయినయాస్తరణంబులు గలిగి, మేకపోతులతోలతోఁ గప్పఁబడి, మఱియు, మంచిపుష్పమాలికలచే నలంకరింపఁబడియుండు, శ్రేష్ఠమయిన, శయనంబుఁ, జూచెను. అని, తాత్పర్యము.

తస్మిన్ జీమూతసంకాశం ప్రదీప్తోత్తమకుండలమ్
లోహితాక్షం మహాబాహుం మహారజతవాససమ్. ౭
లోహితేనానులిప్తాంగం చందనేన సుగంధినా
సంధ్యారక్తమివాకాశే తోయదం సతటిద్గణమ్. ౮
వృతమాభరణైర్దివ్యైస్సురూపం కామరూపిణమ్
సవృక్షవనగుల్మాఢ్యం ప్రసుప్తమివ మందరమ్. ౯
క్రీడిత్వోపరతం రాత్రౌ వరాభరణభూషితమ్
ప్రియం రాక్షసకన్యానాం రాక్షసానాం సుఖావహమ్. ౧౦
పీత్వాప్యుపరతం చాపి దదర్శ స మహాకపిః

టీక॥మహాకపిః=పెద్దకోఁతి యయినట్టి; సః=ఆహనుమంతుండు;తస్మిన్=ఆశయనమునందు; జీమూతసంకాశం=మేఘముతోసమానుఁడైనవాఁడును;ప్రదీప్తోత్తమకుండలం=ప్రకాశించుచున్న శ్రేష్ఠములయినపోగులుగల వాఁడును; లోహితాక్షం=ఎఱ్ఱనికన్నులుగలవాఁడును;మహాబాహుం = పెద్దచేతులుగలవాఁడును;మహారాజతవాససం = బంగారముతోనలంకరింపఁబడిన వస్త్రి

ముగలవాఁడును; లోహితేన = ఎఱ్ఱనిదియు; సుగంధినా = మంచివాసనగలదియునగు; చందనేన = చందనము చేత; అనులిప్తాంగం = పూయఁబడిన దేహముగలవాఁడును; ఆకాశే = ఆకాశమునందు; సంధ్యారక్తం = సంధ్యాకాలముచే నెఱ్ఱనైనదియును; సతటిద్గణం = మెఱుపులతోఁగూడినదియునగు; తోయదమివ (స్థితం) = మేఘంబుఁబోలె నున్నవాఁడును; దివ్యైః = శ్రేష్ఠములయిన; ఆభరణైః = సొమ్ముల చేత; వృతం = చుట్టఁబడినవాఁడును; సురూపం = మంచిరూపముగలవాఁడును; కామరూపిణం = ఇచ్ఛార్థీనంబగురూపంబుగలవాఁడును; సవృక్షవనగుల్మాఢ్యం = వృక్షములతోఁ గూడిన యడవితోను బొదలతోను గూడినదియు; ప్రసుప్తం = నిదురించినదియునగు; మందరమివ (స్థితం) = మందర పర్వతముఁబోలెనున్నవాఁడును; రాత్రౌ = రాత్రియందు; క్రీడిత్వా = రమించి; ఉపరతం = ఉడిగిన వాఁడును; వరాభరణభూషితం = శ్రేష్ఠములయిన సొమ్ముల చేనలంకరింపఁబడినవాఁడును; రాక్షసానాం = రాక్షసులకు; సుఖావహం = సుఖముసేయువాఁడును; పీత్వాపి = త్రాఁగియును; ఉపరతంచాపి = ఉడిగినవాఁడును; రాక్షసకన్యానాం = రాక్షసస్త్రీలకు; ప్రియం = భర్తయునగు రావణుని; దదర్శ = చూచెను.

ఆశయనంబునందు, మేఘంబునకుఁబోలెనలుపురంగుగలిగి, ప్రకాశమానంబులగుకుండలంబులుధరించి, యెఱ్ఱనినేత్రంబులుగలిగి, మోకాలివఱకుఁ బ్రేలుకాడుచుండుచేతులతోనొప్పుచు, బంగారముతోనలంకరింపఁబడినవస్త్రంబుగట్టుకొని, సుగంధియగునెఱ్ఱని చందనంబుమేనలందుకొని, యట్లు సంధ్యాకాలంబున నెఱ్ఱఁగా మెఱుపులంగూడి యాకాశంబుననుండు మేఘంబుం బోలెఁ జూపట్టుచు, శ్రేష్ఠంబులగునాభరణంబుల నలంకరింపఁబడిసుందరంబగు రూపంబుగలవాఁడై, కామరూపుండై, వృక్షంబులతోఁగూడినవనంబులనుబొదలనుంగల్గి సముద్రమథనాంతంబున నిదురించుచున్నట్లునిశ్చలంబైయున్నమందరపర్వతంబుపోలికఁగనుపట్టుచు, రాత్రియందు యథేచ్ఛంబుగ నానావిధక్రీడలు సల్పి నానావిధ మద్యంబులుఁద్రావి యుపరతుండైయుండువాని, రాక్షసులకు సుఖంబుసేయువానిరాక్షసకన్యలకుమనోహరుండగువాని, రావణుని, హనుమంతుండు, చూచెను. అని, తాత్పర్యము.

భాస్వరే శయనే వీరం ప్రసుప్తం రాక్షసాధిపమ్. ౧౧
నిశ్శ్వసంతం యథా నాగం రావణం వానరర్షభః
ఆసాద్య పరమోద్విగ్నస్సో పాసర్పత్సుభీతవత్. ౧౨

టీక॥ సః=ఆ; వానరర్షభః= వానరశ్రేష్ఠుండగుహనుమంతుండు; భాస్వరే=ప్రకాశించుచున్న; శయనే= పాన్పునందు; ప్రసుప్తం=నిదురించినవాఁడును; వీరం=పరాక్రమశాలియును; నిశ్శ్వసంతం = నిట్టూర్పువిడుచుచున్నవాఁడును; నాగంయథా (స్థితం)= సర్పముంబోలె నున్నవాఁడును; రాక్షసాధిపం= రాక్షసులకుఁబ్రభువునగు; రావణం=రావణునిఁ; ఆసాద్య=డగ్గఱి; పరమోద్విగ్నః= మిక్కిలియుఁగలఁతనొందినవాఁడై; సుభీతవత్= మిక్కిలి యుభయముపడినవాఁడువలె; అపాసర్పత్=తొలఁగిపోయెను.

వానరశ్రేష్ఠుండగు నాహనుమంతుండు, ప్రకాశమానంబగు పాన్పునం బరుండినిదురించుచు సర్పంబుం బోలె నిట్టూర్పులువుచ్చుచున్న పరాక్రమశాలియు రాక్షసేశ్వరుండునగు రావణు నిదగ్గఱకుఁబోయి, "ఓహో! యేమినా యజ్ఞానంబు! ఇంతదగ్గఱకు రావచ్చునా! తెలిసికొన్ననేమి సేయవచ్చును!" అని, చింతించి, యతిశీఘ్రంబుగా మిక్కిలిభయపడినవాఁడుం బోలె, కొంత యవ్వలికిఁదొలంగెను.

అని, తాత్పర్యము.

అథా రోహణ మాసాద్య వేదికాంతర మాశ్రితః
సుప్తం రాక్షసశార్దూలం ప్రేక్షతే స్మ మహాకపిః. ౧౩

టీక॥ అథ=అటుపిమ్మట; మహాకపిః=పెద్దకోఁతియగు హనుమంతుండు; ఆరోహణం=పడికట్లమార్గమును; ఆసాద్య=పొంది; వేదికాంతరం=ఇతరమయినపడికట్టును; ఆశ్రితః=పొందినవాఁడై; సుప్తం=నిదురించిన; రాక్షసశార్దూలం=రాక్షసశ్రేష్ఠుండగురావణుని; ప్రేక్షతేస్మ=చూచెను.

అంత, హనుమంతుండు, పడికట్లమార్గముఁజేరి, వేఱొక్కపడికట్టుమీఁదనుండి, నిదురించుచున్న రావణు నింజూచుచుండెను. అని, తాత్పర్యము.

శుశుభే రాక్షసేంద్రస్య స్వపతశ్శయనోత్తమమ్
గంధహస్తిని సంవిష్టే యథా ప్రస్రవణం మహత్. ౧౪

టీక॥ స్వపతః = నిద్రించుచున్న; రాక్షసేంద్రస్య = రాక్షసులకుఁ బ్రభుండైన రావణునియొక్క; శయనోత్తమః = శయనశ్రేష్ఠము; గంధహస్తిని = దేనిగంధమును మూర్కొని యితర గజంబులు భయపడునో, అట్టి యేనుఁగు; సంవిష్టే = ఉండఁగా; మహత్ = పెద్దదైన; ప్రస్రవణం యథా = సెలయేటయుంబోలె; శుశుభే = ప్రకాశించెను.

దేనిగంధంబు మూర్కొని యితర గజంబులుభయంపడునో యట్టియేనుంగుచేనధిష్ఠింపఁబడిన సెలయేటి, యెట్లు; ఇతరగజంబులు రాకుండుటచే వివిక్తముగానుండునో, అట్లు రావణుండు నిదురింపుచుండఁగా, నాశయనంబు, భయంబున, మఱియెవ్వరునచ్చటికి రాకుండుటవలన, వివిక్తంబుగానుండినది.

అని, తాత్పర్యము.

కాంచనాంగదనద్ధౌ చ దదర్శ స మహాత్మనః
విక్షిప్తౌ రాక్షసేంద్రస్య భుజా వింద్రధ్వజోపమౌ. ౧౫
ఐరావతవిషాణాగ్రై రాపీడనకృతవ్రణౌ
వజ్రోల్లిఖితపీనాంసౌ విష్ణుచక్రపరిక్షతౌ. ౧౬
పీనౌ సమసుజాతాంసౌ సంగతౌ బలసంయుతౌ
సులక్షణనఖాంగుష్ఠౌ స్వంగులీతలలక్షితౌ. ౧౭
సంహతౌ పరిఘాకారౌ వృత్తౌ కరికరోపమౌ
విక్షిప్తౌ శయనే శుభ్రే పంచశీర్షావివోరగౌ. ౧౮

టీక॥ సః = ఆహనుమంతుఁడు; మహాత్మనః = అధికమయిన పరాక్రమంబుగల; రాక్షసేంద్రస్య = రాక్షసులకుఁ బ్రభువైనరావణునియొక్క; కాంచనాంగదనద్ధౌ చ = బంగారుబాహుపురుల చేఁజుట్టఁబడినవియును; విక్షిప్తౌ = చాఁచఁబడినవియును; ఇంద్రధ్వజోపమౌ = దేవేంద్రుని టెక్కెంబులతోఁ బోలికగలవియును; ఐరావతవిషాణాగ్రైః = ఐరావతముయొక్క కొమ్ముల కొనల




చేత, ఆపీడనకృతవ్రణౌ = పీడించుటలచేతఁ జేయఁబడినగాయములు గలవియును; వజ్రోల్లిఖిత పీనాంసౌ = వజ్రాయుధముచే గీఱఁ బడిన బలిసియుండు భుజశిఖరములు గలవియును విష్ణుచక్రపరిక్షతౌ= విష్ణువుయొక్క చక్రముచే గాయము దగిలియున్నవియును;పీనౌ=బలిసినవియును; సమసుజాంసౌ=ఎచ్చుతక్కువలులేనివియు సుందరంబులయినవియునగు భుజశిఖరములు గలవియును; సంగతౌ=దేహమునకుసరియయినవియును;బలసంయుతౌ=బలముతోఁగూడినవియును;సులక్షణనఖాంగుష్ఠౌ= మంచిలక్షణములుగలగోళ్లును పెద్దవ్రేలునుగలవియును;స్వంగుళీతలలక్షితౌ= మంచిలక్షణములుగలవ్రేళ్లతోనుఅఱచేతితోనుగూడినవియును;సంహతౌ=దృఢములయిన సంధిబంధంబులుగలవియును;పరిఘాకారౌ= ఇనుపగుదియలయొక్క యాకారమువంటియాకారముగలవియును; వృత్తౌ=గుండ్రములయినవియును;కరికరోపమౌ=ఏనుంగుతుండములతోఁబోలిక గలవియును; శుభ్రే = నిర్మలమయిన; శయనే = పాన్పునందు; విక్షిప్తౌ = చాఁచఁబడినవియును; పంచశీర్షౌ = అయిదుతలలుగల;ఉరగావివ(స్థితౌ)=సర్పంబులుంబోలెనున్నవియునగు; భుజౌ= బాహువులను;దదర్శ=చూచెను.

ఆహనుమంతుండు, బంగారుబాహుపురులుధరించుకొనినవై, యింద్రధ్వజంబులుంబోలెఁబొడనగుచు, మనైరావతంబుతోఁ బోరాడునప్పుడు దానికొమ్ములచేఁజేయఁబడిన గాయంబులతోనొప్పుచు,నిందునివజ్రాయుధంబుచేగీఱఁబడినమూఁపులుగలిగి, విష్ణుచక్రంబుననైన గాయంబులందేజరిల్లుచు, బలిసినవై సమంబులు సుందరంబులగు మూఁపులుగలిగి, దేహంబునకను రూపంబులై,బలిష్ఠంబులై, మంచిలక్షణంబులుగలనఖంబులునంగుష్ఠంబును వ్రేళ్లునఱచేయియునుగలవై , దృఢంబులగు సంధి బంధంబులతోఁగూడి, పరిఘంబులుంబోలెఁబొపట్టుచు,గుండ్రంబులై,ఏనుంగుతుండంబులతో సాటిసేయందగి, శుభ్రంబగుశయనంబునంబ్రసారితంబులై, యయిదుతలలపాములుంబోలెనున్న,మహాపరాక్రమశాలి రావణుని,బాహువులం,జూచెను.

అని, తాత్పర్యము.

శశక్షతజకల్పేన సుశీతేన సుగంధినా
చందనేన పరార్ధ్యేన స్వనులిప్తౌ స్వలంకృతౌ. ౧౯




ఉత్తమ స్త్రీవిమృదితౌ గంధోత్తమ నిషేవితౌ
యక్షపన్నగగంధర్వదేవదానవరావిణౌ. ౨౦
దదర్శ స కపిస్తస్య బాహూ శయనసంస్థితౌ
మందరస్యాంతరే సుప్తౌ మహాహీ రుషితావివ. ౨౧

టీక॥ సః=ఆ; కపిః=హనుమంతుఁడు; తస్య=ఆ రావణునియొక్క; శశక్షతజకల్పేన= కుంకుమపువ్వు నెత్తురుతో సమానమయినదియును; సుశీతేన=మిక్కిలియుఁజల్లనగానున్నదియును; సుగంధినా= మంచివాసనగలదియును; పరార్ధ్యేన=శ్రేష్ఠమయినదియునగు; చందనేన=చందనముచేత; స్వనులిప్తౌ= చక్కఁగాఁబూయఁబడినవియును; స్వలంకృతౌ = చక్కఁగానలంకరింపఁబడినవియును; ఉత్తమస్త్రీవిమృదితౌ=ఉత్తమలగు స్త్రీలచేతఁబిసుకఁబడినవియును; గంధోత్తమనిషేవితౌ=వాసనలలో శ్రేష్ఠములయినవానిచేత సేవింపఁబడినవియును; యక్షపన్నగగంధర్వదేవదానవరావిణౌ= యక్షులనుసర్పములను గంధర్వులను దేవతలనుదానవులను అఱచునట్లు సేయునవియును; శయనసంస్థితౌ=పాన్పునందున్నవియును; మందరస్య=మందరపర్వతముయొక్క; అంతరే=నడుమునందు; సుప్తౌ=నిదురించిన; రుషితౌ=కోపించిన; మహాహీఇవ(స్థితౌ)=గొప్పసర్పంబులుంబోలె నున్నవియునగు ; బాహూ=భుజములను; దదర్శ = చూచెను.

ఆ హనుమంతుండు, కుంకుమపువ్వు నెత్తురుంబోలె నెఱ్ఱనైచల్లగామంచివాసనగలిగి శ్రేష్ఠంబై యుండు చందనంబుచేఁ బూయఁబడి, చక్కఁగానలంకరింపఁబడి, యుత్తమస్త్రీలచేఁబిసుకంబడుచు, నుత్తమంబులగువాసనలంగలిగి, యక్షులనుసర్పంబులను గంధర్వులను దేవతలను దానవులను యుద్ధంబున రోదనంబు సేయునట్లుగావింపంజాలినవై, మందరపర్వతాంతరంబున నిదురించుచుండుకోపంబునొందినగొప్పసర్పంబులుంబోలెం జూపట్టుచున్న, యారావణునిభుజంబులం, జూచెను. అని, తాత్పర్యము.

తాభ్యాం స పరిపూర్ణాభ్యాం భుజాభ్యాం రాక్షసేశ్వరః
శుశుభే ఽచలసంకాశ శ్శృంగాభ్యామివ మందరః. ౨౨

టీక॥అచలసంకాశః=కొండతో సమానుఁడైన; సః=ఆ; రాక్షసేశ్వరః=రాక్షసులకుఁబ్రభుండగు రావణుండు; పరిపూర్ణాభ్యాం = నిండిన ; తాభ్యాం=ఆ; భుజాభ్యాం= బాహువులచేత; శృంగాభ్యాం= శిఖరములచేత; మందరఇవ=మందరపర్వతమువలె; శుశుభే=ప్రకాశించెను.

కొండంబోనిమేనుగల యారావణుండు, బలిసినిడుపుగానుండు నాభుజంబులంగూడి, రెండుశిఖరంబులంగూడిన మందరపర్వతంబుంబోలెఁ, బ్రకాశించుచుండెను. అని, తాత్పర్యము.

చూతపున్నాగసురభి ర్వకుళోత్తమసంయుతః
మృష్టాన్నరససంయుక్తః పానగంధపురస్సరః. ౨౩
తస్య రాక్షససింహస్య నిశ్చక్రామ మహా ముఖాత్
శయానస్య వినిశ్శ్వాసః పూరయన్నివ తద్గృహమ్. ౨౪

టీక॥శయానస్య=పరుండియున్న; తస్య=ఆ; రాక్షససింహస్య= రాక్షసశ్రేష్ఠుండగు రావణునియొక్క; మహాముఖాత్ =పెద్దనోటనుండి; చూతపున్నాగసురభిః=మామిడిపొన్నలపూలంబోలెమంచివాసనగలదియును; వకుళోత్తమసంయుతః=పొగడపుష్పము యొక్కయు త్తమమయినవాసనతోఁ గూడినదియును; మృష్టాన్నరససంయుక్తః=మంచియన్నముయొక్కవాసనతోఁ గూడినదియును; పానగంధపురస్సరః=మద్యముయొక్క వాసనముందు నడుచునదిగాఁగలదియునగు; వినిశ్శ్వాసః= నిట్టూర్పు;తత్ =ఆ; గృహం=ఇంటిని; పూరయన్నివ=నిండించునదివోలె;నిశ్చక్రామ=వెడలుచుండెను.

అచ్చటఁబరుండినిద్రించుచున్న రావణునిపెద్దనోటనుండి,మామిడి పొన్నపూలవాసనయుఁ, బొగడపూగంధంబును,మృష్టాన్నగంధంబును, మద్యగంధంబును,గలిగి,యాగృహంబును, బూరించునట్లుచూపట్టుచు, నిట్టూర్పులు , వెడలుచుండినవి.

అని,తాత్పర్యము.

విశేషార్థము.—ముందుచెప్పఁబడిన "రెండుభుజంబులును,ఇప్పుడునోటనుండి" యనియేకవచనంబును, రావణుండుకామరూపియగుటచే, స్త్రీసమ్మోహనంబునకై ధరించినరూపంబునంగలిగినది.

ముక్తామణి విచిత్రేణ కాంచనేన విరాజితమ్
మకుటే నాపవృత్తేన కుండలోజ్జ్వలితాననమ్. ౨౫
రక్తచందనదిగ్ధేన తథా హారేణ శోభినా
పీనాయత విశాలేన వక్షసా భివిరాజితమ్. ౨౬
పాండరే ణాపవిద్ధేన క్షౌమేణ క్షతజేక్షణమ్
మహార్హేణ సుసంవీతం పీతేనోత్తమవాససా. ౨౭
మాషరాశి ప్రతీకాశం నిశ్శ్వసంతం భుజంగవత్
గాంగే మహతి తోయాంతే ప్రసుప్తమివ కుంజరమ్. ౨౮
చతుర్భిః కాంచనైర్దీపైర్దీప్యమానచతుర్దిశమ్
ప్రకాశీకృత సర్వాంగం మేఘం విద్యుద్గణైరివ. ౨౯
పాదమూలగతాశ్చాపి దదర్శ సుమహాత్మనః
పత్నీస్స ప్రియభార్యస్య తస్య రక్షః పతేర్గృహే. ౩౦

టీక॥ సః=ఆహనుమంతుఁడు ; గృహే=శయనగృహమునందు; ముక్తామణివిచిత్రేణ=ముత్తెములచేతను మణులచేతను నానావర్ణములుగలదియు; కాంచనేన=బంగారువికారమయినదియు; అపవృత్తేన= స్వస్థానంబునందుండి కదలినదియునగు; మకుటేన=కిరీటముచేత; విరాజితం=ప్రకాశింపఁజేయఁబడినవాఁడును; కుండలోజ్జ్వలితాననం = పోఁగులచేఁబ్రకాశింపఁజేయఁబడినముఖముగలవాఁడును; తథా=అట్లు; హారేణ=హారముచేత; శోభినా=ప్రకాశించుచున్నదియు; రక్తచందనదిగ్ధేన= ఎఱ్ఱనిచందనముచేఁబూయఁబడినదియు; పీనాయతవిశాలేన= బలిసినదియు నిడుపైనదియు వెడలుపైనదియునగు; వక్షసా=ఱొమ్ముచేత; అభివిరాజితం=ప్రకాశింపఁజేయఁబడినవాఁడును; పాండరేణ=తెల్లనిదియును; అపవిద్ధేన=పఱుపఁబడినదియునగు; క్షౌమేణ = పట్టువస్త్రముతోఁ; యుక్తం (అధ్యాహృతము)= కూడినవాఁడును ; క్షతజేక్షణం=నెత్తురువంటికండ్లుగలవాఁడును; మహార్హేణ=శ్రేష్ఠంబును ; పీతేన=పసుపురంగుగలదియునగు; ఉత్తమవాససా=మేలయినవస్త్రముచేత ; సుసంవీతం = చక్కఁగాఁజుట్టఁబడినవాఁడును; మాషరాశిప్రతీకాశం = మినుము

౯౧౦




రాశితోసమానుఁడైనవాఁడును; భుజంగవత్=సర్పమువలె; నిశ్శ్వసంతం=నిట్టూర్పువిడుచుచున్న వాఁడును; మహతీ=గొప్పదయిన; గాంగే=గంగానదిసంబంధియగు; తోయాంతే= నీటినడుమునందు; ప్రసుప్తం=నిదురించిన; కుంజరమివ (స్థితం) = ఏనుంగుంబోలెనున్నవాఁడును; చతుర్భిః = నాలుగైన; కాంచనైః = బంగారు స్తంభములందుంచఁబడిన; దీపైః= దీపములచేత; దీప్యమానచతుర్దిశం= వెలిఁగింపఁబడుచున్న నాలుగుదిక్కులునుగలవాఁడును; ప్రకాశీకృతసర్వాంగం=ప్రకాశింపఁజేయఁబడినయన్ని యవయవములుగలవాఁడును; విద్యుద్గణైః=మెఱుపులసమూహములతో; యుక్తం= (అధ్యాహృతము)కూడిన; మేఘమివ(స్థితం)= మేఘముంబోలె నున్నవాఁడునగు; రావణం (అధ్యాహృతము)=రావణుని; సుమహాత్మనః=అధికమయినపరాక్రమముగలవాఁడును; ప్రియభార్యస్య=ఇష్టలయినభార్యలుగలవాఁడునగు; తస్య=ఆ; రక్షఃపతేః= రాక్షసులకుఁ బ్రభువైన రావణునియొక్క; పాదమూలగతాః= పాదములసమీపమునుపొందిన; పత్నీశ్చ = భార్యలనుగూడ; దదర్శ=చూచెను.

బంగారముతోఁ జేయఁబడి ముత్తెములుమణులుఁ బొందుగంబడి యుంటంజేసినానావర్ణంబులుగలిగి నిద్రావశంబునఁగొంకైముస్వస్థానంబు నందుండితొలంగియుండుకిరీటంబునం దేజరిల్లుచుఁ, గుండలంబులనొప్పుచున్నముఖంబుతోఁగూడి, దివ్యంబగుహారంబున వెలుంగుచు, రక్తచన్దనాదులచేననులిప్తంబై బలిసినదై వెడల్పై యుండు ఱొమ్ముగలిగి తెల్లనిపట్టునుత్తరీయంబు ధరించి, నెత్తురుంబోలె నెఱ్ఱనైనకన్నులుగలిగి, చాలవిలువగల మేలైనపీతవస్త్రంబుగట్టుకొని, సర్పంబుంబోలె నిట్టూర్పులువుచ్చుచు, మినుపరాశియుఁబోలెనల్లనై తెల్లనిశయనంబునంబరుండి, గంగాజలమధ్యంబునంబరుండినిదురించు నేనుంగుపోల్కిఁజూపట్టుచు, నాల్గుప్రక్కలనుగాంచనస్తంభంబులనుంచఁబడియుండు నాలుగుదీపంబులతోనొప్పుచు, నాభరణంబులంబ్రకాశింపఁ జేయఁ బడుచు, నట్లు మెఱుపుల సమూహంబులతోఁ గూడినమేఘంబుకైవడిభాసిల్లుచున్న, రావణుని, మహాపరాక్రమ శాలియుఁ దనయందుఁ బ్రీతిగలభార్యలుగలవాఁడునగు, నతని, పాదమూలంబుననుండుభార్యలను, హనుమంతుండచ్చటఁ, జూచెను. అని, తాత్పర్యము.




శశిప్రకాశవదనా శ్చారుకుండలభూషితాః
అమ్లానమాల్యాభరణా దదర్శ హరియూథపః. ౩౧

టీక ॥ హరియూథపః=హనుమంతుఁడు; శశిప్రకాశవదనాః=చంద్రునకుంబోలెఁగాంతిగల ముఖముగలవారలును; చారుకుండలభూషితాః=సుందరములయినపోఁగులచే నలంకరింపఁబడినవారలును; అమ్లానమాల్యాభరణాః=వాడనిపుష్పమాలికలును ఆభరణంబులునుగలవారలునగు; పత్నీః(అధ్యాహృతము)=భార్యలను; దదర్శ=చూచెను.

హనుమంతుఁడు, చంద్రునిఁబోలెసుందరంబులయిన ముఖంబుగలవారలై, సుందరంబులయినకుండలంబులనలంకృతలయి, అప్పుడుకోసిన పుష్పమాలికలు నారణంబులుధరించియుండు, నా రావణునిభార్యలం, జూచెను.

అని, తాత్పర్యము.

నృత్తవాదిత్రకుశలా రాక్షసేంద్ర భుజాంకగాః
వరాభరణధారిణ్యో నిషణ్ణా దదృశే హరిః. ౩౨

టీక॥హరిః=హనుమంతుఁడు; నృత్తవాదిత్రకుశలాః=నృత్తమందును వాద్యమందును నేర్పుగలవారలును; రాక్షసేంద్రభుజాంకగాః=రాక్షసులకుఁ బ్రభువయినరావణునిభుజంబులను దొడలనుబొందినవారలును; వరాభరణధారిణ్యః (వరాభరణధారిణీః)=శ్రేష్ఠములయినయాభరణంబులు ధరించువారలును; నిషణ్ణాః=పరుండినవారలునగు(స్త్రీలను; దదృశే(దదర్శ)=చూచెను.

హనుమంతుం,డచ్చట, నృత్తముల యందును వాద్యములయందును నేర్పుగలిగి, రావణునిచే నాలింగనంబునను దొడపైఁగూర్చుండఁబెట్టుకొనుటవలనను గౌరవింపఁబడుచు, మేలయినయాభరణంబులుధరించి, పరుండియుండు, స్త్రీలం, జూచెను. అని, తాత్పర్యము.

వజ్రవైడూర్యగర్భాణి శ్రవణాం తేషుయోషితామ్
దదర్శ తాపనీయాని కుండలా న్యంగదానిచ. ౩౩

టీక॥సః(అధ్యాహృతము)= ఆహనుమంతుఁడు; యోషితాం = స్త్రీలయొ




కర్ణ; శ్రవణాం తేషు = చెవులమొనలం దు; వజ్రవైడూర్యగర్భాణి = వజ్రములును వైడూర్యములును నడుమఁగలవియును; తాపనీయాని = బంగారువికారములనగు; కుండలాని = పోఁగులను; అంగదానిచ = బాహుపురులను; దదర్శ = చూచెను.

హనుమంతుండచ్చట, ఆస్త్రీలుచేతులనుదలగడగాఁ జేసికొనిపరుండియున్నవారలు కావున, బంగారముతోఁ జేయఁబడి, వజ్రవైడూర్యంబులు పొదిగియుండుపోఁగులను, చెవులనంటియుండుబాహుపురులనుం జూచెను.

అని, తాత్పర్యము.

తాసాం చంద్రోపమై ర్వక్త్రైః శ్శుభై ర్లలితకుండలైః
విరరాజ విమానం త న్నభ స్తారాగణైరివ. ౩౪

టీక॥ తత్ = ఆ; విమానం = విమానము; తాసాం = ఆస్త్రీలయొక్క; చంద్రోపమైః = చంద్రునితోఁబోల్కిగల; వక్త్రైః = ముఖములచేతను; శుభైః = మంగళకరములయిన; లలితకుండలైః = సుందరములగు పోఁగులచేతను; తారాగణైః = నక్షత్రములసమూహముల చేత; నభఇవ = ఆకాశమునుంబోలె; విరరాజ = ప్రకాశించెను.

ఆవిమానంబు, ఆస్త్రీల, చంద్రసుందరంబులై సముఖంబులను, మేలయినకుండలంబులనుంగూడి, నక్షత్రంబులంగూడినయాకాశంబుఁబోలెఁ, ప్రకాశించుచుండినది. అని, తాత్పర్యము.

మదవ్యాయామఖిన్నా స్తా రాక్షసేంద్రస్య యోషితః
తేషు తే ష్వవకాశేషు ప్రసుప్తా స్తనుమధ్యమాః. ౩౫

టీక॥ తనుమధ్యమాః = సూక్ష్మములయిననడుములుగల; తాః = ఆ; రాక్షసేంద్రస్య = రాక్షసులకుఁబ్రభువైనరావణునియొక్క; యోషితః = భార్యలు; మదవ్యాయామఖిన్నాః = మద్యమదముయొక్కయతిశయముచేనలసటనొందినవారలై; తేషు తేషు = ఆయా; అవకాశేషు = ప్రదేశములందు; ప్రసుప్తాః = నిదురించినారు.

సూక్ష్మములయిన నడుములు గలయారావణభార్యలు, అధికముగామద్యంబుఁద్రావి, యలసియయ్యైప్రదేశము







లందుఁబడి,నిదురించిరి. అని, తాత్పర్యము.

అంగహారై స్తథైవాన్యా కోమలై ర్నృత్తశాలినీ
విన్యస్త శుభసర్వాంగీ ప్రసుప్తా వరవర్ణినీ. ౩౬

టీక॥ అన్యా=మఱియొకర్తే; నృత్తశాలినీ=ఆటలచేనొప్పునట్టి; వరవర్ణినీ=శ్రేష్ఠస్త్రీ; తథైవ=అట్లే,నృత్తంబుసేయుకాలంబునందువలెననుట; కోమలైః=సుందరములయిన; అంగహారైః= అవయవవిక్షేపంబులచేత; విన్యస్తశుభసర్వాంగీ=ఉంచఁబడినమంగళకరంబులగుసమస్తావయవంబులు గలదై; ప్రసుప్తా=నిదురించినది.

మఱియొకర్తయుత్తమవనిత, నృత్తమునందు నేర్పుగలది, నృత్తముసేయుకాలంబునందుంబోలె, వాసనాబలంబున,నవయవవిక్షేపంబులతోఁగూడినయవయవంబులుగల్గి, నిదురించుచుండినది.

అని, తాత్పర్యము.

కాచి ద్వీణాం పరిష్వజ్య ప్రసుప్తా సంప్రకాశతే
మహానదీ ప్రకీర్ణేవ నళినీ పోత మాశ్రితా. ౩౭

టీ॥ కాచిత్=ఒకానొకస్త్రీ; వీణాం=వీణెను; పరిష్వజ్య = కౌఁగిలించికొని; ప్రసుప్తా=నిదురించినదై; మహానదీ ప్రకీర్ణా=గొప్పనదియందువ్యాపించియుండునదియు; పోతం=తెప్పను; ఆశ్రితా=పొందినదియునగు; నళినీవ=తామరతీఁగవలె; సంప్రకాశతే=ప్రకాశించుచుండినది.

ఒకర్తె,వీణెనుగౌఁగిలించుకొని, నిదురించుచు,మహానదియందు, తెప్పతోఁగూడిన తామరతీఁగయుంబోలెఁ,బ్రకాశించుచుండినది. అని, తాత్పర్యము.

అన్యా కక్షగతేనైవ మడ్డుకే నాసితేక్షణా
ప్రసుప్తా భామినీ భాతి బాలపుత్రేవ వత్సలా. ౩౮

టీక॥ అసితేక్షణా=నల్లనికండ్లుగల; అన్యా= మఱియొకర్తె; కక్షగతేన=చంకనొందియున్న; మడ్డుకేనైవ=సుమ్మెటతోనే; ప్రసుప్తా=నిదురించినదై;




వత్సలా = బిడ్డయందతి ప్రేమముగలది యును; బాలపుత్రా=చిన్నకొడుకుగల దియునగు; భామినీవ=స్త్రీవలె; భాతి= ప్రకాశించుచున్నది.

నల్లనికండ్లుగల మఱియొకర్తె స్త్రీ, చంకనున్నగుమ్మెటతో నేనిదురించుచుఁ, బిడ్డయందతి ప్రేమగలదియు, బిడ్డను జం కనుంచికొని యున్నదియునగు స్త్రీవ లెఁ, బ్రకాశించుచుండినది.

అని, తాత్పర్యము.

పటహం చారుసర్వాంగీ పీడ్య శేతే శుభ స్తనీ
చిరస్య రమణం లబ్ధ్వా పరిష్వజ్యేవ భామినీ. ౩౯

టీక॥ చారుసర్వాంగీ=సుందరంబుల యిన యన్నియవయవంబులను గలది యు; శుభ స్తనీ=సుందరంబులయిన స్త నంబులుగలదియునగు; భామినీ=స్త్రీ; పటహం = తప్పెటను; పీడ్య(పీడయి త్వా)=పట్టుకొని; చిరస్య=బహుకా లమునకు; రమణం=ప్రియుని; లబ్ధ్వా= పొంది; పరిష్వజ్యేవ=కౌఁగిలించుకొని వలె; శేతే=పరుండియున్నది.

సర్వాంగసుందరియు రమణీయంబుల గు స్తనంబులు గలదియునగు నొకర్తె స్త్రీ, బహుకాలమునకుఁ బొందఁబడిన ప్రియునిగట్టిగాఁదమిదీరఁ గౌఁగిలించు కొనునట్లు, తప్పెటనుగట్టిగాఁబట్టు ని, పరుండియుండినది.

అని, తాత్పర్యము.

కాచి ద్వంశం పరిష్వజ్య సుప్తా కమలలోచనా
రహః ప్రియతమం గృహ్య సకామేవ చ కామినీ. ౪౦

టీక॥ కమలలోచనా=తామరపూల వంటికండ్లుగల; కాచిత్ = ఒకానొక స్త్రీ; వంశం = పిల్లనగ్రోవిని; పరిష్వ జ్య=కౌఁగిలించికొని; సకామా=కామ ముతోఁగూడిన; కామినీ=స్త్రీ; రహః= ఏకాంతమునందు; ప్రియతమం=మిక్కి లియుఁ బ్రియుండగువాని; గృహ్యేవ (గృహీత్వేవ)=గ్రహించినవలె; సుప్తా= నిదురించినది.

తామరపూలంబోలు కండ్లుగలయొ కర్తె వనిత, కాముకురాలై కాంత ము నం బ్రియునిఁ గాంక్షదీరఁ గౌఁగిలించు కొనునట్లు, పిల్లంగ్రోవినిగౌఁగిలించుకొ ని, నిదురించినది. అని, తాత్పర్యము.

విపంచీం పరిగృహ్యాన్యా నియతా నృత్తశాలినీ
నిద్రావశ మనుప్రాప్తా సహకాంతేవ భామినీ. ౪౧

టీక॥ నృత్తశాలినీ=నృత్తముచేనొప్పునదియు; నియతా=నియమముగలదియునగు; అన్యా=మఱియొకస్త్రీ; విపంచీం=ఏడుతంత్రులుగలవీణెను; పరిగృహ్యా=పట్టుకొని; సహకాంతా=ప్రియునితోఁగూడిన; భామినీవ=స్త్రీవలె; నిద్రావశం=నిదురకులోఁకువను; అనుప్రాప్తా=పొందినది.

నృత్తముసేయునట్టి, మఱియొకకాంత, ఏడుతంత్రులుగలవీణెంబట్టుకొనినిదురించుచుఁ, బ్రియునింగౌఁగిలించికొని నిదురించుచున్న వనితయుంబోలెఁ,జూపట్టుచుండినది.

అని, తాత్పర్యము.

అన్యా కనకసంకాశై ర్మృదుపీనై ర్మనోరమైః
మృదంగం పరిపీడ్యాంగైః ప్రసుప్తా మత్తలోచనా. ౪౨

టీక॥ మత్తలోచనా=మదముతోఁగూడినకండ్లుగల; అన్యా=మఱియొకతె; కనకసంకాశైః=బంగారముతోసమానమునయినవియును; మృదుపీనైః=మెత్తనివియునుబలసినవియును; మనోరమైః=మనోహరములునగు; అంగైః=అవయవములచేత; మృదంగం=మద్దెళను; పరిపీడ్య=పీడించి; ప్రసుప్తా=నిదురించినది.

మదంబుతోఁగూడినచూపులుగలమఱియొకయువతి, బంగారమునకుంబోలెరంగుగలిగిమెత్తనై బలిసి మనోహరంబులైయుండునవయవంబుల, మద్దెళనుగట్టిగాఁగౌఁగిలించుకొని నిదురించుచుండినది. అని, తాత్పర్యము.

భుజపార్శ్వాంతరస్థేన కక్షగేణ కృశోదరీ
పణవేన సహానింద్యా సుప్తా మదకృతశ్రమా. ౪౩

టీక॥ అనింద్యా = నిందింపఁదగనిదగు; కృశోదరీ=సన్నగిల్లిన కడుపుగలస్త్రీ; మదకృతశ్రమా=మద్య మదంబుచేఁజేయఁబడినయలసటగలదై ; భుజ

పార్శ్వాంతరస్థేన=బాహువుప్రక్కప్రదేశమునున్నదియును; కక్షగేణ= చంకనొందియున్నదియునగు ; పణవేనసహ=ఉడుకతోఁగూడ; సుప్తా = నిదురించినది.

నిందింపఁదగనిరూపంబుగలిగి కృశోదరియగునొక్కవనిత, మద్యమదంబునన లసి, పణవంబను వాద్యంబును, బాహువుప్రక్కఁజంకనుంచుకొని, నిదురించుచుండినది. అని, తాత్పర్యము.

డిండిమం పరిగృహ్యాన్యా తథైవా సక్తడిండిమా
ప్రసుప్తా తరుణం వత్స ముపగూహ్యేవ భామినీ. ౪౪

టీక॥ అన్యా=మఱియొక్క; భామినీ=స్త్రీ; డిండిమం=డిండిమంబనువాద్యమును; పరిగృహ్య=కౌఁగిలించికొని; తథైవ=అట్లె; ఆసక్తడిండిమా= కౌగిలించుకొనఁబడినమఱియొక్కడిండిమంబుగలదై; తరుణం=యౌవనంబుగలప్రియుని; వత్సం=బిడ్డను; ఉపగూహ్యేవ=కౌఁగిలించికొనివలె; ప్రసుప్తా=నిదురించినది.

మఱియొక్క కాంత, ఒకచేతనొకడిండిమంబును రెండవచేతమఱియొకడిండిమంబును గౌఁగిలించుకొని, పయుండి, యౌవనంబుగలప్రియునిబిడ్డనుం గౌఁగిలించుకొని యుండువనితయుంబోలెఁ, గనుపట్టుచుండెనది. అని, తాత్పర్యము.

కాచి దాడంబరం నారీ భుజసంయోగపీడితమ్
కృత్వా కమలపత్రాక్షీ ప్రసుప్తా మదమోహితా. ౪౫

టీక॥ కమలపత్రాక్షీ=తామరపూలఱేకులవంటికండ్లుగల; కాచిత్=ఒకానొక; నారీ=స్త్రీ; ఆడంబరం=ఆడంబరమనువాద్యమును; భుజసంయోగపీడితం=భుజముయొక్కసంబంధముచేతఁ బీడింపఁబడినదానిఁగా; కృత్వా=చేసి; మదమోహితా=కైపుచే మైమఱచునట్లుచేయఁబడినదై; ప్రసుప్తా=నిద్రించినది.

తామరపూఱేకులుంబోలె విశాలసుందరంబులగు నేత్రంబులుగలయొక్కవనిత, యాడంబరంబనువాద్యంబును గట్టిగాఁగౌగిలించికొని, మద్యమదంబున, మైమఱచి, నిదురించినది.

అని, తాత్పర్యము.

కలశీ మపవి ధ్యాన్యా ప్రసుప్తా భాతి భామినీ
వసంతే పుష్పశబలా మాలేవ పరిమార్జితా. ౪౬

టీక॥అన్యా=మఱియొకర్తె; భామినీ=స్త్రీ; కలశీం=నీటికలశమును; అపవిధ్య=బోరగించుకొని; ప్రసుప్తా=నిదురించుచున్నదై; వసంతే=వసంతర్తువునందు; పరిమార్జితా=తడుపఁబడినదియు; పుష్పశబలా=కొంచెము కాంతిఁదఱిఁగిన పూలుగలదియు నగు; మాలేవ=పుష్పమాలికవలె; భాతి=ప్రకాశించుచున్నది.

మఱియొకర్తె కాంత, నీటితోనిండియుండు కలశమునుదనపై బోరగిలందోసికొని, నీటిచేఁదడుపంబడినదై, నిదురించుచు, వసంతర్తువునందు, వాడకుండుటకై, తడుపంబడి, యుంటంజేసి, కొంచెముకాంతిదఱిఁగిన పూలుగలపుష్పమాలికయుంబోలెఁ, జూపట్టుచుండినది. అని, తాత్పర్యము.

పాణిభ్యాంచ కుచౌ కాచి త్సువర్ణకలశోపమౌ
ఉపగూహ్యా బలా సుప్తా నిద్రాబలపరాజితా. ౪౭

టీక॥ కాచిత్=ఒకానొక; అబలా=స్త్రీయును; పాణిభ్యాం=చేతులచేత; సువర్ణకలశోపమౌ=బంగారుకలశంబులతోఁబోలికగల; కుచౌ=స్తనములను; ఉపగూహ్యా=పట్టుకొని; నిద్రాబలపరాజితా=నిద్రయొక్కయతిశయముచేతలోఁగొనఁబడినదై; సుప్తా=నిదురించినది.

ఒకానొకయువతి, బంగారుకలశంబులంబోనితనస్తనంబులఁజేతులంబట్టుకొని, నిద్రాపరవశయై, పరుండి, నిదురించుచుండినది.

అని, తాత్పర్యము.

అన్యా కమలపత్రాక్షీ పూర్ణేందు సదృశాననా
అన్యా మాలింగ్యసుశ్రోణీం ప్రసుప్తా మదవిహ్వలా. ౪౮

టీక॥కమలపత్రాక్షీ=తామర పూరేకులవంటి కండ్లుగలదియును ; పూ

ణేందుసదృశాననా=నిండు చంద్రుని తోసమానమయిన ముఖముగలదియును; అన్యా=మఱియొకర్తె(స్త్రీ); సుశ్రోణీం=సుందరములయినపిఱుందులుగల; అన్యాం = మఱియొకస్త్రీని ; ఆలింగ్య=కౌఁగిలించికొని; మదవిహ్వలా=కైపుచేస్వాధీనతతప్పినదై; ప్రసుప్తా=నిదురించినది.

తామరపూరేకులుంబోలె విశాలరమణీయంబులగుకండ్లును, నిండుచందురునిబోలుముఖంబునుంగలయొక వనిత, మదంబునమైమఱచి,సుందరంబులగు పిఱుందులనొప్పు మఱియొక్కకాంతంగవుగిలించికొని,నిదురించుచుండినది.

అని, తాత్పర్యము.

ఆతోద్యాని విచిత్రాణి పరిష్వజ్య పరస్త్రియః
నిపీడ్యచ కుచైస్సుప్తాః కామిన్యః కాముకానివ. ౪౯

టీక॥పరస్త్రియః=ఇతరస్త్రీలు; విచిత్రాణి=నానావిధములయిన; ఆతోద్యాని=వాద్యములను; కామిన్యః=కాముకులగుస్త్రీలు; కాముకానివ=తమప్రియులనుంబోలె; పరిష్వజ్య=కౌఁగిలించికొని;కుచైః= స్తనములచేత; నిపీడ్యచ=మర్దించియును; సుప్తాః=నిదురించిరి.

కామినులు,తమప్రియులనుంబోలె, మఱికొందఱుస్త్రీలు నానావిధంబులయినవాద్యంబులనుగౌఁగిలించికొని, స్తనంబులఁబీడించుచు,నిదురించిరి.

అని, తాత్పర్యము.

తాసామేకాంతవిన్యస్తే శయానాం శయనే శుభే
దదర్శ రూపసంపన్నా మపరాం స కపి స్త్రియమ్. ౫౦

టీక॥ సః=ఆ;కపిః=హనుమంతుఁడు; తాసాం=వారలనడుమ; ఏకాంతవిన్యస్తే= వివిక్తస్థలమునందుంచఁబడిన; శుభే=మంగళకరంబగు; శయనే=పాన్పునందు;శయనాం=పరుండియున్నదియును;రూపసంపన్నాం = సౌందర్యముతోఁగూడినదియునగు; అపరాం=మఱియొక్క; స్త్రియం=వనితను; దదర్శ=చూచెను.

ఆస్త్రీలనడుమనేకాంతంబుననుంచఁ

బడిన యుత్తమంబగు శయనంబునం బరుండి, సౌందర్యంబున వెలుంగుచున్న, మఱి యొకవనితను (మందోదరిని) హనుమంతుండు, చూచెను. అని, తాత్పర్యము.

ముక్తామణిసమాయుక్తై ర్భూషణై స్సువిభూషితామ్
విభూషయంతీ మివ త త్స్వశ్రియా భవనో త్తమమ్. ౫౧
గౌరీం కనకవర్ణాభా మిష్టా మంతఃపు రేశ్వరీమ్
కపి ర్మందోదరీం తత్ర శయానాం చారురూపిణీమ్. ౫౨

టీక॥ కపిః = హనుమంతుఁడు; ముక్తామణిసమాయుక్తైః = ముత్తెములతోను రత్నములతోను గూడిన; భూషణైః = సొమ్ములచే; సువిభూషితాం = చక్కఁగా నలంకరింపఁబడినదియును; స్వశ్రియా = తనకాంతిచేత; తత్ = ఆ; భవనోత్తమం = గృహశ్రేష్ఠమును; విభూషయంతీం = అలంకరించుచున్నదియును; ("ఇవ" అనునది వాక్యాలంకారార్థకము) గౌరీం = పసపురంగుగలదియును; కనకవర్ణాభాం = బంగారురంగువంటికాంతి గలదియును; ఇష్టాం = రావణునకుఁ బ్రియురాలును; అంతఃపు రేశ్వరీం = అంతఃపురంబునకధిపతియయినదియును; తత్ర = అచ్చట; శయానాం = పరుండియున్నదియును; చారురూపిణీం = సుందరమయినరూపముగలదియునగు; మందోదరీం = మందోదరిని; దదర్శ (అధ్యాహృతము) = చూచెను.

ముత్తెములు మణులును బొదిగియుండు సొమ్ముల నలంకరింపఁబడి, యుత్తమంబగు నాగృహంబును దనమేనికాంతి చేనలంకరించుచు, బంగారువర్ణంబుం బోనిచాయగలిగి, యచ్చటఁ బరుండి, సౌందర్యంబున వెలుంగుచున్నదాని, రావణునకుఁ బ్రియురాలగుదాని, నంతఃపు రేశ్వరియగు మందోదరిని, హనుమంతుండు, చూచెను.

అని, తాత్పర్యము.

స తాం దృష్ట్వా మహాబాహు ర్భూషితాం మారుతాత్మజః
తర్కయామాస సీతేతి రూపయౌవనసంపదా. ౫౩

టీక॥ మహాబాహుః = పెద్దచేతులుగలవాఁడును; మారుతాత్మజః = వాయు

దేవునికొడుకునగు; సః=ఆహనుమంతుఁడు; భూషితాం= అలంకరింపఁబడిన; తాం=ఆమందోదరిని; దృష్ట్వా= చూచి; రూపయౌవనసంపదా=సౌందర్యముయొక్కయు యౌవనము యొక్కయు నతిశయముచేత; సీతా = సీత; ఇతి=అని; తర్కయామాస=ఊహించెను.

మహాబాహువుండును వాయుదేవుని కుమారుండునగునాహనుమంతుండు, నానావిధాలంకారంబుల నొప్పుచుండునామందోదరింజూచి, సౌందర్యంబునుయౌవనంబు నధికంబుగానుండుటంజూచినమాత్రముననే, చక్కఁగా విచారింపక, "ఈపె దేసీత" యనియూహించెను. అని, తాత్పర్యము.

హర్షేణ మహతా యుక్తో ననంద హరియూథపః

టీక॥హరియూథపః = హనుమంతుఁడు; హర్షేణ= సంతోషముతోఁగూడినవాఁడై; ననంద=సంతోషించెను.

హనుమంతుఁ, డంతకంతకువృద్ధినొందుచుండుసంతోషంబునొంది, మిక్కిలియునానందించెను.

అని, తాత్పర్యము.

ఆస్ఫోటయామాస చుచుంబ పుచ్ఛమ్
ననంద చిక్రీడ జగౌ జగామ. ౫౮
స్తంభా నరోహ న్నిపపాత భూమౌ
నిదర్శయన్ స్వాం ప్రకృతిం కపీనామ్

టీక॥సః(అధ్యాహృతము)= ఆహనుమంతుండు; స్వాం=తనదైన; కపీనాం=కోతులయొక్క; ప్రకృతిం=స్వభావమును; నిదర్శయన్=చూపుచు; ఆస్ఫోటయామాస=చేతులుతట్టెను. పుచ్ఛం=తోఁకను; చుచుంబ=ముద్దుపెట్టుకొనెను; ననంద=సంతసించెను. చిక్రీడ = ఆడెను; జగౌ= పాడెను. జగామ=పోయెను. స్తంభాన్=కంబములను; అరోహత్=ఎక్కెను. భూమౌ= నేలయందు; నిపపాత=పడెను.

హనుమంతుండు; పరమసంతోషం

బునఁ, జేతులుతట్టెను; తోఁకనుముద్దుపెట్టుకొనెను; సంతోషించెను; ఆటలాడెను; పాటలుపాడెను; ఆయింటిస్తంభంబులపైకెక్కెను; నేలపైఁబడెను; ఇట్లుతనకుస్వాభావికమయిన, కోఁతిచేష్టలంజేసెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, దశమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండదశమసర్గటీక,
ముగిసినది.

---

ఓమ్

ఏకాదశసర్గప్రారంభః.

అవధూయచ తాం బుద్ధిం బభూవావస్థితస్తదా

టీక॥ సః(అధ్యాహృతము)= ఆహనుమంతుఁడు; తాం=ఆ; బుద్ధిం=తలంపును; అవధూయ=విడిచి; తదా=అప్పుడు; అవస్థితః=ఎచ్చరికగలవాఁడు; బభూవ=ఆయెను.

ఆహనుమంతుం, డంత, నుచితముగానియాతలంపునువిడిచి, యెప్పటియట్లు, ఎచ్చరికగలవాఁడయ్యెను.
అని, తాత్పర్యము.

జగామ చాపరాం చింతాం సీతాం ప్రతి మహాకపిః. ౧

టీక॥ మహాకపిః= పెద్దకోఁతియగు హనుమంతుండు; సీతాంప్రతి = సీతనుగూర్చి; అపరాం=మఱియొక్క; చింతాం=తలంపును; జగామ= పొందెను.

హనుమంతుం, డంత, సీతవిషయమై, మఱియొక్కవిధముగా, నాలోచించెను. అని, తాత్పర్యము,

న రామేణ వియుక్తా సా స్వప్తు మర్హతి భామినీ
న భోక్తుం నాప్యలంకర్తుం నపాన ముపసేవితుమ్. ౨
నాన్యం నర ముప స్థాతుం సురాణా మపి చేశ్వరమ్

టీక॥సా=ఆ; భామినీ=స్త్రీయయినసీత; రామేణ=రామునిచేత; వియుక్తా=విడువఁబడినదై; స్వప్తుం=నిదురించుటకు; నార్హతి=తగదు. భోక్తుం=భుజించుటకు; న (అర్హతి)=తగదు. అలంకర్తుమపి=అలంకరించి కొనుటకును; న=తగదు. పానం = మద్యమును; ఉపసేవితుం=సేవించుటకు; న=తగదు. సురాణాం=దేవతలకు; ఈశ్వరమపి=ప్రభువైనయింద్రుఁడైనను; అన్యం= ఇతరుఁడైన; నరం = పురుషుని; ఉపస్థాతుం=సేవించుటకు; న = తగదు.

సీత, రామవియోగంబునొంది, యిట్లుసుఖంబుగానిదురింపదు; భోజనంబుసేయదు; అలంకరించికొనదు; మద్యంబుఁద్రాఁగదు; రామునికన్నినితరపురుషుని, దేవేంద్రుఁడైనను,వరింపదు, అని, తాత్పర్యము.

నహి రామసమః కశ్చి ద్విద్యతే త్రిదశేష్వపి. ౩

టీక॥రామసమః=రామునితో సరియయినవాఁడు; కశ్చిత్= ఒకానొకఁడు; త్రిదశేష్వపి= దేవతలయందును; నహి=లేఁడుగదా!

దేవతలయందును, రామునకు సరియగువాఁడెవ్వఁడునులేఁడు. అని, తాత్పర్యము.

అన్యేయ మితి నిశ్చిత్య పానభూమౌ చచార సః

టీక॥సః = ఆహనుమంతుఁడు; "ఇయం=ఈబిడ; అన్యా= మఱియొక్కతె;" ఇతి=అని; నిశ్చిత్య=నిశ్చయించి; పానభూమౌ=త్రాఁగునట్టి స్థలమునందు; చచార=తిరిగెను.

ఆహనుమంతుండు,"ఇదిసీతగాదు, ఎవ్వతెయోమఱియొక్కవనిత." అని,నిశ్చయించి,పానభూమియందు, సంచ

రించెను. అని, తాత్పర్యము.

క్రీడితేనా పరాః క్లాంతా గీతేనచ తథా పరాః. ౪
నృత్తేన చాపరాః క్లాంతాః పానవిప్రహతా స్తథా
మురజేషు మృదంగేషు పీఠికాసుచ సంస్థితాః. ౫
తథా స్తరణ ముఖ్యేషు సంవిష్టా శ్చాపరా స్స్త్రియః

టీక॥ సః(అధ్యాహృతము)=ఆహనుమంతుఁడు; క్రీడితేన= రతిచేత; క్లాంతాః=అలసటనొందిన; అపరాః=ఇతరస్త్రీలను; తథా=అట్లు; గీతేన=పాటచేత; క్లాంతాః(అధ్యాహృతము)=అలసటనొందిన; అపరాశ్చ=ఇతరస్త్రీలను; నృత్తేన=ఆటచేత; క్లాంతాః=అలసటనొందిన; అపరాశ్చ=మఱికొందఱుస్త్రీలను; తథా=అట్లు; పానవిప్రహతాః=త్రాఁగుటచే నలసినస్త్రీలను; మురజేషు=మురుజములను వాద్యములందును; మృదంగేషు=మద్దెళలయందును; పీఠికాసుచ = ఆసనంబులయందును; సంస్థితాః=పరుండియున్నవారలను; తథా= అట్లు; ఆస్తరణముఖ్యేషు=కంబళశ్రేష్ఠములయందు; సంవిష్టాః = పరుండిన; అపరాః=ఇతరలయిన; స్త్రియశ్చ=వనితలను; దదర్శ(అధ్యాహృతము)=చూచెను.

అచ్చటఁ, గొందఱుయువతులు, రతిశ్రమంబునం బరుండి నిద్రించుచుండిరి; కొందఱు పాటలుపాడి యలసినిద్రించుచుండిరి; కొందఱునృత్తంబుచేసి యలసటనొంది పరుండియుండిరి; మఱికొందఱు, మద్యంబుద్రావి మైమఱచినిద్రించుచుండిరి; మురజంబులనుమృదంగంబులను ఆసనంబులనుబడి కొందఱువనితలునిద్రించుచుండిరి; మఱికొందఱుకాంతలు, శ్రేష్ఠంబులగుకంబళంబులపైఁ బరుండినిద్రించుచుండిరి; హనుమంతుండు, వారలనందఱుంబూచెను. అని, తాత్పర్యము.

అంగనానాం సహస్రేణ భూషితేన విభూషణైః. ౬
రూపసల్లాపశీలేన యుక్తగీతార్థభాషిణా
దేశకాలాభియుక్తేన యుక్తవాక్యాభిధాయినా. ౭
రతాభిరతసంసుప్తం దదర్శ హరియూథపః

టీక॥హరియూథపః = హనుమంతుఁడు;విభూషణైః=సొమ్ములచేఁ;భూషితేన=అలంకరింపఁబడినదియు;రూపసల్లాపశీలేన = రావణునిసౌందర్యమునుగొనియాడుస్వభావముగలదియును; యుక్తగీతార్థభాషిణా= సరిగాభరతశాస్త్రార్థమును జెప్పునదియును; దేశకాలాభియుక్తేన= దేశమునుగాలమునెఱింగినదియు ; యుక్తవాక్యాభిధాయినా= సరియయినమాటను జెప్పునదియునగు;అంగనానాం = స్త్రీలయొక్క;సహస్రేణ=వేయిచేత; రతాభిరతసంసుప్తం=రతియొక్కయతిశయముచేతనిదురించినట్టి; రావణం (అధ్యాహృతము)=రావణుని;దదర్శ = చూచెను.

నానావిధభూషణంబుల నలంకరింపఁబడి, రావణుని సౌందర్యంబులఁగొనియాడుస్వభావంబు గలిగి , భరతశాస్త్రార్థమునుయుక్తముగాఁ జెప్పుటకుంజాలి, దేశకాలంబుల నెఱింగి,సరియయినమాటలాడుచున్న, వేవురుస్త్రీలతోఁదమిదీరఁ,గ్రీడించి, యలసినిదురించుచున్న,రావణుని,హనుమంతుండు, చూచెను. అని, తాత్పర్యము.

తాసాం మధ్యే మహా బాహు శ్శుశుభే రాక్షసేశ్వరః. ౮
గోష్ఠే మహతి ముఖ్యానాం గవాం మధ్యే యథా వృషః

టీక॥తాసాం=ఆస్త్రీలయొక్క;మధ్యే=నడుమునందు; మహాబాహుః= పెద్దచేతులుగల; రాక్షసేశ్వరః=రాక్షసులకధిపతియగు రావణుండు ; మహతి=పెద్దదైన;గోష్ఠే=ఆవులమందయందు;ముఖ్యానాం=శ్రేష్ఠములయిన ; గవాం=ఆవులయొక్క; మధ్యే=నడుమనందు;వృషోయథా = ఆఁబోతువలె; శుశుభే=ప్రకాశించెను.

మహాబాహుండగు రావణుండు, ఆ స్త్రీలనడుమ,ఆవులమందయందు, నావులనడుమనున్న యాఁబోతుం బోలెఁ బ్రకాశించుచుండెను.

అని, తాత్పర్యము.

స రాక్షసేంద్ర శ్శుశుభే తాభిః పరివృత స్స్వయమ్. ౯
కరేణుభి ర్యథారణ్యే పరికీర్ణో మహాద్విపః

టీక॥ రాక్షసేంద్రః= రాక్షసులకుఁ బ్రభుండైన; సః=ఆరావణుండు; తాభిః=ఆస్త్రీలచేత; పరివృతః= చుట్టఁబడినవాఁడై; స్వయం=తాను; మహారణ్యే=గొప్పయడవియందు; కరేణుభిః= ఆఁడేనుంగులచేత; పరికీర్ణః= చుట్టఁబడిన; మహాద్విపోయథా= పెద్దయేనుంగుంబోలె; శుశుభే=ప్రకాశించెను.

రాక్షసేశ్వరుండగు నారావణుండు, ఆవనితలచేఁ బరివేష్టింపఁబడి, మహారణ్యంబున, నాఁడేనుంగులచేఁ జుట్టుకొనఁబడియుండు మహాగజంబు పోలిక, జూపట్టుచుండెను.

అని, తాత్పర్యము.

సర్వకామై రుపేతాంచ పానభూమిం మహాత్మనః. ౧౧
దదర్శ హరిశార్దూల స్తస్య రక్షఃపతే గృహే

టీక॥ హరిశార్దూలః= వానరశ్రేష్ఠుండగుహనుమంతుండు; మహాత్మనః= అధికమయిన పరాక్రమముగలవాఁడును; రక్షఃపతేః= రాక్షసులకుఁ బ్రభువునగు; తస్య= ఆరావణునియొక్క; గృహే=ఇంటియందు; సర్వకామైః = సమస్తములయినపదార్థములతోను; ఉపేతాం=కూడిన; పానభూమించ= త్రాఁగెడుస్థలమును; దదర్శ=చూచెను.

వానరశ్రేష్ఠుండగు నాహనుమంతుండు, మహాపరాక్రమశాలియు రాక్షసేశ్వరుండునగు నారావణుని యింటిలో, సమస్తపదార్థములను సంపూర్ణంబైన పానభూమిం, జూచెను.

అని, తాత్పర్యము.

మృగాణాం మహిషాణాంచ వరాహాణాంచ భాగశః. ౧౧
తత్ర న్యస్తాని మాంసాని పానభూమౌ దదర్శ సః

టీక॥ సః=ఆహనుమంతుఁడు; తత్ర=ఆ; పానభూమౌ=త్రాఁగెడు స్థలమునందు; భాగశః= వేఱువేఱుగా; న్యస్తాని=ఉంచఁబడిన; మృగాణాం=జింకలయొక్కయు; మహిషాణాంచ=ఎనుఁబోతులయొక్కయు; వరాహాణాంచ=పందులయొక్కయు; మాంసాని= మాంసములను; దదర్శ=చూచెను.

ఆహనుమంతుం, డచ్చటఁ, బానభూమియందు ; వేయు వేలుగా నుంచఁబడి యుండు, జింకలమాంసంబును, ఎనుఁబోతుమాంసంబును, పంది మాంసంబునుం, జూచెను.

అని, తాత్పర్యము.

రౌక్మేషుచ విశాలేషు భాజనేష్వర్ధభక్షితాన్. ౧౨
దదర్శ హరిశార్దూలో మయూరాన్ కుక్కుటాంస్తథా

టీక॥హరిశార్దూలః= వానరశ్రేష్ఠుండగుహనుమంతుండు; తథా = అట్లు; రౌక్మేషు= బంగారువికారములయిన; విశాలేషు= పెద్దవియగు ; భాజనేషు = పాత్రములందు ; అర్ధభక్షితాన్= సగముదినఁ బడిన ; మయూరాన్= నెమళ్లను, నెమలిమాంసములననుట; కుక్కుటాన్= కోళ్లను , కోడిమాంసములను; దదర్శ= చూచెను.

వానరశ్రేష్ఠుండగు హనుమంతుండు, పెద్దబంగారుపళ్లెములందు, సగముదినఁగామిగిలియున్న, నెమలిమాంసములను గోడిమాంసములనుం, జూచెను.

అని, తాత్పర్యము.

వరాహవార్ధ్రాణసకాన్ దధిసౌవర్చలాయుతాన్. ౧౩
శల్యాన్ మృగమయూరాంశ్చ హనుమానన్వవైక్షత

టీక॥హనుమాన్ = హనుమంతుఁడు; దధిసౌవర్చలాయుతాన్= పెరుఁగుతోను సౌవర్చలమను లవణములోను గూడిన; వరాహవార్ధ్రాణసకాన్= వరాహ=పందులను, పందిమాంసములననుట, వార్ధ్రాణసకాన్=వార్ధ్రాణసమనెడుపక్షులను, ఆమాంసములననుట "కృష్ణగ్రీవోరక్తశిరాశ్శ్వేతపక్షో విహంగమః, సవై వార్ధ్రాణసః పక్షీ" (నల్లనిగొంతుకను, ఎఱ్ఱనితలయును తెల్లనిఱెక్కలును గలపక్షి వార్ధ్రాణసంబనంబడును) అనివిష్ణుధర్మమునందుఁ జెప్పఁబడినది; లేక, ఒకవిధమయిన మేకలను, ఆమాంసములననుట, "త్రిపిబంత్విం ద్రియక్షీణం శ్వేతంవృద్ధమజాపతిం, వార్ధ్రాణసంచతంప్రాహుర్యాజ్ఞికాశ్శ్రాద్ధకర్మణి" (యజ్ఞవేత్తలు, నోటను జెవులనుముక్కునను, మూఁడిటం ద్రాఁగునదియును, ఇంద్రియములుక్షీణించి యుండునదియు, తెల్లనదియు ముసలిదియు




నాఁడు మేకలకుఁ బెనిమిటియునగు మేక వార్ధ్రాణసంబని చెప్పెదరు; శల్యాన్ = ఏదుబందులను, ఆమాంసంబులననుట; మృగమయూరాంశ్చ = జింకలను నెమళ్లను, ఆయామాంసంబులననుట; అన్వవైక్షత = చూచెను.

హనుమంతుం, డచ్చటఁ, బెఱుఁగును సౌవర్చలలవణంబును జేర్చి సంస్కరించి వండఁబడియున్న, పందిమాంసంబులను వాధ్రాణ సంబులను మేకలమాంసంబులను (వార్ధ్రాణసంబులనుపక్షులమాంసంబులను) ఏదుబంది మాంసంబులను, జింకలమాంసంబులను, నెమళ్లమాంసంబులనుం, జూచెను. అని తాత్పర్యము.

క్రకరాన్ వివిధాన్ సిద్ధాం శ్చకోరా నర్ధభక్షితాన్. ౧౪
మహిషా నేకశల్యాంశ్చ ఛాగాంశ్చ కృతనిష్ఠితాన్
లేహ్యా నుచ్చావచాన్ పేయాన్ భోజ్యాని వివిధానిచ. ౧౫

టీక॥ సః (అధ్యాహృతము) = ఆహనుమంతుఁడు; వివిధాన్ = నానావిధములును; సిద్ధాన్ = పక్వములయినవియునగు; క్రకరాన్ = కక్కెరపక్షులను, ఆమాంసములననుట; అర్ధభక్షితాన్ = సగముతినఁబడిన; చకోరాన్ = చకోరపక్షులను, ఆమాంసములననుట; మహిషాన్ = ఎనుఁబోతులను, ఆమాంసములననుట; ఏకశల్యాంశ్చ = ఏకశల్యంబులనుమత్స్యంబులను; కృతనిష్ఠితాన్ = చాలినంత వఱకు సిద్ధములయిన; ఛాగాంశ్చ = మేకలను, ఆమాంసములననుట; లేహ్యాన్ = నాకఁదగిన తేనెమొదలగువానిని; ఉచ్చావచాన్ = నానావిధములైన; పేయాన్ = త్రాగఁదగిన పాలుమొదలగువానిని; వివిధాని = నానావిధములయిన; భోజ్యానిచ = తినఁదగినయన్నము మొదలగువానిని; దదర్శ (అధ్యాహృతము) = చూచెను.

ఆహనుమంతుఁడు, నానావిధంబులుగాఁబక్వంబులయియుండు కక్కెరపక్షుల మాంసంబులను, జకోరపక్షి మాంసంబులను, ఎనుఁబోతులమాంసంబులను, ఏకశల్యంబులను మత్స్యంబుల మాంసంబులను, జాలునంతవఱకు నెచ్చుతక్కువలు లేక పచింపఁబడిన ఛాగమాంసంబులను, నాకఁదగిన తేనెమొదలగువానిని, నానావిధంబులగు పేయద్రవ్యంబులను, పలుదెఱంగులగు భోజ్యపదార్థంబులనుం, జూచెను.

అని, తాత్పర్యము.




స౧౧

తథా మ్లలవణో త్తంసై ర్వివిధై రాగషాడబైః
హారనూపుర కేయూరై రపవిద్ధై ర్మహాధనైః. ౧౬
పానభాజన విక్షిప్తైః ఫలైశ్చ వివిధైరపి
కృతపుష్పోప హారా భూ రధికం పుష్యతి శ్రియమ్. ౧౭

టీక॥తథా=అట్లు;ఆమ్లలవణో త్తంసైః=పులుసుఉప్పు ప్రధానముగాఁగలదియగువానిచేత; వివిధైః=పలువిధములయిన; రాగషాడబైః=శర్కరద్రాక్షమొదలగుమధురద్రవ్యముల విరళముగానుండురసములచేతను, ఆద్రవ్యములయొక్కదట్టముగానుండు రసములచేతను;మహాధనైః=గొప్పవిలువగలవియు; అపవిద్ధైః=తీయఁబడినవియునగు;హారనూపుర కేయూరైః= హారములచేతనుఅందెలచేతను బాహుపురులచేతను; పానభాజనవిక్షిప్తైః=త్రాఁగెడుగిన్నెలనుండివెలికివేయఁబడిన; వివిధైః=నానావిధములైన;ఫలైరపి=పండ్లచేతను; కృతపుష్పోపహారా= చేయఁబడినపూలుచల్లుటగల; భూః=నేల;అధికం=మిక్కిలి;శ్రియం=కాంతిని; పుష్యతి=అధికముసేయుచున్నది.

పులుసుపదార్థములునుఉప్పుపదార్థములునునానావిధములయిన, శర్కరద్రాక్షతేనె మొదలగుమధురంబుల విరళరసంబులయినరాగంబులనుపదార్థంబులును, ఆమధురద్రవ్యంబులనుండిదట్టముగాఁదీసినరసములయినషాడబంబులనుపదార్థంబులును, మఱియునచ్చటఁదీసివేయఁబడియుండు గొప్పవిలువగలహారంబులునుఅందెలునుబాహుపురులునుబానపాత్రంబునుండి వెలికివేయఁబడిననానావిధఫలంబులునుగల్గి, పూలుచల్లఁబడియుండు, నాభూమి, యచ్చటికాంతి,నధికముగాఁజేయుచుండెను.

అని, తాత్పర్యము.

తత్ర తత్ర చ విన్యస్తైస్సుశ్లిష్టై శ్శయనాసనైః
పానభూమి ర్వినా వహ్నిం ప్రదీప్తే వోపలక్ష్యతే. ౧౮

టీక॥పానభూమిః = త్రాఁగుస్థలము;తత్రతత్ర= ఆయాస్థలమునందును; విన్యస్తైః=ఉంచఁబడినవియును;సుశ్లిష్టైః = మిక్కిలియుసంబంధించినవి

యునగు;శయనాసనైః= పాన్పులచేతను,పీఠములచేతను;వహ్నింవినా=నిప్పులేకయె;ప్రదీప్తేన=మండినట్లు ; ఉపలక్ష్యతే=చూడఁబడుచున్నది.

అన్యోన్యస్థలంబులనొకటివెనుకనొకటి వరుసగా,నుంచఁబడినబంగారువికారంబులయినశయనంబులు నాసనంబులునుగల్గియుండఁజేసి,యీపానభూమి, నిప్పులేకయె,మండినట్లు,చూపట్టుచుండినది.

అని, తాత్పర్యము.

బహుప్రకారై ర్వివిధై ర్వర సంస్కారసంస్కృతైః
మాంసైః కుశలసంయుక్తైః పానభూమిగతైః పృథక్. ౧౯
దివ్యాః ప్రసన్నా వివిధా స్సురాః కృతసురా అపి
శర్కరాసవ మాధ్వీక పుష్పాసవ ఫలాసవాః. ౨౦
వాసచూర్ణై శ్చ వివిధై ర్దృష్టా స్తై స్తైః పృథక్పృథక్

టీక॥దివ్యాః=స్వర్గమునందుఁబుట్టిన, సముద్రమథనమునందుఁబుట్టినయనుట; ప్రసన్నాః=తేటగానుండు;వివిధాః=పలువిధములయిన;సురాః=మద్యములును;కృతసురాఅపి = చేయఁబడినమద్యములును; శర్కరాసవమాధ్వీకపుష్పాసవఫలాసవాః,శర్కరాసవ=చక్కెరతోఁజేసినమద్యములును, మాధ్వీక=తేనెతోఁజేసినమద్యములును,మార్ద్వీక(అని,పాఠాంతరము)= ద్రాక్షతోఁజేసిన మద్యములును,పుష్పాసవ= పూలతేనెతోఁజేసినమద్యములును, ఫలాసవాః=పండ్లతోఁజేసినమద్యములును;బహుప్రకారైః=అనేకవిధములయినవియు; వివిధైః=పలువిధములుగాఁజేయఁబడినవియు;వరసంస్కారసంస్కృతైః= శ్రేష్ఠములయినపాకములచేఁబక్వములయినవియును;కుశలసంయుక్తైః=సమర్థులగువంటవాండ్రచేఁగూర్పఁబడినవియును;పృథక్ = వేఱుగా;పానభూమిగతైః = పానభూమినిబొందినవియునగు;మాంసైః(సహ)=మాంసములతోఁగూడ;వివిధైః= నానావిధములయిన; తైస్తైః=ఆయా;వాసచూర్ణైః=(సహ)సువాసనగలుగుటకై వేయునట్టి,గందపొళ్లతోఁగూడ ; పృథక్పృథక్=వేఱువేఱుగా;కపినా(అధ్యాహృతము)=హనుమంతునిచేత;దృష్టాః=చూడఁబడినవి.

హనుమంతుండచ్చట, నానావిధంబులుగాఁబచింపఁబడి,చక్కనిసంస్కా

రంబులతో సమర్థములగు వంట వాండ్రచే సిద్ధములు చేయఁబడి పానభూమి యందు వేఱువేఱుగా నుంచఁబడిన యుండు, మాంసంబులను, అమృతమథనంబునంబుట్టినసకలవిధములైన తేట మద్యంబులను, మద్దికృత్రిమంబులగుమద్యంబులను, చక్కెరతోఁజేసినమద్యంబులను తేనెతోఁజేసినమద్యంబులను, ద్రాక్షతోఁ జేసినమద్యంబులను, పుష్పరసంబులం జేసిన మద్యంబులను, ఫలరసంబులం జేసిన మద్యంబులను, వేఱువేఱుగాఁ, జూచెను. అని, తాత్పర్యము.

సంతతా శుశుభే భూమి ర్మాల్యైశ్చ బహు సంస్థితైః. ౨౧
హిరణ్మయైశ్చ వివిధై ర్భాజనై స్స్ఫాటికైరపి
జాంబూనదమయై శ్చాన్యైః కరకై రభిసంవృతా. ౨౨

టీక॥ భూమిః=నేల ; బహుసంస్థితైః=అనేకవిధములయినయమర్పులుగల, అనేకవిధములుగాఁజేయఁబడిన యమర్పుట; మాల్యైశ్చ=పుష్పమాలికల చేతను; సంతతా=వ్యాపింపఁబడినదై; వివిధైః=నానావిధములయిన; హిరణ్మయైః=వెండివికారములయిన; భాజనైశ్చ=పాత్రలచేతను; స్ఫాటికైరపి=స్ఫటికమణివికారములయిన పాత్రలచేతను; అన్యైః=ఇతరములయిన; జాంబూనదమయైః=బంగారు వికారములయిన; కరకైశ్చ= గిండివంటిపాత్రలచేతను; అభిసంవృతా = చుట్టఁబడినదై; శుశుభే=ప్రకాశించెను.

అచ్చటినేల, నానావిధములుగాఁ గూర్పఁబడినపుష్పమాలికలును, వెండితోఁజేయఁబడినపలుతెఱంగులగు పాత్రలును, స్ఫటికపాత్రలును, ఇతరములగు, బంగారుతోఁజేసినగిండివంటిపాత్రలును గల్గి యుండుటవలనఁ, బ్రకాశించుచుండినది. అని, తాత్పర్యము.

రాజతేషుచ కుంభేషు జాంబూనదమయేషుచ
పానశ్రేష్ఠం తదా భూరి కపి స్తత్ర దదర్శహ. ౨౩

టీక॥ కపిః=హనుమంతుఁడు; తత్ర=అచ్చటు; తదా=అప్పుడు; రాజతేషు=వెండివికారములైన; కుంభేషుచ=కుంభములందును; జాంబూనదమయేషు

చ=బంగారువికారములయినకుంభములందును;భూరి = అధికమయిన;పానశ్రేష్ఠం=మద్యములలో శ్రేష్ఠమగుదానిని;దదర్శ=చూచెను; "హ" అనున పాదపూరణార్థము.

హనుమంతుఁడు, అప్పుడచ్చట వెండి కుంభంబులందును బంగారు కుంభంబులందును, ఎచ్చుగానుంచఁబడి యుండు, శ్రేష్ఠమయినమద్యమును, జూచెను.

అని, తాత్పర్యము.

సోపశ్య చ్ఛాతకుంభాని శీధో ర్మణిమయానిచ
రాజతానిచ పూర్ణాని భాజనాని మహాకపిః. ౨౪

టీక ॥ మహాకపిః = పెద్దకోఁతి యగు; సః = ఆహనుమంతుఁడు ; శీధోః = మద్యము యొక్క ; పూర్ణాని=నిండిన;శాతకుంభాని=బంగారువికారములయినపాత్రలను ; మణిమయానిచ=రత్నవికారములయిన పాత్రలను;రాజతాని= వెండివికారములయిన;భాజనానిచ=పాత్రలను;అపశ్యత్=చూచెను.

ఆహనుమంతుఁడు, అచ్చట, మద్యముతో నిండియుండు, బంగారుపాత్రలను మణులతోఁ జేయఁబడిన పాత్రలను వెండిపాత్రలనుం, జూచెను.

అని, తాత్పర్యము.

క్వచి దర్ధావశేషాణి క్వచి త్పీతాని సర్వశః
క్వచి న్నైవ ప్రపీతాని పానాని స దదర్శహ. ౨౫

టీక॥ సః=ఆహనుమంతుఁడు;క్వచిత్=ఒకానొకచోట;అర్ధావశేషాణి=సగముమిగిలినదిగాఁగలవగు;పానాని=(అధ్యాహృతము) పానపాత్రలను;క్వచిత్=ఒకానొకచోట;సర్వశః = అంతయును; పీతాని = త్రాఁగఁబడినపాత్రలను;క్వచిత్=ఒకానొకచోట;నైవ ప్రపీతాని=ఎంతమాత్రముత్రాఁగఁబడకుండు;పానాని=పానపాత్రలను; దదర్శ=చూచెను "హ" అనునది పాదపూరణార్థము.

ఆహనుమంతుం డొకచోట సగముత్రాఁగిమిగిలిన మద్యముగలపాత్రలను, ఒకానొకచోటనంతయును త్రావఁబడినిశ్శేషముగానుండుపాత్రలను, ఒకచోట నెంతమాత్రమును త్రావఁగఁబడని మద్యముతోనిండియుండుపాత్రలనుజూచెను. అని, తాత్పర్యము.

క్వచి ద్భక్ష్యాంశ్చ వివిధా న్క్వచిత్పానాని భాగశః
క్వచి దన్నావశేషాణి పశ్యన్వై విచచారహ. ౨౬
క్వచి త్ప్రభిన్నైః కరకైః క్వచి దాలోళితై ర్ఘటైః
క్వచి త్సంపృక్తమాల్యాని జలానిచ ఫలానిచ. ౨౭
శయనా న్యత్ర నారీణాం శుభ్రాణి బహుధా పునః
పరస్పరం సమాశ్లిష్య కాశ్చి త్సుప్తా వరాంగనాః. ౨౮
కాశ్చిచ్చ వస్త్ర మన్యస్యా స్స్వపంత్యాః పరిధాయచ
ఆహృత్య చా బలా స్సుప్తా నిద్రాబలపరాజితాః. ౨౯

టీక॥ సః (అధ్యాహృతము)=ఆహనుమంతుఁడు; అత్ర=ఇచ్చట; క్వచిత్=ఒకానొకచోట; వివిధాన్=పలువిధములయిన=భక్ష్యాంశ్చ=పిండివంటలను; క్వచిత్=ఒకానొకచోట; భాగశః=వేఱువేఱుగా; పానాని=మద్యములను; క్వచిత్=ఒకానొకచోట; అన్నావశేషాణి=అన్నముయొక్క మిగతలను; క్వచిత్=ఒకానొకచోట; ప్రభిన్నైః=విఱిగిన; కరకైః=గిండివంటిపాత్రలతోను; క్వచిత్=ఒకానొకచోట; ఆలోళితైః=కలచఁబడిన; ఘటైః=కుంభములతోను; సహితాన్ ప్రదేశాన్(అధ్యాహృతము)=కూడినప్రదేశములను; క్వచిత్=ఒకానొకచోట; సంపృక్తమాల్యాని=సంబంధించినపుష్పమాలికలుగల; జలానిచ=నీళ్లను; ఫలానిచ=పండ్లను; బహుధా=అనేకవిధములయిన; శుభ్రాణి=నిర్మలములగు; నారీణాం=స్త్రీలయొక్క; శయనాని పునః=పాన్పులను; పరస్పరం=ఒండొరులను; సమాశ్లిష్య=కౌఁగిలించికొని; సుప్తాః=నిదురించిన; వరాంగనాః=శ్రేష్ఠస్త్రీలను; కాశ్చిత్=కొందఱను; నిద్రాబలపరాజితాః=నిద్రయొక్కయతిశయముచేఁ లోఁగొనబడినవారును; స్వపంత్యాః=నిదురించుచున్న; అన్యస్యాః=ఇతరస్త్రీయొక్క; వస్త్రం=వస్త్రమును; ఆహృత్యచ=తీసికొనియు; పరిధాయచ=కట్టుకొనియు; సుప్తాః=నిదురించినవారునగు; అబలాః=స్త్రీలను; కాశ్చిచ్చ=కొందఱను; పశ్యన్=చూచుచు; విచచార=తిరిగెను. "హ" అనునది పాదపూరణార్థము.

ఆహనుమంతుండు, ఒకచోట నానావిధములగు పిండివంటలను, ఒకచోట, వే

ఉ వేలుగనుంచఁబడియుండు మద్యములను, ఒకచోట భుజింపఁగామిగిలిన యన్నములను, మఱియొకచోటవిఱిగిపడియున్న ... పాత్రలనుగలఁచఁబడిన ఘటంబులను, ఒకచోటఁ బుష్పమాలికలతోఁగలసియుండుజలంబులను ఫలంబులను, మఱియు నానావిధంబులను నిమఱలంబులనగుస్త్రీలహాస్యములను, ఒండొరుంగౌఁగిలించికొనినిదురించుచున్నస్త్రీలంగొందఱును, ఇతరస్త్రీలు నిదురించుచుండఁగా, నిద్రావశంబునం దెలియక వారివస్త్రంబులం దీసికట్టుకొనినిదురించుచున్నస్త్రీలంగొందఱును, జూచుచు, సంచరించెను. అని, తాత్పర్యము.

తాసా ముచ్ఛ్వాసవాతేన వస్త్రం మాల్యంచ గాత్రజమ్
నాత్యర్థం స్పందతే చిత్రం ప్రాప్య మంద మివానిలమ్. ౩౦

టీక॥ తాసాం=ఆస్త్రీలయొక్క; ఉచ్ఛ్వాసవాతేన = నిట్టూర్పుగాలిచేత; గాత్రజం= దేహమునందుఁబుట్టిన; దేహమునందున్నయనుట; వస్త్రం=చీరయును; మాల్యంచ= పుష్పమాలికయును; మందం=తిన్నని; అనిలం= గాలిని; ప్రాప్యేవ=పొందినవలె; చిత్రం= చమత్కారమగునట్లుగా; నాత్యర్థం = కొంచెముగా; స్పందతే = కదలుచున్నది.

ఆవనితల నిట్టూర్పుగాలిసోఁకుటవలన, వారలుధరించుకొనియుండుచీరలునుబుష్పమాలికలును, మందమారుతంబు సోఁకుటకుంబలెఁ, గొంచెముగాఁగదలుచుండెను. అని, తాత్పర్యము.

చందనస్య చ శీతస్య శీధో ర్మధురస్య చ
వివిధస్య చ మాల్యస్య ధూపస్య వివిధస్య చ. ౩౧
బహుధా మారుత స్తత్ర గంధం వివిధ ముద్వహన్

టీక॥ తత్ర=అచ్చట; మారుతః = గాలి; శీతస్య=చల్లనైన; చందనస్యచ= చందనముయొక్కయు; మధురస్య చ=మధురమయినరుచిగల; శీధోశ్చ= మద్యముయొక్కయు; వివిధస్య = నానావిధమయిన; మాల్యస్యచ=పుష్పమాలికయొక్కయు; వివిధస్య= నానావిధమయిన; ధూపస్యచ = పొగయొక్కయు; వివిధం=నానావిధంబయిన; గంధం=వాసనను; ఉద్వహన్=వహించు

చు; బహుధా = అనేకవిధములుగా; ప్రవవౌ (అధ్యాహృతము) = వీచెను.

అప్పుడు, చల్లని చందనంబును మధురమయిన మద్యమును, నానావిధంబులయిన పుష్పహారికలును పలువిధంబులయిన ధూపంబులును గలుగుటవలన, వానిపైఁగా వచ్చుగాలి, మనోహరంబులగు సుగంధవాసనలంగూడి, వీచుచుండెను. అని, తాత్పర్యము.

స్నానానాం చందనానాంచ ధూపానాం చైవ మూర్ఛితః। ౩౨
ప్రవవౌ సురభిర్గంధో విమానే పుష్పకే తదా॥

టీక॥ తదా = అప్పుడు; పుష్పకే = పుష్పకమను; విమానే = విమానమునందు; స్నానానాం = స్నానములయొక్కయు; చందనానాంచ = చందనంబులయొక్కయు; ధూపానాంచైవ = పొగలయొక్కయు; సురభిః = మనోహరమయిన; గంధః = వాసన; మూర్ఛితః = వ్యాపించినదై; ప్రవవౌ = వీచుచుండెను (అనగా, చే) ఆగంధముతోఁ గూడినవాయువు వీచుచుండెననుట.

అప్పుడా పుష్పకవిమానంబునందు, స్నానయోగ్యంబులగు చందనంబులగంధంబును, ధూపంబులగంధమును, గలిగి, యన్నిప్రదేశంబులను వ్యాపించి, వాయువు, వీచుచుండెను.

అని, తాత్పర్యము.

శ్యామా వదాతా స్తత్రాన్యాః కాశ్చిత్కృష్ణా వరాంగనాః। ౩౩
కాశ్చిత్కాంచనవర్ణాంగ్యః ప్రమదా రాక్షసాలయే

టీక॥ తత్ర = ఆ; రాక్షసాలయే = రాక్షసుండగు రావణునింటియందు; శ్యామాః = ఆకుపచ్చనివర్ణముగలస్త్రీలును; వదాతాః = తెల్లనివర్ణముగల; అన్యాః = ఇతరస్త్రీలును; కృష్ణాః = నల్లనిరంగుగల; వరాంగనాః = శ్రేష్ఠస్త్రీలు; కాశ్చిత్ = కొందఱును; కాంచనవర్ణాంగ్యః = బంగారుయొక్క రంగువంటిరంగుగల దేహముగల, కాశ్చిత్ = కొందఱు; ప్రమదాః = స్త్రీలును; సుప్తాః (అధ్యాహృతము) = నిదురించినారలు.

అప్పుడు, రావణునంతఃపురమునందు, కొందఱాకుపచ్చనివన్నెగలస్త్రీలును, మఱికొందఱు తెల్లనిరంగుగల వార

లును, గొందఱునల్లనివనితలును, గొందఱుబంగారువర్ణంబుగల యువతులును, బరుండి, నిదురించుచుండిరి.

అని, తాత్పర్యము.

తాసాం నిద్రావశత్వాచ్చ మదనేన విమూర్ఛితమ్. ౩౪
పద్మినీనాం ప్రసుప్తానాం రూప మాసీ ద్యథైవ హి

టీక॥నిద్రావశత్వాచ్చ= నిద్రకులోఁబడు వగలిగియుండుటవలనను; మదనేన=మన్మథునిచేత, (లక్షణచే)రతిచేత; విమూర్ఛితం=అలసటనొందియున్నదియునగు; తాసాం=ఆస్త్రీలయొక్క; రూపం=రూపము; ప్రసుప్తానాం=నిదురించియున్న; పద్మినీనాం =తామరలయొక్క; రూపం (అధ్యాహృతము) యథైవ=రూపముఁబోలె; ఆసీత్ హి=ఉండెనుగదా!

ఆస్త్రీలు, తమిదీరసురతంబు గావించియలసినిద్రించియుండుటంజేసి, వారి రూపంబు, రాత్రివేళ, ముడుచుకొనియుండుకమలంబులుగలతామర తీఁగలరూపంబుంబోలె, నొప్పుచుండినది.

అని, తాత్పర్యము.

ఏవం సర్వ మశేషేణ రావణాంతఃపురం కపిః. ౩౫
దదర్శ సుమహాతేజా న దదర్శ చ జానకీమ్

టీక॥సుమహాతేజాః=మిక్కిలి యధికమయినకాంతిగల; కపిః= హనుమంతుండు; ఏవం=ఇట్లు; అశేషేణ=మిగతలేకుండుటచేత; రావణాంతఃపురం= రావణునియంతిపురంబును ; సర్వం= అంతను; దదర్శ=చూచెను . జానకీం చ=జనకునికూఁతురయినసీతనుమాత్రము; నదదర్శ=చూడలేదు.

మహాతేజుండగునా హనుమంతుండు, ఇట్లు, ఎంతమాత్రమునువిడువక, రావణునియంతఃపురంబంతయుఁ, గలయంజూచెను; సీతమాత్రమతని కగపడ లేదు. అని, తాత్పర్యము.

నిరీక్షమాణశ్చ తదా తా స్త్రీస్సయ స్స మహాకపిః. ౩౬
జగామ మహతీం చింతాం ధర్మసాధ్వసశంకితః

టీక॥ మహాకపిః=పెద్దకోఁతియయిన; సః=ఆహనుమంతుఁడు; తదా=అప్పుడు; తాః=ఆ; స్త్రియః=స్త్రీలను; నిరీక్షమాణశ్చ = చూచుచున్నవాఁడై యే; ధర్మసాధ్వసశంకితః=ధర్మము వలనిభయంబునభయపడినవాఁడై; మహతీం=అధికమయిన; చింతాం=తలంపును;జగామ=పొందెను.

ఆహనుమంతుం,డప్పుడు, ఆవనితలంజూచి,యంత ధర్మలోపంబునుగుఱించిభయపడి,యిట్లని,చింతించెను, అని, తాత్పర్యము.

పరదారావరోధస్య ప్రసుప్తస్య నిరీక్షణమ్. ౩౭
ఇదం ఖలు మమాత్యర్థం ధర్మలోపం కరిష్యతి

టీక॥ఇదం=ఈ; ప్రసుప్తస్య=నిదురించిన; పరదారావరోధస్య=ఇతరుని భార్యలయిన యంతఃపురజనము యొక్క;నిరీక్షణం=చూచుట;మమ=నాకు; అత్యర్థం=మిక్కిలియును; ధర్మలోపం=ధర్మంబుదఱుఁగుటను ; కరిష్యతిఖలు=చేయఁగలదుగదా!

ఇట్లు, సుఖనిద్రఁజెంది, విచ్చలవిడిగాఁబరుండియున్న, పరస్త్రీలం, జూచుటవలన, నాకు మిక్కిలియుధర్మలోపంబుగలుగును.

అని, తాత్పర్యము.

నహి మే పరదారాణాం దృష్టి ర్విషయవర్తినీ. ౩౮
అయం చాత్ర మయా దృష్టః పరదారపరిగ్రహః

టీక॥మే=నాయొక్క;దృష్టిః=చూచుట; పరదారాణాం=పరస్త్రీలయొక్క; విషయవర్తినీ=విషయమునందున్నది;నహి=కాదుగదా!అయం=ఈ; పరదారపరిగ్రహశ్చ=(ఇచ్చటదారశబ్దమునుపరిగ్రహశబ్దమునుసమానార్థకములుగావున, ఈరెంటిలోనొకటివ్యర్థమనిచెప్పవలయును; అందు,పరిగ్రహశబ్దము,"అయం"అనుదానితోనేకవచన స్వారస్యము నొందియున్నందున, దారశబ్దమువ్యర్థమని యేర్పడుచున్నది)పరస్త్రీజనమును; దృష్టః=చూడఁబడినది.

నేను,బరస్త్రీలం జూడవలయునని తలంపునం,జూడలేదు; అయితే, నేను సీతంజూడవలయుననిచూచుచు, నీపర

స్త్రీలనుం జూచితిని. అని, హనుమంతుండు, చింతించెను. అని, తాత్పర్యము.

తస్య ప్రాదు రభూ చ్చింతా పున రన్యా మనస్వినః. ౩౮
నిశ్చితై కాంతచిత్తస్య కార్యనిశ్చయ దర్శినీ

టీక॥ మనస్వినః=మంచిమనసు గలవాఁడును; నిశ్చితైకాంతచిత్తస్య=నిశ్చయముగల యేకరూపమయిన మనసు గలవాఁడునగు; తస్య=ఆహనుమంతున కు; కార్యనిశ్చయదర్శినీ = యుక్తమయిన దానినిశ్చయమునుజూపునట్టి; పునః=ఇంకను; అన్యా = ఇతరమయిన; చింతా=తలంపు; ప్రాదురభూత్= కలిగినది.

పరిశుద్ధ మయినదియునియతమును వేఱు పాటు లేనిదియునగు మనసుగల, యాహనుమంతునకు, సిద్ధాంతమును దెల్పుమఱి యొక్క తలంపుగలిగినది. అని, తాత్పర్యము.

కామం దృష్టా మయా సర్వా విశ్వస్తా రావణ స్త్రియః. ౪౦
నహి మే మనసః కించి ద్వైకృత్య ముపపద్యతే

టీక॥ మయా=నాచేత; విశ్వస్తాః=నమ్మకముతోఁగూడియున్న; రావణ స్త్రియః=రావణునిభార్యలు; సర్వాః=అందఱును; కామం = చక్కఁగా; దృష్టాః=చూడఁబడినారు. మే = నాయొక్క; మనసః=మనసునకు; కించిత్=కొంచెమైనను; వైకృత్యం= వికారము; నోపపద్యతేహి=కలుగలేదుగదా!

ఇచ్చటికిఁ బురుషులుమఱియెవ్వరు నురాలేరనునమ్మకంబునంజేసి విచ్చలవిడిగాలజ్జవిడిచిపరుండి నిదురించుచున్న రావణభార్యలనందఱను లెస్సగాఁ జూచినాను; అయినను నామనసున కెంతమాత్రము, వారలపైమన్మథవికారము లుగలుగలేదు; కావున, నాకేదోషంబును లేదు. అని, తాత్పర్యము.

మనోహి హేతు స్సర్వేషా మింద్రియాణాం ప్రవర్తనే. ౪౧
శుభాశుభా స్వవస్థాసు తచ్చ మే సువ్యవస్థితమ్

టీక॥ శుభాశుభాసు=మంగళకరములునుఅమంగళకరములునగు; అవస్థాసు=

స్థితులందు ; ఇంద్రియాణాం = ఇంద్రియములయొక్క; ప్రవర్తనే= ప్రవర్తించుటయందు; మనః = మనసు; హేతుహి = కారణముగదా! తచ్చ=ఆమనసును; మే=నాకు; సువ్యవస్థితం=మిక్కిలియుస్థిరమయినది!

ధర్మమునందుగాని యధర్మమునందుగానియింద్రియములు ప్రవర్తించుటకు, మనసేకారణము ; మనసు,చలించినంగాని యవిప్రవర్తింపవు; నామనసు,ఆస్త్రీలమోహింపకస్థిరముగానున్నది. అని, తాత్పర్యము.

నాన్యత్రహి మయాశక్యా వైదేహీ పరిమార్గితుమ్. ౪౨
స్త్రియోహి స్త్రీషు దృశ్యంతే సదా సంపరిమార్గణే

టీక॥ వైదేహీ=సీత;అన్యత్ర=మఱియొకచోట;మయా = నాచేత;పరిమార్గితుం=వెదకుటకు;నశక్యాహి=కూడినదికాదుగదా ! సదా=ఎల్లప్పుడును;పరిమార్గణే= వెదకుటకాగా; స్త్రియః=స్త్రీలు;స్త్రీషు=స్త్రీలయందు;దృశ్యంతేహి= చూడఁబడుచున్నారుగదా!

ఎప్పుడును, వెదకినట్లయిన,స్త్రీలయందేస్త్రీలగపడుదురు;గాని , పురుషులయందగపడరు;కావున,ఈస్త్రీలనువిడిచి మఱియొకచోట, నేనుసీతనువెదకఁజాలను.అని తాత్పర్యము.

యస్య సత్వస్య యా యోని స్తస్యాం తత్పరిమార్గ్యతే. ౪౩
న శక్యా ప్రమదా నష్టా మృగీషు పరిమార్గితుమ్

టీక॥ యస్య=ఏ;సత్వస్య= జంతువునకు;యా=ఏది; యోనిః=జాతియో; తస్యాం=ఆజాతియందు ; తత్=ఆజంతువు;పరిమార్గ్యతే=వెదకఁబడుచున్నది.నష్టా=అగపడనట్టి; ప్రమదా=స్త్రీ; మృగీషు=లేళ్లయందు;పరిమార్గితుం= వెదకుటకు; శక్యాన=కూడనదికాదు.

ఏజంతువేజాతియందుఁజేరియున్నదో,ఆజాతియందుఆజంతువునువెదకవలయును; అట్లుగావున,స్త్రీయగపడకపోవునేని, దానికి సజాతీయ లయిన స్త్రీలయందేవెదకవలయును; గాని,లేళ్లయందెట్లు వెదకవచ్చును?
అని, తాత్పర్యము.

తదిదం మార్గితం తావ చ్ఛుద్ధేన మనసా మయా. ౪౪
రావణాంతఃపురం సర్వం దృశ్యతే న చ జానకీ

టీక॥ మయా=నాచేత; శుద్ధేన=దోషములేని; మనసా= మనసుచేత; తత్=అట్టి; ఇదం=ఈ; రావణాంతఃపురం= రావణునియంతఃపురము; సర్వం=అంతయును; మార్గితం=వెదకఁబడినది;("తావత్" అనునదివాక్యాలంకారార్థకము) జానకీచ= సీతమాత్రము;నదృశ్యతే=చూడఁబడలేదు.

నేను,బరిశుద్ధంబగుహృదయంబున, రావణుని యంతఃపురంబంతయుఁ గల యవెదకినాను;సీతంగానలేనైతి. అని, హనుమంతుండు,చింతించెను.

అని, తాత్పర్యము.

దేవగంధర్వకన్యాశ్చ నాగకన్యాశ్చ వీర్యవాన్. ౪౫
అవేక్షమాణో హనుమా నైవాపశ్యత జానకీమ్

టీక॥వీర్యవాన్= అధికమయిన పరాక్రమముగల;హనుమాన్ = హనుమంతుఁడు; దేవగంధర్వకన్యాశ్చ=దేవకన్యలను గంధర్వకన్యలను; నాగకన్యాశ్చ=నాగకన్యకలను ; అవేక్షమాణః=చూచుచు;జానకీం=సీతను; నైవాపశ్యత(నైవాపశ్యత్)=చూడనేలేదు.

పరాక్రమశాలియగు హనుమంతుఁడు, దేవకన్యలనుగంధర్వకన్యలను నాగకన్యలను జూచెను,గాని, సీతనుమాత్రము గానఁడయ్యె.

అని, తాత్పర్యము.

తా మపశ్య న్కపి స్తత్ర పశ్యం శ్చాన్యా వరస్త్రియః. ౪౬
అపక్రమ్య తదా వీరః ప్రధ్యాతు ముపచక్రమే

టీక॥తదా=అప్పుడు; వీరః=పరాక్రమశాలియగు ; కపిః=హనుమంతుఁడు;తత్ర=అచ్చట;తాం=ఆసీతను ; అపశ్యన్= చూడనివాఁడై; అన్యాః=ఇతరలయిన;వరస్త్రియః= శ్రేష్ఠస్త్రీలను;పశ్యంశ్చ=చూచుచును;అపక్రమ్య=వెనుకకుఁదిరిగి; ప్రధ్యాతుం=ఆలోచించుటకు;ఉపచక్రమే=అరంభించెను.

అప్పుడు, పరాక్రమశాలియగుహనుమంతుండచ్చట,సీతంగానక , ఇతర

స్త్రీలంజూచి,యంత, వెనుకకుఁదిరిగి, ఇట్లనియాలోచింపనారంభించెను.

అని, తాత్పర్యము.

స భూయస్తు పరం శ్రీమాన్ మారుతి ర్యత్న మాస్థితః. ౪౯
ఆపానభూమి ముత్సృజ్య త ద్విచేతుం ప్రచక్రమే

టీక॥శ్రీమాన్=అందఱికన్ననధికుఁడయిన;సః=ఆ; మారుతిః=వాయువుకొడుకైనహనుమంతుఁడు ; భూయస్తు=మఱలను;పరం=అధికమయిన;యత్నం=ప్రయత్నమును;ఆస్థితః=అవలంబించినవాఁడై;ఆపానభూమిం= పానభూమిని;ఉత్సృజ్య=విడిచి;తత్ = ఆ రావణునియంతఃపురమును; విచేతుం=వెదకుటకు;ప్రచక్రమే=ఆరంభించెను.

అందఱికన్ననధికుండగు హనుమంతుఁడు,మఱలమహాయత్నంబున,పానభూమివిడిచి , రావణునియంతఃపురంబంతయు,వెదకనారంభించెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, ఏకాదశస్సర్గః.
ఇది,స్పష్టార్థము.
ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, సుందరకాండైకాదశసర్గ టీక,
ముగిసినది.

---

౧౨

ద్వాదశసర్గప్రారంభః.

స తస్య మధ్యే భవనస్య మారుతి
ర్లతాగృహాం శ్చిత్రగృహా న్నిశాగృహాన్
జగామ సీతాం ప్రతి దర్శనోత్సుకో
న్నచైవ తాం పశ్యతి చారుదర్శనామ్. ౧

టీక॥ సః=ఆ; మారుతిః=వాయుపుత్రుడుకైనహనుమంతుఁడు; సీతాంప్రతి=సీతనుగూర్చి; దర్శనోత్సుకః=చూచుటయందుత్సాహముగలవాఁడై; తస్య=ఆ; భవనే=రావణ గృహముయొక్క; మధ్యే=నడుమునందు; లతాగృహాన్ = తీఁగెలయిండ్లను; చిత్రగృహాన్ = చిత్తరువులతోఁగూడినయిండ్లను; నిశాగృహాన్= రాత్రులునివసింపఁదగినయిండ్లను; జగామ=పొందెను. చారుదర్శనాం= సుందరములయినకండ్లుగల; తాం= ఆసీతను; నైవపశ్యతి= చూడనేలేదు.

ఆహనుమంతుండు, సీతంజూడఁగోరి, ఆయింటనుండు, లతాగృహంబులనుజిత్రగృహంబులను రాత్రికాలంబులనివసించు గృహంబులనుం, గలయ వెదకియు, సుందరనేత్రంబులుగలయాసీతంగానఁడయ్యె. అని, తాత్పర్యము.

స చింతయామాస తతో మహా కపిః
ప్రియా మపశ్య న్రఘునందనస్య తామ్

టీక॥ తతః=అటుపిమ్మట; మహాకపిః=పెద్దకోఁతియగు; సః=ఆహనుమంతుఁడు; రఘునందనస్య =రామునియొక్క; ప్రియాం=ప్రియురాలైన; తాం= ఆసీతను; అపశ్యన్ = చూడనివాఁడై; చింతయామాస=ఆలోచించెను.

అంతనాహనుమంతుండు, ఎంతవెదకినను, రాముని ప్రియభార్యయగు సీతయగపడకుండుటంజేసి, యిట్లని, యాలోచించెను. అని, తాత్పర్యము,

ధ్రువంహి సీతా మ్రియతే యథా న మే
విచిన్వతో దర్శన మేతి మైథిలీ. ౨
("మ్రియతే=థవానమే"ఇతి, గోవిందరాజమతేపాఠాంతరం)

టీక॥యథా=ఎందువలన; మైథిలీ= సీత; విచిన్వతః=వెదకుచున్నట్టి; మే = నాయొక్క; దర్శనం = చూచుటను; నైతి=పొందదో; తతః (అధ్యాహృతము)=అందువలన ; సీతా=సీత; ధ్రువం=నిశ్చయముగా; మ్రియతేహి=మృతినొందెనుగదా!

నేనెంత వెదకినను, అగపడకుండుట

వలన,నిశ్చయముగాసీతచచ్చియుండును. అని,తాత్పర్యము.

లేక, పాఠాంతరపక్షమందు ; సీతా=సీత;ధ్రువం=నిశ్చయముగా;మ్రియతేహి= చచ్చినదా? అథవా=లేనిచో;విచిన్వతః = వెదకుచున్నట్టి;మే=నాయొక్క;దర్శనం= చూచుటను;నైతి=పొందదా?

సీతనిజముగాఁజచ్చియుండునా? లేక, ఎచ్చటనోయొకగహనప్రదేశమునందుదాఁచఁబడినదై , నాకగపడకున్నదా? అని,తాత్పర్యము.

సా రాక్షసానాం ప్రవరేణ జానకీ
స్వశీలసంరక్షణతత్పరా సతీ
అనేన నూనం ప్రతిదుష్టకర్మణా
హతా భవే దార్య పథే పరే స్థితా. ౩

టీక॥ పరే = ఉత్కృష్టమయిన;ఆర్యపథే=సన్మార్గమునందు;స్థితా= ఉన్న; సా=ఆ;జానకీ=సీత;స్వశీలసంరక్షణతత్పరా సతీ = తనసదాచారముయొక్క-కాపాడుకొనుటయందాసక్తురాలగుచు;ప్రతిదుష్టకర్మణా=మిక్కిలియుచెడ్డవైనకార్యములుగలవాఁడును;రాక్షసానాం=రాక్షసులలో; ప్రవరేణ=శ్రేష్ఠుండునగు; అనేన = ఈరావణునిచేత;హతా = చంపఁబడినదై;భవేత్=అగును.నూనం=నిశ్చయము!

ఉత్కృష్టంబగు పాతివ్రత్యరూపసన్మార్గమునవలంబించియున్నసీత, తన్నురావణుండెంతనిర్బంధించినను దనపాతివ్రత్యమును విడువకుండుటంజేసి, ఈరావణుండు, అతిదుష్టకార్యంబులనైనను,ఎంతమాత్రమునరకుసేయక, సేయువాఁడు,కావున, సీతం జంపియుండును. అని,తాత్పర్యము.

విరూపరూపా వికృతా వివర్ణసో
మహాననా దీర్ఘ విరూపదర్శనాః
సమీక్ష్య సా రాక్షసరాజయోషితో
భయా ద్వినష్టా జనకేశ్వరాత్మజా. ౪




టీక॥సా=ఆ; జనకేశ్వరాత్మజా=జనకమహారాజుకొమార్తెయగు సీత; విరూపరూపాః = వికృతములయిన యాకారములుగలవారలును; వికృతాః=వికారముగలవారలును; వివర్చసః=కాంతిలేనివారలును;మహానసాః=పెద్దనోరుగలవారలును;దీర్ఘ విరూపదర్శనాః=నిడుపయినవియువికృతములయినవియునగుకండ్లుగలవారలునగు; రాక్షసరాజయోషితః= రాక్షసులకుఁ బ్రభువైనరావణునియొక్క స్త్రీలను, దాసీజనములననుట;సమీక్ష్య=చూచి; భయాత్=భయమువలన;వినష్టా=మృతినొందినది.

జనకమహారాజు కొమార్తెయగు నాసీత, వికృతములయిన యాకారములును,వికృతవేషంబులునుగలిగి, యెంతమాత్రమునుకాంతిలేనివారలై, పెద్దనోరునునిడుపులయినవికృత నేత్రంబులును గలిగియుండు,రావణుని పనికత్తెలంజూచి,భయపడి,చచ్చియుండును.

అని, తాత్పర్యము.

సీతా మదృష్ట్వా హ్యనవాప్య పౌరుషమ్
విహృత్యకాలం సహ వానరైశ్చిరమ్
నమేస్తి సుగ్రీవసమీపగా గతి
స్సుతీక్ష్ణదండో బలవాంశ్చ వానరః. ౫

టీక॥సీతాం=సీతను; అదృష్ట్వా=చూడక; పౌరుషం = పరాక్రమమును;అనవాప్య =పొందక; చిరం=అధికమయిన;కాలం=కాలమును;వానరైస్సహ=వానరులతోఁగూడ; విహృత్య=ఆటలాడి; మే=నాకు ; సుగ్రీవసమీపగా=సుగ్రీవునిసమీపమును బొందునట్టి; గతిః=మార్గము;నాస్తి=లేదు. వానరః=సుగ్రీవుఁడు; సుతీక్ష్ణదండః=మిక్కిలియుఁగ్రూరమయినశిక్షగలవాఁడు. బలవాంశ్చ=అధికమయినబలిమిగలవాఁడును.

సీతంజూడక, శత్రువులపైఁ బరాక్రమంబుచూపక,బహుకాలమువానరులతోనాటలాడి,యిప్పుడు సుగ్రీవునొద్దకుఁబోవుటకు,నాకేమియునుపాయము లేదు;పోవుదునేని,యతండు , బలవంతుండునుఅతిక్రూరముగాదండించువాఁడును,గావున,నాప్రాణంబులం గొనును.అని, తాత్పర్యము.




దృష్ట మంతఃపురం సర్వం దృష్టా రావణ యోషితః
న సీతా దృశ్యతే సాధ్వీ వృథా జాతో మమ శ్రమః. ౬

టీక॥ అంతఃపురం=అంతిపురము; సర్వం=అంతయును;దృష్టం= చూడఁబడినది.రావణయోషితః = రావణుని భార్యలు;దృష్టాః = చూడఁబడినారు; సాధ్వీ=పతివ్రతయగు; సీతా=సీత;న దృశ్యతే=చూడఁబడఁలేదు.మమ=నా యొక్క;శ్రమః=ప్రయాసము;వృథా= వ్యర్థము; జాతః=అయినది.

రావణునియంతఃపురం బంతయుఁ గలయంజూచితిని; రావణుని భార్యల నందఱనుం,జూచినాను; పతివ్రతయగు సీతను మాత్రముగానలేనైతి; నాప్రయాసము వ్యర్థమయినది.

అని, తాత్పర్యము.

కిన్ను మాం వానరా స్సర్వే గతం వక్ష్యంతి సంగతాః

టీక॥వానరాః=వానరులు;సర్వే= అందఱును;సంగతాః=చేరినవారలై; గతం=పోయిన; మాం=నన్నుఁగూర్చి; కిన్ను=ఏమి;వక్ష్యంతి=చెప్పుదురు?

సీతంజూడక, నేనచ్చటికిఁబోఁగా నే,నన్నుఁజూచి, యంగదాది వానరు లందఱునొకటిగాఁజేరి, యేమియడుగుదురు? అని, తాత్పర్యము.

గత్వా తత్ర త్వయా వీర కిం కృతం తద్వదస్వ నః. ౭

టీక॥వీర=పరాక్రమశాలివగుహనుమంతుఁడా!త్వయా=నీచేత;తత్ర= ఆ లంకకు;గత్వా=పోయి;కిం=ఏమి; కృతం=చేయఁబడినది?తత్=దానిని;నః= మాకొఱకు;వదస్వ=చెప్పుము. ఇతివక్ష్యంతి(అధ్యాహృతము)=అని, చెప్పుదురు.

"హనుమంతుఁడా!నీవుచాలఁ బరాక్రమశాలివి,లంకకుఁబోయియేమేమిచేసినావు;మాకదిచెప్పుము".అని,నన్నడుగుదురు.

అని, తాత్పర్యము.

అదృష్ట్వా కిం ప్రవక్ష్యామి తా మహం జనకాత్మజామ్

టీక॥అహం=నేను;తాం=ఆ; జనకాత్మజాం= జనకునికూఁతురైనసీతను;

అదృష్ట్వా=చూడక; కిం=ఏమిటిని; ప్రవక్ష్యామి=చెప్పఁగలను.

నేను, సీతం జూడక, యిచ్చటికిం బోయి, వారలట్లుగుడుటకు, ఏమిబదులు చెప్పఁగలను?

అని, తాత్పర్యము.

ధ్రువం ప్రాయ ముపైష్యంతి కాలస్య వ్యతివర్తనే. ౮

టీక॥ వానరాః(అధ్యాహృతము)=అంగదాదివానరులు; కాలస్య=నేనచ్చటికిం బోవునట్టి కాలముయొక్క; వ్యతివర్తనే=అతిక్రమించుట కాఁగా; ధ్రువం=నిశ్చయముగా; ప్రాయం=మరణమును; ఉపైష్యంతి=పొందఁగలరు.

నేనువారలయొద్దకుఁబోకుందునేని, నేను రాఁదగు కాలమువఱకుఁ గాచియుండి, యాపైని, వారలందఱు, ఎట్లయినను, మరణంబునొందుదురు; ఇదినిజము.

అని, తాత్పర్యము.

కిం వా వక్ష్యంతి వృద్ధశ్చ జాంబవా నంగదశ్చ సః
గతం పారం సముద్రస్య వానరాశ్చ సమాగతాః. ౯

టీక॥ వృద్ధః = ముదుసలియాయిన; జాంబవాంశ్చ = జాంబవంతుండును; సః=ఆ; అంగదశ్చ=అంగదుండును; సమాగతాః = వచ్చియున్న; వానరాశ్చ=వానరులును; సముద్రస్య=సముద్రముయొక్క; పారం= తుదనుపొందినట్టి; మాం(అధ్యాహృతము)=నన్నుఁగూర్చి; కిం=ఏమి; వక్ష్యంతివా=చెప్పుదురో!

వృద్ధుండగుజాంబవంతుండు, నంగదుండును, మఱియునచ్చటికి, సీతను వెదకుటకై వచ్చియున్నయితరవానరులునుసముద్రంబుతుదనుబొందిననన్నుఁజూచి, ఏమే మోనిందింపఁగలరు.

అని, తాత్పర్యము.

అనిర్వేద శ్శ్రియో మూల మనిర్వేదః పరం సుఖమ్
అనిర్వేదోహి సతతం సర్వార్థేషు ప్రవర్తకః. ౧౦

టీక॥ అనిర్వేదః=విసువకుండుట; శ్రియః=సంపదకు; మూలం=కారణము;

అనిర్వేదః=విసువకుండుట; పరం= అధికమయిన;సుఖం = సుఖముగల్గించున ది. అనిర్వేదః = విసువకుండుట; సతతం=ఎల్లప్పుడును;సర్వార్థేషు=సమస్తకార్యములందును;ప్రవర్తకోహి= ప్రవర్తింపఁజేయునదిగదా!

విసుగులేకుండుట (ఉత్సాహము) వలన, సంపదగలుగును ; విసుగులేకుండుటవలననే, అధికమయినసుఖంబుగలుగును; విసుకులేకుండుటవలననే, పురుషుండు, ఏకార్యమునందైనను బ్రవర్తించును. అని, తాత్పర్యము.

కరోతి సఫలం జంతోః కర్మయ త్తత్కరోతి సః

టీక॥ యత్=ఏ; కర్మ = కార్యమును;జంతుః (అధ్యాహృతము)=జనము ; కరోతి=చేయుచున్నదో ; జంతోః=జనముయొక్క;తత్ = ఆకార్యమును; సః=ఆవిసుగులేకుండుట; సఫలం= ఫలముతోఁగూడినదానిఁగా;కరోతి=చేయుచున్నది.

జనమేయేకార్యమును జేయుచున్నదో, ఆకార్యములనన్నిటిని, ఉత్సాహముసఫలములుగాఁ జేయుచున్నది. అని, తాత్పర్యము.

తస్మాదనిర్వేదకృతం యత్నం చేష్టే హ ముత్తమమ్. ౧౧

టీక॥తస్మాత్= అందువలన ; అహం= నేను;ఉత్తమం= శ్రేష్ఠమయిన; అనిర్వేదకృతం = ఉత్సాహముచేఁజేయఁబడిన;యత్నం= ప్రయత్నమును; చేష్టే=చేసెదను.

అందువలన, నేనును , ఆయుత్సాహంబునవలంబించి , సీతనువెదకువిషయమైమఱల,నుత్తమంబయినప్రయత్నముఁజేసెదను. అని, తాత్పర్యము.

భూయ స్తావ ద్విచేష్యామి దేశా న్రావణ పాలితాన్

టీక॥అహం(అధ్యాహృతము)=నేను;రావణపాలితాన్= రావణునిచేఁ బాలింపఁబడిన;దేశాన్= ప్రదేశములను;భూయః=మఱలను,("తావత్" అనునదివాక్యాలంకారార్థము) ; విచేష్యామి=వెదకెదను.

నేను, రావణునిచేఁ బాలింపఁబడినలంకలోని ప్రదేశములనన్నింటిని, మఱల, వెదకెదను. అని, తాత్పర్యము.

ఆపానశాలా విచితా స్తథా పుష్పగృహాణిచ. ౧౨
చిత్రశాలాశ్చ విచితా భూయః క్రీడాగృహాణిచ
నిష్కుటాంతరరథ్యాశ్చ విమానానిచ సర్వశః. ౧౩

టీక॥ అహం(అధ్యాహృతము)=నేను; విచితాః= వెదకఁబడిన; ఆపానశాలాః=పానభూములను; తథా=అట్లు వెదకఁబడినయనుట ; పుష్పగృహాణిచ=పూలయిండ్లను; విచితాః=వెదకఁబడిన; చిత్రశాలాశ్చ =చిత్తరువులతోఁగూడినయిండ్లను ; విచితాని (అధ్యాహృతము) = వెదకఁబడిన; క్రీడాగృహాణిచ= క్రీడించుటకొఱకునిర్మింపఁబడినయిండ్లను; విచితాః (అధ్యాహృతము)= వెదకఁబడిన; నిష్కుటాంతరరథ్యాశ్చ = ఇంటితోఁటలనడుమనుండువీధులను ; విచితాని (అధ్యాహృతము)=వెదకఁబడిన ; విమానానిచ=విమానములను; సర్వశః=అన్నిటిని; భూయః=మఱల; విచేష్యామి (అధ్యాహృతము)=వెదకెదను.

పానభూములను, బూలు గప్పఁబడియుండుగృహంబులును , చిత్తరువులు వ్రాసియుండుగృహంబులను, క్రీడాగృహంబులును, ఇంటితోఁటలనడుమనుండువీధులను, విమానంబులను, ఇవన్నియు, ఇదివఱకు వెదకఁబడినవే ; అయినను. మఱల వెదకెదను. అని, హనుమంతుండు, ఆలోచించెను. అని, తాత్పర్యము.

ఇతి సంచింత్య భూయోపి విచేతు ముపచక్రమే
భూమీగృహాం శ్చైత్యగృహాన్ గృహాతిగృహకానపి. ౧౪

టీక॥ సః (అధ్యాహృతము)=ఆహనుమంతుఁడు; ఇతి=ఇట్లు; సంచింత్య= ఆలోచించి; భూయోపి=మఱలను; భూమీగృహాన్= భూమిలోపలనిర్మింపఁబడినయిండ్లను; చైత్యగృహాన్ =నాలుగుమార్గములుకలయుదారులందుఁగట్టఁబడినమండపంబులను; గృహాతిగృహకానపి=ఇండ్లనతిక్రమించివిహారార్థము

గాఁగొంచెముదూరమునందు నిర్మింపఁబడినయిండ్లను;విచేతుం = వెదకుటకు; ఉపచక్రమే=ఆరంభించెను.

ఆహనుమంతుఁ,డిట్లాలోచించి, మఱల, నేలలోపలఁగట్టఁబడిన గృహంబులను,నాలుగుదారులుకలయు మాగ౯మునందునిర్మితములగు గృహంబులను గృహంబులకు కొంచెము దూరముగా విహారార్థముగనిర్మితంబులగుగృహంబులను, వెదకనారంభించెను.

అని, తాత్పర్యము.

ఉత్పత న్నిపతంశ్చాపి తిష్ఠ న్గచ్ఛ౯ పునః పునః
అపావృణ్వంశ్చ ద్వారాణి కవాటా న్యవఘాటయ౯. ౧౫
ప్రవిశ న్నిష్పతంశ్చాపి ప్రపత న్నుత్పత న్నపి
సర్వ మప్యవ కాశం స విచచార మహాకపిః. ౧౬

టీక॥ మహాకపిః= పెద్దకోఁతియగు; సః=ఆహనుమంతుఁడు ; పునఃపునః= మాటిమాటికి;ఉత్పత౯ = పైకెగురుచు;నిపతంశ్చాపి = క్రిందికిఁ బడుచును;తిష్ఠ౯=నిలుచుచు; గచ్ఛ౯=పోవుచు;ద్వారాణి= వాకిళ్లను ; అపావృణ్వంశ్చ=తెఱచుచును;కవాటాని=తలుపులను; అవఘాటయ౯ = పడఁద్రోయుచు;ప్రవిశ౯=ప్రవేశించుచు ; నిష్పతంశ్చాపి=వెడలుచును; ప్రపత౯=క్రిందికిదిగుచు; ఉత్పతన్నపి= పైకెగురుచును;అవకాశం=ప్రదేశమును; సర్వమపి=అంతను;విచచార=తిరిగెను.

ఆహనుమంతుండు,మాటిమాటికి, ఉన్నతస్థలంబులపైకెగురుచు,నంతఁక్రిందికిదిగుచు, నిలిచిచూచుచు,నంతనవ్వలికిఁబోవుచు,వాకిళ్లఁదెఱచుచుఁ, దలపులంబడఁద్రోయుచు,గృహంబులలోనికిఁజొరుచు,బయలు వెడలుచు , భూమిగృహంబులలోనికిం దిగుచు,అంతఁబైకి వచ్చుచు,నిల్లు,అన్నిప్రదేశంబులను, సీతను వెదకుచు,సంచరించెను.

అని,తాత్పర్యము.

చతురంగుళమాత్రోపి నావకాశ స్స విద్యతే
రావణాంతఃపురే తస్మి౯ యం కపి ర్న జగామ సః. ౧౭

టీక॥ తస్మిక్ = ఆ; రావణాంతఃపురే=రావణుని యంతఃపురంబునందు ; సః=ఆ; కపిః=హనుమంతుఁడు; యం=ఏప్రదేశమును; నజగామ = పొందలేదో; సః = అట్టి; చతురంగులమాత్రః=నాలుగంగులములంతటి; చేతేఁడనుట ; అవకాశోపి= ప్రదేశమయినను; నవిద్యతే=లేదు.

రావణుని యంతఃపురంబున బెత్తెఁడుప్రదేశమయినను, హనుమంతుండు సంచరింపనిది, లేదు.

అని, తాత్పర్యము.

ప్రాకారాంతరరథ్యాశ్చ వేదికాశ్చైత్య సంశ్రయాః
దీర్ఘికాః పుష్కరిణ్యశ్చ సర్వం తేనావలోకితమ్. ౧౮

టీక॥ ప్రాకారాంతరరథ్యాశ్చ = ప్రాకారముల నడుమనుండువీథులును; చైత్య సంశ్రయాః = రచ్చమ్రానులయందునిగ్గగల; వేదికాః=తిన్నెలును; దీర్ఘికాః = నడబావులును; పుష్కరిణ్యశ్చ=కోనేఱులును ; సర్వం=అంతయును; తేన=ఆహనుమంతునిచేత; అవలోకితం=చూడఁబడినది.

హనుమంతుండు, ప్రాకారంబుల నడుమనుండువీథులును, రచ్చమ్రానులఁజేరిన తిన్నెలును, నడబావులును, కోనేఱులును, అన్నిటిని, జూచెను,

అని, తాత్పర్యము.

రాక్షస్యో వివిధాకారా విరూపా వికృతాస్తథా
దృష్టా హనుమతా తత్ర నతు సా జనకాత్మజా. ౧౯

టీక॥ తత్ర=అచ్చట; హనుమతా=హనుమంతునిచేత; వివిధాకారాః = నానావిధములయిన యాకారములు గలవారును; విరూపాః= వికృతమయిన దేహముగలవారును; తథా=అట్లు; వికృతాః=వికారముగలవారలునగు; రాక్షస్యః=రాక్షసస్త్రీలు; దృష్టాః=చూడఁబడినారు. సా=ఆ; జనకాత్మజాతు=జనకునికూఁతురయినసీతమాత్రము; న (దృష్టా)=చూడఁబడలేదు.

హనుమంతుం డచ్చట నానావిధంబులగునాకారములు వికృతరూపలయి

వికృతలయియుండు రాక్షసస్త్రీలంజూచెను, గాని, సీతంజూడఁడయ్యె.

అని, తాత్పర్యము.

రూపేణాఽప్రతిమా లోకే వరా విద్యాధరస్త్రియః
దృష్టా హనుమతా తత్ర నతు రాఘవనందినీ. ౨౦

టీక। తత్ర=అచ్చట; హనుమతా=హనుమంతుని చేత; లోకే=ప్రపంచమునందు; రూపేణ=సౌందర్యము చేత; అప్రతిమాః=సరిలేనివారలును; వరాః=శ్రేష్ఠలునుగు; విద్యాధరస్త్రియః=విద్యాధరస్త్రీలు; దృష్టాః=చూడఁబడినారు, రాఘవనందినీతు = రామునిసంతసింపఁజేయునట్టి సీతమాత్రము ; న (దృష్టా)=చూడఁబడదయ్యె.

హనుమంతుండచ్చట, సౌందర్యంబున, లోకమునందెచ్చటను, సరిలేక, వెలుంగుచుండు, విద్యాధరస్త్రీలం, జూచెను, కాని, రామునిసంతోషింపఁజేయునట్టి సీతనుమాత్రము చూడలేఁడయ్యె.

అని, తాత్పర్యము.

నాగకన్యా వరారోహాః పూర్ణచంద్రనిభాననాః
దృష్టా హనుమతా తత్ర నతు సీతా సుమధ్యమా. ౨౧

టీక॥ తత్ర=అచ్చట; హనుమతా=హనుమంతుని చేత; వరారోహాః=గొప్పపిఱుదులుగలవారలును; పూర్ణచంద్రనిభాననాః=నిండుచందురునితో సాటియయిన ముఖముగలవారలునగు; నాగకన్యాః=నాగకన్యకలు; దృష్టాః= చూడఁబడినారు; సుమధ్యమా=సుందరమయిన నడుముగల; సీతాతు= సీతమాత్రము; న (దృష్టా)=చూడబడలేదు.

హనుమంతుండచ్చట, గొప్పపిఱుందులు గల్గి నిండుచందురునింబోలు ముఖంబుతోనొప్పుచుండు నాగకన్యకలం, జూచెను; కానిసుందరమగు నడుముగలసీతనుమాత్రముగానఁడయ్యె.

అని, తాత్పర్యము.

ప్రమథ్య రాక్షసేంద్రేణ నాగకన్యా బలాద్ధృతాః

దృష్టా హనుమతా తత్ర న సా జనకనందినీ. ౨౨

టీక॥ తత్ర=అచ్చట; హనుమతా=హనుమంతునిచేత; రాక్షసేంద్రేణ=రాక్షసులకుప్రభువుడగురావణునిచేత; బలాత్=బలమువలన; ప్రమథ్య=బలాత్కరించి; హృతాః=తేఁబడిన; నాగకన్యాః=నాగకన్యకలు; దృష్టాః=చూడఁబడినారు. జనకనందినీ=జనకునికూఁతురయిన; సా=ఆసీత; న(దృష్టా)=చూడఁబడలేదు.

హనుమంతుండచ్చట, రాక్షసేశ్వరుండగు రావణుండు బలంబునం దెచ్చి కారాగృహంబుననుంచియున్న నాగకన్యకలంజూచెను; జనకునికూఁతురయిన సీతనుమాత్రము, చూడలేదు.

అని, తాత్పర్యము.

విశేషార్థము.—ముందుశ్లోకంబున, వివాహంబైన నాగకన్యలును, ఈశ్లోకంబున బందీకృతలయిననాగకన్యలును, జెప్పఁబడుటంజేసి, పునరుక్తదోషంబులేదు.

సోఽపశ్యంస్తాం మహాబాహుః పశ్యంశ్చాన్యా వరస్త్రియః
విషసాద ముహుర్ధీమాన్ హనుమాన్మారుతాత్మజః. ౨౩

టీక॥ మహాబాహుః=పెద్దచేతులుగలవాఁడును; ధీమాన్=బుద్ధిమంతుండును; మారుతాత్మజః=వాయుదేవునికొడుకునగు; సః=ఆ; హనుమాన్=హనుమంతుఁడు; తాం=ఆసీతను; అపశ్యన్=చూడనివాఁడై; అన్యాః=ఇతరలయిన; వరస్త్రియః=శ్రేష్ఠస్త్రీలను; పశ్యంశ్చ=చూచుచును; ముహుః=పలుమాఱు; విషసాద=దుఃఖించెను.

మహాబాహుండును బుద్ధిమంతుండును వాయుదేవుని కుమారుండునగు నాహనుమంతుండు, ఆసీతంగానక ఇతరస్త్రీలంజూచుచుఁ, బలుమాఱు దుఃఖంబునొందుచుండెను. అని, తాత్పర్యము.

ఉద్యోగం వానరేంద్రాణాం ప్లవనం సాగరస్య చ
వ్యర్థం వీక్ష్యానిలసుతశ్చింతాం పునరుపాగమత్. ౨౪

టీక ॥ అనిలసుతః=వాయువుకొడుకైనహనుమంతుండు; వానరేంద్రా

ణాం= వానరశ్రేష్ఠులగు నంగదాదుల యొక్క; ఉద్యోగం= ప్రయత్నమును; సాగరస్య= సముద్రముయొక్క; ప్లవనంచ=దాఁటుటను; వ్యర్థం=ప్రయోజనములేనిదానిఁగా ; వీక్ష్య=చూచి; పునః=మఱల ; చింతాం=దుఃఖమును; ఉపాగమత్=పొందెను.

వాయుదేవునికుమారుఁడగు హనుమంతుఁడు, వానరశ్రేష్ఠులగు నంగదాదులప్రయత్నమును దాను సముద్రము దాఁటుటయు , వ్యర్థమయినదని తలఁచి, మఱల, దుఃఖమునొందెను.

అని, తాత్పర్యము.

అవతీర్య విమానాచ్చ హనుమా న్మారుతాత్మజః
చింతా ముపజగామాథ శోకోపహతచేతనః. ౨౫

టీక॥మారుతాత్మజః = వాయువుకొడుకయిన;హనుమాన్= హనుమంతుఁడు; విమానాత్ = పుష్పకవిమానంబు నందుండి; అవతీర్యచ = దిగియు; అథ=అటుపిమ్మట; శోకోపహతచేతనః=దుఃఖముచేతఁ గొట్టఁబడిన బుద్ధిగలవాఁడై;చింతాం = ఆలోచనమును; ఉపజగామ=పొందెను.

వాయుదేవునికుమారుఁడగు హనుమంతుండు , ఆపుష్పకవిమానంబునందుండి,దిగి,యతిదుఃఖంబునమునింగినబుద్ధిగలవాఁడై,యిట్లని,చింతించెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, ద్వాదశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండద్వాదశసర్గటీక,
ముగిసినది.

శ్రీ

త్రయోదశసర్గప్రారంభః.

విమానాత్తు సుసంక్రమ్య ప్రాకారం హరియూథపః
హనుమా న్వేగ వా నాసీ ద్విద్యు ద్ఘనాంతరే

టీక॥ వేగవాన్=వేగముగల; హరియూథపః= హనుమంతుండు; విమానాత్=విమానంబునందుండి; ప్రాకారం=ప్రహరిని; సుసంక్రమ్యతు=పొందినంతనే; ఘనాంతరే= మేఘముయొక్క నడుమునందు; విద్యుద్యథా=మెఱుపువలె; ఆసీత్=ఉండెను.

వేగవంతుండగు నాహనుమంతుండు, పుష్పకవిమానంబునందుండి, ప్రాకారంబునకు లంఘించి, యింద్రనీలమయంబగు నాప్రాకారంబునందు, మేఘంబునడుమ మెఱపుంబోలె, మెఱయుచుండెను. అని, తాత్పర్యము.

సంపరిక్రమ్య హనుమా న్రావణస్య నివేశనాత్
అదృష్ట్వా జానకీం సీతా మబ్రవీ ద్వచనం కపిః. ౨

టీక ॥ కపిః=కోతియగు; హనుమాన్=హనుమంతుండు; రావణస్య=రావణునియొక్క; నివేశనాత్=అంతఃపురమునందుండి; సంపరిక్రమ్య= ప్రాకారమునకువచ్చి; జానకీం = జనకుని కూంతురయిన; సీతాం=సీతను; అదృష్ట్వా=చూడక; వచనం=మాటను; అబ్రవీత్=పలికెను, తనలోఁదాను జెప్పకొనెననుట.

హనుమంతుం, డట్లు, రావణునియంతఃపురంబునందుండి, ప్రాకారంబునకు వచ్చి, జనకమహారాజు కూంతురయిన సీతం గానమిన, దనలోఁదాను, ఇట్లని, చెప్పకొనెను. అని, తాత్పర్యము.

భూయిష్ఠం లోళితా లంకా రామస్య చరతా ప్రియమ్
నహి పశ్యామి వైదేహీం సీతాం సర్వాంగశోభనామ్. ౩

టీక॥ రామస్య=రామునకు; ప్రియం= ఇష్టమును; చరతా = చేయుచున్నట్టి;

మయా (అధ్యాహృతము)=నాచేత; లంకా=లంకాపట్టణము; భూయిష్ఠం=మిక్కిలియునధికముగా; లోళితా= కలఁచఁ బడినది. సర్వాంగశోభనాం = సమస్తములయిన యవయవములనుమంగళకరియయిన; వైదేహీం = విదేహదేశమునందుఁబుట్టిన; సీతాం= సీతను; నపశ్యామిహి=చూడలేనైతిఁగదా!

నేను రామునకుఁ బ్రియంబాచరింపవలయునని, లంకయంతయుఁ, బెక్కుమాఱులు వెదకినాను; అయినను, సర్వాంగ సుందరియగు సీత నాకగపడలేదు. అని, తాత్పర్యము.

పల్వలాని తటాకాని సరాంసి సరిత స్తథా
నద్యోనూపవనాంతాశ్చ దుర్గాశ్చ ధరణీ ధరాః. ౪
లోళితా వసుధా సర్వా నతు పశ్యామి జానకీమ్

టీక॥ పల్వలాని = నీళ్లుగలచిన్నపల్లములును; తటాకాని=చెఱువులును; సరాంసి=కొలఁకులును; తథా=అట్లు; సరితః=చిన్నసదులును; నద్యః=పెద్దనదులును; అనూపవనాంతాశ్చ=నీళ్లతోఁగూడిన యరణ్యప్రదేశములును; దుర్గాః= పోవనశక్యములయిన; ధరణీధరాశ్చ=పర్వతములును; లోళితాః (అధ్యాహృతము) =కలఁచఁబడినవి. వసుధా = భూమి; సర్వా = అంతయు; లోళితా= కలఁచఁబడినది. జానకీం=సీతను; నతుపశ్యామి = చూడనేలేదు.

నేను, బల్వలంబులును జెఱువులును గొలఁకులును క్షుద్రనదులును మహానదులునుజలప్రాయములగు సరణ్యప్రదేశములు, నంతయుఁ గలయఁదిరిగి, వెదకితిని; ఇక్కడిభూమియంతయుఁ దిరిగి వెదకినను, సీతయగపడనేలేదు. అని, తాత్పర్యము.

ఇహ సంపాతినా సీతా రావణస్య నివేశనే. ౫
ఆఖ్యాతా గృధ్రరాజేన నచ పశ్యామి తామహమ్

టీక॥ గృధ్రరాజేన = గద్దలకుఁబ్రభువైన; సంపాతినా= సంపాతిచేత; ఇహ=ఈ; రావణస్య = రావణునియొక్క; నివేశనే = ఇంటియందు; సీతా=

సీత; ఆఖ్యాతా = చెప్పఁబడినది. అహంచ=నేనుమాత్రము; తాం=ఆసీతను; నపశ్యామి=చూడలేదు.

గృధ్రరాజుండగు, సంపాతి,యిచ్చటరావణునింట సీతయున్నదని, చెప్పినాఁడు; నేనెంతవెదకినను, నాకిచ్చట,సీతయగపడలేదు.

అని, తాత్పర్యము

కిన్ను సీతాథ వైదేహీ మైథిలీ జనకాత్మజా. ౬
ఉపతిష్ఠేత వివశా రావణం దుష్టచారిణమ్

టీక॥ వైదేహీ=విదేహ దేశమునం దుఁబుట్టినదియు;మైథిలీ=మిథిలా నగరమునందుఁబుట్టినదియు; జనకాత్మజా=జనకునికూఁతురునగు; సీతా= అయోనిజయగుసీతయును;వివశా=స్వాధీనత తప్పినదై;దుష్టచారిణం=చెడ్డకార్యములంజేయునట్టి;రావణం=రావణుని; ఉపతిష్ఠేతకిన్ను=స్నేహితునిఁగాఁ బొందునా!

ధార్మికులుండునట్టి విదేహదేశంబునందు,అందును,బహుసత్పురుషులునివసించు మిథిలానగరంబునఁబుట్టి, "కర్మణైవహిసంసిద్ధిమాస్థితా జనకాదయః" (జనకుండు మున్నగువారలు కర్మముచేతనేసిద్ధినిబొందినారు) అనికర్మఠుండని ప్రసిద్ధుఁడగుజనకుని కూఁతురయిన, యయోనిజయగు సీతయునుగూడ,తనయాచారముతప్పి దుష్టుఁడైనరావణునితో స్నేహముసేయునా? ఎంతమాత్రముసేయదు!

అని, తాత్పర్యము.

క్షిప్ర ముత్పతతో మన్యే సీతా మాదాయ రక్షసః. ౭
బిభ్యతో రామబాణానా మంతరా పతితా భవేత్

టీక॥ సీతాం=సీతను; ఆదాయ=తీసికొని; క్షిప్రం=శీఘ్రముగా; ఉత్పతతః=ఎగురుచున్న;రక్షసః= రాక్షసుఁడగురావణుఁడు;రామబాణానాం=(పంచమ్యర్థమందుషష్ఠి) రామునిబాణములవలన;బిభ్యతః=భయము పడుచుండఁగా;సా (అధ్యాహృతము)= ఆసీత; అంతరా=నడుమను;పతితా=పడినది; భవేత్=అగును;మన్యే=తలఁచెదను.

ఆరావణుండుసీతందీసికొనియతివే

గంబుగానెగురుచున్నప్పుడు, రామబాణంబులనుదలంచుకొనిభయంబునొందివిహ్వలుండుకాఁగా,నప్పుడు,సీత, క్రిందంబడియుండును,గాఁబోలు.

అని, తాత్పర్యము,

అథవా హ్రియమాణాయాః పథి సిద్ధ నిషేవితే. ౮
మన్యే పతిత మార్యాయా హృదయం ప్రేక్ష్య సాగరమ్

టీక॥అథవా=అటుగానిచో; సిద్ధనిషేవితే=సిద్ధులచేసేవింపఁబడిన; పథి= ఆకాశమార్గమునందు; ఆర్యాయాః=పూజ్యురాలగు సీతయొక్క; హృదయం==గుండె(లక్షణచే) దేహమనుట;సాగరం=సముద్రమును; ప్రేక్ష్య=చూచి; పతితం=పడినది.మన్యే=తలఁచెదను!

అటుగాదేని, యాకాశమార్గమునందు,రావణుండుసీతంగొనిపోవుచుండఁగా,సీతసముద్రమునుజూచి,భయపడి,విహ్వలయై, సముద్రంబునంబడినది కాఁబోలు.

అని, తాత్పర్యము.

రావణ స్యోరువేగేన భుజాభ్యాం పీడితేనచ. ౯
తయా మన్యే విశాలాక్ష్యా త్యక్తం జీవిత మార్యయా

టీక॥ రావణస్య= రావణునియొక్క;ఊరువేగేన = తొడలవేగముచేతను;భుజాభ్యాం=బాహువులచేత; పీడితేనచ =అదుముటచేతను; విశాలాక్ష్యా=వెడలుపయినకండ్లుగలదియు;ఆర్యయా=పూజ్యురాలునగు; తయా= ఆసీతచేత; జీవితం= ప్రాణము; త్యక్తం=విడువఁబడినది. మన్యే=తలఁచెదను!

క్రిందఁబడు ననుభయంబున, రావణుండుసీతనుభుజంబుల గట్టిగాఁ బట్టుకొనిపోవుచుండఁగా, పెద్దకండ్లుగలదియుఁబూజ్యురాలునగుసీత, నతనితొడలవేగమునకును, భుజంబులనదుముటకును,నలఁగిచచ్చియుండునుగాఁబోలు.

అని, తాత్పర్యము.

ఉపర్యుపరి వా నూనం సాగరం క్రమత స్తదా. ౧౦

వివేష్టమానా పతితా సముద్రే జనకాత్మజా

టీక॥ తదా = అప్పుడు ; తస్య(అధ్యాహృతము)= ఆ రావణుండు; సాగరం=(షష్ఠ్యర్థమందుద్వితీయ) సముద్రముయొక్క;ఉపర్యుపరి= దగ్గిఱగా మీఁదుగా; క్రమతః=పోవుచుండఁగా; జనకాత్మజా=జనకుని కూఁతురయినసీత;వివేష్టమానా= చుట్టుకొన్నదై; సముద్రే=సముద్రమునందు;పతితావా= పడినదోయేమో!నూనం=నిశ్చయము.

రావణుండుసముద్రమునకు సమీపమయినయాకాశమార్గమునఁ బోవుచుండుసపుడు,సీత,చుట్టుకొని వ్రేలుకాడుచు, సముద్రంబునంబడినది, కాఁబోలు. అని, తాత్పర్యము.

అహో క్షుద్రేణ వానేన రక్షంతీ శీల మాత్మనః. ౧౧
అబంధు ర్భక్షితా సీతా రావణేన తపస్వినీ

టీక॥అహో=అయ్యో!క్షుద్రేణ= దుష్టుఁడయిన;అనేన=ఈ; రావణేన= రావణునిచేత; ఆత్మనః=తనయొక్క; శీలం=సదాచారమును;రక్షంతీ = కాపాడుచున్నదియును; అబంధుః=బంధువులులేనిదియును; తపస్వినీ=కరుణింపఁదగినదియునగు; సీతా=సీత; భక్షితావా=తినఁబడినదోయేమో!

అయ్యో!దుష్టుండగునీరావణుండెంతనిర్బంధించినను, దనపాతివ్రత్యమును విడువకుండుటవలన,నతండు,కోపించి, సమీపంబునబంధువులులేనిదియుశోచనీయయునగుసీతను,భక్షించెనేమో! అని, తాత్పర్యము.

అథవా రాక్షసేంద్రస్య పత్నీభి రసితేక్షణా. ౧౨
అదుష్టా దుష్ట భావాభి ర్భక్షితా సా భవిష్యతి

టీక॥అథవా=అటుగానిచో; దుష్టభావాభిః=చెడుగుహృదయముగల;రాక్షసేంద్రస్య=రాక్షసులకుఁ బ్రభువైన రావణునియొక్క; పత్నీభిః= భార్యలచేత;అదుష్టా=చెడ్డదిగానిదియును; అసితేక్షణా= నల్లనికండ్లుగలదియునగు; సా=ఆసీత;భక్షితా=తినఁబడినది; భవిష్యతి=కాఁగలదు.

అటుగాదేని, చెడుగు హృదయముగలరావణభార్యలు, దుష్టురాలుగానిదియును నల్లనికండ్లుగలదియునగు నాసీతను, భక్షించియుందురేమో! అని, తాత్పర్యము.

సంపూర్ణచంద్ర ప్రతిమం పద్మపత్ర నిభేక్షణమ్. ౧౩
రామస్య ధ్యాయతీ వక్త్రం పంచత్వం కృపణా గతా

టీక॥ కృపణా=కరుణింపదగినసీత; సంపూర్ణచంద్రప్రతిమం= నిండుచంద్రునితోఁబోల్కి-గలదియును; పద్మపత్రనిభేక్షణం= తామరపూరేకులతోసాటియయినకండ్లుగలదియునగు; రామస్య=రామునియొక్క; వక్త్రం=ముఖమును; ధ్యాయతీ= తలంచుకొనుచున్నదై; పంచత్వం=మరణమును; గతా=పొందినదేమో!

కరుణింపఁదగినసీత, నిండుచంద్రుండుంబోలెసుందరంబై తామరపూరేకులంబోలుకండ్లుగల్గియొప్పుచుండు, రామునిముఖంబును ధ్యానించుచు, విరహబాధంజేసి, ప్రాణంబులువిడిచెనేమో! అని, తాత్పర్యము.

హా రామ లక్ష్మణేత్యేవం హాయోధ్యే చేతి మైథిలీ. ౧౪
విలప్య బహు వైదేహీ న్యస్త దేహా భవిష్యతి

టీక॥ వైదేహీ=విదేహదేశమునందుఁబుట్టినదియును; మైథిలీ=మిథిలానగరమునందుఁబుట్టినదియునగుసీత; "హా రామ= అయ్యోరామా! లక్ష్మణ=లక్ష్మణుఁడా!" ఇతి=అని; ఏవం=ఇట్లు; హాయోధ్యా=అయ్యోఅయోధ్యా! ఇతిచ=అనియును; బహు = అధికముగా; విలప్య=ఏడ్చి; న్యస్తదేహా=విడువఁబడినదేహముగలది; భవిష్యతి= కాఁగలదు.

సీత, "అయ్యోరామా! లక్ష్మణా!" అనియును, "అయ్యోఅయోధ్యానగరమా!" అనియును, బెక్కు-మాఱులు విలపించి, దేహంబువిడిచి యుండునుగాఁబోలు. అని, తాత్పర్యము.

అథవా నిహితా మన్యే రావణస్య నివేశనే. ౧౫
నూనం లాలప్యతే సీతా పంజరస్థేవ శారికా

టీక॥ అథవా = అటుగానిచో ; సీతా=సీత; రావణస్య = రావణునియొక్క ; నివేశనే= ఇంటియందు ; నిహితా=ఉంచఁబడినదై ; పంజరస్థా=పంజరమునసుండు ; శారికేవ=గోరువంక యుంబోలె; లాలప్యతే=పలుమాఱు, ఏడ్చుచున్నది. మన్యే=తలంచెను; నూనం=నిశ్చయము!

అటుగాదేని, సీత రావణునింటరహస్యప్రదేశంబున నెచ్చటనో దాఁచఁబడి, పంజరంబున నుంచఁబడిన గోరువంకయుంబోలె . సుస్వరంబునఁ, బలుమాఱు, ఏడ్చుచుండునుగాఁబోలు.

అని, తాత్పర్యము.

జనకస్య సుతా సీతా రామపత్నీ సుమధ్యమా. ౧౬
కథ ముత్పల పత్రాక్షీ రావణస్య వశం వ్రజేత్

టీక ॥ జనకస్య= జనకునియొక్క; సుతా= కొమార్తెయును ; రామపత్నీ = రామునిభార్యయును ; సుమధ్యమా = సుందరమయిన నడుముగలది యును; ఉత్పలపత్రాక్షీ= కలువలతేకులవంటి కండ్లుగలదియునగు;సీతా = సీత; కథం=ఎట్లు; రావణస్య= రావణునియొక్క! వశం=లోఁకువను ; వ్రజేత్ =పొందును?

అయోనిజయైపుట్టి,సీతయని వినుతి వహించి, పరమధార్మికుఁడగుజనకునకుఁగొమార్తెయయి,త్రైలోక్యసుందరుండును త్రైలోక్య శూరుండును సకలసద్గుణ సంపన్నుండును త్రైలోక్యంబునసరిలేనివాఁడునగు రాముంబెండ్లియయి,సీత, రావణుండెంత నిర్బంధించినను, రావణునకులోఁబడునా!ఎంతమాత్రములోఁబడదు!

అని, తాత్పర్యము.

వినష్టా వా ప్రణష్టా వా మృతా వా జనకాత్మజా. ౧౭
రామస్య ప్రియ భార్యస్య న నివేదయితుం క్షమమ్

టీక॥ జనకాత్మజా= జనకుని కూఁతురయినసీత; వినష్టావా=దాఁచఁబడియుండుటచే నగపడకున్నదో! ప్రణష్టావా=సముద్రమునందుఁబడుటమొదలగువానిచేఁజచ్చినదో, మృతావా = రామవిరహంబు సహింపఁజాలక తానెచచ్చినదో! ఇతి(అధ్యాహృతము)= అని; ప్రియభార్యస్య=ఇష్టయయినభార్యగల; రామస్య= రామునకు; నివేదయితుం= తెల్పుటకు;నక్షమం= తగినది గాదు.

రాముఁడు, భార్యయందతి ప్రేమముగలవాఁడుగావున, "సీత, రహస్యప్రదేశమునందు నెవరికి నగపడనట్లు దాఁచఁబడినదో. సముద్రమునందుఁ బడుటవలననోయింకదేనివలననో చచ్చినదో, లేక, భర్తృవిరహంబు సహింపంజాలకతానెమృతినొందినదో, యేమో! నాకగపడలేదు" అని;యతనికిఁజెప్పరాదు. అని, తాత్పర్యము.

నివేద్యమానే దోష స్స్యా ద్దోషస్స్యా దనివేదనే. ౧౮
కథన్నుఖలు కర్తవ్యం విషమం ప్రతిభాతి మే

టీక॥ నివేద్యమానే = చెప్పఁబడఁగా;దోషః=దోషము; స్యాత్= అగును; అనివేదనే = చెప్పటలేకపోగా; దోషః=దోషము ; స్యాత్= అగును; కథన్నుఖలు = ఎట్లు; కర్తవ్యం=చేయంబడవలసినది? మే=నాకు;విషమం= పరస్పర విరుద్ధముగా ; ప్రతిభాతి= తోఁచుచున్నది.

సీతయగపడలేదనిచెప్పుదునేని, రాముండు ప్రాణంబులువిడుచును ; అప్పుడునుదోషమున్నది; చెప్పకుందునేని , స్వామివంచనదోషంబుగలుగును; ఏమి చేయవలయును? నాకురెండును ఒకటికొకటి విరుద్ధముగానగపడుచున్నది,అనియాలోచించెను.

అని, తాత్పర్యము.

అస్మిన్నేవం గతే కార్యే ప్రాప్తకాలం క్షమంచ కిమ్. ౧౯
భవేదితి మతం భూయో హనుమా న్ప్రవిచారయత్

టీక॥ హనుమాన్= హనుమంతుఁడు"అస్మిన్=ఈ;కార్యే=పని;ఏవంగతే=ఇట్లుకాఁగా; ప్రాప్తకాలం=పొందఁబడినకాలముగలదియు, ఈకాలను

నఁజేయఁవలసినదియుననుట; క్షమం= సమర్థమయినదియును;కిం=ఏది ; భ వేత్=అగును?" ఇతి=అనెడు;మతం= పక్షమును; భూయః=మఱల; ప్రవిచా రయత్ (ప్రవ్యచారయత్)= ఆలో చించెను.

ఇట్లు "కార్యమువ్యర్థమయిన వె నుక , నిప్పుడు చేయవలసినదేమి? ఏమి యుపాయము." అనియీవిషయమును గుఱించి హనుమంతుఁడు,మఱల; నా లోచించెను. అని తాత్పర్యము.

యది సీతా మదృష్ట్వాహం వానరేంద్ర పురీ మితః. ౨౦
గమిష్యామి తతః కోమే పురుషార్థో భవిష్యతి

టీక॥అహం=నేను;సీతాం = సీత ను;అదృష్ట్వా=చూడక;ఇతః= ఇటనుం డి;వానరేంద్రపురీం=వానరులకుఁ బ్రభు వైనసుగ్రీవునిపట్టణమగుకిష్కింధను; గ మిష్యామియది=పొందుదునేని; తతః= అంత; మే=నాకు;కః=ఏ;పురుషార్థః= పురుషప్రయోజనము; భవిష్యతి=కాఁ గలదు.

నేనుసీతంజూడక యిచ్చటనుండి కి ష్కింధకుఁబోవుదునేని, యటుపిమ్మట నాకేమిపురుషార్థముగలుగును? అధో గతియే గలుగును.

అని, తాత్పర్యము.

మమేదం లంఘనం వ్యర్థం సాగరస్య భవిష్యతి. ౨౧
ప్రవేశ శ్చైవ లంకాయా రాక్షసానాంచ దర్శనమ్

టీక॥మమ=నాయొక్క ; ఇదం= ఈ; సాగరస్య=సముద్రముయొక్క;లం ఘనం=దాఁటుట;వ్యర్థం=ప్రయోజన ములేనిది;భవిష్యతి=కాఁగలదు. లంకా యాః=లంకయొక్క; ప్రవేశశ్చైవ= చొఱుటయును;వ్యర్థః భవిష్యతి (అ ధ్యాహృతము) = ప్రయోజనములేనిది కాఁగలదు. రాక్షసానాం= రాక్షసుల యొక్క;దర్శనంచ = చూచుటయు ను;వ్యర్థంభవిష్యతి=ప్రయోజనము లేని దికాఁగలదు.

నేనిప్పుడుసముద్రముదాఁటుటలంకం బ్రవేశించుట రాక్షసులంజూచుట, యివన్ని యువ్యర్థములగును.అని తాత్పర్యము.

కింమాంవక్ష్యతి సుగ్రీవో హరయో వాసమాగతాః. ౨౨
కిష్కింధాం సమనుప్రాప్తం తౌ వా దశరథాత్మజౌ

టీక॥కిష్కింధాం=కిష్కింధను; సమనుప్రాప్తం=పొందిన;మాం=నన్నుఁగూర్చి;సుగ్రీవః=సుగ్రీవుఁడు; కిం=ఏమి;వక్ష్యతి=చెప్పఁగలఁడో; హరయో వా=వానరులుగాని; సమాగతాః=చేరినవారలై; కింవక్ష్యంతి=(అధ్యాహృతము)ఏమిచెప్పఁగలరు;తౌ=ఆ ; దశరథాత్మజౌవా=దశరథుని కొడుకులయినరామలక్ష్మణులుగాని; కింవక్ష్యతః=(అధ్యాహృతము)ఏమిచెప్పఁగలరో?

నేను, సీతంజూడక కిష్కింధకుఁ, బోఁగానే,నన్నుఁజూచి సుగ్రీవుండేమి చెప్పునో!వానరులందఱుఁజేరి నన్నేమనుదురో! ఆరామలక్ష్మణులు నన్నేమి చెప్పుదురో?వారలందఱు నన్నుఁజూచి యేమేమొ దూషింపఁగలరు.

అని, తాత్పర్యము.

గత్వాతు యది కాకుత్స్థం వక్ష్యామి పరమప్రియమ్. ౨౩
న దృష్టేతి మయా సీతా తతస్త్యక్ష్యతి జీవితమ్

టీక॥అహం(అధ్యాహృతము)=నేను;గత్వా=పోయి;కాకుత్స్థం = రామునిగూర్చి;"మయా= నాచేత ; సీతా=సీత;నదృష్టా= చూడఁబడలేదు" ఇతి=అనెడు;పరం=మిక్కిలియును; అప్రియం=అనిష్టమయినమాట; యదితు వక్ష్యామి=చెప్పుదునేని;తతః=అంతట; సః(అధ్యాహృతము)=అరాముఁడు;జీవితం=ప్రాణమును; త్యక్ష్యతి=విడువఁగలవాఁడు.

నేనచ్చటికిఁబోయి, రామునింజూచి,"నేనుసీతంజూడలేదు " అనునీయప్రియవార్తం జెప్పుదునేని, అంతనతండుప్రాణంబులవిడుచును.

అని, తాత్పర్యము.

పరుషం దారుణం క్రూరం తీక్ష్ణ మింద్రియతాపనమ్. ౨౪
సీతానిమిత్తం దుర్వాక్యం శ్రుత్వా సన భవిష్యతి

టీక॥ పరుషం = చెవులకుఁ గఠోర మయినదియును ; దారు

ణం = భయంకరం బయి నదియును ; క్రూరం = ఉగ్రమయినదియును ; తీక్ష్ణం = సహింపఁ గూడనదియును; ఇంద్రియతాపనం=ఇంద్రియంబులఁదపింపఁజేయునదియునగు; సీతానిమిత్తం=సీతావిషయకమగు,సీతనుగుఱించినయనుట; దుర్వాక్యం = చెడ్డమాటను; శ్రుత్వా=విని ; సః= ఆరాముఁడు; నభవిష్యతి=ఉండఁడు.

రాముండు, కర్ణకఠోరంబును భయంకరంబును గ్రూరంబును సహింపఁగూడనిదియు నింద్రియంబులకుఁదాపంబుగల్గించునదియునగు, సీతనుగుఱించిన చెడుగుమాటనువిని, బ్రతికియుండనేరఁడు. అనితాత్పర్యము.

తంతు కృచ్ఛ్రగతం దృష్ట్వా పంచత్వగతమానసమ్. ౨౫
భృశానురక్తో మేధావీ నభవిష్యతి లక్ష్మణః

టీక॥ భృశానురక్తః= మిక్కిలియు స్నేహముగలవాఁడును; మేధావీ=బుద్ధిశాలియునగు;లక్ష్మణః = లక్ష్మణుఁడు;కృచ్ఛ్రగతం= కష్టమునొందినవాఁడును;పంచత్వగతమానసం = మరణంబునొంది నమనసుగలవాఁడును , మరణమునందు నిశ్చయించినమనసుగలవాఁడుననుట; తం=ఆరాముని= దృష్ట్వాతు=చూచినంతనే;నభవిష్యతి=ఉండఁజాలఁడు.

ఆ రాముండు కష్టమునొంది మరణంబునొంద నిశ్చయించి యుండుటంజూడఁగానే , రామునందతిస్నేహముగలవాఁడును మేధావియునగులక్ష్మణుండును బ్రాణంబులువిడుచును.

అని, తాత్పర్యము.

వినష్టౌ భ్రాతరౌ శ్రుత్వా భరతోపి మరిష్యతి. ౨౬

టీక॥భరతోపి= భరతుఁడును;భ్రాతరౌ=తోఁబుట్టువులను; వినష్టౌ= మృతినొందినవారలనుగా;శ్రుత్వా=విని; మరిష్యతి=చావఁగలఁడు.

రాముండునులక్ష్మణుండునుంజచ్చుటనువిని, భరతుండును, చావగలఁడు.

అని, తాత్పర్యము.

భరతంచ మృతం దృష్ట్వా శత్రుఘ్నోన భవిష్యతి

టీక॥ శత్రుఘ్నః = శత్రుఘ్నుఁడు; మృతం=చచ్చిన; భరతంచ = భరతుని; దృష్ట్వా=చూచి; నభవిష్యతి= ఉండఁడు.

భరతుండును జచ్చుటంజూచి శత్రుఘ్నుండును బ్రాణంబులువిడువం గలండు. అని, తాత్పర్యము.

పుత్రాన్మృతాన్ సమీక్ష్యాథ నభవిష్యంతి మాతరః. ౨౭
కౌసల్యాచ సుమిత్రాచ కైకేయీ చ న సంశయః

టీక॥మృతాన్=చచ్చిన;పుత్రాన్=కొడుకులను;సమీక్ష్య=చూచి; అథ=అటుపిమ్మట; మాతరః=తల్లులు ; కౌసల్యాచ= కౌసల్యయును;సుమిత్రాచ= సుమిత్రయును; కైకేయీచ=కైకేయియును; నభవిష్యంతి= ఉండరు; సంశయః=సందేహము; న=లేదు.

కొడుకులందఱునుజచ్చుటంజూచి, తల్లులయిన కౌసల్యయు సుమిత్రయుఁ గైకేయియుఁ బ్రాణంబుల విడువంగలరు; సందియముఁలేదు.

అని, తాత్పర్యము.

కృతజ్ఞ స్సత్యసంధశ్చ సుగ్రీవః ప్లవగాధిపః. ౨౮
రామం తథా గతం దృష్ట్వా తత స్త్యక్ష్యతి జీవితమ్

టీక॥ కృతజ్ఞః= ఇతరులచేఁజేయఁబడిన యుపకారముకొంచెమైననుదానినెచ్చుగానెఱుంగువాఁడును ; సత్యసంధశ్చ = దబ్బఱకానిప్రతిజ్ఞ గలవాఁడును; ప్లవగాధిపః= కోఁతులకుఁబ్రభువైన;సుగ్రీవః=సుగ్రీవుఁడు; తథా=అట్లు; గతం=మృతినొందిన ; రామం=రాముని; దృష్ట్వా=చూచి; తతః=అంత ; జీవితం=ప్రాణమును; త్యక్ష్యతి=విడువఁగలఁడు.

రాముఁడుమృతినొందఁగానే , సుగ్రీవుండు, దాని జూచి, కృతజ్ఞుండును సత్యప్రతిజ్ఞుండును, గావునఁదనకు రాముండుచేసిన యుపకారమును దలంచుకొనుచుఁ, దానురామునకు "సీతనుదెచ్చియిచ్చెద" నని గావించినప్రతినయుబద్ధంబగుటనుగుఱించి దుఃఖించుచుఁ , బ్రాణంబులువిడువంగలఁడు.

అని, తాత్పర్యము.

దుర్మనా వ్యథితా దీనా నిరానందా తపస్వినీ. ౨౯
పీడితా భర్తృశోకేన రుమా త్యక్ష్యతి జీవితమ్

టీక॥ భర్తృశోకేన = పెనిమిటిని గురించినదుఃఖముచేత; పీడితా = పీడింపఁబడినదియు; దుర్మనాః = దుఃఖముగల మనసుగలదియు; వ్యథితా = బాధింపఁబడినదియు; దీనా = గర్వముడిగినదియు; నిరానందా = సంతోషములేనిదియు; తపస్వినీ = కరుణింపఁదగినదియునగు; రుమా = సుగ్రీవునిభార్యయగురుమ; జీవితం = ప్రాణమును; త్యక్ష్యతి = విడువఁగలదు.

పెనిమిటిచనిపోవుటవలనఁ గలిగిన దుఃఖంబునంబీడింపఁబడి దుఃఖించుచుఁ దర్పంబుడిగి, సంతోషంబులేక, సుగ్రీవునిభార్యయగురుమయును, ప్రాణంబులు విడుచును. అని, తాత్పర్యము.

వాలిజేనతు దుఃఖేన పీడితా శోకకర్శితా. ౩౦
పంచత్వంచ గతే రాజ్ఞి తారాపి నభవిష్యతి

టీక॥ వాలిజేన = వాలివలనఁ గలిగిన; దుఃఖేనతు = దుఃఖముచేతనే; పీడితా = బాధింపఁబడినదియు; శోకకర్శితా = దుఃఖముచేసన్నగిల్లునట్లుచేయఁబడినదియునగు; తారాపి = తారయును; రాజ్ఞిచ = రాజయినసుగ్రీవుఁడును; పంచత్వం = మరణమును; గతే = పొందఁగా; నభవిష్యతి = ఉండదు.

వాలిచచ్చినందువలననె బహుదుఃఖంబునొంది, కృశించియుండు, తారయు, సుగ్రీవుండును జచ్చెనేని, దుఃఖంబుపట్టఁజాలక, ప్రాణంబులు విడుచును. అని, తాత్పర్యము.

మాతాపిత్రో ర్వినాశేన సుగ్రీవవ్యసనేనచ. ౩౧
కుమారోప్యంగదః కస్మా ద్ధారయిష్యతి జీవితమ్

టీక॥ కుమారః = బాలుండగు; అంగదోపి = అంగదుండును; మాతాపిత్రోః = తల్లిదండ్రులయొక్క; వినాశేన = చావుచేతను; సుగ్రీవవ్యసనేనచ = సుగ్రీవునిగు

టించినదుఃఖముచేతను; కస్మాత్ = ఎందువలన; జీవితం = ప్రాణమును; ధారయిష్యతి = ధరించును? ధరింపఁడనుట.

బాలుండగునంగదుండును, దధిదంద్రుల చావును, సుగ్రీవుని చావును, జూచి, దుఃఖంబుపట్టఁజాలకఁ ప్రాణంబులు విడుచును. అని, తాత్పర్యము.

భర్తృజేనతు దుఃఖేన హ్యభిభూతా వనౌకసః. ३౨
శిరాం స్యభిహనిష్యంతి తలై ర్ముష్టిభి రేవచ

టీక॥ వనౌకసః = వానరులు; భర్తృజేన = రాజువలనఁగలిగిన; దుఃఖేన = దుఃఖముచేత; అభిభూతాః = కొట్టఁబడినవారలై; తలైః = అఱచేతులచేతను; ముష్టిభి రేవచ = పిడికిళ్లచేతను; శిరాంసి = తలలను; అభిహనిష్యంతి = కొట్టుకొనఁగలరు.

వానరులందఱు, రాజైన సుగ్రీవుఁడు చచ్చుటకుఁ జాల దుఃఖంబునొంది, అఱచేతులచేతను బిడికిళ్లచేతను, దమతలలఁగొట్టుకొందురు.

అని, తాత్పర్యము.

సాంత్వే నానుప్రదానేన మానేనచ యశస్వినా. ३३
లాలితాః కపిరాజేన ప్రాణాం స్త్యక్ష్యంతి వానరాః

టీక॥ కపిరాజేన = వానరులకుఁబ్రభువైన సుగ్రీవునిచేత; సాంత్వేన = తీన్నని మాటచేత; అనుప్రదానేన = కోరినదానినిచ్చుటచేతను; మానేన = పూజించుటచేతను; లాలితాః = బుజ్జగింపఁబడిన; వానరాః = వానరులు; ప్రాణాన్ = ప్రాణంబులను; త్యక్ష్యంతి = విడువఁగలరు.

సుగ్రీవుండు, వానరులనందఱను, దిన్నని మాటలచేతను గోరినవానినిచ్చుటచేతను గౌరవించుటచేతను జాలనుపలాలించినవాఁడు, కావున, నతండు చావఁగా; వానరులందఱును, దుఃఖం బోర్వలేక, ప్రాణంబులువిడుతురు అని తాత్పర్యము.

న వనేషు న శైలేషు న నిరోధేషు వా పునః. ३౪
క్రీడా మనుభవిష్యంతి సమేత్య కపికుంజరాః

టీక॥ పునః = మఱల; కపికుంజరాః = వానరశ్రేష్ఠులు; సమేత్య=గుంపుగాఁజేరి; వనేషు= అడవులయందు; క్రీడాం=ఆటను;నానుభవిష్యంతి=అనుభవింపరు. శైలేషు= పర్వతములందు; క్రీడా మనుభవిష్యంతి (అధ్యాహృతము)న= క్రీడించుటననుభవింపరు;నిరోధేషువా = ఇండ్లు మొదలగు నావరణముగల ప్రదేశములయందుఁ గాని; క్రీడా మను భవిష్యంతి (అధ్యాహృతము)న=క్రీడించుట ననుభవింపరు.

ఇంక, వానరులు,అడవులందుఁగాని,పర్వతంబులందుఁగాని, యిండ్లుమొదలగునావరణముగల ప్రదేశములందుగాని,యొకటిగాఁజేరి, క్రీడింపఁబోరు. అని,తాత్పర్యము.

సపుత్ర దారా స్సామాత్యా భర్తృవ్యసన పీడితాః. ౩౫
శైలాగ్రేభ్యః పతిష్యంతి సమేత్య విషమేషుచ

టీక॥సపుత్రదారాః=కొడుకులతోను భార్యలతోను గూడినవారలును; సామాత్యాః = మంత్రులతోనుగూడినవారలునగు ; వానరాః (అధ్యాహృతము)= వానరులు ; భర్తృవ్యసనపీడితాః= రాజునుగుఱించిన దుఃఖముచేతఁ బీడింపఁబడిన వారలై ; విషమేషు=మిట్టపల్లములగు స్థలములయందు ; ("చ" అనునది పాదపూరణార్థము) సమేత్య=చేరి; శైలాగ్రేభ్యః=పర్వతశిఖరములనుండి;పతిష్యంతి= పడఁగలరు.

కొడుకులు భార్యలనుగూడి మంత్రులనుఇతరవానరులును, మిట్టపల్లములు గలస్థలములు చేరి.పర్వతశిఖరంబులమీఁదనుండి, నేలంబడి,ప్రాణంబులు విడుతురు. అని,తాత్పర్యము.

విష ముద్బంధనం వాపి ప్రవేశం జ్వలనస్యవా. ౩౬
ఉపవాస మథో శస్త్రం ప్రచరిష్యంతి వానరాః

టీక॥ అథో= అటుపిమ్మట; వానరాః=వానరులు;విషం=విషమునుగాని (లక్షణచే) విషమునుదినుటనుగానియనుట; ఉద్బంధనంవాపి= ఉరిఁబోసికొనుటనుగాని; జ్వలనస్య=నిప్పుయొక్క; ప్రవేశంవా=జొచ్చుటనుగాని; ఉపవా

సం=భోజనము సేయకుండుటను గాని; శస్త్రం= ఆయుధమును గాని (లక్షణ చే)=ఆయుధముచేఁ బొడుచుకొనుటను గాని;ప్రచరిష్యంతి=సేయఁగలరు.

ఇంక, వానరులు,విషము ద్రావియయినను, ఉరిఁబోసికొనియయినను, అగ్నిలోనుఱికియయినను, ఏమియుఁ దినక యుపవాసంబుండియయినను, ఆయుధంబుచేఁబొడుచుకొనియయినను, ప్రాణంబులు విడువంగలరు.

అని, తాత్పర్యము.

ఘోర మారోదనం మన్యే గతే మయి భవిష్యతి. ३८
ఇక్ష్వాకుకులనాశశ్చ నాశశ్చైవ వనౌకసామ్

టీక॥ మయి=నేను;గతే=పోఁగా; ఇక్ష్వాకుకులనాశశ్చ = ఇక్ష్వాకువంశముయొక్క-చేటును; వనౌకసాం=వానరులయొక్క; నాశశ్చైవ= చేటును; ఘోరం= భయంకరమయిన ; ఆరోదనం= అధికమైనయేడ్పు ; భవిష్యతి= కాఁగలదు.మన్యే=తలఁచుచున్నాను!

నేనుగిష్కింధకుఁబోగానే, భయంకరంబయినరోదనంబును, ఇక్ష్వాకువంశంబునకువినాశంబును,వానరకులంబునకువినాశంబును గలుగును.

అని, తాత్పర్యము.

సోహం నైవ గమిష్యామి కిష్కింధాం నగరీమితః. ३౯
నచ శక్ష్యామ్యహం ద్రష్టుం సుగ్రీవం మైథిలీంవినా

టీక॥ సః=అట్టి ; అహం=నేను;ఇతః= ఇటనుండి; కిష్కింధాం=కిష్కింధయనెడు; నగరీం=పట్టణమును; నైవ గమిష్యామి = పొందుటయేలేదు. అహం=నేను;మైథిలీంవినా= సీతనువిడిచి;సుగ్రీవం=సుగ్రీవుని;ద్రష్టుంచ= చూచుటకును;నశక్ష్యామి=చాలను.

నేనుగిష్కింధకుఁబోవుదునేని యిట్టియనర్థముగలుగును,గావున , నేనిచ్చటనుండి, కిష్కింధకుఁబోవుటయేలేదు;సీతంజూడక,సుగ్రీవునిం జూచుటకును,నాచేతంగాదు.

అని, తాత్పర్యము.

మయ్యగచ్ఛతి చేహస్థే ధర్మాత్మానౌ మహారథౌ. ౩౯
ఆశయా తౌ ధరిష్యేతే వానరాశ్చ మనస్వినః

టీక॥మయి=నేను;అగచ్ఛతి = పోకుండఁగా;ఇహస్థేచ = ఇచ్చటనుండఁగాను; ధర్మాత్మానౌ=ధర్మస్వభావంబుగలవారలును;మహారథౌ=తన్నునుదనసారథినిగుఱ్ఱములను గాపాడుకొనుచుఁబదునొకండువేలమంది విలుకాండ్రతోఁబోరునట్టివారునగు; తౌ=ఆరామలక్ష్మణులు;ఆశయా=ఆశచేత; జీవితం(అధ్యాహృతము)= ప్రాణమును; ధరిష్యేతే= తాల్పఁగలరు. మనస్వినః=మంచిమనస్సుగల;వానరాశ్చ=వానరులును; ధరిష్యంతి=(అధ్యాహృతము)తాల్పఁగలరు.

నేనుగిష్కింధకుఁ బోకుండనిచ్చటనేయుందునేని, ధర్మస్వభావులునదన్నునుసారథులనుగుఱ్ఱములను గాపాడుకొనుచుఁబదునొకండువేలమందివిలుకాండ్రతోఁబోరంజాలినవారునగు రామలక్ష్మణులు, నేనుసీతంజూచివత్తునను నాసం జేసి, ప్రాణంబులు ధరించియుందురు;అట్లుమంచిమనస్సుగలవానరులునుబ్రతికియుందురు.

అని, తాత్పర్యము.

హస్తాదానో ముఖాదానో నియతో వృక్షమూలికః. ౪౦
వానప్రస్థో భవిష్యామి హ్యదృష్ట్వా జనకాత్మజామ్

టీక॥అహం (అధ్యాహృతము)=నేను;జనకాత్మజాం=జనకునికూఁతురయినసీతను;అదృష్ట్వా=చూడక;హస్తాదానః=చేతులోఁబడినదాని భుజించువాఁడనై;ముఖాదానః=నోటిలోఁ బడినదానిభుజించువాఁడనై; వృక్షమూలికః=చెట్టుక్రిందనుండువాఁడనై; నియతః= నియమముగలవాఁడనై; వానప్రస్థః=వానప్రస్థుండను; భవిష్యామిహి=అగుదునుగదా!

నేను,సీతంబూడకుందునేని, చేతులంబడిన దానిభుజించుచు,నోటఁబడ్డదానిభుజించుచుఁ,జెట్టుక్రిందవాసముసేయుచు,నియమంబున,వానప్రస్థుండనయ్యెదను. అని, తాత్పర్యము.

సాగరానుపజే దేశే బహుమూలఫలోదకే. ౪౧
చితాం కృత్వా ప్రవేక్ష్యామి సమిద్ధ మరణీ సుతమ్

టీక॥అహం (అధ్యాహృతము) = నేను;బహుమూలఫలోదకే= అధికమయినమూలములునుబండ్లునునీళ్లునుగల; సాగరానుపజే=సముద్రము దగ్గి అనుందుజలప్రాయభూములఁగలిగిన;దేశే= ప్రదేశమునందు; చితాం=చితిని; కృత్వా=చేసికొని;సమిద్ధం=మండిన; అరణీసుతం=అగ్నిహోత్రుని;ప్రవేక్ష్యామి=చొచ్చెదను.

అటుగానిచో,నధికముగామూలములునుబండ్లునునీళ్లును గలయీ సముద్రముసమీపమందలిజలప్రాయ ప్రదేశమునందు, చితినేపఱచుకొని, మండుచున్నయగ్నిలోనికుఱికి,ప్రాణంబులు విడిచెదను.అని,తాత్పర్యము.

ఉపవిష్టస్య వాసమ్యా గ్లింగినం సాధయిష్యతః. ౪౨
"సమ్యగ్లింగినీం"ఇతి,గోవిందరాజమతేపాఠాంతరం.
శరీరం భక్షయిష్యంతి వాయసా శ్శ్వాపదానిచ

టీక॥వా=లేక;సమ్యక్ = చక్కఁగా;ఉపవిష్టస్య=కూచుండిన్నవాఁడును, ఏమియుఁదినకుండునట్టివ్రతము నవలంబించునట్టివాఁడునసుట;లింగినం=ఆత్మను;సాధయిష్యతః=దేహమునుండి వెడలునట్లుచేయఁగలవాఁడునగు;మమ (అధ్యాహృతము)=నాయొక్క; శరీరం= దేహమును;వాయసాః = కాకులును; శ్వాపదానిచ=క్రూరజంతువులును; భక్షయిష్యంతి=తినఁగలవు.

అటుగానిచో, నేనేమియునాహారముదీసికొనకుండి,యాత్మ దేహమును విడిచిపోవునట్లుచేయఁగానే, నాదేహమును గాకులునుబులులు మొదలగు నవి యుఁదినఁగలవు.అని,తాత్పర్యము.

పాఠాంతరపక్షమందు ; వా=లేక;ఉపవిష్టస్య=కూచుండినవాఁడును; లింగినీం=("లింగం" అనఁగా , ఏమియుఁదినకుండుట;అదిగలది,లింగినీ) ఏమియుఁదినకుండునట్టివ్రతమును; సాధయిష్యతః=సాధింపఁగలవాఁడును; మమ=నాయొక్క; శరీరం=దేహమును; వాయసాః=కాకులును ; శ్వాపదానిచ=క్రూరజంతువులును; భక్షయిష్యం

తి=తినఁగలవు.

అటుగానిచో, నేనేమియుఁదినకుండునట్టివ్రతంబునవలంబించి, కూర్చుండి, ప్రాణంబులువిడువఁగా, నాదేహమును గాకులును బలులు మొదలగు నవియుఁదినఁగలవు.

అని, తాత్పర్యము.

ఇదం మహర్షిభి ర్దృష్టం నిర్యాణ మితి మే మతిః. ౪౩

టీక॥ఇదం=ఈ; నిర్యాణం = చావు;మహర్షిభిః=పూజ్యులగు ఋషులచేత;దృష్టం=చూడఁబడినది" ఇతి= అని; మే=నాయొక్క;మతిః=తలంపు.

"ఇట్లు, ఏమియు భుజింపకుండి, ప్రాణంబులు విడుచుటను, మహర్షులు యుక్తమనిచెప్పియున్నారు" అని, తలంచెదను.అని, తాత్పర్యము.

సమ్య గాపః ప్రవేక్ష్యామి నచే త్పశ్యామి జానకీమ్

టీక॥అహం(అధ్యాహృతము)=నేను;జానకీం=సీతను; నపశ్యామిచేత్=చూడకుండునేని; సమ్యక్=చక్కఁగా; ఆపః(అపః)=నీళ్లను; ప్రవేక్ష్యామి=చొచ్చెదను.

నాకు,సీతయగపడకుండునేని, నీటిలోనైననుదుమికి,ప్రాణంబులువిడిచెదను. అని,తాత్పర్యము.

సుజాతమూలా సుభగా కీర్తిమాలా యశస్వినీ. ౪౪
ప్రభగ్నా చిర రాత్రీయం మమ సీతా మపశ్యతః

టీక॥సుజాతమూలా= మంగళకరమయినప్రారంభముగలదియును; సుభగా=మనోహరమయినదియును; కీర్తిమాలా= నాకుకీర్తులమాలికగానుండినదియును;యశస్వినీ=ప్రశస్తమగు కీర్తిగలదియునగు; ఇయం=ఈ; చిరరాత్రీ=దీర్ఘమయినరాత్రి;సీతాం=సీతను;అపశ్యతః=చూడనట్టి; మమ=నాకు;ప్రభగ్నా= నశించినది , వ్యర్థమయినదనుట.

మొదట,లంకాధిదేవతయగు లంకనుజయించుటంజేసి మంగళకరంబయిన ప్రారంభముగల్గి,సీతను వెదకుట కనుకూలముగా వెన్నెలగలుగుటవలన మ

నోహరంబయి,నాకధికకీర్తిఁ గలిగించునదియై,"హనుమంతుండు లంకం బ్రవేశించినరాత్రి"యని ప్రాగల్భ్యకెక్కఁగలదై,నిద్రమేల్కొనుటచే దీర్ఘముగాఁ గనుపించుచుండు,నీరాత్రి,సీతయగపడకుండుటవలన,నాకువ్యర్థమయినది.

అని,తాత్పర్యము.

తాపసోవా భవిష్యామి నియతో వృక్షమూలికః. ౪౫

టీక॥అహం(అధ్యాహృతము)=నేను;నియతః= నియమముగలవాఁడును;వృక్షమూలికః=చెట్టుక్రిందనుండు వాఁడునై ; తాపసోవా=తపస్విగానే;భవిష్యామి=అవుదును.

చచ్చుటకన్నబ్రతికియుండుట మేలుగావున, నేను,నియమంబవలంబించి, చెట్టుక్రిందనివాసముసేయుచుఁ , దపస్సుచేసికొనుచుండెదను.

అని,తాత్పర్యము.

నేతః ప్రతిగమిష్యామి తా మదృష్ట్వాఽసితేక్షణామ్

టీక॥అహం(అధ్యాహృతము)= నేను;అసితేక్షణాం = నల్లనికండ్లుగల ; తాం=ఆసీతను;అదృష్ట్వా=చూడక; ఇతః=ఇచ్చటనుండి;నప్రతిగమిష్యామి= మఱలిపోవుటలేదు.

నేను,నల్లనికండ్లుగలసీతం జూడక, ఇచ్చటనుండి,మఱలిపోవుటలేదు.

అని,తాత్పర్యము.

యదీతః ప్రతిగచ్ఛామి సీతా మనధిగమ్యతామ్. ౪౬
అంగద స్సహతై స్సర్వై ర్వానరై ర్నభవిష్యతి

అహం (అధ్యాహృతము) = నేను;తాం=ఆ;సీతాం=సీతను; అనధిగమ్య= తెలిసికొనక;ఇతః=ఇచ్చటనుండి,ప్రతిగచ్ఛామియది= మఱలిపోవుదునేని;అంగదః=అంగదుఁడు;తైః=ఆ; వానరైః=వానరులతో;సర్వైస్సహ =ల దఱితోసుగూడ;నభవిష్యతి=ఉండఁడు.

నేను,సీతయుండు తెఱంగు తెలిసికొనక, యిచ్చటనుండి సుగ్రీవునియొద్దకుఁబోక యంగదాదుల యొద్దకు మాత్రము పోయినను, సీతయగపడనివృత్తాంతమువిన్నంతనె, యంగదుఁడును

అచ్చటివానరులందఱును, ప్రాణంబులువిడుతురు. అని, తాత్పర్యము.

వినాశే బహవో దోషా జీవ న్భద్రాణిపశ్యతి. ౪౭
తస్మా త్ప్రాణా న్ధరిష్యామి ధ్రువో జీవితసంగమః

టీక॥ వినాశే=చచ్చుటయందు; బహవః=అనేకములయిన; దోషాః=దోషములు; సంతి(అధ్యాహృతము) = ఉన్నవి. జీవన్= బ్రతుకుచున్నవాఁడు; భద్రాణి = మంగళములను; పశ్యతి= చూచుచున్నాఁడు. తస్మాత్=అందువలన; ప్రాణాన్=ప్రాణంబులను; ధరిష్యామి=ధరించెదను. జీవితసంగమః= బ్రతుకుటయందు మంగళమునొందుట; ధ్రువః=సత్యము.

చచ్చినట్టయిన, ననేకదోషంబులు గలుగును, బ్రతికియుండునేని, పురుషుం డెప్పుడైనను, మంగళంబులఁజూడఁగలండు; కావున, నేనును బ్రాణంబులు విడువకుండెదను; అట్లుబ్రతికియుండునేని, నిశ్చయముగా, నెప్పుడైనను, మంగళము నొందుదును. అని, హనుమంతుండు, ఆలోచించెను. అని, తాత్పర్యము.

ఏవం బహువిధం దుఃఖం మనసా ధారయ న్ముహుః. ౪౮
నాధ్యగచ్ఛ త్తదా పారం శోకస్య కపికుంజరః

టీక॥ కపికుంజరః=వానరశ్రేష్ఠుండగుహనుమంతుండు; తదా=అప్పుడు; ఏవం=ఇట్లు; బహువిధం=అనేకవిధమయిన; దుఃఖం=దుఃఖమును; ముహుః= పలుమాఱు; మనసా=మనసుచేత; ధారయన్=ధరించుచు; శోకస్య= దుఃఖముయొక్క; పారం=తుదను; నాధ్యగచ్ఛత్=పొందలేదు.

వానరశ్రేష్ఠుండగు హనుమంతుండప్పుడిట్లు, అనేకవిధములుగాఁ బలుమాఱు దుఃఖించుచుండెను, అతనికెంతసేపునకును, దుఃఖం బెంతమాత్రము తఱుఁగదయ్యె.

అని, తాత్పర్యము.

రావణంవా వధిష్యామి దశగ్రీవం మహాబలమ్. ౪౯
కామ మస్తు హృతా సీతా ప్రత్యాచీర్ణం భవిష్యతి

టీక॥ అహం(అధ్యాహృతము)= నేను; దశగ్రీవం=పదికంఠములుగలవాఁడును; మహాబలం=అధికమయినబలముగలవాఁడునగు; రావణంవా=రావణునే; వధిష్యామి=చంపెదను. హృతా=అపహరింపఁబడిన; సీతా=సీత; కామమస్తు=ఎట్లయిననుఅగుఁగాక! ప్రత్యాచీర్ణం=బదులుచేయుట; భవిష్యతి=కాఁగలదు.

పదికంఠములుగలిగి, మహాబలుండై యుండురావణునేచంపెదను; వానిచే నపహరింపఁబడిన, సీత, దొరకకపోయిననుబోవుఁగాక; ఎట్లయినను అగుఁగాక! వాఁడు చేసినందుకు బదులుచేసి, పగతీర్చుకొన్నట్లగుచున్నది.

అని, తాత్పర్యము.

అథవైనం సముత్క్షిప్య ఉపర్యుపరి సాగరమ్. ౨౦
రామాయోపహరిష్యామి పశుం పశుపతేరివ

టీక॥ అథవా=అటుగానిచో; అహం(అధ్యాహృతము)=నేను; ఏనం=ఈరావణుని; సాగరం (షష్ఠ్యర్థేద్వితీయ)=సముద్రముయొక్క; ఉపర్యుపరి=కొంచెముమీఁదుగా; సముత్క్షిప్య=ఎత్తుకొని; రామాయ=రామునికొఱకు; పశుపతేః=అగ్నిహోత్రునకు; పశుమివ=పసువునుంబోలె; ఉపహరిష్యామి=కానుకగాసమర్పించెదను.

అటుగానిచో, నీరావణుని, సముద్రమునకుఁగొంచెముమీఁదుగా, భయంబున వెలవెలంబోవునట్లు, ఎత్తుకొనిపోయి, యాగంబునసగ్నిహోత్రునకుఁ బశువునుసమర్పించునట్లు, రామునకుఁగానుకగాసమర్పించెదను. అని, హనుమంతుండాలోచించెను.

అని, తాత్పర్యము.

ఇతి చింతాం సమాపన్నః సీతా మనధిగమ్య తామ్. ౨౧
ధ్యానశోకపరీతాత్మా చింతయామాస వానరః

టీక॥ వానరః=హనుమంతుఁడు; తాం=ఆ; సీతాం=సీతను; అనధిగమ్య=తెలిసికొనక, చూడకయనుట; ఇతి=ఇట్లు; చింతాం=ఆలోచనమును; సమాపన్నః=పొందినవాఁడై; ధ్యానశోకపరీతాత్మా=ఆలోచనముచేతను

దుఃఖముచేతనువ్యాపింపఁబడిన మనసు గలవాఁడై; చింతయామాస= చింతించెను.

హనుమంతుం,డిట్లు,సీతంజూడనేరక,చింతించి,యాలోచనంబుననుదుఃఖంబుననుమునింగియిట్లని మఱలఁజింతించెను.అని,తాత్పర్యము.

యావత్సీతాం హి పశ్యామి రామపత్నీం యశస్వినీమ్. ౫౨
తావ దేతాం పురీం లంకాం విచినోమి పునఃపునః

టీక॥యావత్=ఎంతలోపల; యశస్వినీం=అధికకీర్తిగల;రామపత్నీం=రామునిభార్యయయిన; సీతాం= సీతను;పశ్యామి=చూతునో;తావత్=అంతవఱకు;ఏతాం=ఈ ; లంకాం=లంకయనెడు;పురీం=పట్టణమును; పునఃపునః=మాటిమాటికి;విచినోమిహి=వెదకెదనుగదా!

నాకుఁ, బ్రశస్తమగు కీర్తిగలరామునిభార్యయయిన సీతయగుపడువఱకు,ఈలంకాపట్టణంబంతయు, మాటిమాటికివెదకుచుండెదను.

అని,తాత్పర్యము.

సంపాతివచనాచ్చాపి రామం యద్యానయామ్యహమ్. ౫౩
అపశ్యన్రాఘవో భార్యాం నిర్దహేత్సర్వవానరాన్

టీక॥అహం=నేను;సంపాతివచనాచ్చాపి= సంపాతియొక్క మాటవలననే;రామం = రాముని ; ఆనయామియది = తీసికొనివత్తునేని; రాఘవః=రాముఁడు; భార్యాం = పెండ్లామును;అపశ్యన్=చూడనివాఁడై; సర్వవానరాన్=సమస్తవానరులను;నిర్దహేత్=కాల్చును.

నేను,సంపాతిమాటనేనమ్మి,రామునిచ్చటికిఁదోడ్కొనివచ్చియుందునేని, రాముండు, తనభార్యసీత యగపడకున్నందున,వానరులనందఱంజంపును.

అని, తాత్పర్యము.

ఇహైవ నియతాహారో వత్స్యామి నియతేంద్రియః. ౫౪

న మత్కృతే వినశ్యేయు స్సర్వేతే నరవానరాః

టీక॥ అహం (అధ్యాహృతము)=నేను;నియతాహారః=నిగ్రహింపఁ బడిన యాహారముగలవాఁడనై; నియతేంద్రియః = నిగ్రహింపఁబడిన యింద్రియములుగలవాఁడనై; ఇహైవ = ఇచ్చటనే ; వత్స్యామి= ఉండెదను. తే=ఆ;నరవానరాః = మనుష్యులును వానరులును;సర్వే= అందఱును ; మత్కృతే=నాకుఁగా;నవినశ్యేయుః=నశింపకుందురుగాఁక.

నేను , ఆహారంబువిడిచి యింద్రియంబులనిగ్రహించికొని, యిచ్చటనే, వాసముచేసెదను;నాకుఁగా , నారాముందుమొదలగుమనుష్యులును , సుగ్రీవుండుమున్నగువానరులునుజావకుందురుగాక. అని, తాత్పర్యము.

అశోకవనికా చేయం దృశ్యతే యా మహాద్రుమా. ౫౫
ఇమా మధిగమిష్యామి నహీయం విచితా మయా

టీక॥యా=ఏది;మహాద్రుమా=పెద్దచెట్లుగలదో;సా(అధ్యాహృతము)=అట్టి;ఇయం=ఈ;అశోకవనికాచ= అశోకవనమును;దృశ్యతే=చూడఁబడుచున్నది.ఇమాం=ఈయశోకవనికను; అధిగమిష్యామి=పొందెదను.ఇయం=ఇది; మయా=నాచేత;నవిచితాహి = వెదకఁబడలేదుగదా!

పెద్దవృక్షంబులతోఁగూడిన యశోకవనికయిదిగో!అగపడుచున్నది; ఇచ్చటికిబోయెదను; నేనిచ్చటనిదివఱకు వెదకలేదు. అని,తాత్పర్యము.

వసూ న్రుద్రాం స్తథాదిత్యా నశ్వినౌ మరుతోపిచ. ౫౬
నమస్కృత్వా గమిష్యామి రక్షసాం శోకవర్ధనః

టీక॥అహం(అధ్యాహృతము)=నేను;వసూన్=వసువులను; రుద్రాన్=రుద్రులను,తథా=అట్లు; ఆదిత్యాన్=సూర్యులను;అశ్వినౌ=అశ్వినీ దేవతలను;మరుతోపిచ=వాయువులను ; నమస్కృత్వా=నమస్కరించి; రక్షసాం=రాక్షసులకు;శోకవర్ధనః= దుఃఖము వృద్ధిఁబొందించువాఁడనై ; గమిష్యామి=పోయెదను.

అష్టవసువులకును ఏకాదశరుద్రుల

స ౧౩

కును ద్వాదశాదిత్యులకును అశ్వినీదేవతలకును సప్తమారుతంబులకును, నమస్కారము చేసి, రాక్షసులకు దుఃఖము వృద్ధిం బొందుటకై, యీయశోకవనికం జొచ్చెదను.

అని, తాత్పర్యము.

జిత్వా తు రాక్షసాన్ సర్వా నిక్ష్వాకుకులనందినీమ్. ౫౭
సంప్రదాస్యామి రామాయ యథాసిద్ధిం తపస్వినే

టీక॥ అహం (అధ్యాహృతము) = నేను; రాక్షసాన్ = రాక్షసులను; సర్వాన్ = అందఱను; జిత్వా తు = జయించియు; ఇక్ష్వాకుకులనందినీం = ఇక్ష్వాకు వంశమును సంతసించునట్లు చేయునట్టి సీతను; రామాయ = రామునికొఱకు; తపస్వినే = ప్రశస్తమగు తపసు గలవానికొఱకు; సిద్ధిం యథా = తపః ఫలంబునుంబోలె; సంప్రదాస్యామి = ఇచ్చెదను.

నేను రాక్షసులనందఱనుజయించి, తపస్వికి తపఃఫలంబొసంగునట్లు, రామునకు; ఇక్ష్వాకువంశంబునకు సంతోషంబు గల్గించునట్టి సీతనిచ్చెదను, అని, హనుమంతుండు, చింతించెను. అని, తాత్పర్యము.

సుముహూర్తమివ ధ్యాత్వా చింతావగ్రథితేంద్రియః. ౫౮
ఉదతిష్ఠ న్మహాతేజా హనుమా న్మారుతాత్మజః

టీక॥ మహాతేజాః = అధికమయిన పరాక్రమముగలవాఁడును; మారుతాత్మజః = వాయుదేవునికొడుకునగు; హనుమాన్ = హనుమంతుండు; చింతావగ్రథితేంద్రియః = దుఃఖముచేత వ్యాకులములయినయింద్రియంబులు గలవాఁడై; సుముహూర్తం = కొంచెము సేపు ("ఇవ" అనునది వాక్యాలంకారార్థము); ధ్యాత్వా = ఆలోచించి; ఉదతిష్ఠత్ = లేచెను.

మహాపరాక్రమశాలియు వాయుదేవునికుమారుండునగు హనుమంతుండు, దుఃఖంబున వ్యాకులత నొందిన యింద్రియములతోఁ, గొంచెము సేపు, చింతించి, యటువెనుక, అశోక వనమునకుం బోవనుద్యుక్తుండయ్యెను.

అని, తాత్పర్యము.

నమోస్తు రామాయ సలక్ష్మణాయ
దేవ్యై చ తస్యై జనకాత్మజాయై. ౫౯
నమోస్తు రుద్రేంద్రయమానిలేభ్యో
నమోస్తు చంద్రార్క-మరుద్గణేభ్యః

టీక॥సలక్ష్మణాయ=లక్ష్మణునితోఁ గూడిన; రామాయ =రామునికొఱకు; నమః=నమస్కారము;అస్తు=అగుఁగాక. దేవ్యై=రాణియగు; తస్యై=ఆ; జనకాత్మజాయై=జనకునికూఁతురయిన సీతకొఱకు;నమః=నమస్కారము;అస్తు=అగుఁగాక. రుద్రేంద్రయమానిలేభ్యః=శివునికొఱకును, ఇంద్రునికొఱకును,యమునికొఱకును,వాయువుకొఱకును;నమః=నమస్కారము;అస్తు=అగుఁగాక. చంద్రార్క-మరుద్గణేభ్యః=చంద్రునికొఱకును,సూర్యునికొఱకును వాయుసమూహములకొఱకును;నమః=నమస్కారము;అస్తు=అగుఁగాక.

రామునకును లక్ష్మణునకును నమస్కారముచేసెదను; జనకునికొమార్తె యగుసీతాదేవికిని నమస్కరించెదను;రుద్రునకునింద్రునకుయమునకు వాయుదేవునకు నమస్కరించెదను; చంద్రునకును సూర్యునకును సప్తమారుతంబులకును నమస్కరించెదను. అని,హనుమంతుఁడు, దేవతలకునమస్కరించెను.

అని, తాత్పర్యము.

స తేభ్యస్తు నమస్కృత్వా సుగ్రీవాయచ మారుతిః. ౬౦
దిశ స్సర్వా స్సమాలోక్య హ్యశోకవనికాం గతః

టీక॥సః=ఆ; మారుతిః=వాయువు కొడుకైనహనుమంతుఁడు; తేభ్యః=ఆ దేవతలకొఱకు;నమస్కృత్వాతు=నమస్కరించినంతనే; సుగ్రీవాయచ=సుగ్రీవునికొఱకును; నమశ్చక్రే (అధ్యాహృతము)=నమస్కరించెను. దిశః=దిక్కులను;సర్వాః=అన్నిటిని;సమాలోక్య=చూచి; అశోకవనికాం=అశోకవనమును;గతోహి=పొందినాఁడుగదా!అశోకవనికాంప్రతి(అని, పాఠాంతరము)=అశోకవనమునుగూర్చి; సమాలోకయత్(అధ్యాహృతము) = చూచెను.

ఆహనుమంతుఁడు, ఆదేవతలకును, సుగ్రీవునకును నమస్కరించి, యంతది క్కులనన్నింటినిఁజూచి, యశోకవనమునకుఁ బోయెను. (పాఠాంతరమందు, అశోకవనికనుఁజూచెను).

అని, తాత్పర్యము.

స గత్వా మనసా పూర్వ మశోకవనికాం శుభామ్. ౬౧
ఉత్తరం చింతయామాస వానరో మారుతాత్మజః

టీక॥ మారుతాత్మజః=వాయుదేవునికుమారుండగు; సః=ఆ; వానరః=హనుమంతుఁడు; పూర్వం=మొదట; శుభాం= మంగళకరమయిన; అశోకవనికాం=అశోకవనమును; మనసా=మనసుచేత; గత్వా=పోయి, పోనిశ్చయించి; ఉత్తరం=పైకార్యమును; చింతయామాస=ఆలోచించెను.

వాయుదేవుని కుమారుండగుహనుమంతుండు, మొదటమనసున నాలోచించి, యశోకవనంబునకుఁబోవునట్లు నిశ్చయించి, యటుపిమ్మటఁ, జేయవలసినకార్యమునుగుఱించి, యాలోచించెను.

అని, తాత్పర్యము.

ధ్రువంతు రక్షోబహులా భవిష్యతి వనాకులా. ౬౨
అశోకవనికా చింత్యా సర్వ సంస్కారసంస్కృతా

టీక॥ చింత్యా=వెదకఁదగిన; అశోకవనికా=అశోకవనము; ధ్రువంతు=నిశ్చయముగానే; రక్షోబహులా=రాక్షసులధికముగాఁగలదిగాను; వనాకులా= వృక్షముల సమూహములచేనిఱుకుగనుండు నదిగాను; సర్వసంస్కారసంస్కృతా=సమస్తములైనదున్నుటమొదలగుసంస్కారములచేఁజక్కఁజేయఁబడినదిగాను; భవిష్యతి=ఉండఁగలదు.

ఇప్పుడు నేనువెదకఁబోవునట్టి యశోకవనిక, నిశ్చయముగాఁ గావలివాండ్రగు పెక్కురక్కసులుగలిగి, వృక్షసమూహంబులతోఁగూడి, దున్నుటమొదలగు సర్వసంస్కారములచేతనుం జక్కఁజేయఁబడి, యుండఁగలదు.

అని, తాత్పర్యము.

రక్షిణ శ్చాత్ర విహితా నూనం రక్షంతి పాదపాన్. ౬౩

టీక॥అత్ర = ఈయశోకవనికయందు;విహితాః=నియోగింపఁబడిన;రక్షిణశ్చ=కావలివాండ్రును;పాదపాన్=వృక్షములను; రక్షంతి = కాపాడుచున్నారు.నూనం=నిశ్చయము!

ఈయశోకవనికనురక్షించుటకై రావణునిచేనుంచఁబడిన కావలివాండ్రు, ఇచ్చటివృక్షములనుజాగ్రత్తతో,రక్షించుచుందురు.

అని, తాత్పర్యము.

భగవానపి సర్వాత్మా నాతిక్షోభం ప్రవాతి వై

టీక॥ సర్వాత్మా=అన్నిటియందునుస్వరూపముగల,సర్వవ్యాపకుండయినయనుట;భగవానపి=మాహాత్మ్యముగలవాయుదేవుఁడును; అతిక్షోభం=వృక్షముల కధికముగాక్షోభముగలుగునట్లు; నప్రవాతి=వీవఁడు. ("వై" అనునదిపాదపూరణార్థము).

సర్వవ్యాపకుఁడును భగవంతుండునగువాయుదేవుఁడును,భయంబున,వృక్షములకుక్షోభముగలుగునట్లు, అధికముగా,వీవకున్నాఁడు.

అని, తాత్పర్యము.

సంక్షిప్తోయం మయాత్మాచ రామార్థే రావణస్యచ. ౪౮

టీక॥మయా=నాచేత ; అయం=ఈ;ఆత్మాచ=దేహమును; రామార్థే=రామునికొఱకును; రావణస్య(అర్థే) చ=రావణునకుఁగాను; సంక్షిప్తః=చిన్నదిచేయఁబడినది.

రామునకుఁ గార్యసిద్ధియగుటకును, రావణునకు నేనగపడకుండుటకును, నేనునాదేహమునుజిన్నదిగాఁ జేసుకొంటిని. అని, తాత్పర్యము.

సిద్ధిం మే సంవిధాస్యంతి దేవా స్సర్షిగణా స్త్విహ

టీక॥సర్షిగణాః=ఋషులసమూహములతోఁగూడిన; దేవాస్తు=దేవతలె;ఇహ=ఇచ్చట;మే=నాకొఱకు ; సిద్ధిం=కార్యసిద్ధిని; సంవిధాస్యంతి=చేయఁగలరు.

నేనుగార్యసిద్ధి కనుకూలముగాఁబ్రయత్నముచేసినాను;ఇచ్చటనాకుఁ గార్యసిద్ధి, గలుగునట్లు, దేవతలునుఋషు

లును,చేసెదరు. అని, తాత్పర్యము.

బ్రహ్మా స్వయంభూ ర్భగవాన్ దేవాశ్చైవ దిశంతు మే. ౬౫
సిద్ధి మగ్నిశ్చ వాయుశ్చ పురుహూతశ్చ వజ్రభృత్
వరుణః పాశ హస్తశ్చ సోమాదిత్యౌ తథైవచ. ౬౬
అశ్వినౌచ మహాత్మానౌ మరుత శ్శర్వ ఏవచ

టీక॥స్వయంభూః=తనకుతానేపుట్టినవాఁడును;భగవాన్=అధికమయినమాహాత్మ్యముగలవాఁడునగు; బ్రహ్మా =బ్రహ్మయును;దేవాశ్చైవ= దేవతలును; అగ్నిశ్చ= అగ్నిహోత్రుఁడును; వాయుశ్చ=వాయుదేవుఁడును ; వజ్రభృత్=వజ్రాయుధమును ధరించునట్టి; పురుహూతశ్చ=ఇంద్రుండును; పాశహస్తః=పాశముచేతియందుఁగల;వరుణశ్చ=వరుణుండును; సోమాదిత్యౌ=చంద్రుండునుసూర్యుండును;తథైవచ=అట్లె;మహాత్మానౌ=పూజ్యమయినస్వభావముగల;అశ్వినౌచ=అశ్వినీ దేవతలును;మరుతః=వాయువులును ; శర్వ ఏవచ=శివుఁడును;మే=నాకొఱకు; సిద్ధిం=కార్యసిద్ధిని; దిశంతు = ఇత్తురుగాక.

తనకుఁదానెపుట్టినవాఁడును భగవంతుండునగుబ్రహ్మదేవుండును, దేవతలును,అగ్నియును,వాయువును, వజ్రధరుండగునింద్రుండును,పాశధరుండగువరుణుండును జంద్రుండును సూర్యుండును,మహాత్ములగు నశ్వినీదేవతలును సప్తమారుతంబులును శివుండును,నాకుఁగార్యసిద్ధినొసంగుదురుగాక.
అని, తాత్పర్యము.

సిద్ధిం సర్వాణి భూతాని భూతానాం చైవ యః ప్రభుః. ౬౭
దాస్యంతి మమ యే చాన్యే హ్యదృష్టాః పథి గోచరాః

టీక॥సర్వాణి=సమస్తము లయిన; భూతాని=భూతములును ; భూతానాం=భూతములయొక్క ; ప్రభుః= నాయకుఁడు; యః=ఎవ్వఁడో ; సః (అధ్యాహృతము)చైవ= అతండును; అన్యే=ఇతరులయిన;పథి = మార్గమునందు;అదృష్టాః= చూడఁబడనివారును; గోచరాః = నేత్రవిషయముల

గువారలు, చూడఁబడువారలు ననుట; యే=ఎవరో; తే(అధ్యాహృతము)చ=వారును; మమ=నాకు; సిద్ధిం=కార్యసిద్ధిని; దాస్యంతిహి=ఇత్తురుగదా!

సమస్తభూతంబులును, భూతనాయకుండగు సర్వేశ్వరుండును, మఱియు మార్గము నందు దృష్టులై యదృష్టులై యెవ్వరుండురో, వారును, నాకుఁ, గార్యసిద్ధినొసంగుదురుగాక.

అని, తాత్పర్యము.

తదున్నసం పాండురదంత మవ్రణమ్
శుచిస్మితం పద్మపలాశలోచనమ్. ౬౧
ద్రక్ష్యే త దార్యావదనం కదా న్వహమ్
ప్రసన్నతారాధిపతుల్యదర్శనమ్

టీక॥ తత్=అందువలన; అహం=నేను; ఉన్నసం=ఉన్నతమయిన ముక్కుకలదియును; పాండురదంతం=తెల్లని దంతములుగలదియును; అవ్రణం=గాయములేనిదియును, దోషములేనిదియు ననుట; శుచిస్మితం=తెల్లని చిఱునవ్వుగలదియును; పద్మపలాశలోచనం=తామరపూరేకులవంటి కండ్లుగలదియును; ప్రసన్నతారాధిపతుల్యదర్శనం = నిర్మలుఁడయినచంద్రునితోసరియయిన చూచుటగలదియునగు; తత్=ఆ; ఆర్యావదనం = పూజ్యురాలగుసీతయొక్కముఖమును; కదాను=ఎప్పుడు; ద్రక్ష్యే=చూచెదను?

అట్లగుటం జేసి, యున్నతంబయిన ముక్కుగలిగి, తెల్లనిదంతములు గలిగి, దోషంబులులేక, తెల్లనిచిఱునగవునొప్పుచు, తామరపూరేకులంబోలు నేత్రంబుల నలరారుచు, నిర్మలుండగు చంద్రుండుంబోలెంజూపట్టుచున్న, సీతాదేవిముఖంబును నేనెప్పుడు, చూడఁగలను? అని, తాత్పర్యము.

క్షుద్రేణ పాపేన నృశంసకర్మణా
సువారుణాలంకృతవేషధారిణా. ౬౨
బలాభిభూతా హ్యబలా తపస్వినీ
కథన్ను మే దృష్టిపథేద్య సా భవేత్

టీక॥ దుష్టేన=దుష్టుండును; పాపేన=పాపముసేయువాఁడును; నృశంసకర్మణా= క్రూరములయినకార్యములుగలవాఁడును; సుదారుణాలంకృతవేషధారిణా=మిక్కిలియుభయంకరుండును, అలంకారముతోఁ గూడిన వేషముధరించువాఁడునగు; రావణేన=(అధ్యాహృతము)రావణునిచేత;బలాభిభూతా=బలిమిచేతఁ దిరస్కరింపఁబడినదియును("హా"అనునది పాదపూరణార్థము); తపస్వినీ=కరుణింపఁదగినదియునగు;సా=ఆ; అబలా=స్త్రీయయినసీత; కథన్ను=ఎట్లు; మే=నాయొక్క; దృష్టిపథే=చూచుటయొక్క మార్గమునందు; అద్య=ఇప్పుడు; భవేత్=అగును?

దుష్టుండును పాపిష్ఠుండును క్రూరకార్యంబులు సేయువాఁడును అతిభయంకరుండైనను పైకిఁ బ్రసన్నవేషంబు దాల్చియున్నవాఁడునగు రావణునిచే, బలంబున, బందీకృతయయి, శోచనీయమైయుండు,సీతను, నేనిప్పుడేవిధంబునం,జూడఁగలను?

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, సుందరకాండే, త్రయోదశస్సర్గః.

ఇది,స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, సుందరకాండత్రయోదశసర్గటీక, ముగిసినది.



శ్రీ

చతుర్దశసర్గప్రారంభః.

సుముహూర్తమివ ధ్యాత్వా మనసాచాధి గమ్య తామ్
అవప్లుతో మహాతేజాః ప్రాకారం తస్య వేశ్మనః. ౧

టీక॥ మహాతేజాః=అధికమయినపరాక్రమముగల హనుమంతుండు ; సుముహూర్తం= కొంచెముసేపు ("ఇవ" అనునదివాక్యాలంకారార్థము )

ధ్యాత్వా=ఆలోచించి; తాం= ఆయ శోకవనికను; మనసా=మనసుచేత; అధిగమ్యచ=పొందియు; పొందనిశ్చయించియనుట;తస్య=ఆరావణునియొక్క; వేశ్మనః=ఇంటనుండి; ప్రాకారం= ప్రహరిని; అవప్లుతః=పొందినాఁడు.

మహా పరాక్రమశాలియగు హనుమంతుండు , ఇట్లుకొంచెముసేపాలోచించి, మనంబున నాయశోకవనికకుఁబోవనిశ్చయించి,యారావణునింటనుండి, యశోకవనిక ప్రహరిమీఁదికి దుమికెను. అని, తాత్పర్యము.

సతు సంప్రాప్తసర్వాంగః ప్రాకారస్థో మహాకపిః
పుష్పితాగ్రాన్ వసంతాదౌ దదర్శ వివిధాన్ ద్రుమాన్. ౨
సాలా నశోకాన్ భవ్యాంశ్చ చంపకాంశ్చ సుపుష్పితాన్
ఉద్దాలకా న్నాగవృక్షాం శ్చూతా నృపి ముఖా నపి. ३

టీక॥ప్రాకారస్థః=ప్రహరియందున్న; మహాకపిః=పెద్దకోఁతియగు ; సతు=ఆహనుమంతుఁడు; సంప్రాప్త సర్వాంగః=గగుపాటుగొనిన యన్ని యవయవములునుగలవాఁడై;వసంతాదౌ=వసంతఋతువు ప్రారంభంబునందు;పుష్పితాగ్రాన్=పుష్పించిన శిఖరములుగల;సాలాన్ = మద్దిచెట్లను;భవ్యాన్=మనోహరములయిన ; అశోకాంశ్చ=అశోకవృక్షములను; సుపుష్పితాన్;చక్కఁగాఁబూచిన;చంపకాంశ్చ=సంపెఁగచెట్లను; ఉద్దాలకాన్=విరిగిచెట్లను; నాగవృక్షాన్=పొన్నచెట్లను;చూతాన్=మామిడిచెట్లను; కపిముఖానపి=తీఁగకానుగుచెట్లను ; వివిధాన్= నానావిధములయిన ; ద్రుమాన్=వృక్షములను;దదర్శ = చూచెను.

ఆహనుమంతుఁడు,ఆయశోక వనిక ప్రాకారముపైఁగూర్చుండి, బహుసంతోషంబునొంది,వసంతప్రారంభంబున, చక్కఁగాఁబూచియుండు కొనలుగల, మద్దిచెట్లనుమనోహరములయిన యశోకవృక్షంబులనుజంపకవృక్షంబులనువిరిగిచెట్లనుబొన్నచెట్లనుమామిడిచెట్లనుదీఁగకానుగుచెట్లను,ఇట్లు, నానావిధంబులయినవృక్షంబులనుం,జూచెను.

అని, తాత్పర్యము.

అథామ్రవణ సంఛన్నాం లతాశతసమావృతామ్

స ౧౪

జ్యాముక్త ఇవ నారాచః పుప్లువే వృక్షవాటికామ్. ౪

టీక॥ సః (అధ్యాహృతము) = ఆహనుమంతుఁడు; అథ = అటుపిమ్మట; జ్యాముక్తః = అల్లెత్రాటనుండి విడువఁబడిన; నారాచ ఇవ = బాణమువలె; ఆమ్రవణసంఛన్నాం = మామిడిచెట్లగుంపుచేఁ గప్పఁబడినదియును; లతాశతసమావృతాం = తీఁగెలయొక్క నూటిచే (పెక్కుతీఁగెలచే) చుట్టఁబడినదియునగు; వృక్షవాటికాం = చెట్లతోఁటను; పుప్లువే = ప్రాఁకెను.

అంతనాహనుమంతుండు, అల్లెత్రాటనుండి విడువంబడిన బాణంబుంబోలె, నతివేగంబున, మామిడిచెట్లు విశేషముగాఁ గల్గి, నానావిధములయిన లతలనొప్పుచుండు, వృక్షవాటికను, లంఘించెను. అని, తాత్పర్యము.

స ప్రవిశ్య విచిత్రాంతాం విహగై రభినాదితామ్
రాజతైః కాంచనై శ్చైవ పాదపై స్సర్వతో వృతామ్. ౫
విహగై ర్మృగసంఘైశ్చ విచిత్రాం చిత్రకాననామ్
ఉదితాదిత్యసంకాశాం దదర్శ హనుమాన్ కపిః. ౬
వృతాం నానావిధై ర్వృక్షైః పుష్పోపగ ఫలోపగైః
కోకిలై ర్భృంగరాజైశ్చ మత్తై ర్నిత్య నిషేవితామ్. ౭
ప్రహృష్టమనుజే కాలే మృగపక్షిసమాకులే
మత్తబర్హిణసంఘుష్టాం నానాద్విజగణాయుతామ్. ౮

టీక॥ సః = ఆ; కపిః = కోఁతియగు; హనుమాన్ = హనుమంతుఁడు; ప్రహృష్టమనుజే = సంతసించినమనుష్యులు గలదియును; మృగపక్షిసమాకులే = మృగములచేతను బక్షులచేతను నిండినదియునగు; కాలే = వసంతప్రారంభకాలమందు; ప్రవిశ్య = చొచ్చి; విచిత్రాంతాం = నానావిధములయినకొనలు గలదియును; విహగైః = పక్షులచేత; అభినాదితాం = ధ్వనించునట్లుచేయఁబడినదియును; రాజతైః = వెండివికారములయినవియును, రజతవర్ణము గలవియనుట; కాంచనైశ్చైవ = బంగారువికారములునగు, బంగారువర్ణము

గలవియునగుననుట; పాదపైః = చె ట్లచేత; సర్వతః = అంతటను; వృ తాం=చుట్టఁబడినదియును; విహగైః= పక్షులచేతను; మృగసంఘైశ్చ=మృగ ములసమూహముల చేతను;విచిత్రాం= నానావర్ణములు గలదియును; చిత్ర కాననాం = నానావిధములయిన యు వాంతరవనములుగలదియును; ఉదితా దిత్యసంకాశాం=ఉదయించినసూర్యుని తోసమానమయినదియును; పుష్పోపగ ఫలోపగైః, పుష్పోపగ=పూలనుబొం దునవియును, పూలతోఁగూడినవియు ననుట,ఫలోపగైః=పండ్లను బొందున వియును,పండ్లతోఁగూడినవియుననుట; నానావిధైః=పలువిధము లయినవియు నగు;వృక్షైః=చెట్లచే; వృతాం=చుట్టఁ బడినదియును;మత్తైః=మదించిన; కోకి లైః= కోయిలలచేతను; భృంగరాజై శ్చ=తుమ్మెదలలో శ్రేష్ఠములైనవానిచే తను;నిత్యనిషేవితాం =ఎల్లప్పుడును సే వింపఁబడినదియును;మత్తబర్హిణసం ఘుష్టాం=మదించిననెమళ్లచే ధ్వనించు నట్లుచేయఁ బడినదియు; నానాద్విజగ ణాయుతాం= నానావిధములయినప క్షులసమూహములతోఁ గూడినదియు నగు; అశోకవనికాం= (అధ్యాహృత ము)అశోకవనికను; దదర్శ=చూచెను.

ఆహనుమంతుండు, మనుష్యులకంద అకునుసంతోషముగల్గించునదియైమృగ ములనుబక్షులను ఒప్పుచుండు వసంత ప్రారంభకాలమందు,ఆయశోకవనికం బ్రవేశించి,నానావిధములయిన కొనలు గల్గి,పక్షులమధురధ్వనులతోఁగూడి, ర జతవర్ణంబులును బంగారువన్నెగల వియునగు వృక్షంబుల నంతటనుం దే జరిల్లుచు, నానావిధము లగు పక్షులు ను మృగంబులునుగల్గుటంజేసి విచిత్ర వర్ణంబై, నానావిధంబులుగా నేర్ప ఱుపఁబడిన యవాంతర వనంబులతోఁ గూడి,యుదయకాలంబుననుండు సూ ర్యునికైవడి భాసిల్లుచుఁ, బూలతోను బండ్లతోనుగూడియుండు నానావిధవృ క్షంబులుగల్గి, మదించిమధురంబుగాఁ గూయుచుండుకోయిలలతోనుతుమ్మెద లతోను జెన్నొందుచు, మదంబున మ ధురంబుగాఁ గేకలు వేయు నెమళ్లు గలిగి, మఱియు, నానావిధ పక్షుల తోనొప్పుచున్న, యశోకవనికం, జూ చెను.

అని, తాత్పర్యము.

మార్గమాణో వరారోహాం రాజపుత్రీ మనిందితామ్

సుఖప్రసుప్తాన్ విహగా న్బోధయామాస వానరః. ౯

టీక॥ వానరః=హనుమంతుఁడు; వరారోహాం=శ్రేష్ఠములయిన పిఱుఁదులుగలదియును; అనిందితాం=నిందింపఁబడనిదియును; రాజపుత్రీం=రాచకొమార్తె యయినగు సీతను; మార్గమాణః=వెదకుచు; సుఖప్రసుప్తాన్=సుఖముగా నిదురించియున్న; విహగాన్=పక్షులను; బోధయామాస=మేలుకొలిపెను.

హనుమంతుం, డప్పుడు, శ్రేష్ఠములయినగొప్పపిఱుఁదులుగలదియు నిందింపఁబడనదియునగుసీతను వెదకుచుండుటవలన, నచ్చటివృక్షంబులు కదలుటం జేసి, సుఖముగా నిదురించియున్న పక్షులు మేలుకొనినవి.

అని, తాత్పర్యము.

ఉత్పతద్భి ర్ద్విజగణైః పక్షైః సాలా స్సమాహతాః
అనేకవర్ణా వివిధా ముముచుః పుష్పవృష్టయః. ౧౦

టీక॥ సాలాః=వృక్షములు; ఉత్పతద్భిః=ఎగురుచున్న; ద్విజగణైః=పక్షులసమూహములచేత; పక్షైః=ఱెక్కలచేత; సమాహతాః=కొట్టఁబడినవై; అనేకవర్ణాః = పెక్కువన్నెలుగలవియును; వివిధాః=నానావిధము లయినవియునగు; పుష్పవృష్టయః (పుష్పవృష్టీః)=పూలవానలను; ముముచుః=విడిచినవి.

అప్పుడుపక్షులు గుంపులుగుంపులుగా నెగురుచుండఁగా వానిఱెక్కలచేఁ గదలింపంబడి, వృక్షంబులు, నానావర్ణంబులునానావిధంబులునైనపూలం గురిసినవి.

అని, తాత్పర్యము.

పుష్పావకీర్ణ శ్శుశుభే హనుమా న్మారుతాత్మజః
అశోకవనికా మధ్యే యథా పుష్పమయో గిరిః. ౧౧

టీక॥ అశోకవనికామధ్యే=అశోకవనమునడుమునందు; పుష్పావకీర్ణః=పూలచేవ్యాపింపఁబడిన; మారుతాత్మజః = వాయువు కొడుకైన; హను

మారుతిః = హనుమంతుఁడు; పుష్పమయః = పూలవికారమయిన; గిరిర్యథా= పర్వతముంబోలె; శుశుభే=ప్రకాశించెను.

అశోకవనంబునడుమఁబూలచేఁ గప్పఁబడియున్నవాయుపుత్రుండగు హనుమంతుఁడు, పూలకొండ యనందగి యొప్పుచుండెను.అని, తాత్పర్యము.

దిశ స్సర్వాః ప్రధావంతం వృక్షషండగతం కపిమ్
దృష్ట్వా సర్వాణి భూతాని వసంతఇతి మేనిరే.౧౨

టీక॥ భూతాని=భూతములు; సర్వాణి= అన్నియును; దిశః=దిక్కులను;సర్వాః=అన్నిటినిగూర్చి; ప్రధావంతం = పరులిడుచున్నవాఁడును; వృక్షషండగతం = చెట్లయొక్క సమూహమునుబొందిన వాఁడునగు; కపిం=హనుమంతుని; దృష్ట్వా=చూచి; వసంతః=వసంతుఁడు;ఇతి=అని; మేనిరే=తలంచినవి.

అన్నిదిక్కులకునుబరులిడుచు,చెట్లనడుమనున్నహనుమంతుంజూచి, సమస్తభూతంబులును,వసంతుండని, తలంచినవి.

అని, తాత్పర్యము.

వృక్షేభ్యః పతితైః పుష్పైరవకీర్ణా పృథగ్విధైః
రరాజ వసుధా తత్ర ప్రమదేవ విభూషితా. ౧౩

టీక॥ తత్ర=అచ్చట; వృక్షేభ్యః=చెట్లనుండి; పతితైః = పడినవియు;పృథగ్విధైః = నానావిధములునగు; పుష్పైః=పూలచేత;అవకీర్ణా = వ్యాపింపఁబడిన;వసుధా=భూమి ; విభూషితా=అలంకరింపఁబడిన; ప్రమదేవ= స్త్రీవలె; రరాజ=ప్రకాశించెను.

అచ్చటి, భూమిమీఁద , వృక్షంబులనుండి నానావిధములుగ పూలురాలియున్నందున, నాభూమి , సొమ్ములచేనలంకరింపఁబడియుండు వనితయుంబోలెఁ, బొపట్టుచుండెనది,

అని, తాత్పర్యము.

తరస్వినా తే తరవ స్తరసాభి ప్రకంపితాః

కుసుమాని విచిత్రాణి ససృజుః కపినా తదా. ౧౪

టీక॥ తదా=అప్పుడు; తే= ఆ;తరవః;వృక్షంబులు;తరస్వినా=బలవంతుండగు; కపినా=హనుమంతునిచేత; తరసా=బలముచేత;అభిప్రకంపితాః=నాలుగుప్రక్కలకును గదలింపఁ బడినవై ; విచిత్రాణి= నానావిధములయిన; కుసుమాని= పూలను; ససృజుః=విడిచినవి.

అప్పుడు, బలవంతుండగు నాహనుమంతుండుబలంబున నావృక్షంబుల నాలుగుప్రక్కలకునుగదలింపఁగా నా,వృక్షంబులనుండి, నానావిధంబులగు పూలురాలినవి. అని, తాత్పర్యము,

నిర్ధూతపత్రశిఖరా శ్శీర్ణపుష్ప ఫలా ద్రుమాః
నిక్షిప్త వస్త్రాభరణా ధూర్తా ఇవ పరాజితాః. ౧౫

టీక॥నిర్ధూతపత్రశిఖరాః= ఎగురఁగొట్టఁబడినయాకులునుకొనలును గలవియును; శీర్ణపుష్పఫలాః=రాలినపూలునుబండ్లును గలవియునగు ; ద్రుమాః=చెట్లు; పరాజితాః= అపజయమునొన్దినవారును; కావున నే;నిక్షిప్తవస్త్రాభరణాః=ఉంచఁబడినవస్త్రములునుసొమ్ములునుగలవారలునగు; ధూర్తాః ఇవ=జూదరులుంబోలె ; ఆసన్ (అధ్యాహృతము)= ఉండినవి.

అచ్చటహనుమంతుండుకదలించుటం జేసివస్త్ర ప్రాయంబులగు పత్రములునుకొనలందలిమొగ్గలును, ఆభరణప్రాయంబులగుపూలును బండ్లునురాలి నందువలన, నాచెట్లు, జూదమాడియపజయంబునొంది గెల్చినవారికిచ్చుటకై వస్త్రంబులునాభరణంబులునుగ్రిందం బెట్టియుండు, జూదరులుంబోలెఁ, జూపట్టుచుండినవి. అని, తాత్పర్యము.

హనూమతా వేగవతా కంపితా స్తేన గోత్తమాః
పుష్పపర్ణఫలా న్యాశు ముముచుః పుష్పశాలినః. ౧౬

టీక॥ వేగవతా=అధికమయిన వేగముగల; హనూమతా=హనుమంతు

నిచేత; కంపితాః=కదలింపఁబడిన; పుష్పశాలినః=పూలచేనొప్పుచుండు; తే= ఆ; నగోత్తమాః= వృక్షశ్రేష్ఠములు; ఆశు = శీఘ్రముగా; పుష్పపర్ణఫలాని=పూలను ఆకులను బండ్లను ; ముముచుః=విడిచినవి.

అతివేగముగల హనుమంతుండు, పూల నిండియుండు నాయుత్తమవృక్షంబులఁ గదలింపఁగానే, వానివలన , బూలును బత్రంబులును ఫలంబులును, శీఘ్రంబుగా, నేలంబడెనవి.

అని, తాత్పర్యము.

విహంగసంఘైర్హీనాస్తే స్కంధమాత్రాశ్రయా ద్రుమాః
బభూవురగమాస్సర్వే మారుతేనేవ నిర్ధుతాః. ౧౬

టీక॥ తే=ఆ; ద్రుమాః = వృక్షంబులు; సర్వే=అన్నియును ; మారుతేన= వాయువుచేత; నిర్ధుతా ఇవ=కదలింపఁబడినవివలె; విహంగసంఘైః=పక్షులసమూహంబులచే ; హీనాః=విడువఁబడినవిగాను ; స్కంధమాత్రాశ్రయాః=బోదెలను మాత్రము స్థానంబులుగాను, బోదెలుమాత్రముగలవిగా ననుట; కావుననే, అగమాః = పొందఁగూడనివిగాను; బభూవుః=ఐనవి.

ఆహనుమంతునిచేఁ గదలింపఁబడిన వృక్షంబులన్నియు, వాయువుచేఁ గదలింపఁబడినట్లు, పక్షులచే విడువఁబడి, పుష్పములు పత్రములు మొదలగునవియు లేక బోదెలు మాత్రము గలిగి యుంటం జేసి, సేవించుటకు అర్హంబులు, గాక, పోయినవి. అని, తాత్పర్యము.

నిర్ధూతకేశ యువతిర్యథా మృదితవర్ణకా
నిష్పీతశుభదంతోష్ఠీ నఖైర్దంతైశ్చ విక్షతా. ౧౭
తథా లాంగూలహస్తైశ్చ చరణాభ్యాంచ మర్దితా
బభూవాశోకవనికా ప్రభగ్నవరపాదపా. ౧౮

టీక॥ నిర్ధూతకేశీ=విరియనట్లు చేయఁబడిన వెండ్రుకలుగలదియును; మృదితవర్ణకా=నలిచఁబడిన చందనముగలదియును; నిష్పీతశుభదంతోష్ఠీ = చక్కఁగాఁ ద్రాగఁబడినదియును (కావుననే) సుందరమయినదంతమువంటిదైన పె

దవిగలదియును; నఖైః=గోళ్లచేతను; దంతైశ్చ=పండ్లచేతను; విక్షతా=గాయముచేయఁబడినదియునగు; యువతిః=స్త్రీ; యథా=ఎట్లో; తథా=అట్లు; లాంగూలహస్తైశ్చ=తోఁకచేతను జేతులచేతను; చరణాభ్యాంచ=పాదములచేతను; మర్దితా=మర్దింపఁబడినదియు; ప్రభగ్నవరపాదపా=విఱిగినశ్రేష్ఠములైనవృక్షములు గలదియునగు; అశోకవనికా=అశోకవనము; బభూవ=ఉండెను.

అట్లుహనుమంతునిచే, తోఁకనుజేతులనుగాళ్లనుమర్దింపఁబడి, విఱిగినచెట్లతోనున్నయాయశోకవనిక, సంభోగవేగంబునఁ, జెదరినతల వెండ్రుకలును, ఆలింగనాదులచే, రాలిపోయినచందనంబును, చక్కఁగాఁ బానము సేయఁబడుటంజేసి, దంతంబుంబోలెఁదెల్లగానుండుపెదవియునుగలిగి, గోళ్లను దంతంబులనుదగిలినగాయములతో నొప్పుచున్న, వనితయుంబోలెఁ, బాపట్టుచుండినది. అని, తాత్పర్యము.

మహాలతానాం దామాని వ్యధమత్తరసా కపిః
యథా ప్రావృషి వింధ్యస్య మేఘజాలాని మారుతః. ౨౦

టీక॥ కపిః=హనుమంతుఁడు; తరసా=బలముచేత; మహాలతానాం=పెద్దతీఁగెలయొక్క; దామాని=సమూహములను; మారుతః=వాయువు; ప్రావృషి=వర్షాకాలమునందు; వింధ్యస్య=వింధ్యపర్వతముయొక్క; మేఘజాలాని యథా=మబ్బులయొక్క సమూహములనుంబోలె; వ్యధమత్=తెంచెను.

వర్షాకాలంబున, వాయువు, వింధ్యపర్వతమునందలిమేఘంబుల సమూహంబులనుఖండఖండములుగాఁ జేయునట్లు, హనుమంతుండు, బలంబుననాయశోకవనియందలి లతాసమూహంబులను, తెంచెను. అని, తాత్పర్యము.

స తత్ర మణిభూమీశ్చ రాజతీశ్చ మనోరమాః
తథా కాంచన భూమీశ్చ దదర్శ విచర న్కపిః. ౨౧

టీక॥ సః=ఆ; కపిః=హనుమంతుఁడు; తత్ర=ఆయశోకవనికయందు; వి

చరన్=తిరుగుచు; మనోరమాః= సుందరములయిన; మణిభూమీశ్చ=రత్నవికారములయిన భూములను ; రాజతీశ్చ==వెండిభూములను; తథా= అట్లు ; కాంచనభూమీశ్చ= బంగారు భూములను; దదర్శ=చూచెను.

ఆహనుమంతుం డాయశోక వనిక యందు సంచరించుచు,సుందరములయిన మణిమయంబులగు భూములను వెండిభూములను బంగారు భూములనుం జూచెను. అని, తాత్పర్యము.

వాపీశ్చ వివిధాకారాః పూర్ణాః పరమవారిణా
మహార్హై ర్మణిసోపానై రుపపన్నా స్తత స్తతః. ౨౨
ముక్తాప్రవాళసికతా స్స్ఫాటికాంతర కుట్టిమాః
కాంచనై స్తరుభిశ్చిత్రైః తీరజై రుపశోభితాః. ౨౩
ఫుల్లపద్మోత్పలవనా శ్చక్రవాకోప కూజితాః
నత్యూహ రుతసంఘుష్టా హంససారసనాదితాః. ౨౪
దీర్ఘాభి ర్ద్రుమయుక్తాభి స్సరిద్భిశ్చ సమంతతః
అమృతోప మతోయాభి శ్శివాభి రుపసంస్కృతాః. ౨౫
లతాశతై రవతతా స్సంతాన కుసుమావృతాః
నానాగుల్మావృతఘనాః కరవీర కృతాంతరాః. ౨౬

టీక॥సః(అధ్యాహృతము)= ఆహనుమంతుఁడు;వివిధాకారాః= నానా విధములయిన యాకారములుగలవియును;పరమవారిణా=శ్రేష్ఠమయిన జలముచేః;పూర్ణాః= నిండినవియును; తత స్తతః=అచ్చటచ్చట; మహార్హైః=శ్రేష్ఠములయిన; మణిసోపానైః = రత్నవికారములయిన పడికట్లతో; ఉపపన్నాః==కూడినవియును; ముక్తాప్రవాళసికతాః=ముత్తెపు వికారమయినదియుఁబవడపు వికారమయినదియునగునిసుకగలవియును; స్ఫాటికాంతరకుట్టిమాః=స్ఫటికమణివికారమయిన నీళ్ల లోపలికట్టినపు నేలగలవియును; కాంచనైః = బంగారువన్నెగలవియును;చిత్రైః=నానా వర్ణములుగలవియునగు తీరజైః = గట్టునఁబుట్టిన వృక్షముల చేః; ఉపశోభితాః = ప్రకాశింపఁజే




యఁబడినవియును; ఫుల్లపద్మోత్పలవనాః=వికసించిన తామరపూలయొక్కయుఁ గలువలయొక్కయు సమూహములుగలవియును; చక్రవాకోపకూజితాః=జక్కవపక్షులచే ధ్వనించునట్లు చేయఁబడినవియును; నత్యూహరుతసంఘుష్టాః=నీరుకోళ్ల ధ్వనిచే ధ్వనింపఁజేయఁబడినవియును; హంససారసనాదితాః=హంసపక్షులచేతను బెగ్గురుపక్షులచేతను ధ్వనింపఁజేయఁబడినవియును; దీర్ఘాభిః=నిడుపైనవియు; ద్రుమయుక్తాభిః=చెట్లతోఁగూడినవియు; అమృతోపమతోయాభిః=అమృతముతోఁబోలికగలనీళ్లుగలవియు; శివాభిః=మంగళకరంబులునగు; సరిద్భిః=కాలువలచేతను; సమంతతః=అన్నిప్రక్కలను; ఉపసంసృతాః=అలంకరింపఁబడినవియును; లతాశతైః=తీఁగెలయొక్క నూఱులచేత; అవతతాః=వ్యాపింపఁబడినవియును; సంతానకపుష్పావృతాః=కల్పవృక్షములయొక్క పుష్పములచేఁ గప్పఁబడినవియును; నానాగుల్మావృతఘనాః=నానావిధములయినబోదెలేని చెట్లచేతఁ గప్పఁబడినవియును దట్టములయినవియును; కరవీరకృతాంతరాః=గన్నేరుచెట్లచేఁజేయఁబడినవిశేషములుగలవియునగు; వాపీః=నడబావులను; దదర్శ (అధ్యాహృతము)=చూచెను.

నానావిధాకారంబులుగల్గి, యుత్కృష్ట జలంబుతో నిండి, యచ్చటచ్చట, శ్రేష్ఠములయిన మణిమయంబులగు పడికట్లతోఁగూడి, ముత్తెములుఁ బగడములు వీనితోఁ జేయఁబడిన యిసుకయు స్ఫటికశిలలతోఁ జేయబడిన నీళ్లలోపలనుండు కట్టనపు నేలయుగల్గి, తీరంబునం బుట్టిన కాంచన వర్ణంబులుఁ జిత్రవర్ణంబులునగు వృక్షంబులచేనలంకరింపఁబడి, వికసించిన తామరపూలతోనుగలువలతోను, మధురము గాఁగూయుచుండుజక్కవపక్షులతోను, నీరుకోళ్లతోనుహంసపక్షులతోను సారసపక్షులతోనుంగూడి, దీర్ఘంబులై రెండుప్రక్కలనుచెట్లుగలిగి యమృతంబుంబోలెమధురంబయినజలంబుగలిగియుండు కాలువలచేఁజెన్నొందుచు, అనేకవిధంబులయినలతలచేనలరారుచుఁగల్పపుష్పంబులరమణీయంబులై, బోదెలేనిచెట్లుచుట్టునసేకంబులుదట్టముగాఁగల్గి, గన్నేరువృక్షంబులంజెలంగుచున్న, నడబావులను, హనుమంతుండు, చూచెను.

అని, తాత్పర్యము.




తతో౽౦బుధర సంకాశం ప్రవృద్ధ శిఖరం గిరిమ్
విచిత్ర కూటం కూటైశ్చ సర్వతః పరివారితమ్. ౨౭
శిలా గృహై రవతతం నానావృక్షైస్సమావృతమ్
దదర్శ హరి శార్దూలో రమ్యం జగతి పర్వతమ్. ౨౮

టీక॥తతః=అటుపిమ్మట; హరిశార్దూలః=వానరశ్రేష్ఠుండగుహనుమంతుఁడు;అంబుధరసంకాశం= మేఘముతో సమానమైనదియును; ప్రవృద్ధశిఖరం=పెరిఁగినశిఖరములుగలదియును;విచిత్రకూటం= నానావిధములైనకొండకొమ్ములుగలదియును;కూటైః=కొండకొమ్ములచేత; సర్వతః=అంతటను;పరివారితంచ=చుట్టఁబడినదియును; శిలాగృహైః=ఱాతియిండ్లచేత;అవతతం=వ్యాపింపఁ బడినదియును ; నానావృక్షైః=నానావిధములగుచెట్లచేతను, సమావృతం= చుట్టఁబడినదియును ; రమ్యం= సుందరమునగు;జగతి పర్వతం (జగతీపర్వతం)=మట్టికొండ యయిన; లేక,జగతిపర్వతమనుపేరుగల; గిరిం=పర్వతమును;దదర్శ=చూచెను.

అంత, మేఘంబునకుసరివచ్చుచు, సున్నతమయినశిఖరంబుగల్గి, నానావిధములగుకొమ్ములుగల్గి ,యన్ని ప్రదేశంబులనుగొమ్ములతోనొప్పుచు, ఱాతిగృహంబులతోఁగూడి, నానావిధవృక్షంబులంగప్పఁబడి,రమణీయంబై , యున్న మట్టికొండను,(పక్షాంతరమందు, జగతీపర్వతమనుపర్వతమును); వానరశ్రేష్ఠుండగు హనుమంతుండుచూచెను.

అని, తాత్పర్యము.

దదర్శ చ నగా త్తస్మా న్నదీం నిపతితాం కపిః
అంకాదివ స ముత్పత్య ప్రియస్య పతితాం ప్రియామ్. ౨౯
జలే నిపతి తాగ్రైశ్చ పాదపై రుప శోభితామ్
వార్య మాణా మివ క్రుద్ధాం ప్రమదాం ప్రియ బంధుభిః. ౩౦

టీక॥కపిః = హనుమంతుఁడు; తస్మాత్=ఆ;నగాత్=పర్వతమునందు;నిపతితాం=పడినదియును(కావుననే)ప్రియస్య=ప్రియునియొక్క; అంకాత్=

తొడనుండి; సముత్పత్య=ఎగిరి; పతితాం=పడినట్టి; ప్రియామివ(స్థితాం)=ప్రియురాలుంబోలె నున్నదియును; జలే=నీటియందు; నిపతితాగ్రైశ్చ=పడినకొనలుగల; పాదపైః=చెట్లచేత; ఉపశోభితాంచ=ప్రకాశింపఁజేయఁబడినదియును; ప్రియబంధుభిః=ఇష్టులయిన బంధువులచే; వార్యమాణాం=అడ్డగింపఁబడిన; క్రుద్ధాం=కోపించిన; ప్రమదామివ(స్థితాం)=స్త్రీయుంబోలెను న్నదియునగు; నదీంచ=ఏటిని; దదర్శ=చూచెను.

ఆపర్వతంబునందుండి నేలకుఁబాఱుచుండుటంజేసికోపంబునఁబ్రియునియంకంబువిడిచి నేలంబడు ప్రియురాలుంబోలెఁజూపట్టుచు, ఫలభారంబునవంగి నీటందోఁగుచుండుకొనలుగల చెట్లతోఁగూడియుండుటంజేసి, ప్రియబంధువులచే హస్తంబులననునయింపఁబడుచున్న క్రుద్ధస్త్రీయుంబోలెఁగనుపట్టుచున్న, యొకయేటిని, హనుమంతుండచ్చటఁ, జూచెను. అని, తాత్పర్యము.

పునరాప్లుతతోయాంచ దదర్శ స మహాకపిః
ప్రసన్నామివ కాంతస్య కాంతాం పునరుపస్థితామ్. ౩౦

టీక॥ మహాకపిః=పెద్దకోఁతియగు; సః=ఆహనుమంతుండు; పునరాప్లుతతోయాంచ=మఱలితిరిగిన నీళ్లుగలదియు(కావుననే)ప్రసన్నాం=కోపంబు విడిచినదియును; పునః=మఱల; ఉపస్థితః = ప్రియునిం బొందినదియునగు; కాంతామివ(స్థితాం)=ప్రియురాలుంబోలెనున్నదియునగు; నదీం=(అధ్యాహృతము)నదిని; దదర్శ=చూచెను.

అట్లుకొంతవఱకుఁబర్వతంబువిడిచి పాఱియంతమఱల వెనుకకుఁ దిరిగిపర్వతముత్ట్టుగాఁబాఱుటంజేసి, బంధువులనునయింపఁగాకోపంబువిడిచి ప్రసన్నయయి, మఱలఁ బ్రియునింబొందునట్టి, వనితయుంబోలెఁజూపట్టుచున్న, యానదిని, హనుమంతుండు, చూచెను.

అని, తాత్పర్యము.

తస్యా దూరాత్స పద్మిన్యో నానాద్విజగణాయుతాః
దదర్శ హరి శార్దూలో హనుమా న్మారుతాత్మజః. ౩౧

టీక॥ హరిశార్దూలః=వానరశ్రేష్ఠుండును; మారుతాత్మజః= వాయుదేవుని కుమారుండునగు; సః=ఆ; హనుమాన్ = హనుమంతుఁడు ; తస్య=ఆపర్వతమునకు;అదూరాత్=సమీపమునందు; నానాద్విజ గణాయుతాః = నానావిధములయినపక్షులసమూహములతోఁగూడిన;పద్మిన్యః (పద్మినీః)= తామరకొలనులను;దదర్శ= చూచెను.

వానరశ్రేష్ఠుండువాయుదేవుని కుమారుండునగు హనుమంతుఁడు, ఆపర్వతమునకుసమీపంబున, నానావిధపక్షులతోనొప్పుచున్న, తామరకొలంకులంజూచెను.

అని, తాత్పర్యము.

కృత్రిమాం దీర్ఘికాం చాపి పూర్ణాం శీతేన వారిణా
మణి ప్రవర సోపానాం ముక్తాసికత శోభితామ్. ౩౩
వివిధై ర్మృగ సంఘైశ్చ విచిత్రాం చిత్రకాననామ్
ప్రాసాదై స్సుమహద్భిశ్చ నిర్మితై ర్విశ్వ కర్మణా. ౩౪
కాననైః కృత్రిమై శ్చాపి సర్వత స్సమలం కృతామ్

టీక॥సః (అధ్యాహృతము)=ఆహనుమంతుఁడు;కృత్రిమాం=నిర్మింపఁబడినదియును;శీతేన=చల్లని; వారిణా=నీటిచేత;పూర్ణాం=నిండినదియును;మణిప్రవరసోపానాం =రత్నశ్రేష్ఠములతోఁజేయఁబడిన పడికట్లుగలదియును; ముక్తాసికతశోభితాం=ముత్తెములతోఁజేయఁబడినయిసుకచేతఁబ్రకాశింపఁబడినదియును; వివిధైః=నానావిధములైన;మృగసంఘైః=మృగములసమూహములతో;యుక్తాంచ=కూడినదియును; విచిత్రాం=నానావిధమయినదియును చిత్రకాననాం=నానావిధములయినవనములుగలదియును;సుమహద్భిః = మిక్కిలియు గొప్పవియును; విశ్వకర్మణా = విశ్వకర్మచేత; నిర్మితైః= చేయఁ బడినవియునగు ; ప్రాసాదైశ్చ=మేడలచేతను;కృత్రిమైః= నిర్మింపఁబడిన;కాననైశ్చాపి= వనములచేతను;సర్వతః = అంతటను; సమలంకృతాం=చక్కఁగా నలంకరింపఁ బడినదియునగు;దీర్ఘికాంచాపి = నడబావిని;

దదర్శ (అధ్యాహృతము)=చూచెను.

చల్లనినీటితోనిండి మణిమయంబుల గుపడికట్లతోఁగూడి ముత్తెములతోఁజేయఁబడిన యిసుకగల్గి, నానావిధమృగంబులనొప్పుచు, విచిత్రమయి, చుట్టును నానావిధవనంబులఁ దేజరిల్లుచు, విశ్వకర్మచేనిర్మింపఁబడినగొప్పప్రాసాదంబులనువనంబులనుం జెలంగుచు, నా పర్వతముసమీపంబుననున్ననదబావిని, హనుమంతుండు, చూచెను.

అని, తాత్పర్యము.

యేకేచిత్పాదపాస్తత్ర పుష్పోపగ ఫలోపగాః. ౩౬
సచ్ఛత్రాస్సవితర్దీకా స్సర్వే సౌవర్ణ వేదికాః

టీక॥ తత్ర=అచ్చట; పుష్పోపగఫలోపగాః= పూలుగలిగినవియును, బండ్లుగలవియునగు; పాదపాః=వృక్షములు; యే కేచిత్ = ఏవేవి; సంతి=(అధ్యాహృతము) ఉన్నవో; తే = (అధ్యాహృతము) అవి; సర్వే=అన్నియును; సచ్ఛత్రాః=ఎండవానలు మొదలగువాని బాధగలుగకుండుటకై యేర్పఱుపఁబడిన శాలలతోఁ గూడి సవితర్దీకాః= పెద్దతిన్నెలతోఁగూడినవై; సౌవర్ణవేదికాః=బంగారువికారములయిన చిన్నతిన్నెలుగలవై; ఆసన్ (అధ్యాహృతము)=ఉండినవి.

అచ్చటఁ, బూలను బండ్లను నిండియుండువృక్షంబులనన్నియు, శాలలతోను, బెద్ద తిన్నెలతోను, వానిపైనఁ జిన్న బంగారుతిన్నెలతోనుగూడియుండినవి.

అని, తాత్పర్యము.

లతాప్రతానైర్బహుభిః పర్ణైశ్చ బహుభిర్వృతామ్. ౩౭
కాంచనీం శింశుపామేకాం దదర్శ హరియూథపః
వృతాం హేమమయీభిస్తు వేదికాభిస్సమంతతః. ౩౮

టీక॥ హరియూథపః = హనుమంతుఁడు; బహుభిః=అనేకములయిన; లతాప్రతానైః=తీఁగల సమూహముల చేతను; బహుభిః=అనేకములయిన; పర్ణైశ్చ=ఆకులచేతను; వృతాం = చుట్టఁబడినదియును; సమంతతః=అంతటను; హేమమయీభిః= బంగారువికారములయిన; వేదికాభిస్తు = తిన్నెలచేత

ను;వృతాం=చుట్టఁబడినదియును;కాంచనీం=బంగారువన్నెగలదియునగు; ఏకాం=ఒక;శింశుపాం = ఇరుగుడుచెట్టును;దదర్శ=చూచెను.

హనుమంతుఁడు, పెక్కుతీఁగలచేతను బత్త్రంబులచేతను బరివృతంబై, నాలుగుప్రక్కలను బంగారు తిన్నెలతో నొప్పుచున్న,యొకయిరుగుడువృక్షంబును,చూచెను.

అని, తాత్పర్యము.

సోఽపశ్యద్భూమిభాగాంశ్చ గర్తప్రస్రవణానిచ

టీక॥సః=ఆహనుమంతుఁడు;భూమిభాగాంశ్చ=భూములభాగములను, వేఱువేఱుభూములననుట;గర్తప్రస్రవణానిచ=పల్లములను సెలయూటలను; అపశ్యత్=చూచెను.

ఆహనుమంతుండు,దచ్చట, నానావిధంబులగుభూములనుబల్లపుఁ బ్రదేశములను సెలయూటలనుం,జూచెను.

అని, తాత్పర్యము.

సువర్ణవృక్షానపరాన్ దదర్శ శిఖిసన్నిభాన్. ౨౮

టీక॥సః(అధ్యాహృతము)= ఆహనుమంతుఁడు;శిఖిసన్నిభాన్= నిప్పుతో సమానములయిన;అపరాన్=ఇతరములయిన;సువర్ణవృక్షాన్= బంగారువన్నెగలచెట్లను;దదర్శ=చూచెను.

ఆహనుమంతుఁడు,దచ్చట,నగ్నియుంబోలెఁ దేజరిల్లుచున్నబంగారు వర్ణపువృక్షంబులమఱికొన్నిటిని , జూచెను.అని, తాత్పర్యము.

తేషాం ద్రుమాణాం ప్రభయా మేరోరివ దివాకరః
అమన్యత తదా వీరః కాంచనోఽస్మీతి వానరః. ౨౯

టీక॥తదా=అప్పుడు; వీరః=పరాక్రమశాలియగు;వానరః=హనుమంతుఁడు;తేషాం=ఆ; ద్రుమాణాం=వృక్షములయొక్క; ప్రభయా=కాంతిచేత; మేరోః = మేరుపర్వతముయొక్క; ప్రభయా(అధ్యాహృతము)= కాంతి

చేత; దివాకర ఇవ = సూర్యుండుంబోలె; కాంచనః = బంగారు వికారుండను; అస్మి = అగుచున్నాను; ఇతి = అని; అమన్యత = తలంచెను.

అప్పుడు, పరాక్రమశాలియగుహనుమంతుండు, ఆబంగారువృక్షంబుల కాంతివలన, మేరుపర్వతముకాంతివలనసూర్యుండు కాంచనమయుండుగాఁ గనుపట్టునట్లు, తనదేహము బంగారువన్నెగలిగిచూపట్టుటంజేసి, "నేనిప్పుడు బంగారుదేహంబుగలవాఁడనైతిని" అని, తలంచుకొనెను. అని, తాత్పర్యము.

తాం కాంచనై స్తరుగణై ర్మారుతేన చ వీజితామ్
కింకిణీ శత నిర్ఘోషాం దృష్ట్వా విస్మయ మాగమత్. ౪౦

టీక॥ సః (అధ్యాహృతము) = ఆహనుమంతుఁడు; కాంచనైః = బంగారువన్నెగల; తరుగణైః = వృక్షముల సమూహములతోఁ; యుక్తాం (అధ్యాహృతము) = కూడినదియును; మారుతేన = గాలిచేత; వీజితాం చ = వీవఁబడినదియును; కింకిణీశతనిర్ఘోషాం = చిఱుగంటలచే నూఱుధ్వనులుగలదియును; చిఱుగంటలుగట్టియుండుటచేనానేకధ్వనులుగలదియుననుట; తాం = ఆయశోకవనికను; దృష్ట్వా = చూచి; విస్మయం = ఆశ్చర్యమును; ఆగమత్ = పొందెను.

ఆహనుమంతుండు, అట్లు కాంచనవృక్షంబుల సమూహంబులతోఁ గూడి వాయువువీచుటచే, చెట్లకుఁ గట్టియుండుచిఱుగంటలు మ్రోఁగుటంజేసి, యనేకశబ్దంబులనొప్పుచున్న, యాయశోకవనికంజూచి, యాశ్చర్యంబు నొందెను. అని, తాత్పర్యము.

స పుష్పితాగ్రాం రుచిరాం తరుణాంకురపల్లవామ్
తా మారుహ్య మహాబాహు శ్శింశుపాం పర్ణసంవృతామ్. ౪౧

టీక॥ మహాబాహుః = పెద్దచేతులుగల; సః = ఆహనుమంతుఁడు; పుష్పితాగ్రాం = పూచినశిఖరములుగలదియును; తరుణాంకురపల్లవాం = క్రొత్తమొలకలునుచిగుళ్లునుగలదియును; పర్ణసంవృతాం = ఆకులచేఁగప్పఁబడినదియునగు; తాం = ఆ; శింశుపాం = ఇరుగుడుచెట్టును; ఆరుహ్య = ఎక్కి; అచిం

తయత్ (అధ్యాహృతము) ఆలోచించెను.

మహాబాహుండగు నాహనుమంతుండు, పుష్పించినశిఖరంబులునులేంత మొలకలునుజిగుళ్లునుగలిగిపత్రంబులచే నొప్పుచుండుశింశుపావృక్షంబు నెక్కియిట్లనియాలోచించెను.

అని, తాత్పర్యము.

ఇతో ద్రక్ష్యామి వైదేహీం రామదర్శనలాలసామ్
ఇతశ్చేతశ్చ దుఃఖార్తాం సంపతంతీం యదృచ్ఛయా. ౪౨

టీక॥ అహం (అధ్యాహృతము)= నేను; ఇతః=ఇచ్చటనుండి; రామదర్శనలాలసాం= రామునిచూచుటయందు మిక్కిలియుంగోరికగలదియును ; దుఃఖార్తాం=దుఃఖముచేం బీడింపంబడినదియును;యదృచ్ఛయా= స్వేచ్ఛచేత;ఇతశ్చేతశ్చ=ఇటునటు ; సంపతంతీం=తిరుగుచున్నదియునగు ; వైదేహీం=సీతను;ద్రక్ష్యామి=చూచెదను.

నేనిచ్చటనుండి, రామునింజూచుటయందుమిక్కిలియుగోరికగల్గిదుఃఖంబుననిట్టట్టుదిరుగుచున్నసీతాదేవిం,జూచెదను.అని, తాత్పర్యము.

అశోకవనికా చేయం దృఢం రమ్యా దురాత్మనః
చంపకైశ్చందనైశ్చాపి వకుళైశ్చ విభూషితా. ౪౩

టీక॥దురాత్మనః= దుష్టస్వభావముగలరావణునియొక్క;అయం=ఈ; అశోకవనికాచ=అశోకవనికయును;దృఢం=మిక్కిలియును;రమ్యా = రమణీయమయినది. చంపకైః=సంపెంగవృక్షములచేతను;చందనైశ్చాపి= చందనవృక్షములచేతను;వకుళైశ్చ = పొగడవృక్షములచేతను;విభూషితా=అలంకరింపంబడినది.

ఈదురాత్ముండగురావణునియశోకవనిక,మిగులరమణీయంబుగానున్నది, మఱియుసంపెంగవృక్షంబులను జందనవృక్షంబులనుబొగడవృక్షంబులను, ఒప్పుచున్నది. అని,తాత్పర్యము.

ఇయంచ నళినీ రమ్యా ద్విజసంఘనిషేవితా

టీక॥ఇయం=ఈ;నళినీచ= తామర కొలంకును;రమ్యా=సుందరమయినది. ద్విజసంఘనిషేవితా = పక్షులసమూహంబులచే సేవింపఁబడినది.

ఈ తామరకొలంకునుమిగుల సుందరంబై, మధురంబుగాఁ గూయుపక్షులం, జెన్నొందుచున్నది.
అని, తాత్పర్యము.

ఇమాం సా రామ మహిషీ నూన మేష్యతి జానకీ. ౪౪

టీక॥జానకీ= జనకునికూఁతురయి న;రామమహిషీ = రామునిభార్యయగు;సా=ఆసీత;ఇమాం=ఈ తామరకొలంకునుగూర్చి;నూనం = నిశ్చయముగాఁ,ఏష్యతి=రాఁగలదు.

రామునిభార్యయుజనకుని కూఁతురనగునాసీతాదేవి, యీతామరకొలంకునొద్దకు,సందేహములేక , వచ్చును.అని, తాత్పర్యము.

సా రామా రామమహిషీ రాఘవస్య ప్రియా సతీ
వనసంచారకుశలా నూన మేష్యతి జానకీ. ౪౫

టీక॥రామమహిషీ=రామునిభార్యయును; రాఘవస్య=రామునకు; ప్రియా= ఇష్టురాలును;సతీ=పతివ్రతయును;వనసంచారకుశలా= వనమునందుఁదిరుగుటయందు నేర్పుగలదియును; జానకీ=జనకమహారాజుకొమార్తెయునగు;సా= ఆ;రామా=స్త్రీయయినసీత;నూనం= నిశ్చయముగా;ఏష్యతి = రాఁగలదు.

రామునిభార్యయురామునకుఁ బ్రియురాలును,వనంబులందిరుగుటయందునేర్పుగలదియుఁ,గావున , జనకపుత్రియగునాసీత, యిచ్చటికి , నిస్సందేహముగా,వచ్చును.అని, తాత్పర్యము.

అథవా మృగశాబాక్షీ వన స్యాస్య విచక్షణా
వన మేష్యతి సార్యేహ రామచింతానుకర్శితా. ౪౬

టీక॥అథవా=అటుగాదేని;మృగశాబాక్షీ = లేడిపిల్లలయొక్క-కండ్లువంటి

కండ్లుగలదియును; విచక్షణా= పండితురాలును;ఆర్యా=పూజ్యురాలునగు; సా=ఆసీత; రామచింతానుకర్శితా = రామునియొక్క-చింతచే కృశించునట్లు చేయఁబడినదియై;అస్య=ఈ;వనస్య= అశోకవనముయొక్క; ఇహ=ఇచ్చటి; వనం= తామరకొలను సమీపమందలివనమునుగూర్చి;ఏష్యతి=రాఁగలదు.

అటుగాదేని, లేడిపిల్లలకుంబోలె నేత్రంబులు గలదియుఁ బూజ్యురాలునగు సీతాదేవి రామునిచింతచేఁ గృశించినదై, పండితురాలుగావునఁ, దాపంబు పోఁగొట్టు నుపాయంబులు తెలిసినదగుటంజేసి, యశోకవనమందలి యీ తామరకొలంకు సమీపమందున్న వనమునకు, వచ్చును.అని, తాత్పర్యము.

రామశోకాభిసంతప్తా సా దేవీ వామలోచనా
వనవాసే రతా నిత్య మేష్యతే వనచారిణీ. ౪౭

టీక॥ వామలోచనా= సుందరములయినకండ్లు గలదియును; వనవాసే= వనంబుననుండుటయందు; నిత్యం= ఎల్లప్పుడును ; రక్తా=ఆసక్తురాలును ; వనచారిణీ = వనంబునందుఁదిరుగునదియునగు; సా=ఆ; దేవీ=సీతాదేవి ; రామశోకాభిసంతప్తా=రామునిగుఱించినదుఃఖముచే తపింపఁజేయఁబడినదై; ఏష్యతే=రాఁగలదు.

సుందర నేత్రంబులుగల యాసీతాదేవి యెప్పుడును వనంబున నివాసము సేయుటయం దాసక్తురాలును వనంబునందిరుగుచుండు స్వభావంబుగలదియును గావున, రామవిరహ దుఃఖంబునందపించుచు, నాతాపంబుపోఁగొట్టుకొనుటకై, యిచ్చటికవశ్యము వచ్చును. అని, తాత్పర్యము.

వనేచరాణాం సతతం నూనం స్పృహయతే పురా
రామస్య దయితా భార్యా జనకస్య సుతా సతీ. ౪౮

టీక॥ రామస్య= రామునియొక్క; దయితా=ప్రియయైన ; భార్యా= పెండ్లామును; జనకస్య=జనకునియొక్క ; సుతా=కూఁతురును; సతీ = పతివ్రతయునగుసీత; పురా = మున్ను;సతతం=ఎల్లప్పుడును; వనేచరాణాం (చ

తుర్థ్యర్థమందుషష్ఠి) వనంబునందుఁ
దిరుగువారలకొఱకు ; స్పృహయతే=
ఆశపడుచుండినది, వారలతోఁగూడ వ
నవాసంబుసేయఁగోరుచుండినదనుట .
రామునిప్రియభార్యయు జనకమ
హారాజుకూఁతురును బతివ్రతయునగు
సీత, మున్నెల్లప్పుడునువనంబుననుండు
వారలపై దయగలిగి, వారలతోఁగూడ
వనవాసముసేయఁ గోరుచుండినది.
అని, తాత్పర్యము.

సంధ్యాకాలమనాః శ్యామా ధ్రువ మేష్యతి జానకీ
నదీం చేమాం శుభజలాం సంధ్యార్థే వరవర్ణినీ. ౪౯

టీక॥సంధ్యాకాలమనాః=సంధ్యా
కాలమునందలిమనసుగలదియును; శ్యా
మా=యౌవనమధ్యస్థురాలును; వరవ
ర్ణినీ=ఉష్ణకాలమున సుఖశీతలమునుశీ
తకాలమునసుఖోష్ణమునగు దేహముగ
లిగిపెనిమిటియందుమిక్కిలియనురా
గముగలయుత్తమస్త్రీయునగు ; జాన
కీ=జనకునికూఁతురయినసీత; సంధ్యా
ర్థే=సంధ్యకుఁగాను; సంధ్యావందన
ముసేయుటకుఁగాననుట;శుభజలాం=
మంగళకరమయినజలముగల;ఇమాం=
ఈ;నదీంచ=ఏటినిగూర్చి; ధ్రువం=
నిశ్చయముగా;ఏష్యతి=రాగలదు.
యౌవనమధ్యస్థురాలును, ఉష్ణకా
లమునందుసుఖశీతలమును శీతకాలము
నందుసుఖోష్ణమునగు దేహము గల్గి పె
నిమిటియందుమిగుల ననురాగము గల
యుత్తమస్త్రీయునగు, జనకమహారా
జుకొమార్తె సీతాదేవి , సంధ్యనుపా
సించుటయందుమిక్కిలియు నాసక్తిగ
లది,కావున,సంధ్యోపాసనమునకుఁగా
ను,మంచియుదకముగలయీనదికిని, ని
శ్చయముగా,వచ్చును.
అని, తాత్పర్యము.

తస్యాశ్చాప్యనురూపేయ మశోకవనికా శుభా
శుభా యా పార్థివేంద్రస్య పత్నీ రామస్య సమ్మతా. ౫౦

టీక॥యా=ఏసీత; పార్థివేంద్ర
స్య=రాజశ్రేష్ఠుండగు;రామస్య= రా
మునకు; సమ్మతా=ప్రియయైన ; శు
భా=మంగళకరియగు;పత్నీ = భార్య

యో;తస్యాశ్చాపి=అట్టిసీతకును ; ఇయం=ఈ; శుభా=మంగళకరి యయిన;అశోకవనికా = అశోకవనిక ; అనురూపా=తగినది.

ఈసుందరమయిన యశోకవనిక, రాజశ్రేష్ఠుండగురాముని ప్రియభార్యయులోకసుందరియునగు సీతకును, దగియున్నది.

అని, తాత్పర్యము.

యది జీవతి సా దేవీ తారాధిపనిభా ననా
ఆగమిష్యతి సా వశ్య మిమాం శివజలాం నదీమ్. ౫౧

టీక॥ తారాధిపనిభాననా=చంద్రునితో సమానమయినముఖముగల; సా=ఆ; దేవీ=సీతాదేవి;జీవతియది = బ్రతికియుండునేని; సా=ఆసీత;అవశ్యం=అవశ్యముగా; శివజలాం = మంగళకరంబగునీరుగల;ఇమాం=ఈ;నదీం=ఏటినిగూర్చి;ఆగమిష్యతి= రాఁగలదు.

చంద్రుండుంబోలె సుందరంబయిన ముఖంబు గల యాసీతాదేవి, బ్రతికియుండునేని,యవశ్యముగా, మంచినీరుగలయీనదియొద్దకువచ్చును. అని, హనుమంతుండాలోచించెను.

అని, తాత్పర్యము.

ఏవంతు మత్వా హనుమా న్మహాత్మా
ప్రతీక్షమాణో మనుజేంద్ర పత్నీమ్
అవేక్షమాణశ్చ దదర్శ సర్వమ్
సుపుష్పితే పర్ణఘనే నిలీనః. ౫౨

టీక॥మహాత్మా=పూజ్యమయిన స్వభావముగల;హనుమాన్= హనుమంతుఁడు; సుపుష్పితే=చక్కఁగాఁ బూచియున్న;పర్ణఘనే=ఆకుల సమూహమునందు; నిలీనః=దాఁగినవాఁడై; ఏవం=ఇట్లు;మత్వాతు= తలఁచియు; మనుజేంద్రపత్నీం = మనుష్యులకధిపుఁడైనరామునియొక్కభార్యను; ప్రతీక్షమాణః=ఎదురుచూచుచున్నవాఁడై;అవేక్షమాణశ్చ=చూచుచున్నవాఁడునై;

సర్వం=అంతను;దదర్శ=చూచెను.

మహాత్ముండగుహనుమంతుండు,చక్కగాఁజూచియుండునాశింశుపావృక్షమునందలిపత్రసమూహంబునఁదాఁగి,యిట్లాలోచించి,సీతవచ్చుట కెదురుసూచుచు,నాలుగుప్రక్కలంజూచుచు,నచ్చటనున్నవిశేషంబుల నన్నింటిని, జూచెను. అని, తాత్పర్యము,

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, చతుర్దశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండచతుర్దశసర్గ టీక,
ముగిసినది.

శ్రీః
పంచదశసర్గప్రారంభః.

స వీక్షమాణ స్తత్రస్థో మార్గమాణశ్చ మైథిలీమ్
అవేక్షమాణశ్చ మహీం సర్వాం తా మన్వవైక్షత. ౧

టీక॥సః=ఆహనుమంతుఁడు; తత్రస్థః=ఆయిరుగుడు వృక్షముమీఁదనున్నవాఁడై;మైథిలీం=సీతను; మార్గమాణః=వెదకువాఁడై; వీక్షమాణశ్చ=చూచుచున్నవాఁడునై;మహీంచ=భూమిని; అవేక్షమాణః=చూచుచు; తాం=ఆయశోకవనికను;సర్వాం=అంతను;అన్వవైక్షత=చూచెను.

ఆహనుమంతుండు, ఆశింశుపావృక్షంబుపయినుండి,సీతను వెదకుటకైనాలుగుప్రక్కలంజూచుచు,నట్లు, అచ్చటిభూములంజూచుచునట్లు, ఆయశోకవనికయంతయుఁ,గలయంజూచెను.
అని, తాత్పర్యము.

సంతానకలతాభిశ్చ పాదపై రుపశోభితామ్
దివ్యగంధరసోపేతాం సర్వత స్సమలంకృతామ్. ౨

స ౧౫

తాం స నందనసంకాశాం మృగపక్షిభి రావృతామ్
హర్మ్యప్రాసాదసంబాధాం కోకిలాకులనిస్స్వనామ్. ౩
కాంచనోత్పలపద్మాభి ర్వాపీభి రుపశోభితామ్
బహ్వాసనకుథోపేతాం బహుభూమిగృహాయుతామ్. ౪
సర్వర్తుకుసుమై రమ్యాం ఫలవద్భిశ్చ పాదపైః
పుష్పితానామశోకానాం శ్రియా సూర్యోదయప్రభామ్. ౫
ప్రదీప్తా మివ తత్రస్థో మారుతి స్సముదైక్షత
నిష్పత్రశాఖాం విహగైః క్రియమాణా మివాసకృత్. ౬
వినిష్పతద్భి శ్శతశ శ్చిత్రైః పుష్పావతంసకైః
ఆమూలపుష్పనిచితై రశోకై శ్శోకనాశనైః. ౭
పుష్పభారాతిభారైశ్చ స్పృశద్భి రివ మేదినీమ్
కర్ణికారైః కుసుమితైః కింశుకైశ్చ సుపుష్పితైః. ౮

టీక॥ సః=ఆ; మారుతిః=వాయుదేవునికుమారుండగుహనుమంతుఁడు; తత్రస్థః=ఆశింశుపావృక్షముపయినున్నవాఁడై; సంతానకలతాభిశ్చ=కల్పవృక్షపుఁదీఁగలచేతను; పాదపైః=వృక్షములచేతను; ఉపశోభితాం=ప్రకాశింపఁజేయఁబడినదియును; దివ్యగంధరసోపేతాం=శ్రేష్ఠమయినవాసనలోనురసములోను గూడినదియును; సర్వతః=అంతటను; సమలంకృతాం=చక్కఁగా నలంకరింపఁబడినదియును; నందనసంకాశాం=నందనవనముతో సమానమైనదియును; మృగపక్షిభిః=మృగములచేతను, పక్షులచేతను; ఆవృతాం=కప్పఁబడినదియును; హర్మ్యప్రాసాదసంబాధాం=మేడలచేతనుసగళ్లచేతనుఇఱుకుఁగలదియును; కోకిలాకులనిస్స్వనాం=కోయిలలయొక్క వ్యాకులములయినధ్వనులుగలదియును; కాంచనోత్పలపద్మాభిః=బంగారువన్నెగలకలువలును కమలములును గల; వాపీభిః=నడబావులచే; ఉపశోభితాం=ప్రకాశింపఁజేయఁబడినదియును; బహ్వాసనకుథోపేతాం=అనేకములయినపీఠములతోనుజిత్రకంబళములతోను గూడినదియును; బహుభూమిగృహాయుతాం=అనేకములయినభూమిలోపలఁగట్టఁబడిన గృహంబులతోఁగూడినదియును; సర్వర్తుకుసు




మైః=సమస్తములయిన ఋతువులపు ష్పములుగలవియును; ఫలవద్భిః=పండ్లుగలవియునగు; పాదపైశ్చ=చెట్లచేత మనోహర మయినదియు పుష్ప...ం= పూచియుండు; అశోకానాం = అశోకవృక్షములయొక్క ;శ్రియా=కాంతిచేత; సూర్యోదయప్రభాం= సూర్యోదయముయొక్క కాంతివంటికాంతిగలదియును; ప్రదీప్తామివ(స్థితాం)= మండుచున్నట్లున్నదియును ; శతశః = నూఱునూఱులుగా;వినిష్పతద్భిః= బయలు వెడలుచున్నవియును; చిత్రైః= నానావర్ణములుగలవియును ; పుష్పావతంసకైః= పూలుశిరోభూషణముగాఁ గలవియును,ముక్కులఁ బూలంగఱచుకొని యున్నవియునగుననుట;విహగైః= పక్షులచేత; అసకృత్ =పలుమాఱు;నిష్పత్రశాఖాం= ఆకులునుగొమ్మలును లేనిదిగా; క్రియమాణామివ (స్థితాం) చేయఁబడుచున్నట్లున్నదియును; ఆమూలపుష్పనిచితైః=అడుగువఱకుఁబూలచేవ్యాపింపఁబడినవియు; శోకనాశనైః= దుఃఖమునుబోఁగొట్టునవియు ;అశోకైః=అశోకవృక్షములతోను; పుష్పభారాతిభారైశ్చ=పూలసమూహముయొక్కబరువులచేత; మేదినీం=భూమిని; స్పృశద్భిరివ(స్థితైః)= తాఁకుచున్నట్లున్నవియునగు; కుసుమితైః= పుష్పించినవియును ; కర్ణికారైః = కొండగోఁగులతోను;సుపుష్పితైః = చక్కఁగాఁబూచియుండు; కింశుకైశ్చ=మోదుగుచెట్లతోను;యుక్తాం (అధ్యాహృతము)=కూడినదియునగు ; తాం=ఆయశోకవనికను ; సముదైక్షత= చూచెను.

ఆహనుమంతుండచ్చటశింశుపావృక్షంబుపైనుండి , కల్పలతలునునానావిధవృక్షంబులుగలిగి,దివ్య గంధరసంబులనొప్పుచు,నంతటనుఅలంకృతంబై,నందనవనంబునకుసాటివచ్చుచు,మృగంబులనుం బక్షులనుం జెలంగుచు, మేడలును నగళ్లును అధికముగాఁగల్గి, మధురంబులగుకోయిలలధ్వనులరమణీయంబై, బంగారుకలువలును బంగారుకమలంబులునునిండియున్ననడబావులనలంకృతంబై,యనేకములయినపీఠంబులుఁ జిత్రకంబళంబులునుగల్గి,భూగృహంబులనేకంబులతోఁ గూడి,సమస్తఋతువు లందలిపూలతోనుంగూడియున్నఫలవంతంబులయినవృక్షంబులమనోహరంబై, చక్కఁగాఁబూచియెట్టినికాంతితో వెలుంగుచుండునశోకవృక్షంబులు గల్గుటవలన,నప్పుడుదయంబునొందుసూర్యునితో




సాటియగుచు జ్వలించుచున్నదోయని యెన్నందగి యొప్పుచు, నానావర్ణంబులై పూలనుముకుళలం గలుగుకొన్నవై గుంపులుగుంపులుగా నెగురుచుండు, పక్షులచే, పత్రింబులుఁగొమ్మలునగపడకుండుటవలనఁ బత్రశాఖలేవియులేకుండునట్లుచేయంబడినవోయని భావింపఁదగినదై, శిఖరంబు మొదలుకొని వేళ్లవఱకు దట్టముగాఁబూచిచూపరుల దుఃఖంబులం బోఁగొట్టుచున్న యశోకవృక్షంబులను, బూలబరువున నేలకు వంగనవాటం జేసి నేలం దాఁకుచున్నట్లుచూపట్టుచున్నకొండగోఁగులను, సుపుష్పితంబులగు మోదుగుచెట్లను, జేజరిల్లుచున్న, యశోకవనికం జూచెను.

అని, తాత్పర్యము.

స దేశః ప్రభయా తేషాం ప్రదీప్త ఇవ సర్వతః

టీక॥ సః=ఆ; దేశః= ప్రదేశము; తేషాం= ఆవృక్షములయొక్క; ప్రభయా=కాంతిచేత; సర్వతః = అంతటను; ప్రదీప్తఇవ= మండెనదివలె; ఆసీత్ (అధ్యాహృతము)= ఉండినది.

ఆయశోకవనికయందలిప్రదేశము, అట్లు చక్కఁగాఁ బుష్పించియుండువృక్షంబుల కాంతిచే, మండుచున్నది వోలెఁ బొడకట్టుచుండినది.

అని; తాత్పర్యము.

పున్నాగా స్సప్తపర్ణాశ్చ చంపకోద్దాలకా స్తథా. ౯
వివృద్ధమూలా బహవ శ్శోభంతేస్మ సుపుష్పితాః

టీక॥ పున్నాగాః = సురపొన్నచెట్లును; సప్తపర్ణాశ్చ= ఏడాకులయరఁటిచెట్లును; తథా=అట్లు; చంపకోద్దాలకాః=సంపెంగచెట్లును విరిగిచెట్లును; బహవః= అనేకములైన; వివృద్ధమూలాః = పెరిగినవేళ్లుగలవై; సుపుష్పితాః= చక్కఁగాఁబూచినవై; శోభంతేస్మ=ప్రకాశించుచుండినవి.

ఆయశోక వనికయందు, పున్నాగవృక్షంబులును ఏడాకులయరఁటిచెట్లును, సంపెంగచెట్లునువిరిగి చెట్లు ననేకములు, వేళ్లుపెరిఁగి, చక్కఁగాఁబుష్పించి, యెంతయునొప్పుచుండినవి.

అని, తాత్పర్యము.

శాతకుంభనిభాః కేచి త్కేచి దగ్నిశిఖోపమాః. ౧౦

నీలాంజననిభాః కేచి త్తత్రాశోకా స్సహస్రశః

టీక ॥ తత్ర = ఆయశోకవనికయందు; కేచిత్ = కొన్నివృక్షంబులు; శాతకుంభనిభాః = బంగారుతో సమానము లయినవియును; కేచిత్ = కొన్నివృక్షంబులు; అగ్నిశిఖోపమాః = నిప్పుమంటతోఁబోలికగలవియును; కేచిత్ = కొన్ని; నీలాంజననిభాః = నీలమణితోను గాటుకతోను సమానములయినవియును; సహస్రశః = వేనవేలుగా; అశోకాః = అశోకవృక్షంబులును; ఆసన్ (అధ్యాహృతము) = ఉండినవి.

ఆయశోకవనికయందు, కొన్నిచెట్లుబంగారు వన్నెగలవియుఁ గొన్ని యగ్నిజ్వాలతో సరియయినవియును గొన్ని నీలపుఱాళ్లతోను గాటుకతోను సాటియయినవియును, వేనవేలుగా నశోకవృక్షంబులును, ఉండినవి.

అని, తాత్పర్యము.

నందనం వివిధోద్యానం చిత్రం చైత్రరథం యథా. ౧౧
అతివృత్తమివాచింత్యం దివ్యం రమ్యం శ్రియావృతమ్
ద్వితీయమివ చాకాశం పుష్పజ్యోతిర్గణాయుతమ్. ౧౨
పుష్పరత్నశతై శ్చిత్రం పంచమం సాగరం యథా
సర్వర్తుకైః పుష్పై ర్నిచితం పాదపై ర్మధుగంధిభిః. ౧౩
నానానినాదై రుద్యానం రమ్యం మృగగణై ర్ద్విజైః
అనేకగంధప్రవహం పుణ్యగంధం మనోరమమ్. ౧౪
శైలేంద్ర మివ గంధాఢ్యం ద్వితీయం గంధమాదనమ్

టీక॥ సః (అధ్యాహృతము) = ఆహనుమంతుఁడు; వివిధోద్యానం = నానా విధములయిన యవాంతరోద్యానములుగల; నందనం = నందనంబను పేరుగల ఇంద్రుని యుద్యానంబును; అతివృత్తమివ (స్థితం) = అతిక్రమించియున్నట్లున్నదియును; చిత్రం = ఆశ్చర్యకరంబగు; చైత్రరథంయథా (స్థితం) = చైత్రరథంబను పేరుగల కుబేరుని యుద్యానంబుం బోలె నున్నదియును; అచింత్యం = ఎన్నఁదగనిదియును; దివ్యం = శ్రేష్ఠంబును; రమ్యం = సుందరంబును; శ్రియా = కాంతిచేత; వృతం = కప్పఁబడినదియును; పుష్పజ్యోతిర్గణా

యుతం=పువ్వులనెడు నక్షత్రసమూహంబులతోఁగూడినదియు, కావుననే; ద్వితీయం=రెండవదైన;ఆకాశమివ(స్థితం)= ఆకాశముంబోలె నున్నదియును; పుష్పరత్నశతైః=పూలనెడుమణులయొక్క నూఱులచేత ; చిత్రం = నానావర్ణమయినదియును, కావుననే; పంచమం=ఐదవదైన ; సాగరంయథా (స్థితం) = సముద్రముంబోలెనున్నదియును;సర్వర్తుకపుష్పైః=సమస్తములయినఋతువుల యందలిపూలు గలవియును;మధుగంధిభిః = తేనెయొక్క వాసనగలవియునగు; పాదపైః=వృక్షములచేత;సంచితం= వ్యాపింపఁబడినదియును;నానానినాదైః= నానావిధములగుధ్వనులుగల ; మృగగణైః=మృగములసమూహములచేతను; ద్విజైః = పక్షులచేతను; రమ్యం= సుందరమయినదియును; అనేకగంధప్రవహం= పెక్కువాసనలుగల వాయువు గలదియును; పుణ్యగంధం=పరిశుద్ధంబగు వాసనగలదియును; మనోరమం= మనోహరమయినదియును,కావుననే ; గంధాఢ్యం= వాసనతోఁగూడిన; ద్వితీయం= రెండవదైన; గంధమాదనం = గంధమాదనంబను; శైలేంద్రమివ(స్థితం)= పర్వతశ్రేష్ఠముంబోలెనున్నదియునగు; ఉద్యానం=అశోకవనికను; దదర్శ (అధ్యాహృతము)=చూచెను.

హనుమంతుఁడు,నందనవనంబునతిక్రమించినదియుఁజైత్ర రథవనంబుతో సాటి యయినదియునై, యచింత్యంబైదివ్యంబై సుందరంబై కాంతిచే వెలుంగుచుఁ, బుష్పంబులను నక్షత్రంబులుగల్గుటంజేసి రెండవయాకాశంబనందగినదై,పుష్పంబులను మణులుగలదగుటంజేసి యయిదవసముద్రంబనం దగినదై, సమస్త ఋతువులంగల్గు పుష్పంబులును గల్గి మధుగంధంబు గుబాళించుచుండువృక్షంబులనొప్పుచునానావిధ మధురధ్వనులుసేయుచుండు మృగంబులును బక్షులునుగల్గి మనోహరంబగు గంధంబుతోవీచుచుండు వాయువుతోఁగూడి, మనోహరంబై, సుగంధ సంపన్నంబై, రెండవగంధమాదన పర్వతంబు కైవడిఁ బొపట్టుచున్న, యశోకవనికం, జూచెను.

అని, తాత్పర్యము.

అశోక వనికాయాంతు తస్యాం వానరపుంగవః ౧౫
స దదర్శా విదూరస్థం చైత్యప్రాసాద ముచ్ఛ్రితమ్

మధ్యే స్తంభసహస్రేణ స్థితం కైలాసపాండురమ్. ౧౮
ప్రవాళకృతసోపానం తప్తకాంచనవేదికమ్
ముష్ణంత మివ చక్షూంషి ద్యోతమాన మివ శ్రియా. ౧౭
విమలం ప్రాంశుభావత్వా దుల్లిఖంత మివాంబరమ్

టీక॥ తస్యాం=ఆ ; అశోకవనికాయాంతు = అశోకవనికయందే; సః= ఆ; వానరపుంగవః= వానరశ్రేష్ఠుండగు హనుమంతుండు; అవిదూరస్థం=కొంచెముసమీపమునందున్నదియును ; ఉచ్ఛ్రితం=ఉన్నతమయినదియును; మధ్యే = నడుమునందు; స్తంభసహస్రేణ= స్తంభములయొక్క వేయిచేత ; స్థితం = ఉన్నదియును; కైలాసపాండురం= కైలాసపర్వతమువలెఁ దెల్లనైనదియును; ప్రవాళకృతసోపానం= పవడములచేఁ జేయఁబడిన పడికట్లు గలదియును; తప్తకాంచనవేదికం= కాఁచబడిన బంగారముతోఁ జేయఁబడినతిన్నెలుగలదియును; చక్షూంషి=కండ్లను ; ముష్ణంతమివ (స్థితం)=దొంగిలించుచున్నదివోలెనున్నదియును; శ్రియా=కాంతిచేత; ద్యోతమానం=ప్రకాశించుచున్నదియును ("ఇవ" అనునది పాదపూరణార్థము); విమలం=నిర్మలమయినదియును; ప్రాంశుభావత్వాత్= ఉన్నతస్వభావముగలదగుటవలన ;అంబరం=ఆకాశమును; ఉల్లిఖంతమివ (స్థితం)=ఒరయుచున్నదివోలెనున్నదియు నగు; చైత్యప్రాసాదం= బుద్ధాలయము వంటి మేడను; దదర్శ=చూచెను.

వానర శ్రేష్ఠుండగు నాహనుమంతుండు, ఆయశోకవనికయందే కొంతసమీపంబున, నత్యున్నతంబై, నడుమ వేయి స్తంభంబుల మోయఁబడుచుఁ, గైలాసపర్వతంబుంబోలెఁ దెల్లనై , పవడములతోఁ జేసిన పడికట్లును మంచి బంగారముతోఁ జేసినతిన్నెలునుగల్గి, యధికముగాఁ గాంతిగలుటం జేసి కండ్లంబోఁగొట్టు నంత తీక్ష్ణంబై , నిర్మలంబై యౌన్నత్యంబున నాకాశంబు నొరయునట్లు మాపట్టుచున్న, బౌద్ధాలయమువలె నిర్మితంబైన ప్రాసాదంబును, జూచెను. అని, తాత్పర్యము.

తతో మలినసంవీతాం రాక్షసీభి స్సమావృతామ్. ౧౯

ఉపవాస కృశాం దీనాం నిశ్శ్వసంతీం పునః పునః
దదర్శ శుక్ల పక్షాదౌ చంద్రరేఖా మివామలామ్. ౧౯
మంద ప్రఖ్యాయమానేన రూపేణ రుచిర ప్రభామ్
పినద్ధాం ధూమజాలేన శిఖామివ విభావసోః. ౨౦
పీతే నైకేన సంవీతాం క్లిష్టే నోత్తమవాససా
సపంకా మనలంకారాం విపద్మామివ పద్మినీమ్. ౨౧
వ్రీళితాం దుఃఖ సంతప్తాం పరిమ్లానాం తపస్వినీమ్
గ్రహేణాం గారకేణేవ పీడితా మివ రోహిణీమ్. ౨౨
అశ్రుపూర్ణముఖీం దీనాం కృశా మనశనేనచ
శోకధ్యాన పరాం దీనాం నిత్యదుఃఖ పరాయణామ్. ౨౩
ప్రియం జన మపశ్యంతీం పశ్యంతీం రాక్షసీగణమ్
స్వగణేన మృగీం హీనాం శ్వగణాభివృతామివ. ౨౪
నీలనాగాభయా వేణ్యా జఘనం గతయైకయా
నీలయా నీరదాపాయే వనరాజ్యా మహీమివ. ౨౫
సుఖార్హాం దుఃఖసంతప్తాం వ్యసనానా మకోవిదామ్

టీక॥ తతః= అటుపిమ్మట; సః (అధ్యాహృతము)= ఆహనుమంతుఁడు; మలినసంవీతాం= మురికిబట్టచేఁగప్పఁబడినదియును; రాక్షసీభిః= రాక్షసస్త్రీలచేత; సమావృతాం = చుట్టఁబడినదియును; ఉపవాసకృశాం= ఉపవాసముచే సన్నగిల్లియున్నదియును; దీనాం= దుఃఖితురాలును; కాఁపునసై; శుక్లపక్షాదౌ= శుక్లపక్షప్రారంభమునందు; అమలాం= స్వచ్ఛమయిన; చంద్రరేఖామివ (స్థితాం)= చంద్రరేఖయుం బోలెనున్నదియును; పునఃపునః= మాటిమాటికి; నిశ్శ్వసంతీం= నిట్టూర్పు విడుచుచున్నదియును; మంద ప్రఖ్యాయమానేన= కొంచెముగా గుఱుతుపెట్టఁబడుచున్న; రూపేణ= ఆకారముతో; యుక్తాం (అధ్యాహృతము)= కూడినదియును; రుచిరప్రభాం= మనోహరమయిన కాంతిగలదియును; ధూమజాలేన= పొగలసమూహముచేత; పినద్ధాం= కప్పఁబడిన; విభావసోః= అగ్నియొక్క; శిఖామివ (స్థితాం)= మం

టయుంబోలెనున్నదియును; పీతేన=
పసుపురంగుగలదియునగు; క్లిష్టేన=జీ
ర్ణమయినదియును; ఏకేన=ఒకటై
న; ఉత్తమవాససా = శ్రేష్ఠమయినవ
స్త్రముచేత; సంవీతాం= కప్పఁబడి
నదియును;సపంకాం=మురికితోఁగూడి
నదియును;అనలంకారాం=అలంకార
ములేనిదియును;విపద్మాం= కమలములు
లేని;పద్మినీమివ (స్థితాం)=తామరకొ
లనుంబోలెనున్నదియును; వ్రీళితాం=
సిగ్గు నొందియున్నదియును; తలవంచు
కొనియున్నదనుట; దుఃఖసంతప్తాం=
దుఃఖముచేఁదపించునట్లుచేయఁ బడినది
యును;పరిమ్లానాం=వాడుపాటి యు
న్నదియును;తపస్వినీం=చూచువారికి
దుఃఖముగలిగించునట్టి యవస్థగలదియు
ను;అంగారకేణ=అంగారకుండను; గ్ర
హేణ=గ్రహముచే;పీడితాం = పీడిం
పఁబడిన;రోహిణీమివ(స్థితాం)= రో
హిణియుంబోలెనున్నదియును. అశ్రు
పూర్ణముఖీం=కన్నీళ్లచేనిండిన ముఖ
ముగలదియును; దీనాం = భయంబు
నొంది యుండు నదియును; అనశనే
న=భుజింపకుండుటచేత; కృశాం=
సన్నగిలియుండు నదియును; శోకధ్యా
నపరాం=దుఃఖించుటకును జింతించుట
కును లోఁబడినదియును;దీనాం= వెల

వెలఁబోవుచున్నదియును ; నిత్యదుఃఖ
పరాయణాం=ఎల్లప్పుడును దుఃఖించు
టయె ముఖ్యగతిగాఁగలదియును; ప్రి
యం=ఇష్టమయిన;జనం=జనమును;అ
పశ్యంతీం=చూడనిదియును ; రాక్షసీ
గణం= రాక్షసస్త్రీలసమూహమును ;
పశ్యంతీం=చూచుచున్నదియును ; స్వ
గణేన = తనజాతిమృగములసమూహ
ముచేత; హీనాం=విడువఁబడినదియు
ను; శ్వగణాభివృతాం = కుక్కలస
మూహముచేఁ జుట్టును జుట్టఁబడినది
యునగు; మృగీమివ(స్థితాం)= లేడివ
లెనున్నదియును; నీలనాగాభయా=న
ల్లనిసర్పముతో సమానమయినదియు
ను; జఘనం=మొలను ; గతయా =
పొందినదియును;ఏకయా=ఒకటియైన
గు; వేణ్యా=తలవెండ్రుకలజడతో;యు
క్తాం (అధ్యాహృతము) = కూడినది
యును; నీరదాపాయే=మేఘములనా
శమునందు, వర్షఋతువు పోఁగా న
నుట;నీలయా=నల్లనైన; వనరాజ్యా=
వనములపఙ్క్తితో;యుక్తాం (అధ్యా
హృతము)=కూడిన ; మహీమివ (స్థి
తాం)==భూమియుం బోలె నున్నది
యును; సుఖార్హాం=సుఖమునకుఁద
గినదియును; దుఃఖసంతప్తాం= దుఃఖ
ముచేఁదపింపఁజేయఁబడినదియును; వ్య

సనానాం = దుఃఖములకు ; అకోవిదాం=పంకితురాలుగా నిదియునగు; దుఃఖములనెఱుంగనిదియు నగుననుట ; కాంచిత్ (అధ్యాహృతము)= ఒకానొకస్త్రీని ; దదర్శ = చూచెను.

అంత, మలినవస్త్రంబు ధరించి, రాక్షసస్త్రీలచేఁ బరివృతయై, ఉపవాసంబులచే శుక్లపక్షపాడ్యమినాఁటి చంద్రరేఖయుంబోలెఁ గృశించియున్నదై, దీనయై మాటిమాటికి నిట్టూర్పులు పుచ్చుచు, మిక్కిలియుఁ గృశయు మాలిన్యముతోఁ గూడినదియుఁ గావునఁ గొంచెముగా గుఱుతుపెట్టఁదగిన రూపంబుతోఁ గూడి, మనోహరంబగు కాంతిగలిగి, ధూమజాలంబునం గప్పఁబడిన యగ్నిజ్వాలభంగిం బొడకట్టుచు, పీతవర్ణంబును జీర్ణంబునగు నొక్కటె యుత్తమవస్త్రంబు దాల్చి, పతివ్రతయగుట వలన దేహసంస్కారాదులు చేసికొనకుండుటం జేసి దేహమునం దెప్పుడు మురికి గల్గియు నలంకారములు చేసికొనకయు నుండుటచేఁ గమలంబులు లేని తామరకొలంకునై పడి గాంతిదఱిఁగి, తలక్రిందుగాఁ బడి దుకొని దుఃఖంబు నవాడు పాఱని మేనగల్గి చూచుచువారికి దుఃఖంబుగల్గించునట్టిదై వస్థనాంది, అంగారకగ్రహంబుచేఁ బీడపడఁ బడిన రోహిణీనక్షత్రంబుం బోలెఁ ల్పిఱి, నేత్రంబులం గన్నీరు నించుచు, భయమునొందినదై, యాహారంబు డీసికొనకుండుటం జేసి కృశించినదై యెల్లప్పుడును దుఃఖించుచుఁ జింతించుచు, ప్రియజనులం గానక, రాక్షసస్త్రీలం జూచుచు, తేల్లంబాసి కుక్కలచేఁ గాఱించి పెట్టబడు లేడిక్రైవడి విలపించుచు, సంస్కారంబు లేకుండుటచే నొకటిగాఁ జుట్టుకొని కృష్ణసర్పము వలె నల్లగా జఘనంబుపై వ్రేలాడుచున్న తల వెండ్రుకల జడలోఁ గూడినట్లు శరదృతువునందు నల్లనివనపఙ్క్తితోఁ గూడియుండు భూమియుంబోలెఁ బొడకట్టుచున్నదాని, సుఖంబును మాత్రమనుభవింపఁ దగినదియు దుఃఖితయు నెప్పుడును వ్యసనంబుల ననుభవింప నిదియునగు దాని, నొక్క వనితం జూచెను.

అని, తాత్పర్యము.

తాం సమీక్ష్య విశాలాక్షీ మధికం మలినాం కృశామ్. ౧౭
తర్కయామాస సీతేతి కారణై రుపపాదిభిః

టీక॥ సః (అధ్యాహృతము)= ఆహనుమంతుఁడు ; అధికం=మిక్కిలియు

నః; మలినాం= మురికిగలదియును; కృశాం=సన్నగిల్లినదియునగు; తాం=ఆ; విశాలాక్షీం = వెడల్పయినకండ్లుగల స్త్రీని; సమీక్ష్య=చక్కఁగాఁజూచి; ఉపపత్తిభిః=యుక్తులచేఁగూడినట్టి; కారణైః=కారణములచేత; సీతేతి=సీత యని; తర్కయామాస = ఊహించెను.

అట్లుమిగుల మలినయయి కృశించి యున్న యావనితం జక్కఁగాఁజూచి యాహనుమంతుండు, సరియయినకారణములచేత, "ఈబిడే సీత" యని యూహించెను. అని, తాత్పర్యము.



హ్రియమాణా తదా తేన రక్షసా కామరూపిణా. ౨౭
యథారూపాహి దృష్టావై తథారూపేయ మంగనా

టీక॥ తదా=అప్పుడు; కామరూపిణా=ఇచ్ఛాధీనంబగురూపముగల; తేన=ఆ; రక్షసా=రాక్షసునిచేత; హ్రియమాణా=అపహరింపబడున స్త్రీ; యథారూపా = ఎట్టిరూపముగలదిగా; దృష్టా=చూడఁబడినదో ("హి" అనునది పాదపూరణార్థము); ఇయం=ఈ; అంగనా=స్త్రీ; తథారూపాహి=అట్టిరూపముగలదే గదా!

అప్పుడు కామరూపియగు రాక్షసుం

స ౧౫

దుకొనిపోవఁగా మేము చూచిన స్త్రీకే రూపం బుండినదో, అదే రూపంబీబిడకున్నది. అని హనుమంతుఁ డూహించెను. అని, తాత్పర్యము.

పూర్ణచంద్రాననాం సుభ్రూం చారువృత్త పయోధరామ్. ౨౮
కుర్వంతీం ప్రభయా దేవీం సర్వా వితిమిరా దిశః
తాం నీలకేశీం బింబోష్ఠీం సుమధ్యాం సుప్రతిష్ఠితామ్. ౨౯
సీతాం పద్మపలాశాక్షీం మన్మథస్య రతిం యథా
ఇష్టాం సర్వస్య జగతః పూర్ణచంద్రప్రభా మివ. ౩౦
భూమౌ సుతను మాసీనాం నియతా మివ తాపసీమ్
నిశ్శ్వాసబహుళాం భీరుం భుజగేంద్రవధూ మివ. ౩౧
శోకజాలేన మహతా వితతేన న రాజతీమ్
సంసక్తాం ధూమజాలేన శిఖామివ విభావసోః. ౩౨
తాం స్మృతి మివ సందిగ్ధా మృద్ధిం నిపతి తా మివ
విహతా మివచ శ్రద్ధా మాశాం ప్రతిహతా మివ. ౩౩
సోపసర్గాం యథా సిద్ధిం బుద్ధిం సకలుషామివ
అభూతే నాపవాదేన కీర్తిం నిపతితామివ. ౩౪
రామోపరోధ వ్యథితాం రక్షోహరణ కర్శితామ్
అబలాం మృగశాబాక్షీం వీక్షమాణాం తత స్తతః. ౩౫
బాష్పాంబుపరిపూర్ణేన కృష్ణవక్రాక్షి పక్ష్మణా
వదనేనా ప్రసన్నేన నిశ్శ్వసంతీం పునః పునః. ౩౬
మలపంకధరాం దీనాం మండనార్హా మ మండితామ్
ప్రభాం నక్షత్ర రాజస్య కాలమేఘైరి వావృతామ్. ౩౭

టీక॥ సః(అధ్యాహృతము)=ఆహనుమంతుఁడు ; పూర్ణచంద్రనిభాననాం=నిండుచంద్రునివంటి ముఖముగలదియును; సుభ్రూం (సుభ్రువం)=సుందరము లయినకనుబొమ్మలు గలదియును; చారువృత్తపయోధరాం= సుందరములును గుండ్రములు నయినవియు నగు స్తనములు గలదియును; దేవీం=రాణియు

ను; ప్రభయా= కాంతిచేత; దిశః=దిక్కులను; సహసా=అప్పటిని; వితిమిరాః=చీఁకటిలేనివానిఁగా; కుర్వతీం=చేయుచున్నదియును; తాం=ప్రసిద్ధయును; నీలకేశీం=నల్లని వెండ్రుకలు గలదియును; బింబోష్ఠీం=దొండపండువంటి పెదవి గలదియును; సుమధ్యాం=సుందరమయిన నడుముగలదియును; సుప్రతిష్ఠితాం= మిక్కిలియు స్థిరమునదియును; పద్మపలాశాక్షీం=తామరపూరేకుల వంటి కన్నులుగలదియును; మన్మథస్య = మన్మథునియొక్క; రతింయథా (స్థితాం) = రతియుంబోలెనున్నదియును; సర్వస్య=సమస్తమయిన; జగతః= ప్రపంచమునకును; ఇష్టాం= సమ్మతయయినదియును; పూర్ణచంద్రప్రభామివ (స్థితాం)=నిండుచంద్రుని కాంతియుంబోలెనున్నదియును; భూమౌ = నేలయందు; ఆసీనాం= కూర్చున్నదియును; సుతనుం=మిక్కిలియు కృశించినదియును; నియతాం = నియమముతోఁగూడిన; తాపసీమివ (స్థితాం)=తపస్సుచేయు స్త్రీవలెనున్నదియును; భీరుం=భయపడుస్వభావము గలదియును; నిశ్వాసబహుళాం= నిట్టూర్పులధికముగాఁగలదియును; భుజగేంద్రవధూమివ (స్థితాం) = సర్పశ్రేష్ఠముయొక్క భార్యయుంబోలెనున్నదియును; మహతా = అధికమయిన; వితతే = దేహమంతయు వ్యాపించిన. దేహంబందంతయు దుఃఖచిహ్నంబులు గల్గించినయనుట; శోకజాలేన = దుఃఖసమూహము చేత; సరాజతీం = (రాజంతీం = ప్రకాశించుచున్నదియును; ధూమజాలేన = పొగలసమూహముతో; సంసక్తాం=సంబంధించిన; విభావసోః=అగ్నియొక్క; శిఖామివ( స్థితాం)=మంటయుంబోలె నున్నదియును; సందిగ్ధాం=సందేహముతోఁగూడిన; స్మృతీమివ (స్మృతిమివ, స్థితాం)=ధర్మశాస్త్రముంబోలెనున్నదియును; నిపతితాం=పడిన; ఋద్ధిమివ(స్థితాం)= సంపదయుంబోలె నున్నదియును; విహతాం=కొట్టఁబడిన; శ్రద్ధామివ (స్థితాం)చ=శ్రద్ధయుంబోలె నున్నదియును; ప్రతిహతాం=కొట్టఁబడిన; ఆశామివ (స్థితాం)=ఆశయుంబోలెనున్నదియును; సోపసర్గాం = విఘ్నముతోఁగూడిన; సిద్ధింయథా (స్థితాం)= కార్యసిద్ధియుంబోలెనున్నదియును; సకలుషాం=కసటముతోఁగూడిన; బుద్ధిమివ (స్థితాం) = బుద్ధియుంబోలె

నున్నదియును; అభూతేన=నిజముగానట్టి; అపరాధేన=నిందచేత; నిపతితాం=పడిన; కీర్తిమివ(స్థితాం)=కీర్తియుంబోలెనున్నదియును; రామోపరోధవ్యథితాం=రాముని (లక్ష్మణుచే) పొందుటయొక్క యడ్డగించుటచే దుఃఖించునదియును; రక్షోహరణకర్శితాం = రాక్షసులచేనపహరించుటచేఁగృశించునట్లుచేయఁబడినదియును; అబలాం=బలములేని స్త్రీయును; మృగశాబాక్షీం=జింకపిల్లయొక్క కండ్లవంటికండ్లుగలదియును; తతస్తతః=ఆయాప్రక్కల; వీక్షమాణాం=చూచుచున్నదియును; బాష్పాంబుపరిపూర్ణేన=కన్నీళ్లచేనిండినదియును; కృష్ణవక్రాక్షిపక్ష్మణా=నల్లనివియువంకరయయినవియునగుకనుఱెప్పలుగలదియును; అప్రసన్నేన= దుఃఖమునొందియుండుటచేనిర్మలముగానిదియునగు; వదనేన=ముఖముతో; యుక్తాం=(అధ్యాహృతము)కూడినదియును; పునఃపునః=మాటిమాటికి; నిశ్శ్వసంతీం=నిట్టూర్పులువుచ్చుచున్నదియును; మలపంకధరాం=మురికియునుబంకమును దాల్చియున్నదియును; దీనాం = దుఃఖితురాలును; మండనార్హాం= అలంకారమునకుఁదగినదియును; అమండితాం=అలంకరింపఁబడనిదియును; కాలమేఘైః=కాలమేఘములచేత; ఆవృతాం=మూయఁబడిన; నక్షత్రరాజస్య=నక్షత్రములకధిపతియైనచంద్రునియొక్క; ప్రభామివ=(స్థితాం)కాంతియుంబోలె నున్నదియునగు; తాం=ఆ; సీతాం=సీతను; దదర్శ=(అధ్యాహృతము)చూచెను.

నిండుచందురునింబోలుముఖంబును సుందరంబు లయిన కనుబొమ్మలును సుందరంబులును గుండ్రంబులునగు స్తనంబులును గల్గి దేహప్రభచే సమస్తదిక్కులచీఁకట్లనుంబోఁగొట్టుచు, నల్లని వెండ్రుకలతోను దొండపండువంటిపెదవితోను సుందరంబగునడుముతోను జెలంగుచు, పాతివ్రత్యమందు స్థైర్యంబు గల్గి, తామరపూరేకులుంబోలె విశాల సుందరంబులగు నేత్రంబులతోఁగూడి, మన్మథునిభార్యయగు రతియుంబోలె నొప్పుచు, సమస్తలోకంబులకును సమ్మతనై, నిండుచందురుని కాంతింబోలు కాంతిగలదై, నేలంగూర్చున్నదై, కృశించియున్నదేహముగలదై, నియమంబవలంబించియుండు తాపసియుంబోలెఁజూపట్టుచు, భయంబునొంది, మెచ్చగానిట్టూర్పులువుచ్చుచు, నాగకన్య

కయుంబోలెఁగనుపట్టుచు, నధికంబుగాదుఃఖంబుగలదికావునఁ బ్రకాశింపకున్నదియై,పొగలచేఁగప్పబడినయగ్నిజ్వాలయుంబోలెఁజూడనగుచు, సందేహంబుతోఁగూడినయర్థంబుగలస్మృతియుంబోలెనియోగించుట కశక్తయై, తఱిగినసంపదయుంబోలె కాంతివగ్గినదై,ఫలాభావంబునంజేసితగ్గినశ్రద్ధకైవడి,సాఫల్యంబులేకుండుటవలన వ్యర్థమయినయాశపగిది,విఘ్నంబు నొందినకార్యసిద్ధిభంగి,కపటసహితంబగుబుద్ధిరీతి,నపవాదంబుచేఁ దఱిఁగిన కీర్తిపోల్కి,క్షీణరూపయై, రామసంగమంబులేమిం జేసి దుఃఖితయై, రాక్షసుండగు రావణునిచేనపహరింపఁబడుట వలనఁ గృశించిన దేహంబుగలదై, యబలయు జింకపిల్లలకుంబోలెఁ జంచలనేత్రంబులుగలదియుఁ, గావున, నాల్గుప్రక్కలంజూచుచుఁ,గన్నీళ్లనిండి నల్లనిదియు వంకరయునగు కనుఱెప్పలు గల్గి యప్రసన్నంబైయున్నముఖంబుతోఁగూడి, మాటిమాటికినిట్టూర్పులువుచ్చుచు,మలినదేహయై, గర్వంబుడిగినదై యలంకారాహయయినను,భర్తృవిరహంబునంజేసి, యలంకారంబుచేసికొనక, కాలమేఘంబులచేఁగప్పఁబడిన చంద్రునికాంతియుంబోలెఁ జూడనగుచున్న, సీతను,హనుమంతుండు,చూచెను.

అని, తాత్పర్యము.

తస్య సందిదిహే మూతిర్ముహు స్సీతాం నిరీక్ష్యతు
ఆమ్నాయానా మయోగేన విద్యాం ప్రశిథిలామివ. ౩౮

టీక ॥ ఆమ్నాయానాం=అభ్యాసములయొక్క; అభావేన=లేకపోవుటచేత; ప్రశిథిలాం=సంధులువదలిన,మఱవఁబడినయనుట; విద్యామివ = (స్థితాం)విద్యయుంబోలెనున్న; సీతాం=సీతాదేవిని; ముహుః=పలుమాఱు;నిరీక్ష్యతు=చూచినంతనె; తస్య=ఆహనుమంతునియొక్క;బుద్ధిః=బుద్ధి; సందిదిహే=సందేహమునొందెను.

అభ్యాసము లేకుండుటవలన మఱవఁబడినవిద్యయుంబోలెఁ గృశించియున్నసీతను మాటిమాటికింజూచి, యాహనుమంతుఁడు,"ఇదియిట్లుకృశించిమలినదేహయైయున్నదే, సీతయానో, కాదో" అని,సందేహమునొందెను.

అని, తాత్పర్యము.

దుఃఖేన బుబుధే సీతాం హనుమా ననలంకృతామ్
సంస్కారేణ యథా హీనాం వాచ మర్థాంతరంగతామ్. ౩౯

టీక॥ హనుమాన్=హనుమంతుఁడు; అనలంకృతాం=అలంకరింపఁబడనట్టి; సీతాం=సీతను; సంస్కారేణ=శబ్దవ్యుత్పత్తిచే; హీనాం=విడువఁబడినదియు, కావున నే; అర్థాంతరం=మఱియొకయర్థమును; గతాం=పొందినదియునగు; వాచంయథా=మాటనుంబోలె; దుఃఖేన=కష్టముచేత; బుబుధే=తెలిసికొనెను.

పండితుఁడు కానివాఁడు చెప్పినమాటను, అతనికి శబ్దవ్యుత్పత్తిలేనందువలన, ఆమాటయతఁడు చెప్పఁదలచినయర్థమునువిడిచిమఱియొకయర్థమును, బోధించుటంజేసి, పండితుండు, పూర్వోత్తర సందర్భము నాలోచించి, బహుకష్టంబునం దెలిసికొనునట్లు, హనుమంతుండు, అలంకారంబు లేకయుపవాసాదులచే మాఱురూపునొందియున్నసీతను, రాముండుచెప్పిన గుఱుతులనాలోచించి, బహుకష్టంబునం దెలిసికొనెను.

అని, తాత్పర్యము.

తాం సమీక్ష్య విశాలాక్షీం రాజపుత్రీ మనిందితామ్
తర్కయామాస సీతేతి కారణై రుపపాదిభిః. ౪౦

టీక॥సః(అధ్యాహృతము)= ఆహనుమంతుఁడు; అనిందితాం=నిందింపఁబడనిదియును; రాజపుత్రీం= రాచకొమార్తెయునగు; తాం=ఆ; విశాలాక్షీం=వెడలుపయినకండ్లుగల(స్త్రీ)ని; సమీక్ష్య=చూచి; ఉపపాదిభిః=యుక్తియుక్తములయిన; కారణైః=హేతువులచే; సీతేతి=సీతయని; తర్కయామాస=ఊహించెను.

ఆహనుమంతుఁడు, నిందింపఁబడనిదియును రాచకొమార్తెయునగు నా వనితంజూచి, సరియయిన కారణములచేత, సీతయనియూహించెను.

అని, తాత్పర్యము.

వైదేహ్యా యాని చాంగేషు తదా రామో న్వకీర్తయత్

తా న్యాభరణజాలాని శాఖాశోభీన్యలక్షయత్. ౪౧
సుకృతౌ కర్ణవేష్టౌచ శ్వదంష్ట్రౌచ సుసంస్థితౌ
మణివిద్రుమ చిత్రాణి హస్తే ష్వాభరణానిచ. ౪౨
శ్యామాని చిరయుక్తత్వా త్తథా సంస్థానవంతిచ

టీక॥ సః (అధ్యాహృతము)= ఆ హనుమంతుఁడు; సుకృతౌ=చక్కఁగాఁ జేయఁబడిన; కర్ణవేష్టౌచ= కుండలంబులను; సుసంస్థితౌ=సుందరములయిన, శ్వదంష్ట్రౌచ = ఆఁడువారు చెవినిధరించెడునొకవిధమైనభూషణములను; శ్యామాని = నల్లనివిగానుండునవియును; చిరయుక్తత్వాత్ = బహుకాలముసంబంధముగలసి యుండుట వలన, బహుకాలము ధరింపఁబడుటవలననుట; తథా=అట్లు; సంస్థానవంతిచ= సన్నివేశములుగలవియును, ధరించినచోటముద్రలుగలవియు ననుట ; మణివిచిత్రాణి= రత్నములచేతను బవడములచేతను నానావర్ణములు గలవియునగు ; హస్తేషు=చేతులయందు; (ధరింపదగిన); ఆభరణానిచ = సొమ్ములను; ఏవం (అధ్యాహృతము) = ఇట్లు; తదా=అప్పుడు; రామః=రాముఁడు; వైదేహ్యాః=సీతయొక్క; అంగేషు=అవయవములందు; యాని= ఏయాభరణములను; అన్వకీర్తయత్ = చెప్పెనో; శాఖాశోభీని= చెట్లకొమ్మలందుఁబ్రకాశించుచున్న; తాని=ఆ; ఆభరణజాలాని చ = సొమ్ములయొక్కసమూహములను; అలక్షయత్ =చూచెను.

రాముండు, హనుమంతుండు బయలుదేఱునప్పుడు, ఆనవాలుగా, సీతయేయే యాభరణంబుల ధరించుచున్నదని చెప్పెనో, సీత పతివ్రతయగుటంజేసి భర్తృవిరహకాలంబున ధరింపరాదని తలంచి చెట్టుకొమ్మలయందుఁ గట్టియున్న, సుందరంబులగు కుండలంబులు శ్వదంష్ట్రంబులను కర్ణాభరణంబులు మణులను బవడములను గూర్చి నిర్మింపఁబడినవియు విరహబాధవలననలుపుదగిలి యున్నవియు నగు హస్తాభరణలు మొదలగు, నాయాభరణంబుల నన్నింటిని, మఱియు సీత దేహంబునవానిధరించుచోట్ల నేర్పడియుండు ముద్రలనుం, జూచెను. అని, తాత్పర్యము.

తాన్యే వైతాని మన్యేహం యాని రామో న్వకీర్తయత్. ౪౩



టీక॥ రామః=రాముడు; యాని=ఏయాభరణంబులను; అన్వకీర్తయత్=చెప్పెనో; ఏతాని=వీటిని; తాన్యేవ=వానిఁగానె; అహం=నేను; మన్యే=తలంచుచున్నాను.

రాముండే యాభరణంబుల నానవాలుగాఁజెప్పెనో, అవియే, యాభరణంబులని, తలంచెదను.

అని, తాత్పర్యము.

తత్ర యాన్యవహీనాని తాన్యహం నోపలక్షయే
యాన్యస్యా నావహీనాని తానీమాని న సంశయః. ౪౪

టీక॥ తత్ర=ఆఋశ్యమూక పర్వతమునందు; యాని=ఏయాభరణములు; అవహీనాని=విడువఁబడినవో; తాని=ఆయాభరణంబులను; అహం=నేను; నోపలక్షయే=చూడను. అస్యాః=ఈసీతయొక్క; యాని=ఏయాభరణములు; నావహీనాని=విడువఁబడలేదో; ఇమాని=ఇవి; తాని=ఆయాభరణములు. సంశయః=సందేహము; న=లేదు.

ఆఋశ్యమూక పర్వతంబునందు, ఈసీతయే యాభరణంబులఁ బడవైచెనో, ఆయాభరణంబులిప్పుడు నాకగపడలేదు; అప్పుడు పాఱవేయఁబడని యాభరణంబులు; అందు సందేహము లేదు.

అని, తాత్పర్యము.

పీతం కనకపట్టాభం స్రస్తం తద్వసనం శుభమ్
ఉత్తరీయం నగాసక్తం తదా దృష్టం ప్లవంగమైః. ౪౫

టీక॥ తదా=అప్పుడు; స్రస్తం=పడినదియును; నగాసక్తం=పర్వతమునందు సంబంధించియుండినదియు, పర్వతమునందున్నదియుననుట; పీతం=పసుపురంగుకలదియు; కనకపట్టాభం=బంగారుపట్టెయొక్క కాంతివంటికాంతిగలదియును; శుభం=మంగళకరమయినదియును; ఉత్తరీయం=పైనధరింపదగినదియునగు; తత్=ఆ; వస్త్రం=వస్త్రము; ప్లవంగమైః=కోఁతులచేత; దృష్టం=చూడఁబడినది.

ఈసీతయాఋశ్యమూకపర్వతంబు




పైఁబడవైచిన, సుపపురంగుగల్గి బంగారు పంట్టెంబోలె వెలుంగుచున్న పయఁటవేసుకొనువస్త్రమును, సుగ్రీవాదివానరులుచూచినారు. అని, తాత్పర్యము.

భూషణానిచ ముఖ్యాని దృష్టాని ధరణీతలే
అన యైవాపవిద్ధాని స్వనవంతి మహాంతిచ. ౪౬

టీక॥ అనయైవ=ఈబిడచేతనే; ధరణీతలే=భూతలమునందు ; అపవిద్ధాని=పడవైవఁబడినవియును; ముఖ్యాని=శ్రేష్ఠములయినవియును ; స్వనవంతి=ధ్వనిగలవియును; మహాంతిచ=గొప్పవియునగు; భూషణానిచ=సొమ్ములును; దృష్టాని=చూడఁబడినవి.

ఈబిడచేతనే నేలంబడవైవఁబడిగల్లుగల్లుమని మ్రోగుచున్న శ్రేష్ఠములగు భూషణంబులును, జూడఁబడినవి.

అని, తాత్పర్యము.

ఇదం చిరగృహీతత్వా ద్వసనం క్లిష్టవత్తరమ్
తథాపి నూనం తద్వర్ణం తథా శ్రీమద్యథే తరత్. ౪౭

టీక॥ ఇదం=ఈ; వసనం=వస్త్రము; చిరగృహీతత్వాత్ =బహుకాలముగా గ్రహింపఁబడియుండుటవలన; క్లిష్టవత్తరం= మిక్కిలియునలఁగుటగల్గినది; తథాపి=అట్లయినను; నూనం=నిశ్చయముగా; తద్వర్ణం= ఆరంగుగలదిగాను; ఇతరత్=మఱియొకటి; యథా=ఎట్లో; తథా=అట్లు; శ్రీమత్ =కాంతిగలదిగాను; అస్తి (అధ్యాహృతము)=ఉన్నది.

ఈవస్త్రము బహుకాలముగా విడువకధరింపఁబడుటంజేసి, మిగుల నలఁగియున్నది; అయినను, మునుపు పర్వతంబుపైఁబడవయివఁబడినవానియట్లు, అదేరంగును అదేకాంతియును గల్గియున్నది. అని, తాత్పర్యము.

ఇయం కనకవర్ణాంగీ రామస్య మహిషీ ప్రియా
ప్రణష్టాపి సతీ యాస్య మనసోన ప్రణశ్యతి. ౪౮

టీక॥ సతీ=పతివ్రతయగు; యా=ఏసీత; ప్రణష్టాపి= అగపడకపోయినను; అస్య=ఈరామునియొక్క; మనసః=మనసునుండి; నప్రణశ్యతి= అగపడకపోలేదో, ఎల్లప్పుడును రామునిచే మనంబున ధ్యానింపఁబడుచున్నదనుట; ఇయం=ఈ; కనకవర్ణాఙ్గీ= బంగారువన్నెగల దేహముగలయాఁడుది; సా=అట్టి; రామస్య=రామునియొక్క; ప్రియా = ఇష్టయయిన; మహిషీ=భార్య.

ఎవ్వతె, రావణుండపహరించుటచేఁగంట్లకగపడకున్నను రామునిచే నెల్లప్పుడు మనంబున ధ్యానింపఁబడు చుండుటంజేసి, విడువక రామునిమనంబునకగపడు చుండునో, అట్టిరాముని ప్రియభార్యయయిన సీతయే, యీవనిత.

అని, తాత్పర్యము.

ఇయం సా యత్కృతే రామ శ్చతుర్భిః పరితప్యతే
కారుణ్యేనా నృశంస్యేన శోకేన మదనేనచ. ౪౯
స్త్రీ ప్రణష్టేతి కారుణ్యా దాశ్రితే త్యా నృశంస్యతః
పత్నీ నష్టేతి శోకేన ప్రియేతి మదనేనచ. ౫౦

టీక॥ యత్కృతే = ఎవ్వతెకుఁగాను; రామః= రాముఁడు; "స్త్రీ=ఆఁడుది; ప్రణష్టా= అగపడకపోయినది" ఇతి=అని; కారుణ్యాత్=దయవలనను; ఆశ్రితా= తన్నాశ్రయించినది; ప్రణష్టేతి(అధ్యాహృతము)=అగపడకపోయినదని; ఆనృశంస్యతః=మృదుస్వభావముఁగలిగియుండుటవలనను; "పత్నీ= భార్య; నష్టా= అగపడకపోయినది" ఇతి=అని; శోకేన= దుఃఖముచేతను; ప్రియా=ప్రియురాలు; నష్టేతి (అధ్యాహృతము)= అగపడకపోయినదని; మదనేనచ=మన్మథునిచేతను; ఏవం (అధ్యాహృతము)= ఇట్లు; కారుణ్యేన= దయచేతను; అనృశంస్యేన=మృదుస్వభావముఁగలుగుటచేతను; శోకేన= దుఃఖముచేతను; మదనేనచ=మన్మథుని చేతను; చతుర్భిః=నాల్గింటిచేత; పరితప్యతే=బాధపడుచున్నాఁడో; ఇయం= ఈస్త్రీః సా=ఆసీత.

రాముండేసీతనుగుఱించి, "సాధారణంబుగా నెవ్వఁడు నాపత్సునయంబు




నరక్షింపవలసినస్త్రీ యగపడకపోయినదే, యెంతశ్రమపడుచున్నదో అని" దయవలనను, "తన్నాశ్రయించిన దానిరక్షించుటకు లేకపోయినదే" యని యనుతాపంబువలనను, "నాభార్య, నా దేహములోసగమని వేదములోఁజెప్పఁబడినదిసమస్త ధర్మంబులుసేయుటకును సహాయురాలు, అగపడలేదే" యనిదుఃఖంబువలనను "నాప్రియురాలెచ్చటనో యగపడలేదే, విరహబాధనోర్వలేనే" యని మన్మథబాధవలనను, ఇట్లు దయచేతను, అనుతాపముచేతను దుఃఖముచేతను మన్మథబాధచేతను, నాలుగింటను బాధపడుచున్నాఁడో, ఆసీతయె యీబిడ. అని, తాత్పర్యము.

అస్యా దేవ్యా యథా రూప మంగప్రత్యంగసౌష్ఠవమ్
రామస్య చ యథారూపం తస్యేయ మసితేక్షణా. ౫౧

టీక॥అస్యాః=ఈ; దేవ్యాః= సీతాదేవికి; రూపం=సౌందర్యంబును; అంగప్రత్యంగసౌష్ఠవం= దేహముయొక్కయును అవయవములయొక్కయునుజక్కఁగానుండుటయును; యథా=ఎట్లో; రామస్యచ (అధ్యాహృతము)= రామునకును; తథా (అధ్యాహృతము)= అట్లు. రామస్యచ=రామునకు; రూపం=సౌందర్యము; యథా=ఎట్లో; అస్యాః (అధ్యాహృతము)= ఈసీతకును; తథా(అధ్యాహృతము)=అట్లు. ఇయం=ఈ; అసితేక్షణా=నల్లనికండ్లుగలస్త్రీ; తస్య=ఆ రామునకు; యోగ్యా(అధ్యాహృతము)=తగినది.

ఈసీతకెట్లుసౌందర్యంబును దేహావయవంబులచక్కఁదనమునున్నదో, రామునకునట్లేయున్నది; రామునకెట్లు సౌందర్యాదులున్నవో, ఈసీతకునుఅట్లేయున్నవి; కావున, రామునకీబిడతగియున్నది. అని, తాత్పర్యము.

అస్యా దేవ్యా మనస్తస్మిం స్తస్య చాస్యాం ప్రతిష్ఠితమ్
తేనేయం స చ ధర్మాత్మా ముహూర్తమపి జీవతి. ౫౨

టీక॥అస్యాః=ఈ; దేవ్యాః= సీతాదేవియొక్క; మనః=మనసు; తస్మిన్=




ఆరామునియందును; తస్య=ఆరాము నియొక్క; మనః(అధ్యాహృతము)= మనసు;అస్యాంచ= ఈబిడయందును; ప్రతిష్ఠితం= ప్రతిష్ఠింపఁబడినది . తేన=దానిచేత;ఇయం = ఈబిడయును; ధర్మాత్మా=ధర్మస్వభావముగల; స చ=ఆరాముండును; ముహూర్తమపి=కొంచెముసేపైనను; జీవతి=జీవించుచున్నారు.

ఈసీతమనసు రామునియందును, రామునిమనసు, సీతయందును, స్థిరముగానెలకొనియున్నది; అట్లు మనసునొకరినొకరుచూచుకొనుచుండుట వలననె, ఈసీతగాని,ధర్మాత్ముండగు నారాముండుగాని, యింతవఱకుబ్రతికియున్నారు.

అని, తాత్పర్యము.

దుష్కరం కృతవా న్రామో హీనో యదనయా ప్రభుః
ధారయ త్యాత్మనో దేహం నశోకే నావసీదతి. ౫౩

టీక॥ప్రభుః = రాముండు; అనయా=ఈసీతచేత; హీనః=విడువఁబడినవాఁడై;ఆత్మనః =తనయొక్క; దేహం=దేహమును; ధారయతి= ధరించుచున్నాఁడు; శోకేన=దుఃఖముచే ; నావసీదతి = నశింపకున్నాఁడు;(ఇతి) యత్=అనునదియేదికలదో; తత్ (అధ్యాహృతము)=ఆ ; దుష్కరం=చేయఁగూడనికార్యమును;రామః = రాముఁడు; కృతవాన్=చేసినాఁడవు.

రాముండు, సీతను విడిచియును, దేహంబు ధరించి యున్నాఁడే, సీత మాత్రము స్వతంత్రురాలు కాదు కావున దేహంబు విడుచుటకు శక్తురాలుకాదు, రాముండు పురుషుండు కావునస్వతంత్రుండు, అట్లుండఁగ, దుఃఖంబున దేహంబు విడువక జీవించి యుండుట చాల నాశ్చర్యకరముగానున్నది ; మఱియెవ్వరును ఇట్లుండఁజాలరు.

అని, తాత్పర్యము.

దుష్కరం కురుతే రామో య ఇమాం మత్తకాశినీమ్
సీతాం వినా మహాబాహు ర్ముహూర్తమపి జీవతి. ౫౪

టీక॥ యః=ఏరాముఁడు ; మత్తకాశినీం=మదముచేఁ బ్రకాశించునట్టి ;




ఇమాం=ఈ; సీతాంవినా=సీతను విడిచి; ముహూర్తమపి = కొంచము సేపైనను; జీవతి = బ్రతుకుచున్నాఁడో; సః (అధ్యాహృతము) = అట్టి; మహాబాహుః=పెద్దచేతులుగల; రామః=రాముండు; దుష్కరం= చేయన శక్యమయిన కార్యమును; కురుతే=చేయుచున్నాఁడు.

మదంబుచేఁ బ్రకాశించునట్టి యుత్తమవనితయయిన యీసీతనువిడిచి, యింతవఱకుబ్రతికియున్నాఁడు, కావున, మహాబాహుండగురాముండు ఎట్టివారికినిజేయ నశక్యమయిన కార్యమును, జేయుచున్నాఁడు. అని, ఆహనుమంతుండు, చింతించెను. అని, తాత్పర్యము.

ఏవం సీతాం తదా దృష్ట్వా హృష్టః పవనసంభవః
జగామ మనసా రామం ప్రశశంసచ తం ప్రభుమ్. ౫౫

టీక॥ పవనసంభవః= వాయువువలనఁబుట్టినహనుమంతుఁడు; తదా= అప్పుడు; ఏవం=ఇట్లు; సీతాం= సీతను; దృష్ట్వా=చూచి; హృష్టః=సంతసించినవాఁడై; మనసా=మనసుచేత; రామం=రాముని; జగామ= పొందెను. తం=ఆ; ప్రభుం=ప్రభుండగు రామునిఁ; ప్రశశంసచ=పొగడెను.

వాయుదేవునికుమారుండగు హనుమంతుం, డప్పుడు, ఇట్లు, సీతంజూచి, సంతోషంబునొంది, మనంబున రామునిం దలంచుకొని, సమస్తలోక నాయకుండగునారామునింబొగడెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, పంచదశస్సర్గః.

ఇది, స్వస్తార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానం బగు శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండ పంచదశసర్గ టీక,
ముగిసినది.






౩౨

### షోడశసర్గః ప్రారంభః.

ప్రశస్యతు ప్రశ స్తవ్యాం సీతాం తాం హరిపుంగవః
గుణాభి రామం రామంచ పున శ్చింతాపరో భవత్. ౧

టీక॥హరిపుంగవః=వానర శ్రేష్ఠుం డగుహనుమంతుండు;ప్రశ స్తవ్యాం(ప్రశంసితవ్యాం) = పొగడఁబడవలసిన; తాం=ఆ; సీతాం=సీతను; గుణాభి రామం=గుణంబులనొప్పుచున్న; రామంచ= రాముని; ప్రశస్యతు=పొగడియు;పునః=మఱల; చింతాపరః=దుఃఖమునకులోఁకువయయినవాఁడు; అభవత్ =ఆయెను.

వానరశ్రేష్ఠుండగు హనుమంతుండు,ప్రశంసింపఁదగినసీతాదేవిని, గుణవంతుండగురాముని, బ్రశంసించి, మఱలఁ,జింతలోమునింగెను.

అని, తాత్పర్యము.

సుముహూర్త మివ ధ్యాత్వా బాష్పపర్యా కులేక్షణః
సీతా మాశ్రిత్య తేజస్వీ హనుమా న్విలలా పహ. ౨

టీక॥ తేజస్వీ=ప్రశ స్తమగు పరాక్రమముగల; సః=ఆ; హనుమాన్=హనుమంతుఁడు ; ముహూర్తం = కొంచెముసేపు ("ఇవ" అనునది వాక్యాలంకారార్థము); ధ్యాత్వా=ఆలోచించి;బాష్పపర్యాకులేక్షణః = కన్నీరుచేఁగలఁతనొందిన కండ్లుగలవాఁడై;సీతాం=సీతను; ఆశ్రిత్య=ఉద్దేశించి;విలలాప=దుఃఖించెను."హ" అనునది పాదపూరణార్థము.

మహాపరాక్రమశాలి యగు హనుమంతుండు,కొంచెముసేపు, ఆలోచించి,యంతఁగన్నీటందోఁగుచుండు నేత్రములతో,సీతనుగుఱించి,యిట్లని విలపించెను. అని, తాత్పర్యము.

మాన్యా గురువినీతస్య లక్ష్మణస్య గురుప్రియా
యది.సీతాపి దుఃఖార్తా కాలోహి దురతిక్రమః. ౩




టీక॥ గురువినీతస్య=గురువులచేత శిక్షింపఁబడిన; లక్ష్మణస్య=లక్ష్మణుననకు; మాన్యా=పూజింపఁదగినదియును; గురుప్రియా=గురువయినరామునియొక్క-ప్రియురాలునగు; సీతాపి=సీతయయు; దుఃఖాతా౽యది=దుఃఖముచేఁబీడింపఁబడినదగునేని; కాలః=కాలము; దురతిక్రమోహి = అతిక్రమింపఁగూడనిదే.

గురువులచే శిక్షింపఁబడి ధార్మికుండైనలక్ష్మణునిచేఁబూజింపఁ దగినదై, రామునకుఁ బ్రియురాలై యున్న, సీతకునుదుఃఖముగలిగినది, కావున, కాలమునతిక్రమింప నేరికినలవిగాదు.

అని, తాత్పర్యము.

రామస్య వ్యవసాయజ్ఞా లక్ష్మణస్య చ ధీమతః
నాత్యర్థం క్షుభ్యతే దేవీ గంగేవ జలదాగమే. ౪

టీక॥ రామస్య=రామునియొక్క-యు; ధీమతః= అధికమయినబుద్ధిగలి; లక్ష్మణస్యచ=లక్ష్మణునియొక్క-యు; వ్యవసాయజ్ఞా= ప్రయత్నమునెఱింగినదగు, పరాక్రమము నెఱింగినదగునటు; దేవీ=సీతాదేవి; జలదాగమే=మేఘంబులవచ్చుటయందు, వర్షర్తువునందనుట; గంగేవ=గంగానదియుంబోలె; అత్యర్థం = మిక్కి-లియు; నక్షుభ్యతే=దుఃఖింపకున్నది.

ఈసీతాదేవి, రామునిపరాక్రమంబును బుద్ధిమంతుండగు లక్ష్మణునిపరాక్రమంబునుం, దెలిసినది, కావున, వారలుదన్నెట్లయినశత్రుపుంజంబు, మఱలఁగొనిపోవుదురని,నమ్మి, యెచ్చుగాదుఃఖింపకున్నది. అని, తాత్పర్యము.

తుల్యశీలవయోవృత్తాం తుల్యాభిజనలక్షణామ్
రాఘవోఽర్హతి వైదేహీం తం చేయ మసితేక్షణా. ౫

టీ॥ రాఘవః=రఘువంశమునఁబుట్టిన రాముఁడు; తుల్యశీలవయోవృత్తాం= సమానములయిన స్వభావమునువయసునుఆచారమును గలదియు; తుల్యాభిజనలక్షణాం = సమానములయినకులమునులక్షణములును గలదియునగు; వై




దేహం=విదేహదేశంబునఁ (జనకవంశంబుననుట) బుట్టినసీతను; అహతి=పొందఁదగును. ఇయం=ఈ; అసితేక్షణా = నల్లనికన్నులుగల సీతయును; తం=ఆ రాముని; అహతి(అధ్యాహృతము)= పొందఁదగును.

రాముఁడు, తన కెప్పుడు తక్కువలు లేక, స్వభావంబునను వయసునను సదాచారంబునను గులంబున నుత్తమలక్షణంబులను సమానయై యుండు, సీతకుఁ దగియున్నాఁడు; నల్లనికన్నులుగల యీసీతయును ఆరామునకుఁ దగియున్నది. అని, హనుమంతుండు నిశ్చయించెను.

అని, తాత్పర్యము.

తాం దృష్ట్వా నవహేమాభాం లోకకాంతామివ శ్రియమ్
జగామ మనసా రామం వచనం చేద మబ్రవీత్. ౮

టీక॥ సః (అధ్యాహృతము) = ఆ హనుమంతుండు; నవహేమాభాం = నూతనమయిన బంగారము యొక్క కాంతివంటి కాంతిగలదియును; లోకకాంతాం= లోకంబునకుఁ బ్రియమైనదియును ;శ్రియమివ (స్థితాం) =లక్ష్మియుంబోలెనున్నదియునగు; తాం= ఆసీతను ; దృష్ట్వా=చూచి మనసా=మనసుచేత; రామం=రాముని;జగామ=పొందెను. ఇదం=ఈ ; వచనంచ = మాటను; అబ్రవీత్=పలికెను.

ఆహనుమంతుఁడు , నూతనంబగు బంగారముంబోలెఁ దేజరిల్లుచుఁ బ్రపంచమునకంతయుఁ బ్రియయయి లక్ష్మీదేవిం బోలియున్న సీతఁ జూచి రాముందలంచుకొని, యిట్లని, తనలోఁ దాను చెప్పుకొనెను.

అని, తాత్పర్యము.

అస్యా హేతో ర్విశాలాక్ష్యా హతో వాలీ మహాబలః
రావణప్రతిమో వీర్యే కబంధశ్చ నిపాతితః. ౯

టీక॥అస్యాః=ఈ; విశాలాక్ష్యాః= పెద్దకండ్లుగలసీతయను; హేతోః (తృతీయార్థమందుషష్ఠి) = కారణముచేత;మహాబలః=అధికమయిన బలముగల;వాలీ=వాలి;హతః=చంపఁబడినాఁడు.వీర్యే=పరాక్రమమునందు ; రావ




॥ప్రతిమః=రావణునితోఁ బోలికగల; కబంధశ్చ=కబంధుండును; నిపాతితః=పడఁద్రోయఁబడెను;చంపఁబడెననుట.

పెద్దనేత్రంబులుగలయీసీతకుఁగానే, రాముండు,అధికమయినబలముగలవాలిని, బరాక్రమంబునరావణునితో సరివచ్చుకబంధునింజంపెను.

అని, తాత్పర్యము.

విరాధశ్చ హత స్సంఖ్యే రాక్షసో భీమవిక్రమః
వనే రామేణ విక్రమ్య మహేంద్రేణేవ శంబరః. ౮

టీక॥వనే=అడవియందు ; రామేణ=రామునిచేత;విక్రమ్య = పరాక్రమించి; సంఖ్యే=యుద్ధమునందు; భీమవిక్రమః=భయంకరంబగు పరాక్రమంబుగల;విరాధః=విరాధుండను ; రాక్షసశ్చ=రాక్షసుండును;మహేంద్రేణ=దేవేంద్రునిచేత;శంబరఇవ= శంబరాసురుండుంబోలె;హతః = చంపఁబడినాఁడు.

మఱియు,నీసీతకుఁగానే, రాముండు,దేవేంద్రుండుశంబరాసురునిం జంపినట్లు,వనంబునఁ బరాక్రమించి,యుద్ధంబునందు , మహాపరాక్రమశాలియగువిరాధుండనురాక్షసుం,జంపెను.

అని, తాత్పర్యము.

చతుర్దశసహస్రాణి రక్షసాం భీమకర్మణామ్
నిహతాని జనస్థానే శరైరగ్నిశిఖోపమైః. ౯

టీక॥జనస్థానే=జనస్థానమందు;భీమకర్మణాం=భయంకరంబులగుకార్యములుగల; రక్షసాం=రాక్షసులయొక్క; చతుర్దశసహస్రాణి=పదునాలుగువేలు;అగ్నిశిఖోపమైః=నిప్పుమంటలతోఁ బోలికగల;శరైః=బాణములచేత ; నిహతాని=చంపఁబడినవి.

మఱియు,నీబిడకుఁగానే, రాముండు,జనస్థానంబునందు , భయంకరమగుపరాక్రమముగలవారలఁ బదునాలుగువేలరాక్షసుల, నగ్నిజ్వాలలంబోలుబాణంబులచేఁ,జంపెను.

అని, తాత్పర్యము.




ఖరశ్చ నిహత స్సంఖ్యే త్రిశిరాశ్చ నిపాతితః
దూషణశ్చ మహాతేజా రామేణ విదితాత్మనా. ౧౦

టీక॥విదితాత్మనా=తెలిసికొనఁబడినయాత్మగల; రామేణ=రామునిచేత; సంఖ్యే=యుద్ధమునందు; ఖరశ్చ=ఖరుండును;నిహతః= చంపఁబడినాఁడు. త్రిశిరాశ్చ=త్రిశిరుండును; నిపాతితః= పడఁద్రోయఁబడినాఁడు , చంపఁబడినాఁడనుట.మహాతేజాః=అధికమయినపరాక్రమంబుగల;దూషణశ్చ= దూషణుండును; నిపాతితః (అధ్యాహృతము)=చంపఁబడినాఁడు.

ఆత్మజ్ఞానంబుగలరాముఁడీబిడకుఁగానే,యుద్ధంబున,ఖరునిత్రిశిరునిమహాపరాక్రమశాలియగుదూషణునిం,జంపెను.అని, తాత్పర్యము.

ఐశ్వర్యం వానరాణాంచ దుర్లభం వాలిపాలితమ్
అస్యా నిమిత్తే సుగ్రీవః ప్రాప్తవాన్ లోకసత్కృతమ్. ౧౧

టీక॥అస్యాః=(సప్తమ్యర్థమందుషష్ఠి) ఈబిడ;నిమిత్తే = కారణమగుచుండఁగా;సుగ్రీవశ్చ= సుగ్రీవుఁడును; దుర్లభం=పొంద నశక్యమయినదియును; వాలిపాలితం=వాలిచేఁ బాలింపఁబడినదియును; లోకసత్కృతం=లోకముచేఁబూజింపఁబడినదియునగు;వానరాణాం= వానరులయొక్క ; ఐశ్వర్యం=సంపదను;ప్రాప్తవాన్ = పొందెను.

ఈబిడవలననే,సుగ్రీవుండును , దుర్లభంబునులోకంబునగౌరవంబునొందినదియునగువాలియధీనముగ నుండు, వానరులయైశ్వర్యంబునొందెను. అని, తాత్పర్యము.

సాగరశ్చ మయా క్రాంత శ్శ్రీమా న్నదనదీపతిః
అస్యా హేతో ర్విశాలాక్ష్యాః పురీ చేయం నిరీక్షితా. ౧౨

టీక॥ అస్యాః=ఈసీతయను; హేతోః=(తృతీయార్థమందుషష్ఠి) కారణముచేత;మయా=నాచేత;శ్రీమాన్= అన్నిటికన్ననధికంబును; నదనదీపతిః=

పడమర గాఁ బాఱునట్టియే ఱులకును దూర్పుగాఁ బాఱునట్టి యేఱులకును బ్రభువైనదియునగు; సాగరశ్చ = సముద్రంబు; క్రాంతః = దాఁటఁబడినది. ఇయం=ఈ; పురీచ= లంకాపట్టణమును; నిరీక్షితా=చూడఁబడినది.

ఈసీతకుఁగానే, నేను, శ్రీమంతంబునునదంబులకును నదులకును బ్రభువగుసముద్రంబును దాఁటి, వచ్చి, యీలంకాపట్టణంబును, జూచినాను.

అని, తాత్పర్యము.

యది రామ స్సముద్రాంతాం మేదినీం పరివర్తయేత్
అస్యాః కృతే జగచ్చాపి యుక్తమిత్యేవ మే మతిః. ౧౩

టీక॥ అస్యాఃకృతే=ఈసీతకుఁ గాను; రామః=రాముండు ; సముద్రాంతాం=సముద్రములు కొనలందుఁగల ; మేదినీం=భూమిని; జగచ్చాపి=ప్రపంచంబును; పరివర్తయేద్యది = తలక్రిందుగాఁజేయునేని ; యుక్తం = సరియయినది. ఇతి=అని; మే=నాయొక్క; మతిః=తలంపు.

ఇట్టిసీతకుఁగా , రాముండు సముద్రపర్యంతంబగు భూమినంతయును సమస్తలోకంబులనుగూడఁదలక్రిందుగాఁ జేసినను, అదియుయుక్తమే,యని, నాకుఁదోచుచున్నది.

అని, తాత్పర్యము.

రాజ్యం వా త్రిషు లోకేషు సీతా వా జనకాత్మజా
త్రైలోక్య రాజ్యం సకలం సీతాయా నాప్నుయాత్కలామ్. ౧౪

టీక॥త్రిషు=మూఁడైన; లోకేషు=లోకములయందు; రాజ్యం= దొరతనము; ఉత్కృష్టం ( అధ్యాహృతము ) వా=మేలా? జనకాత్మజా=జనకునికొమార్తెయగు;సీతా = సీత; ఉత్కృష్టా (అధ్యాహృతము) వా=మేలా? త్రైలోక్యరాజ్యం= ముల్లోకంబులదొరతనము; సకలం=అంతయును; సీతాయాః=సీతయొక్క;కలాం=పదియాఱవపాలును; నాప్నుయాత్=పొందదు.

త్రైలోక్యరాజ్యంబెచ్చా? జనకునికొమార్తెయగుసీతయెచ్చా? యని, యోచింతు మేని, త్రైలోక్య రాజ్యంబంతయు సీత యొక్క పదియాఱవ

పాలునకుసరికాదు. అని, తాత్పర్యము.

ఇయం సా ధర్మశీలస్య మైథిలస్య మహాత్మనః
సుతా జనకరాజస్య సీతా భర్తృదృఢవ్రతా
ఉత్థితా మేదినీం భిత్త్వా క్షేత్రే హలముఖక్షతే
పద్మరేణునిభైః కీర్ణా శుభైః కేదారపాంసుభిః. ౧౬

టీక॥ ఇయం=ఈబిడ; ధర్మశీలస్య=ధర్మస్వభావుండును; మైథిలస్య=మిథిలకుఁ బ్రభువును; మహాత్మనః=పూజ్యస్వభావముగలవాఁడునగు; జనకరాజస్య=జనకమహారాజుయొక్క; సుతా=కొమార్తెయును; భర్తృదృఢవ్రతా=పెనిమిటియందుదృఢమయిన వ్రతము గలదియును; పద్మరేణునిభైః = తామరసపరాగములతో సమానములయిన; శుభైః=మంగళకరంబులయిన ; కేదారపాంసుభిః=యాగక్షేత్రమందలి పరాగములచేత; కీర్ణా=వ్యాపింపఁ బడినదియై; హలముఖక్షతే= నాఁగటికొఱ్ఱుచేదున్నఁబడిన; క్షేత్రే = భూమియందు; మేదినీం=భూమిని; భిత్త్వా=భేదించుకొని; ఉత్థితా = పుట్టినదియునగు; సా=ఆ; సీతా=సీత.

ధర్మస్వభావుండును మిథిలాధిపతియు మహాత్ముండునగు జనకమహారాజుకొమార్తెయు దృఢమయిన పాతివ్రత్యముగలదియుఁ దామర పూపరాగంబులం బోలునట్టి మంగళకరంబుల గుయాగక్షేత్రపరాగంబులం గప్పఁబడి, నాఁగటికొఱ్ఱునదున్నఁబడినక్షేత్రంబునభూమిని భేదించుకొని యుద్భవించినదియునగునాసీత,యీబిడే.

అని, తాత్పర్యము.

విక్రాంతస్యార్యశీలస్య సంయుగేష్వనివర్తినః
స్నుషా దశరథస్యైషా జ్యేష్ఠా రాజ్ఞో యశస్వినీ. ౧౭

టీక॥ ఏషా = ఈబిడ ; విక్రాంతస్య=పరాక్రమంబుగలవాఁడును ; ఆర్యశీలస్య=పూజ్యంబగు స్వభావముగలవాఁడును; సంయుగేషు= యుద్ధములందు; అనివర్తినః = వెనుకకుఁదిరుగనట్టివాఁడును; రాజ్ఞః=రాజునగు,

దశరథస్య=దశరథునియొక్క ; జ్యేష్ఠా=పెద్దదియును; యశస్వినీ= ప్రశస్తముగుకీర్తి గలదియునగు ; స్నుషా=కోడలు.

ఈబిడే, పరాక్రమశాలియుఁబూజ్యంబగుస్వభావముగలవాఁడును యుద్ధంబులవెనుకదీయని వాఁడునగుదశరథమహారాజు, పెద్దకోడలు.

అని, తాత్పర్యము.

ధర్మజ్ఞస్య కృతజ్ఞస్య రామస్య విదితాత్మనః
ఇయం సా దయితా భార్యా రాక్షసీవశ మాగతా. ౧౮

టీక॥ ధర్మజ్ఞస్య=ధర్మముల నెఱింగినవాఁడును ;కృతజ్ఞస్య= తనకితరులచేఁజేయఁబడిన యుపకారముకొంచెమైనను దాని నెప్పుగాఁదెలుసుకొనువాఁడును; విదితాత్మనః= తెలిసికొనఁబడిన పరమాత్మగలవాఁడునగు;రామస్య = రామునియొక్క;దయితా = ప్రియయగు; భార్యా= భార్యయగు; సా=అట్టి; ఇయం=ఈసీత; రాక్షసీవశం=రాక్షసస్త్రీలయధీనతను ; ఆగతా=పొందినది.

సమస్తధర్మంబుల నెఱింగిన వాఁడును గృతజ్ఞుండును బరమాత్మజ్ఞానము గలవాఁడు నగు రాముని ప్రియభార్యయయినట్టి యీసీత, రాక్షసస్త్రీలచే తంజిక్కియున్నది.

అని, తాత్పర్యము.

సర్వాన్భోగా న్పరిత్యజ్య భర్తృస్నేహబలాత్కృతా
అచింతయిత్వా దుఃఖాని ప్రవిష్టా నిర్జనం వనమ్. ౧౯
సంతుష్టా ఫలమూలేన భర్తృశుశ్రూషణే రతా
యా పరాం భజతే ప్రీతిం వనేపి భవనే యథా. ౨౦
సేయం కనకవర్ణాంగీ నిత్యం సుస్మితభాషిణీ
సహతే యాతనా మేతా మనర్థానా మభాగినీ. ౨౧

టీక ॥ యా=ఏసీత; భర్తృస్నేహబలాత్కృతా = పెనిమిటియందలి

స్నేహముచేనిర్బంధింపఁబడినదై; స ర్వాన్ = సమస్తములయిన; భోగాన్=భోగములను; పరిత్యజ్య= విడిచి; దుఃఖాని=దుఃఖంబులను; అచింతయిత్వా=తలంపక; నిర్జనం=జనులులేని; వనం=అడవిని; ప్రవిష్టా= ప్రవేశించినదై; ఫలమూలేన= పండ్లచేతను గడ్డలచేతను; సంతుష్టా=సంతోషము నొందినదై; భర్తృశుశ్రూషణే= పెనిమిటియొక్క సేవించుటయందు; రతా=ఆసక్తురాలై; వనేపి = అడవియందును; భవనేయథా= ఇంటియందుంబోలె; పరాం=అధికమయిన; ప్రీతిం=సంతోషమును; భజతే = పొందుచున్నదో; సా=అట్టి; కనకవర్ణాంగీ=బంగారురంగుగల దేహంబు గలదియును; నిత్యం=ఎల్లప్పుడును; సుస్మితభాషిణీ = సుందరమయినచిఱునవ్వు గలుగునట్లు మాటలాడునదియును; అనర్థానాం=ఆపదలకు; అభాగినీ=పొందఁదగనిదియునగు; ఇయం= ఈసీత; ఏతాం=ఈ; యాతనాం= మహాదుఃఖమును; సహతే=ఓర్చుచున్నది!

భర్తయందలిస్నేహబలంబునం జేసి, సమస్తభోగంబులువిడిచి, దుఃఖంబులం దలంపక నిర్జనంబగువనంబుం బ్రవేశించి, పూర్వము మిక్కిలియుమధురమయిన యాహారమును భుజించుచుండినదయ్యు నడవినుండు పండ్లకును గడ్డలకును దృప్తిఁజెందుచు, భర్తకెప్పుడునేమఱక శుశ్రూషసేయుచు, గృహంబుననుండునప్పుడు సంతోషంబునొందుచుండునట్లు, వనంబునందును, మిగుల సంతోషంబు నొందుచున్నదియు, బంగారువంటిమేనుగలదియు, నెల్లప్పుడు నుఁజిఱునవ్వుతోమాటలాడునదియునాపదలంబొందనర్హురాలు కానిదియునగునట్టి, యీసీత , యిప్పుడిట్టిమహాదుఃఖంబు సహించుచున్నదే! ఏమనవచ్చును. అని, తాత్పర్యము.

ఇమాంతు శీలసంపన్నాం ద్రష్టు మర్హతి రాఘవః
రావణేన ప్రమథితాం ప్రపా మివ పిపాసితః. ౨౨

టీక॥ రామః=రాముండు; శీలసంపన్నాం=సదాచారముతోఁ గూడినదియును; రావణేన=రావణునిచేత, ప్రమథితాం= బాధింపఁబడినదియునగు; ఇమాంతు = ఈసీతను మాత్రము; పిపాసితః=దప్పినొందినవాఁడు; ప్రపా

మివ = చలిపందిరినింబోలె; ద్రష్టుం= చూచుటకు; అర్హతి=తగును.

దప్పిగొనిన వాఁడు చలిపందిరినిం జూచునట్లు, రాముండు, సదాచారముతోఁగూడిన దైరావణునిచేఁగాఁటియ పెట్టఁబడుచున్న యీసీతం, బాడవలయును. అని; తాత్పర్యము.

అస్యా నూనం పున ర్లాభా ద్రాఘవః ప్రీతి మేష్యతి
రాజా రాజ్యపరిభ్రష్టః పునః ప్రాప్యేవ మేదినీమ్. ౨౩

టీక॥ రాఘవః=రాముఁడు; నూనం=నిశ్చయముగా; పునః=మఱల; అస్యాః=ఈసీతయొక్క; లాభాత్=పొందుటవలన; రాజ్యపరిభ్రష్టః=రాజ్యమువలనజాఱిన, రాజ్యమును బోఁగొట్టుకొన్నయనుట; రాజా=రాజు; పునః=మఱల; మేదినీం=భూమిని; ప్రాప్యేవ=పొందినవలె; ప్రీతిం=సంతోషమును; ఏష్యతి=పొందఁగలఁడు.

రాజ్యంబుఁబోఁగొట్టుకొన్న రాజు మఱలరాజ్యముం బొంది సంతోషమునొందునట్లు, రాముండు, మఱలసీతం బొంది, సంతోషంబునొందఁగలఁడు. అని, తాత్పర్యము.

కామభోగైః పరిత్యక్తా హీనా బంధుజనేనచ
ధారయత్యాత్మనో దేహం తత్సమాగమ కాంక్షిణీ. ౨౪

టీక॥ కామభోగైః=కోరఁబడునట్టి పుష్పములు మొదలగు భోగపదార్థములచేత; పరిత్యక్తా=విడువఁబడినదియును; బంధుజనేన=బంధుజనముచేత; హీనాచ= విడువఁబడినదియునగు; ఏషా(అధ్యాహృతము)=ఈసీత; తత్సమాగమకాంక్షిణీ= ఆరామునియొక్కపొందుటనుకోరుచున్నదై; ఆత్మనః=తనయొక్క; దేహం=దేహమును; ధారయతి=ధరించుచున్నది.

ఈసీత, దనకుఁబుష్పములుఁ గంధములుమున్నగు భోగపదార్థములు లేకపోయినను, బంధువులు లేకున్నను, రామసమాగమంబుఁగోరునది కావున, "జీవించియుండినచో, నెప్పుడయినను, రాముంగూడవచ్చును" అని, తలంచి, దేహంబునఁబ్రాణంబులుధరించియున్నది.

అని, తాత్పర్యము.

నైషా పశ్యతి రాక్షస్యో నేమాన్ పుష్పఫలద్రుమాన్
ఏకస్థహృదయా నూనం రామమేవానుపశ్యతి. ౨౫

టీక॥ ఏషా=ఈసీత; రాక్షస్యః (రాక్షసీః)= రాక్షసస్త్రీలను; నపశ్యతి= చూడదు. ఇమాన్=ఈ; పుష్పఫలద్రుమాన్= పూలతోను బండ్లతోను గూడిన వృక్షములను; న(పశ్యతి)=చూడదు. ఏకస్థహృదయా = ఒకటనుండు మనసుగలదై, ఏకాగ్రంబగు మనసుగలదై యనుట; రామమేవ=రామునే; అనుపశ్యతి = చూచుచున్నది. నూనం=నిశ్చయము.

ఈసీత, యిప్పుడీ రాక్షసస్త్రీలం జూడదు; రాముని విరహకాలంబున, ఫలపుష్పంబులతో గూడిన యీవృక్షంబులను రాక్షసస్త్రీలం బోలెంజూడ నిక్కృతములుగా నుండుటవలన, వానినిం జూడదు. ఏకాగ్రచిత్తయయి, మనంబున, ఇతరము సర్వమువిడచి, రామునిమాత్రమే ధ్యానించుచున్నది. ఇది నిశ్చయము.

అని, తాత్పర్యము.

భర్తా నామ పరం నార్యా భూషణం భూషణాదపి
ఏషా హి రహితా తేన భూషణార్హా న శోభతే. ౨౬

టీక॥ భర్తానామ=పెనిమిటియనఁగా; నార్యాః=స్త్రీకి; భూషణాదపి=సొమ్ముకన్నను; పరం=అధికమయిన; భూషణం= సొమ్ము; భూషణార్హా= సొమ్ములకుఁదగిన; ఏషాతు= ఈసీతయు; తేన=ఆపెనిమిటిచేత; రహితా=విడువఁబడినదై; నశోభతే=ప్రకాశింపలేదు.

పెనిమిటియనఁగా, స్త్రీకి, భూషణముకన్నను, అధికమయిన యలంకారము; భూషణంబులధరింపఁదగినదగు నీసీత, అట్టిపెనిమిటి లేకుండుటచే, నెంతమాత్రము ప్రకాశింపకున్నది.

అని, తాత్పర్యము.

దుష్కరం కురుతే రామో హీనోయదనయా ప్రభుః
ధారయత్యాత్మనో దేహం న దుఃఖే నావసీదతి. ౨౭

టీక॥ ప్రభుః= లోకనాయకుండగు రాముండు; అనయా=ఈసీతచేత; హీ

నః = విడువఁబడినవాఁడై; ఆత్మనః = తనయొక్క; దేహం = దేహమును; ధారయతి = ధరించుచున్నాఁడు. దుఃఖేన = దుఃఖముచేత ; నావసీదతి (ఇతి) యత్ = నశింపఁడనునదియేదిగలదో, తత్ (అత్యాశ్చర్యము) = అ; దుష్కరం = చేయనశక్యమయిన కార్యమును ; రామః = రాముఁడు; కృతవాన్ = చేసినాఁడు.

లోకనాయకుండగు రాముండు, ఇట్టిసీతను విడిచియును, దుఃఖంబున మృతినొందక, దేహంబు ధరించుచున్నాఁడే; ఇది మఱియెవ్వరికిని జేయనలవిగాదు. అని, తాత్పర్యము.

ఇమా మసితకేశాంతాం శతపత్రనిభేక్షణామ్
సుఖార్హాం దుఃఖితాం దృష్ట్వా మమాపి వ్యథితం మనః. ౨౮

టీక॥ అసితకేశాంతాం = నల్లనివెండ్రుకలకొనలుగలదియును; శతపత్రనిభేక్షణాం = నూఱుఱేకులుగల తామరపూలతో సమానములయిన కండ్లుగలదియును; సుఖార్హాం = సుఖమునకుఁదగినదియును; దుఃఖితాం = దుఃఖమునొందినదియునగు; ఇమాం = ఈసీతను; దృష్ట్వా = చూచి; మమాపి = నాయొక్కయునుగూడ; మనః = మనసు; వ్యథితం = దుఃఖమునొందినది.

నల్లనివెండ్రుకలకొనలుగల్గినదియు తామరపూలవంటికండ్లతో నొప్పుచున్నదియు, సుఖంబుమాత్రమనుభవింపఁదగినదియునగు నీసీత, దుఃఖంబునొందుటం జూడఁగా, నీవిడదుఃఖముతోఁగాని సుఖముతోఁగానియెంతమాత్రము సంబంధములేనిమధ్యస్థుండనగు నామనసునకును, దుఃఖముగలుగుచున్నది; ఇంక, నీసీతకుం బ్రియుండగు రామునకు దుఃఖంబుగలుగునని చెప్పనేల? అని, తాత్పర్యము.

క్షితిక్షమా పుష్కరసన్నిభాక్షీ
యా రక్షితా రాఘవలక్ష్మణాభ్యామ్
సా రాక్షసీభి ర్వికృతేక్షణాభి
స్సంరక్ష్యతే సంప్రతి వృక్షమూలే. ౨౯

టీక॥ యా=ఏసీత; రాఘవలక్ష్మణాభ్యాం=రామునిచేతను లక్ష్మణునిచేతను; రక్షితా=కాపాడఁబడినదో; క్షితిక్షమా=భూమికింబోలె నోర్పుఁగలదియును; పుష్కరసన్నిభాక్షీ=తామరపూలతోసమానములయిన నేత్రములుఁగలదియునగు; సా=ఆసీత; సంప్రతి=ఇప్పుడు; వికృతేక్షణాభిః=వికారముతోఁగూడిన నేత్రములుగల; రాక్షసీభిః=రాక్షసస్త్రీలచేత; వృక్షమూలే=చెట్టుయొక్కయడుగునందు; సంరక్ష్యతే=కాపాడఁబడుచున్నది.

పూర్వమెవ్వతెను రాముండును లక్ష్మణుఁడును రక్షించుచుండిరో, భూమియుంబోలె నోర్పుఁగలదియుఁ దామరపూలవంటికండ్లుగలదియునగు, నట్టిసీత, కిప్పుడు, చెట్టుక్రిందఁ, వికృతంబులగు కండ్లతోఁ బూడ నసహ్యముగానున్న రాక్షసస్త్రీలు, కావలియున్నారు. అని, తాత్పర్యము.

హిమహతనళినీవ నష్టశోభా
వ్యసనపరంపరయా నిపీడ్యమానా
సహచరరహితేవ చక్రవాకీ
జనకసుతా కృపణాం దశాం ప్రపన్నా. ౩౦

టీ॥ జనకసుతా=జనకునికుమార్తెయగుసీత; హిమహతనళినీవ=మంచుచేఁగొట్టఁబడినతామర తీఁగెయుంబోలె; నష్టశోభా=నశించినకాంతిగలదై; వ్యసనపరంపరయా=దుఃఖములయొక్క పరంపరచేత; నిపీడ్యమానా=బాధింపఁబడినదై; సహచరరహితా=ప్రియునిచేవిడువఁబడిన; చక్రవాకీవ=ఆఁడు చక్రవాకపక్షియుంబోలె; కృపణాం=చూచువారికినిగూడదుఃఖముగల్గించునట్టి; దశాం=అవస్థను; ప్రపన్నా=పొందినది.

జనకునింటమిక్కిలియు గారాబముగాఁ బెంపఁబడినసీత, యిప్పుడు, మంచుదగిలిన తామరతీఁగెయుంబోలెఁ గాంతిలేనిదై, ఎడతెగక గల్గుచుండు దుఃఖములచే బాధింపఁబడుచు, మగజక్కవం బాసినయాఁడుజక్కవభంగిఁ, బ్రియవిరహంబొక్క క్షణమయిన నోర్వలేనిదగావునఁ, జూచువారికినింగూడ దుఃఖముగల్గించునట్టి, నోటం జెప్పనశక్యంబై సుమనసునందలంపనశక్యంబునగు, దుర

వస్థం, బొందియున్నది. అని, తాత్పర్యము.

అస్యాహి పుష్పావనతాగ్రశాఖా
శ్శోకం దృఢంవై జనయంత్యశోకాః
హిమవ్యపాయేనచ మందరశ్మి
రభ్యుత్థితో నైక సహస్రరశ్మిః. ౨౧

టీక॥ అస్యాః=ఈసీతకు; పుష్పావనతాగ్రశాఖాః=పూలచేవంగినకొనకొమ్మలుగల; అశోకాః=అశోకవృక్షములు; దృఢం=అధికమయిన; శోకం=దుఃఖమును; జనయంతిహి = కల్గించుచున్నవిగదా! ("వై" అనునది పాదపూరణార్థము). హిమవ్యపాయేన = హిమవంతఋతువుయొక్క అభావముతోఁగూడ, వసంత ఋతువుతోఁగూడననుట; అభ్యుత్థితః=ఉదయించిన; మందరశ్మిః=తీక్ష్ణములు గాని కిరణములు గలవాఁడును; నైకసహస్రరశ్మిశ్చ= ఒకవేయికిరణములుగలవాఁడుకానివాఁడు నగుచంద్రుఁడును ; శోకం, జనయతి (అధ్యాహృతము)=దుఃఖమును, గలిగించుచున్నాఁడు.

పూలభారంబువలన వంగినకొనకొమ్మలుగల యశోక వృక్షంబులవలనను వసంతఋతువుతోఁగూడి యుదయించియుండు సల్లనైన కిరణంబులుగల చంద్రునివలనను , ఈసీతకు అధికముగా దుఃఖముగలుగుచున్నది. అని, హనుమంతుఁడుదనలోఁదాను జెప్పుకొనెను. అని, తాత్పర్యము.

ఇత్యేవ మర్థం కపి రన్వవేక్ష్య
సీతేయ మిత్యేవ నివిష్టబుద్ధిః
సంశ్రిత్య తస్మిన్నిషసాదవృక్షే
బలీ హరీణా మృషభ స్తరస్వీ. ౨౨

టీక॥ బలీ=బలవంతుండును; హరీణాం=కోఁతులలోపల; ఋషభః=శ్రేష్ఠుఁడును; తరస్వీ= వేగవంతుండునగు; కపిః=హనుమంతుండు; ఇతి = అని;

ఏవం=ఇట్టి;అర్థం= అభిప్రాయంబును అన్వవేక్ష్య= తలంచి; "ఇయం=ఈవిడ; సీతైవ=సీతయే;" ఇతి=అని; నివిష్టబుద్ధిః= నిశ్చయమునొందిన బుద్ధిగలవాఁడై; తస్మిన్=ఆ;వృక్షే=చెట్టునందు; సంశ్రిత్య=పొంది; నిషసాద=కూర్చుండెను.

బలవంతుండును వానరశ్రేష్ఠుండును వేగవంతుఁడునగు హనుమంతుండు, డిల్లిదనలోఁదాను జెప్పకొని, "ఈవిడ సీతయే వేఱుకాదు" అని,నిశ్చయించి,ఆశింశుపావృక్షమునందుఁ, గూర్చుండియుండెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే,ఆదికావ్యే,
సుందరకాండే, షోడశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇవి, పరమార్థచంద్రికాఖ్యానం బగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండ షోడశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

సప్తదశసర్గప్రారంభః.

తతః కుముదషండాభో నిర్మలో నిర్మలం స్వయమ్
ప్రజగామ నభ శ్చంద్రో హంసో నీల మివోదకమ్. ౧

టీక॥తతః=అటుపిమ్మట;కుముదషండాభః = తెల్లకలువల సమూహము యొక్క కాంతి వంటి కాంతి గలవాఁడును;నిర్మలః=స్వచ్ఛుండునగు; చంద్రః=చంద్రుండు; స్వయం=తానే; నిర్మలం=స్వచ్ఛమయిన;నభః=ఆకాశమును;హంసః=హంసపక్షి; నీలం=నల్లని;ఉదకమివ=నీటినింబోలె; ప్రజగామ=చక్కఁగాఁబొందెను, ఆకాశము నడుమనుండెననుట.

అటుపిమ్మట, తెల్లకలువల సమూహముంబోలె నొప్పుచు నిర్మలుండై

యున్న చంద్రుండు, హంసపక్షి నల్లని యుదకంబులోనికిఁ బోవునట్లు, ఆకాశమధ్యభాగంబునొందెను.

అని, తాత్పర్యము.

సాచివ్య మివ కుర్వన్ స ప్రభయా నిర్మల ప్రభః
చంద్రమా రశ్మిభి శ్శీతై స్సిషేవే పవనాత్మజమ్. ౨

టీక॥ నిర్మలప్రభః=స్వచ్ఛమయిన కాంతిగల; సః=ఆ; చంద్రమాః=చంద్రుండు; ప్రభయా=కాంతిచే; సాచివ్యం=సాహాయ్యంబును; కుర్వన్నివ=చేయువాఁడువలె; శీతైః=చల్లని; రశ్మిభిః=కిరణములచేత; పవనాత్మజం=వాయుదేవునికొడుకయిన హనుమంతుని; సిషేవే=సేవించెను.

స్వచ్ఛంబగు కాంతిగల యాచంద్రుండు, హనుమంతునకుఁ దన వెలుంగు చూపి కొంత సాహాయ్యంబు సేయువాఁడుం బోలెఁ, దన చల్లనికిరణంబుల, హనుమంతుని పైఁ, బఱపెను.

అని, తాత్పర్యము.

స దదర్శ తత స్సీతాం పూర్ణచంద్ర నిభాననామ్
శోకభారై రివ న్యస్తాం భారై ర్నావ మివాంభసి. ౩

టీక॥ తతః=అటుపిమ్మట; సః=ఆ హనుమంతుఁడు; పూర్ణచంద్రనిభాననాం=నిండుచంద్రునితో సమానమయిన ముఖముగలదియును; శోకభారైః=దుఃఖములయొక్క యతిశయముచేత; న్యస్తామివ (స్థితాం)=క్రిందికిఁ గొనిపోఁబడినట్లున్నదియును, కావుననే; భారైః=బరువులచేత; అంభసి=నీటియందు; న్యస్తాం (అధ్యాహృతము)=క్రిందికిఁ గొనిపోఁబడిన, ముంపఁబడిన యనుట; నావమివ (స్థితాం)=ఓడయుంబోలెనున్నదియునగు; సీతాం=సీతను; దదర్శ=చూచెను.

అంత, నాహనుమంతుండు, బరువులచే నావ నీటమునుంగునట్లు, దుఃఖభారంబున, మునింగియున్నదియు, నిండుచంద్రునింబోలు ముఖంబుగల, సీతం, జూచెను, అని, తాత్పర్యము.

దిదృక్షమాణో వైదేహీం హనుమా న్మారుతాత్మజః

స దదర్శావిదూరస్థా రాక్షసీర్ఘోరదర్శనాః. ౪
ఏకాక్షీ మేకకర్ణాంచ కర్ణప్రావరణాం తథా
అకర్ణాం శంకుకర్ణాంచ మస్తకోచ్ఛ్వాసనాసికామ్. ౫
అతికాయోత్తమాంగీంచ తనుదీర్ఘశిరోధరామ్
ధ్వస్తకేశీం తథా కేశీం కేశకంబళధారిణీమ్. ౬
లంబకర్ణ లలాటాంచ లంబోదరపయోధరామ్
లంబోష్ఠీం చుబుకోష్ఠీంచ లంబాస్యాం లంబజానుకామ్. ౭
హ్రస్వాం దీర్ఘాం తథా కుబ్జాం వికటాం వామనాం తథా
కరాళాం భుగ్నవక్త్రాంచ పింగాక్షీం వికృతాననామ్. ౮

టీక॥ మారుతాత్మజః = వాయుదేవునికుమారుండగు; సః = ఆ; హనుమాన్ = హనుమంతుఁడు; వైదేహీం = సీతను; విదృక్షమాణః = చూడఁగోరువాఁడై; అవిదూరస్థాః = సమీపమునందున్న; ఘోరదర్శనాః = భయంకరంబగుచూచుటగల; రాక్షసీః = రాక్షసస్త్రీలను; ఏకాక్షీం = ఒకకన్నుగలదానిని; ఏకకర్ణాంచ = ఒకచెవిగలదాని; తథా = అట్లు; కర్ణప్రావరణాం = చెవులె తలకప్పుగాఁగలదాని; అకర్ణాం = చెవిలేనిదాని; శంకుకర్ణాంచ = ఏదుపందికిం బోలె చెవులుగలదాని; మస్తకోచ్ఛ్వాసనాసికాం = తలతట్టు నిట్టూర్పులుగలముక్కుగలదానిని; అతికాయోత్తమాంగీంచ = మిక్కిలియుం బెద్దతలగలదానిని; తనుదీర్ఘశిరోధరాం = కృశించినదియును నిడుపైనదియునగు కంఠముగలదానిని; ధ్వస్తకేశీం = నశించినవెండ్రుకలుగలదానిని, కొంచెముగా వెండ్రుకలుగలదాని ననుట; తథా = అట్లు; అకేశీం = వెండ్రుకలు లేనిదానిని; కేశకంబళధారిణీం = కంబళివంటివెండ్రుకలం దాల్చియుండుదానిని; లంబకర్ణలలాటాంచ = వ్రేలాడుచున్న చెవులును నొసలును గలదానిని; లంబోదరపయోధరాం = వ్రేలాడుచుండు కడుపును స్తనములును గలదానిని; లంబోష్ఠీం = వ్రేలాడుచుండు పెదవిగలదానిని; చుబుకోష్ఠీంచ = గడ్డమందుఁ బెదవిగలదానిని; లంబాస్యాం = వ్రేలాడుచున్నముఖముగలదానిని; లంబజానుకాం = వ్రేలాఁడుచున్న మోఁకాళ్లుగలదానిని; హ్రస్వాం = పొట్టిదానిని; దీ

ర్ఘాం= పొడుగుదానిని ; హ్రస్వదీర్ఘాం (అనిగోవిందరాజమతమందుఁ బాఠాంతరము)=కొన్నిస్థలంబులందుఁ బొట్టియు గొన్నిచోట్లనిడుపునగు దానిని;తథా=అట్లు;కుబ్జాం=గూని దానిని;వికటాం= మిక్కిలియు వంకరయయిన దానిని; తథా=అట్లు;వామనాం=పొట్టియగు దానిని;కరాళాం= మిట్టపండ్లు గలదానిని; భుగ్నవక్త్రాంచ= వంకరయయిన నోరు గలదానిని ; పింగాక్షీం=గోరోచనపురంగుగల కండ్లుగల దానిని;వికృతాననాం= వికారముతోఁ గూడినముఖముగలదానిని; దదర్శ= చూచెను.

వాయుదేవునికుమారుండగు హనుమంతుండు,సీతంజూడఁగోరి,విమర్శించిచూచుచు , సీతకుసమీపంబుననున్న వారల, చూపరులకు వెఱపుఁ బుట్టించువారలరాక్షసస్త్రీలను, ఒక్కకన్ను గలదానిని,ఒక్కచెవిగలదానిని, విశాలంబులగుచెవులను దలపైఁ గప్పుకొని యున్నదానిని, చెవులులేనిదానిని, నీరు పంది చెవులవంటి చెవులు గలదానిని, తలతట్టుగానిట్టూర్పులు విడుచుముక్కుగలదానిని, పెద్దతలలుగలదానిని, కృశించినిడుపుగానుండు కంఠముగలదానిని, కొంచెముగా వెండ్రుకలుగలదానిని;వెండ్రుకలేలేనిదానిని. కంబళివంటివెండ్రుకలుగలదానిని,వ్రేలుకాడుచుండుచెవులును నొసలును గలదానిని,వ్రేలుకాడుచుండుకడుపును స్తనములును గలదానిని,వ్రేలాడుపెదవిగలదానిని,గడ్డమునందుఁబెదవిగలదానిని, వ్రేలాడుముఖముగలదానిని , వ్రేలాడు మోఁకాళ్లుగలదానిని,పొట్టిదానిని, పొడుగుదాని(పక్షాంతరమందు, కొంతమట్టుకు హ్రస్వంబును కొంతమట్టుకుదీర్ఘంబునగు దేహంబుగలదానిని) గూనిదానిని,వంకదేహముగలదానిని, పొట్టిదానిని,మిట్టపల్లుదానిని,వంకరనోరుగలదానిని, గోరోచనపురంగు గలకండ్లతోఁ గూడినదానిని, వికృతమయిన ముఖముగలదానినింజూచెను.

అని, తాత్పర్యము.

వికృతాః పింగళాః కాళీః క్రోధనాః కలహప్రియాః
కాలాయసమహాశూలకూటముద్గరధారిణీః. ౯
వరాహమృగశార్దూలమహిషాజశివాముఖీః
గజోష్ట్రహయపాదీశ్చ నిఖాతశిరసోపరాః. ౧౦

స౧౭

ఏకహస్తైకపాదాశ్చ ఖరకర్ణ్యశ్వకర్ణికాః
గోకర్ణీ హస్తికర్ణీశ్చ హరికర్ణీ స్తథాపరాః. ౧౧
అనాసా అతినాసాశ్చ తిర్యఙ్నాసా వినాసికాః
గజసన్నిభ నాసాశ్చ లలటోచ్ఛ్వాస నాసికాః. ౧౨
హస్తిపాదా మహాపాదా గోపాదాః పాదచూళికాః
అతిమాత్ర శిరోగ్రీవా అతిమాత్ర కుచోదరీః. ౧౩
అతిమాత్రాస్యనేత్రాశ్చ దీర్ఘజిహ్వా నఖా స్తథా
అజాముఖీ హస్తిముఖీ గోముఖీ స్సూకరీ ముఖీః. ౧౪
హయోష్ట్ర ఖరవక్త్రాశ్చ రాక్షసీ ఘోరదర్శనాః
శూలముద్గర హస్తాశ్చ క్రోధనాః కలహప్రియాః. ౧౫
కరాళా ధూమ్రకేశీశ్చ రాక్షసీ వికృతాననాః
పిబంతీ స్సతతం పానం సదా మాంససురాప్రియాః. ౧౬
మాంసశోణిత దిగ్ధాంగీ ర్మాంస శోణిత భోజనాః
తా దదర్శ కపిశ్రేష్ఠో రోమ హర్షణ దర్శనాః. ౧౭
స్కంధ వంత ముపాసీనాః పరివార్య వనస్పతిమ్

టీక॥ కపిశ్రేష్ఠః=వానరశ్రేష్ఠుండగుహనుమంతుండు; వికృతాః=వికారముగలవారలను; పింగళాః=గోరోచనపువన్నెగలవారలను; కాళీః=నల్లనివారలను; క్రోధనాః=కోపించువారలను; కలహప్రియాః=పోట్లాటయేయిష్టముగాఁగలవారలను; కాలాయసమహాశూలకూటముద్గరధారిణీః = ఇనుముతోఁజేసిన పెద్దశూలమును కూటమనునాయుధమును ఇనుపగుదియను దాల్చువారలను; వరాహమృగశార్దూలమహిషాజశివాముఖీః=పందిముఖమువంటిముఖంబును లేడిముఖమువంటిముఖంబును పులిముఖమువంటి ముఖంబును యెనుఁబోతు ముఖమువంటిముఖమును గొఱ్ఱెముఖమువంటిముఖంబును నక్కముఖంబువంటిముఖంబునుగలవారలను; గజోష్ట్రహయపాదాశ్చ = యేనుఁగుయొక్క పాదములవంటిపాదములుగలవారలను, ఒంటెయొక్క పాదములవంటిపాదములుగలవారలను గుఱ్ఱముయొక్క పాదములవంటి పాదములుగలవా




రలను; అపరాః=ఇతరులయిన; శిఖాతశిరసః= దేహములోపలనుండు తలలు గలవారలను; ఏకహస్తైకపాదాశ్చ=ఒకచేయియును ఒకపాదమునుగలవారిలను; ఖరకర్ణ్యశ్వకర్ణికాః=గాడిదయొక్క చెవులవంటిచెవులుగలవారలనుగుఱ్ఱముయొక్క చెవులవంటిచెవులు గలవారలను; గోకర్ణీః = ఆవుయొక్క చెవులవంటి చెవులుగలవారలను; హస్తికర్ణ్యశ్చ= యేనుఁగుయొక్క చెవులవంటి చెవులుగల వారలను ; తథా=అట్లు;అపరాః=ఇతరలైన; హరికర్ణీకాః=కోఁతియొక్క చెవులవంటిచెవులుగలవారలను; అనాసాః=ముక్కులేనివారలను; అతినాసాశ్చ=పెద్దముక్కు గలవారలను; తిర్యఙ్నాసాః=అడ్డముగానుండు ముక్కుగలవారలను ; వినాసికాః= వికృతమయిన ముక్కుగలవారలను; గజసన్నిభనాసాశ్చ=యేనుఁగుతో సమానమైన ముక్కుగలవారలను; లలాటోచ్ఛ్వాసనాసికాః=నొసటనిట్టూర్పులుగల ముక్కుగలవారలను;హస్తిపాదాః = ఏనుఁగుయొక్క పాదములవంటిపాదములు గలవారలను;మహాపాదాః= పెద్దపాదములుగలవారలను; గోపాదాః= ఆవులయొక్క పాదములవంటి పాదములుగలవారలను; పాదచూలికాః = పాదములందుఁజుట్టుగలవారలను; అతిమాత్రశిరోగ్రీవాః= మిక్కిలియుఁ బెద్దవయినతలయును మెడయును గలవారలను; అతిమాత్రకుచోదరీః = మిక్కిలియుఁబెద్దవయిన స్తనములను గడుపును గలవారలను; అతిమాత్రాస్యనేత్రాశ్చ=మిక్కిలియుఁబెద్దవయిన నోరునుకండ్లను గలవారలను; తథా=అట్లు; దీర్ఘజిహ్వానఖాః=నిడుపైననాలుకయును గోళ్లును గలవారలను; అజాముఖీః= మేకయొక్క ముఖమువంటిముఖముగలవారలను;హస్తిముఖీః=ఏనుఁగుయొక్క ముఖమువంటిముఖముగలవారలను;గోముఖీః = ఆవుయొక్క ముఖమువంటిముఖముగలవారలను; సూకరీముఖీః=ఆడుపందియొక్క ముఖమువంటిముఖముగలవారలను;హయోష్ట్రఖరవక్త్రాశ్చ=గుఱ్ఱముయొక్క ముఖమువంటిముఖముగలవారలను ఒంటెయొక్క ముఖమువంటిముఖముగలవారలను గాడిదయొక్క ముఖమువంటిముఖము గలవారలను; ఘోరదర్శనాః=భయంకరమయిన చూచుటగల; రాక్షసీః=రాక్షసస్త్రీలను;శూలముద్గరహస్తాశ్చ= శూలమును ఇనుపగుదియయును చేతులంగల వారలను; క్రోధనాః = కోపించు వారలను; కలహప్రి




యాః=కలహమే యిష్టముగాఁ గలవారలను;కరాళాః=మిట్టపండ్లుగలవారలను;ధూమ్రకేశాశ్చ= నలుపుమించఁగలసినయెఱుపు వన్నెగల వెండ్రుకలుగల వారలను; వికృతాననాః= వికృతమైన నోరుగలవారలను; సతతం=ఎల్లప్పుడును;పానం = మద్యమును;పిబంతీః=త్రాఁగుచుండువారలను ; సదా=ఎల్లప్పుడును; మాంససురాప్రియాః=మాంసమును మద్యమును ఇష్టములుగాఁ గల వారలను; మాంసశోణితదిగ్ధాంగీః = మాంసముచేతను నెత్తురుచేతను బూయఁబడినదేహముగల వారలను;మాంసశోణితభోజనాః=మాంసమును నెత్తురును ఆహారముగాఁగల వారలను;రోమహర్షణదర్శనాః = వెండ్రుకలయొక్కగగుర్పాటు నొందఁజేయునట్టి చూచుటగలవారలను; స్కంధవంతం=పెద్దబోదెగల; వనస్పతిం= చెట్టును; పరివార్య=చుట్టుకొని ; ఉపాసీనాః=కూర్చుండియుండు; తాః=ఆ ; రాక్షసీః=రాక్షసస్త్రీలను; దదర్శ = చూచెను.

హనుమంతుండు, వికృతలను , గోరోచనపువన్నెగల వారలను , నల్లని వారలను,కోపించు స్వభావముగల వారలను,కలహప్రియులగువారలను, ఇనుపశూలమును గూటమును ఇనుపగుదియనుం,దాల్చియుండు వారలను,పందిముఖంబుగలవారలను, లేడిముఖంబుతోఁ గూడినవారలను,పులిముఖంబు గలవారలను, ఎనుఁబోతుముఖంబుగలవారలను, గుఱ్ఱమువంటిముఖము గలవారలను నక్క ముఖంబు గలవారలను , గజపాదంబులు గలవారలను, ఒంటె పాదంబులుగలవారలను,గుఱ్ఱముకాళ్లుగల వారలను, దేహములోపలఁ దలగలవారలను , ఒకచేయియునొకకాలునుగల వారలను గాడిద చెవులుగల వారలను,గుఱ్ఱమువంటిచెవులు గలవారలను, గోకర్ణంబులుగల వారలను,ఏనుఁగు వంటిచెవులుగలవారలను,కోఁతిచెవులు గలవారలను ముక్కులేనివారలను, పెద్దముక్కుగలవారలను, అడ్డముగానుండు ముక్కుగల వారలను , వికృతమైన నాసికగల వారలను ఏనుంగు వంటిముక్కుగలవారలను , నొసట నిట్టూర్పులు విడుచుచుండు ముక్కుగల వారలను, గజపాదంబులుగలవారలను పెద్దపాదములు గలవారలను ఆవువంటిపాదములు గలవారలను పాదములందుజుట్టుగలవారలను, పెద్దతలయు

ను పెద్దమెడయును గలవారలను పెద్దస్తనములును పెద్దకడుపును గలవారలను, పెద్దనోరును పెద్దకండ్లును గలవారలను నిడుపునాలుకయును నిడుపుగోళ్లును గలవారలను, మేకముఖంబుతోఁ గూడినవారలను ఏనుంగుముఖము గలవారలను, గోముఖంబుగలవారలను, పందిముఖముగలయుఱికొందఱను, అశ్వముఖంబుఁగలవారలను ఒంటెముఖంబుగలవారలను గాడిదముఖంబు గలవారలను, చూపరులకు వెఱపుఁబుట్టించు రాక్షసస్త్రీలను, మఱియును శూలమును ఇనుపగుదియను జేతులందాల్చియుండు వారలను కోపస్వభావంబు గలవారలను, కలహప్రియులను, మిట్టపండ్లవారలను నలుపెచ్చుగాఁగలసిన వెఱుపువర్ణంబుగల వెండ్రుకలతోఁ గూడినవారలను, వికృతమయిన నోరుగలవారలను, ఎల్లప్పుడును మద్యంబుఁద్రావుచుండువారలను ఎల్లప్పుడు మాంసమునందును మద్యంబునందును బ్రీతిగలవారలను, మాంసంబునను నెత్తుటనుం దోఁగుచుండు దేహంబుగలవారలను, మాంసంబును నెత్తురు నాహారంబుగాఁగల వారలను, జూపరులకు గగుర్పాటుగల్గించుచుఁ బెద్దబోదెగల చెట్టుంజుట్టుకొనికూర్చుండియున్న, యారాక్షసస్త్రీలం, బూచెను.

అని, తాత్పర్యము.

తస్యా ధస్తాచ్ఛ్రితాం దేవీం రాజపుత్రీ మనిందితామ్. ౧౮
లక్షయామాస లక్ష్మీవాన్ హనుమాన్ జనకాత్మజామ్
నిష్ప్రభాం శోక సంతప్తాం మలసంకుల మూర్ధజామ్. ౧౯
క్షీణ పుణ్యాం చ్యుతాం భూమౌ తారాం నిపతితామివ
చారిత్రవ్యపదేశాఢ్యాం భర్తృదర్శన దుర్గతామ్. ౨౦
భూషణై రుత్తమై ర్హీనాం భర్తృవత్సల భూషణామ్
రాక్షసాధిప సంరుద్ధాం బంధుభిశ్చ వినాకృతామ్. ౨౧
వియూథాం సింహ సంరుద్ధాం బద్ధాం గజ వధూమివ
చంద్రరేఖాం పయోదాంతే శారదాభ్రై రివావృతామ్. ౨౨
క్లిష్టరూపా మసంస్పర్శా దయుక్తామివ వల్లకీమ్.

టీక॥లక్ష్మీవాన్=అధికమయినకాంతిగల; హనుమాన్=హనుమంతుఁడు; తస్య=ఆవృక్షముయొక్క; అధస్తాత్= క్రిందను; నిష్ప్రభాం = కాంతిలేనిదియును; శోకసంతప్తాం=దుఃఖము చేతఁ దపింపఁజేయ బడినదియును; మలసంకులమూర్ధజాం=మురికితోనిండిన తలవెంట్రుకలుగలదియును; క్షీణపుణ్యాం = నశించినపుణ్యంబుగలదియు; చ్యుతాం=జారినదియును; భూమౌ= భూమియందు; నిపతితాం = పడినదియునగు; తారామివ (స్థితాం)= నక్షత్రముంబోలెనున్నదియును; చారిత్రవ్యపదేశాఢ్యాం =సదాచారముచేఁ గలిగినవిశేషముతోఁ గూడినదియును; భర్తృదర్శనదుర్గతాం= పెనిమిటి దర్శనముచేత దరిద్రయును, పెనిమిటిదర్శనములేనిదియుననుట; ఉత్తమైః=శ్రేష్ఠములయిన; భూషణైః= సొమ్ములచేత; హీనాం=విడువఁబడినదియును; భర్తృవాత్సల్య భూషణాం = పెనిమిటియందలిస్నేహమేయలంకారముగాఁ గలదియును; రాక్షసాధిపసంరుద్ధాం= రాక్షసులకుఁ బ్రభువైనరావణునిచే నడ్డగింపఁబడినదియును; బంధుభిః=బంధువులచేత; వినాకృతాంచ= విడువఁబడునట్లుచేయఁబడినదియును ; కావున నే; వియూథాం= సమూహమునువిడిచినదియును; బద్ధాం= బంధింపఁబడినదియును ; సింహసంరుద్ధాం=సింహముచే నడ్డగింపఁబడినదియునగు ; గజవధూమివ (స్థితాం ) = ఆఁడేనుంగుంబోలె నున్నదియును ; పయోదాంతే = మేఘముల యొక్క నాశమునందు , శరదృతువునందనుట ; శారదాభ్రైః= శరదృతువునందలి మేఘంబులచే; ఆవృతాం=కప్పఁబడిన; చంద్రరేఖామివ (స్థితాం)=చంద్రరేఖయుంబోలెనున్నదియును; అసంస్పర్శాత్= సంస్కారములేకుండుటవలన ; క్లిష్టరూపాం= చెడినసౌందర్యముగలదియును, కావుననే; అయుక్తాం = ఆరోపింపఁబడని తంత్రులుగల; వల్లకీమివ (స్థితాం) =వీణెయుంబోలెనున్నదియును; రాజపుత్రీం= రాచకొమార్తెయును; అనిందితాం= నిందింపఁబడనిదియును; జనకాత్మజాం=జనకునికూఁతురునగు; తాం=ఆ; దేవీం = సీతాదేవిని; లక్షయామాస=చూచెను.

సీతం జూచుటవలన నధికమయిన కాంతిగలహనుమంతుండు, ఆచెట్టుక్రిందఁ, గాంతిలేనిదై, దుఃఖంబునఁదపించుచున్నదై సంస్కారములేకుంటంజేసిమురికితోనిండియుండు తలవెంట్రుకలుగల

డై, పుణ్యంబుః దఱిగినపిమ్మట నాకాశంబునుండి భూమియందుఁబడిన నక్షత్రంబువలెనుండునదియు, పాతివ్రత్యాది సదాచారములవలనఁగీర్తిఁ బొంది, భర్తృదర్శనము లేనిదై, యుత్తమభూషణంబులు ధరింపక, భర్తృయందలిభక్తియే భూషణంబుగాఁ గలదియైనదై, బంధువులు లేనిదై రావణునిచే బాధింపఁబడుచుండుటంజేసి, గజసమూహంబువదలి సింహంబుచేఁబడిన యాఁడేనుంగువలె యుండునదియు, శరదృతువునందలి మేఘంబులంగప్పఁబడిన చంద్రరేఖకైవడిఁ, గొంచెము స్పష్టముగాను, గొంచెము స్పష్టముగాను తెలియంబడుచున్నదై, దేహసంస్కారంబు లేమింజేసి, కొంచెము దఱిగినసౌందర్యంబు గలిగియుండుటంజేసి, పంతుగ్రిలాకొంపింపకుండు నప్పుడుశోభింపకుండు పీణాయుంబోలెఁ గనుపట్టుచున్నదాని, రాచకొమార్తెయగు దాని నిందింపఁబడనిదాని, జనకునికొమార్తెయగుదాని, సీతాదేవింజూచెను.

అని, తాత్పర్యము.

సీతాం భర్తృవశే యుక్తామయుక్తాం రాక్షసీవశే. ౨౩
అశోకవనికామధ్యే శోకసాగరమాప్లుతామ్
తాభిః పరివృతాం తత్ర సగ్రహామివ రోహిణీమ్. ౨౪
దదర్శ హనుమాన్ దేవీం లతామకుసుమామివ

టీ॥ హనుమాన్ = హనుమంతుఁడు; భర్తృవశే = పెనిమిటికధీనత యందు; యుక్తాం = తగినదియును; రాక్షసీవశే = రాక్షసస్త్రీల యధీనత యందు; అయుక్తాం = తగనిదియును; శోకసాగరం = దుఃఖసముద్రమును, దుఃఖసముద్రమునందనుట; ఆప్లుతాం = మునింగినదియును; తాభిః = ఆ రాక్షసస్త్రీలచే; పరివృతాం = చుట్టుకొనఁబడినదియును, కావుననే; సగ్రహాం = క్రూరగ్రహముతోఁ గూడిన; రోహిణీమివ (స్థితాం) = రోహిణీనక్షత్రముం బోలె నున్నదియును; అకుసుమాం = పూలు లేని; లతామివ (స్థితాం) = తీఁగెయుం బోలెనున్నదియునగు; దేవీం = రాణి యగు; సీతాం = సీతను; తత్ర = ఆ; అశోకవనికామధ్యే = అశోకవనమునడుము నందు; దదర్శ = చూచెను.

ఎల్లప్పుడు పెనిమిటియగు రాముని యొద్దనేయుండఁదగినదియును, రాక్షసస్త్రీలకులోఁబడియుండఁదగనిదియును, దుఃఖసముద్రమునందుమునింగియున్నది

యు, రాక్షసస్త్రీలుచుట్టునుంజుట్టుకొని యుండుటంజేసి క్రూరగ్రహములతోc గూడినరోహిణీనక్షత్రంబుంబోలె, స్వాభరణంబులువిడిచి యుండుటవలనcబుష్పంబులు లేకుండు తీcగయుంబోలెc గాంతిహీనమ్మైయున్నదియునగు, సీతాదేవిని, ఆయశోకవనికనడుమను, హనుమంతుcడు, చూచెను. అని, తాత్పర్యము.

సా మలేన చ దిగ్ధాంగీ వపుషా చాప్యలంకృతా. ౧౮
మృణాలీ పంకదిగ్ధేవ విభాతి న విభాతి చ

టీక॥ మలేన=మురికిచేత ; దిగ్ధాంగీ చ=పూయcబడిన దేహము గలదియు; వపుషా=దేహముచేత ; అలంకృతా చాపి = అలంకరింపcబడినదియునగు; సా=ఆసీత; పంకదిగ్ధా=బురదచేcబూయcబడిన; మృణాళీవ=తామరతూcడువలె; విభాతి=ప్రకాశించుచున్నది. నవిభాతిచ=ప్రకాశింపకున్నదియు.

తామరతూcడు,బురదగలిగియున్నను స్వభావంబున దెల్లనైనది కావునcబ్రకాశించుచునుబ్రకాశింపకనుజూపట్టునట్లు, ఆసీత, దేహంబంతయుమురికిదగిలియున్నను, స్వభావంబునసౌందర్యంబుగలది కావునc బ్రకాశించుచునుబ్రకాశింపకను,గనుపట్టుచుండినది.

అని, తాత్పర్యము.

మలినేన తు వస్త్రేణ పరిక్లిష్టేన భామినీమ్. ౧౯
సంవృతాం మృగశాబాక్షీం దదర్శ హనుమాన్ కపిః
తాం దేవీం దీనవదనామదీనాం భర్తృతేజసా. ౨౦
రక్షితాం స్వేన శీలేన సీతామసితలోచనామ్

టీక॥ కపిః= కోcతియగు ; హనుమాన్=హనుమంతుcడు ; మలినేన=మురికియయినదియును; ("తు" అనునది పాదపూరణార్థము ) పరిక్లిష్టేన=నలcగినదియునగు; వస్త్రేణ= చీరచేత; సంవృతాం=కప్పcబడినదియును; మృగశాబాక్షీం= జింకపిల్లకండ్లవంటికండ్లుగలదియును; దీనవదనాం=దుఃఖముతోcగూడినముఖము గలదియును; భర్తృతేజసా=పెనిమిటి పరాక్రమముచేత; అదీనాం = దైన్యములేనిదియును; స్వేన=తనదైన; శీలేన=సదాచారముచేత; రక్షితాం=కాపాడcబడినదియును ; అసితలోచనాం=నల్ల

నికంన్నులుగలదియునగు; భామినీం=స్త్రీయయిన; దేవీం= రాణియగు; తాం= ఆ; సీతాం=సీతను; దదర్శ=చూచెను.

ముత్తికియునుసలంగినదియునగుచీరం గట్టుకొని, జింకపిల్లకుంబోలెసుందరంబులగుకంన్నుగగ్గి, దైన్యంబునొంది, పెనిమిటిపరాక్రమంబుం దలంచుకొన్నప్పుడు మాత్రము దైన్యంబులేనిదై, తనపాతివ్రత్యంబువిడువకున్న, యాసీతాదేవిని, హనుమంతుండు, చూచెను.

అని, తాత్పర్యము.

తాం దృష్ట్వా హనుమాన్ సీతాం మృగశాబనిభేక్షణామ్. ౨౮
మృగకన్యామివ త్రస్తాం వీక్షమాణాం సమంతతః
దహంతీ మివ నిశ్శ్వాసై ర్వృక్షాన్ పల్లవధారిణః. ౨౯
సంఘాతమివ శోకానాం దుఃఖస్యోర్మి మివోత్థితామ్

టీక॥ హనుమాన్= హనుమంతుండు; మృగశాబనిభేక్షణాం= జింకపిల్లకన్నులతో సమానములయిన కంన్నులుగలదియును; సమంతతః=అంతటను; వీక్షమాణాం=చూచుచున్నదియును; త్రస్తాం= భయముపడిన ; మృగకన్యామివ (స్థితాం)= ఆడుజింకయుంబోలెనున్నదియును; నిశ్శ్వాసైః=నిట్టూర్పులచేత; పల్లవధారిణః=చిగురుటాకులందాల్చియున్నట్టి; వృక్షాన్=చెట్లను ; దహంతీమివ (స్థితాం)=కాల్చుచున్నట్లున్నదియును; శోకానాం= దుఃఖములయొక్క; సంఘాతమివ (స్థితాం)=సమూహముంబోలె నున్నదియును ; ఉత్థితాం=లేచిన; దుఃఖస్య=దుఃఖముయొక్క; ఊర్మిమివ(స్థితాం) =పరంపరయుంబోలె నున్నదియునగు; తాం=ఆ; సీతాం=సీతను; దృష్ట్వా=చూచి; ప్రహర్షం (అధ్యాహృతము)= సంతోషమును ; లేభే (అధ్యాహృతము) = పొందెను.

జింకపిల్లలకుంబోలె విశాలంబులును సుందరంబులునగు కంన్నులుగలిగి భయంబునొందిన లేడియుంబోలె నలుప్రక్కలనుం జూచుచు, వేడినిట్టూర్పులచే నచ్చటి వృక్షంబుల చిగురుటాకుల దహించునట్లు చూపట్టుచు, నాకారము వహించిన దుఃఖసమూహముంబోలె దుఃఖపరంపరయుంబోలెం జూడనగుచున్న, యాసీతంజూచి, హనుమంతుండు, సంతోషంబునొందెను. అని, తాత్పర్యము.

తాం క్షమాం సువిభక్తాంగీం వినాభరణశోభినీమ్. ౩౦
ప్రహర్ష మతులం లేభే మారుతిః ప్రేక్ష్య మైథిలీమ్

టీక॥ మారుతిః = వాయుదేవుని కుమారుండగుహనుమంతుండు; క్షమాం (ఇవస్థితాం)=భూమియుంబోలెనున్నదియును; సువిభక్తాంగీం=చక్కఁగావిభజింపఁబడినయవయవములు గలదియును; వినాభరణశోభినీం=సొమ్ములులేకయెప్రకాశించుచున్నదియునగు; తాం=ఆ; మైథిలీం=సీతను; ప్రేక్ష్య=చూచి; అతులం=సాటిలేని; ప్రహర్షం=సంతోషమును; లేభే=పొందెను.

వాయుదేవునికుమారుండగు హనుమంతుండు, భూమియుంబోలెఁజాలనోర్పుగలదియును, వేఱువేఱుగానున్నట్లు తెలియఁగన సుందరంబులైయుండు నవయవంబులు గలదియు నాభరణంబులేమి యుండకున్నను దేహసౌందర్యంబుననె ప్రకాశించుచున్నదియునగు, నాసీతం జూచి, మిగులనధికమయినసంతోషంబు నొందెను. అని, తాత్పర్యము.

హర్షజాని చ సో౽శ్రూణి తాం దృష్ట్వా మదిరేక్షణామ్. ౩౧
ముముచే హనుమాం స్తత్ర నమశ్చక్రే చ రాఘవమ్

టీక॥ తత్ర = ఆయశోకవనికయందు; మదిరేక్షణాం=మదముగప్పినకండ్లు గలయాండుదియగు; తాం=ఆసీతను; దృష్ట్వా=చూచి, సః=ఆ; హనుమాన్=హనుమంతుండు; హర్షజాని=సంతోషంబువలననంబుట్టిన; అశ్రూణి=కన్నీళ్లను; ముముచేచ=విడిచెను. రాఘవం = రామును; నమశ్చక్రేచ= నమస్కరించెను.

ఆయశోకవనికయందు, మదంబుగప్పినకండ్లుగల యాండుదియగునాసీతం జూచి; యాహనుమంతుఁడు కండ్లనానందబాష్పంబులు విడుచుచు, రామునకు నమస్కరించెను.

అని, తాత్పర్యము.

నమస్కృత్వా చ రామాయ లక్ష్మణాయ చ వీర్యవాన్. ౩౨
సీతాదర్శనసంహృష్టో హనుమాన్ సంవృతో౽భవత్

టీక॥ వీర్యవాన్ = అధికమయినపరాక్రమంబుగల; సః=ఆ; హనుమాన్ =

హనుమంతుఁడు; రామాయ=రామునికొఱకును; లక్ష్మణాయచ= లక్ష్మణునికొఱకును; నమస్కృత్వా= నమస్కరించి; సీతాదర్శనసంహృష్టః= సీతం జూచుటచేమిక్కిలియు సంతోషమును బొందినవాఁడై; సంవృతః= కప్పఁబడినవాఁడు; అభవత్ =ఆయెను.

మహాపరాక్రమశాలియగు నాహనుమంతుఁడు, రామునకును లక్ష్మణునకును నమస్కరించి, "సీతం జూచితిని గదా!" యనిమిగులసంతోషంబునొంది, రాక్షసస్త్రీలుతన్నుఁ జూడకుండుటకై, యాశింశుపావృక్షపత్రంబులం గప్పుకొనియుండెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, సప్తదశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, సమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండసప్తదశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

## అష్టాదశసర్గప్రారంభః.

తథా విప్రేక్షమాణస్య వనం పుష్పితపాదపమ్
విచిన్వతశ్చ వైదేహీం కించిచ్ఛేషా నిశాఽభవత్. ౧

టీ॥ తస్య (అధ్యాహృతము)= ఆహనుమంతుఁడు; తథా=అట్లు; పుష్పితపాదపం=పూచినచెట్లుగల; వనం=అశోకవనికను; విప్రేక్షమాణస్య= చూచుచు; వైదేహీం=సీతను; విచిన్వతశ్చ=వెదకుచుండఁగా; నిశా= రాత్రి; కించిచ్ఛేషా= కొంచెముమిగతగలదిగా; అభవత్=ఆయెను.

ఆహనుమంతుఁడట్లు, చక్కఁగాఁబూచియుండుచెట్లుగలయశోక వనికను జూచుచు, సీతను వెదకుచుండఁగా, రాత్రిలోఁగొంచెముప్రొద్దుమాత్రముమిగిలియుండినది. అని, తాత్పర్యము.

షడంగవేదవిదుషాం క్రతుప్రవరయాజినామ్
శుశ్రావ బ్రహ్మఘోషాంశ్చ విరాత్రే బ్రహ్మరక్షసామ్. ౨

టీక॥ సః (అధ్యాహృతము) = ఆ హనుమంతుఁడు; విరాత్రే = అపరరాత్రియందు; షడంగవేదవిదుషాం = ఆఱంగములను వేదములను దెలిసినవారును; క్రతుప్రవరయాజినాం = యాగశ్రేష్ఠములను జేయించునట్టివారునగు; బ్రహ్మరక్షసాం = బ్రాహ్మణరాక్షసులయొక్క; బ్రహ్మఘోషాంశ్చ = వేదధ్వనులను; శుశ్రావ = వినెను.

అంత, నపరరాత్రియందు, హనుమంతుఁడు, శిక్షాదిషడంగములను వేదములను దెలిసినవారును గొప్పయాగంబులను జేయించువారునగు బ్రాహ్మణరాక్షసులు, వేదాధ్యయనముసేయఁగా, నాధ్వనులనువినెను. అని, తాత్పర్యము.

అథ మంగళవాదిత్రశబ్దైః శ్రోత్రమనోహరైః
ప్రాబుధ్యత మహాబాహు ర్దశగ్రీవో మహాబలః. ౩

టీక॥ అథ = అటుతర్వాత; మహాబాహుః = పెద్దచేతులుగలవాఁడును; మహాబలః = అధికమయినబలముగల వాఁడునగు; దశగ్రీవః = పదికంఠములుగల రావణుండు; శ్రోత్రమనోహరైః = చెవులకింపైన; మంగళవాదిత్రశబ్దైః = మంగళవాద్యములధ్వనులచేత; ప్రాబుధ్యత = మేలుకొనెను.

అంతట, చెవులకుసుఖంబుగా మంగళవాద్యంబులు మ్రోయఁగా, నాధ్వనులచే మహాబాహుండును మహాబలుండును నగు రావణుండు, మేలుకొనెను.

అని, తాత్పర్యము.

విబుధ్యతు యథాకాలం రాక్షసేంద్రః ప్రతాపవాన్
స్రస్తమాల్యాంబరధరో వైదేహీ మన్వచింతయత్. ౪

టీక॥ ప్రతాపవాన్ = పరాక్రమంబుగల; రాక్షసేంద్రః = రాక్షసులకుఁ బ్రభుండగు రావణుండు; స్రస్తమాల్యాంబరధరః = జాఱినపుష్పమాలికల

సువస్త్రములనుధరించినవాఁడై; యథా కాలం=కాలమునుదప్పక; విబుధ్యమాన=మేలుకొననంతనే; వైదేహీం=సీతను; అన్వచింతయత్=తలంచుకొనెను.

పరాక్రమశాలియగు రావణుండు, నిద్రించుటవలన స్థలంబుదప్పి జాఱియుం బుష్పమాలికలలోను వస్త్రములోను మేలుకొని, యంత, సీతం దలంచుకొనెను. అని, తాత్పర్యము.

భృశం నియుక్త స్తస్యాంచ మదనేన మదోత్కటః
న స తాం రాక్షసః కామం శశాకాత్మని గూహితుమ్. ౫

టీక॥ మదోత్కటః=మదముచేతనతిశయించినవాఁడగు; సః=ఆ; రాక్షసః=రావణుఁడు; మదనేన=మన్మథునిచేత; తస్యాం=ఆసీతయందు; భృశం=మిక్కిలియును; నియుక్తః=నియోగింపఁబడినవాఁడై; తం=ఆ; కామం=మన్మథతాపమును; ఆత్మని=మనసునందు; గూహితుం=అణఁచుకొనుటకు; నశశాక=చాలఁడయ్యె.

ననుట; మదోత్కటః= అధికమదంబుగలవాఁడు; సః=కాఁడు; తస్యాం=ఆసీతయందు; భృశం=మిక్కిలియును; నియుక్తః= అధికమయినభక్తిగలవాఁడు. సః (అధ్యాహృతము)= అట్టిరావణుండు; తం=ఆ; కామం = మన్మథుని; ఆత్మని = మనస్సునందు; గూహితుం=అణఁచుకొనుటకు; నశశాక = చాలఁడా? సిద్ధముగాఁ జాలును.

చాలమదంబుగల యారావణుఁడు, ఆసీతనుగురించి, మన్మథునిచే మిక్కిలియుఁ బ్రేరితుండగుటం జేసి, యామన్మథతాపంబును మనంబునణఁచుకొనలేకుండెను. అని, తాత్పర్యము.

రహస్యార్థము.— సః=ఆ; రాక్షసః=రావణుఁడు; మదనే = మన్మథుండున్నను, మన్మథుఁడు ప్రేరేపించిన

మన్మథుండెంత ప్రేరేపించినను, ఆ రావణుండెంత మాత్రమును మన్మథవికారంబునొందలేదు; ఆసీతయందుమిగులభక్తివినయంబులుగల్గి యుండెను; అట్టిరావణుఁడు, ఆమన్మథునిఁదనమనంబున నేయడంచుకొనంజాలఁడా యేమి? చాలుననుటకేమియు సందియములేదు.

అని, తాత్పర్యము.

స సర్వాభరణై ర్యుక్తో బిభ్రచ్ఛ్రియ మనుత్తమామ్
తాం నగై ర్బహుభి ర్జుష్టాం సర్వపుష్ప ఫలోపగైః. ౬

వృతాం పుష్కరిణీభిశ్చ నానాపుష్పోపశోభితామ్
సదామదైశ్చ విహగైర్విచిత్రాం పరమాద్భుతామ్. ౭
ఈహామృగైశ్చ వివిధైర్జుష్టాం దృష్టిమనోహరైః
వీథీస్సంప్రేక్షమాణశ్చ మణికాంచనతోరణాః. ౮
నానామృగగణాకీర్ణాం ఫలైః ప్రపతితైర్వృతామ్
అశోకవనికామేవ ప్రావిశత్సంతతద్రుమామ్. ౯

టీక॥ సః=ఆరావణుఁడు; సర్వాభరణైః= సమస్తములయినసొమ్ములతోను; యుక్తః = కూడినవాఁడై; అనుత్తమాం=తనకన్నశ్రేష్ఠంబులేని; శ్రియం= కాంతిని; బిభ్రత్ = ధరించుచు; బహుభిః=అనేకములయిన; సర్వపుష్పఫలోపగైః= సమస్తములయినపూలను ఫలములనుబొందియున్నట్టి; నగైః=వృక్షములచేత; జుష్టాం= సేవింపఁబడినదియును; పుష్కరిణీభిః=కోనేఱులచేత; వృతాం చ=చుట్టఁబడినదియును; నానాపుష్పోపశోభితాం= నానావిధములయినపూలచేతఁబ్రకాశింపఁజేయఁబడినదియును; సదామదైః = ఎల్లప్పుడు మదంబుగల; విహగైః=పక్షులచేత; విచిత్రాం= నానావర్ణములుగలదియును; పరమాద్భుతాం= మిక్కిలియునాశ్చర్యముగల్గించునదియును; దృష్టిమనోహరైః = చూచుటకందములయిన; వివిధైః= నానావిధములగు; ఈహామృగైః=తోడేళ్లచేతను; జుష్టాం చ= సేవింపఁబడినదియును; నానామృగగణాకీర్ణాం=నానావిధములయినమృగముల సమూహములచే వ్యాపింపఁబడినదియును; ప్రపతితైః=పడిన; ఫలైః=పండ్లచే; వృతాం=కప్పఁబడినదియును; సంతతద్రుమాం=చక్కఁగా వ్యాపించిన చెట్లుగలదియునగు; తాం=ఆ; అశోకవనికామేవ= అశోకవనికనే; మణికాంచనతోరణాః= రత్నవికారములును బంగారువికారములునగు ద్వారంబులుగల; వీథీః = వీధులను; సంప్రేక్షమాణశ్చ = చూచుచును; ప్రావిశత్ =ప్రవేశించెను.

ఆరావణుండు, సమస్తాభరణంబులనుధరించి. సరిలేనికాంతిం దేజరిల్లుచు, సమస్తపుష్పంబులను ఫలంబులను నిండియున్నయనేకంబులగు వృక్షంబులతో నొప్పుచున్నదియుఁ, బెక్కుకోనేఱులతోఁగూడినదియు, నానావిధపుష్పంబులంజూడనందంబైనదియు, నెప్పుడుమ

దంబున విహరించుచుండు పక్షులుగల్గి చూపరుల కాశ్చర్యంబు గల్గించు నదియు, సుందరములయిన తోఁటల్లతోఁ గూడినదియు, నానావిధమృగంబులనొప్పుచున్నదియు, చెట్లనుండి నేలరాలిన ఫలంబులంగప్పఁబడినదియును, చెట్లతోనిండియున్నదియు నగు, నాయశోకవనికను, బంగారుతోను మణులతోనుం జేయఁబడిన ద్వారంబులుగల వీధులం జూచుచుఁ బ్రవేశించెను.

అని, తాత్పర్యము.

అంగనాశత మాత్రంతు తం వ్రజంత మనువ్రజత్
మహేంద్ర మివ పౌలస్త్యం దేవగంధర్వయోషితః. ౧౦

టీక॥ మహేంద్రం=దేవేంద్రుని; దేవగంధర్వయోషితఇవ=దేవతాస్త్రీలునుగంధర్వస్త్రీలునుంబోలె; వ్రజంతం=పోవుచున్న; తం=ఆ; పౌలస్త్యం=పులస్త్యునివంశంబునంబుట్టినరావణుని; అంగనాశతమాత్రంతు = స్త్రీలయొక్క-నూఱంతటిసంఖ్యామాత్రము; అనువ్రజత్ (అన్వవ్రజత్)=వెంబడించినది.

దేవతాస్త్రీలునుగంధర్వస్త్రీలును దేవేంద్రుని వెంబడించునట్లు, ఆరావణుండుపోవుచుండఁగా, నూఱుమంది స్త్రీలతని వెంబడించిరి. అని, తాత్పర్యము.

దీపికాః కాంచనీః కాశ్చి జ్జగృహు స్తత్ర యోషితః
వాలవ్యజనహస్తాశ్చ తాలవృంతాని చాపరాః. ౧౧

టీక॥ తత్ర=అందు; యోషితః=స్త్రీలు; కాశ్చిత్=కొందఱు; కాంచనీః=బంగారు వికారములయిన, బంగారు స్తంభంబులుగలయనుట; దీపికాః = దీపములను; జగృహుః=పట్టుకొనిరి. కాశ్చిత్ (అధ్యాహృతము)=కొందఱు; వాలవ్యజనహస్తాశ్చ= చామరంబులు చేతులందుఁగలవారలుగాను; ఆసన్ (అధ్యాహృతము)=ఉండిరి. అపరాశ్చ= ఇతరలు; తాలవృంతానిచ= విసనకఱ్ఱలను; జగృహుః (అధ్యాహృతము)= పట్టుకొనిరి.

అందుఁ, గొందఱుస్త్రీలు, బంగారు స్తంభంబులుగల దీపంబులం బట్టుకొనియుండిరి; కొందఱుచామరంబులం జేకొనియుండిరి; మఱికొందఱువిసనకఱ్ఱలను

గ్రహించియుండిరి. అని, తాత్పర్యము.

కాంచనై రపి భృంగారై ర్జహ్రుః స్సలిల మగ్రతః
మండలాగ్రా న్బృసీం చైవ గృహ్యాన్యాః పృష్ఠతో యయుః. ౧౨

టీక॥ కాశ్చిత్ (అధ్యాహృతము)= కొందఱు; కాంచనైః= బంగారువికారములైన; భృంగారైః= గిండిపాత్రలచేత; సలిలమపి= నీళ్లను; అగ్రతః= ముందటను; జహ్రుః = కొనిపోయిరి. అన్యాః= ఇతరస్త్రీలు; మండలాగ్రాన్= కత్తులను; బృసీంచైవ= ఆసనమును; గృహ్య(గృహీత్వా)= పట్టుకొని ; పృష్ఠతః= వెనుకను; యయుః= పోయిరి.

కొందఱుస్త్రీలు, బంగారుగిండిపాత్రల జలంబుగొని రావణునకుముందు నడచిరి. మఱికొందఱువనితలు , కత్తులను ఆసనంబులను జేకొని, రావణునివెనుకంబోయిరి. అని తాత్పర్యము.

కాచి ద్రత్నమయీం స్థాలీం పూర్ణాం పానస్య భామినీ
దక్షిణా దక్షిణే నైవ తదా జగ్రాహ పాణినా. ౧౩

టీక॥ తదా= అప్పుడు; దక్షిణా= చతురయగు; కాచిత్ = ఒకానొక; భామినీ= స్త్రీ ; పానస్య= (తృతీయార్థమందుషష్ఠి) మద్యముచేత; పూర్ణాం= నిండిన; రత్నమయీం= మణివికారమయిన; స్థాలీం= పాత్రమును; దక్షిణేన= కుడిదియగు; పాణినైవ= చేతిచేతనే; జగ్రాహ= పట్టుకొనెను.

అప్పుడు, చాతుర్యముగలయొకానొకస్త్రీ, మద్యముతోనిండినమణిమయపాత్రము నుదనరుడిచేతం బట్టుకొనిపోయెను. అని, తాత్పర్యము.

రాజహంసప్రతీకాశం ఛత్రం పూర్ణ శశిప్రభమ్
సౌవర్ణదండ మపరా గృహీత్వా పృష్ఠతో యయౌ. ౧౪

టీక॥ అపరా = మఱియొక్కతె ; రాజహంసప్రతీకాశం= రాజహంసపక్షితోసమానమయినదియును; పూర్ణశశిప్రభం= నిండుచందురునికాంతివంటి




కాంతి గలదియును; సౌవర్ణదండం= బంగారు వికారమయిన దండముగలది యునగు; ఛత్రం = గొడుగును; గృహీత్వా=పట్టుకొని; పృష్ఠతః = వెనుకను; యయౌ=పోయెను.

వ జెయొక్క తె, రాయంచయుం బోలెను చంద్రుండుం బోలెం దెల్లగా నుండు ఛత్రంబు నుబట్టుకొని, రావణుని వెనుకం బోయెను. అని, తాత్పర్యము.

నిద్రామదపరీతాక్ష్యో రావణస్యోత్తమాః స్త్రియః
అనుజగ్ముః పతిం వీరం ఘనం విద్యుల్లతా ఇవ. ౧౫

టీక॥ ఉత్తమాః= శ్రేష్ఠలగు; రావణస్య=రావణునియొక్క; స్త్రియః=భార్యలు; నిద్రామదపరీతాక్ష్యః= నిద్రచేతను కైపుచేతను వ్యాపింపఁబడిన కండ్లు గలవారలై; ఘనం = మేఘంబును; విద్యుల్లతాఇవ = మెఱుపుఁదీఁగెలుంబోలె; వీరం = పరాక్రమశాలియగు; పతిం= పెనిమిటిని; అనుజగ్ముః= వెంబడించిరి.

ఉత్తమస్త్రీలగు రావణుని భార్యలు, నిదురచేతను మద్యమదంబుచేతను ఘూర్ణిల్లుచున్న కన్నులుగలిగి కాంతిచే మెఱయుచు, మేఘంబును మెఱుపుఁదీఁగెలు వెంబడించునట్లు, పరాక్రమశాలియగు తమభర్త రావణుని, వెంబడించిపోయిరి. అని, తాత్పర్యము.

వ్యావిద్ధహారకేయూరా స్సమామృదితవర్ణకాః
సమాగళితకేశాంతా స్సస్వేదవదనా స్తథా. ౧౬
ఘూర్ణంత్యో మదశేషేణ నిద్రయాచ శుభాననాః
స్వేదక్లిష్టాంగకుసుమా స్సుమాల్యాకులమూర్ధజాః. ౧౭
ప్రయాంతం నైరృతపతిం నార్యో మదిరలోచనాః
బహుమానాచ్చ కామాచ్చ ప్రియా భార్యా స్త మన్వయుః. ౧౮

టీక॥ ప్రియాః= ఇష్టలగు; భార్యాః=భార్యలయిన; నార్యః=స్త్రీలు; వ్యావిద్ధహారకేయూరాః= స్థలంబుదప్పినహారములును బాహుపురులును గలవారలై; సమామృదితవర్ణకాః= మిక్కిలియును మాయఁజేయఁబడినమై




పూఁతగలవారలై; సమాగళిత కేశాంతాః=జాఱిన వెండ్రుకల మొనలుగలవారలై; తథా=అట్లు; సస్వేదవదనాః=చెమటతోఁగూడినముఖముగలవారలై; మదశేషేణ=కైపుమిగతచేతను; నిద్రయాచ= నిదురచేతను ; ఘూర్ణంత్యః=తిరుగఁబడునొందినవారలై; శుభాననాః=సుందరంబులగు ముఖంబు గలవారలై; స్వేదక్లిష్టాంగకుసుమాః=చెమటచేవాడినదేహమునందలిపుష్పంబులుగలవారలై; సుమాల్యాకుల మూర్ధజాః= మంచిపుష్పమాలికలచే నిండినవెండ్రుకలుగలవారలై; మదిరలోచనాః=మదముగప్పినకండ్లుగలవారలై; బహుమానాచ్చ = గౌరవంబువలనను; కామాచ్చ=మన్మథతాపంబు వలనను; ప్రయాంతం=పోవుచున్న ; నైరృతపతిం=రాక్షసులకుఁబ్రభుండగు ; తం=ఆరావణుని; అన్వయుః=వెంబడించిరి.

ఆరావణునిప్రియభార్యలు, నిద్రించుటంజేసినలంబుదప్పినహారంబులను బాహువులనుంగలిగి, మాసినమైపూఁతతోఁగూడి, తలవెండ్రుకల కొనలు జాఱి వ్రేలుచుండఁగా, ముఖంబునఁ జెమటపట్టఁగా, కైపుచేతనునిదురచేతనుదిరుగుడునొందుచు, అట్టియవస్థగలుగుటంజేసి, ముఖంబులు మిగుల సుందరంబులై చెలంగఁగాఁ, జెమటనీళ్లవాడినపుష్పంబులుగల్గి, మంచిపుష్పమాలికలతో నిండియుండుతలవెండ్రుకలతో నొప్పుచు, భర్తృగౌరవంబునను , అగ్గలంబగుమన్మథతాపమునను, రాక్షసరాజుండగురావణుని, వెంబడించిరి. అని, తాత్పర్యము.

సచ కామపరాధీనః పతి స్తాసాం మహాబలః
సీతాసక్తమనా మందో మందాంచితగతి ర్బభౌ. ౧౯

టీక॥ తాసాం=ఆస్త్రీలయొక్క ; పతిః=పెనిమిటియును; మహాబలః= అధికమయినబలిమి గలవాఁడునగు; సచ=ఆరావణుండును; కామపరాధీనః=మన్మథునకులోఁకువయయిన వాఁడై ; సీతాసక్తమనాః=సీతయందుఁదగిలినమనస్సుగలవాఁడై; మందః = జడుఁడై; మందాంచితగతిః=మెల్లనిదియు సుందరంబునగునడకగలవాఁడై; బభౌ = ప్రకాశించెను.

ఆస్త్రీలకుఁబెనిమిటియు మహాబలుండునగునారావణుండు, మన్మథాధీ

నుండైె మనస్సు సీతయందుమగ్నం బగుటవలన జడుండుంబోలె నేమియుందోఁచక, మెల్లగా లీలమైయింబోవుచుఁ, బ్రకాశించెను. అని, తాత్పర్యము.

తతః కాంచీ నినాదంచ నూపురాణాంచ నిస్వనమ్
శుశ్రావ పరమస్త్రీణాం సకపి మారుతాత్మజః ౨౦

టీక॥ తతః = అటుపిమ్మట; మారుతాత్మజః = వాయుదేవునికుమారుండగు; సః = ఆ; కపిః = హనుమంతుండు; పరమస్త్రీణాం = ఉత్తమస్త్రీలయొక్క; కాంచీనినాదంచ = మొలనూలుధ్వనిని; నూపురాణాం = అందెలయొక్క; నిస్వనంచ = ధ్వనిని; శుశ్రావ = వినెను.

అంత, వాయుదేవునికుమారుండగు నాహనుమంతుండు, ఆయుత్తమస్త్రీలు నడుచుచుండఁగాఁ బుట్టినమొలనూళ్లధ్వనినిఅందెలశబ్దంబును, వినెను. అని, తాత్పర్యము.

తం చాప్రతిమకర్మాణ మచింత్యబలపౌరుషమ్
ద్వారదేశే మనుప్రాప్తం దదర్శ హనుమాన్ కపిః. ౨౧
దీపికాభి రనేకాభి స్సమంతా దవభాసితమ్
గంధతైలావసిక్తాభి ర్ధ్రియమాణాభి రగ్రతః. ౨౨
కామదర్పమదై ర్యుక్తం జిహ్మతామ్రాయతేక్షణమ్
సమన మివ కందర్ప మపవిద్ధ శరాసనమ్. ౨౩
మథితామృతఫేనాభ మరజోవస్త్రముత్తమమ్
సలీల మనుకర్షంతం విముక్తం సక్త మంగదే. ౨౪

టీక॥ కపిః = కోఁతియగు; హనుమాన్ = హనుమంతుఁడు; అప్రతిమకర్మాణం = సరిలేని కార్యములుగలవాఁడును; అంచిత్యబలపౌరుషం = ఎన్నరాని బలంబునుబురుషకారంబును గలవాఁడును; అగ్రతః = ముందట; ధ్రియమాణాభిః = పట్టుకొనఁబడినవియు; గంధతైలావసిక్తాభిః = వాసననూనెచేఁదడుపఁబడినవియునగు; అనేకాభిః = పెక్కులయిన; దీపికాభిః = దీపములచే

తః; సమంతాత్=అంతటను; అవభాసి
తం = ప్రకాశింపఁజేయఁబడినవాఁడు
ను;కామదర్పమదైః= మన్మథతాపము
తోను గర్వముతోను మత్తతోను; యు
క్తం=కూడినవాఁడును; జిహ్మతామ్రా
యతేక్షణం= వక్రంబులు నెఱ్ఱనివియు
నునిడుపులయినవియునగుకండ్లుగలవాఁ
డును; అపవిద్ధశరాసనం=విడువఁబడి
నవిల్లుగలవాఁడును ; సమత్తం=సార్థ్య
త్యుండైనవాఁడునగు;కందర్పమివ ( స్థి
తం)= మన్మథుండుం బోలెనున్నవాఁ
డును ; విముక్తం= జాఱినదియును;
అంగదే = బాహుపురియందు ; స
క్తం= తగులుకొన్నదియును; మథితా
మృతఫేనాభం,మథిత = సిల్లుబోయిక
చిలికినమజ్జిగయొక్కయు , అమృత=
ధారోష్ణంబగుపాలయొక్కయు , ఫే
న=నురుఁగుయొక్క, ఆభం = కాంతి
వంటికాంతిగలదియును; అరజః= దు
మ్ములేనిదియును; ఉత్తమం=శ్రేష్ఠంబు
నగు; వస్త్రం=వస్త్రమును; సలీలం=
విలాసముతోఁగూడునట్లుగా ; అనుక
ర్షంతం=ఈడ్చుచున్నవాఁడును; ద్వా
రదేశం=వాకిటిప్రదేశమును; అనుప్రా
ప్తం=పొందినవాఁడునగు; తంచ= ఆ
రావణుని; దదర్శ=చూచెను.

సరిలేని గొప్పకార్యంబులు చేయు
వాఁడునను మనంబునంగూడ నెన్నరానిబ
లపౌరుషంబులు గలవాఁడునై, స్త్రీల
చేముందటఁబట్టుకొనఁబడిన వాసననూ
నెపోసినయనేక దీపంబులవెల్గురుచేఁజ
క్కఁగానగపడుచు, మన్మథతాపంబు
నుగర్వంబునుమద్యమదంబునుంగల్గి, వ
క్రంబులై యెఱ్ఱనై దీర్ఘంబులైయుండు
నేత్రంబులనొప్పుచు,చేఁతవిల్లువిడిచిప్ర
త్యక్షంబుగావచ్చిన మన్మథుండనందగి,
స్వస్థానంబునుండిజాఱిబాహుపురిలోఁ
దగులుకొనినగట్టిమజ్జిగ నురుగునుబాల
నుఱుఁగునుంబోలె సూక్ష్మంబై ధవళం
బై యెంతమాత్రంబును దుమ్ములేకుం
డును త్తమంబగు వస్త్రంబును విలాసం
బుతోఁజైకీడ్చుకొనుచు, నాయశోకవని
కద్వారమునకువచ్చిన,రావణుని,హను
మంతుండు,చూచెను.

అని, తాత్పర్యము.

తం పత్రవిటపే లీనః పత్రపుష్పఘనావృతః
సమీప మివ సంక్రాంతం నిధ్యాతు ముపచక్రమే. ౨౫

టీక॥సః(అధ్యాహృతము)=ఆహ
నుమంతుఁడు;పత్రవిటపే=అధికముగా
నాకులుగలకొమ్మయందు;లీనః=కప్పఁ
బడినవాఁడై;పత్రపుష్పఘనావృతః= ఆ




కులయొక్కయుఁ బూలయొక్కయుస మూహముచేఁగప్పఁబడినవాఁడై; సమీపం=సమీపమును; సంక్రాంతముప(స్థితం)= పొందిన వాఁడుంబోలెనున్న; తం=ఆ రావణుని;నిధ్యాతుం=చూచుట కు;ఉపచక్రమే=ఆరంభించెను.

ఆహనుమంతుండు, ఆకులతోనిండి న కొమ్మయందు , ఎవ్వరికినిగానరా కుండు నట్లు , ఆకులను బూలనుంగ ప్పకొని , దూరముననున్న ను గాం తిచేదగ్గి అరువచ్చినట్లు చూపట్టుచున్న యారావణునిం,బూడసాగెను.

అని, తాత్పర్యము.

అవేక్షమాణస్తు తతో దదర్శ కపికుంజరః
రూపయౌవనసంపన్నా రావణస్య వరస్త్రియః. ౮౬

టీక॥తతః=అటుపిమ్మట; కపికుంజరః= వానరశ్రేష్ఠుండగుహనుమంతుండు; అ వేక్షమాణస్తు=చూచుచునే; రూపయౌ వనసంపన్నాః=సౌందర్యముతోనుయౌ వనముతోనుగూడినవారలగు; రావణ స్య=రావణునియొక్క; వరస్త్రియః= ఉత్తమవనితలను;దదర్శ=చూచెను.

అంత, వానరశ్రేష్ఠుండగుహనుమం తుండు,ఆరావణునింజూచుచు,అధికమ యిన సౌందర్యంబుతోను యౌవనంబు తోనుఒప్పుచున్నవారల, రావణునిభా ర్యలం,జూచెను.

అని, తాత్పర్యము.

తాభిః పరివృతో రాజా సురూపాభి ర్మహాయశాః
తన్మృగద్విజసంఘుష్టం ప్రవిష్టః ప్రమదావనమ్. ౮౭

టీక॥ మహాయశాః= అధిమయినకీ ర్తిగల ;రాజా=రావణుఁడు; సురూ పాభిః = చక్కనిరూపంబుగల ; తా భిః=ఆస్త్రీలచేత ;పరివృతః= చుట్టుకొ నఁబడినవాఁడై; మృగద్విజసంఘుష్టం= మృగములచేతను బక్షులచేతనుధ్వనిగ ల; తత్ =ఆ; ప్రమదావనం= అంతః పురస్త్రీలయుద్యానవనంబగునాయశో కవనికను; ప్రవిష్టః=ప్రవేశించెను.

అధికమయినకీర్తిగల , యారావణుం డు , సౌందర్య వతులగునాస్త్రీలతోఁ గూడి, మధురంబుగాఁ గూయుచుండు




నట్టిమృగంబులతోఁబక్షులతో నొప్పచుండునశోకవనికం బ్రవేశించెను.

అని, తాత్పర్యము.

క్షీబో విచిత్రాభరణ శ్శంకుకర్ణో మహాబలః
తేన విశ్రవసః పుత్ర స్స దృష్టో రాక్షసాధిపః. ౨౮
వృతః పరమనారీభి స్తారాభిరివ చంద్రమాః

టీక॥ తేన= ఆహనుమంతునిచేత; క్షీబః=మదంబునొందినవాఁడును; విచిత్రాభరణః=నానావిధంబులగు సొమ్ములుగలవాఁడును; శంకుకర్ణః=స్తంభంబులవంటిచెవులుగలవాఁడును; మహాబలః= అధికమయినబలముగలవాఁడును; తారాభిః = నక్షత్రములచేత; చంద్రమాఇవ = చంద్రుఁడుంబోలె, పరమనారీభిః=ఉత్తమస్త్రీలచేత; వృతః=చుట్టుకొనఁబడినవాఁడును; విశ్రవసః=విశ్రవసునియొక్క; పుత్రః= కొడుకును; రాక్షసాధిపః= రాక్షసులకుఁబ్రభువునగు; సః= ఆరావణుఁడు; దృష్టః = చూడఁబడినాఁడు.

ఆహనుమంతుండు, మద్యపానంబు సమత్తుఁడును నానావిధంబులగు నాభరణంబులధరించినవాఁడును గర్వంబున స్తబ్ధంబులగుటంజేసి స్తంభంబులుం బోలెనిశ్చలంబులయిన చెవులుగలవాఁడునగు వానిఁ, జంద్రుండు నక్షత్రంబులచేఁ బరివేష్టింపఁబడునట్లు, ఉత్తమస్త్రీలచేఁ బరివేష్టింపఁబడియున్నవాని, రాక్షసులకుఁబ్రభువైనవాని, విశ్రవసునికుమారుని రావణునిం, జూచెను.

అని, తాత్పర్యము.

తం దదర్శ మహాతేజా స్తేజోవంతం మహాకపిః. ౨౯

టీక॥ మహాతేజాః = అధికమయిన కాంతిగల; మహాకపిః= పెద్దకోఁతియగు హనుమంతుండు; తేజోవంతం=అధికమయినకాంతిగల; తం=ఆరావణుని; దదర్శ=చూచెను.

మహాతేజుండగు, హనుమంతుం, డట్లు, అధికమయిన తేజస్సుగలరావణునిం జూచెను. అని, తాత్పర్యము.

రావణోఽయం మహాబాహు రితి సంచింత్య వానరః
అవప్లుతో మహాతేజా హనుమా న్మారుతాత్మజః. ౩౦

టీక॥ మహాతేజాః = అధికమయిన కాంతిగలవాఁడును; మారుతాత్మజః = వాయుదేవుని కుమారుండును; వానరః = కోఁతియునగు; హనుమాన్ = హనుమంతుఁడు; "మహాబాహుః = గొప్ప చేతులుగల; అయం = ఇతఁడు; రావణః = రావణుఁడు" ఇతి = అని; సంచింత్య = ఆలోచించి; అవప్లుతః = దిగినాఁడు.

మహాతేజుండును వాయుదేవునికుమారుండునగునాహనుమంతుండు, "మహాబాహుండగు నితండు రావణుండు" అని, తలంచి, యతనిచేష్టలన్నియుఁ జక్కఁగాఁజూచుటకై, క్రిందికొమ్మకు దిగెను. అని, తాత్పర్యము.

స తథా ప్యుగ్రతేజాస్స న్నిర్ధూత స్తస్య తేజసా
పత్రగుహ్యాంతరే సక్తో హనుమాన్ సంవృతో భవత్. ౩౧

టీక॥ సః = ఆ; హనుమాన్ = హనుమంతుఁడు; తథా = అట్లు; ఉగ్రతేజాస్సన్నపి = భయంకరమయిన కాంతిగలవాఁడయ్యును; తస్య = ఆరావణుని యొక్క; తేజసా = కాంతిచేత; నిర్ధూతః = తిరస్కరింపఁబడినవాఁడై; పత్రగుహ్యాంతరే = ఆకులచేగూఢమయినప్రదేశమందు; సక్తః = తగులుకొన్నవాఁడై; సంవృతః = కప్పఁబడినవాఁడు; అభవత్ = ఆయెను.

ఆహనుమంతుఁడు, భయంకరమగు తేజంబుగలవాఁడయ్యును, ఆరావణుని తేజంబునకు భయపడి, యాకులునిండియుండు ప్రదేశంబున నెవ్వరికినిగానరాకుండునట్లు నిలీనుండైయుండెను. అని, తాత్పర్యము.

స తా మసితకేశాంతాం సుశ్రోణీం సంహతస్తనీమ్
దిదృక్షు రసితాపాంగా ముపావర్తత రావణః. ౩౨

టీక॥ సః = ఆ; రావణః = రావణుఁడు; అసితకేశాంతాం = నల్లనివెండ్రుక

లకొనలుగలదియును; సుశ్రోణీం=సుందరములయినపిఱుదులు గలదియును; సంహతస్తనీం=ఇఱుకైన స్తనములు గలదియును; అసితాపాంగాం= నల్లనికడకన్నుగలదియునగు; తాం=ఆసీతను; విదృక్షుః = చూడఁగోరినవాఁడై; ఉపావర్తత=సమీపించెను.

ఆరావణుండు, నల్లనివెండ్రుకలకొనలునుసుందరంబులగుపిఱుందులునుగల్గి మిగులబలిసినవైన డుమ సందులేకుండుటచేఁ బరస్పరమునొరసికొనుచున్న స్తనంబులతోనల్లని కడకండ్లతోనొప్పుచున్నయాసీతంజూడఁగోరి, ఆబిడసమీపంబునకువచ్చెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, అష్టాదశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, సుందరకాండాష్టాదశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

ఏకోనవింశస్సర్గప్రారంభః.

తస్మిన్నేవ తతః కాలే రాజపుత్రీ త్వనిందితా
రూపయౌవనసంపన్నం భూషణోత్తమభూషితమ్. ౧
తతో దృష్ట్వైవ వైదేహీ రావణం రాక్షసాధిపమ్
ప్రావేపత వరారోహా ప్రవాతే కదలీ యథా. ౨

టీక॥ తతః=అటుపిమ్మట; తస్మిన్=ఆ; కాలఏవ=కాలమునందే; రాజపుత్రీ=రాచకొమార్తెయును; అనిందితా=నిందింపఁబడనిదియును, వరారోహా= గొప్పపిఱుందులుగలదియునగు; వైదేహీతు = సీతయును; రూపయౌవనసంపన్నం=సౌందర్యముతోనుయౌవనముతోనుగూడినవాఁడును; భూష

ణో త్తమభూషితం = సొమ్ములలో మేలయినవాని చేత నలంకరింపఁబడినవాఁడును; రాక్షసాధిపం = రాక్షసులకుఁ బ్రభుండగువాఁడునగు; రావణం = రావణుని; తతః = అప్పటనుండి; దృష్ట్వైవ = చూచినంతనె; ప్రవాతే = పెద్దగాలియందు; కదళీయథా = అరఁటిచెట్టుంబోలె; ప్రావేపత = వడఁకెను.

అంతనప్పుడు, రాచకొమార్తె యునుబరిశుద్ధయును గొప్పపిఱుఁదులు గలదియునగుసీత, సౌందర్యముతో యౌవనముతో నొప్పుచు శ్రేష్ఠ భూషణంబులతో నలంకరించుకొని వచ్చుచున్నవాని రాక్షసాధీశుండగు రావణుని, దూరంబుననుండియే చూచి, పెద్దగాలికిం దూలు నరఁటిచెట్టుకైవడి, భయంబున గడగడ వడంకెను. అని, తాత్పర్యము.

ఆచ్ఛాద్యోదర మూరుభ్యాం బాహుభ్యాంచ పయోధరౌ
ఉపవిష్టా విశాలాక్షీ రుదంతీ వరవర్ణినీ. ३

టీక॥ వరవర్ణినీ = ఉష్ణకాలమునందు సుఖశీతలమును శీతకాలమునందు సుఖోష్ణమునగునంగము గలిగి భర్తయందను రాగము గల స్త్రీయును; విశాలాక్షీ = పెద్దకండ్లు గలదియును; ఉదరం = కడుపును; ఊరుభ్యాం = తొడల చేత; పయోధరౌ = స్తనములను; బాహుభ్యాంచ = భుజముల చేతను; ఆచ్ఛాద్య = కప్పుకొని; రుదంతీ = ఏడ్చుచు; ఉపవిష్టా = కూర్చుండినది.

ఉష్ణకాలమున సుఖశీతలంబును శీతకాలంబున సుఖోష్ణంబునగు దేహంబు గలిగి భర్తయందను రాగము గలదై పెద్దకండ్లు గలిగియుండు సీతాదేవి, రావణుండు వచ్చుటం జూచినంతనె, భయంబునఁ, దొడలతోఁ గడుపును భుజంబులతో స్తనంబులను గప్పుకొని యేడ్చుచుఁ, గూర్చుండియుండినది. అని, తాత్పర్యము.

దశగ్రీవస్తు వైదేహీం రక్షితాం రాక్షసీగణైః
దదర్శ సీతాం దుఃఖార్తాం నావం సన్నామివార్ణవే. ४
అసంవృతాయా మాసీనాం ధరణ్యాం సంశితవ్రతామ్
ఛిన్నాం ప్రపతితాం భూమౌ శాఖామివ వనస్పతేః. ५

మలమండనచిత్రాంగీం మండనార్హా మమండితామ్
మృణాళీ పంకదిగ్ధేవ విభాతి న విభాతిచ. ౬

టీక॥దశగ్రీవస్తు=పదికంఠములుగల రావణుండును; రాక్షసీగణైః = రాక్షసస్త్రీలసమూహముల చేత ; రక్షితాం=కాపాడఁబడినదియును ; దుఃఖార్తాం=దుఃఖముచేఁబీడింపఁబడినదియును; అర్ణవే= సముద్రమునందు; సన్నాం=నశించిన , మునింగినయునుట; నావమివ (స్థితాం)= ఓడయుంబోలె నున్నదియును ; అసంవృతాయాం=ఆస్తరణములేని; ధరణ్యాం=భూమియందు; ఆసీనాం = కూర్చున్నదియును; సంశితవ్రతాం= మిక్కిలియుఁ దీక్ష్ణమయినవ్రతము గలదియును; ఛిన్నాం = నఱుకఁబడినదియు ; భూమౌ=నేలయందు; ప్రపతితాం= పడినదియునగు; వనస్పతేః = చెట్టుయొక్క;శాఖామివ (స్థితాం) = కొమ్మయుంబోలెనున్నదియును; మలమండనచిత్రాంగీం=మురికియను నలంకారముచేతఁ జిత్రవర్ణమయినదేహముగలదియును; మండనార్హాం= అలంకారమునకుఁదగినదియును; అమండితాం= అలంకరింపఁబడనిదియును ; యాం(అధ్యాహృతము)=ఎవ్వతె;పంకదిగ్ధా = బురదచేఁబూయఁబడిన; మృణాళీవ= తామరతూఁడుంబోలె; విభాతి= ప్రకాశించుచున్నదియు; నవిభాతిచ=ప్రకాశింపకున్నదియునో; తాం (అధ్యాహృతము)=అట్టిదియగు;వైదేహీం= విదేహదేశమునందుఁ బుట్టినదియునగు; తాం=ఆసీతను ;దదర్శ=చూచెను.

రాక్షసస్త్రీలచేరక్షింపఁబడినదై యతిదుఃఖంబునొందినదికావునసముద్రంబులోమునింగినయోడయుంబోలెఁ బూపట్టుచు, నతితీక్ష్ణంబగుపాతివ్రత్యవ్రతంబునవలంబించినదై, యాస్తరణంబులేని నేలపైఁగూర్చున్నదై , నఱుకఁగానేలంబడినచెట్టుకొమ్మయుం బోలెఁబూడనగుచు , మఱికిపేరుకొనియుండుటవలనఁజిత్రవర్ణంబుగా నుండుదేహముతోనొప్పుచు , నలంకారంబునకుఁదగినసౌందర్యంబు గలదయ్యును అలంకారముచేసికొనకున్నదికావున, బురదదగిలినతామరతూఁడుం బోలెఁబ్రకాశించునదియుఁబ్రకాశింపకున్నదియునైయున్నసీతాదేవిం,జూచెను.అని,తాత్పర్యము.

సమీపం రాజసింహస్య రామస్య విదితాత్మనః

సంకల్పహయసంయుక్తై ర్యాంతీమివ మనోరథైః. ౭
శుష్యంతీం రుదతీ మేకాం ధ్యానశోకపరాయణామ్
దుఃఖస్యాంత మపశ్యంతీం రామాం రామ మనువ్రతామ్. ౮
వేష్టమానాం తథా విష్టాం పన్నగేంద్రవధూ మివ
ధూప్యమానాం గ్రహేణేవ రోహిణీం ధూమకేతునా. ౯
వృత్తశీలకులే జాతా మాచారవతి ధార్మికే
పున స్సంస్కార మాపన్నాం జాతామివచ దుష్కులే. ౧౦
అభూతే నాపవాదేన కీర్తిం నిపతితా మివ
ఆమ్నాయానా మయోగేన విద్యాం ప్రశిథిలా మివ. ౧౧
సన్నా మివ మహాకీర్తిం శ్రద్ధామివ విమానితామ్
ప్రజ్ఞామివ పరిక్షీణా మాశాం ప్రతిహతామివ. ౧౨
ఆయతీ మివ విధ్వస్తా మాజ్ఞాం ప్రతిహతా మివ
దీప్తా మివ దిశం కాలే పూజా మపహృతా మివ. ౧౩
పద్మినీ మివ విధ్వస్తాం హతశూరాం చమూమివ
ప్రభామివ తమోధ్వస్తా ముపక్షీణా మివాపగామ్. ౧౪
వేదీ మివ పరామృష్టాం శాంతా మగ్నిశిఖా మివ
పౌర్ణమాసీ మివ నిశాం రాహుగ్రస్తేందుమండలామ్. ౧౫
ఉత్కృష్టపర్ణకమలాం విత్రాసితవిహంగమామ్
హస్తిహస్తపరామృష్టా మాకులాం పద్మినీ మివ. ౧౬
పతిశోకాతురాం శుష్కాం నదీం విస్రావితా మివ
పరయా మృజయా హీనాం కృష్ణపక్షనిశా మివ. ౧౭
సుకుమారీం సుజాతాంగీం రత్నగర్భగృహోచితామ్
తప్యమానా మివోష్ణేన మృణాలీ మచిరోద్ధృతామ్. ౧౮
గృహీతా మాళితాం స్తంభే యూథపేన వినాకృతామ్
నిశ్శ్వసంతీం సుదుఃఖార్తాం గజరాజవధూ మివ. ౧౯
ఏకయా దీర్ఘయా వేణ్యా శోభమానా మయత్నతః

నీలయా నీరదాపాయే వనరాజ్యా మహీ మివ. ౨౦
ఉపవాసేన శోకేన ధ్యానేనచ భయేనచ
పరిక్షీణాం కృశాం దీనా మల్పాహారాం తపోధనామ్. ౨౧
ఆయాచమానాం దుఃఖార్తాం ప్రాంజలిం దేవతా మివ
భావేన రఘుముఖ్యస్య దశగ్రీవపరాభవమ్. ౨౨

టీక॥సః(అధ్యాహృతము)= ఆరావణుఁడు; రాజసింహస్య=రాజశ్రేష్ఠుండును; విదితాత్మనః= తెలియఁబడినపరమాత్మ గలవాఁడునగు; రామస్య=రాముని యొక్క; సమీపం = సమీపమును గూర్చి; సంకల్పహయసంయుక్తైః= సంకల్పములను గుఱ్ఱములతోఁగూడిన; మనోరథైః = మనస్సనెడిరథములచేత; యాంతీమివ(స్థితాం)= పోవుచున్నట్లున్నదియును; శుష్యంతీం= ఎండుచున్నదియును; రుదంతీం=ఏడ్చుచున్నదియును; ఏకాం=ఒకతెగానున్నదియును, తోడు లేకున్నదియునుట; ధ్యానశోకపరాయణాం=ఆలోచనయు దుఃఖమును ముఖ్యమయిన గతిగాఁ గలదియును ; దుఃఖస్య = దుఃఖము యొక్క ; అంతం=తుదను; అపశ్యంతీం = చూడకున్నదియును ; రామాం = సుందరియును; రామం = రాముని; అనువ్రతాం= అనుసరించినవ్రతముగలదియును, పాతివ్రత్యముగలదియుననుట; ఆవిష్టాం=మణిమంత్రములచేబంధింపఁబడినదియును; తథా= అట్లు; వేష్టమానాం= చుట్టుకొను చున్నదియునగు; పన్నగేంద్రవధూమివ(స్థితాం)= సర్పశ్రేష్ఠము యొక్క స్త్రీవలెనున్నదియును, ఆఁడుసర్పమువలెనున్నదియుననుట; ధూమకేతునా = ధూమకేతువనెడు; గ్రహేణ = గ్రహము చేత; ధూప్యమానాం = తపింపఁ జేయఁబడుచున్న; రోహిణీమివ(స్థితాం)= రోహిణీనక్షత్రమువంటిదియును ; ఆచారవతి = మంచియాచారముగలదియును; ధార్మికే = ధర్మమునాచరించునదియునగు; వృత్తశీలకులే= దృఢమయిన సత్స్వభావంబుగలవంశమందు ; జాతాం=పుట్టినదియు; పునః= మఱల, సంస్కారం=వివాహమును; ఆపన్నాం= పొందినదియు; కావునసే, దుష్కులే= దుష్టకులమునందు; జాతాం= పుట్టినదియునగు ; స్త్రియం ( అధ్యాహృతము ) ఇవ (స్థితాం) చ = స్త్రీ

యుంబోలెనున్నదియును; అభూతేన= అసత్యమయిన; అపరాధేన = అపరాధముచేత; నిపతితాం=పడిన; కీర్తిమివ (స్థితాం)=కీర్తియుంబోలెనున్నదియును; ఆమ్నాయానాం = అభ్యాసములయొక్క; అయోగేన=కూడికలేకుండుటచేత; ప్రశిథిలాం=మఱపుగలిగిన; విద్యామివ (స్థితాం)= విద్యయుంబోలెనున్నదియును; సన్నాం = నాశమునొందిన; మహాకీర్తిమివ (స్థితాం) = గొప్పకీర్తియుంబోలెనున్నదియును; విమానితాం = అవమానింపఁబడిన; శ్రద్ధామివ (స్థితాం) = శ్రద్ధయుంబోలెనున్నదియును; పరిక్షీణాం = నశించిన; పూజామివ (స్థితాం)= పూజయుంబోలెనున్నదియును; ప్రతిహతాం=కొట్టఁబడిన; ఆశామివ (స్థితాం)= ఆశయుంబోలెనున్నదియును; విధ్వస్తాం = చెఱుపఁబడిన, కొంచెమయినదనుట; ఆయతీమివ(స్థితాం) = ధనలాభముంబోలెనున్నదియును; విహతాం=కొట్టఁబడిన, అనుష్ఠింపఁబడనిదైనదనుట; ఆజ్ఞామివ(స్థితాం)=ఆజ్ఞయుంబోలెనున్నదియును; కాలే = ఉత్పాతకాలమునందు; దీప్తాం = మండుచున్న; దిశమివ (స్థితాం) = దిక్కుంబోలెనున్నదియును; అపహృతాం = అపహరింపఁబడిన; పూజామివ (స్థితాం)=పూజాద్రవ్యంబుంబోలెనున్నదియును; విధ్వస్తాం= నశింపఁజేయఁబడిన; పద్మినీమివ (స్థితాం) = తామరతీఁగయుంబోలెనున్నదియును; హతశూరాం = చంపఁబడిన శూరులుగల; చమూమివ (స్థితాం)= సేనయుంబోలెనున్నదియును; తమోధ్వస్తాం=చీఁకటిచేనశింపఁజేయఁబడిన; ప్రభామివ(స్థితాం)=వెల్తురుంబోలెనున్నదియును; ఉపక్షీణాం= నీళ్లులేని; ఆపగామివ(స్థితాం) = నదియుంబోలెనున్నదియును; పరామృష్టాం=తాఁకఁబడిన; వేదీమివ(స్థితాం) అగ్నివేదికయుంబోలెనున్నదియును; శాంతాం=చల్లాఱిన; అగ్నిశిఖామివ (స్థితాం)= నిప్పుమంటయుంబోలెనున్నదియును; రాహుగ్రస్తేందుమండలాం =రాహువుచేమ్రింగఁబడినచంద్రమండలముగల; పౌర్ణమాసీం= పూర్ణిమయందలి; నిశామివ(స్థితాం)= రాత్రియుంబోలెనున్నదియును; హస్తిహస్తపరామృష్టాం = ఏనుఁగుతొండముచేఁగలఁచఁబడినదియు; ఉత్కృష్టపర్ణకమలాం = పెఱుకఁబడినఆకులును గమలంబులునుగలదియు; విత్రాసితవిహంగమాం = భయపఱుపఁబడి

నపక్షులుగలదియు; ఆకులాం=కలంత పడియున్నదియునగు ; పద్మినీమివ(స్థితాం)= తామరకొలనుంబోలెనున్నదియును;పతిశోకాతురాం=భర్తృదుఃఖముచేఁ బీడింపఁబడినదియును; విస్రావితాం = పాఱునట్లుచేయఁబడినదియు; శుష్కాం= ఎండినదియునగు;నదీమివ (స్థితాం)= నదియుంబోలెనున్నదియును;పరయా = ఉత్కృష్టమయిన;మృజయా = దేహసంస్కారముచే; హీనాం=విడువఁబడినదియును; కృష్ణపక్షనిశామివ(స్థితాం)=కృష్ణపక్షమునందలి రాత్రియుంబోలె నున్నదియును; సుకుమారీం = కోమలయయినదియును;సుజాతాంగీం=సుందరములయిన యవయవములుగలదియును;రత్నగర్భగృహోచితాం= మణులులోపలఁగలగృహంబునకుఁదగినదియును; అచిరోద్ధృతాం = అప్పుడెపెఱుకఁబడినదియు; ఉష్ణేన= వేడిమిచేత; తప్యమానాం=వాడఁజేయఁబడుచున్నదియునగు;మృణాళీమివ (స్థితాం)= తామరతూఁడుంబోలెనున్నదియును;గృహీతాం=పట్టుకొనఁబడినదియు; స్తంభే=స్తంభమునందు;ఆలితాం=కట్టఁబడినదియు; యూథపేన= ఏనుఁగులతెగను బాలించునట్టియేనుఁగుచేత, తెగకుముఖ్యమయినయేనుఁగుచే తననుట; వినాకృతాం=విడువఁబడునట్లుచేయఁబడినదియు; నిశ్శ్వసంతీం = నిట్టూర్పు...చున్నదియు; సుదుఃఖితాం= మిక్కిలియుదుఃఖముచేఁబీడింపఁబడినదియునగు; గజరాజవధూమివ (స్థితాం)= గజశ్రేష్ఠముయొక్కభార్యయగునాఁడేనుఁగుంబోలె నున్నదియును;ఏకయా = ఒకటియు ; దీర్ఘయా = పొడవైనదియునగు;వేణ్యా= వెంట్రుకలజడచేత;అయత్నతః=ప్రయత్నములేకనే;శోభమానాం=ప్రకాశించుచున్నదియును; నీరదాపాయే=శరదృతువునందు;నీలయా =నల్లని; వనరాజ్యా=వనపఙ్క్తిచేత;శోభమానాం(అధ్యాహృతము)=ప్రకాశించుచున్న; మహీమివ(స్థితాం)= భూమియుంబోలెనున్నదియును;ఉపవాసేన= ఉపవాసముచేతను;శోకేన = దుఃఖముచేతను; ధ్యానేనచ= పెనిమిటినిధ్యానించుటచేతను;భయేనచ=వెఱపుచేతను; పరిక్షీణాం=క్షీణించినదియును; కృశాం=కృశించినదియును;దీనాం=దైన్యమునొందినదియును;అల్పాహారాం= కొంచెమైనయాహారముగలయుత్తమస్త్రీయయినదియును;తపోధనాం = తపస్సేధనముగాఁగలదియును;దుఃఖార్తాం = దుఃఖముచేఁ బీడింపఁబడినదియును; ప్రాంజ

లిం=మంచిచే మోడ్పుగలదియును; ధ్యావేన; హృదయముచేత; రఘుముఖ్యస్య=రామునకు; దశగ్రీవపరాభవం=రావణునితిరస్కరించుటను; దేవతాం=దేవనిః అయాచమానామివ(స్థితాం)=ప్రార్థించుచున్నట్లున్నదియునగు; తాం(అధ్యాహృతము) = ఆసీతను; దదర్శ(అధ్యాహృతము)=చూచెను.

గుఱ్ఱంబులుంబోలె నతివేగంబులైన సంకల్పంబులచే మనంబున రాజశ్రేష్ఠుండును బరమాత్మవేత్తయునగు రాము సన్నిధానంబునకుం బోవుచున్నట్లున్నదై, యాహారంబులేమిం జేసి కృశించియున్నదై యేడ్చుచు నేకాకినియై యెల్లప్పుడు నుఆలోచించుచు దుఃఖంబునొంది, దుఃఖంబునకుం దుదిగానక, రాముసే మనంబున ధ్యానించుచు, మణిమంత్రాదులకుం గట్టుపడి నేలంబట్టుకొనియున్న యాండుసర్పముంబోలె, ధూమకేతుగ్రహంబుచే బాధింపంబడిన రోహిణీనక్షత్రంబు పగిదిం, బూషట్టుచు, సదాచారంబుగలదియు ధార్మికంబునగు కులంబునం బుట్టి దుష్కులంబునం బెండ్లియయినకన్యకైవడి, నసత్యాపవాదంబుచేంజెడిన కీర్తియుంబోలె, నాప్తిలేమింజేసి మఱపుదగిలిన విద్యభంగి, క్షీణించినమహాకీర్తిరీతి, నవమానింపంబడినవానికవమానించిన వానిపయినుండు శ్రద్ధలాగునం, బూజాద్రవ్యంబులులేని పూజవిధంబున, నిష్ఫలంబయిన యాశకైవడిం, జాలందగ్గి సఫలలాభంబుమార్గ, భృత్యులచే నాదరింపంబడనియాజ్ఞవిధంబున, నుత్పాతకాలంబున జ్వలించుచున్న దిక్కులాగున, దుష్టులచేంజెఱుపంబడిన పూజాసామగ్రియుంబోలె, మంచుచేంగాంతి విడిన తామరతీంగచార్పున, శూరులు చంపంబడిన వెనుకభయంబునం బఱచుసేనపోల్కిం, జీంకటిచేనగపడని వెలుగుపథంబున, నీళ్లులేని నదియుంబోలె, శూద్రాదులు తాంకిన యగ్నివేదిభాతిం, జల్లాఱినయగ్నిజ్వాలయుంబోలెం జంద్రుండు గ్రహణంబునొందంగాం గాంతిలేకుండున్న పున్నమనాంటిరేయుంబోలె, నేనుంగులు తుండంబులచేం బత్రంబులును గమలంబులునుం బెఱుకంగాం బక్షులు బెదరంగా నాకులంబైయుండు తామరకొలంకుంబోలె, గట్టుతెగినీళ్లన్నియుం బాఱంగా నెండిన నదియుంబోలెం, గృష్ణపక్షరాత్రి పగిది, భర్తృదుఃఖంబున దేహసంస్కారంబేమియుంజేసికొనకుంటంజేసి, కాంతిహీనయై, కోమలంబులును సుందరంబులునగు నవయవంబులతో నొప్పుచు మణిమయగృహంబుననుండందగినదయ్యును నేలంగూ

ర్పుండియుండుటం జేసి, యప్పుడే పెఱుకంబడి యెండకు వాడుచున్న తామరతూఁడుంబోలెఁ జూడనగుచు, నరణ్యంబున వేటకాండ్రు పట్టుకొని స్తంభంబునఁగట్టివేయఁగాఁ, బెనమిటినిం బాసి, నిట్టూర్పులు వుచ్చుచు దుఃఖంబునం బరితపించుచున్న యాఁడేనుంగుభంగిం జూపట్టుచు, సంస్కారంబు లేకుండుట వలననొకటిగా జడకట్టుకొనిన నిడుపైన వెండ్రుకలు గలిగినది కావున, శరదృతువునందు నల్లని వృక్షపఙ్క్తితోఁ గూడియుండు భూమియుంబోలె నొప్పుచు, నుపవాసంబునను దుఃఖంబునను జింతనంబునను భయంబునను క్షీణత నొంది కృశించి దైన్యంబు నొందియున్నదానిఁ, బాతివ్రత్యరూపంబగు తపస్సును గట్టిగా నవలంబించియున్నదానిఁ, గొంచెముగా భుజించుటయును సుత్తమస్త్రీ లక్షణంబు గలదాని, దుఃఖంబునం జేమోడ్పు ఘటించియుండుటం జేసి, మనంబున, రామునివలన రావణునకుఁ బరాభవంబు గలుగవలెనని, యిష్టదేవతం బ్రార్థించుచున్నట్లు చూపట్టుచున్న సీతాదేవిని, రావణుండు చూచెను.

అని, తాత్పర్యము.

సమీక్షమాణాం రుదతీ మనిందితాం
సుపక్ష్మతామ్రాయతశుక్లలోచనామ్
అనువ్రతాం రామ మతీవ మైథిలీమ్
ప్రలోభయామాస వధాయ రావణః. ౨౩

టీక॥ రావణః = రావణుఁడు; సమీక్షమాణాం = చూచుచున్నదియును; రుదతీం = ఏడ్చుచున్నదియును; అనిందితాం = నిందింపఁబడనిదియును; సుపక్ష్మతామ్రాయతశుక్లలోచనాం = సుందరమయిన ఱెప్పలు గలదియును ఎఱ్ఱనిదియును నిడుపులయినవియును తెల్లనివియును నగు కండ్లు గలదియును; రామం = రాముని; అతీవ = మిక్కిలియు; అనువ్రతాం = అనుసరించిన వ్రతములు గలదియునగు; మైథిలీం = సీతను; వధాయ = చావుకొఱకు; ప్రలోభయామాస = ఆసఁగొనఁజేసెను.

తనకు రక్షకుండెవ్వఁడైన నగపడునో యని నాల్గుప్రక్కలం జూచుచు రోదనంబు సేయుచున్నదియును అనిందిత




యును సుందరములయినఱెప్పలు గలిగికొనలనెట్టనై దీర్ఘములై సముముదెల్లఁగా నుండుకండ్లుగలదియు, నెల్లప్పుడును రామునందే మనసునుంచియుండునదియునగు నాసీతను, రావణుండు, మంచిమాటలచేఁదనపైనాసఁగొను నట్లుచేయనారంభించెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, ఏకోనవింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండైకోనవింశసర్గటీక,

ముగిసినది.

---

శ్రీ.

వింశసర్గ ప్రారంభః.

స తాం పతివ్రతాం దీనాం నిరానందాం తపస్వినీమ్
సాకారై ర్మధురై ర్వాక్యై ర్న్యదర్శయత రావణః. ౧

టీ॥ సః = ఆ; రావణః = రావణుఁడు; పతివ్రతాం; పతివ్రతయును; దీనాం = దైన్యమునొందినదియును; నిరానందాం = సంతోషములేనిదియును; తపస్వినీం = కనికరింపఁదగినదియునగు; తాం = ఆసీతను; సాకారైః = అభిప్రాయముతోఁగూడిన, మధురైః = మనోహరంబులగు; వాక్యైః = మాటలచేత; న్యదర్శయత = తెలియునట్లు చేసెను.

ఆ రావణుండు, దైన్యంబునొందిసంతోషంబులేకచూపరులకుఁ గనికరింపందగియుండు పతివ్రతయగు నాసీతకు, సాభిప్రాయంబులయిన యింపుమాటలతోఁ, దనయభిప్రాయంబుం దెలిపెను.

అని, తాత్పర్యము.




మాం దృష్ట్వా నాగనాసోరు గూహమానా స్తనోదరమ్
అదర్శన మివాత్మానం భయాన్నేతుం త్వ మిచ్ఛసి. ౨

టీక॥ నాగనాసోరు = ఏనుంగతొండము వంటితొడలుగలసీతా! త్వం = నీవు; మాం = నన్ను; దృష్ట్వా = చూచి; భయాత్ = భయంబువలన; స్తనోదరం = స్తనములనుగడుపును; గూహమానా = మూసికొనుచు; ఆత్మానం = దేహమును; అదర్శనం = కనుపడకుండుటను; నేతుం = పొందించుటకు; ఇచ్ఛసీవ = కోరుచున్నట్లున్నావు.

ఏనుంగుతొండములవంటి తొడలుగలసీతా! నీవునన్నుఁజూచి, భయంబున స్తనంబులనుగడుపునుమూసికొని, నీదేహంబునంతయు, నాకెంతమాత్రమగపడకుండునట్లుచేయఁగోరినట్లున్నావు.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— నేను నీకడుపునఁబుట్టినకొడుకువంటివాఁడను; నన్నుఁజూచి, నీవిట్లు స్తనోదరంబులమూసికొని నీదేహంబె నాకగపడకుండవలెనని కోరుచున్నావు; ఇదియుచితముకాదు.

అని, తాత్పర్యము.

కామయే త్వాం విశాలాక్షి బహుమన్యస్వ మాం ప్రియే
సర్వాంగగుణసంపన్నే సర్వలోకమనోహరే. ౩

టీక॥ విశాలాక్షి = పెద్దకన్నులుగలసీతా! త్వాం = నిన్ను; కామయే = వలచుచున్నాను. ప్రియే = నాకుసంతోషంబుగల్గించుదానవును; సర్వాంగగుణ సంపన్నే = సమస్తములయినయవయవముల శుభలక్షణములతోను గూడినదానవును; సర్వలోకమనోహరే = సమస్తలోకంబులకును మనోహరురాలవునగు సీతా! మాం = నన్ను; బహుమన్యస్వ = గౌరవింపుము.

సీతా! నీవువిశాలంబులగుకన్నులుగలదానవు, నాకుఁబ్రియురాలవు, శుభలక్షణములతోఁగూడినయవయవములుగలదానవు, లోకంబులకునుసంతోషంబుగల్గించుదానవు; నీరూపంబుఁజూచిమోహించియున్నాను; నన్నుబహుమానింపుము. అని, తాత్పర్యము.

రహస్యార్థము.— త్వాం = నిన్ను; కామయే = నాకీశ్వరివిగాఁగోరుచున్నాను. (శేషము, పై.)

నీవు నాకేశ్వరివై నన్నుద్ధరింపవలయునని కోరుచున్నాను; నన్ను బహుమానించి నామనవి యంగీకరింపుము. అని, తాత్పర్యము.

నేహ కేచి న్మనుష్యా వా రాక్షసాః కామరూపిణః
వ్యపసర్పతు తే సీతే భయం మత్తః సముత్థితమ్. ౪

టీక॥ ఇహ = ఇచ్చట ; మనుష్యా వా=మనుష్యులు గాని; కామరూపిణః= ఇచ్ఛాధీనంబగు రూపముగల , రాక్షసాః(వా)= రాక్షసులు గాని; కేచిత్= ఎవ్వరును; న=లేరు. సీతే=సీతా! మత్తః=నావలన ; సముత్థితం=పుట్టిన ; తే=నీయొక్క; భయం=భయము; వ్యపసర్పతు=విడువుగాక.

ఇచ్చట, మనుష్యులుగాని కామరూపులగు రాక్షసులుగాని నీకు భయంబు గల్గించువారలెవ్వరును లేరు; నేనో నీయెడ మోహంబుగలవాఁడను; కావున నీకు భయంబు వలదు, విడువుము.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— ఇచ్చట మనుష్యులుగాని రాక్షసులుగాని యెవ్వరును లేరు ; నేనును , యథార్థమున విచారించినచో, రాక్షసుండనుగాను మనుష్యుండనుగాను; అనాదిగా నీపాదముల సేవించువాఁడను; నాశరీరంబు మాత్రము భిన్నముగానున్నదిగాని మఱియే భేదమును లేదు; కావున , నీవు భయంబు విడువుము. అని, తాత్పర్యము.

స్వధర్మో రక్షసాం భీరు సర్వథైవ న సంశయః
గమనం వా పరస్త్రీణాం హరణం సంప్రమథ్య వా. ౫

టీక॥ భీరు= భయపడుస్వభావముగల సీతా! పరస్త్రీణాం = పరస్త్రీల యొక్క; గమనం వా= పొందుటగాని; సంప్రమథ్య= బలాత్కరించి; హరణం వా=కొనిపోవుటగాని, రక్షసాం=రాక్షసులకు ; సర్వథైవ= అన్నివిధంబులను; స్వధర్మః= కులధర్మము. సంశయః=సందేహము; న=లేదు.

భయపడుస్వభావముగలసీతా! నాకుం బరస్త్రీగమనమున దోషంబు గల్గునని తలంపవలదు ; పరస్త్రీలతో రమించుటగాని, బలాత్కారముగా వారల నప

హరించుటగాని, రాక్షసులకు కులధర్మము; ఇందుకు సందేహములేదు; కావున గులధర్మము జేసినచో నెంతమాత్రము దోషము లేకుండుట మాత్రమె కాదు; పుణ్యంబును గలుగును.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— పరస్త్రీల గోబోపుటయువారల నపహరించుటయు రాక్షసులకు స్వధర్మమె; అయినను, నేనట్టివాఁడను గాను; నాశరీరంబు మాత్రము రాక్షసశరీరము గాని నేను మొదటినుండి నీకు సేవ చేయుచుండినవాఁడను; కావున నాకట్టిస్వభావంబుండదు.

అని, తాత్పర్యము.

ఏవం చైత దకామాంతు న త్వాం స్ప్రక్ష్యామి మైథిలి
కామం కామ శ్శరీరే మే యథాకామం ప్రవర్తతామ్. ౬

టీక॥ మైథిలి=సీతా! ఏతచ్చ=ఇదియు; ఏవం=ఇట్లు. అకామాం = కామములేని; త్వాంతు=నిన్నుమాత్రము; నస్ప్రక్ష్యామి = తాఁకను; తవ (అధ్యాహృతము)=నీయొక్క; కామః = మోహము; మే= నాయొక్క శరీరే= దేహమందు ; కామం=మిక్కిలియును; యథాకామం=యథేచ్ఛగా ; ప్రవర్తతాం=ప్రవర్తించుఁగాక.

ఈవిషయమిట్లున్నది; ఐనను, నీవు నాయందువలపులేకున్నావు, కావున, నిన్ను మాత్రము నేను తాఁకను ; అందువలన యథేచ్ఛగా నాదేహంబున గామంబు నుంచి, నన్నుఁగాపాడుము.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— ఏతచ్చ; ఏవం. అకామాం, అ =విష్ణుదేవునియందు, కామాం=వలపుగల; త్వాం=నిన్ను; నస్ప్రక్ష్యామితు=తాఁకుటయే లేదు. కామః=మన్మథుఁడు; మే=నాయొక్క; శరీరే=దేహమందు; యథాకామం=యథేచ్ఛగా; ప్రవర్తతాం కామం=ప్రవర్తింపనిమ్ము.

ఈవిషయంబిట్లుండఁగా, నీవు, విష్ణుపత్నివి, కావున, నీయాజ్ఞ లేకనిన్నుఁ దాఁకనుంజాలను, అట్లగుటంజేసి, నీవు నన్నుభక్తునిఁగాఁజేకొని, నిన్నుఁ బూజించునట్లునాకనుజ్ఞయిమ్ము; మన్మథుండు, నాశరీరంబునందుఁ బ్రవర్తించి యేమిచేసినను, నామనసుపరిశుద్ధంబై యున్నది కావున, నామనసునకు వైకల్యముగలుగదు; నీవుభయపడవలదు.

అని, తాత్పర్యము.

దేవి నేహ భయం కార్యం మయి విశ్వసిహి ప్రియే
ప్రణయస్వచ తత్త్వేన మైవం భూః శోకలాలసా. ౭

టీక॥ దేవి=సీతాదేవీ ! ఇహ=ఇచ్చట; భయం=భయము ; కార్యం=చేయఁదగినది; న=కాదు ప్రియే=ప్రియురాలా!మయి=నాయందు; విశ్వసిహి=నమ్మకంబుంచుము.తత్త్వేన=యాథార్థ్యముచేత; ప్రణయస్వచ=స్నేహమునుంచుము. ఏవం=ఇట్లు ; శోకలాలసా=దుఃఖముచేఁ జపలురాలవై; మాభూః= ఉండకుము.

నాకుఁబ్రియురాలవగు సీతాదేవీ! ఇచ్చటభయంపడవలదు; నన్ను నమ్ముము; యథార్థముగా నాయందుస్నేహంబుంచుము;ఇట్లుదుఃఖింపు చుండకుము. అని, తాత్పర్యము.

రహస్యార్థము.—దేవి=తల్లీ!ప్రణయస్వ=అనుగ్రహంబుంచుము. (శేషము పై).

తల్లి వగుసీతా! నీకుభక్తుండ భృత్యుండనగునేనుండఁగా నిచ్చట నీవేల భయముపడెదవు?భయపడకుము;నన్ను నమ్ముము; నాయందనుగ్రహం బుంచుము;ఇట్లుదుఃఖింపుచుండవలదు.

అని, తాత్పర్యము.

ఏకవేణీ ధరాశయ్యా ధ్యానం మలిన మంబరమ్
అస్థానే ప్యుపవాసశ్చ నైతాన్యౌపయికాని తే. ౮

టీక॥ ఏకవేణీ=ఒకజడయును ; ధరాశయ్యా=భూమియందుఁబరుండుటయును; ధ్యానం=చింతయును; మలినం=మురికియయిన; అంబరం = వస్త్రమును ; అస్థానేపి=అసమయమునందును; ఉపవాసశ్చ= ఉపవాసమును; ఏతాని=ఇవి; తే=నీకు;నౌపయికాని=సరికావు.

తలదువ్వుకొనక యొకజడగా వెంట్రుకలముడి వేసికొనియుండుట, నేలంబరుండుట,మురికివస్త్రముగట్టుకొనుట, యసమయంబునందునుపవాసంబుండుట, ఇవన్నియునీకుఁదగినవికావు ; కావున,దీనివిడువుము.

అని, తాత్పర్యము.

విచిత్రాణి చ మాల్యాని చందనా న్యగరూణిచ
వివిధానిచ వాసాంసి దివ్యాన్యాభరణానిచ. ౯
మహార్హాణిచ పానాని శయనా న్యాసనాని చ
గీతం నృత్తంచ వాద్యంచ లభ మాం ప్రాప్య మైథిలి. ౧౦

టీక॥ మైథిలి=సీతా! త్వం (అధ్యాహృతము)=నీవు; మాం=నన్ను; ప్రాప్య=పొంది; విచిత్రాణి= నానావిధము లయిన; మాల్యానిచ= పుష్పమాలికలను; చందనాని= చందనంబులను ; అగరూణిచ=అగరుగంధములను; వివిధానిచ=నానావిధములయిన; వాసాంసిచ= వస్త్రములను; దివ్యాని = శ్రేష్ఠములయిన; ఆభరణానిచ=సొమ్ములను ; మహార్హాణి = శ్రేష్ఠములయిన ; పానానిచ= మద్యములను ; శయనాని= పాన్పులను ; ఆసనానిచ = పీఠంబులను; గీతం=పాటను; నృత్తం = ఆటను; వాద్యంచ = వాద్యమును; లభ=(లభస్వ)=పొందుము.

సీతా! నీవు నన్నుం గూడి, నానావిధంబులగు పుష్పమాలికలనుజందనగంధములనుఅగరుగంధములను బలువిధంబులయినవస్త్రంబులనుదివ్యంబులయినయాభరణంబులనుధరించి, శ్రేష్ఠంబులగు మద్యంబులంగ్రోలుచు, నుత్తమంబులయినశయనంబులను ఆసనంబులను సుఖంబుగాఁ బరుండివిహరించుచు , నాటపాటలను వాద్యంబులనుం బ్రొద్దువుచ్చుచు సుఖంబుగానుండుము. అని, తాత్పర్యము.

రహస్యార్థము.—మాం=నన్ను; ప్రాప్య=భృత్యునిగాఁబొంది. శేషము పై.

నీవునన్నుభృత్యునిగాఁ జేకొని, సుఖంబుగానుండుము. అని, తాత్పర్యము.

స్త్రీరత్న మసి మైవం భూః కురు గాత్రేషు భూషణమ్
మాం ప్రాప్య హి కథం నుస్యా స్త్వ మనర్హా సువిగ్రహే. ౧౧

టీక॥ త్వం(అధ్యాహృతము) = నీవు; స్త్రీరత్నం = స్త్రీలలోశ్రేష్ఠవైనదానవు; అసి=అగుచున్నావు; ఏవం= ఇట్లు ; మాభూః=ఉండకుము. గాత్రేషు=అవయవములందు; భూషణం = అలంకారమును; కురు=చేయుము. సువి

గ్రహే = మంచిరూపముగలసీతా ! త్వం=నీవు; మాం = నన్ను ; ప్రాప్య హి=పొందియును; భూషణానాం (అధ్యాహృతము) = సొమ్ములకు ; అనర్హా=తగనిదానవు;కథన్ను = ఎట్లు; స్యాః=అగుదువు?

మంచి రూపముగలసీతా! నీవు స్త్రీలందఱిలోను త్తమురాలవు; ఇట్లుండకుము; సొమ్ములు పెట్టుకొనుము; నన్నుఁ బొందియును నీవు సొమ్ములులేని దానవెట్లుకావచ్చును? ఎంతమాత్రమట్లు కాఁగూడదు. అని, తాత్పర్యము.

రహస్యార్థము.— నేను నీకుభృత్యుండనై యుండఁగా, నీవు సొమ్ములులేని దానవెట్లుకావచ్చును?

అట్లుకాఁగూడదు.

అని, తాత్పర్యము. శేషము. పై.

ఇదం తే చారు సంజాతం యౌవనం వ్యతివర్తతే
య దతీతం పున ర్నైతి స్రోత శ్శీఘ్ర మపామివ.౧౨

టీక॥చారు=సుందరముగా; సంజాతం=పుట్టిన;ఇదం=ఈ; తే=నీయొక్క; యౌవనం=యౌవనము;వ్యతివర్తతే= అతిక్రమించుచున్నది. యత్ =ఏది ; అతీతం=కడచినదో; తత్ (అధ్యాహృతము)=అది; అపాం = నీళ్లయొక్క; శీఘ్రం=వడిగల; స్రోతఇవ= ప్రవాహమువలె; పునః=మఱల; నైతి=రాదు.

మనోహరంబుగాఁ బొడమియుండునీయౌవనంబు వ్యర్థమైపోవుచున్నది; పాఱిపోయిననీళ్లుమఱలరానట్లుకడచినయౌవనముమఱల రాదు;కావున,నుపేక్షింపక, భోగంబులననుభవింపుము.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— తే = నీయొక్క;భృత్యస్యమమ = (అధ్యాహృతము)భృత్యుండనైననాయొక్క; శేషము పై.

నీభృత్యుండనగునాయౌవనకాలము వ్యర్థముగాఁబోవుచున్నది; పాఱిపోయిననీళ్లుమఱలరానట్లు, గడచినయౌవనంబుమఱలరాదు; యౌవనంబునందె దార్ఢ్యంబుండును; యౌవనం బతిక్రమించినపిదపనీకుఁ బూజసేయుటకు నేనుశక్తుండఁగాఁజాలను; కావుననిన్నుఁ బూజించుటకిప్పుడేయనుజ్ఞనిమ్ము.

అని, తాత్పర్యము.

త్వాం కృత్వో పరతో మన్యే రూపకర్తా స విశ్వసృక్
నహి రూపోపమా త్వన్యా తవాస్తి శుభదర్శనే. ౧౩

టీక॥ రూపకర్తా = రూపములు చేయునట్టి; సః=ఆ ; విశ్వసృక్=ప్రపంచంబు సృజించు బ్రహ్మదేవుఁడు ; త్వాం=నిన్ను;కృత్వా=చేసి;ఉపరతః=ఉడిగినాఁడు. మన్యే=తలఁచెదను. శుభదర్శనే = సుందరంబులగుకన్నులుగలసీతా! అన్యా = మఱియొక్కతె ; తవతు=నీకుమాత్రము;రూపోపమా = సౌందర్యముచేఁబోలికగలది; నహి= లేదుగదా!

సుందరంబులగుకన్నులుగలసీతా! ప్రపంచమందెచ్చటను,నీవంటి రూపముగలదిమఱియొకతె లేదుకావున,రూపంబులుసేయునాబ్రహ్మదేవుఁడు, నిన్ను నిర్మించి,యంతశ్రమంబునంబనిచాలించుకొనెను;అనితలంచెదను.

అని, తాత్పర్యము.

త్వాం సమాసాద్య వైదేహి రూపయౌవనశాలినీమ్
కః పుమా నతివర్తేత సాక్షాదపి పితామహః. ౧౪

టీక॥ వైదేహి=సీతా!రూపయౌవనశాలినీం=సౌందర్యముచేతనుయౌవనముచేతనుప్రకాశించునట్టి; త్వాం=నిన్ను; సమాసాద్య=పొంది; సాక్షాత్ పితామహోపి= సాక్షాద్బ్రహ్మదేవుఁడైనను; కః=ఏ;పుమాన్= పురుషుఁడు ; అతివర్తేత=అతిక్రమించును?

సీతా!సరిలేనిసౌందర్యంబును యౌవనంబునుంగలనిన్నుఁజూచిబ్రహ్మదేవుండైనను మోహించును ; ఇతరులు మోహింతురని చెప్పనేల?

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— సాక్షాల్లక్ష్మీదేవివగునిన్నుఁజూచునేని,బ్రహ్మదేవుండైననునిన్నుఁబూజింప కుండఁడు; ఇంకనితరపురుషులనుగుఱించిచెప్పనేల?

అని, తాత్పర్యము.

యద్య త్పశ్యామి తే గాత్రం శీతాంశుసదృశాననే
తస్మిం స్తస్మిన్ పృథుశ్రోణి చక్షు ర్మమ నిబధ్యతే. ౧౫

టీక॥పృథుశ్రోణి= పెద్దపిఱుందులు గల; శీతాంశుసదృశాననే = చంద్రునితో సమానమయిన ముఖముగలసీతా! తే=నీయొక్క-; యద్యత్ = ఏయే; గాత్రం=అవయవమును; పశ్యామి = చూచుచున్నానో; తస్మింస్తస్మిన్=ఆయా యవయవమునందు; మమ = నాయొక్క-; చక్షుః=కన్ను; నిబధ్యతే= కట్టంబడుచున్నది.

పెద్దపిఱుందులుగల దానవును జంద్రునింబోలు ముఖంబుగలదానవునగుసీతా! నేనునీయవయవంబులలో దేనింజూచినను మఱలనాకంటిని, అచ్చటనుండి మఱలింపలేకున్నాను.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— నాకన్నులుభక్తిచేచ్చగుచున్నది, కావున, శీఘ్రంబుగాం బూజింపననుజ్ఞయొసంగుము.

అని, తాత్పర్యము.

భవ మైథిలి భార్యా మే మోహ మేనం విసర్జయ

టీక॥మైథిలి=సీతా! మే=నాకు; భార్యా=భార్యవు; భవ= అగుము. ఏనం= ఈ; మోహం = అజ్ఞానమును; విసర్జయ=విడువుము.

సీతా! నాకుభార్యవగుము; నేనితరపురుషుండనునజ్ఞానంబునువదలుము.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.—మైథిలి = సీతా! మే = నాకొఱకు; భార్యా. భా= కాంతిచేత, ఆర్యా=పూజ్యురాలవు; భవ=అగుము. శేషము. పై.

సీతా! నేనిప్పుడు నిన్నుంబూజింపవలయును గావున, నిట్లు అలంకారంబులేకుండక, చక్క-గా నలంకరించుకొనికాంతివహించి యుండుము; నన్నుశత్రువనితలంచియున్నావె; ఈయజ్ఞానంబువిడువుము. అని, తాత్పర్యము.

బహ్వీనా ముత్తమస్త్రీణా మాహృతానా మితస్తతః. ౧౬
సర్వాసామేవ భద్రం తే మమాగ్రమహిషీ భవ

టీక॥తే=నీకు; భద్రం = మంగళము; అస్తు (అధ్యాహృతము)=అగుం

గాక. ఇతస్తతః=ఇచ్చటనుండి యచ్చటనుండి; ఆహృతానాం=తేఁబడిన, బహ్వీనాం = అనేకలయిన ; ఉత్తమస్త్రీణాం=శ్రేష్ఠస్త్రీలకు; సర్వాసామేవ=అందఱకునే; మమ= నాయొక్క ; అగ్రమహిషీ=పెద్దభార్యవు ; భవ= అగుము.

నీకుమంగళమగుఁగాక; నేనునానాస్థలంబులనుండి తెచ్చినయుత్తమస్త్రీలు పెక్కుమందియున్నారు; వారలందఱికన్న నీవు నాకగ్రభార్యవుగా నుండుము. అని, తాత్పర్యము.

రహస్యార్థము.—ఇతస్తతః, బహ్వీనాం; ఉత్తమస్త్రీణాం; సర్వాసామేవ; మమ=నాకును; అగ్రమహిషీ= పెద్దభార్య; యా = (అధ్యాహృతము)=ఎవ్వతో; తస్యాశ్చ= (అధ్యాహృతము)=ఆమందోదరికిని; భవ= ఈశ్వరివగుము.

నేను నానాస్థలములందుఁ దెచ్చియున్న పెక్కుమంది యుత్తమస్త్రీలకందఱికిని నాయగ్రభార్యయగు మందోదరికిని నాకును, ఈశ్వరివై, యుండుము. అని, తాత్పర్యము.

లోకేభ్యో యాని రత్నాని సంప్రమథ్యాహృతాని వై. ౧౭
తాని మే భీరు సర్వాణి రాజ్యం చైత దహంచ తే

టీక॥ భీరు= భయపడుస్వభావముగలసీతా! యాని=ఏ; రత్నాని=మణులు; లోకేభ్యః=లోకంబులనుండి; సంప్రమథ్య=బలాత్కరించి; ఆహృతాని = తేఁబడినవో ("వై" అనునది పాదపూరణార్థము;) తాని = ఆమణులు; సర్వాణి=అన్నియును; మే=నాయొక్క ; ఏతత్=ఈ; రాజ్యంచ=రాజ్యమును ; అహంచ=నేనును; తే=నీది.

భయపడు స్వభావముగల సీతా! నేనునానాలోకంబులనుండి బలాత్కారముగాఁ దెచ్చినమణులన్నియునారాజ్యంబును నీకిచ్చినాను; నేనును నీకు భృత్యుండనైతిని. అని, తాత్పర్యము.

రహస్యార్థము.—రత్నంబులను రాజ్యంబునిచ్చినాననుటచేఁదనవాని నన్నింటిని రావణుండుసీతకు సమర్పించెను. నేనునీకుభృత్యుండనైతిననుటచేఁదన్నును సమర్పించుకొనెను. అని, తెలియునది.

విజిత్య పృథివీం సర్వాం నానానగరమాలినీమ్. ౧౮

జనకాయ ప్రదాస్యామి తవ హేతోర్విలాసిని

టీక॥ విలాసిని = సీతా! తవహేతోః=నీకుఁగా; నానానగరమాలినీం= నానావిధములయిన పట్టణములపఙ్క్తిగల; పృథివీం=భూమిని; సర్వాం=అంతను; విజిత్య = జయించి; జనకాయ= జనకమహారాజుకొఱకు; ప్రదాస్యామి=ఇచ్చెదను.

సీతా! నీకుఁగా , నేను, నానావిధపట్టణంబులతోఁ గూడియున్న భూమినంతయుజయించి, జనకమహారాజునకిచ్చెదను. అని, తాత్పర్యము.

నేహ పశ్యామి లోకేన్యం యో మే ప్రతిబలో భవేత్. ౧౯

టీక॥ యః=ఎవ్వఁడు; మే=నాకు ; ప్రతిబలః=ఎదురు; భవేత్=అగునో ; తం(అధ్యాహృతము)=అట్టి; అన్యం=మఱియొకని; ఇహ=ఈ; లోకే=లోకమునందు;నపశ్యామి=చూడలేదు.

నాకెదురుగానిలిచినాతో యుద్ధముసేయువాఁడు, ఇదివఱకీలోకంబుననాకగపడలేదు. అని, తాత్పర్యము.

పశ్య మే సుమహద్వీర్య మప్రతిద్వంద్వ మాహవే

టీక॥ ఆహవే = యుద్ధమునందు; అప్రతిద్వంద్వం=ఎదురులేని ; సుమహత్ =మిక్కిలియునధికమయిన; మమ = నాయొక్క; వీర్యం=పరాక్రమమును ; పశ్య=చూడుము.

యుద్ధమునందు నాకెవ్వరైన నెదురువత్తురో , నాపరాక్రమంబెట్లుండునో, చూడుము. అని, తాత్పర్యము.

అసకృత్సంయుగే భగ్నా మయా విమృదితధ్వజాః. ౨౦
అశక్తాః ప్రత్యనీకేషు స్థాతుం మమ సురాసురాః

టీక॥మమ=నాయొక్క; ప్రత్యనీకేషు=శత్రువులయందు; సురాసురాః=దేవతలునుఅసురులును;అసకృత్=పలుమాఱు;సంయుగే=యుద్ధమునందు; భ

గ్నాః=అపజయమునొందినవారలై; మయా=నాచేత; విమృదితధ్వజాః= విఱువఁబడిన పెకెక్కములుగలవారలై; స్థాతుం=నిలుచుటకు; అశక్తాః=చాలరైరి.

నాశత్రువులలో, దేవతలునసురులును, నాతో యుద్ధముచేసి, పలుమాఱు, అపజయమునొంది, నాచేఁ ఱువఁబడిన టెక్కెములతో నాయెదుట నిలువలేక పాఱిపోయిరి; ఇంకనితరులగతి చెప్పనేల? అని, తాత్పర్యము.

ఇచ్ఛ మాం క్రియతా మద్య ప్రతికర్మ తవో త్తమమ్. ౨౧

టీక॥ మాం = నన్ను; ఇచ్ఛ=కోరుము. అద్య = ఇప్పుడు; తవ=నీకు; ఉత్తమం=శ్రేష్ఠమయిన; ప్రతికర్మ=అలంకారము; క్రియతాం = చేయఁబడుఁగాక.

నాయందు మోహంబుసేయుము; ఇప్పుడు, చక్కఁగా నలంకరించుకొనుము. అని, తాత్పర్యము.

రహస్యార్థము.—మాం= లక్ష్మిని, సంపదననుట; ఇచ్ఛ=కోరుము. శేషము. పై.

నీవు, నాసంపదయందిచ్ఛయుంచి, దానినంతయుఁజేకొని, చక్కఁగానలంకరించికొనుము; అటుపిమ్మటనిన్నుఁబూజించెదను. అని, తాత్పర్యము.

సప్రభా ణ్యవసజ్యంతాం తవాంగే భూషణానిచ

టీక॥ తవ=నీయొక్క; అంగే=దేహమునందు; సప్రభాణి=కాంతితోఁగూడిన; భూషణానిచ=సొమ్ములును; అవసజ్యంతాం=ఉంచఁబడుఁగాక.

నీదేహంబంతయుఁ, గాంతిచే వెలుంగుచుండు నాభరణంబులం బెట్టుకొనుము. అని, తాత్పర్యము.

సాధు పశ్యామి తే రూపం సంయుక్తం ప్రతికర్మణా. ౨౨

టీక॥ ప్రతికర్మణా = అలంకారముతోఁ; సంయుక్తం=కూడిన ; తే=నీయొక్క ; రూపం=రూపమును; సాధు=చక్కఁగా; పశ్యామి=చూచెదను.



నీవుచక్కఁగా నలంకరించుకొనియుండఁగా నీరూపంబును జూడవలయు నని యున్నాను. అని, తాత్పర్యము.

ప్రతికర్మాభిసంయుక్తా దాక్షిణ్యేన వరాననే
భుఙ్క్ష్వ భోగా న్యథా కామం పిబ భీరు రమస్వ చ. ౨౩

టీక॥ వరాననే=శ్రేష్ఠమయిన ముఖముగలదానా! దాక్షిణ్యేన= సరళత్వముచేత; ప్రతికర్మాభిసంయుక్తా=అలంకారముతోఁగూడినదానవై; యథాకామం=యథేచ్ఛగా; భోగాన్=భోగములను; భుఙ్క్ష్వ=అనుభవింపుము. పిబ=త్రాఁగుము. రమస్వచ= క్రీడింపుము.

సుందరమయినముఖముగల సీతా! నీవుసరళంబుగా నలంకరించుకొని యథేచ్ఛగాభోగంబుల ననుభవింపుము, మద్యంబులంగ్రోలుము; క్రీడింపుము. అని, తాత్పర్యము.

యథేష్టంచ ప్రయచ్ఛ త్వం పృథివీంవా ధనానిచ

టీ॥ త్వం=నీవు; యథేష్టం=యథేచ్ఛగా; పృథివీంవా=భూమినిగాని; ధనానిచ=ధనంబులనుగాని; ప్రయచ్ఛ=ఇమ్ము.

నీవు, నీకుఁ గావలసినవారలకు, యథేష్టముగా, భూమినిగాని, ధనములనుగాని, యిచ్చుకొనుము. అని, తాత్పర్యము.

లలస్వ మయి విస్రబ్ధా ధృష్ట మాజ్ఞాపయస్వచ. ౨౪

టీక॥ మయి=నాయందు; విస్రబ్ధా=నమ్మకంబుంచినదానవై; లలస్వ= రమింపుము. ధృష్టం=ధైర్యముగా; ఆజ్ఞాపయస్వచ=ఆజ్ఞాపింపుము.

నాయందునమ్మకంబుంచి, నిర్భయముగ యథేష్టముగాఁగ్రీడింపుము; భయపడకనీకుఁగావలసినకార్యము లందున న్నాజ్ఞాపింపుము. అని, తాత్పర్యము.

మత్ప్రసాదా ల్లలంత్యాశ్చ లలంతాం బాంధవా స్తవ





టీక॥ తవ (అధ్యాహృతము)=నీవు; మత్ప్రసాదాత్=నాయనుగ్రహంబువలన; లలంత్యాః=రమింపుచుండఁగా; తవ=నీయొక్క; బాంధవాశ్చ=బంధువులును; లలంతాం=రమింతురుగాక.

నీవు, నాయనుగ్రహంబున, సంతోషంబనుభవింపుచుండుటంజూచి, నీబంధువులును సంతోషంబుననుందురు.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— మత్ప్రసాదాత్= నాయందలియనుగ్రహమువలన; తవ=నీవు; లలంత్యాః=సంతోషింపుచుండగా; మమ (అధ్యాహృతము)= నాయొక్క; బాంధవాశ్చ= బంధువులును; లలంతాం= సంతోషింతురుగాక.

నాయందుండు ననుగ్రహంబుననీవు సంతోషంబున నుండఁగా, నాబంధువులందఱునునీయట్టి పరదేవతంబూజింపఁగల్గెననిసంతోషంబునొందుదురు.

అని, తాత్పర్యము.

బుద్ధిం మమాఽనుపశ్య త్వం శ్రియం భద్రే యశశ్చ మే. ౨౪

టీక॥ భద్రే= మంగళస్వరూపిణివగుసీతా! త్వం=నీవు; మమ=నాయొక్క; బుద్ధిం= సమృద్ధిని; శ్రియం = లక్ష్మిని; మే=నాయొక్క; యశశ్చ=కీర్తిని; అనుపశ్య=చూడుము.

మంగళ స్వరూపిణివగుసీతా! నీవు నాసమృద్ధినిసంపదనుగీర్తినింజూడుము.

అని, తాత్పర్యము.

కిం కరిష్యసి రామేణ సుభగే చీరవాససా

టీక॥ సుభగే = సుందరివగుసీతా! చీరవాససా = నారచీరలు వస్త్రము గాఁగల; రామేణ=రామునితో; కిం= ఏమి; కరిష్యసి=చేసెదవు?

నీవుసుందరివి; నారచీరలు గట్టుకొనియరణ్యంబుననుండు రామునితో నీకేమిప్రయోజనము? అని, తాత్పర్యము.

రహస్యార్థము.— సుభగే; అచీరవాససా=నారచీరగానిది వస్త్రముగాఁగల, పీతాంబరము వస్త్రము గాఁగలయననుట; రామేణ = రామునితో; కింకరిష్యసి=ఏమిచేసెదవు?

భృత్యుండను నేను, సమస్తసేవలు చేయుటకుండగా, నిప్పుడుపీతాంబరధరుండగు రాముండు నీకేమి చేయవలెను? అని, తాత్పర్యము.

నిక్షిప్తవిజయో రామో గతశ్రీ ర్వనగోచరః. ౨౬
వ్రతీ స్థండిలశాయీచ శంకే జీవతివా నవా

టీక॥ నిక్షిప్తవిజయః=విడువఁబడినజయముగలవాఁడును; గతశ్రీః = పోయినసంపద గలవాఁడును; వనగోచరః = వనంబుననగపడు వాఁడును, వనంబున నుండువాఁడు ననుట; వ్రతీ= వానప్రస్థ వ్రతముగలవాఁడును; స్థండిలశాయీచ = నేలంబరుండువాఁడునగు; రామః = రాముఁడు; జీవతివా=బ్రతికియున్నాఁడో; నవా=లేదో; శంకే=సందేహించుచున్నాను.

జయంబులేనివాఁడై, సంపదనువిడిచియరణ్యంబుననివసించుచు, వానప్రస్థవ్రతంబునవలంబించి, నేలంబరుండుచున్నరాముండింకనుబ్రతికియున్నాఁడో, లేదో, అనినాకుసందేహముగా నున్నది. అని, తాత్పర్యము.

రహస్యార్థము.—నిక్షిప్తవిజయః=విడువఁబడినజయించుటగలవాఁడు, అందఱినిజయించినవాఁడూరకుండునట్లు స్వతస్సిద్ధంబగు జయముగలవాఁడు కావున నూరకున్న వాఁడు ననుట; గతశ్రీః = పొందినలక్ష్మి గలవాఁడును, లక్ష్మీపతియనుట; వనగోచరః=నీళ్లయందుండినవాఁడును, నారాయణుండనుట "ఆపోనారాఇతిప్రోక్తా ఆపోవైనరసూనవః, తాయదస్యాయనంపూర్వం తేననారాయణస్స్మృతః" నరుండనఁగా, ఆత్మ, జలములయాత్మవలనఁగలిగినవి కావుననారములనంబడీనవి; ఆజలములు ముందితనికి స్థానముగానుండినవికావుననితండు నారాయణుండనంబడెను.) వ్రతీ= పితృవాక్యంబునవ్రతంబుగలవాడును; స్థండిలశాయీ= నేలంబరుండువాఁడునగు; రామః = రాముండు; మయి(అధ్యాహృతము)= నేను; జీవతి=బ్రతికియుండఁగా; ఆగచ్ఛతి (అధ్యాహృతము) వా= వచ్చునో; నవా=రాఁడో; శంకే = సందేహించెదను.

రాముండు, స్వతస్సిద్ధమగుజయంబుగలవాఁడు, లక్ష్మీపతి, సాక్షాన్నారాయణుండు, తండ్రియాజ్ఞచేవానప్రస్థ వ్రతంబవలంబించి, నేలంబరుండుచున్నాఁడు; అట్టిరాముఁడు, భృత్యుండనునీకు సేవసేయువాఁడను నేనుబ్రతికియుండఁగా, వ్రతంబువిడిచి, నీయొద్దకిచ్చటికివచ్చునో రాఁడో, నాకుసందేహముగానున్నది. అని, తాత్పర్యము.

నహి వైదేహి రామ స్త్వాం ద్రష్టుంవా ప్యుపలప్స్యతే. ౨౭
పురోబలాకై రసితై ర్మేఘై ర్జ్యోత్స్నామివా వృతామ్

టీక॥ వైదేహి=సీతా! రామః=రాముఁడు; త్వాం=నిన్ను; పురోబలాకైః=ముందుకొంగ-రపక్షులుగలు; అసితైః=నల్లనివి; మేఘైః=మేఘములచేత; ఆవృతాం=కప్పఁబడిన; జ్యోత్స్నామివ=వెన్నెలంబోలె; ద్రష్టుంవాపి= చూచుటకును; నోపలప్స్యతేహి = పొందఁడుగదా!

సీతా! అగ్రభాగంబున ఒకపక్షులు సంచరించుచుండఁగా విశాలంబులయినల్లని మేఘంబులచేత మఱుఁగుపడియుండు వెన్నెలనుబూడఁజాలనట్లు, నావశంబుననున్ననిన్ను, రాముండుచూడనుగూడఁజాలఁడు.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.—వైదేహి= సీతా! మయి; జీవతి(అధ్యాహృతము)= నేను బ్రతికియుండఁగా. శేషంబు.పై.

నేనుబ్రతికియుండఁగా, మేఘంబులచేఁ గప్పఁబడినవెన్నెలంజూడనట్లు, నిన్నురాముండు,చూడనుంజూడఁడు; ఇంకనిన్నుఁగొనిపోవఁడనిచెప్పనేల? నేనుజనిపోయినచో, నిన్నుఁజూచును గొనిపోవును. అని, తాత్పర్యము.

నచాపి మమ హస్తా త్త్వాం ప్రాప్తుం మహార్హతి రాఘవః. ౨౮
హిరణ్యకశిపుః కీర్తి మింద్రహస్తగతా మివ

టీక॥ రాఘవః=రాముండు; మమ=నాయొక్క; హస్తాత్ = చేతనుండి; త్వాం=నిన్ను; హిరణ్యకశిపుః= హిరణ్యకశిపువు; ఇంద్రహస్తగతాం = ఇంద్రునిచేతింబొందిన; కీర్తిమివ = కీర్తియుంబోలె, భార్యనుంబోలెననుట (వైధర్మ్యదృష్టాంతము); ప్రాప్తుంచ = పొందుటకును; నార్హతి=తగఁడు.

ఇంద్రుండు తనభార్యను హరింపఁగా నారదముఖముగాఁబ్రార్థించి హిరణ్యకశిపుండుతనభార్యనుమఱలంబొందినట్లు, నావశంబుననున్ననిన్నురాముండెంతమాత్రముపొందలేఁడు. అతండెన్నివినయంబులు చూపినను నేనునిన్నివ్వను. అని, తాత్పర్యము.

రహస్యార్థము.— సాధర్మ్య

దృష్టాంతము. శేషము పై. ఇంద్రునిచేహరింపఁబడినతనభార్యను, హిరణ్యకశిపుండుకొంతకాలమువఱకుఁబొందలేకుండినట్లు, రాముండునిన్నుఁగొంతకాలమువఱకుఁ బొందనేరఁడు ; హిరణ్యకశిపుండు, కొంతకాలమునకుఁబిమ్మటఁదనభార్యనుఁబొంది నట్లు, రాముండునుగొంతకాలమునకుఁబిమ్మట, (నన్నుఁజంపినవెనుక) నిన్నుఁబొందఁగలఁడు.

అని, తాత్పర్యము.

చారుస్మితే చారుదతి చారునేత్రే విలాసిని. ౨౯
మనో హరసిమే భీరు సుపర్ణః పన్నగం యథా

టీక॥చారుస్మితే=సుందరంబగు చిఱునవ్వుగలదానవును; చారుదతి=సుందరంబులగు దంతములుగల దానవును; చారునేత్రే=సుందరములగు కండ్లుగల దానవును; విలాసిని=అధికమయిన విలాసముగలదానవును ; భీరు=భయపడుస్వభావముగలదానవు నగు సీతా! త్వం (అధ్యాహృతము)= నీవు; సుపర్ణః=గరుత్మంతుఁడు; పన్నగంయథా=సర్పమునుంబోలె; మే=నాయొక్క; మనః=మనస్సును; హరసి=హరించుచున్నావు.

భయపడునట్టి, స్వభావముగల సీతా! నీవు సుందరమగు చిఱునవ్వు గలదానవు, రమణీయంబులగుదంతములు గలదానవు, మనోహరంబులగుకండ్లు గలదానవు, అధికముగావిలాసము గలదానవు; ఇట్టి సౌందర్యముగల్గి యుండుటంజేసి , గరుత్మంతుండు సర్పంబునుహరించునట్లు నామనసును హరించుచున్నావు. అని, తాత్పర్యము.

రహస్యార్థము.—గరుత్మంతుండుహరించిన సర్పంబునకు మరణంబు గల్గునట్లు నీవు హరించిన నామనసునకునునాశంబుగల్గును ; మనస్సు నశించెనేని, నేను మోక్షంబునొందుదును.

అని, తాత్పర్యము,

క్లిష్ట కౌశేయవసనాం తన్వీ మప్యనలంకృతామ్. ౩౦
త్వాం దృష్ట్వా స్వేషు దారేషు రతిం నోపలభా మ్యహమ్

టీక॥అహం=నేను; క్లిష్ట కౌశేయవసనాం = నలఁగినపట్టువస్త్రముగట్టు

కొనియున్న దానవును;తస్వీం=కృశించి నదానవును;అనలంకృతామపి=అలంకరింపఁబడని దానవునగు; త్వాం=నిన్ను; దృష్ట్వా=చూచి; స్వేషు = నావారలయిన; దారేషు=భార్యలందు; రతిం= సంతోషమును; నోపలభామి=పొందకున్నాను.

నీవు, నలఁగినపట్టుబట్టగట్టుకొనికృశించియలంకరించుకొనకుండు నప్పుడె, నిన్నుఁజూచినపిమ్మట, నాభార్యలయందునాకిష్టముదప్పియున్నది; నీవుచక్కఁగానలంకారములుచేసికొనిమంచివస్త్రముగట్టుకొనిసంతోషముతోనుండునప్పుడు చూతునేని, యెట్లుండునో!

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— నాయిష్టదేవతవగునీవు, ఇట్లు, నలఁగినవస్త్రముసుగట్టుకొనికృశించియలంకరించుకొనకదుఃఖంబుతోనుండుటంజూచి, నాకునాభార్యలందుఁగూడ మనస్సంతోషముగలుగకున్నది;కావున,నీవిట్లుండక,చక్కఁగానలంకరించుకొని,యుండుము; నేనునునిన్నుఁబూజించుకొనుచు,సుఖంబుండెదను.అని, తాత్పర్యము.

అంతఃపురనివాసిన్య స్త్రియస్సర్వగుణాన్వితాః. ౩౦
యావంత్యో మమ సర్వాసామైశ్వర్యం కురు జానకి

టీక॥ జానకి=సీతా!మమ=నాయొక్క; అంతఃపురనివాసిన్యః=అంతఃపురమునందున్న; సర్వగుణాన్వితాః = సమస్తములయినగుణములతోఁగూడిన ; స్త్రియః=స్త్రీలు;యావంత్యః = ఎందఱు; సంతి (అధ్యాహృతము)=ఉన్నారో;తాసాం=వారలకు;సర్వాసాం= అందఱకును; ఐశ్వర్యం=ఈశ్వరివగుటను;కురు=చేయుము, పొందుమనుట.

సీతా! నాయంతఃపురంబున సమస్తశుభలక్షణంబులతోను గూడినయుత్తమస్త్రీలెందఱున్నారో, వారలకందఱకును ఈశ్వరివిగానుండుము.

అని, తాత్పర్యము,

మమ హ్యసితకేశాంతే త్రైలోక్యప్రవరా స్త్రియః. ౩౧
తాస్త్వాం పరిచర్యంతి శ్రియ మప్సరసో యథా

టీక॥అసితకేశాంతే=నల్లనివెండ్రుకలకొనలుగలసీతా! మమ = నాయొ



కర్తు; త్రైలోక్యప్రవరాః=ముల్లోకంబులందును శ్రేష్ఠలయినః తాః = ఆ; స్త్రియః = స్త్రీలు; త్వాం=నిన్ను; శ్రియం=లక్ష్మీదేవిని; అప్సరసోయథా= అప్సరసలుంబోలె; పరిచరిష్యంతిహ= సేవింతురుగదా!

నల్లనివెండ్రుకలకొనలుగలసీతా! ముల్లోకంబు లందంతటను ఉత్తమలయినానాభార్య లందఱును, లక్ష్మీదేవికిఅప్సరసలు పరిచర్యసేయునట్లు, నీకుఁ బరిచర్యసేయుచుందురు.

అని, తాత్పర్యము.

యాని వైశ్రవణే సుభ్రు రత్నానిచ ధనానిచ. ౩౩
తాని లోకాంశ్చ సుశ్రోణి మాంచ భుఙ్క్ష్వయథాసుఖమ్

టీక॥ సుభ్రు= సుందరములయినకనుబొమ్మలుగలదానవును ; సుశ్రోణి= సుందరములయినపిఱుందులుగలదానవునగుసీతా! వైశ్రవణే=కుబేరునియందు; రత్నానిచ=మణులును; ధనానిచ=ధనములును;యాని(సంతి) = ఏవియున్నవో; తాని=వానిని;లోకాంశ్చ=లోకంబులను, మాంచ;నన్నును;యథాసుఖం= సుఖముగా;భుఙ్క్ష్వ=అనుభవింపుము.

సుందరములయినకనుబొమ్మలునుపిఱుందులునుగలదానవగుసీతా!కుబేరుని యొద్దనెన్నిరత్నంబులును ధనంబులును న్నవో, వానినన్నింటిని నేనుజయించిన లోకంబులను,నీవిగాఁజేసికొని,సుఖంబుగాననుభవింపుచుండుము;నన్నునునీకుఁ బతినిగా స్వీకరించిసుఖం బనుభవింపుము.అని, తాత్పర్యము.

రహస్యార్థము.— నన్నును భృత్యునిగాఁజేసికొని నేనుశుశ్రూషలు సేయుచుండఁగా సుఖంబు ననుభవింపుము.

అని, తాత్పర్యము. శేషము. పై.

న రామ స్తపసా దేవి న బలేన న విక్రమైః. ౩౪
న ధనేన మయా తుల్య స్తేజసా యశసాపి వా

టీక॥ దేవి=సీతాదేవీ! రామః= రాముఁడు;మయా=నాతో; తపసా= తపస్సుచేత;తుల్యః=సమానుఁడు ; న= కాఁడు, బలేన=బలముచేత; (తుల్యః)




న=సమానుఁడుకాఁడు.విక్రమైః = పరాక్రమములచేత; (తుల్యః)న = సమానుఁడుకాఁడు;ధనేన = ధనముచేత; (తుల్యః)న= సమానుఁడుకాఁడు. తేజసా=కాంతిచేతనుగాని; యశసాపి వా=కీర్తిచేతనుగాని; తుల్యోన (అధ్యాహృతము)= సమానుఁడుకాఁడు.

సీతా! రాముండు,తపంబునఁగాని, బలంబునఁగాని, పరాక్రమంబునంగాని,ధనంబునంగాని తేజంబునంగాని,కీర్తియందుఁగాని,నాకు సరికానేరఁడు.

రహస్యార్థము.—దేవి= తల్లివగుసీతా! శేషము.సై.

రాముండు, భగవంతుండగుశ్రీమహావిష్ణుండైకావున, తపంబునఁగాని బలంబునఁగానిపరాక్రమంబునఁగాని ధనంబునఁగాని తేజంబునఁగాని కీర్తియందుఁగాని, నాకన్న నెంతోయధికుండు; నాతో సమానుఁడుకాఁడు.

అని, తాత్పర్యము.

పిబ విహర రమస్వ భుఙ్క్ష్వ భోగాన్
ధననిచయం ప్రదిశామి మేదినీంచ. ౩౫
మయి లల లలనే యథాసుఖం త్వమ్
త్వయిచ సమేత్య లలంతు బాంధవాస్తే

టీక॥ లలనే=విలసించునట్టిస్వభావముగలసీతా!త్వం=నీవు; పిబ=త్రాఁగుము.విహర=సుఖముగసంచరింపుము.రమస్వ=క్రీడింపుము. భోగాన్= భోగంబులను;భుఙ్క్ష్వ= అనుభవింపుము. ధననిచయం=ధనసమూహమును; మేదినీంచ=భూమిని;ప్రదిశామి= ఇచ్చెదను. మయి=నాయందు;యథాసుఖం=సుఖమునతిక్రమింపక; లల= రమింపుము. తే=నీయొక్క;బాంధవాశ్చ= బంధువులును;త్వయి=నీయందు ; సమేత్య=చేరి;లలంతు=రమింతురుగాక.

విలసించియుండునట్టి స్వభావముగలసీతా! నీవు,యథేష్టంబుగామద్యంబుత్రాఁగుము; సుఖముగాఁదిరుగుము; క్రీడింపుము; కావలసినభోగంబులననుభవింపుము; నీకుధనంబంతయుభూమినంతయునిచ్చెదను; నాయందు మోహంబుంచిసుఖంబుగారమింపుచుండుము; నీవిట్లుఅధికసంతోషంబుగానుండుటంజూచి,నీబంధువులందఱునిన్నుఁజేరి సంతోషంబనుభవింతురుగాక.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.—మయి (సతి) నేను భృత్యుండనైయుండఁగా; శేషము.పై.

నేను, భృత్యుండనై శుశ్రూషలు సేయుచుండఁగా నీవు సుఖంబుగా నుండుము; అట్లు నీవు సుఖంబుగా నుండుటం జూచి, నీ బంధువులు నన్నుఁ జేరి, సుఖంబను భవింతురుగాక.

అని, తాత్పర్యము. శేషము.పై.

కుసుమితతరుజాలసంతతాని
భ్రమరయుతాని సముద్రతీరజాని. ౩౬
కనకవిమలహారభూషితాంగీ
విహర మయాసహ భీరు కాననాని

టీక॥ భీరు=భయపడుస్వభావముగలసీతా! త్వం(అధ్యాహృతము)=నీవు; కనకవిమలహారభూషితాంగీ=బంగారువికారమును స్వచ్ఛమునగు హారముచేనలంకరింపఁబడిన దేహముగలదానవై; కుసుమితతరుజాలసంతతాని = పుష్పించిన వృక్షములయొక్క సమూహములచేవ్యాపింపఁబడినవియును; కావున నే, భ్రమరయుతాని= తుమ్మెదలతోఁగూడినవియును; సముద్రతీరజాని= సముద్రపుగట్టునఁబుట్టినవియునగు; కాననాని = (సప్తమ్యర్థమందుద్వితీయ) వనములయందు ; మయాసహ = నాతోఁగూడ; విహర=క్రీడింపుము.

భయపడుస్వభావముగలసీతా!నీవు, స్వచ్ఛమగుబంగారుహారంబుదాల్చి పుష్పించియుండు చెట్లతోఁగూడితుమ్మెదలుమధురంబుగాఁగూయుచుండఁగారమణీయంబులైన, సముద్రతీరంబునందలి వనంబులయందు, నాతోఁగూడఁ, గ్రీడింపుచుండుము. అని, తాత్పర్యము.

రహస్యార్థము.— మయాసహ=భృత్యుండనగునాతోఁగూడ; శేషము-పై.

భృత్యుండనగు నేను సేవలు సేయుచుండఁగా,నీవావనంబులయందు సుఖంబుగా విహరింపుచుండుము.

అని,తాత్పర్యము-

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

సుందరకాండే, వింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, సుందరకాండవింశసర్గటీక, ముగిసినది.

---

శ్రీ

ఏకవింశసర్గప్రారంభః.



తస్య తద్వచనం శ్రుత్వా సీతా రౌద్రస్య రక్షసః
ఆర్తా దీనస్వరా దీనం ప్రత్యువాచ శనై ర్వచః. ౧

టీక॥ సీతా = సీత; రౌద్రస్య = భయంకరుండగు; తస్య = ఆ; రక్షసః = రాక్షసుండయిన రావణుని యొక్క; తత్ = ఆ; వచనం = మాటను; శ్రుత్వా = విని; ఆర్తా = దుఃఖము నొందినదై; దీనస్వరా = గర్వంబుడిగిన ధ్వనిగలదై; దీనం = దైన్య




ముతోఁగూడిన;వచః = మాటను; శనైః=మెల్లఁగా; ప్రత్యువాచ=బదులు చెప్పెను.

భయంకరుండగునారావణుండుచెప్పినయామాటనువిని, సీత, చాలదుఃఖమునొంది,దీనన్నై, దీనంబగు స్వరంబున, మెల్లఁగా,నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

దుఃఖార్తా రుదతీ సీతా వేపమానా తపస్వినీ
చింతయంతీ వరారోహా పతి మేవ పతివ్రతా. ౨
తృణ మంతరతః కృత్వా ప్రత్యువాచ శుచిస్మితా

టీక॥ వరారోహా=శ్రేష్ఠములయినపిఱుఁదులుగలదియును;శుచిస్మితా=తెల్లనిచిఱునవ్వుగలదియును ; పతివ్రతా=పతిభక్తిగలదియునగు; సీతా = సీత; దుఃఖార్తా= దుఃఖముచేఁబీడింపఁబడినదై ; రుదతీ=ఏడ్చుచు; వేపమానా=వడంకుచు; తపస్వినీ= కనికరింపఁదగినదై ; పతిమేవ=పెనిమిటినే;చింతయంతీ=ధ్యానింపుచు; అంతరతః=నడుమను; తృణం = గడ్డిపోఁచను; కృత్వా= చేసి,వుంచియనుట;ప్రత్యువాచ=బదులుచెప్పెను.

సుందరములగు పిఱుందులు గలదియునుస్వభావంబుననె మొల్లప్పుడును తెల్లనిచిఱునవ్వుగలదియును బతివ్రతయునగుసీతాదేవి , పరమ దుఃఖంబునొందిరోదనంబుసేయుచు , భయంబునగడగడవడంకుచుఁ,జూపరులచేఁగనికరింపఁదగినదై , పెనిమిటినే మనంబున ధ్యానించుచు, రావణునితోఁ బ్రత్యక్షముగామాటలాడుటతగదుకావున, నొకగడ్డిపోఁచను నడుమనుంచుకొని, యిట్లనిచెప్పెను. అని,తాత్పర్యము.

విశేషార్థము.— దుఃఖకాలంబునందును "శుచిస్మితా" (తెల్లని చిఱునవ్వుగలది)యనివర్ణించుటచే "స్వభావంబుననేసీత నగుమొగంబుగలది" యనిసూచింపఁబడినది"పెనిమిటినిధ్యానించుచు గడ్డిపోఁచను నడుమనుంచికొని" యనిచెప్పుటచే, "నాభర్తయగురాముండెక్కడ? ఇతండెక్కడ? విచారించినచోనితండు గడ్డిపోఁచయంతటివాఁడు అనితలంచినది." అనియును సూచింపఁబడినది.

నివర్తయ మనో మత్తః స్వజనే క్రియతాం మనః. ౩




టీక॥ మత్తః=నావలన; మనః=మనసును; నివర్తతాయ = మఱలించుకొనుము. స్వజనే=నీభార్యాజనమునందు ; మనః=మనసు; క్రియతాం = చేయఁబడుఁగాక,ఉంచఁబడుఁగాకయనుట.

నీవునాయందుమనంబుంచకుము; నీమనసును మఱలించికొని నీభార్యలయందుఁజేర్పుము. అని, తాత్పర్యము.

న మాం ప్రార్థయితుం యుక్తం సుసిద్ధిమివ పాపకృత్

టీక॥ త్వం (అధ్యాహృతము) = నీవు;పాపకృత్= పాపముసేయువాఁడు; సుసిద్ధిమివ= మోక్షముసుంబోలె; మాం=నన్ను; ప్రార్థయితుం=కోరుటకు; యుక్తం=ఉచితము;నకాదు.

పాపిష్ఠుండు మోక్షమును గోరునట్లునీవు నన్నుఁగోరఁదగదు ; ఎంతకోరినను బాపిష్ఠునకు మోక్షము గలుగకుండునట్లు, నీకు నేనుదక్కను.

అని, తాత్పర్యము.

అకార్యం న మయా కార్య మేకపత్న్యా విగర్హితమ్. ౪
కులం సంప్రాప్తయా పుణ్యం కులే మహతి జాతయా

టీక॥పుణ్యం = పరిశుద్ధమయిన;కులం=వంశమును;సంప్రాప్తయా=పొందినదానను;మహతి=పూజ్యమయిన;కులే=వంశమునందు; జాతయా=పుట్టినదానను;ఏకపత్న్యా=ఒకఁడె పెనిమిటి గాఁగలదానను, పతివ్రత ననుట; మయా=నాచేత;గర్హితం=నిందింపఁబడినదియును;అకార్యం= చేయఁదగనిదియునగునది.కార్యం = చేయఁదగినది; న=కాదు.

నేను బరిశుద్ధంబగు కులంబునవివాహమాడినాను; అట్లుపరిశుద్ధవంశంబునంబుట్టినాను; పతివ్రతనని పేరువడసితిని;అట్టినేను, నిందితంబయినచేయరానిపనినిజేయఁగూడదు.అని,సీత, రావణునితోఁజెప్పెను.అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వాతు వైదేహీ రావణం తం యశస్వినీ. ౫
రాక్షసం పృష్ఠతః కృత్వా భూయో వచన మబ్రవీత్

టీక॥యశస్వినీ= ప్రశస్తమయినకీర్తిగల; వైదేహీ=సీత;ఏవం=ఇట్లు; ఉ

క్త్వాతు=చెప్పినంత నే; రాక్షసం = రాక్షసుండగు; రావణం = రావణుని; పృష్ఠతః = వెనుకను; కృత్వా = చేసి; భూయః=మరల; వచనం=మాటను; అబ్రవీత్=పలికెను.

అధికమయినకీర్తిఁగలసీతాదేవి, యిట్లుపలికియంత రావణుని ప్రక్కఁజూడక రావణునకువీపుకనుపడునట్లు వెనుకకుం దిరిగికూర్చుండి, మరల, రావణునితో, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

నాహ మౌపయికీ భార్యా పరభార్యా సతీ తవ. ౮

టీక॥ పరభార్యా=ఇతరభార్యను; సతీ=పతివ్రతనగు ; అహం = నేను ; తవ=నీకు ; ఔపయికీ = తగిన ; భార్యా=భార్యను; న=కాను.

నేనితరపురుషునిభార్యను, పతివ్రతను, నీకుభార్యగాఁ దగినదానను గాను, అని, తాత్పర్యము.

రహస్యార్థము.— సతీ= పతివ్రతనగు; అహం=నేను; తవ=నీకు; భార్యా=భరింపఁదగినదానను గా; ఔపయికీన=తగినదానను గాను . పరభార్యా, పర=అధికుండగు రామునకు, భార్యా=భరింపఁదగినదానను.

నేను నీకు భరింపఁదగినదానను గాను; అయితే, లోకోత్తముండగు రాముండు మాత్రమె నన్ను భరింపవలసినవాఁడు. అని, తాత్పర్యము.

సాధు ధర్మ మవేక్షస్వ సాధు సాధువ్రతం చర

టీక॥సాధు=చక్కఁగా; ధర్మం=ధర్మమును; అవేక్షస్వ=చూచుకొనుము. సాధు=చక్కఁగా; సాధువ్రతం=సత్పురుషులవ్రతమును; చర = ఆచరించుము.

ధర్మంబును జక్కఁగాఁజూచుకొనుము ; విడువకుము ; సత్పురుషుల యాచారము ప్రకారమున నాచరింపుము. అని, తాత్పర్యము.

యథా తవ తథా న్యేషాం దారా రక్ష్యా నిశాచర. ౯

టీక॥నిశాచర=రాత్రియందుఁదిరుగునట్టిరాక్షసుఁడా! తవ=నీయొక్క; దా

స ౨౧

రాః=భార్యలు; యథా=ఎట్లో; తథా=అట్లు; అన్యేషాం= ఇతరులయొక్క; దారాః (అధ్యాహృతము)= భార్యలు; రక్ష్యాః=కాపాడఁదగిన వారలు.

రాక్షసుఁడా! నీవు నీభార్యలు వ్యభిచారములేక పరిశుద్ధలయియుండవలయు నని కోరుచున్నావుగదా! అట్లు, ఇతర భార్యలందును ఆబుద్ధినే యుంచుము.

అని, తాత్పర్యము.

ఆత్మాన ముపమాం కృత్వా స్వేషు దారేషు రమ్యతామ్

టీక॥ ఆత్మానం=నిన్ను; ఉపమాం=ఉపమానమునుగా; కృత్వా=చేసికొని; స్వేషు=నీవారలయిన; దారేషు=భార్యలందు; రమ్యతాం= క్రీడించుట యవుఁగాక.

ఇతరులు నీభార్యలతో రమించినప్పుడు నీ కెట్లుండునో, వారలకును దమభార్యలతో నీవు రమించినప్పుడట్లే యుండునని, తెలిసికొని, యితరభార్యలను విడిచి, నీభార్యలతో నే రమింపుచుండుము.

అని, తాత్పర్యము.

అతుష్టం స్వేషు దారేషు చపలం చలితేంద్రియమ్. ౮
నయంతి నికృతిప్రజ్ఞం పరదారాః పరాభవమ్

టీక॥ స్వేషు=తన; దారేషు=భార్యలందు; అతుష్టం = తృప్తిలేనివాఁడును; చపలం=చాంచల్యముగలవాఁడును; చలితేంద్రియం = చలించినయింద్రియములుగలవాఁడును; నికృతిప్రజ్ఞం=రహస్యముగాఁగుత్సితము సేయుటయందు బుద్ధిగలవాఁడునగువానిని; పరదారాః=పరస్త్రీలు; పరాభవం= తిరస్కారమును, ఆయురైశ్వర్యాది నాశముననుట; నయంతి=పొందించెదరు.

తనభార్యలయందుఁ దృప్తిఁబొందక చపలుండై చపలంబులగు నింద్రియములుగలవాఁడై శఠుండై పరభార్యలంబొందునేని, దానివలన, నశనియాయుస్సును ఐశ్వర్యంబును మొదలగునన్నియును, నశించును. అని, తాత్పర్యము.

ఇహ సంతో న వా సంతి సతో వా నానువర్తసే. ౯

తథాహి విపరీతా తే బుద్ధి రాచారవర్జితా

టీక॥ఇహ=ఇచ్చట; సంతః=పెద్దలు; నసంతిహి=లేరా? సతః=పెద్దలను; నానువర్తసేహి=అనుసరింపవా? తథాహి=అటియుక్తమే! తే=నీయొక్క; బుద్ధిః=బుద్ధి; విపరీతా=ధర్మమునెడఁబాసినదియు; ఆచారవర్జితా=ఆచారముచేవిడువఁబడినదియునుగా; అస్తి (అధ్యాహృతము)=ఉన్నది.

ఇచ్చటనీకుమంచిచెప్పుటకుఁ బెద్దలైవారునులేరా? ఉన్నను, నీవువారలననుసరింపవాయేమి? నీవువారలననుసరింపవేని, వారలునీకెట్లుమంచిచెప్పఁగలరు? నీవువారలం దిరస్కరించుటవలనవారలు నిన్నువిడిచియుందురు; నీవిట్లుశిష్టాచారంబునువిడిచియధర్మబుద్ధినవలంబించియున్నావు, కావున, నిన్నువారలువిడిచియుందురనుటకుసందియములేదు.

అని, తాత్పర్యము.

వచో మిథ్యాప్రణీతాత్మా పథ్య ముక్తం విచక్షణైః. ౧౧
రాక్షసానా మభావాయ త్వం వా న ప్రతిపద్యసే

టీక॥ మిథ్యాప్రణీతాత్మా=అబద్ధముగావిషయములతోఁగూడినమనసుగల; త్వం=నీవు; విచక్షణైః=పండితులచేత; ఉక్తం=చెప్పఁబడిన; పథ్యం = హితమయిన; వచః = మాటను; రాక్షసానాం = రాక్షసులయొక్క; అభావాయ=లేమికొఱకు; నప్రతిపద్యసేవా=అంగీకరింపకున్నావా?

అటుగానిచో, నీవు, మనంబునందు దురహంకారంబుగలవాఁడవయ్యును, ఐహికవిషయంబులతోఁబండితులనాదరించునట్లభినయించుచుండుటంజేసి, వారలు, తమమాటను నీవువినుదువని, నీకుహితంబుచెప్పఁగా, రాక్షసులందఱునశింపవలసిన కాలంబువచ్చినది కావున నే, నామాటలనంగీకరింపకున్నావాయేమి?

అని, తాత్పర్యము.

అకృతాత్మాన మాసాద్య రాజాన మనయే రతమ్. ౧౧
సమృద్ధాని వినశ్యంతి రాష్ట్రాణి నగరాణిచ

టీ॥ అకృతాత్మానం=చక్కఁగాఁజేయఁబడనిబుద్ధిగలవాఁడును, తెలివిలేనిబుద్ధిగలవాఁడనుట; అనయే= అన్యాయమునందు; రతం=ఆసక్తుఁడునగు; రాజానం=రాజును; ఆసాద్య=పొంది; సమృద్ధాని=సంపూర్ణములయిన; రాష్ట్రాణి=దేశములను; నగరాణిచ= పట్టణములను; వినశ్యంతి=నశించును.

తెలివిలేనివాఁడును దుర్మార్గుఁడునగువాఁడు రాజగునేని, సమస్తసంపదలతో నిండినవయ్యును, దేశంబులును బట్టణములును మొదలగునవి, నాశము నొందును. అని, తాత్పర్యము.

తథేయం త్వాం సమాసాద్య లంకా రత్నౌఘసంకులా. ౧౨
అపరాధాత్తవైకస్య న చిరాద్వినశిష్యతి

టీక॥ తథా=అట్లు; రత్నౌఘసంకులా=మణుల సమూహములచే నిండిన; ఇయం=ఈ; లంకా=లంక; త్వాం=నిన్ను; సమాసాద్య=పొంది; ఏకస్య=ఒకఁడవైన; తవ=నీయొక్క; అపరాధాత్=దోషమువలన; నచిరాత్=శీఘ్రముగా; వినశిష్యతి=నశింపఁగలదు.

ఆప్రకారముగా, నానావిధ మణులతో నిండిసమస్తసంపదలతో నొప్పుచున్నయీలంకయంతయు, నీవు రాజగుటచే, నీయొకనియపరాధంబున, శీఘ్రంబుగా, నాశమునొందఁగలదు.

అని, తాత్పర్యము.

స్వకృతైర్హన్యమానస్య రావణాదీర్ఘదర్శినః. ౧౩
అభినందంతి భూతాని వినాశే పాపకర్మణః

టీక॥ రావణ=రావణుఁడా! భూతాని=ప్రాణులు; స్వకృతైః=తనచేఁజేయఁబడినవానిచేత; హన్యమానస్య=కొట్టఁబడుచున్నవాఁడును; అదీర్ఘదర్శినః=దూరముచూడలేనివాఁడునగు; పాపకర్మణః=పాపముగల్గించునట్టి కార్యములుగలవానికి; వినాశే=నాశము కాఁగా; అభినందంతి=సంతసింతురు.

రావణుఁడా! పాపిష్ఠుండగువాఁడు, దూరదృష్టిలేక, స్వాపరాధంబుననె, నాశంబునొందుచుండఁగాఁజూచి, ప్రాణులందఱుసంతసింతురు.

అని, తాత్పర్యము.

ఏవం త్వాం పాపకర్మాణం వక్ష్యంతి నికృతా జనాః. ౧౪
దిష్ట్యైతద్వ్యసనం ప్రాప్తో రౌద్ర ఇత్యేవ హర్షితాః

టీక॥ఏవం=ఇట్లు; నికృతాః = అవమానింపఁబడిన; జనాః=జనులు; హర్షితాః=సంతసించిన వారలై; త్వాం=నిన్నుఁగూర్చి; రౌద్రః=భయంకరుండగు రావణుఁడు; దిష్ట్యా = భాగ్యముచేత; ఏతత్=ఈ; వ్యసనం=కష్టమును; ప్రాప్తః=పొందినాఁడు. ఇత్యేవ=అనియే; వక్ష్యంతి=చెప్పఁగలరు.

ఈప్రకారముగానే, ఇంకనీకు నాశంబుగల్గునప్పుడు, మున్ను నీచేనవమానింపఁబడినజనులందఱు. సంతోషంబున "మా భాగ్యవశంబునభయంకరుండగునీరావణునకు వినాశంబు వాటిల్లినది! అనియే, చెప్పుదురు. అని, తాత్పర్యము.

శక్యా లోభయితుం నాహం నైశ్వర్యేణ ధనేనవా. ౧౫
అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభాయథా

టీక॥అహం=నేను; ఐశ్వర్యేణ=అంతఃపురస్త్రీప్రభుత్వముచేతఁగాని; ధనేనవా = ధనముచేతఁగాని; లోభయితుం=ఆసఁగొనఁజేయుటకు; శక్యా=కూడినదానను; న=కాను. భాస్కరేణ=సూర్యునితో; ప్రభాయథా=కాంతియుంబోలె; అహం = నేను; రాఘవేణ=రామునితో; అనన్యా= వేఱుపాటులేనిదానను.

నేను, అంతఃపురస్త్రీప్రభుత్వమునకుఁగానిధనమునకుఁగాని యింకదేనికిఁగానిఆసపడుదానను గాను; వెల్తురుసూర్యునివిడిచి యుండనట్లు, నేనెంతమాత్రమును రాముని విడిచియుండను.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.—పూర్వార్థము సమానము. అహం=నేను, నాశములేని నేననుట; భాస్కరేణ, ప్రభాయథా రాఘవేణ= రఘువంశమునందవతరించిన విష్ణుదేవునితో; అనన్యా. "రఘువంశమందుఁబుట్టినవిష్ణువుతో" అనుటచే, "ఇట్లు విష్ణుండవతరించునప్పుడంతయు నేనునవతరింతును" అని, సూచింపఁబడినది. "రాఘవేణ" అని, తృతీయచెప్పఁబడుటచే, "అట్టివిష్ణుదేవునికిఁబరతంత్రురాలను" అని, సూచింపఁబడినది. "భాస్కరేణ

ప్రభాయథా" అను నుపమానముచే, "సూర్యునకు వెల్తురునువిడిచి స్వరూపమే లేనట్లునన్నువిడిచివిష్ణుదేవునికిస్వరూపమే లేదు వెల్తురు సూర్యునకతిశయము గల్గించినట్లు, నేను, ఆవిష్ణుదేవునకునుఅతిశయముగల్గింతును." అని, సూచింపఁబడినది.

నాకు నాశములేదు; సూర్యునితోఁగాంతి వేఱుపడనట్లు, రఘువంశమునందవతరించినయావిష్ణుదేవునితో నెప్పుడును వేఱుపడియుండను ; అట్లువిష్ణుండవతరించునప్పుడంతయు నేనునవతరించుచుండుదును; వెల్తురునువిడిచి సూర్యుని స్వరూపమే లేనట్లునన్నువిచియావిష్ణుదేవునకు స్వరూపమే లేదు, వెల్తురువలన సూర్యునికతిశయముగల్గునట్లు, నావలననావిష్ణుదేవునకును అతిశయము గల్గును. అని, తాత్పర్యము.

ఉపధాయ భుజం తస్య లోకనాథస్య సత్కృతమ్. ౧౬
కథన్నా మోపధాస్యామి భుజ మన్యస్య కస్యచిత్

టీక॥ అహం(అధ్యాహృతము) = నేను; లోకనాథస్య=జనులకుఁబ్రభువైన; తస్య=ఆరామునియొక్క ; సత్కృతం=పూజింపఁబడిన; భుజం=భుజమును; ఉపధాయ=తలగడగాఁజేసికొని, కౌఁగిలించుకొనియనుట; అన్యస్య=ఇతరుఁడైన; కస్యచిత్=ఒకానొకనియొక్క, అనామధేయునియొక్క యనుట; భుజం=భుజమును ; కథన్నామ=ఎట్లు; ఉపధాస్యామి=తలగడగాఁ జేసికొందును?

నేనట్టి, లోకనాథుండగు రామునియుత్తమభుజంబును గౌఁగిలించు కొని, యింక, ననామధేయుఁడగు మఱియొక్కని భుజంబునెట్లు గౌఁగిలించుకొందును? అని, తాత్పర్యము.

రహస్యార్థము.—అహం= నేను; లోకనాథస్య=లోకంబులనుయాచింపఁబడునట్టి (నాథృయాచ్ఞాయాం) బ్రహ్మాదులచేఁ దమతమలోకంబులనొందుటకై యాచింపఁబడునట్టి; తస్య=అట్టి పురుషోత్తముండగు రాముని యొక్క; సత్కృతం=ఉత్తమంబగు; భుజం, ఉపధాయ. శేషము. పై.

బ్రహ్మాయు దేవతలును దమకాయాలోకంబులిమ్మని యాచింపఁగా , వారలకులోకాధిపత్యంబు లొసంగిన వాఁడునుబురుషోత్తముండని ప్రసిద్ధుండయి

సవాఁడునగునాభగవంతుని యుత్తమ భుజంబును దలగడగాఁజేసికొని, యుంక, నట్టిభగవంతుని యొద్దఁగుత్సితభోగంబులుయాచించెదే నీబోఁటియనాథయనిభుజంబునెట్లుగళ్ళఁగిలించికొదునుః అని, తాత్పర్యము.

అహం మౌపయికీ భార్యా తస్యైవ వసుధాపతేః. ౧౭
వ్రతస్నాతస్య విప్రస్య విద్యేవ విదితాత్మనః

టీక॥ అహం = నేను ; విదితాత్మనః = తెలియఁబడినయాత్మగలవాఁడును; వ్రతస్నాతస్య = వేదవ్రతములచేతస్నానముచేసినవాఁడునగు; విప్రస్య = బ్రాహ్మణుని యొక్క ; విద్యేవ = వేదవిద్యయుంబోలె; వసుధాపతేః = భూమికిఁబ్రభువైన; తస్యైవ = ఆరామునకే; ఔపయికీ = సరియయిన ; భార్యా = భార్యను.

వేదవ్రతోద్యాపనము చేసికొని స్నాతుండగు నాత్మవేత్తయినబ్రాహ్మణునకుసాంగవేదవిద్యయొప్పియుండునట్లు, నేను భూమికిఁబ్రభువైన యారామునకేతగినభార్యను; మఱియెవ్వరికిఁగాను. అని, తాత్పర్యము.

రహస్యార్థము.—విష్ణుదేవునకు భూమియునులక్ష్మియును, బత్నులిద్దఱు, కావునవిష్ణుదేవావతారరూపుండగునారామునకే, భూమియునేనును, ఇద్దఱముసుబత్నులమగుటయుచితము.

అని, తాత్పర్యము.

సాధు రావణ రామేణ మాం సమానయ దుఃఖితామ్. ౧౮
వనే వాశితయా సార్ధం కరేణ్వేవ గజాధిపమ్
("వనేవాసితయా" ఇతి పాఠాంతరం.)

టీక॥ రావణ = రావణుఁడా! గజాధిపం = ఏనుంగులకుఁబ్రభువైనయేనుంగును; వనే = అడవియందు; వాశితయా = యౌవనముగలదియును; (పాఠాంతరపక్షమందు) వాసితయా = ఉండునట్లుచేయఁబడిన; కరేణ్వాసార్ధమివ = ఆఁడేనుంగుతోఁ గూడవలె; ("రామేణ, మాం" అనుచోట, రామం, మయా" అనివిభక్తివిమార్పణవలెనుట.) రామేణ (రామం) = రాముని; దుఃఖితాం = దుఃఖమునొందిన; మాం (మయా) = నాతో; సాధు = చక్కఁగా; సమానయ = చే

పుణము.

రావణుఁడా! అడవియందు, మగ యేనుంగుంబాసి దుఃఖించుచున్నయాఁడేనుంగుతో మగయేనుంగుం గూర్చినట్లు,సుందరంబగునట్లుగా, దుఃఖితనగు నాతో రామునింగూర్చుము.

అని,తాత్పర్యము.

మిత్ర మౌపయికం కర్తుం రామ స్థానం పరీప్సతా. ౧౯
వధం చానిచ్ఛతా ఘోరం త్వయాసౌ పురుషర్షభః

టీక॥ అసౌ=ఈ; పురుషర్షభః= పురుషశ్రేష్ఠుండగు; రామః = రాముఁడు; స్థానం=ఉండుటను; పరీప్సతా = కోరుచున్నవాఁడవును; ఘోరం = భయంకరమయిన; వధంచ=చంపుటను ; అనిచ్ఛతా = కోరనివాఁడవునగు;త్వయా=నీచేత; మిత్రం = స్నేహితునిఁగా; కర్తుం=చేసికొనుటకు ; ఔపయికం= తగినవాఁడు.

నీవు రామునిచే భయంకరంబగు వధంబునొందకలంకయందు బ్రతికియుండఁగోరుదువేని, నీవు , పురుషోత్తముండగు రాముని మిత్రునిఁగాఁ జేసికొనుట యుక్తము;అతండు, పురుషోత్తముండు కావున, నీయపరాధంబులుక్షమించి నిన్నువిడిచిపుచ్చును- అని,తాత్పర్యము.

విదిత స్సహి ధర్మజ్ఞ శ్శరణాగతవత్సలః. ౨౦

టీక॥ సః=ఆరాముఁడు ; ధర్మజ్ఞః = ధర్మములంజెలిసినవాఁడు.శరణాగతవత్సలః= శరణుచొచ్చినవారలయందలి ప్రేమగలవాఁడు. ఇతి (అధ్యాహృతము)=అని, విదితోహి=ప్రసిద్ధుఁడుగదా!

ఆరాముఁడు, "సమస్తధర్మంబుల నెఱింగినవాఁడు, శరణుచొచ్చినవారలపైనతిదయగలవాఁడు , అని,సమస్తలోకంబుల యందును బ్రసిద్ధి వహించియున్నాఁడు.అని,తాత్పర్యము.

తేన మైత్రీ భవతు తే యది జీవితు మిచ్ఛసి

టీక॥ జీవితుం=బ్రతుకుటకు; ఇచ్ఛసియది=కోరుదువేని; తే=నీకు; తేన=

ఆరామునితో; మైత్రి = చెలిమి; భవతు=అగుఁగాక.

నీకుఁబ్రతికియుండ వలెనను కోరికగలదేని, అట్టిశరణాగతవత్సలుండగురామునితో స్నేహంబు సేయుము.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— "రాముండుశరణాగతవత్సలుం" డనుటచే "నీవు రామునిశరణుఁ బొందుము" అనియేసీతయభిప్రాయమైనను, "స్నేహంబు సేయుము" అనుట, రావణునకు "శరణుఁబొందుము" అనిచెప్పినచో, నేమైనఁదకుక్కువమాటగాఁ దోఁచునని, చెప్పబడినది. అట్లు "మిత్రభావేన సంప్రాప్తంనత్యజేయంకథంచన" (స్నేహంబునవచ్చినవాని నేవిధంబుననైనను విడువను) అని, శ్రీరాములును, ఈయభిప్రాయంబుననె "శరణుఁబొందినవాని" అనుటకుమాఱుగా, "స్నేహంబునవచ్చినవాని" అని,వచించియున్నారు.

ప్రసాదయస్వ త్వం చైనం శరణాగతవత్సలమ్. ౨౧

టీక॥ త్వంచ=నీవును; శరణాగతవత్సలం= శరణుచొచ్చినవారియం దతిప్రేమగల; ఏనం=ఈ రాముని; ప్రసాదయస్వ= సంతోషింపఁజేయుము.

నీవును, రామునకుసంతోషంబు గల్గునట్లు చేయుము; నేనును నీకొఱకై వేఁడుకొనెదను; అతండు, శరణాగత వత్సలుండుకావునఁ,దప్పక ,నిన్నునన్నింపఁడు.

విశేషార్థము.— "త్వంచ"(నీవును) అనుటచే, "నేనునునీకొఱకై వేఁడుకొనెదను" అనిసూచింపఁ బడినది. లేక, ఇదివఱకు, నీవంటియుపరాధులనేకులు, ఇట్లురామునిశరణుచొచ్చి క్షేమంబు నొందియున్నారు; అట్లునీవును, అతని,సంతోషపఱుపుము ; నీకును క్షేమంబుగలుగును. అని, తెల్పఁబడినది.

మాం చాస్మై ప్రయతో భూత్వా నిర్యాతయితు మర్హసి

టీక॥త్వం (అధ్యాహృతము)= నీవు; ప్రయతః= పరిశుద్ధుండవు; భూత్వా=అయి; మాం=నన్ను; అస్మై= ఈ రామునికొఱకు ; నిర్యాతయితుం చ=మఱలనిచ్చుటకును; అర్హసి=తగుదువు.

నీవు రామునిశరణుచొచ్చుటమాత్రమె చాలదు; మనంబునఁ గాలుష్యంబు విడిచి, శుద్ధాంతఃకరణంబుతో, నన్ను, రామునకివ్వవలెను; లేనిచో, నీయందు రామునకుఁ బ్రసాదంబు గలుగ నేరదు. అని, తాత్పర్యము.

ఏవంహి తే భవే త్స్వస్తి సంప్రదాయ రఘూత్తమే. ౨౨

టీక॥ఏవం = ఇట్లు; మాం (అధ్యాహృతము) = నన్ను; రఘూత్తమే = రామునందు; సంప్రదాయ = సమర్పించి; స్థితాయ (అధ్యాహృతము) = ఉన్నట్టి; తే = నీకొఱకు; స్వస్తి = మంగళము; భవేద్ధి = అగునుగదా!

ఈప్రకారముగా, నీవు నన్ను రామునకు సమర్పింతువేని, నీకు మేలు గలుగును.

అని, తాత్పర్యము.

అన్యథా త్వం హి కుర్వాణో వధం ప్రాప్స్యసి రావణ

టీక॥రావణ = రావణుఁడా! త్వం = నీవు; అన్యథా = వేఱువిధముగా; కుర్వాణః = చేయువాఁడవై; వధం = చావును; ప్రాప్స్యసిహి = పొందుదువుగదా!

రావణుఁడా! నీవట్లు చేయక వేఱువిధముగాఁ జేయుదువేని, తప్పక, రాముండు నిన్నుఁ జంపును.

అని, తాత్పర్యము.

వర్జయే ద్వజ్ర ముత్సృష్టం వర్జయే దంతక శ్చిరమ్. ౨౩
త్వద్విధంతు న సంక్రుద్ధో లోకనాథ స్స రాఘవః

టీక॥త్వద్విధం = నీవంటివానిని; ఉత్సృష్టం = విడువఁబడిన; వజ్రం = వజ్రాయుధము; వర్జయేత్ = విడుచును. అంతకః = యముఁడు; చిరం = బహుకాలము; వర్జయేత్ = విడుచును. సంక్రుద్ధః = కోపంబునొందినవాఁడును; లోకనాథః = ప్రపంచమునకుఁ బ్రభుండును; సః = ఆ; రాఘవస్తు = రాముండు మాత్రము; న (వర్జయేత్) = విడువఁడు.

ఒకవేళ నింద్రుండు ప్రయోగించినవజ్రాయుధంబు నిన్ను విడిచినను విడుచును; యమ




మండును నిస్సుబహుకాలముగానిపోక విడిచియుండును;ఇంద్రునివజ్రాయుధంబునకును యమునకునులోఁబడనివాఁడనని విఙ్ఞిపీఁగవలదు;కుపితుండయినలోకనాథుండగు రాముండుమాత్రము, నీవంటిదుష్టాత్ముని నంతమాత్రమునుజంపకవిడువఁడు. అని, తాత్పర్యము.

రామస్య ధనుష శ్శబ్దం శ్రోష్యసి త్వం మహాస్వనమ్. ౨౪
శతక్రతువిసృష్టస్య నిర్ఘోషమశనేరివ

టీక॥త్వం=నీవు;శతక్రతువిసృష్టస్య=దేవేంద్రునిచేవిడువఁబడిన ; అశనేః=వజ్రాయుధముయొక్క ; నిర్ఘోషమివ(స్థితం)=ధ్వనియుంబోలెనున్నదియును; మహాస్వనం= గొప్పనాదంబుగలదియునగు; రామస్య = రామునియొక్క;ధనుషః=వింటియొక్క;శబ్దం=ధ్వనిని; శ్రోష్యసి=వినఁగలవు.

నీవు,శీఘ్రంబుగా, దేవేంద్రుండువిడిచిన వజ్రాయుధంబునకుం బోలె మహానాదంబుగలరామునిధనుర్ధ్వనిని,వినంగలవు. అని, తాత్పర్యము.

ఇహ శీఘ్రం సుపర్వాణో జ్వలితాస్యా ఇవోరగాః. ౨౫
ఇషవో నిపతిష్యంతి రామలక్ష్మణలక్షణాః

టీక॥సుపర్వాణః=సుందరములయిన గనుపులుగలవియును; జ్వలితాస్యాః=మండుచున్నముఖములుగలవియును; ఉరగాఇవ (స్థితాః) = సర్పములుంబోలెనున్నవియును; రామలక్ష్మణలక్షణాః = రామ,లక్ష్మణయనుగుఱుతులుగలవియునగు;ఇషవః= బాణములు ; ఇహ=ఈలంకాపురియందు;శీఘ్రం=శీఘ్రముగా ; నిపతిష్యంతి = పడఁగలవు.

సుందరములయిన గనుపులు గల్గి మండునట్లున్న ముఖంబులతో సర్పంబులుంబోలెనున్న రామలక్ష్మణుల పేరులచేనంకితంబులగుబాణంబులు, శీఘ్రంబుగనే, యీలంకాపట్టణంబునందువ్యాపింపఁగలవు.

అని, తాత్పర్యము.

రక్షాంసి పరినిఘ్నంతః పుర్యా మస్యాం సమంతతః. ౨౬




అసంపాతం కరిష్యంతి పతంతః కంకవాససః

టీక॥కంకవాససః=బాణములు; అస్యాం=ఈ;పుర్యాం = పట్టణమునందు;సమంతతః=అంతటను; పతంతః=పడుచున్నవై;రక్షాంసి= రాక్షసులను; పరినిఘ్నంతః = చంపుచు; అసంపాతం = అవకాశములేనట్లుగా;కరిష్యంతి=చేయఁగలవు.

రామలక్ష్మణ నామాంకితములగు బాణములు,ఈపట్టణము నందంతటను బ్రయోగింపఁబడి, రాక్షసులం జంపుచు, నెంతమాత్రమును జోటులేనట్లు, ఈపట్టణంబంతయువ్యాపింపఁగలవు.

అని, తాత్పర్యము.

రాక్షసేంద్ర మహాసర్పాన్ స రామగరుడో మహాన్. ౨౭
ఉద్ధరిష్యతి వేగేన వైనతేయ ఇవోరగాన్

టీక॥మహాన్ = గొప్పవాఁడైన; సః=ఆ;రామగరుడః= రాముండను గరుడుఁడు;రాక్షసేంద్రమహాసర్పాన్=రాక్షసశ్రేష్ఠులను గొప్పసర్పములను; వేగేన=వేగముచేత;వైనతేయః = గరుడుఁడు; ఉరగానివ=సర్పములనుంబోలె;ఉద్ధరిష్యతి = పైకెత్తఁగలఁడు, చంపఁగలఁడనుట.

ఆరాముండను గరుత్మంతుఁడు,గరుత్మంతుఁడు సర్పంబులఁ జంపునట్లు , వేగంబున రాక్షసులను సర్పంబులం, జంపును. అని, తాత్పర్యము.

అపనేష్యతి మాం భర్తా త్వత్తః శీఘ్ర మరిందమః. ౨౮
అసురేభ్య శ్శ్రియం దీప్తాం విష్ణుస్త్రిభిరివ క్రమైః

టీక॥అరిందమః= శత్రువులనడఁగఁద్రొక్కునట్టి;భర్తా=పెనిమిటియగు రాముండు; శీఘ్రం=శీఘ్రముగా; త్వత్తః=నీయొద్దనుండి;మాం=నన్ను ; విష్ణుః=విష్ణుదేవుఁడు; త్రిభిః= మూఁడైన;క్రమైః=అడుగులచేత; అసురేభ్యః=అసురులయొద్దనుండి;దీప్తాం=ప్రకాశించుచున్న; శ్రియమివ= లక్ష్మినిం బోలె;అపనేష్యతి=కొనిపోఁగలఁడు.

విష్ణుదేవుండు, మూఁడడుగులచే,

నసురలయొద్దనుండి, రాజ్యలక్ష్మిని హరించినట్లు, శత్రువులనడంగఁ ద్రొక్కి-౦జాలిననాపెనిమిటియగు రాముండు, సీయొద్దనుండినన్నుశీఘ్రముగాఁదీసికొనిపోలేఁడు. అని, తాత్పర్యము.

జనస్థానే హతస్థానే నిహతే రక్షసాం బలే. ౨౯
అశక్తేన త్వయా రక్షః కృత మేత దసాధు వై

టీక॥రక్షః = రాక్షసుండవగురావణుఁడా! రక్షసాం=రాక్షసులయొక్క; బలే=సైన్యము; నిహతే = చంపఁబడఁగా; జనస్థానే = జనస్థానము; హతస్థానే=కొట్టఁబడినస్థానమగుచుండఁగా; అశక్తేన=శక్తిలేనట్టి; త్వయా=నీచేత; అసాధు = మంచిదికాని("వై" అనునది పాదపూరణార్థము); ఏతత్ = ఈదొంగతనము; కృతం=చేయఁబడినది.

జనస్థానంబునందలి రాక్షసులందఱుఁజంపఁబడి, జనస్థానంబంతయుఁబాడగుటంజూచి, నీవు, యుద్ధంబు సేయశక్తిలేనివాఁడవు కావున, భయంబున, దొంగతనముగా, నన్నుఁగొనితెచ్చినావు.

అని, తాత్పర్యము.

ఆశ్రమంతు తయో శ్శూన్యం ప్రవిశ్య నరసింహయోః. ౩౦
గోచరం గతయో ర్భ్రాత్రో రపనీతా త్వయాఽధమ

టీక॥అధమ — తక్కువవాఁడవైనవాఁడా! నరసింహయోః — పురుషశ్రేష్ఠులయిన; తయోః=ఆ; భ్రాత్రోః= అన్నదమ్ములగు రామలక్ష్మణులు; గోచరం=బహిఃప్రదేశమును ; గతయోస్తు— పోయినవారలగుచుండఁగానే; ఆశ్రమం=ఆశ్రమును; ప్రవిశ్య—చొచ్చి; త్వయా=నీచేత; అహం(అధ్యాహృతము)—నేను; అపనీతా=తేఁబడినాను.

అధముఁడవగురావణుఁడా! పురుషశ్రేష్ఠులయినయా రామలక్ష్మణులిద్దఱు వెలుపలంబోఁగానే, యదిచూచి, నీవాశ్రమంబుప్రవేశించి, దొంగతనంబున, నన్నుఁగొనితెచ్చినావు.

అని, తాత్పర్యము.

సహి గంధ ముపాఘ్రాయ రామలక్ష్మణయో స్త్వయా. ३०
శక్యం సందర్శనే స్థాతుం శునా శార్దూలయోరివ

టీక॥ త్వయా=నీచేత ; రామలక్ష్మణయోః= రామలక్ష్మణులయొక్క ; గంధం=వాసనను; ఉపాఘ్రాయ= మూర్కొని; శార్దూలయోః= పెద్దపులులయొక్క ; గంధం, ఉపాఘ్రాయ (అధ్యాహృతము)= వాసనను మూర్కొని; శునేవ=కుక్కచేతంబోలె ; సందర్శనే=సమ్ముఖమునందు; స్థాతుం = నిలుచుటకు; నశక్యంహి=కాదుగదా!

అప్పుడు రామలక్ష్మణుల వాసన యయినను నీకుం దోఁచియుండు నేని, పులుల వాసన గన్న కుక్కయుంబోలె, నచ్చట నిమిషమయినను, నిలిచియుండలేవు.

అని, తాత్పర్యము.

తస్య తే విగ్రహే తాభ్యాం యుగగ్రహణ మస్థిరమ్. ३२
వృత్రస్యే వేంద్రబాహుభ్యాం బాహో రేకస్య నిగ్రహః

టీక॥ తస్య=అట్టి, బలములేదగుటచే దొంగతనముచేసిన; తే=నీకు ; తాభ్యాం = ఆరామలక్ష్మణులతోఁ; విగ్రహే=యుద్ధమగుచుండఁగా; యుగగ్రహణం=యుద్ధమునుగ్రహించుట,జయమనుట; అస్థిరం=దరుకనది కాదు.ఇంద్రబాహుభ్యాం=ఇంద్రునిభుజములచేత;వృత్రస్య= వృత్రునియొక్క ; ఏకస్య=ఒకటైన;బాహోరివ= భుజమునకువలె; తవ(అధ్యాహృతము)=నీకు; నిగ్రహః=అపజయము.

నీవు మొదలే బలములేనివాఁడవై నందు నభయపడియున్నావు;అట్టినీకు, ఆరామలక్ష్మణులిద్దఱితోఁ యుద్ధముగలుగునేని,నీకుజయంబుగలుగదు; వృత్రునకును ఇంద్రునకునుయుద్ధముగలుగఁగా, ఇంద్రునకు రెండు చేతులుండుటచే నొక చేయిగలవృత్రునకపజయముగల్గినట్లు, వారలిద్దఱునునీవొకండవునగుటచే,వారిచే నీకపజయంబుగల్గుటతప్పదు.

అని, తాత్పర్యము.

క్షిప్రం తవ స నాథో మే రామ స్సౌమిత్రిణాసహ. ३३
తోయ మల్ప మివా దిత్యః ప్రాణా నాదాస్యతే శరైః

టీక॥ మే=నాయొక్క; నాథః=పెనిమిటియగు; సః=ఆ; రామః=రాముఁడు; సౌమిత్రిణాసహ=లక్ష్మణునితోఁగూడ; ఆదిత్యః=సూర్యుఁడు; అల్పం=కొంచెమైన; తోయమివ=జలమునుంబోలె; క్షిప్రం=శీఘ్రముగా; శరైః=బాణములచే; తవ=నీయొక్క; ప్రాణాన్=ప్రాణములను; ఆదాస్యతే=గ్రహింపఁగలఁడు.

నాపెనిమిటియగు రాముఁడు లక్ష్మణునితోఁగూడఁజేరి, సూర్యుండు కిరణంబులచేఁగొంచెపునీళ్లను గ్రహించునట్లు, శీఘ్రముగా బాణంబులచేనీ ప్రాణంబులంగొనును. అని, తాత్పర్యము.

గిరిం కుబేరస్య గతోఽపధాయ వా
("పురీం కుబేరస్య గతోఽపయాయ వా" ఇతి పాఠాంతరం.)
సభాం గతో వా వరుణస్య రాజ్ఞః. ౩౪
అసంశయం దాశరథే ర్న మోక్ష్యసే
మహాద్రుమః కాలహతోఽశనేరివ

టీక॥ కాలహతః=కాలముచేఁగొట్టఁబడిన; త్వం(అధ్యాహృతము)=నీవు; అపధాయ=పాఱి; (పాఠాంతరపక్షమందు) అపయాయ=పాఱి; కుబేరస్య=కుబేరునియొక్క; గిరిం=పర్వతమయిన కైలాసమును; (పాఠాంతర పక్షమునందు) పురీం=అలకాపట్టణమును; గతో వా=పొందినవాఁడవుగాని; రాజ్ఞః=రాజయిన; వరుణస్య=వరుణునియొక్క; సభాం=సభను; గతో వా=పొందినవాఁడవుగాని; ("కుబేరునిపట్టము" అనుట, యితరములయిన యూర్ధ్వలోకములకును, "వరుణునిసభను" అనుట, యధోలోకములకును సలక్షణము) మహాద్రుమః=పెద్దచెట్టు; అశనేరివ=పిడుగువలనంబోలె; అసంశయం=సందేహములేక; దాశరథేః=రామునివలన; న మోక్ష్యసే=విడువఁబడవు.

నీకిది మంచికాలముకాదు, కావున నెనన్నిట్లు నిర్బంధించుచున్నావు; అట్లగుటంజేసి, నీవు, రామునిబారింబడి, కుబేరునిపట్టణంబునకుఁబోయినను వరుణునొద్దకుఁబోయినను, ఎచ్చటికిఁబోయినను, పిడుగుపడఁగా వృక్షముతప్పించుకొనలేనట్లు, తప్పించుకొనలేవు.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.—"తత్త్వదృష్టిచేత రావణుండు సీతతోఁ బరుషవచనంబులాడకున్నను, సీతాదేవి మాత్రము, అట్టితాత్త్వికార్థము మఱుఁగు పడియుండవలెనని, పరుషముగా మాటలాడినది." అని, మహేశ్వరతీర్థులు వచించిరి. "నేను బ్రతికియుండఁగా నిన్ను రాముండు గొనిపోవఁడు, నన్నుఁ జంపి గొనిపోవును, నిన్నుఁ జూచుచుండుటచే నాకు మోక్షంబు గలుగును, రామునిచేఁ జంపఁబడుటం జేసి, మోక్షంబు లభించును; దానికొఱకై నిన్ను వేఁడుకొనుచున్నాను" అని మొదలుగా రావణుండు సీతతోఁ జెప్పినాఁడని రహస్యార్థములచేఁ దేటయగుచున్నది గదా! సీతయును "నీవు నన్ను భరింపఁజాలవు, నేను సాక్షాల్లక్ష్మిని. నన్ను భరింపఁజాలినవాఁడు మహావిష్ణురూపుండగు రాముండే; అట్లు నీకును రాముండే మోక్షంబివ్వవలయును" అని, సూచించి, యతనిమనోదార్ఢ్యమును బరీక్షించుటకై "నీకు బ్రతుకనిచ్ఛయుండునేని, రామునకు నన్నొసంగి యతని శరణొందుము; అట్లతని యనుగ్రహంబున, శీఘ్రంబునం గాకున్నను, క్రమముగా ముక్తిఁ బడయ వచ్చును" అని, చెప్పి, అతండు అత్యంతఘనమయిన ముముక్షుతగలవాఁడగుట నెఱింగి, "నిన్ను రాముండు విడువఁడు, నీ బంధువులుగాని మఱి నిన్నుఁ గావలసిన వారెవ్వరుగాని వచ్చినను నిన్నుఁ జంపును, దానంజేసి, నీకు మోక్షంబు గల్గును; భయపడకుము; మొదలే నీవు నన్నుఁ గొనితెచ్చినపుడే రాము బారింబడియుందువేని యప్పుడె నీకు మోక్షంబు గల్గియుండును; సంసారవాసనం జేసి, యిప్పుడు నీకు వైరాగ్యంబు గల్గదయ్యె" అని, రావణునకు నమ్మకము గల్గుటకై సకారణముగా నిరూపించి చెప్పినది. ఇట్లు మాఱుదోఁచుచున్నది. అధికారిపరము, బుద్ధిమంతులాలోచించి తెలిసికొనునది. విస్తారభయంబున నింతటితో ముగింపఁబడియె.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

సుందరకాండే, ఏకవింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర

వ్యాఖ్యానంబునందు, సుందరకాండైకవింశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

ద్వావింశసర్గప్రారంభః.

సీతాయా వచనం శ్రుత్వా పరుషం రాక్షసాధిపః
ప్రత్యువాచ తత స్సీతాం విప్రియం ప్రియదర్శనామ్. ౧

టీక॥ రాక్షసాధిపః= రాక్షసులకుం బ్రభుండయిన రావణుండు ; సీతాయాః=సీతయొక్క; పరుషం = కఠినమయిన; వచనం=మాటను;శ్రుత్వా= విని;తతః = అటుపిమ్మట; ప్రియదర్శనాం = సంతోష కరంబగుచూచుటగల; సీతాం=సీతనుగూర్చి; విప్రియం= దుఃఖకరంబగుమాటను; ప్రత్యువాచ= బదులుచెప్పెను.

రాక్షసేశ్వరుండగు రావణుండు,సీత చెప్పినపరుషవచనంబులనువిని , చూపరులకుసంతోషంబుగలిగించు సీతాదేవిం జూచి, కఠినంబుగా,నిట్లని, చెప్పెను అని, తాత్పర్యము.

రహస్యార్థము.— అపరుషం= కఠినంబుగాని;వచనం; శ్రుత్వా; విప్రియం=తనకు విశేషముగా మేలుగల్గించునట్టి మాటను; ప్రత్యువాచ. శేషము. పై.

రావణుండుసీత చెప్పిన మృదువచనంబులువిని, యంతట జూపరులకు సంతోషంబు గలిగించునట్టి సీతాదేవింజూచి, తనకు మేలుగలుగుటకై, యిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

యథాయథా సాంత్వయితా వశ్య స్త్రీణాం తథాతథా
యథాయథా ప్రియం వక్తా పరిభూత స్తథాతథా. ౨

టీక. పురుషః(అధ్యాహృతము)=పురుషుడు;యథాయథా=ఎట్లెట్లు;స్త్రీణాం=స్త్రీలయొక్క, స్త్రీలననుట;సాంత్వయితా=బుజ్జగించువాఁడో;తథాత

థా=అట్లట్లు;వశ్యః=స్వాధీనుఁడు.యథాయథా=ఎట్లెట్లు;ప్రియం=సంతోషకరంబగుమాటను; వక్తా=చెప్పువాఁడో;తథాతథా=అట్లట్లు;పరిభూతః=తిరస్కరింపఁబడినవాఁడు.

పురుషుఁడు స్త్రీల నెంతబుజ్జగించునో, అంతవారలకు స్వాధీనుఁడగును; మఱివారల కెంతమంచిమాటలం జెప్పునో, అంతవారిచే తిరస్కరింపఁబడును.

అని, తాత్పర్యము.

సన్నియచ్ఛతి మే క్రోధం త్వయి కామ స్సముత్థితః
ద్రవతో మార్గ మాసాద్య హయానివ సుసారథిః. ౩

టీక॥ త్వయి=నీయందు; సముత్థితః=పుట్టిన;కామః=మోహము,మే=నాయొక్క; క్రోధం=కోపమును; సుసారథిః=మంచిసారథి; అమార్గం=తప్పుత్రోవను;ఆసాద్య=పొంది; ద్రవతః=పరుగెత్తుచున్న; హయానివ=గుఱ్ఱములనుంబోలె; సన్నియచ్ఛతి= అణఁచుచున్నది.

నాకిప్పుడు,నీయందుఁగలిగినకామము,సమర్థుఁడగుసారథి,త్రోవదప్పిపరుగెత్తుగుఱ్ఱములను లాగిపట్టునట్లు,నాకోపమును, అణఁచుచున్నది.

అని, తాత్పర్యము.

రహస్యార్థము. కామః=ఇచ్ఛ, భక్తియనుట, శేషము. స్ప.

నాకిప్పుడు నీయందుఁగలిగియున్నభక్తి నారాక్షసజాతికి స్వభావమయి నాకుఁ గలిగియుండుకోపమును, సమర్థుఁడగు సారథి దారిదప్పి పరుగెత్తు గుఱ్ఱములనులాగిపట్టునట్లు, అణఁచుచున్నది; ఇంకనిన్నుఁ బూజించినచో నెంతఫలంబుగల్గునో, చెప్పనలవిగాదు.

అని, తాత్పర్యము.

వామః కామో మనుష్యాణాం యస్మిన్ కిల నిబధ్యతే
జనే తస్మిం స్త్వనుక్రోశ స్స్నేహశ్చ కిల జాయతే. ౪

టీక॥ మనుష్యాణాం = మనుష్యులకు;వామః=ప్రతికూలమయిన;కామః=మోహము;యస్మిన్=ఏజనమునందు;నిబధ్యతేకిల = కట్టఁబడియేయుండునో, దృఢమైయేయుండునో;తస్మిన్=ఆ; జనేతు= జనమునందుమాత్రము; అను

క్రోశః=దయయును; స్నేహశ్చ=చెలిమియును; జాయతే కిల = పుట్టుచున్నది గదా!

కామమననది చెడ్డది, అది యెవ్వరియందు ద్భవమయి పుట్టునో, ఆజనంబు శిక్షింపఁ దగినదైనను, అచ్చట దయయును స్నేహంబును గలుగును.

అని, తాత్పర్యము.

ఏతస్మాత్కారణాత్ సీతే! త్వాం ఘాతయామి న వరాననే
వధార్హా మవమానార్హాం మిథ్యా ప్రవ్రజితే రతామ్. ౫

టీక॥ వరాననే= శ్రేష్ఠమయినముఖముగలసీతా! ఏతస్మాత్ కారణాత్=ఈ కారణమువలన; మిథ్యాప్రవజితే= కపటములయినవనవాసవేషముగల రామునియందు; రతాం = ఆసక్తురాలవ్వను; వధార్హాం = చంపుటకుఁదగిన దానవ్వను; అవమానార్హాం=అవమానింపఁదగిన దానవ్వనగు; త్వాం=నిన్ను; నఘాతయామి=చపించకున్నాను.

సుందరమగు ముఖముగలసీతా! ఇట్లు, నాకునీమీఁద మోహంబు గల్గియుండుకారణంబున నే, నీవ్వనన్ను విడిచికపట వానప్రస్థవేష ధరుండగు రామునందాసక్తినుంచియున్నను, అవమానించిచంపఁ దగినదానవైనను, నిన్నుఁ జంపకున్నాను .అని, తాత్పర్యము.

రహస్యార్థము.— ఏతస్మాత్= ఈ; కారణాత్ =కారణంబువలన, నాయిష్టదైవంబగు రాముండు నీయందాసక్తుండయియుండుటవలననని యర్థము; ప్రవజితే=వానప్రస్థుండగు నాయిష్టదైవంబ యినరామునందు; రతాం=ఆసక్తురాలవగు; త్వాం= నిన్ను; నఘాతయామి= చంపుటయే లేదు. వధార్హాం= చంపుటకుఁ దగినదియును ; అవమానార్హాం= అవమానింపఁదగినదియునగు స్త్రీని; ఘాతయామీతియత్ (అధ్యాహృతము) = చంపించెదననుచదియేదిగలదో; తత్ (అధ్యాహృతము)= అదియును; మిథ్యా=అబద్ధము.

సీయందు నాయిష్టదేవంబగు రాముండాసక్తుండై యుండుటంజేసి, అట్టిరామునియందాసక్తవయిననిన్నుఁ జంపుటయేలేదు, సరియేకదా! అవమానించి చంపఁదగినంతటి యపరాధంబు గావించినస్త్రీని,ఎప్పుడునుజంపను.

అని, తాత్పర్యము.

పరుషాణీ హ వాక్యాని యాని యాని బ్రవీషి మామ్
తేషు తేషు వధో యుక్త స్తవ మైథిలి దారుణః. ౬

టీక॥ మైథిలి=సీతా ! ఇహ=ఇచ్చట; మాం=నన్నుఁగూర్చి; యాని యాని=ఏవేవి; పరుషాణి=కఠినములయిన; వాక్యాని=మాటలను; బ్రవీషి= చెప్పుచున్నావో; తేషు తేషు= ఆవాక్యములయందు; తవ=నీకు; దారుణః=భయంకరమగు; వధః=చంపుట; యుక్తః=తగినది.

సీతా! నీవు, నన్నుఁగూర్చి , పరుషంబులగుమాటలెన్ని చెప్పితివో, వానిలో నొక్కొకటికిని , నన్నుభయంకరముగాఁ జంపుటమంచిది.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.—మైథిలి=సీతా! ఇహ,తవమాం=నీయొక్క-నన్ను,నీవాఁడనైన నన్నుగూర్చి, నీభృత్యుండనైనన న్నుగూర్చియనుట; యానియాని , పరుషాణి, వాక్యాని, బ్రవీషి. తేషు తేషు,మమ (అధ్యాహృతము) = నాకు;వధః; యుక్తః.

సీతా! నీభృత్యుండనైననన్నుఁగూర్చి, యిన్నిపరుషవాక్యంబులాడితివే , వీనిలో నొక్కొక మాట యనుటకు బదులుగా , నన్నుఁజంపవచ్చును. అని, రావణుండుసీతతోఁజెప్పెను.

అని, తాత్పర్యము,

ఏవ ముక్త్వాతు వైదేహీం రావణో రాక్షసాధిపః
క్రోధసంరంభసంయుక్త స్సీతా ముత్తర మబ్రవీత్. ౭

టీక॥ రాక్షసాధిపః=రాక్షసులకుఁబ్రభువైన; రావణః= రావణుఁడు ; వైదేహీం=సీతనుగూర్చి; ఏవం=ఇట్లు ఉక్త్వాతు=చెప్పినంతనె ; క్రోధసంరంభసంయుక్తః=కోపముయొక్క-యతిశయముతోఁగూడినవాఁడై;సీతాం = సీతనుగూర్చి;ఉత్తరం= పైమాటను ; అబ్రవీత్=చెప్పెను.

రాక్షసులకుఁబ్రభుండగు రావణుండు, యిట్లుసీతతోఁజెప్పి , యంతనగ్గలంబగుకోపంబున, మఱలనిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

ద్వౌ మాసౌ రక్షితవ్యౌ మే యో వధి స్తే మయా కృతః

టీక॥ యః=ఏ; అవధిః=గడువు; తే=నీకు; మయా=నాచేత; కృతః=చేయఁబడినదో; తౌ(అధ్యాహృతము)=ఆ; ద్వౌ=రెండు; మాసౌ=మాసములు రక్షితవ్యౌ=కాపాడఁబడవలసినవి.

నేను నీకేర్పఱిచిన గడువు ప్రకారము, ఇంక రెండుమాసములు కాచియుండవలయును. అని, తాత్పర్యము.

రహస్యార్థము.—మే = లక్ష్మివగు సీత! శేషము. పై.

తత శ్శయన మారోహ మమ త్వం వరవర్ణిని. ౮

టీక॥ వరవర్ణిని=ఉష్ణకాలమునను సుఖశీతలమును శీతకాలమునను సుఖోష్ణమునైన దేహముగలిగి భర్తయందను రాగముగల స్త్రీవగు, సీతా! తతః=అటుపిమ్మట; త్వం=నీవు; మమ=నాయొక్క; శయనం=పాన్పును; ఆరోహ = ఎక్కుము.

సీతా! అటుపిమ్మట, నీవు శయనంబు ననాతోఁగూడఁబరుండవలయును.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.—శయనం= పుష్పకవిమానమును. శేషము. పై.

ఇంక రెండుమాసము లోర్చియుండుము; అంతఁ బెనిమిటితోఁగూడి, నా పుష్పకవిమానంబు నెక్కుము.

అని, తాత్పర్యము.

ఊర్ధ్వం ద్వాభ్యాం తు మాసాభ్యాం భర్తారం మామనిచ్ఛతీం
మమ త్వాం ప్రాతరాశార్థ మాలభంతే మహానసే. ౯

టీక॥ ద్వాభ్యాం=రెండైన; మాసాభ్యాం = మాసములకన్న; ఊర్ధ్వం తు=పైనమాత్రము; మాం=నన్ను; భర్తారం= పెనిమిటినిగా; అనిచ్ఛతీం=కోరకున్నట్టి; త్వాం=నిన్ను; మమ=నాకు; ప్రాతరాశార్థం = ప్రాతఃకాలమునందలిభోజనముకొఱకు; మహానసే= వంటయింటియందు; ఆరభంతే(ఆలభంతే)=చంపుదురు.

ఆ రెండుమాసములలో నీవు నన్నుఁ బెనిమిటిగా వరింపవేని, నాకామఱునాఁటి ప్రాతఃకాల భోజనంబునకై, నిన్ను వంటయింటంజంపివండుదురు,

అని తాత్పర్యము.

రహస్యార్థము.—ద్వాభ్యాం = రెండయిన; మాసాభ్యాం= మాసముల

కన్న; ఊర్ధ్వఁతు= పైనమాత్రము; భర్తారం= పెనిమిటియగు రామునిఁ; అనిచ్ఛతీం=నన్నుఁగోరకున్న; మమ = నాయొక్క; మాం=లక్ష్మిని;ప్రాప్తుం (అధ్యాహృతము) = పొందుటకు, త్వాం=నిన్ను;ప్రార్థయే(అధ్యాహృతము)=ప్రార్థించెదను.ప్రాతః= ప్రొద్దున;మహానసే=వంటయింటియందు;ఆలభంతే=మృగములంజంపుదురు.భక్షయ (అధ్యాహృతము)=తినుము.

ఆరెండుమాసములపైని, నీవునీపెనిమిటియగురామునింబొందుము; ఈ రాజ్యలక్ష్మినన్నువలవకున్నది; కావున, నీవుదీనినింగూడ నంగీకరింపవలె నని ప్రార్థించెదను; ప్రాతఃకాలము నందు, వంటయింటియందు, మృగంబులం జంపివండుదురు;నీవువానిభక్షింపుము.

అని, తాత్పర్యము.

తాం తర్జ్యమానాం సంప్రేక్ష్య రాక్షసేంద్రేణ జానకీమ్
దేవగంధర్వకన్యాస్తా విషేదు ర్వికృతేక్షణాః. ౧౦

టీక॥ రాక్షసేంద్రేణ= రాక్షసుల కుఁబ్రభువైనరావణునిచేత; తర్జ్యమానాం = బెదరింపఁబడుచున్న; తాం=ఆ;జానకీం=జనకునికొమార్తెయగుసీతను; సంప్రేక్ష్య = చూచి; తాః=ఆ; దేవగంధర్వకన్యాః= దేవతాస్త్రీలునుగంధర్వస్త్రీలును; వికృతేక్షణాః=వికారమునొందినకండ్లుగలవారలై; విషేదుః=దుఃఖించిరి.

రాక్షసేశ్వరుండగు రావణుండట్లు సీతనుబెదరించుటంజూచి,యచ్చటరావణునితోఁగూడనుండు దేవతాస్త్రీలును గంధర్వవనితలును,దుఃఖంబునఁబొందినవై వికృతములయినకండ్లతో,దుఃఖించిరి.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— ఆదేవతాస్త్రీలకును గంధర్వస్త్రీలకును, రావణుండుసీతను,యథార్థముగా బెదిరింపకున్నను,బెదరించినట్లు తోఁచినది కావున, వారలుదుఃఖించిరి.

అని, తాత్పర్యము.

ఓష్ఠప్రకారై రపరా వక్త్రైర్నేత్రై స్తథాపరాః
సీతా మాశ్వాసయామాసు స్తర్జితాం తేన రక్షసా. ౧౧

టీక॥ అపరాః=ఇతరస్త్రీలు; ఓష్ఠప్రకారైః= పెదవులయొక్కవిధములచే




తను; తథా=అట్లు; అపరాః= ఇతరలు; వక్త్రైర్నేత్రైః = ముఖములచేతనుగండ్ల చేతను; తేన=ఆ; రక్షసా = రావణునిచేత; తర్జితాం = బెదరింపఁబడిన; సీతాం=సీతను;ఆశ్వాసయామాసుః=ఊఱడించిరి.

మఱికొందఱు, పెదవులను గదలించియుఁ గొందఱు, ముఖసంజ్ఞల చేతను నేత్రసంజ్ఞలచేతను, రావణునిచే బెదరింపఁబడినసీతను, ఊఱడించిరి.

అని, తాత్పర్యము.

తాభి రాశ్వాసితా సీతా రావణం రాక్షసాధిపమ్
ఉవాచాత్మహితం వాక్యం వృత్తశౌండీర్యగర్వితమ్. ౧౨

టీక॥సీతా=సీత; తాభిః=వారలచేత;ఆశ్వాసితా = ఊఱడింపఁబడినదై; రాక్షసాధిపం= రాక్షసులకుఁబ్రభువైన;రావణం=రావణునిగూర్చి;ఆత్మహితం=తనకుమేలుకల్గించునట్టి;వాక్యం=మాటను; వృత్తశౌండీర్యగర్వితం, వృత్త= సదాచారముయొక్క,పాతివ్రత్యముయొక్కయనుట,శౌండీర్య = బలముచే,గర్వితం = గర్వముగల్గినట్లుగా;ఉవాచ=చెప్పెను.

సీతాదేవియు,వారలచేనట్లూఱడింపఁబడినదై, రాక్షసేశ్వరుండగు రావణుం జూచి, పాతివ్రత్యబలగర్వంబునఁ,దనకుహితంబగునట్లు, చెప్పెను.

అని, తాత్పర్యము.

నూనం న తే జనః కశ్చి దస్తి నిశ్శ్రేయసే స్థితః
నివారయతి యో న త్వాం కర్మణో ఽస్మా ద్విగర్హితాత్. ౧౩

టీక॥తే = నీయొక్క; నిశ్శ్రేయసే=మేలునందు;స్థితః=ఉన్నట్టి;జనః=జనము;కశ్చిత్ = ఒకానొకఁడును;నాస్తి=లేఁడు.నూనం=నిశ్చయము.యః=ఎవ్వఁడు;అస్మాత్ = ఈ; విగర్హితాత్ =నిందింపఁబడిన; కర్మణః=కార్యమునుండి;నివారయతి = అడ్డగించునో;సచ(అధ్యాహృతము) = వాఁడును;న=లేఁడు.

ఇచ్చట నీమేలుగోరువాఁ డెవ్వఁడును లేఁడు;నీవిట్లుపతివ్రతనగునన్నునిర్బంధించుచుండఁగా, “నిదియకార్య”మని చెప్పినిన్నుమఱల్చువార లెవ్వరును లేరు;ఇది నిశ్చయము.




రహస్యార్థము.— నీభార్యాపుత్రాదులలో నెవ్వరును నీమేలుగోరువారు లేరు; అందఱును దమతమమేలుగోరుకొనువారలె; మఱియు నీవిట్టినిందితమయిన రాక్షసాధిపత్యము చేయుచున్నావే, నీ "కీకార్యము చేయవల" దని చెప్పువారలెవ్వరును లేరు; అట్లు, నీకు ఇష్టప్రాప్తినిగాని అనిష్టనివృత్తినిగాని, గోరువారలెవ్వరును లేరు; కావున, నీవు కరుణింపందగినవాఁడవు; నిన్ను రాముండు కరుణించును. భయపడకుము. అని, తాత్పర్యము.

మాం హి ధర్మాత్మనః పత్నీం శచీమివ శచీపతేః
త్వదన్యస్త్రిషు లోకేషు ప్రార్థయేన్మనసాపి కః. ౧౪

టీక॥ శచీపతేః = శచీదేవికిఁ బెనిమిటి యయినయింద్రునియొక్క; పత్నీం (అధ్యాహృతము) = భార్యయగు; శచీమివ (స్థితాం) = శచీదేవియుంబోలెనున్న; ధర్మాత్మనః = ధర్మబుద్ధిగలరామునియొక్క; పత్నీం = భార్యనైన; మాం హి = నన్నుఁగూడ; త్రిషు = మూఁడైన; లోకేషు = లోకములయందును; త్వదన్యః = నీకన్న నితరుండగు; కః = ఎవ్వఁడు; మనసాపి = మనసుచేతనైన; ప్రార్థయేత్ = కోరును.

దేవేంద్రునకు శచీదేవియుంబోలె ధర్మాత్ముండగు రామునకు భార్యయయియున్న నన్ను, ముల్లోకంబులయందును, నీవు దప్ప మఱియెవ్వరును, ఇట్లు మోహించి, భార్యగాఁ గోరరు.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— ధర్మాత్మనః = ధర్మస్వరూపుండగు రామునియొక్క; శేషము. పై.

రాముండు, ధర్మస్వరూపుండగు నారాయణుండె కాని వేఱు కాదు; శచీదేవి యింద్రునకవినాభూతయయిన భార్యయగునట్లు, నేనట్టి రామునకు నిత్యభార్యను. మహాలక్ష్మి యనంబడుదానను; అట్టి నన్ను, ఇట్లు ప్రత్యక్షముగాఁ జూచి, వరంబులు ప్రార్థించువాఁడు, ముల్లోకంబులయందును నీవు దప్ప, నట్టిపుణ్యావంతుండు లేఁడు.

అని, తాత్పర్యము.

రాక్షసాధమ రామస్య భార్యామమితతేజసః

ఉక్త్వా నసి యత్పాపం క్వ గత స్తస్య మోక్ష్యసే. ౧౫

టీక॥ రాక్షసాధమ = రాక్షసులలోఁ దక్కువయయినవాఁడవగు రావణుఁడా; అమితతేజసః = కొలఁదిలేనిపరాక్రమముగల; రామస్య = రామునియొక్క; భార్యాం = భార్యనుగూర్చి; యత్ = ఏ; పాపం = చెడ్డమాటను; ఉక్త్వాన్ = చెప్పినవాఁడవు; అసి = అగుచున్నావో; క్వ = ఎచ్చటికి; గతః = పోయినవాఁడవై; తస్య = (పంచమ్యర్థమునందు షష్ఠి) దానివలన; మోక్ష్యసే = విడువఁబడుదువు?

రాక్షసాధముఁడా! కొలఁదిలేని పరాక్రమంబుగల రామునిభార్యనగు నన్నిట్టిమాటలాడితివే, నీవే లోకంబునకుఁబోయి, యీయపరాధంబు దప్పించుకొనఁగలవు? ఎక్కడికిఁ బోయినను, రాముఁడు నిన్ను దండింపక విడువఁడు.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— రాక్షసాధమ = రాక్షసులలోఁ దక్కువయిన వాఁడా! రాక్షసగుణంబులు లేనివాఁడా యనుట; అమితతేజసః = కొలందిలేని కాంతిగల; సూర్యాదులకాంతికిఁగొలంది గలదు, ఇతనికాంతికది లేదనుట; రామస్య = నారాయణరూపుండగు రాముని యొక్క; భార్యాం = భార్యనగు లక్ష్మీదేవినినన్నుఁగూర్చి; యత్ = ఏ; పాపం = నీకుఁగలకష్టమును; ఉక్త్వాన్ = చెప్పుకొన్నవాఁడవు; అసి = అగుచున్నావో; క్వ = ఎచ్చటికి; గతః = పోయినవాఁడవై; తస్య (తస్మాత్) = ఆకష్టమునుండి; మోక్ష్యసే = విడువఁబడఁగలవు?

రావణుఁడా! నీవు రాక్షసుండవై పుట్టినను నీకు రాక్షసగుణంబులు లేవు; సూర్యాదులకాంతికన్న నధికంబును గొలఁదిలేనిదియునగు కాంతితోఁగూడిన సాక్షాన్నారాయణరూపుండగు రాముని భార్యను మహాలక్ష్మినైననాయొద్ద, నీకష్టములేమేమి చెప్పుకొంటివో, నీవు రాముని విడిచి యెచ్చటికిఁ బోయినను ఎవ్వనినాశ్రయించినను, ఆకష్టంబులఁ బోఁగొట్టువాఁడెవ్వఁడును లేఁడు; కావున రాముని నాశ్రయింపుము.

అని, తాత్పర్యము.

యథా దృప్తశ్చ మాతంగ శ్శశశ్చ సహితో వనే
తథా ద్విరదవ ద్రామ స్త్వం నీచ శశవ త్స్మృతః. ౧౬




టీక॥ వనే= అడవియందు ; సహితేః = సంధించిన; దృప్తేః=గర్వించియున్న; మాతంగశ్చ=ఏనుంగును; శశశ్చ= కుందేలును ; యథా=ఎట్లో; తథా=అట్లు; రామః=రాముఁడు;ద్విరదవత్=ఏనుఁగువలె.త్వం=నీవు; నీచశశవత్ = తక్కువయినకుందేలు వలెను; స్మృతేః=చెప్పఁబడినావు.

అడవియందు , మదపుటేనుంగును కుందేలును బోరునేని, యెట్లుండునో, అట్లు,రాముండును నీవును , యుద్ధము సేయుదురేని, రాముఁడుమదపు టేనుంగువలెను, నీవునీచమయిన కుందేలు వలెను, అవుదురు.అని, తాత్పర్యము.

రహస్యార్థము.— "రాముఁడు నన్నుంజంపినచోఁగదా, నాకు మోక్షము. ఇంద్రాదులుంబోలె రాముఁడు నన్నుఁజంపలేఁడేని,నాగతియేమి?" అని, సంశయింపఁవలదు . మదపుటేనుంగునకును కుందేలునకు ఎంతయంతర మున్నదో, రామునకును,నీకును , అంతయంతరంబున్నది; కావున , రాముండు నిన్నుఁ దప్పకచంపును,అట్లునీకు మోక్షంబును వచ్చును.సంశయింప వలదు.

అని, తాత్పర్యము.

స త్వ మిక్ష్వాకు నాథం వై క్షిపన్నిహ నలజ్జసే
చక్షుషో ర్విషయం తస్య న తావ దుప గచ్ఛసి. ౧౭

టీక॥సః=అట్టి;త్వం=నీవు;ఇక్ష్వాకునాథం వై = ఇక్ష్వాకువంశమునఁబుట్టినవారలకుఁ బ్రభువైన మహానుభావుండగు రాముని; క్షిపన్=దూరముగాఁ బోవునట్లుచేయుచు;ఇహ=ఇచ్చట; నలజ్జసే= సిగ్గునొందకున్నావు. తస్య= ఆరామునియొక్క; చక్షుషోః=కండ్లకు;విషయం=విషయంబగుటను , అగపడుటననుట ; నోపగచ్ఛసి తావత్= పొందవైతివిగదా!

ఇట్టిస్వభావంబింకపు మాటలాడుచున్నావే; అప్పుడు,కపటంబున రాముని దూరముగాఁబోవునట్లుచేసి, దొంగతనముగా నన్నుంగొనితెచ్చితివే ; సిగ్గులేదా?నీవింకను రామునికండ్లకగపడలేదు; అతనికంటంబడితివేని , నీకుఁదెలియును. అని, తాత్పర్యము.

రహస్యార్థము.— నీవిప్పుడిట్లు మోక్షంబుగావలయునని కోరుచున్నావు; అప్పుడు,రాముండుదూరంబుగాఁ




బోవువఱకు దాఁగియుంటివి; అంతమో క్షేచ్ఛగలవాఁడవప్పుడేల రాము నెదుటికి రానైతివి; నీకు సిగ్గులేదా ఏమి? కొంతయోచించియుండుము; ఆరాముని దృష్టిపథంబున నెప్పుడుపడుదువో, అప్పుడు నీకు మోక్షముగల్గును.

అని, తాత్పర్యము.

ఇమే తే నయనే క్రూరే విరూపే కృష్ణపింగళే
క్షితౌ న పతితే కస్మాన్మామనార్య నిరీక్షతః. ౧౮

టీక॥ అనార్య = దుష్టుండవగు రావణుఁడా! మాం=నన్ను; నిరీక్షతః = చూచుచున్న; తే=నీయొక్క; క్రూరే= భయంకరములును; విరూపే = వికృతములయినవియును; కృష్ణపింగళే= నల్లనివియును గోరోజనమువంటి వర్ణముగలవియు నగు; నయనే=కండ్లు; క్షితౌ=నేలయందు; కస్మాత్=ఎందువలన; పతితే=పడినవి; న=కాలేదు?

దుష్టుండవగు రావణుఁడా! పతివ్రతవగు నన్ను మోహంబునం జూచుచున్నావే; భయంకరములై వికృతములయి, నడుమ నల్లగాను గోరోజనమువంటి వర్ణముగలిగియుండు, నీకండ్లు రెండును, వీడి, నేలంబడవేఁ?

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— అచ్చటనున్న వారలందఱుఁ దాత్త్వికార్థము నెంతమాత్రమును దెలిసికొనకుండుటకై, స్పష్టముగాఁ గొన్ని పరుషవచనంబులను, సీతాదేవి చెప్పినది. ఇట్లు; ముందును దెలిసికొనునది. లేక; నీవు నన్ను మోహంబునం జూచియుందువేని, నీకండ్లువీడి నేలంబడును. అట్లులేక, నీవు నన్ను భక్తితోఁ జూచుచున్నావు కావున, నీవు క్షేమంబుగానున్నావు.

అని, తాత్పర్యము.

తస్య ధర్మాత్మనః పత్నీం స్నుషాం దశరథస్య చ
కథం వ్యాహరతో మాం తే న జిహ్వా వ్యవశీర్యతే. ౧౯

టీక॥ ధర్మాత్మనః=ధర్మబుద్ధిగలః; తస్య=ఆరామునియొక్క; పత్నీం= భార్యను; దశరథస్య = దశరథునియొక్క; స్నుషాంచ=కోడలనగు; మాం=

నన్నుఁగూర్చి; వ్యాహరతః = చెప్పరాని మాటలు చెప్పుచున్న; తే=నీయొక్క; జిహ్వా=నాలుక; కథం=ఎట్లు; నవ్యవశీర్యతే=వీడిపడకున్నది?

ధర్మాత్ముండగు రాముని భార్యను దశథునికోడలనగు నన్నుఁగూర్చి యిట్టిచెప్పరానిమాటలు చెప్పుచున్నావే; యెందువలన, నీనాలుకవీడి నేలంబడకున్నది?

రహస్యార్థము.—ధర్మస్వరూపుండగు రామునిభార్యను దశరథమహారాజు కోడలను బతివ్రతనగు నన్నుఁ గూర్చి, నీవుతప్పుమాటలు చెప్పియుందువేని, నీనాలుక యప్పుడే నేలంబడియుండును; అట్లులేక, నీవుభక్తితోఁ బ్రార్థించుచుండుటంజేసి, సుఖముగనున్నావు.

అని, తాత్పర్యము.

అసందేశాత్తు రామస్య తపసశ్చానుపాలనాత్
న త్వాం కుర్మి దశగ్రీవ భస్మభస్మార్హ తేజసా.

టీక॥ భస్మార్హ=బూడిదగాఁ జేయఁదగినవాఁడవగు; దశగ్రీవ=రావణుఁడా! రామస్య=రామునియొక్క; అసందేశాత్తు=ఆజ్ఞలేకుండుటవలనను; తపసః= పాతివ్రత్యరూపమయినతపస్సుయొక్క; అనుపాలనాచ్చ=కాపాడుటవలనను; తేజసా= ప్రభావముచేత; త్వాం=నిన్ను; భస్మ=బూడిదగా; నకుర్మి (కరోమి)=చేయకున్నాను.

రావణుఁడా! నీవు భస్మముగాఁ జేయఁదగినవాఁడవు, అయినను, "అపరాధముగలవాని దండింపు" మని పెనిమిటియాజ్ఞలేకుండుటవలనను, పాతివ్రత్యంబునుంగల్గిన తపస్సు తఱుగునని యు, నిన్ను భస్మమునుగాఁ జేయకున్నాను. అని, తాత్పర్యము,

రహస్యార్థము.— భస్మభస్మార్హ=అధికముగా విభూతికిఁదగిన, ఎల్లప్పుడును దేహమంతయు విభూతినిధరించియున్నవాఁడనుట; దశగ్రీవ, రామస్య, అసందేశాత్తు, తపసః, అనుపాలనాత్, త్వాం, తేజసా=కాంతితో; సహితం (అధ్యాహృతము) = కూడినవానిఁగా; జ్ఞానముగలవానిఁగా, జీవన్ముక్తునిఁగా, లేక, యెప్పటివలె నారాయణునొద్ద ద్వారపాలకునిఁగా; నకుర్మి.

ఎల్లప్పుడును దేహమంతయు విభూతిధ

రించుకొనియుండు రావణుఁడా! నాకు, భక్తులకువరంబులిమ్మని రామునియాజ్ఞ లేకుండుటవలననునా తపస్సుక్షయించు ననియునీ పాపములంబోగొట్టి, ఎప్పటియట్లనిన్నునారాయణునొద్ద ద్వారపాలకునిఁగాఁ జేయకున్నాను; రాముండే, నిన్నట్లుచేయును.

అని, తాత్పర్యము.

నాపహర్తుమహం శక్తా త్వయా రామస్య ధీమతః
విధిస్తవ వధార్థాయ విహితో నాత్ర సంశయః. ౨౧

టీక॥ త్వయా=నీచేత; ధీమతః=బుద్ధిమంతుండగు; రామస్య (పంచమ్యర్థేషష్ఠి)=రామునియొద్దనుండి; అపహర్తుం=అపహరించుటకు; అహం=నేను; శక్తా = కూడినదానను; న=కాను. విధిః=అట్లునన్నపహరించుట; తవ=నీయొక్క; వధార్థాయ=చంపుటయనుప్రయోజనముకొఱకు; విహితః= ఏర్పఱుపఁబడినది. అత్ర=ఈవిషయమందు; సంశయః=సందేహము; న=లేదు.

బుద్ధిమంతుండగు రామునొద్ద నేనుండఁగా, నన్నపహరించుటకునీచేతఁగాదు; నీకుఁజావుగలుగుటకై, రాముండు దూరముగాఁ బోవునట్లును నీవునన్ను దొంగతనముగా నపహరించునట్లును, దైవముఘటించినది.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.—తవ = నీయొక్క; వధార్థాయ= చంపుటయనుప్రయోజనముకొఱకు, ఈరాక్షసరూపమునువిడిచి నిజరూపమునొందునట్లు చేయుటకొఱకనుట. శేషము. సై.

రాము నొద్ద నేనుండఁగా, నన్నునీవపహరింపనేరవు; నన్నపహరింపకున్న నిన్నురాముండుచంపఁడు; అట్లునీకీ రాక్షసరూపంబువిడువదు; కావున, నీకీ రాక్షసరూపంబువిడిచినిజరూపంబు వచ్చుటకైయే, నన్ను దొంగతనముగా నపహరింపవీలగునట్లు, దైవముఘటించినది; కావున, నీకుమేలుగలుగును; సందియములేదు.

అని, తాత్పర్యము.

శూరేణ ధనదభ్రాత్రా బలైస్సముదితేన చ
అపోహ్య రామం కస్మాద్ధి దారచౌర్యం త్వయా కృతమ్. ౨౨

స ౨౨

టీక॥ శూరేణ=యుద్ధమునందు భయపడనట్టివాఁడును; ధనదభ్రాత్రా=కుబేరునితమ్ముఁడును; బలైః=బలముచేత;సముదితేనచ = శ్రేష్ఠుండవునగు; త్వయా=నీచేత; కస్మాద్ధి= ఎందువల్లను; రామం=రాముని ; అపోహ్య=తొలఁగఁజేసి;దారచౌర్యం= భార్యను దొంగిలించుట;కృతం= చేయఁబడినది.

“నేను, యుద్ధమునందుభయంపడనివాఁడను, గుబేరునితమ్ముఁడను, బలంబునవినుతికెక్కినవాఁడను,అని, చెప్పుకొనుచున్నావే;అట్టివాఁడవగునేని, బంగారులేడిచే, రాముండు దూరముగాఁబోవునట్లుచేసి, యతనిభార్యనగు నన్ను,ఏలదొంగిలించితెచ్చినావు;అతని యెదుటనేతేవచ్చునుగదా!అని, సీత, రావణునితోఁజెప్పెను.

అని,తాత్పర్యము.

సీతాయా వచనం శ్రుత్వా రావణో రాక్షసాధిపః
వివృత్య నయనే క్రూరే జానకీ మన్వవైక్షత. ౨౩

టీక॥ రాక్షసాధిపః = రాక్షసులకుఁబ్రభుండగు; రావణః = రావణుఁడు; సీతాయాః = సీతయొక్క; వచనం=మాటను; శ్రుత్వా = విని;క్రూరే = భయంకరములయిన;నయనే=కండ్లను; వివృత్య = పెద్దవిచేసి;జానకీం=సీతను;అన్వవైక్షత=చూచెను.

రాక్షసేశ్వరుండగు రావణుండు, సీతచెప్పినమాటనువిని , మిక్కిలియు నాగ్రహంబునొంది , భయంకరములగుకండ్లనుబెద్దగాఁజెఱచి, సీతంబూచెను. అని,తాత్పర్యము.

నీలజీమూతసంకాశో మహాభుజశిరోధరః
సింహసత్త్వగతి శ్శ్రీమాన్ దీప్తజిహ్వోగ్రలోచనః. ౨౪
చలాగ్రమకుటప్రాంశు శ్చిత్రమాల్యానులేపనః
రక్తమాల్యాంబరధర స్తప్తాంగదవిభూషణః. ౨౫
శ్రోణిసూత్రేణ మహతా మేచకేన సుసంవృతః
అమృతోత్పాదనద్ధేన భుజగేనేవ మందరః. ౨౬
తాభ్యాం స పరిపూర్ణాభ్యాం భుజాభ్యాం రాక్షసేశ్వరః

శుశుభేఽచలసంకాశ శ్శృంగాభ్యామివ మందరః. ౨౭

టీక॥ నీలజీమూతసంకాశః=నల్లని మేఘముతో సమానుఁడైన వాఁడును; మహాభుజశిరోధరః= పెద్దభుజములును మెడయునుగలవాఁడును; సింహసత్త్వగతిః= సింహమునకుంబోలెబలంబును నడకయునుగలవాఁడును; శ్రీమాన్= అధికమయినకాంతిగలవాఁడును; దీప్తజిహ్వాగ్రలోచనః= ప్రకాశించుచున్న నాలుకకొనయును కండ్లునుగలవాఁడును; చలాగ్రమకుటప్రాంశుః= కదలుచున్నకొనగలకిరీటముచేనున్నతుఁడైన వాఁడును; చిత్రమాల్యానులేపనః= నానావర్ణములయిన పుష్పమాలికలును మైపూఁతయునుగలవాఁడును; రక్తమాల్యాంబరధరః= ఎఱ్ఱనిపుష్పమాలికలును వస్త్రంబులును దాల్చినవాఁడును; తప్తాంగదవిభూషణః= ప్రకాశించుచున్న బాహుపురులను భూషణములుగలవాఁడును; మహతా = పెద్దదియును; మేచకేన= నల్లనిదియునగు; శ్రోణిసూత్రేణ = మొలనూలిచేత; సుసంవృతః= చుట్టఁబడినవాఁడును; కావుననే; అమృతోత్పాదనద్ధేన= అమృతము పుట్టించుటకై కట్టఁబడిన; భుజగేన=పాముచేత; సంవృతః(అధ్యాహృతము) = చుట్టఁబడిన; మందరఇవ(స్థితః) = మందరపర్వతంబుంబోలెనున్న వాఁడును; అచలసంకాశః=కొండతో సమానుఁడైన వాఁడును; రాక్షసేశ్వరః=రాక్షసులకుఁ బ్రభుండునగు; సః= ఆరావణుండు; పరిపూర్ణాభ్యాం= నిండిన, బలిసినయనుట ; తాభ్యాం= ఆ; భుజాభ్యాం=భుజములచేత; శృంగాభ్యాం = శిఖరములచేత; మందరఇవ = మందరపర్వతంబుంబోలె; శుశుభే=ప్రకాశించెను.

నీలమేఘంబుంబోలె నల్లగానుండు మేనును విశాలములగు భుజంబులును మెడయునుంగలిగి, సింహంబునకుంబోలె బలంబును గమనంబునుంగలిగి, ప్రకాశించుచున్ననాలుకకొనతోను కండ్లతో నొప్పుచుఁ, గోపంబునం గదలుచున్న కిరీటంబుకొనతోఁ జూడనగుచుఁ, చిత్రవర్ణంబులగు పుష్పమాలికల నను లేపనంబుల రక్తవర్ణంబులగుపుష్పమాలికల రక్తవస్త్రంబులనుం దేజరిల్లుచు, బాహుపురులు దాల్చి, దీర్ఘంబై ఇంద్రనీలఘటితంబై నల్లగానుండు మొలనూలుధరించి యుండుటం జేసి, యమృతంబుఁబుట్టించుటకై కట్టిన సర్పంబు

తోఁగూడిన మందరపర్వతంబుం బోలె దర్శనీయుండై, పర్వతాకారుండైయున్న రాక్షసేశ్వరుండగు రావణుండు, ఉన్నతంబులగు భుజంబులచే, శిఖరంబుల మందరపర్వతంబు ప్రకాశించునట్లు, ఎంతయుం బ్రకాశించుచుండెను.

అని, తాత్పర్యము.

తరుణాదిత్య వర్ణాభ్యాం కుండలాభ్యాం విభూషితః
రక్తపల్లవపుష్పాభ్యా మశోకాభ్యా మివాచలః. ౨౮
సకల్పవృక్షప్రతిమో వసంత ఇవ మూర్తిమాన్
శ్మశానచైత్యప్రతిమో భూషితోఽపి భయంకరః. ౨౯
అవేక్షమాణో వైదేహీం కోపసంరక్తలోచనః
ఉవాచ రావణ స్సీతాం భుజంగ ఇవ నిశ్శ్వసన్. ౩౦

టీక॥ తరుణాదిత్యవర్ణాభ్యాం= బాలసూర్యునియొక్క వన్నెవంటి వన్నెగల; కుండలాభ్యాం= పోఁగులచేత; విభూషితః = అలంకరింపఁబడినవాఁడును; రక్తపల్లవపుష్పాభ్యాం= ఎఱ్ఱని చిగుళ్లను బూలునుగల; అశోకాభ్యాం= అశోకవృక్షములచేత; విభూషితః (అధ్యాహృతము)= అలంకరింపఁబడిన; అచలఇవ (స్థితః) = కొండయుంబోలెనున్నవాఁడును; కల్పవృక్షప్రతిమః= కల్పవృక్షముతోఁ బోలికగలవాఁడును; మూర్తిమాన్= ఆకారముగల; వసంత ఇవ (స్థితః) = వసంతర్తువుంబోలె నున్నవాఁడును; భూషితోఽపి= అలంకరింపఁబడినవాఁడైనను; భయంకరః= భయముసేయువాఁడును; కాఫ్రసనే; శ్మశానచైత్యప్రతిమః = శ్మశానమునందలిమంటపముతోఁ బోలికగలవాఁడునగు; సః=ఆ; రావణః=రావణుఁడు; కోపసంరక్తలోచనః = కోపముచే నెఱ్ఱనైన కన్నులు గలవాఁడై; వైదేహీం=సీతను; అవేక్షమాణః= చూచుచు; భుజంగఇవ = సర్పమువలె; నిశ్శ్వసన్ = నిట్టూర్పులు పుచ్చుచు; సీతాం=సీతనుగూర్చి; ఉవాచ=చెప్పెను.

బాలసూర్యవర్ణంబున నొప్పుచుండుకుండలంబులం దాల్చినవాఁడు, కావున, నెఱ్ఱనిచిగుళ్లుఁ బూలుఁ గలిగిన యశోకవృక్షంబులచేఁ గూడి పర్వతంబు మాడ్కిం జూపట్టుచు, నలంకరింపఁబ

డియుండుటంజేసి, కల్పవృక్షంబుంబోలెఁ జూడనగుచు, నాకారంబువహించినవసంతుండనందగి, భూషణంబులు ధరించి యున్నను భయంకరుండై యుంటంజేసి, శ్మశానమంటపంబుకైవడిఁ జూడ (న్క)లకు (?)వేగయున్న యీ రావణుండు, కోపంబున నెఱ్ఱంబాఱిన కండ్లతో సీతంజూచుచు, సర్పంబుంబోలె నిట్టూర్పులు విడుచుచు, సీతతో నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

అనయేనాభిసంపన్న మర్థహీన మనువ్రతే
నాశయామ్యహ మద్య త్వాం సూర్య స్సంధ్యా మివౌజసా. ౩౧

టీక॥ అనయేన = దుర్మార్గముతోఁ; అభిసంపన్నం = కూడినవాఁడును; అర్థహీనం = ధనముచేతవిడువఁబడినవాఁడునగు రాముని; అనువ్రతే = అనుసరించినదానా! అద్య = ఇప్పుడు; అహం = నేను; త్వాం = నిన్ను; ఓజసా = కాంతిచేత; సూర్యః = సూర్యుఁడు; సంధ్యామివ = సంధ్యనుంబోలె; నాశయామి = నశింపఁజేసెదను.

దుర్మార్గము నవలంబించి యున్నవాఁడును దరిద్రుండునగు రామున నుసరించియున్నావు; నేనెంతచెప్పినను నామాటవిననైతివి; కావున, సూర్యుఁడు, ప్రాతస్సంధ్యను నశింపఁజేయునట్లు నేనిప్పుడె నిన్నునశింపఁ జేసెదను. అని, తాత్పర్యము.

రహస్యార్థము.— అనయే = అన్యాయమునందు; నాభిసంపన్నం = సంబంధములేనివాఁడును, న్యాయమునం జేయుండువాఁడుననుట; అర్థహీనం = అర్థముచేవిడువఁబడిన వాఁడును, పరబ్రహ్మకావున, శబ్దార్థంబులకగోచరుండుననుట, అగు రామునిః అనువ్రతే, ఓజసాః విశిష్టః = (అధ్యాహృతము) = కూడిన; సూర్యః; సంధ్యామివ; అహం; అద్య; త్వాం; నాశయామి, (శసయోరభేదః) = నాసయామి; అసగతిదీప్త్యాదానేషుణిచ్) = పొందింపను, రామునింబొందింపననుట.

నీవు, నాజగత్పరిపాలన ధురంధరుండును, శబ్దార్థములకగోచరుండునగు రాముని భార్యవు; ప్రాతస్సంధ్య సూర్యునింబొందునట్లు, నాకుమోక్షముఁగలుగుదనుక, నిన్నురామునితోఁజేర్పను. అని, తాత్పర్యము.

"ఈశ్లోకము, కొన్నికోశంబులనగ

పడకుండుటవలన, వ్యాఖ్యాతంబు కాదయ్యె" అని, మహేశ్వర తీర్థులు వచించిరి.

ఇత్యుక్త్వా మైథిలీం రాజా రావణ శ్శత్రురావణః
సందిదేశ తత స్సర్వా రాక్షసీ ర్ఘోరదర్శనాః. ౩౨
ఏకాక్షీ మేకకర్ణాంచ కర్ణప్రావరణాం తథా
గోకర్ణీం హస్తికర్ణీంచ లంబకర్ణీ మకర్ణికామ్. ౩౩
హస్తిపాద్యశ్వపాద్యౌచ గోపాదీంపాదచూళికామ్
ఏకాక్షీ మేకపాదీంచ పృథుపాదీ మపాదికామ్. ౩౪
అతిమాత్రశిరోగ్రీవా మతిమాత్రకుచోదరీమ్
అతిమాత్రాస్యనేత్రాంచ దీర్ఘజిహ్వా మజిహ్వికామ్. ౩౫
అనాసికాం సింహముఖీం గోముఖీం సూకరీముఖీమ్

టీక॥ శత్రురావణః= శత్రువులను మనట్లుచేయునట్టి; రాజా= రాజయిన; రావణః=రావణుఁడు; ఇతి= ఈ ప్రకారముగా; మైథిలీం = సీతనుగూర్చి; ఉక్త్వా=చెప్పి; తతః=అటుపిమ్మట; ఏకాక్షీం=ఒకకన్నుగలదానిని; ఏకకర్ణాంచ = ఒకచెవిగలదానిని; తథా=అట్లు ; కర్ణప్రావరణాం= చెవిమెయుత్తరీయముగాఁ గలదానిని ; గోకర్ణీం = ఆవుయొక్క చెవులవంటి చెవులు గలదానిని ; హస్తికర్ణీంచ = ఏనుంగుచెవులవంటిచెవులుగలదానిని; లంబకర్ణీం = వ్రేలుకాడుచెవులుగలదానిని;అకర్ణికాం= చెవులులేనిదానిని; హస్తిపాద్యశ్వపాద్యౌచ= ఏనుఁగుపాదములవంటిపాదములుగలదానిని , గుఱ్ఱపు పాదములవంటి పాదములుగలదానిని; గోపాదీం= ఆవుయొక్క పాదములవంటిపాదములుగలదానిని; పాదచూళికాం= పాదములందు జుట్టుగలదానిని; ఏకాక్షీం= ఒక్క కన్నుగలదానిని; ఏకపాదీంచ = ఒక్కకాలుగలదానిని; పృథుపాదీం=పెద్దపాదములుగలదానిని; అపాదికాం=పాదములులేనిదానిని; అతిమాత్రశిరోగ్రీవాం= మిక్కిలియుఁబెద్దవైనతలయును మెడయునుగలదానిని; అతిమాత్రకుచోదరీం = మిక్కిలియుఁ బెద్దవైన స్తనములును గడుపునుగలదానిని; అతిమాత్రాస్యనేత్రాంచ = మిక్కిలియును బెద్దవైన ముఖమునుగండ్లునుగలదానిని; దీర్ఘజిహ్వాం= పొడు

నైన నాలుక గల దానిని; అజిహ్వాకాం= నాలుక లేని దానిని; అనాసికాం= ముక్కు లేని దానిని; సింహముఖీం= సింహము యొక్క ముఖము వంటి ముఖము గల దానిని; గోముఖీం= ఆవు యొక్క ముఖము వంటి ముఖము గల దానిని; సూకరీముఖీం= ఆఁడు పంది యొక్క ముఖము వంటి ముఖము గల దానిని; ఘోరదర్శనాః= భయంకరమగు చూచుట గల; రాక్షసీః= రాక్షసస్త్రీలను; సర్వాః= అందఱను; సందిదేశ= ఆజ్ఞాపించెను.

శత్రువుల నేడ్పించునట్టి రావణుండు, సీతతో నాప్రకారము చెప్పి, యొక్క కన్ను గల దానిని, ఒక చెవి గల దానిని, చెవులు విశాలములయి యుండఁగా వాని నేయుత్తరీయముగా ధరించిన దానిని, ఆవు చెవుల వంటి చెవులు గల దానిని, ఏనుంగు చెవుల వంటి చెవులు గల దానిని, వేలు కాఁడు చెవులు గల దానిని, చెవులే లేని దానిని, ఏనుంగు పాదముల వంటి పాదములు గల దానిని, గుఱ్ఱము పాదముల వంటి పాదములు గల దానిని, ఆవు పాదముల వంటి పాదములు గల దానిని, పాదంబులందు జుట్టు మొలిచియుండు దానిని, అట్లు ఒక కన్ను గల మఱియొక దానిని, ఒక్క కాలు గల దానిని, విశాల పాదంబులు గల దానిని, పాదంబులేని దానిని, మిగులఁ బెద్దవైన తలయును మెడయును గల దానిని, మిక్కిలియుఁ బెద్దవైన స్తనంబులును గడుపును గల దానిని, అతివిశాలంబులగు ముఖంబును గండ్లును గల దానిని, పొడుగు నాలుక గల దానిని, నాలుకయే లేని దానిని, ముక్కు లేని దానిని, సింహముఖంబు వంటి ముఖంబు గల దానిని, ఆవు ముఖంబు వంటి ముఖంబు గల దానిని, పంది ముఖంబు వంటి ముఖంబు గల దానిని, ఇట్లు చూపరులకు భయంబు గలుగఁ జేయుచుండు రాక్షసస్త్రీలనందఱిం జూచి, యిట్లని, యాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

యథా మద్వశగా సీతా క్షిప్రం భవతి జానకీ. ౩౬
తథా కురుత రాక్షస్య స్సర్వాః క్షిప్రం సమేత్యచ

టీక॥ రాక్షస్యః= రాక్షసస్త్రీలారా, యూయం (అధ్యాహృతము)= మీరలు; సర్వాశ్చ= అందఱును; సమేత్య= చేరి; జానకీ; జనకుని కొమార్తెయగు; సీతా= సీత; యథా= ఎట్లు; క్షిప్రం= శీఘ్రముగా; మద్వశగా= నాయధీనతను బొందు

నది; భవతి = అగునో; తథా = అట్లు. క్షిప్రం=శీఘ్రముగా; కురుత= చేయుఁడు.

రాక్షసస్త్రీలారా! మీరందఱు నాకటయు,, జనకునికొమార్తెయగు సీత, శీఘ్రముగానామీఁద ననురాగము గలదగునట్లు, శీఘ్రముగాఁగావింపుఁడు. అని, తాత్పర్యము.

ప్రతిలోమానులోమైశ్చ సామదానాదిభేదనైః. ౩౭
ఆవర్జయత వైదేహీం దండస్యోద్యమనేనచ

టీక॥ ప్రతిలోమానులోమైశ్చ=ప్రతికూల కార్యములచేతను ; అనుకూల కార్యములచేతను; సామదానాదిభేదనైః=సామము దానము మొదలుగాఁగల భేదములచేతను;దండస్య= శిక్షించుటయొక్క; ఉద్యమనేనచ = ప్రయత్నించుటచేతను ;వైదేహీం= సీతను; ఆవర్జయత=వశీకరింపుఁడు.

ఈబిడకుఁ బ్రతికూలకార్యములనైనను అనుకూలకార్యములనైనను సామదాన భేదములనైననులేక, దండముఁజూపియయినను, ఈసీతను,వశీకరింపుఁడు అని, రావణుండు రాక్షసస్త్రీలకాజ్ఞాపించెను. అని, తాత్పర్యము.

ఇతి ప్రతిసమాదిశ్య రాక్షసేంద్రః పునఃపునః. ౩౮
కామమన్యుపరీతాత్మా జానకీం పర్యతర్జయత్

టీక॥ రాక్షసేంద్రః = రాక్షసులకుఁబ్రభువైనరావణుండు; ఇతి = ఈ ప్రకారముగా; ప్రతిసమాదిశ్య = ఆజ్ఞాపించి; కామమన్యుపరీతాత్మా=కామముచేతను గోపముచేతనువ్యాపింపఁబడినమనసుగలవాఁడై ; పునఃపునః= మాటిమాటికిని; జానకీం=సీతను; పర్యతర్జయత్=అదలించెను.

రాక్షసులకుఁబ్రభుండైనరావణుం, డిట్లురాక్షసస్త్రీలకాజ్ఞాపించి మఱియుం గామక్రోధంబులతిశయిల్లఁగా ; మాటిమాటికిని, సీతనదలించెను.

అని, తాత్పర్యము.

"అదల్చినట్లభినయించెను" అని, రహస్యము.

ఉపగమ్య తతః క్షిప్రం రాక్షసీ ధాన్యమాలినీ. ౩౯

పరిష్వజ్య దశగ్రీవ మిదం వచన మబ్రవీత్

టీక॥ తతః=అటుపిమ్మట ; ధాన్య మాలినీ=ధాన్యమాలినియను ; రాక్షసీ=రాక్షసస్త్రీ; క్షిప్రం = శీఘ్రముగా; ఉపగమ్య=దగ్గఱి; దశగ్రీవం=రావణుని; పరిష్వజ్య=కౌఁగిలించుకొని ; ఇదం=ఈ; వచనం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత, రావణునికనిష్ఠభార్యయయిన ధాన్యమాలినియను రాక్షసస్త్రీ , శీఘ్రముగా రావణునొద్దకుఁబోయి, యతని గౌఁగిలించికొని, యిట్లని, పలికెను. అని, తాత్పర్యము.

మయా క్రీడ మహారాజ సీతయా కిం తవానయా. ౪౦
వివర్ణయా కృపణయా మానుష్యా రాక్షసేశ్వర

టీక॥ మహారాజ= మహారాజుండవగు రావణుఁడా! మయా=నాతో ; క్రీడ=రమింపుము; రాక్షసేశ్వర= రాక్షసులకుఁ బ్రభుండవగు రావణుఁడా! వివర్ణయా= వికృతవర్ణము గలదియును; కృపణయా= దీనురాలును; మానుష్యా=మనుష్యస్త్రీయునగు; అనయా=ఈ; సీతయా=సీతచేత ; తవ=నీకు; కిం=ఏమిప్రయోజనము!

మహారాజుండవగు రావణుఁడా! నీవు నాతోఁ గ్రీడింపుము;నీవు రాక్షసేశ్వరుండవు; వికృతమగు వర్ణము గలదియు మనుష్యస్త్రీయునగు నాసీత నీకేల! అని, తాత్పర్యము.

నూన మస్యా మహారాజ న దివ్యాన్ భోగస త్తమాన్. ౪౧
విదధాత్యమరశ్రేష్ఠ స్తవ బాహుబలార్జితాన్

టీక॥మహారాజ=మహారాజుండవగు రావణుఁడా!అమరశ్రేష్ఠః=బ్రహ్మదేవుఁడు; తవ=నీయొక్క; బాహుబలార్జితాన్= భుజబలముచే సంపాదింపఁబడిన; దివ్యాన్=స్వర్గమునందుఁగల్గుగునట్టి; భోగసత్తమాన్= ఉత్తమములయినభోగములను; అస్యాః= ఈసీతకు; నవిదధాతి = చేయఁడు; నూనం=నిశ్చయము.

మహారాజా! ఇది ఈబిడతప్పుగాదు;

నీభుజబలంబున సంపాదింపఁబడినదివ్య భోగంబుల ననుభవించుటకుందగు భాగ్యంబు, నీబిడకు, బ్రహ్మదేవుండొసంగఁడయ్యె; కావున నే, యీబిడకు నిన్నుభర్తగా వరింపనిష్టము లేకున్నది.

అని, తాత్పర్యము.

అకామాం కామయానస్య శరీర ముపతప్యతే. ౪౨

టీక॥ అకామాం = ఇచ్ఛలేనిదానిని; కామయానస్య = కోరువానియొక్క; శరీరం=దేహము; ఉపతప్యతే= పరితాపమునొందుచున్నది.

తనపైనిచ్ఛలేనిదానినిగోరినచో, వ్యర్థముగా దేహంబునకుఁగ్లేశమేకాని మఱియేమియుఁబ్రయోజనంబులేదు.

అని, తాత్పర్యము.

ఇచ్ఛంతీం కామయానస్య ప్రీతిర్భవతి శోభనా

టీక॥ ఇచ్ఛంతీం= కోరుచున్నదానిని; కామయానస్య = కోరువానికి;శోభనా=మంగళకరంబగు; ప్రీతిః= సంతోషము;భవతి=అగుచున్నది.

తనపైనిచ్ఛగలయాఁడుదానింగోరినచో, మిక్కిలియు సంతోషంబునను భవింపవచ్చును ; కావున, నీపైమోహంబుగలదానినన్నుంగోరుము. అని, ధాన్యమాలిని రావణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవము_క్తస్తు రాక్షస్యా సముత్క్షి_ప్త స్తతో బలీ. ౪౩
ప్రహస న్మేఘ సంకాశో రాక్షస స్స న్యవర్తత

టీక॥ బలీ=బలవంతుఁడును; మేఘసంకాశః = మేఘముతోసమానుఁడైనవాఁడును; రాక్షసః=రాక్షసుండునగు; సః=ఆరావణుండు; రాక్షస్యా= ధాన్యమాలినియను రాక్షస (స్త్రీ)చేత; ఏవం=ఇట్లు; ఉ_క్తస్తు=చెప్పఁబడినవాఁడైనంతనె;తతః = అటుపిమ్మట;సముత్క్షి_ప్తః = విడువఁబడినవాఁడై;ప్రహసన్=నవ్వుచు; న్యవర్తత=మరలెను.

బలవంతుండును మేఘంబుంబోలు మేను గలవాఁడునగు నారావణుండు, ధాన్యమాలినిచెప్పినమాటనువిని, యంత ధాన్యమాలినిచే విడువఁబడినవాఁడై,నవ్వుచు,నవ్వలికింబోయెను.

అని, తాత్పర్యము.




ప్రస్థిత స్స దశగ్రీవః కంపయన్నివ మేదినీమ్. ౪౪
జ్వలద్భాస్కరవర్ణాభం ప్రవివేశ నివేశనమ్

టీక॥సః=ఆ;దశగ్రీవః = రావణుఁడు;మేదినీం = భూమిని ; కంపయన్నివ=కదలించువాఁడువోలె; ప్రస్థితః = బయలుదేఱినవాఁడై ; జ్వలద్భాస్కరవర్ణాభం = ప్రకాశించుచున్నసూర్యునివన్నెయొక్క కాంతివంటి కాంతిగల; నివేశనం=ఇంటిని;ప్రవివేశ= ప్రవేశించెను.

ఆరావణుండు, భూమియదరునట్లు పాదన్యాసంబులు సేయుచు , మధ్యాహ్నసూర్యుండుంబోలె వెలుంగుచున్న తనగృహంబుం బ్రవేశించెను.

అని, తాత్పర్యము.

దేవగంధర్వకన్యాశ్చ నాగకన్యాశ్చ సర్వతః. ౪౫
పరివార్య దశగ్రీవం వివిశు స్తం గృహోత్తమమ్

టీక॥దేవగంధర్వకన్యాశ్చ = దేవకన్యలునుగంధర్వకన్యలును ; నాగకన్యాశ్చ = నాగకన్యలును; సర్వతః= అంతటను; దశగ్రీవం=రావణుని; పరివార్య=చుట్టుకొని; తం=ఆ; గృహోత్తమం=గృహశ్రేష్ఠమును;వివిశుః=ప్రవేశించిరి.

దేవకన్యలునుగంధర్వకన్యలును నాగకన్యలును, ఆరావణునిచుట్టుంబరివేష్టించి, యతనితోఁగూడ , నుత్తమంబగునాగృహంబుఁజొచ్చిరి.

అని, తాత్పర్యము.

స మైథిలీం ధర్మపరా మవస్థితాం
ప్రవేపమానాం పరిభర్త్స్య రావణః. ౪౬
విహాయ సీతాం మదనేన మోహిత
స్స్వమేవ వేశ్మ ప్రవివేశ భాస్వరమ్

టీక॥సః=ఆ;రావణః = రావణుఁడు ; ధర్మపరాం= ధర్మమునందాసక్తయును ; అవస్థితాం = దృఢమయిన మనసుగలదియును ; ప్రవే




పమానాం= వడఁకుచున్నదియునగు; మైథిలీం=సీతను; పరిభర్త్స్య= బెదరించి; సీతాం=సీతను; విహాయ=విడిచి; మదనేన=మన్మథునిచేత; మోహితః=మోహమునొందునట్లుచేయఁ బడినవాఁడై ; స్వం = తనదైన; భాస్వరం=ప్రకాశించుచున్న ; వేశ్మైవ= గృహమునే ; ప్రవివేశ = ప్రవేశించెను.

ఆరావణుండు, ధర్మంబవలంబించిదృఢచిత్తయై భయంబున వడంకుచున్నసీతనీప్రకారము బెదరించి, యంతసీతనువిడిచి మన్మథమోహితుండై సుందరంబై వెలుంగుచున్న తనయింటికిం బోయెను. అని, తాత్పర్యము.

రహస్యార్థము.— మదనేన = మన్మథునిచేత; మోహితః = మోహమునొందునట్లుచేయఁబడిన; సః=ఆ ; రావణః=రావణుండు; ధర్మపరాం; అవస్థితాం; ప్రవేపమానాం ; పరిభర్త్స్య=నన్నుఁగింకరునిఁగాఁజేసికొనకయేలయిట్లు నన్నుపేక్షించుచున్నావని గట్టిగాఁ జెప్పి;సీతాం; విహాయ;భాస్వరం; స్వంవేశ్మైవ = ఇంటికే; ప్రవివేశ.

రాక్షసుండగుటచే నెల్లప్పుడును గామక్రోధంబులకు లోఁబడి యుండు నారావణుండు, ధర్మాసక్తయై దృఢచిత్తయై "పతియాజ్ఞలేకయే నీతని నుద్ధరింపలేను; ఇతండిప్పుడే యుద్ధరింపుమని బాధించుచున్నాఁడే! ఏమిసేయవచ్చును?" అని, సంభ్రమంబువడంకుచున్న సీతాదేవింజూచి, "నీవునన్నుఁగింకరునిగాఁజేకొని నన్నుద్ధరింపకయేల యిట్లుపేక్షించుచున్నావు?" అనిగట్టిగానఱచి,యంతసీతనువిడిచి, తనయింటికేపోయెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

సుందరకాండే, ద్వావింశస్సర్గః.

ఇదిస్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, సుందరకాండద్వావింశసర్గటీక, ముగిసినది.

---

౨౩.

త్రయోవింశసర్గప్రారంభః.

ఇత్యుక్త్వా మైథిలీం రాజా రావణ శ్శత్రురావణః
సందిశ్యచ తత స్సర్వా రాక్షసీ ర్నిర్జగామ హ. ౧

టీక॥ శత్రురావణః= శత్రువులనేడ్పించునట్టి; రాజా=రాజయిన; రావణః=రావణుఁడు; మైథిలీం= సీతనుగూర్చి; ఇతి=ఈప్రకారముగా; ఉక్త్వా=చెప్పి; తతః=అటుపిమ్మట; రాక్షసీః=రాక్షసస్త్రీలను; సర్వాః=అందఱను; సందిశ్యచ= ఆజ్ఞాపించియు; నిర్జగామ= వెడలెను. "హ" అనునది పాదపూరణార్థము.

శత్రువులంగొట్టి యేడ్పించునట్టి రావణుఁడు, సీతతో నీప్రకారముచెప్పి, యెంత రాక్షసస్త్రీలకందఱకు నుక్తవిధంబున నాజ్ఞాపించి, యింటికింబోయెను. అని, తాత్పర్యము.

నిష్క్రాంతే రాక్షసేంద్రే తు పున రంతఃపురం గతే
రాక్షస్యో భీమరూపా స్తా స్సీతాం సమభిదుద్రువుః. ౨

టీక॥ రాక్షసేంద్రే= రాక్షసులకుఁ బ్రభుండగు రావణుండు; నిష్క్రాంతేతు= వెడలఁగానే; అంతఃపురం= అంతిపురమును; గతేపునః = పొందఁగానే; భీమరూపాః=భయంకరంబులైన యాకారములుగల; తాః=ఆ; రాక్షస్యః=రాక్షసస్త్రీలు; సీతాం=సీతను; సమభిదుద్రువుః=తఱింపఁజేసిరి.

రాక్షసేశ్వరుండగు రావణుండు వెడలియంతఃపురంబుసేరఁగానే, భయంకరాకారలయిన యారాక్షసస్త్రీలందఱును, సీతకు నానావిధకఠినోక్తులం దాపంబుగలుగఁజేసిరి.

అని, తాత్పర్యము.

తత స్సీతా ముపాగమ్య రాక్షస్యః క్రోధమూర్ఛితాః
పరం పరుషయా వాచా వైదేహీ మిద మబ్రువన్. ౩

టీక॥ తతః = అటుపిమ్మట; రాక్షస్యః = రాక్షసస్త్రీలు; క్రోధమూర్ఛితాః = కోపముచేవ్యాపింపఁబడినవారలై; వైదేహీం = విదేహదేశమునందుఁబుట్టిన; సీతాం = సీతను; ఉపాగమ్య = పొంది; పరం = మిక్కిలియైనను; పరుషయా = కఠినమయినను; వాచా = మాటచేతను; ఇదం = ఈమాటను; అబ్రువన్ = పలికిరి.

అంత, నారాక్షసస్త్రీలు, పరమకోపంబువహించి, సీతయొద్దకుం బోయి, మిక్కిలియుఁ బరుషంబగు వాక్యంబున, సీతతో నిట్లని, పల్కిరి.

అని, తాత్పర్యము.

పౌలస్త్యస్య వరిష్ఠస్య రావణస్య మహాత్మనః
దశగ్రీవస్య భార్యాత్వం సీతే నబహుమన్యసే. ౪

టీక॥ సీతే = సీతా! పౌలస్త్యస్య = పులస్త్యవంశమునందుఁ బుట్టినవాఁడును; వరిష్ఠస్య = శ్రేష్ఠుండును; మహాత్మనః = అధికమయినపరాక్రమముగలవాఁడును; దశగ్రీవస్య = పదికంఠములుగలవాఁడునగు; రావణస్య = రావణునకు; భార్యాత్వం = భార్యయగుటను; నబహుమన్యసే = అధికముగాఁదలంపవు.

సీతా! సాక్షాత్పులస్త్య ప్రజాపతివంశంబునఁబుట్టినవాఁడుఁ గులంబుననైశ్వర్యంబునను శ్రేష్ఠుండుమహాపరాక్రమశాలియుఁ బదికంఠములుగలవాఁడునగు రావణునకు భార్యగానుండుటనీకెచ్చుగాఁదోఁచ లేదేమి?

రహస్యార్థము — మహాత్మనః = పూజ్యంబగు స్వభావముగలవాఁడును; భార్యాత్వం = పోషింపఁ దగియుండుటను.

సీతాదేవీ! సాక్షాత్పులస్త్యప్రజాపతివంశంబునఁబుట్టినవాఁడు, కులంబున శ్రేష్ఠుండు, ధార్మికుండునగునట్టి రావణుండు,నీకుఁ "గింకరుండనై యుండెద" నని వేఁడుకొనుచుండఁగా, నతని కైంకర్యంబును నీవు గ్రహింపవేమి?

అని, తాత్పర్యము.

తత స్త్వేకజాటా నామ రాక్షసీ వాక్యమబ్రవీత్
ఆమంత్ర్య క్రోధతామ్రాక్షీ సీతాం కరతలోదరీమ్. ౫

స ౨౩



టీక॥ తతః = అటుపిమ్మట; ఏకజటా నామ = ఏకజటయను పేరుగల; రాక్షసీ = రాక్షసస్త్రీ; క్రోధతామ్రాక్షీ = కోపముచే నెఱ్ఱనైనకండ్లుగలదై; కరతలోదరీం = అఱచేయియంతటికడుపుగల; సీతాం = లః సీతను; ఆమంత్ర్య = పిలిచి; వాక్యం = మాటను; అబ్రవీత్ = పలికెను.

అంత, నేకజటయనురాక్షసి, కోపంబున నెఱ్ఱనైన కండ్లతో నఱచేయియంతటికడుపుగలసీతం బిలిచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ప్రజాపతీనాం షణ్ణాంతు చతుర్థో యః ప్రజాపతిః
మానసో బ్రహ్మణః పుత్రః పులస్త్య ఇతి విశ్రుతః. ౮

టీక॥ యః = ఎవఁడు; షణ్ణాంతు = ఆఱుగురైన; ప్రజాపతీనాంతు = ప్రజాపతులలోపలను; చతుర్థః = నాలవవాఁడైన; ప్రజాపతిః; ప్రజాపతియో; సః = అట్టి; పులస్త్య ఇతి = పులస్త్యుండని; విశ్రుతః = ప్రసిద్ధుండైన; బ్రహ్మణః = బ్రహ్మదేవునియొక్క; మానసః = మనసులోఁబుట్టిన; పుత్రః = కొడుకు; ఆసీత్ (అధ్యాహృతము) = ఉండెను.

"మరీచిరత్ర్యంగిరసౌ పులస్త్యః పులహః క్రతుః" (మరీచియు, నత్రియు, నంగిరసుండును, బులస్త్యుండును, బులహుం

డును, క్రతువును, వీరు ప్రజాపతులార్వురు.) అని, చెప్పఁబడిన ప్రజాపతులాఱుగురిలోను, నాలవవాఁడు, పులస్త్యుండని పేరొందినవాఁడు, బ్రహ్మమానసపుత్రుం డొకఁడుండెను.

అని, తాత్పర్యము.

పులస్త్యస్యతు తేజస్వీ మహర్షి ర్మానస స్సుతః
నామ్నా స విశ్రవా నామ ప్రజాపతిసమప్రభః. ౭

టీక॥ పులస్త్యస్యతు = పులస్త్యునకును; తేజస్వీ = అధికమయిన ప్రభావముగలవాఁడును; మహర్షిః = పూజ్యుఁడైన ఋషియును; ప్రజాపతిసమప్రభః = బ్రహ్మదేవునకుసరియైయిన కాంతిగలవాఁడును; నామ్నా = పేరుచేత; విశ్రవానామ = విశ్రవుండని ప్రసిద్ధుండునగు; సః = ప్రసిద్ధుండైన; మానసః = మనస్సులోఁ బుట్టిన; సుతః = కొడుకు; ఆసీత్ (అధ్యాహృతము) = ఉండెను.

పులస్త్యుని మానసపుత్త్రుండు, మహాప్రభావుండును మహర్షియు, బ్రహ్మదేవునకుసరియయినవాఁడునగు, విశ్రవసుండు. అని, తాత్పర్యము.

తస్య పుత్త్రో విశాలాక్షి రావణ శ్శత్రురావణః

టీక॥ విశాలాక్షి = వెడలుపులయిన కండ్లుగలసీతా! శత్రురావణః = శత్రువుల నేడ్పించునట్టి; రావణః = రావణుఁడు; తస్య = ఆవిశ్రవసునియొక్క; పుత్త్రః = కొడుకు.

విశాలములయిన కండ్లుగలసీతా! శత్రువుల నేడ్పించునట్టి యీ రావణుండు, మహాత్ముండగు నావిశ్రవసునికొడుకు. అని, తాత్పర్యము.

తస్య త్వం రాక్షసేంద్రస్య భార్యా భవితు మర్హసి. ౮

టీక॥ త్వం = నీవు; తస్య = అట్టి; రాక్షసేంద్రస్య = రాక్షసులకుఁ బ్రభుండగు రావణునకు; భార్యా = భార్యవు; భవితుం = అగుటకు; అర్హసి = తగుదువు.

నీవట్టి సత్కులమునందుఁ బుట్టి రాక్షసులకందఱకుం బ్రభుండై వెలయుచున్న రావణునకు భార్యవగుము.

రహస్యార్థము.—భార్యా = భరింపఁదగినదానవు.

రావణుండట్టి సత్కులంబునం బుట్టినవాఁడు; కావున, నిప్పుడు రాక్షసుల

కుంభకర్ణుండైయున్న నేమి ? నీవు సంశయింపక, యితనిం గింకరునిం గా గ్రహించి, యుద్ధింపుము.

అని, తాత్పర్యము,

మయోక్తం చారుసర్వాంగి వాక్యం కిన్నానుమన్యసే

టీక॥ చారుసర్వాంగి=సుందరములయినసమస్తావయవములుగలసీతా ! మయా=నాచేత; ఉక్తం= చెప్పఁబడిన; వాక్యం=మాటను; కిం = ఎందువలన; నానుమన్యసే=ఒప్పుకొనవు.

అన్నియవయవములును సుందరములుగాఁగలసీతా ! నీవు నేనుజెప్పుమాట నేలవినవు? అని, తాత్పర్యము.

తతో హరిజటా నామ రాక్షసీ వాక్యమబ్రవీత్. ౯
వివర్త్య నయనే కోపా న్మార్జారసదృశేక్షణా

టీక॥ తతః= అటుపిమ్మట ; మార్జారసదృశేక్షణా = పిల్లికిసరియయినకండ్లుగల; హరిజటానామ = హరిజటయనెడుపేరుగల; రాక్షసీ—రాక్షసస్త్రీ; కోపాత్ = కోపమువలన ; నయనే=కండ్లను; వివర్త్య=త్రిప్పి; వాక్యం—మాటను; అబ్రవీత్=చెప్పెను.

అంతఁ, బిల్లివంటికండ్లుగలహరిజటయను నొకరాక్షసి , కోపంబునఁ గండ్లుత్రిప్పుచు, సీతంజూచి, యిట్లని , చెప్పెను. అని,తాత్పర్యము.

యేన దేవా స్త్రయస్త్రింశ ద్దేవరాజశ్చ నిర్జితాః. ౧౦
తస్య త్వం రాక్షసేంద్రస్య భార్యా భవితుమర్హసి

టీక॥యేన — ఎవ్వనిచేత; త్రయస్త్రింశత్ — ముప్పదిమూఁడు, (కోట్లు;)దేవాః= దేవతలును; దేవరాజశ్చ—దేవేంద్రుండును;నిర్జితాః=జయింపఁబడిరో; తస్య—అట్టి; రాక్షసేంద్రస్య= రాక్షసులకుఁబ్రభుండగురావణునకు; త్వం=నీవు; భార్యా=భార్యవు; భవితుం—అగుటకు ; అర్హసి= తగుదువు.

ముప్పదిమూఁడుకోట్లదేవతలను దేవేంద్రుని , జయించియెదురులేకున్నట్టి రాక్షసేశ్వరుండగురావణుండు,నీవుఁ

గోరుచున్నాఁడు; నీవుబదులు చెప్పక, యతనికిభార్యవగుము.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— భార్యా = భరింపఁదగినదానవు.

ఈరావణుండు,ముప్పదిమూఁడుకోట్లదేవతలనుదేవేంద్రుండును గావ్యఫలంబుల నిచ్చువారని వారలనుం గూడ సరకుసేయుచు; వారలభోగంబులను గోరుచు; మోక్షంబుఁగోరి, నీకైంకర్యంబునపేక్షించుచున్నాఁడు; నీవితనింగింకరునిఁగా నంగీకరింపుము.

అని, తాత్పర్యము.

తతస్తు ప్రఘసా నామ రాక్షసీ క్రోధమూర్ఛితా. ౧౦
భర్త్సయంతీ తదా ఘోర మిదం వచన మబ్రవీత్

టీక॥ తతస్తు = అటుపిమ్మటను; తదా=అప్పుడు; ప్రఘసానామ= ప్రఘసయనుపేరుగల; రాక్షసీ= రాక్షసస్త్రీ; క్రోధమూర్ఛితా = కోపముచే వ్యాపింపఁబడినదై; ఘోరం= భయంకరముగా; భర్త్సయంతీ= బెదరించుచు; ఇదం=ఈ; వచనం= మాటను; అబ్రవీత్=చెప్పెను.

అంతట,ప్రఘసయనురక్కసి, మహాకోపంబునొంది, సీతంజూచి, భయంకరంబుగా బెదరించుచు,నిట్లని,చెప్పెను.

అని, తాత్పర్యము.

వీర్యోత్సిక్తస్య శూరస్య సంగ్రామే ష్వనివర్తినః. ౧౧
బలినో వీర్యయుక్తస్య భార్యా త్వం కిం నలప్స్యసే

టీక॥ వీర్యోత్సిక్తస్య = పరాక్రమముచేగర్వించినవాఁడును; శూరస్య = యుద్ధమునందు భయపడనివాఁడును ; సంగ్రామేషు=యుద్ధములందు ; అనివర్తినః=వెనుదీయనివాఁడును; బలినః= అధికమయినబలముగలవాఁడును ; వీర్యయుక్తస్య = పరాక్రమముతోఁగూడినవాఁడునగురావణునకు ; భార్యాత్వం=భార్యయగుటను; కిం= ఎందువలన; నలప్స్యసే=పొందవు.

మహాపరాక్రమశాలియగుటచేఁ బరాక్రమంబున నెదురులేక గర్వించియున్నవాఁడును శూరుండును యుద్ధంబుల వెనుదీయనివాఁడును బలవంతుండును నగు రావణునను, భార్యవగుటకు నీ కేమికష్టము? అని, తాత్పర్యము.

రహస్యార్థము. — భార్యాత్వం=భరింపఁదగినదగుటను.

ఇట్టిరావణుండు, నీకుఁగింకరుండనయ్యెదనని ప్రార్థించుచుండగా, నీవేలయతనిఁగింకరునిఁగా నంగీకరింపవు?

అని, తాత్పర్యము.

ప్రియాం బహుమతాం భార్యాం త్యక్త్వా రాజా మహాబలః. ౧౩
సర్వాసాంచ మహాభాగాం త్వా ముపైష్యతి రావణః

టీక॥ మహాబలః=అధికమయినబలముగల; రాజా=రాజయిన; రావణః=రావణుఁడు; సర్వాసాంచ= అందఱిలోను; ప్రియాం = ప్రియురాలును; బహుమతాం= బహుమానింపఁబడినదియును; మహాభాగాం=పూజ్యమయిన భాగ్యము గలదియునగు; భార్యాం= మండోదరిని; త్యక్త్వా=విడిచి; త్వాం= నిన్ను; ఉపైష్యతి = పొందఁ గలఁడు.

మహాబలుండును రాక్షసరాజుండునగు రావణుండు, అందఱిభార్యలలోను బ్రియురాలయి బహుమానంబునొంది నదైమహాభాగ్యమైయుండు, మండోదరినింగూడవిడిచి, నిన్నేపొంది యుండఁగలఁడు. అని, తాత్పర్యము.

సమృద్ధం స్త్రీసహస్రేణ నానారత్నోపశోభితమ్. ౧౪
అంతఃపురం సముత్సృజ్య త్వా ముపైష్యతి రావణః

టీక॥ రావణః=రావణుఁడు; స్త్రీసహస్రేణ=స్త్రీలవేయిటిచేత; సమృద్ధం = నిండినదియును; నానారత్నోపశోభితం= నానావిధములయినమణులచేఁబ్రకాశించునట్లు చేయఁబడినదియునగు; అంతఃపురం= అంతఃపురమును; సముత్సృజ్య=విడిచి; త్వాం=నిన్ను; ఉపైష్యతి=పొందఁగలఁడు.

రావణుండు, వేవురుస్త్రీలతోనిండి నానావిధమణులచేనలంకృతంబైయుండు నంతఃపురంబునుంగూడవిసర్జించి, నిన్నేపొందియుండఁగలఁడు.

అని, తాత్పర్యము.

అన్యాతు వికటానామ రాక్షసీ వాక్య మబ్రవీత్. ౧౫

టీక॥ అన్యా=మఱియొక్కతె; వికటానామ=వికటయను పేరుగల; రాక్షసీతు=రాక్షసియును; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

మఱియొక్కతెవికటయనురాక్షసి, సీతంజూచి,యిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

అసకృ ద్దేవతాయుద్ధే నాగగంధర్వదానవాః
నిర్జితా స్సమరే యేన స తే పార్శ్వ ముపాగతః. ౧౮

టీక॥ యేన=ఎవ్వనిచేత; యుద్ధే=యుద్ధమునందు; దేవతాః= దేవతలును; సమరే= యుద్ధమునందు ; నాగగంధర్వదానవాః=పన్నగులును గంధర్వులను దానవులును; అసకృత్ = మాటిమాటికిని; నిర్జితాః = జయింపఁబడిరో; సః=అట్టిరావణుఁడు; తే=నీయొక్క; పార్శ్వం= ప్రక్కను; ఉపాగతః=పొందినాఁడు.

పలుమాఱుయుద్ధంబున దేవతలును బన్నగులును గంధర్వులును దానవులును ఎవ్వనిచే జయింపఁబడిరో, అట్టిరావణుండు, నిన్నాశ్రయించియున్నాఁడు. అని, తాత్పర్యము.

తస్య సర్వసమృద్ధస్య రావణస్య మహాత్మనః
కి మద్య రాక్షసేంద్రస్య భార్యాత్వం నేచ్ఛసేఽధమే. ౧౯

టీక॥ అధమే = నీచురాలవయినదానా! సర్వసమృద్ధస్య= అన్నిటిచేతనునిండినవాఁడును ;మహాత్మనః=అధికమయినపరాక్రమముగలవాఁడును; రాక్షసేంద్రస్య= రాక్షసులకుఁబ్రభువైనవాఁడునగు; తస్య=అట్టి; రావణస్య= రావణునకు;భార్యాత్వం= భార్యవగుటను;అద్య=ఇప్పుడు; కిం=ఎందుకు;నేచ్ఛసే=కోరవు?

సీతా! నీవునీచురాలవు; సమస్తైశ్వర్యంబులుగలవాఁడును మహాబల పరాక్రమశాలియు రాక్షసేశ్వరుండు నగునట్టిరావణునకుభార్యవై యుండుటకు నీకేమికష్టము? అని, తాత్పర్యము.

తతస్తు దుర్ముఖీనామ రాక్షసీ వాక్య మబ్రవీత్

టీక॥ తతస్తు=అటుపిమ్మటను; దుర్ముఖీనామ=దుర్ముఖి యనెడు పేరు గల; రాక్షసీ = రాక్షసి ; వాక్యం= మాటను; అబ్రవీత్ = చెప్పెను.

అటుపిమ్మట దుర్ముఖియనుపేరు గలరాక్షసస్త్రీ, సీతంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

యస్య సూర్యో న తపతి భీతో యస్యచ మారుతః. ౧౮
నవాతిస్మాయతాపాంగే కింత్వం తస్య నతిష్ఠసి

టీక॥ ఆయతాపాంగే = దీర్ఘమయినకడకన్నుగలసీతా! సూర్యః= సూర్యుఁడు; యస్య= (పంచమ్యర్థమందుషష్ఠి)ఎవ్వనివలన;భీతః=భయపడినవాఁడై; నతపతి = తపింపఁజేయఁడో; మారుతశ్చ=వాయువును ; యస్య=(పంచమ్యర్థమందుషష్ఠి)ఎవ్వనివలన;భీతః(అధ్యాహృతము)=భయ్యంపడినవాఁడై;నవాతి=వీవఁడో ("స్మ"అనునది పాదపూరణార్థము); తస్య= అట్టిరావణునియొక్క; వశే (అధ్యాహృతము);అధీనతయందు;త్వం=నీవు; కిం=ఎందుకు; నతిష్ఠసి=ఉండవు?

విశాలములగు కండ్లుగల సీతా! ఎవ్వనిభయంబున సూర్యుండుతపింపఁజేయకున్నాఁడో, ఎవ్వనిభయంబున వాయువేఁపుండధికముగవీవకున్నాఁడో, అట్టిరావణునియొద్దనుండుటకు నీవేల యిచ్చింపవు? అని, తాత్పర్యము.

పుష్పవృష్టిం చ తరవో ముముచుర్యస్య వై భయాత్. ౧౯
శైలాశ్చ సుభ్రు పానీయం జలదాశ్చ యదేచ్ఛతి
తస్య నైరృతరాజస్య రాజరాజస్య భామిని. ౨౦
కింత్వం న కురుషే బుద్ధిం భార్యార్థే రావణస్య హి

టీక॥ సుభ్రు= మంచికనుబొమలు గల; భామిని= స్త్రీవగుసీతా! యస్య=ఎవ్వనియొక్క ("వై"అనునది పాదపూరణార్థము);భయాత్= భయమువలన;తరవశ్చ = వృక్షములును;పుష్పవృష్టిం=పూలవానను; ముముచుః= (వర్తమానార్థమందులట్) విడుచుచున్నవో; యదా=ఎప్పుడు ; ఇచ్ఛతి=

కోరుచున్నాఁడో; తదా (అధ్యాహృతము)=అప్పుడు; శైలాశ్చ= పర్వతములును; జలదాశ్చ= మేఘములును; పానీయం=జలమును; ముంచంతి (అధ్యాహృతము)= విడుచుచున్నవో; తస్య=అట్టి; నైరృతరాజస్య= రాక్షసులకుఁ బ్రభుండును; రాజరాజస్య=రాజులకును రాజయినవాఁడునగు; రావణస్య=రావణునియొక్క- ("హి" అనునది పాదపూరణార్థము); భార్యాత్వే= భార్యవగుటకొఱకు; త్వం = నీవు; కిం=ఎందువలన; బుద్ధిం=తలంపును; న కురుషే= చేయకున్నావు?

సుందరములయిన కనుబొమ్మలుగల సీతా! ఎవ్వనికి భయంపడి, వృక్షములు పూలవానగురియుచున్నవో, మఱి యునెవ్వనికొఱకు ఋతువులెల్లఁ, గొండలును మేఘంబులును జలంబొసంగుచున్నవో, అట్టి, రాక్షసేశ్వరుండును, రాజరాజుండునగు రావణునకు భార్యవగుటకై, సమ్మతియిచ్చుటకుఁ దలఁచకున్నావు?

అని, తాత్పర్యము.

సాధు తే తత్త్వతో దేవి కథితం సాధు భామిని. ౨౦
గృహాణ సుస్మితే వాక్య మన్యథా న భవిష్యసి

టీక॥ సుస్మితే=సుందరమయిన చిఱునగవుగల; భామిని=స్త్రీవగు; దేవి=సీతా! తే=నీకొఱకు; సాధు = చక్కఁగా; తత్త్వతః = యథార్థముగా; కథితం=చెప్పఁబడిన; వాక్యం = మాటను; సాధు=లెస్సఁగా; గృహాణ=స్వీకరింపుము. అన్యథా=అటుకాదేని; నభవిష్యసి=ఉండవు.

సుందరమయిన చిఱునగవుగల సీతా! నీకు యథార్థమయిన సంగతిని జెప్పినాము; నీవా ప్రకారమునడుచుకొనుము; అట్లుకాదేని, జీవించియుండలేవు. అని, దుర్ముఖి యను రాక్షసి, సీతతోఁ జెప్పెను, అని, తాత్పర్యము.

అట్లుకాదేని, యింకదయాశాలివనుఖ్యాతి గలిగియుండనేరవు. అని, రహస్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, త్రయోవింశస్సర్గః.
ఇదిస్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, సుందరకాండత్రయోవింశసర్గటీక, ముగిసినది.

---

శ్రీ.

చతుర్వింశసర్గప్రారంభః.

తత స్సీతా ముపాగమ్య రాక్షస్యో వికృతాననాః
పరుషం పరుషా నార్య ఊచు స్తాం వాక్య మప్రియమ్. ౧

టీక॥ తతః=అటుపిమ్మట ; వికృతాననాః=వికారముతోఁగూడిన ముఖములగలవారును; పరుషాః = కఠినలయిన; నార్యః= స్త్రీలునగు; రాక్షస్యః=రాక్షసస్త్రీలు ; సీతాం= సీతను; ఉపాగమ్య=పొంది; తాం=ఆసీతనుగూర్చి; పరుషం=కఠినమును; అప్రియం=ఇష్టముకానిదియునగు ; వాక్యం=మాటను; ఊచుః= చెప్పిరి.

అటుపిమ్మట, వికృతంబులగుముఖములుగలవారలును బరుషస్వభావలునగు రాక్షసస్త్రీలు, ఆసీతంజూచి, మఱల, అప్రియంబును బరుషంబునగు నీమాటఁ జెప్పిరి. అని, తాత్పర్యము.

కిం త్వ మంతః పురే సీతే సర్వభూతమనోహరే
మహార్హశయనోపేతే నవాస మనుమన్యసే. ౨

టీక॥ సీతే=సీతా! త్వం=నీవు; కిం= ఎందుకు; సర్వభూతమనోహరే= సమస్తప్రాణులమనస్సును హరించునదియు; మహార్హశయనోపేతే= శ్రేష్ఠమయిన పాన్పుతోఁగూడినదియు నగు; అంతఃపురే=అంతఃపురమునందు; వాసం=ఉనికిని; నానుమన్యసే = సమ్మతింపవు?

సీతా! ఎట్టివారికిని గోరఁదగినదియునుత్తమంబగుశయనంబుతోఁ గూడినదియునగు నంతఃపురంబున నుండుమని, ప్రార్థింపఁగా, నందుసుఖంబుగా నుండుటకు , నీవేలసమ్మతింపవు? అని, తాత్పర్యము.

మానుషీ మానుషస్యైవ భార్యాత్వం బహుమన్యసే
ప్రత్యాహర మనో రామా న్నత్వం జాతు భవిష్యసి. ౩

టీక॥ త్వం (అధ్యాహృతము) = నీవు; మానుషీ=మనుష్యస్త్రీవి; అతఏవ (అధ్యాహృతము)= కావుననే; మానుషస్య=మనుష్యునియొక్క; భార్యాత్వమేవ=భార్యగానుండుటనే; బహుమన్యసే= అధికముగా నెంచుచున్నావు; రామాత్=రామునుండి; మనః=మనసును; ప్రత్యాహర=మఱలించుము. త్వం=నీవు; జాతు=ఒకానొకప్పుడును; నభవిష్యసి=కాలేవు, రామునకుభార్యగానుండలేవు, అనుట.

నీవుమనుష్యస్త్రీవికావున మనుష్యుండగు రామునకుభార్యగానుండుటనెచ్చుగాఁదలంచుచున్నావు; ఎంతసీమరాలవు? ఇంకనైనను, రాముని యందుండి మనసును ద్రిప్పుకొనుము; ఇంకనీవెప్పటికిని రామునియొద్దఁజేరియతనికిభార్యగానుండలేవు. అని, తాత్పర్యము.

రహస్యార్థము.—త్వం= నీవు; మానుషీ=మనుష్యస్త్రీగానవతరించినదానవు. అతఏవ=కావుననే; మానుషస్య= మనుష్యుఁడుగా నవతరించియున్నరామునకు; భార్యాత్వం= బహుమన్యసే. రామాత్; మనః;నప్రత్యాహర (నప్రత్యాహరసి)= మఱలింపవు. త్వం=నీవు; జాతు= ఒకానొకప్పుడు; భవిష్యసి—రామునికి భార్యగాఁగలవు.

నీవుమహాలక్ష్మివి; విష్ణుదేవుని,భార్యవు; అట్టినీవిప్పుడు మనుష్యావతారమునొంది, యట్లు మనుష్యావతారమునొందియున్నవిష్ణుదేవుండగు, రామునకు,భార్యయగుటనేయధికముగాఁదలంచుచున్నావు; మఱియు, నారామునియందె, నీమనసు. ఎప్పుడునేమఱక, మెలంగుచున్నది; అదియుక్తమె; నీవింకఁగొంతకాలమునకు మఱల రామునింజేరఁగలవు; దుఃఖింపకుము. అని, తాత్పర్యము.

త్రైలోక్యవసుభోక్తారం రావణం రాక్షసేశ్వరమ్
భర్తారముపసంగమ్య విహరస్వ యథా సుఖమ్. ౪

టీక॥ త్వం(అధ్యాహృతము) = నీవు; త్రైలోక్యవసుభోక్తారం = ము

ల్లోకంబులఫలమునమభవించునట్టి; రాక్షసేశ్వరం = రాక్షసులకుఁబ్రభుండగు; రావణం= రావణుని; భర్తారం= పెనిమిటినిగా; ఉపసంగమ్య= పొంది; యథాసుఖం=సుఖముగా; విహరస్వ=క్రీడింపుము.

మూఁడులోకంబుల నుత్పన్నంబులగు ధనంబుల ననుభవించుచుండురాక్షసేశ్వరుండగు రావణుని బెనిమిటినిగావరించి, యంతసుఖంబుగా విహరించుచుండుము.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.—భర్తారం= పోషించువానిఁగా. శేషము,పై. ముల్లోకంబులకును బ్రభుండై రాక్షసేశ్వరుండై వెలయు రావణుండునీకుశుశ్రూషలుచేసెదననినన్నుఁ బ్రార్థించుచున్నాఁడే; నీవాప్రార్థన నంగీకరించి, యతండు సేయు శుశ్రూషలం బరిగ్రహించుచు, సుఖంబుగా,విహరించుచుండుము. అని, తాత్పర్యము.

మానుషీ మానుషం తం తు రామమిచ్ఛసి శోభనే
రాజ్యాద్భ్రష్ట మసిద్ధార్థం విక్లబం త్వ మనిందితే.౫

టీక॥ శోభనే=మంగళస్వరూపిణివగు; అనిందితే=నిందింపఁబడనట్టిసీతా! త్వం=నీవు;మానుషీ=మనుష్యస్త్రీవి;అతఏవ(అధ్యాహృతము)= కావుననే; రాజ్యాత్ = దొరతనమునుండి; భ్రష్టం=జాఱినవాఁడును; అసిద్ధార్థం= ఈడేఱని ప్రయోజనములు గలవాఁడును; విక్లబం=దీనుండును;మానుషం= మనుష్యుండునగు; తం = ఆ;రామం తు= రామునే; ఇచ్ఛసి = కోరుచున్నావు.

నీవుమంగళస్వరూపిణివి, నిందింపఁదగనిదానవు; అయినను, మనుష్యస్త్రీవికావున, రాజ్యభ్రష్టుండును, ఏకోరికెనైననీడేఱ్చుకొనలేనివాఁడును మనుష్యుండునగు, రామునే కోరుచున్నావు; రాక్షసేశ్వరుండగు రావణుండెంత ప్రార్థించినను వినకున్నావు. అని, రాక్షసస్త్రీలుసీతతోఁజెప్పిరి.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.—శోభనే;అనిందితే=నిందింపఁబడనిదానా! దోషములేనిదానాయనుట; త్వం=నీవు ; మనుష్యావతారమునొందినదానవు; కావున

నే; రాజ్యాత్ భ్రష్టం=తండ్రియాజ్ఞచే రాజ్యమునువిడిచినవాఁడును; అసిద్ధార్థం, అ=విష్ణుదేవుండును; సిద్ధార్థం= ఈడేఱిన ప్రయోజనములుగల వాఁడును; విక్లబం= దయాళువగుటచేగర్వము లేకున్నవాఁడును; మానుషం=మనుష్యావతారమునుబొందినవాఁడునగు; తం= ఆ; రామంతు=రామునే; ఇచ్ఛసి=కోరుచున్నావు.

నీవు, మంగళస్వరూపిణియుదోషరహితయునగుమహాలక్ష్మివి; ఇప్పుడు మనుష్యస్త్రీరూపమునవతరించియున్నదానవు; కావుననే; అట్లు, మనుష్యరూపంబున నవతరించియున్న సాక్షాద్విష్ణుదేవుండును, పూర్ణకాముండును, తండ్రియాజ్ఞచే రాజ్యంబువిడిచియున్నవాఁడునగు నారామునే కోరుచున్నావు. అని, రాక్షసస్త్రీలు, సీతం బ్రస్తుతించిరి. అని, తాత్పర్యము.

రాక్షసీనాం వచశ్శ్రుత్వా సీతా పద్మనిభేక్షణా
నేత్రాభ్యా మశ్రుపూర్ణాభ్యా మిదం వచన మబ్రవీత్. ౬

టీక॥ పద్మనిభేక్షణా=తామరపూలతోసమానము లయినకండ్లుగల; సీతా=సీత; రాక్షసీనాం = రాక్షసస్త్రీలయొక్క; వచః = మాటను; శ్రుత్వా=విని; అశ్రుపూర్ణాభ్యాం= కన్నీళ్లతోనిండిన; నేత్రాభ్యాం= కండ్లతో; ఇదం=ఈ; వచనం= మాటను; అబ్రవీత్=పలికెను.

తామరపూలంబోలు కండ్లుగల సీతాదేవి, యారాక్షసస్త్రీలు చెప్పిన మాటనువిని, కన్నీళ్లతో నిండినకండ్లతో, నారాక్షసస్త్రీలంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

యదిదం లోకవిద్విష్ట ముదాహరథ సంగతాః
నైతన్మనసి వాక్యంమే కిల్బిషం ప్రతిభాతి వః. ౭

టీక॥ యూయం (అధ్యాహృతము)=మీరలు; సంగతాః=చేరినవారలై; లోకవిద్విష్టం=లోకముచేమిక్కిలియుద్వేషింపఁబడిన; యత్ = ఏ; ఇదం=ఈమాటను; మే=నాకొఱకు; ఉదాహరథ=చెప్పుచున్నారో; ఏతత్ =

ఈ; వాక్యం=మాట; వః=మీయొక్క; మనసి=మనసునందు; కిల్బిషం=పాపముగా; నప్రతిభాతి=తోఁచలేదా?

మీరలందఱు నొక్కటిగాఁజేరి, నన్నుఁగూర్చి, లోకవిద్విష్టంబగు నీమాటం జెప్పితిరేయిట్టిమాటఁ జెప్పినట్లయినఁ బాపమని మీమనసునకుఁదోఁచలేదా యేమి? అని, తాత్పర్యము.

న మానుషీ రాక్షసస్య భార్యా భవితు మర్హతి

టీక॥ మానుషీ=మనుష్యస్త్రీ; రాక్షసస్య=రాక్షసునియొక్క; భార్యా=భార్య; భవితుం=అగుటకు; నార్హతి=తగదు.

మనుష్యస్త్రీ, యెప్పటికిని రాక్షసునకుభార్యయగుటకుందగునది కాదు. అని, తాత్పర్యము.

రహస్యార్థము.—భార్యా=పోషింపఁదగినది. శేషము. స్ప.

నేనుమహాలక్ష్మినైయున్నను, ఇప్పుడు, మనుష్యరూపంబునొందియుండుటవలన, మనుష్యస్త్రీ రాక్షసునియింటనుండరాదుకావున, నేను రావణునియింటనుండఁగూడదు. అని, తాత్పర్యము.

కామం ఖాదత మాం సర్వా నకరిష్యామి వో వచః. ౮

టీక॥ యూయం (అధ్యాహృతము)=మీరలు; సర్వాః=అందఱును; మాం=నన్ను; కామం=హెచ్చుగా; ఖాదత=తినుఁడు. వః=మీయొక్క; వచః=మాటను; నకరిష్యామి=చేయను.

మీరందఱును జేరినన్ను యథేచ్ఛగా, భక్షించిననుభక్షింపుఁడు; నాకదియునిష్టమే, నేనేమో మీరుచెప్పినట్లు చేయను. అని, తాత్పర్యము.

దీనో వా రాజ్యహీనో వా యో మే భర్తా స మే గురుః
తం నిత్యమనురక్తాస్మి యథా సూర్యం సువర్చలా. ౯

టీక॥ దీనోవా= దుఃఖమునొందినవాఁడుగాని; రాజ్యహీనోవా = రాజ్యముచేత విడువఁబడినవాఁడుగాని; యః=ఎవ్వఁడు; మే = నాయొక్క; భర్తా=పెనిమిటియో; సః= ఆరాముఁడు; మే=నాకు; గురుః = అధికుఁడు. సు

వర్చలా=సువర్చల; సూర్యంయథా=సూర్యుఁడుంబోలె;తం=ఆరామునిని; నిత్యం=ఎల్లప్పుడు; అనురక్తా=అనుసరించిన ప్రేమగలదానను; అస్మి = అగుచున్నాను.

నాభర్తయగు రాముండు, దీనుండుగాని రాజ్యంబులేనివాఁడుగాని, యతండె నాకధికుండు; సువర్చలసూర్యునియందనురాగంబుగలిగి యుండునట్లు, నేనతనియందెప్పుడు ననురాగంబుగలిగియుందును. అని, తాత్పర్యము.

యథా శచీ మహాభాగా శక్రం సముపతిష్ఠతి
అరుంధతీ వసిష్ఠంచ రోహిణీ శశినం యథా. ౧౦
లోపాముద్రా యథాగస్త్యం సుకన్యా చ్యవనం యథా
సావిత్రీ సత్యవంతంచ కపిలం శ్రీమతీ యథా. ౧౧
సౌదాసం మదయంతీవ కేశినీ సగరం యథా
నైషధం దమయంతీవ భైమీ పతిమనువ్రతా. ౧౨
తథాహ మిక్ష్వాకు వరం రామం పతిమనువ్రతా

టీక॥ యథా = ఎట్లు; మహాభాగా = పూజ్యమయినభాగ్యముగల; శచీ=శచీదేవి; శక్రం=ఇంద్రునిని; సముపతిష్ఠతి = అనుసరించుచున్నదో; యథా(అధ్యాహృతము)=ఎట్లు; అరుంధతీ=అరుంధతి; వసిష్ఠం = వసిష్ఠమహర్షిని; సముపతిష్ఠతి= అనుసరించుచున్నదో; యథా = ఎట్లు; రోహిణీ= రోహిణీదేవి; శశినం=చంద్రునిని; సముపతిష్ఠతి(అధ్యాహృతము)= అనుసరించుచున్నదో; యథా=ఎట్లు; లోపాముద్రా=లోపాముద్రాదేవి; అగస్త్యం= అగస్త్యమహర్షిని; సముపతిష్ఠతి= అనుసరించుచున్నదో; యథా=ఎట్లు; సుకన్యా=సుకన్యయనునది; చ్యవనం= చ్యవనమహర్షిని; సముపతిష్ఠతి=అనుసరించుచుండినదో; యథా (అధ్యాహృతము)=ఎట్లు; సావిత్రీ= సావిత్రీదేవి; సత్యవంతం= సత్యవంతుని; సముపతిష్ఠతి=అనుసరించుచుండినదో; యథా=ఎట్లు; శ్రీమతీ=శ్రీమతీదేవి; కపిలం=కపిలమహామునిని; సముపతిష్ఠతి= అనుసరించుచుండినదో, ఇవ("యథా" అనుదానితో సమానార్థకము) = ఎట్లు; మదయంతీ = మదయంతియనునది; సౌదాసం= సౌదాసుని; సముప




తిష్ఠతి = అనుసరించుచుండినదో; యథా=ఎట్లు; కేశినీ=కేశినియనునది; సగరం= సగరచక్రవర్తిని; సముపతిష్ఠతి=అనుసరించుచుండినదో; ఇవ ("యథా" అను దానితో సమానార్థకము)= ఎట్లు; భైమీ = భీముఁడను రాజుకొమార్తెయగు; దమయంతీ= దమయంతి; పతిం= పెనిమిటియయిన; నైషధం=నలచక్రవర్తిని; అనువ్రతా=అనుసరించుచుండినదో; తథా=అట్లు; అహం= నేను; పతిం = పెనిమిటియయిన; ఇక్ష్వాకువరం= ఇక్ష్వాకువంశములోఁ బుట్టినవారలలో శ్రేష్ఠుండగు; రామం= రాముని; అనువ్రతా = అనుసరించినదానను; అస్మి(అధ్యాహృతము)= అగుచున్నాను.

మహాభాగయగు శచీదేవియెట్లు దేవేంద్రు ననుసరించియుండునో ఏప్రకార మరుంధతీదేవివసిష్ఠు ననుసరించియుండునో, ఏలాగున రోహిణీదేవి చంద్రుననుసరించియుండునో, ఏరీతిని లోపాముద్రాదేవి యగస్త్యు ననుసరించియుండునో, ఏవిధంబున సుకన్యచ్యవనుననుసరించుచుండినదో, ఎట్లుసావిత్రిసత్యవంతుననుసరించియుండినదో, ఏవిధంబున శ్రీమతికపిలు ననుసరించియుండినదో, ఏదమవృసమదయంతిసౌదాసుననుసరించియుండినదో, ఎట్లుకేశినిసగరచక్రవర్తి ననుసరించియుండినదో, ఎట్లుభీముని కొమార్తె యగుదమయంతి, నలచక్రవర్తి ననుసరించి యుండినదో, అప్రకారము, నేను నాపెనిమిటి యగు, ఇక్ష్వాకువంశంబునఁ బుట్టినవారలలో నుత్తముండునగురాము నేయనుసరించియుందును. అని, సీతరాక్షస్త్రీలతోఁజెప్పినది. అని, తాత్పర్యము.

సీతాయా వచనం శ్రుత్వా రాక్షస్యః క్రోధమూర్ఛితాః. ౧౩
భర్త్సయంతిస్మ పరుషై ర్వాక్యై రావణచోదితాః

టీక॥ రావణచోదితాః= రావణునిచేఁబ్రేరేపింపఁబడిన; రాక్షస్యః= రాక్షసస్త్రీలు; సీతాయాః= సీతయొక్క; వచనం=మాటను; శ్రుత్వా= విని; క్రోధమూర్ఛితాః= కోపముచేవ్యాపింపఁబడినవారలై; పరుషైః= కఠినములగు; వాక్యైః= మాటలచేత; భర్త్సయంతిస్మ =బెదరించిరి.

అట్లు రావణునిచే నాజ్ఞాపింపఁబడియున్నయీరాక్షసస్త్రీలు, సీతచె




ప్పినమాటవిని, మిక్కిలియుఁగోపంబు నొంది, పరుషవచనంబుల, నాసీతా దేవిని, బెదరింపుచుండిరి. అని, తాత్పర్యము.

అవలీన స్స నిర్వాక్యో హనుమాన్ శింశుపాద్రుమే. ౧౪
సీతాం సంతర్జయంతీ స్తా రాక్షసీ రశృణోత్కపిః

టీక॥ శింశుపాద్రుమే=శింశుపావృక్షమునందు; అవలీనః=దాఁగియున్న; సః=ఆ; కపిః=కోతియైయున్న; హనుమాన్=హనుమంతుఁడు; నిర్వాక్యః=మాటలేనివాఁడై,ఏమియుఁ బలుకనివాఁడైయనట; సీతాం=సీతను; సంతర్జయంతీః=బెదరించుచున్న; తాః=ఆ; రాక్షసీః=రాక్షసస్త్రీలను; అశృణోత్=వినెను.

శింశుపావృక్షమునందు దాఁగియున్నయాహనుమంతుఁడు, ఏమియుఁబలుకక; యిట్లు సీతను బెదరించుచున్నయారాక్షసస్త్రీలమాటల వినుచుండెను. అని, తాత్పర్యము.

తా మభిక్రమ్య సంక్రుద్ధా వేపమానాం సమంతతః. ౧౫
భృశం సంలిలిహు ర్దీప్తాన్ ప్రలంబాన్ దశనచ్ఛదాన్

టీక॥ తాః (అధ్యాహృతము)=ఆరాక్షసస్త్రీలు; వేపమానాం=వడంకుచున్న; తాం=ఆసీతను; సమంతతః=అంతటను; అభిక్రమ్య=చుట్టుకొని; దీప్తాన్=ప్రకాశించుచున్నవియును; ప్రలంబాన్=వ్రేలాడుచున్నవియునగు; దశనచ్ఛదాన్=పెదవులను; భృశం=మిక్కిలియును; సంలిలిహుః=నాకిరి.

ఆరాక్షసస్త్రీలు, భయంబున గడగడవడంకుచున్నసీతంజుట్టుకొని మహాకోపంబున, నిట్లుగాఁ వెలుంగుచు వ్రేలుకాడుచున్నతమ పెదవుల నాలికచేనాకిరి. అని, తాత్పర్యము.

ఊచుశ్చ పరమక్రుద్ధాః ప్రగృహ్యాశు పరశ్వథాన్. ౧౬

టీక॥ తాః (అధ్యాహృతము)=ఆరాక్షసస్త్రీలు; పరమక్రుద్ధాః=మిక్కిలియుఁగోపంబునొందినవారలై; ఆశు=శీఘ్రముగా; పరశ్వథాన్=

గండగొడ్డళ్లను; ప్రగృహ్య=పట్టుకొని; ఊచుః=పలికిరియు.

ఆ రాక్షసస్త్రీలట్లు, మహాకోపంబున, గండగొడ్డళ్లంజేకొని, సీతం జూచి, యిట్లనిపలికిరి.

అని, తాత్పర్యము.

నేయ మర్హతి భర్తారం రావణం రాక్షసాధిపమ్

టీక॥ ఇయం=ఈసీత; రాక్షసాధిపం=రాక్షసులకుప్రభువైన; రావణం=రావణుని; భర్తారం=పెనిమిటినిగా; నార్హతి=పొందఁదగదు.

ఈసీతఁ, రాక్షసులకుఁ ప్రభుండైన రావణునకుభార్యయయియుండం దగదు. అని, రాక్షసస్త్రీలుచెప్పిరి.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.—భర్తారం=భరించువానిగా; (శేషము, సై.)

ఈవిధమహావిష్ణు సహచరియగుమహాలక్ష్మి; రాక్షసులకుఁప్రభుండగు రావణుండీవిధకుసీడుగాఁదగఁడు; అవివాస్తవము. అని, రాక్షసస్త్రీలుచెప్పిరి.

అని, తాత్పర్యము.

సా భర్త్స్యమానా భీమాభీ రాక్షసీభిర్వరాననా. ౧౪

టీక॥ వరాననా=శ్రేష్ఠంబగుముఖముగల; సా=ఆసీత; భీమాభిః=భయంకరలయిన; రాక్షసీభిః=రాక్షసస్త్రీలచేత; భర్త్స్యమానా=బెదరింపఁబడుచున్నది; అభూత్(అధ్యాహృతము)=ఆయెను.

సుందరంబగు ముఖముగలయాసీత, చూపరులకుభయంబుఁబుట్టించునారాక్షసస్త్రీలచే, నట్లు, బెదరింపఁబడుచుండెను. అని, తాత్పర్యము.

సా బాష్పమపమార్జంతీ శింశుపాం తాముపాగమత్

టీక॥ సా=ఆసీత; బాష్పం=కన్నీటిని; అపమార్జంతీ=తుడుచుకొనుచు; తాం=ఆ; శింశుపాం=శింశుపావృక్షమును; ఉపాగమత్=పొందెను.

ఆసీత, యిట్లురాక్షసస్త్రీలచే బెదరింపఁబడి, కన్నీళ్లందుడుచుకొనుచు, హనుమంతుండు డాఁగియున్న శింశుపావృక్షంబునొద్దకుంబోయెను.

అని, తాత్పర్యము.

తత స్తాం శింశుపాం సీతా రాక్షసీభి స్సమావృతా. ౧౮
అభిగమ్య విశాలాక్షీ తస్థౌ శోకపరిప్లుతా

టీక॥ తతః=అటుపిమ్మట; విశాలాక్షీ=వెడలుపులయినకన్నులుగల; సీతా=సీతాదేవి; రాక్షసీభిః=రాక్షసస్త్రీల చేత; సమావృతా=పరివేష్టింపఁబడినదై; తాం=ఆ; శింశుపాం=శింశుపావృక్షమును; అభిగమ్య=పొంది; శోకపరిప్లుతా=దుఃఖముచేముంపఁబడినదై; తస్థౌ=ఉండెను.

అంత, విశాలంబులగు నేత్రంబులు గలసీతాదేవి, రాక్షసస్త్రీలు చుట్టునుఁ బరివేష్టించిరాఁగా నాహనుమంతుండు డాఁగియున్నశింశుపావృక్షంబుఁ జేరి, దుఃఖసముద్రంబులో మునింగియుండెను. అని, తాత్పర్యము.

తాం కృశాం దీనవదనాం మలినాం బరధారిణీమ్. ౧౯
భర్త్సయాంచక్రిరే సీతాం రాక్షస్య స్తాం సమంతతః

టీక॥ రాక్షస్యః=రాక్షసస్త్రీలు; సమంతతః=చుట్టును, తాం=అట్టి, పతివ్రతయును; కృశాం=కృశించియున్నదియును; దీనవదనాం=దుఃఖముతోఁగూడినముఖముగలదియును; మలినాంబరధారిణీం=మురికివస్త్రమును దాల్చియున్నదియునగు; తాం=ఆ; సీతాం=సీతను, భర్త్సయాంచక్రిరే=బెదరించిరి.

రాక్షసస్త్రీలుచుట్టునుం జేరి మహాపతివ్రతయు నుపవాసవ్రతంబునం గృశించి దుఃఖితయయి మురికిబట్టలం గట్టుకొనియున్నదియునగునాసీతను, మఱలబెదరింపసాగిరి. అని, తాత్పర్యము.

తత స్తాం వినతానామ రాక్షసీ భీమదర్శనా. ౨౦
అబ్రవీ త్కుపితాకారా కరాళా నిర్ణతోదరీ.

టీక॥ తతః=అటుపిమ్మట ; భీమదర్శనా=భయంకరములయిన కండ్లుగలదియును; కుపితాకారా=కోపముతోఁగూడినయాకారముగలదియును; కరాళా=భయంకరియును; నిర్ణతోదరీ=కృశించినకడుపుగలదియునగు; వినతా

నామ=వినతయనుపేరుగల ; రాక్షసీ=రాక్షసస్త్రీ; తాం= ఆసీతనుగూర్చి; అబ్రవీత్=పలికెను.

అంత, భయంకరములగు కంఠ్లుగలదియును జూపరులకువెఱపుఁ బుట్టించునదియునగు వినతయనురక్కసి, కోపంబునొంది, యాసీతంబూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

సీతే పర్యాప్త మేతావ ద్భర్తుః స్నేహో నిదర్శితః. ౨౧

టీక॥ సీతే=సీతా! ఏతావత్=ఇంత; పర్యాప్తం=చాలును ; భర్తుః=పెనిమిటియొక్క; స్నేహః = చెలిమి; నిదర్శితః=చూపఁబడినది.

సీతా ! నీకునీపెనిమిటియందుఁగల స్నేహంబునుజూపితివి ; ఇంతమట్టుకుం జాలును. అని, తాత్పర్యము.

సర్వత్రాతికృతం భద్రే వ్యసనాయోపకల్పతే

టీక॥ భద్రే = మంగళకరమగుసీతా! సర్వత్ర = అన్నిటను ; అతికృతం= అధికముగానాచరించుట ; వ్యసనాయ=దుఃఖముకొఱకు;ఉపకల్పతే = అగుచున్నది.

మంగళస్వరూపిణివగు సీతా! దేనికైనమిక్కిలియునధికముగానాచరించినచో, దుఃఖంబెగలుగునుగానిసుఖముగలుగదు; కావున, మితముగానుండవలయును. అని, తాత్పర్యము.

పరితుష్టాస్మి భద్రం తే మానుష స్తే కృతో విధిః. ౨౨

టీక॥ అహం (అధ్యాహృతము)= నేను;పరితుష్టా= సంతసించినదానను; అస్మి=అగుచున్నాను. తే = నీకు; భద్రం=మంగళము; అస్తు(అధ్యాహృతము)=అగుఁగాక. తే=నీయొక్క; మానుషః = మనుష్యసంబంధియయిన;విధిః=అనుష్ఠానము; కృతః=చేయఁబడినది.

నీవుమనుష్యజాతికిఁదగినపాతివ్రత్యమునుబ్రకటించినావు;ఇంతమట్టుకుఁజాలును;నీపాతివ్రత్యమునకు నేనుసంతసించితిని;నీకుమంగళముగలుగుఁగాక.

అని, తాత్పర్యము.

మమ పితు వచః పథ్యం బ్రువంత్యాః కురు మైథిలి

టీక॥ మైథిలి= సీతా! పథ్యం= మేలును; బ్రువంత్యాః = చెప్పుచున్న; మమ= నాయొక్క; వచః= పితు= మాటను; కురు= చేయుము.

సీతా! నేను, నీకు మేలుగలుగుమాటం జెప్పెదను; నే జెప్పినట్లునుగాం జేముసేయుము. అని, తాత్పర్యము.

రావణం భజ భర్తారం భర్తారం సర్వరక్షసామ్. ౨౩
విక్రాంతం రూపవంతంచ సురేశమివ వాసవమ్
దక్షిణం త్యాగశీలంచ సర్వస్య ప్రియదర్శనమ్. ౨౪

టీక॥ విక్రాంతం=పరాక్రమంబుగలవాఁడును; రూపవంతంచ=మంచిరూపంబుగలవాఁడును; సురేశం= దేవతలకుఁబ్రభువైన; వాసవమివస్థితం=ఇంద్రుండుంబోలె నున్నవాఁడును; దక్షిణం=చతురుండును; త్యాగశీలంచ = ఈవిస్వభావముగాఁగలవాఁడును; సర్వస్య=సమస్తజనమునకును; ప్రియదర్శనం = సంతోషకరంబగుచూచుటగలవాఁడును; సర్వరక్షసాం = సమస్తరాక్షసులకును; భర్తారం=ప్రభువైనవాఁడునగు; రావణం= రావణుని; భర్తారం= పెనిమిటినిగా; భజ= పొందుము.

పరాక్రమశాలియు రూపవంతుండును దేవతలకధిపుండగు దేవేంద్రునివంటివాఁడును జతురుండును దాతయుఁ జూపరులకుసంతోషముగల్గించువాఁడు నురాక్షసులకందఱకునుబ్రభుండు నగు రావణునింబెనిమిటిగావరింపుము.

అని, తాత్పర్యము.

గహాస్యార్థము.— భర్తారం= భృత్యునిగా; శేషము పైని.

అట్టిసమస్తసద్గుణంబులును గలిగియున్నరావణునిభృత్యునిగా గ్రహింపుము. అని, తాత్పర్యము.

మానుషం కృపణం రామం త్యక్త్వా రావణ మాశ్రయ

టీక॥ మానుషం= మనుష్యుండును; కృపణం= కుత్సితుండునగు; రామం=

రాముని; త్యక్త్వా=విడిచి; రావణం=రావణుని;ఆశ్రయ=పొందుము.

మనుష్యుండుఁ గుత్సితుండునగు రాముంబరిత్యజించి, రావణునివరింపుము, అని, తాత్పర్యము.

రహస్యార్థము.— మానుషం=మనుష్యధర్మమయినభయమును; త్యక్త్వా=విడిచి;కృపణం= కుత్సితుండయినను; రావణం=రావణుని; రామం=రాముని;ఆశ్రయ=పొందుము.

మనుష్యులకుస్వాభావికంబయినభయంబునువిడిచి, రావణుండు రాక్షసుండగుటచేఁగుత్సితుండయినను భక్తుండుగావున, నతనిభృత్యుఁగానంగీకరించి, రామునిఁబొందుము.

అని, తాత్పర్యము.

దివ్యాంగరాగా వైదేహి దివ్యాభరణభూషితా. ౨౫

టీక॥ వైదేహి=సీతా! త్వం(అధ్యాహృతము)=నీవు;దివ్యాంగరాగా=శ్రేష్ఠమయినమైపూఁతగలదానవుగాను;దివ్యాభరణభూషితా=శ్రేష్ఠములయిన సొమ్ములచేనలంకరింపఁబడిన దానవుగాను;భవ (అధ్యాహృతము) = అగుము.

సీతా! నీవు,శ్రేష్ఠమయినసుగంధంబులందుకొని మంచియాభరణంబుల ధరించియుండుము. అని తాత్పర్యము.

అద్య ప్రభృతి సర్వేషాం లోకానా మీశ్వరీ భవ

టీక॥అద్యప్రభృతి= ఇదిమొదలు ; సర్వేషాం = సమస్తములయిన ; లోకానాం=లోకములకును; ఈశ్వరీ=ప్రభువైనదానవు భవ=అగుము.

ఇదిమొదలు, నీవుసమస్తలోకంబులకును ప్రభువుగానుండుము.

అని, తాత్పర్యము.

అగ్నేస్స్వాహా యథా దేవీ శచీవేంద్రస్య శోభనే. ౨౬
కింతే రామేణ వైదేహి కృపణేన గతాయుషా

టీక॥శోభనే=మంగళకరమగు; వైదేహి=సీతా! అగ్నేః=అగ్నికి ; స్వాహాయథా = స్వాహాదేవియుంబోలె; ఇంద్రస్య=ఇంద్రునకు; దేవీ=రాణియగు;శచీవ=శచీదేవియుంబోలె; రావణస్య,భార్యాభవ(అధ్యాహృతము)=

రావణునకుభార్యవగుము. కృపణేన=దుఃఖితుండును; గతాయుషా=పోయినయాయుస్సుగలవాఁడునగు ; రామేణ=రామునిచేత; తే=నీకు; కిం= యేమిప్రయోజనము?

మంగళకరివగుసీతా ! అగ్నికిస్వాహాదేవియు నింద్రునకుశచీదేవియుభార్యలుగానుండునట్లు , నీవురావణునకు భార్యగానుండుము; రాముండు , దుఃఖితుండైయున్నవాఁడు; మఱియురావణునకు విరోధియయి యింకజీవింపంజాలఁడు ; ఇంకనతనియందాశవిడువుము. అని, తాత్పర్యము.

రహస్యార్థము. శోభనే=మంగళకరివగు ; వైదేహి= సీతా! తే=నీకు; కృపణేన=దుఃఖముచేత ; కిం=ఏమిప్రయోజనము? గతాయుషా=పొందినయాయుస్సుగల, నిత్యుఁడగుననుట ; రామేణ=రామునిచేత; అగ్నేః=అగ్నియొక్క; దేవీ=భార్యయగు; స్వాహాయథా= స్వాహాదేవియుంబోలె; ఇంద్రస్య=ఇంద్రునియొక్క; దేవీ(అధ్యాహృతము)=భార్యయగు ; శచీవ=శచీదేవియుంబోలె ; భవిష్యసి (అధ్యాహృతము)=కాఁగలవు.

మంగళకరివగుసీతా! నీవుదుఃఖంబువిడువుము ; నీవునిత్యుండగు రామునింబొంది,యగ్నిభార్యయగు స్వాహాదేవియునింద్రభార్యయగుశచీదేవియుంబోలె, సుఖముగానుండఁగలవు.

అని, తాత్పర్యము.

ఏతదుక్తంచ మే వాక్యం యది త్వం న కరిష్యసి. ౨౭
అస్మిన్ముహూర్తే సర్వా స్త్వాం భక్షయిష్యామహే వయమ్

టీక॥త్వం=నీవు; మే=నాయొక్క; ఉక్తం=చెప్పఁబడిన; ఏతత్=ఈ; వాక్యం=మాటను;నకరిష్యసియది=చేయవేని; అస్మిన్=ఈ ; ముహూర్తే=కాలమునందే; వయం= మేము ; సర్వాః=అందఱమును ; త్వాం=నిన్ను; భక్షయిష్యామహే=భక్షింతుము.

నేనిప్పుడుచెప్పిన మాటప్రకారము నీవుచేయవేని , ఇప్పుడె, మేమందఱమును జేరినిన్నుభక్షింతుము.అని, వినతయనురాక్షసి, సీతతోఁ జెప్పినది.

రహస్యార్థము.— పూర్వార్థముసమానము.అస్మిన్, ముహూర్తే, వయం, సర్వాః, త్వాం= నిన్నుఁగూ

చిః; విషం(అధ్యాహృతము)= విషము ను; భక్షయిష్యామహే- తినుదుము.

నేనిప్పుడు చెప్పినమాట ప్రకారము నీవు సేయవేని, మేమందఱమును, నిన్నుం గూర్చి, యిప్పుడె విషంబుదిని, ప్రాణంబులువిడుతుము. అని, తాత్పర్యము.

అన్యాతు వికటానామ లంబమానపయోధరా. ౭౮
అబ్రవీ త్కుపితా సీతా ముష్టి ముద్యమ్య గర్జతీ

టీక॥ లంబమానపయోధరా= వ్రేలాడుచున్న స్తనములుగల ; వికటానామ=వికటయనెడు; అన్యాతు = మఱియొక రాక్షస స్త్రీయును ; కుపితా=కోపమునొందినదై; ముష్టిం= పిడికిలిని; ఉద్యమ్య=ఎత్తి; గర్జతీ=అఱచుచు; సీతాం=సీతనుగూర్చి; అబ్రవీత్ = పలికినది.

వ్రేలాడుచున్న స్తనములుగలవికటయనుమఱియొక్క రాక్షసస్త్రీ, కోపంబునంబిడికిలినెత్తి, గర్జించుచు, సీతంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఇచ్చట, కోపము, పిడికిలినెత్తుట, గర్జించుట, ఇవి, స్వాభావికములని, రహస్యము.

బహూన్య ప్రియరూపాణి వచనాని సుదుర్మతే. ౭౯
అనుక్రోశా న్మృదుత్వా చ్చ సోఢాని తవ మైథిలి

టీక॥ సుదుర్మతే=మిక్కిలియుదుర్బుద్ధిగల; మైథిలి=సీతా! తవ= నీయొక్క; బహూని=పెక్కులయిన ; అప్రియరూపాణి=ఇష్టములు గానివిగానుండునట్టి; వచనాని=మాటలు; అనుక్రోశాత్ =దయవలనను; మృదుత్వాచ్చ=తిన్నదనమువలనను ; సోఢాని=ఓర్వఁబడినవి.

దుష్టబుద్ధివగుసీతా! నీవిదివఱకెన్నియప్రియవచనంబు లాడుచున్నను, మేము, దయవలనను దిన్నఁదనమువలనను, వానికన్నింటికిని, ఓర్చుచుంటిమి.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— సుదుర్మతే=మిక్కిలియు దుష్టులగు వారియందును, అనుగ్రహరూపమయిన బుద్ధిగల; మైథిలి=సీతా! బహూని= పెక్కులయిన; అప్రియరూపాణి=అప్రియము

లుగాఁగానఁబడునట్టి ; అస్మాకం(అధ్యాహృతము) = మాయొక్క ; వచనాని=మాటలు; తవ=నీయొక్క; అనుక్రోశాత్=దయవలనను;మృదుత్వాచ్చ=తిన్నఁదనమువలనను; త్వయా(అధ్యాహృతము)=నీచేత; సోఢాని = ఓర్వఁబడినవి.

సీతా!నీవు,మావంటి యధికదుష్టజనులందును అనుగ్రహముసేయు దానవుకావున, మేమప్రియములుగాఁ గానఁబడునట్టిమాటలెన్ని చెప్పినను,దయయుమార్దవంబునవలంబించి, వానినన్నింటిని , ఓర్చియున్నావు.

అని, తాత్పర్యము.

న చ నః కురుషే వాక్యం హితం కాలపురస్కృతమ్. ౩౦

టీక॥ కాలపురస్కృతం= కాలముచేగౌరవింపఁబడినదియును, కాలమునకుఁదగినదియుననుట ; హితం=మేలుసేయునదియునగు;నః=మాయొక్క , వాక్యంచ=మాటను; నకురుషే = చేయకున్నావు.

ఇప్పటికాలమునకుఁ దగునట్లుగా నీకు మేలుగల్గునట్లుగా నీకుమేము చెప్పిన మాటలను జేయకున్నావు.

అని, తాత్పర్యము.

ఆనీ తాసి సముద్రస్య పార మన్యై ర్దురాసదమ్

టీక॥అన్యైః=ఇతరులచేత; దురాసదం=పొందఁగూడనట్టి; సముద్రస్య=సముద్రముయొక్క; పారం=గట్టును; ఆనీతా=పొందింపఁబడినదానవు ; అసి=అగుచున్నావు.

ఇప్పుడు నీవుసముద్రముదాటియీవలిగట్టునకుఁదేఁబడియున్నావు; ఇట్లు, సముద్రము దాటి యిచ్చటికివచ్చుటకు, ఇంక,మఱి యెవ్వరికినలవిగాదు.

అని, తాత్పర్యము.

ఇతరులిచ్చటికిరాలేరుగాని , రాముండు రాఁగలండు.అని,రహస్యము.

రావణాంతః పురం ఘోరం ప్రవిష్టాచాసి మైథిలి. ౩౧

టీక॥ మైథిలి=సీతా! ఘోరం=భయంకరమగు; రావణాంతఃపురం=రావణునియంతఃపురమును; ప్రవిష్టాచ = పొందినదానవును;అసి=అయితివి.

సీతా! మఱియెవ్వరికిం జొరరాని రావణునంతఃపురంబులో నున్నావు. అని, తాత్పర్యము.

రావణస్య గృహే రుద్ధా మస్మాభి స్తు సురక్షితామ్
న త్వాం శక్తః పరిత్రాతు మపి సాక్షా త్పురందరః. ౩౨

టీక॥ రావణస్య=రావణునియొక్క; గృహే=ఇంటియందు; రుద్ధాం=అడ్డగింపఁబడిన దానవును; అస్మాభిః=మాచేత; సురక్షితాంతు=చక్కఁగా రక్షింపఁబడిన దానవు నగు; త్వాం=నిన్ను; పరిత్రాతుం=రక్షించుటకు; సాక్షాత్పురందరోపి=సాక్షాద్దేవేంద్రుఁడైనను; శక్తః=చాలినవాఁడు; న=కాఁడు.

రావణునియింట డాఁచఁబడి మాచేఁ జక్కఁగా రక్షింపఁబడుచున్న నిన్నిచ్చటనుండి గొనిపోవుటకు సాక్షాద్దేవేంద్రుఁడైనను శక్తుండు గాఁడు. అని, తాత్పర్యము.

రాముం డుదక్క మఱి యెవ్వండును శక్తుండు గాఁడు. అని రహస్యము.

కురుష్వ హితవాదిన్యా వచనం మమ మైథిలి

టీక॥ మైథిలి=సీతా! హితవాదిన్యాః=మేలు చెప్పుచున్నట్టి; మమ=నాయొక్క; వచనం=మాటను; కురుష్వ=చేయుము.

సీతా! నేను నీకు మేలు గలుగుటకై చెప్పుచున్నాను; నామాట ప్రకారము సేయుము. అని, తాత్పర్యము.

అల మశ్రుప్రపాతేన త్యజ శోక మనర్థకమ్. 33
("తుల్యమశ్రుప్రపాతేన" ఇతి పాఠాంతరమ్.)

టీక॥ అశ్రుప్రపాతేన=కన్నీరు విడుచుటచేత; అలం=చాలును. (పాఠాంతర పక్షమందు) అశ్రుప్రపాతేన తుల్యం=కన్నీరు విడుచుటతోఁ గూడ; అనర్థకం=ప్రయోజనము లేని; శోకం=దుఃఖమును; త్యజ=విడువుము.

నీ విట్లు కన్నీరు విడుచుటం జాలింపుము; ఇట్లు, నిష్ప్రయోజనము గాదుఃఖింపకుము. అని, తాత్పర్యము.

భజ ప్రీతించ హర్షంచ త్యజైతాం నిత్యదైన్యతామ్

టీక॥ ప్రీతించ=స్నేహమును ; హర్షంచ=సంతోషమును; భజ=పొందుము. ఏతాం=ఈ; నిత్యదైన్యతాం=ఎల్లప్పుడును దుఃఖము గలిగియుండుటను; త్యజ=విడువుము.

రావణునియందు స్నేహంబునుంచి సంతోషంబు గానుండుము; ఇట్లు, ఎల్లప్పుడు నేకరీతిగా దుఃఖించుచుండకుము. అని, తాత్పర్యము.

సీతే రాక్షసరాజేన సహ క్రీడ యథాసుఖమ్. ౩౪

టీక॥ సీతే=సీతా! యథాసుఖం=సుఖముగా; రాక్షసరాజేన సహ=రాక్షసులకుఁ బ్రభుండగు రావణునితోఁగూడ; క్రీడ=రమింపుము.

సీతా! రాక్షసేశ్వరుండగు రావణుంగూడి సుఖముగా రమింపుచుండుము. అని, తాత్పర్యము.

రహస్యార్థము.— సీతే=సీతా! రాక్షసరాజేన=రాక్షసులకుఁ బ్రభుండగు రావణునిచేత; ఉక్తం (అధ్యాహృతము)=చెప్పఁబడినదాని; సహ (సహస్వ) ఓర్వుము. యథాసుఖం=సుఖముగా; క్రీడ=విహరింపుము.

సీతా! రాక్షసేశ్వరుండగు రావణుండు చెప్పిన మాటలలో దోషంబున్న యెడ దానిక్షమింపుము ; సుఖంబుగా విహరింపుచుండుము. అని, తాత్పర్యము.

జానాసిహి యథా భీరు స్త్రీణాం యౌవన మధ్రువమ్

టీక॥ భీరు=భయముగలదానా! యథా=ఎట్లు; స్త్రీణాం=స్త్రీలకు; యౌవనం=యౌవనము; అధ్రువం=అనిత్యమో; తథా (అధ్యాహృతము) = అట్లు; జానాసిహి=ఎఱుంగుదువుగదా!

భయముగలదానవగు సీతా ! స్త్రీలకు యౌవనము నిత్యముగాదని నీకుఁ దెలియునుగదా! అని, తాత్పర్యము.

యౌవన్న తే వ్యతిక్రామే త్తావ త్సుఖ మవాప్నుహి. ౩౫

టీక॥ తే=నీయొక్క; తత్ (అధ్యాహృతము)=ఆయౌవనము; యావత్ =

ఎంతవఱకు; నవ్యతిక్రామేత్=అతిక్రమింపదో; తావత్=అంతలోపల; సుఖం=సౌఖ్యమును; అవాప్నుహి=పొందుము.

అట్టినీయౌవనమునశించుటకుమున్నె రావణునింగూడి సుఖంబు ననుభవింపుము. అని, తాత్పర్యము.

రహస్యార్థము.—సాధారణస్త్రీలకు యౌవనమునిత్యముగానుండదు; నీవునిత్యయౌవనశాలివి, నిత్యంబుగా నీవు రామునింగూడిసుఖంపఁగలవు.

అని, తాత్పర్యము.

ఉద్యానానిచ రమ్యాణి పర్వతోపవనానిచ
సహ రాక్షసరాజేన చర త్వం మదిరేక్షణే. ౩౬

టీక॥మదిరేక్షణే=మదముగప్పినకం డ్లుగలయోఁడుదానవగుసీతా! త్వం=నీవు; రమ్యాణి=మనోహరములయిన; ఉద్యానానిచ=ఉద్యానవనములను, ఉద్యానములయందుననుట; పర్వతోపవనానిచ=పర్వతములసమీపముననుండు వనంబులను, వనములయందుననుట; రాక్షసరాజేనసహ=రాక్షసులకుఁబ్రభుఁడైనరావణునితోఁగూడ; చర=సంచరింపుము.

మదముగప్పినకండ్లుగలసీతా! నీవు రాక్షసేశ్వరుండగురావణుంగూడి, రమణీయంబులగు నుద్యానవనంబులందు నుబర్వతములసమీపమునందలి వనంబులందును, విహరించుచుండుము.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— రాక్షసేశ్వరుండగు రావణుండుభృత్యుండై గొలుచుచుండఁగానీవు, రమణీయంబు లగు నుద్యానవనంబుల యందును బర్వతములసమీపముననుండు వనంబులందును విహరింపుచుండుము. అని, తాత్పర్యము.

స్త్రీసహస్రాణి తే సప్త వశే స్థాస్యంతి సుందరి

టీక॥సుందరి=సౌందర్యవతివగు సీతా! స్త్రీసహస్రాణి = స్త్రీలయొక్క వేలు; సప్త=ఏడు; తే=నీయొక్క; వశే=అధీనతయందు; స్థాస్యంతి=ఉండఁగలరు.

సౌందర్యవతివగుసీతా! ఏడువేలమంది స్త్రీలు నీవశంబులోనుండినీకు సేవసేయుచుండుదురు. అని, తాత్పర్యము.

రావణం భజ భర్తారం భర్తారం సర్వ రక్షసామ్. ౩౭

టీక॥ సర్వరక్షసాం=సమస్తరాక్షసులకును ; భర్తారం=ప్రభువైన ; రావణం=రావణుని; భర్తారం=పెనిమిటినిగా; భజ=పొందుము.

సమస్తరాక్షసులకును ప్రభుండై వెలయుచున్న రావణుం బెనిమిటినిగావరింపుము. అని, తాత్పర్యము.

రహస్యార్థము.— సర్వరక్షసాం; భర్తారం; రావణం; భర్తారం = భృత్యునిఁగా; భజ=పొందుము.

సమస్తరాక్షసులకును నాయకుండైవెలయురావణునిభృత్యునిఁగా గ్రహింపుము. అని, తాత్పర్యము.

ఉత్పాట్య వా తే హృదయం భక్షయిష్యామి మైథిలి
యది మే వ్యాహృతం వాక్యం న యథావ త్కరిష్యసి. ౩౮

టీక॥ మైథిలి=సీతా! మే = నాయొక్క; వ్యాహృతం = చెప్పఁబడిన; వాక్యం=మాటను; యథావత్=సరిగా; నకరిష్యసియది=చేయవేని; తే=నీయొక్క; హృదయం = గుండెను ; ఉత్పాట్య వా=పెఱికియే; భక్షయిష్యామి=తినెదను.

సీతా! నేనుజెప్పినమాటప్రకారము సేయవేని, నీగుండెంబెఱికిభక్షింతును. అని,వికటయనునదిసీతతోఁజెప్పినది.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— మైథిలి; మే; వ్యాహృతం;వాక్యం;యథావత్; నకరిష్యసియది;తే = నీకొఱకు; మమ(అధ్యాహృతము) = నాయొక్క;హృదయం=గుండెను;ఉత్పాట్య వా= పెఱికినయినను; భక్షయిష్యామి=తినిపించెదను.

సీతా! నేనుజెప్పినమాటప్రకారము సేయవేని, నీకుఁగా, నాగుండెంబెఱికి యీరాక్షసస్త్రీలకుఁ దినబెట్టియయినను బ్రాణంబులువిడిచెదను.

అని, తాత్పర్యము.

తత శ్చండోదరీ నామ రాక్షసీ క్రోధమూర్ఛితా
భ్రామయంతీ మహ చ్ఛూల మిదం వచన మబ్రవీత్. ౩౯

టీక॥ తతః=అటుపిమ్మట; చండోదరీనామ = చండోదరియనెడు; రాక్షసీ = రాక్షసస్త్రీ; క్రోధమూర్ఛితా= కోపముచే వ్యాపింపఁబడినదై ; మహత్=పెద్దదైన; శూలం=శూలమును; భ్రామయంతీ = త్రిప్పుచు; ఇదం= ఈ; వచనం=మాటను; అబ్రవీత్ = చెప్పెను.

అంత, చండోదరియనురాక్షసి, మహాకోపంబునొంది, శూలంబుఁ ద్రిప్పుచు, నీమాటం జెప్పెను.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— తతః=అటుపిమ్మట; క్రోధమూర్ఛితా= కోపముచే వ్యాపింపఁబడినదియును; మహత్=పెద్దదైన; శూలం=శూలమును; భ్రామయంతీ=త్రిప్పుచున్నదియునగు; చండోదరీనామ = చండోదరియనెడు; రాక్షసీ=రాక్షసస్త్రీ; ఇదం=ఈ; వచనం= మాటను; అబ్రవీత్=చెప్పెను.

అంతనెల్లప్పుడును గోపంబునొందియుండుస్వభావంబుగలదియు శూలము ద్రిప్పుచున్నదియునగు చండోదరియనునొక్కరక్కసి, వికట, చెప్పినమాటరహస్యార్థంబు దెలియక, సీతనుమాఱినదనిభ్రమించి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

ఇమాం హరిణలోలాక్షీం త్రాసోత్కంపిపయోధరామ్
రావణేన హృతాం దృష్ట్వా దౌహృదో మే మహా నభూత్.౪౦

టీక॥ రావణేన= రావణునిచేత ; హృతాం=అపహరింపఁబడినదియును; హరిణలోలాక్షీం= జింకకుంబోలెఁజంచలంబులయినకండ్లుగలదియును; త్రాసోత్కంపిపయోధరాం =భయముచే వడంకుచున్న స్తనములు గలదియునగు; ఇమాం=ఈసీతను; దృష్ట్వా=చూచి; మే=నాకు; మహత్=అధికమయిన; దౌహృదః=కోర్కె; అభూత్ =కలిగినది.

జింకకుంబోలె జంచలంబులగు నేత్రంబులుగలదియు, భయంబున నిట్టూర్పులు విడుచుటంజేసి వడంకుచున్న స్తనంబులుగలదియునగు, నీసీతను రావణుండిచ్చటికిఁదెచ్చినప్పుడునేఁ జూచినదిమొదలు, నాకొకగొప్పకోర్కె కలిగియున్నది.

రహస్యార్థము.— దౌహృదః= స్నేహము. శేషము, పై.

రావణుండీసీతనిచ్చటికిఁదెచ్చినప్పుడునేనుజూచినదిమొదలు, నాకీసీతయం

దు, మిక్కిలియధికమయిన స్నేహముగలిగియున్నది. అని, తాత్పర్యము.

యకృ త్ప్లీహ మథోత్పీడం హృదయంచ సబంధనమ్
("అథోత్క్రోడం" ఇతిపాఠాంతరమ్)
ఆంత్రాణ్యపి తథాశీర్షం ఖాదేయ మితిమే మతిః. ౪౧

టీక॥ యకృత్=హృదయమునకుద క్షిణభాగమునందుమాంసమును; ప్లీహం(ప్లీహానం)=హృదయమునకువామభాగమునందు మాంసమును; అథ=ఇంక; ఉత్పీడం=హృదయమునకుఁబైనుండుమాంసమును; (పాఠాంతరపక్షమందు) ఉత్క్రోడం=హృదయస్థానంబును; స్యందనం = క్రిందనాధారమయియుండు మాంసముతోఁగూడిన, హృదయంచ = తామర మొగ్గవంటి మాంసమును; ఆంత్రాణ్యపి = ప్రేగులను; తథా=అట్లు; శీర్షం=తలను; ఖాదేయం=తినుదును. ఇతి=అని; మే=నాయొక్క; మతిః=కోరిక.

ఈసీతంజంపి, ఈబిడదేహమునందు, హృదయమునకుదక్షిణభాగంబునందు మాంసమునుదానికివామ భాగమునందుండుమాంసమును, దానికిఁబయినుండు మాంసమును లేకహృదయస్థానమును దామర మొగ్గవలె నుండు మాంసమును దానికిఁగ్రింద నాధారమయియుండుమాంసమును ప్రేగులను దలను, దినవలయునని నేను గోరుచున్నాను. అని, చండోదరిచెప్పినది.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— ఈవికటనాకు, మిక్కిలి స్నేహితురాలై యుండునీసీతనీప్రకారమునందిట్టినది, కావున, దీనింజంపి, దీనిదేహంబునందలియకృదాది మాంసంబులఁ దనివి దీరఁదినఁగోరుచున్నాను. అని, చెప్పినది. అని తాత్పర్యము.

తతస్తు ప్రఘసా నామ రాక్షసీ వాక్య మబ్రవీత్

టీక॥ తతస్తు=అటుపిమ్మటను; ప్రఘసానామ=ప్రఘసయనెడు; రాక్షసీ=రాక్షసస్త్రీ; వాక్యం=మాటను; అబ్రవీత్=పలికెను.

అంతఁ బ్రఘసయను రాక్షసియిట్లని చెప్పినది. అని, తాత్పర్యము.

కంఠ మస్యా నృశంసాయాః పీడయామ కిమాస్యతే. ౪౨

టీక॥ నృశంసాయాః=క్రూరురాలయిన; అస్యాః=ఈసీతయొక్క; కంఠం=మెడను; పీడయామ=పిసుకుదము. కిం=ఎందుకు; ఆస్యతే=ఉండుటయగుచున్నది.

క్రూరచిత్తయగు నీసీత మెడనుబిసికి చంపివేయుదము; ఊరకుండ నేల?

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— అస్యాః=ఈవికటయొక్క; శేషము, పై.

మృదుస్వభావయగు సీత నిట్లుబాధించుచున్నదే! ఈవికటయెంత క్రూరురాలు; దీనిమెడకాయంబిసికిచంపివేయుదము; ఊరకుండనేల?

అని, తాత్పర్యము.

నివేద్యతాం తతో రాజ్ఞే మానుషీ సా మృతేతి హ.

టీక॥ తతః=అటుపిమ్మట; రాజ్ఞే=రాజయినరావణునికొఱకు; సా=ఆ; మానుషీ=మనుష్యస్త్రీయగుసీత; మృతా=చచ్చినది. ఇతి=అని ("హ" అనునది పాదపూరణార్థము); నివేద్యతాం=తెల్పఁబడుఁగాక.

ఆవెనుక, "మనుష్యస్త్రీయగు సీత చచ్చినది" అని, రావణునకుఁ జెప్పదము. అని, తాత్పర్యము.

రహస్యార్థము.— అమానుషీ=మనుష్యస్త్రీకాని, అనఁగా రాక్షసస్త్రీయయినవికట. శేషము, పై.

అటుపిమ్మట, "ఆవికటయను రాక్షసస్త్రీ చచ్చినది" అని, రావణునకుఁ జెప్పదము. అని, తాత్పర్యము.

నాత్ర కశ్చన సందేహః ఖాదతేతి స వక్ష్యతి. ౪౩

టీక॥ సః=ఆరావణుండు, "ఖాదత=భక్షింపుఁడు." ఇతి=అని; వక్ష్యతి=చెప్పును. అత్ర=ఈవిషయమునందు; సందేహః=సందేహము; కశ్చన=ఒకానొకటియును; న=లేదు.

అంత, రావణుండు, "అయితే, భక్షింపుఁడు" అని చెప్పును; ఈవిషయమునం దెంతమాత్రమును సందేహము లేదు. అని, ప్రఘసయను రాక్షసి చెప్పినది. అని, తాత్పర్యము.

స ౨౪

తత స్త్వజాముఖీ నామ రాక్షసీ వాక్య మబ్రవీత్

టీక। తతస్తు=అపిమ్మటను; అజాముఖీనామ=అజాముఖియనెడు; రాక్షసీ=రాక్షసస్త్రీ; వాక్యం = మాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత, అజాముఖియను రాక్షసస్త్రీ, యిట్లని, చెప్పినది. అని, తాత్పర్యము.

విశస్యేమాం తత స్సర్వా స్సమాన్ కురుత పిలుకాన్. ౪౪

టీక। యూయం (అధ్యాహృతము)=మీరలు; సర్వాః=అందఱును; ఇమాం=ఈబిడను; విశస్య=కోసి; సమాన్=సమానములయిన; పిలుకాన్=మాంసఖండములనుగా; కురుత=చేయుడు.

మీరందఱును జేరి, యీసీత దేహమును ఛేదించి, సమముగా, మాంసఖండములం జేయుఁడు. అని, తాత్పర్యము. "ఈపికట దేహమును ఛేదించి" యని రహస్యము.

విభజామ తత స్సర్వా వివాదో మే న రోచతే

టీక॥ తతః=అటుపిమ్మట; వయం (అధ్యాహృతము)=మనము; సర్వాః=అందఱమును; విభజామ=పంచుకొందము. మే=నాకు; వివాదః=కలహము; నరోచతే=రుచింపదు.

అంత, మనమందఱమును, ఆమాంసఖండములను సమానముగాఁ బంచుకొందము; నాకుఁగలహముసేయుట సరి పడదు. అని, తాత్పర్యము.

పేయ మానీయతాం క్షిప్రం లేహ్య ముచ్చావచం బహు. ౪౫

టీక॥ ఉచ్చావచం=నానావిధమయిన; బహు=అధికమగు; పేయం=పానద్రవ్యమును; లేహ్యం=నాకఁదగిన తేనె మొదలగునదియును; క్షిప్రం=శీఘ్రముగా; ఆనీయతాం=తేఁబడుఁగాక.

నానావిధములగు, మద్యములను దేనె మొదలగు లేహ్యపదార్థములనుదీసికొనిరండు; వానిం జేర్చికొని భక్షింతము. అని, యజాముఖియను రాక్షసి, చెప్పినది. అని, తాత్పర్యము.

తత శ్శూర్పణఖా నామ రాక్షసీ వాక్య మబ్రవీత్

టీక॥ తతః=అటుపిమ్మట; శూర్పణఖా నామ = శూర్పణఖయనెడు; రాక్షసీ= రాక్షసస్త్రీ; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత, శూర్పణఖయను రాక్షసి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

అజాముఖ్యా యదుక్తం హి తదేవ మమ రోచతే. ౪౬

టీక అజాముఖ్యా= అజాముఖిచే; యత్=ఏది; ఉక్తంహి=చెప్పఁబడినదో; తదేవ=అదియే; మమ=నాకు; రోచతే=రుచించుచున్నది.

అజాముఖి యేమిచెప్పినదో, అదియె నాకునుసరిగాఁదోఁచుచున్నది.

అని, తాత్పర్యము.

సురా చానీయతాం క్షిప్రం సర్వశోక వినాశినీ
మానుషం మాంస మాస్వాద్య నృత్యామో థ నికుంభిలామ్. ౪౭

టీక॥ సర్వశోకవినాశినీ= సమస్తదుఃఖములనుబోఁగొట్టునట్టి; సురా చ=మద్యమును; క్షిప్రం=శీఘ్రముగా; ఆనీయతాం=తేఁబడుఁగాక. అథ=అటుపిమ్మట; మానుషం=మనుష్యసంబంధియయిన; మాంసం=మాంసమును; ఆస్వాద్య=చవిచూచిభక్షించియనుట; నికుంభిలాం= లంకపశ్చిమద్వారమునందుండునికుంభిలయను శక్తినిగూర్చి, శక్తికిఁబ్రీతిగల్గుటకై యనుట; నృత్యామః=నర్తనముసేయుదము.

దుఃఖంబులనెల్లఁబోఁగొట్టునట్టి మద్యమునుదీసికొనిరండు; మనుష్య మాంసమును భక్షించి యామద్యముం గ్రోలి లంకపశ్చిమ ద్వారమునందుండు నికుంభిలయనుశక్తికిఁ బ్రీత్యర్థ మయి నర్తనము సేయుదము. అని, శూర్పణఖయను రాక్షసి, చెప్పినది.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— సర్వశోక వినాశినీ = సమస్తదుఃఖములను బోఁగొట్టునట్టి; సురా=మద్యమును; మానుషం=మనుష్యసంబంధియయిన; మాంసంచ=మాంసమును; క్షిప్రం= శీఘ్రముగా; ఆనీయతాం! తేఁబడుఁ గాక. ఆస్వాద్య=భక్షించి; అథ; నికుంభి

లాం; నృత్యామః.

దుఃఖములనెల్ల బోఁగొట్టునట్టిమద్యమును మనుష్యమాంసమునుంగూడఁ దీసికొనిరండు; ఆమనుష్యమాంసముతోఁగూడ, ఈవికటదేహమునందలి రాక్షసమాంసమును భక్షించి, మద్యంబుఁ గ్రోలి, నికుంభిలకుఁ బ్రీతిగల్గునట్లు, నర్తనము సేయుదము.

అని, తాత్పర్యము.

ఏవం సంభర్త్స్యమానా సా సీతా సురసుతోపమా
రాక్షసీభి స్సుఘోరాభి ర్ధైర్య ముత్సృజ్య రోదితి. ౪౮

టీక॥ సురసుతోపమా= దేవకన్యకతోఁబోలికగల; సా=ఆ; సీతా=సీత; సుఘోరాభిః=మిక్కిలియుభయంకరలయిన; రాక్షసీభిః=రాక్షసస్త్రీలచేత; ఏవం=ఇట్లు; సంభర్త్స్యమానా=బెదరింపఁబడినదై; ధైర్యం=ధైర్యమును; ఉత్సృజ్య=విడిచి; రోదితి=(భూతార్థమందులట్)ఏడ్చెను.

దేవకన్యకయుం బోలె సర్వాంగసుందరియయియుండునా సీత, యిట్లుభయంకరలయిన రాక్షసస్త్రీలు సేయు బెదరింపులకుదడిసి, ధైర్యంబు విడిచి, రోదనముచేసెను. అని, తాత్పర్యము.

"సీత, రామవియోగదుఃఖంబున రోదనముచేసెను." అని, రహస్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, చతుర్వింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, సుందరకాండ చతుర్వింశసర్గటీక, ముగిసినది.

---

శ్రీ
పంచవింశసర్గప్రారంభః.

తథా తాసాం వదంతీనాం పరుషం దారుణం బహు
రాక్షసీనా మసౌమ్యానాం రురోద జనకాత్మజా. ౧

టీక॥ అసౌమ్యానాం=తిన్ననివారు కానట్టి, భయంకరలయినయనుట; తాసాం=ఆ; రాక్షసీనాం = రాక్షసస్త్రీలు; తథా=అట్లు; పరుషం = కఠినముగాను; దారుణం=భయంకరముగాను; బహు = అధికముగాను; వదంతీనాం=చెప్పుచుండఁగా; జనకాత్మజా= జనకునికొమాతెయగుసీత; రురోద= ఏడ్చెను.

భయంకరాకారలయిన యారాక్షసస్త్రీలు, అట్లుకఠినముగానుభయంకరముగాను బెక్కుమార్లు చెప్పుచుండఁగా, నామాటలనువిని, సీత, దుఃఖమున, నేడ్చినది. అని, తాత్పర్యము.

ఆరాక్షసస్త్రీ లట్లు చెప్పుచుండఁగా, సీత, రామునిందలంచుకొనిరోదనముచేసినది. అని, రహస్యము.

ఏవ ముక్తాతు వైదేహీ రాక్షసీభి ర్మనస్వినీ
ఉవాచ పరమత్రస్తా బాష్పగద్గదయా గిరా. ౨

టీక॥ మనస్వినీ = మంచి మనస్సు గల; వైదేహీ=సీత; రాక్షసీభిః = రాక్షసస్త్రీలచేత ; ఏవం=ఇట్లు; ఉక్తాతు=చెప్పఁబడినంతనె; పరమత్రస్తా = మిక్కిలియుభయమునొందినదై; బాష్పగద్గదయా=కన్నీరుచేడగ్గుత్తికపడినట్టి; గిరా=మాటచేత; ఉవాచ=చెప్పినది.

మంచిమనస్సుగలసీత, రాక్షసస్త్రీలమాటలనువిని, పరమభయంబునొంది, డగ్గుత్తికతో, నిట్లని, చెప్పినది. అని, తాత్పర్యము.

రామవియోగంబున భయంబునొంది, ఆదుఃఖమునడగ్గుత్తికతో, నిట్లని, చెప్పినది. అని, రహస్యము.

న మానుషీ రాక్షసస్య భార్యా భవితు మర్హతి

టీక॥ మానుషీ=మనుష్యస్త్రీ; రాక్షసస్య=రాక్షసునకు; భార్యా=పెండ్లాము; భవితుం=అగుటకు; నార్హతి=తగదు.

ఎప్పటికిని మనుష్యస్త్రీ రాక్షసునకు భార్యగాఁదగదు; కావున, నేను రావణునకు భార్యగాఁదగను.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.—భార్యా—పోషింపఁదగినది. శేషము. పై.

రాక్షసుండు, మనుష్యస్త్రీని, పోషింపందగఁడు, కావున, రావణుండు, నన్నుఁబోషింపందగఁడు.

అని, తాత్పర్యము.

కామం ఖాదత మాం సర్వా న కరిష్యామి వో వచః. ౩

టీక॥ యూయం (అధ్యాహృతము) మీరలు; సర్వాః=అందఱును; మాం=నన్ను; కామం=యథేచ్ఛముగా; ఖాదత=భక్షింపుఁడు. వః=మీయొక్క; వచః=మాటను; నకరిష్యామి=చేయను.

మీరలందఱునన్ను యథేచ్ఛగాఁదినివేయుఁడు; నేనుమీరుచెప్పినట్లు చేయను. అని, సీతచెప్పినది. అని, తాత్పర్యము.

వికటనుభక్షింపవలదు; నన్నేభక్షింపుఁడు, నేనుమీరుచెప్పినట్లుచేయను.

అని, రహస్యము.

సా రాక్షసీ మధ్యగతా సీతా సురసుతోపమా
న శర్మ లేభే దుఃఖార్తా రావణేన చ తర్జితా. ౪

టీక॥ రాక్షసీమధ్యగతా=రాక్షసస్త్రీలనడుమఁ బొందినదియును; సురసుతోపమా=దేవకన్యకతోఁ బోల్కఁగలదియును; దుఃఖార్తా=దుఃఖముచేఁ బీడింపఁబడినదియును; రావణేన=రావణునిచేత; తర్జితా చ=బెదరింపఁబడినదియునగు; సా=ఆ; సీతా=సీత; శర్మ=సుఖమును; నలేభే=పొందదయ్యె.

అట్లు రావణునిచే బెదరింపఁబడి, దుఃఖంబునొంది, రాక్షసస్త్రీలనడుమనున్న దేవకన్యకతో సమానమయిన సీతాదేవి, యెంతమాత్రము సుఖంబుపొందదయ్యె. అని, తాత్పర్యము-

రహస్యార్థము.— సీతాదేవి, దేవకన్యకతోసరిగా సౌందర్య సౌకు

మార్యాదులుగలవిగావున, నట్టిభయంకరాకారలగు రాక్షసస్త్రీలనడుమనుండుటవలననుభయంకరాకారుండగు రావణుండు మంచిమాటలే చెప్పినను అవి రాక్షసవచనములౌటవలనను, ఆబిడకు, ఎంతమాత్రము, సుఖంబు గలుగదయ్యె. అని, తాత్పర్యము.

వేపతే స్మాధికం సీతా విశంతీ వాంగ మాత్మనః
వనే యూథపరిభ్రష్టా మృగీ కోకైరి వార్దితా. ౫

టీక॥ ఆత్మనః = తనయొక్క; అంగం = దేహమును; విశంతీవ (స్థితా) = ప్రవేశించుచున్నదివలెనున్నట్టి; సీతా = సీత; వనే = అడవియందు; యూథపరిభ్రష్టా = గుంపునుండితప్పినట్టిదియు; కోకైః = తోడేళ్లచేత; అర్దితా = పీడింపఁబడినదియునగు; మృగీవ = లేడియుంబోలె; అధికం = మిక్కిలియు; వేపతే స్మ = వడంకెను.

సమస్తేంద్రియముల వృత్తులనుడుపరమింపఁ జేసికొని నట్లున్న సీతాదేవి, యడవియందుగుంపుదప్పితోడేళ్ల చేబాధింపఁబడుచున్న లేడియుంబోలె, మిక్కిలియుగడగడవడంకెను.

అని, తాత్పర్యము.

సా త్వశోకస్య విపులాం శాఖా మాలంబ్య పుష్పితామ్
చింతయామాస శోకేన భర్తారం భగ్నమానసా. ౬

టీక॥ సాతు = ఆసీత; అశోకస్య = అశోకవృక్షముయొక్క; విపులాం = విశాలమయిన; పుష్పితాం = పూచియుండు; శాఖాం = కొమ్మను; ఆలంబ్య = పట్టుకొని; శోకేన = దుఃఖముచేత; భగ్నమానసా = విఱిగినమనసుగలదై; భర్తారం = పెనిమిటిని; చింతయామాస = ధ్యానించెను.

ఆసీత, అశింశుపావృక్షముదగ్గఱఁజక్కఁగాఁబూచివిశాలముగానుండు, నశోకశాఖంబట్టుకొని, దుఃఖంబునఁ, బెనిమిటియగు రాముని ధ్యానించెను.

అని, తాత్పర్యము.

సా స్నాపయంతీ విపులౌ స్తనౌ నేత్రజలస్రవైః

చింతయంతీ న శోకస్య తదాంత మధిగచ్ఛతి. ౭

టీక॥తదా=అప్పుడు; సా=ఆసీత; నేత్రజలస్రవైః=కన్నీరుకాలుటలచేత; విపులౌ = పెద్దవైన; స్తనౌ=స్తనములను;స్నాపయంతీ = తడుపుచు ; చింతయంతీ=ధ్యానించుచు; శోకస్య=దుఃఖముయొక్క;అంతం=తుదను;నాధిగచ్ఛతి = (భూతార్థమందులట్)పొందలేదు.

అప్పుడట్లాసీత, కన్నీళ్లఁబెద్ద స్తనంబులుతడియుచుండఁగా, మనంబునరాముని ధ్యానించుచు, నెంతమాత్రమును దుఃఖావధినిబొందఁజాలఁదయ్యె.

అని, తాత్పర్యము.

సా వేపమానా పతితా ప్రవాతే కదళీయథా

రాక్షసీనాం భయత్రస్తా వివర్ణవదనా భవత్. ౮

టీక॥సా=ఆసీత; వేపమానా=వడంకుచు;ప్రవాతే= పెద్దగాలియుండఁగా;కదళీయథా = అరఁటిచెట్టుంబోలె;పతితా=పడినదై ; రాక్షసీనాం= (పంచమ్యర్థమందుషష్ఠి)రాక్షసస్త్రీలవలన; భయత్రస్తా=భయముచేభయపడినదై;వివర్ణవదనా = తెల్లఁబాఱినముఖముగలది; అభవత్=అయినది.

ఆసీత, గడగడవడంకుచు, నరఁటిచెట్టుపెద్దగాలికినేలంబడునట్లు, క్రిందంబడిలేచి, రాక్షసస్త్రీలవలని భయంబునం, దెల్లఁబాఱినముఖంబులో, నుండెను. అని, తాత్పర్యము.

తస్యా స్సా దీర్ఘవిపులా వేపంత్యా సీతయా తదా

దదృశే కంపినీ వేణీ వ్యాళీవ పరిసర్పతీ. ౯

టీక॥తదా=అప్పుడు;వేపంత్యా(వేపంత్యాః)=వడంకుచున్న;తస్యాః=ఆ; సీతయా(సీతాయాః, షష్ఠ్యర్థమందుఁదృతీయ)=సీతయొక్క; దీర్ఘవిపులా=పొడవైనదియు వెడలుపైనదియును;కంపినీ=కదలుచున్నదియునగు;సా=ఆ; వేణీ = వెండ్రుకలజడ;పరిసర్పతీ(పరిసర్పంతీ)=కదలుచున్న; వ్యాళీవ=ఆఁడుసర్పముంబోలె;దదృశే=చూడఁబడెను.

అప్పుడట్లువడంకుచున్నసీత తలవెం

ద్రుకలజడ, పొడవై విశాలమయిక దలుచుండుటంజేసి, చలించు సర్పంబుంబోలెం, బొంపట్టుచుండినది.

అని, తాత్పర్యము.

సా నిశ్శ్వసంతీ దుఃఖార్తా, శోకోపహతచేతనా
ఆర్తా వ్యసృజ దశ్రూణి మైథిలీ విలలాప హ. ౧౦

టీక॥ ఆర్తా = రామవియోగముచేఁబీడింపఁబడిన; సా=ఆ, మైథిలీ=సీత; శోకోపహతచేతనా=దుఃఖముచేఁగొట్టఁబడినబుద్ధిగలదై; దుఃఖార్తా=దుఃఖముచేఁబీడింపఁబడినదై; నిశ్శ్వసంతీ = నిట్టూర్పులువుచ్చుచు; అశ్రూణి=కన్నీళ్లను; వ్యసృజత్ =విడిచెను. విలలాప=ఏడ్చెను. "హ" అనునది పాదపూరణార్థము.

ఆసీత, యిట్లు దుఃఖమునబుద్ధికలతనొందఁగాఁ, గన్నీళ్లవిడుచుచు, రోదనముచేసెను. అని, తాత్పర్యము.

హా రామేతి చ దుఃఖార్తా హా పున ర్లక్ష్మణేతి చ
హా శ్వశ్రు మమ కౌసల్యే హా సుమిత్రేతి భామినీ. ౧౧

టీక॥ భామినీ=సీత; దుఃఖార్తా=దుఃఖముచేఁబీడింపఁబడినదై; హా రామ=అయ్యో రాముఁడా! ఇతిచ = అనియును; పునః=ఇంకను; హాలక్ష్మణ = అయ్యో లక్ష్మణుఁడా! ఇతిచ= అనియును; మమ=నాయొక్క; శ్వశ్రు=అత్తగారివైన; హాకౌసల్యే= అయ్యో కౌసల్యా! హాసుమిత్రే= (సంధియార్షము)=అయ్యో సుమిత్రా! ఇతి= అనియును; విలలాప (అధ్యాహృతము) = ఏడ్చెను.

సీతయిట్లు పరమదుఃఖమునొంది, "హా రాముఁడా! అనియును, "హాలక్ష్మణుఁడా" అనియు, హానాయత్తవగుకౌసల్యా! హాసుమిత్రా!" యనియును, రోదనము చేసినది.

అని, తాత్పర్యము.

లోకప్రవాద స్సత్యోయం పండితై స్సముదాహృతః
అకాలే దుర్లభో మృత్యు స్స్త్రియా వా పురుషస్య వా. ౧౨
యత్రాహ మేవం క్రూరాభి రాక్షసీభి రిహార్దితా

జీవామి హీనా రామేణ ముహూర్త మపి దుఃఖితా. ౧౩

టీక॥ యత్ర(యతః)=ఎందువలన; అహం=నేను; ఏవం=ఇట్లు; ఇహ=ఇచ్చట; క్రూరాభిః=దయలేని; రాక్షసీభిః=రాక్షసస్త్రీలచేత; అర్దితా=పీడింపఁబడినదాననై; రామేణ=రామునిచే; హీనా = విడువఁబడినదాననై; దుఃఖితా=దుఃఖమునొందినదాననై; ముహూర్తమపి= కొంచెము సేపైనను; జీవామి= బ్రతుకుచున్నానో; తతః (అధ్యాహృతము)= అందువలన; "స్త్రియావా = ఆఁడుదానికిఁగాని; పురుషస్యవా=పురుషునకుఁగాని; అకాలే=అసమయమునందు; మృత్యుః=చావు; దుర్లభః=పొందఁగూడనిది." పండితైః=పండితులచేత; సముదాహృతః=చెప్పఁబడిన; అయం=ఈ; లోకప్రవాదః=జనవార్త; సత్యః=అబద్ధము కాదు.

నేనిట్లిచ్చట, నిర్దయలయిన యీ రాక్షసస్త్రీలచే దర్జింపఁబడుచు, రామునింబాసి, దుఃఖముం బొందియును బ్రాణంబులు విడువలేక, ముహూర్తమయినను జీవించియున్నాను; కావున, "స్త్రీకిఁగాని పురుషునకుఁగానియీశ్వరేచ్ఛ లేనప్పుడు మరణంబు రానేరదు" అని, పండితులు చెప్పుమాట, సత్యముగానే యున్నది. అని, తాత్పర్యము.

ఏషా ల్పపుణ్యా కృపణా వినశిష్యా మ్యనాథవత్
సముద్రమధ్యే నౌః పూర్ణా వాయువేగై రివాహతా. ౧౪

టీక। అల్పపుణ్యా=కొంచెమయినపుణ్యముగలదానను; కృపణా=పాపిష్ఠురాలనగు; ఏషా=ఈ; అహం (అధ్యాహృతము)=నేను; సముద్రమధ్యే=సముద్రమునడుమను; పూర్ణా=నిండినదియును; వాయువేగైః= గాలితాఁకుడులచేత; ఆహతా=కొట్టఁబడినదియునగు; నౌరివ=ఓడయుంబోలె; అనాథవత్=నాథుండులేనివానియట్లు; వినశిష్యామి=నశింపఁగలను.

పదార్థంబులచే నింపఁబడియుండు నోడ, సముద్రంబునడుమ వాయువేగంబున, నశించునట్లు, స్వల్పపుణ్యంబుగలదానను, పాపిష్ఠురాలనగు నేను, అనాథయుంబోలె, నాశంబునొందఁగలను.

అని, తాత్పర్యము.

భర్తారం త మపశ్యంతీ రాక్షసీ వశ మాగతా
సీదామి ఖలు శోకేన కూలం తోయహతం యథా. ౧౫

టీక॥ భర్తారం = పెనిమిటియగు; తం = ఆ రాముని; అపశ్యంతీ = చూడకున్నదానను; రాక్షసీవశం = రాక్షసస్త్రీలయధీనతను; ఆగతా = పొందిన దాసనగు; అహం(అధ్యాహృతము) = నేను; శోకేన = దుఃఖముచేత; తోయహతం = నీటిచేఁగొట్టఁబడిన; కూలంయథా = గట్టువలె; సీదామిఖలు = నశించుచున్నానుగదా!

నేనునా పెనిమిటియగునా రామచంద్రునింబూడఁజాల, యిట్లు రాక్షసస్త్రీలచేతులోఁజిక్కి, జలప్రవాహంబుతాఁకుడుచేనశించు నేటిగట్టుంబోలె, నాశంబునొందఁగలను.

అని, తాత్పర్యము.

తం పద్మదళపత్రాక్షం సింహవిక్రాంత గామినమ్
ధన్యాః పశ్యంతి మే నాథం కృతజ్ఞం ప్రియవాదినమ్. ౧౬

టీక॥ పద్మదళపత్రాక్షం = వికసించిన తామరపుష్పముతేకులవంటి కండ్లుగలవాఁడును; సింహవిక్రాంతగామినం = సింహంబునడకయుంబోలెనడుచువాఁడును; కృతజ్ఞం = తనకుఁజేయఁబడిన యుపకారము కొంచమయినను దానినెచ్చుగా నెఱుంగువాఁడును; ప్రియవాదినం = సంతోషముగలుగునట్లు మాటలాడువాఁడునగు; తం = అట్టియనంతసద్గుణములుగల; మే = నాయొక్క; నాథం = పెనిమిటిని; ధన్యాః = పుణ్యవంతులు; పశ్యంతి = చూచుచున్నారు.

వికసించిన తామరపూతేకులంబోలుకండ్లుగలవాఁడును సింహంబుంబోలె నడుచువాఁడునుఇతరులుదనకుఁగొంచెముపకారముచేసినను దానినెచ్చుగాభావించుచుండువాఁడునుఅందఱకునుసంతోషముగలునగునట్లు మాటలాడుచుండువాఁడును, అట్లు సర్వాంగ సుందరుండును సమస్తసద్గుణ సంపన్నుండునగు నాపెనిమిటినిరాముని, ఇప్పుడు, పుణ్యవంతులయినవారలు, చూచుచుందురు; నేనుబాపిష్ఠురాలనుగాన, నాకట్టిరామునింబూడఁగలుగదయ్యె.

అని, తాత్పర్యము.

సర్వధా తేన హీనాయా రామేణ విదితాత్మనా
తీక్ష్ణం విష మివాస్వాద్య దుర్లభం మమ జీవితమ్. ౧౭

టీక॥ విదితాత్మనా=తెలిసికొనఁబడినపరమాత్మగల; తేన=ఆ; రామేణ=రామునిచేత; హీనాయాః=విడువఁబడిన; మమ=నాకు; తీక్ష్ణం=తీవ్రమయిన; విషం=విషమును; ఆస్వాద్య=భక్షించి; స్థితాయాః (అధ్యాహృతము) ఇవ=ఉన్నదానికింబోలె; సర్వధా=అన్నివిధములను; జీవితం=బ్రతుకుట; దుర్లభం=పొందఁగూడనిది.

అట్టిపరమాత్మ వేత్తయగు రాముని౦బాసి, నేను, తీవ్రంబగు విషంబు గ్రోలినదియుంబోలె, నెంతమాత్రము జీవింపంజాలను. అని, తాత్పర్యము.

కీదృశంతు మయా పాపం పురా జన్మాంతరే కృతమ్
యేనే దం ప్రాప్యతే దుఃఖం మయా ఘోరం సుదారుణమ్. ౧౮

టీక॥ మయా=నాచేత; పురా=మును; జన్మాంతరే=ఇతరజన్మము నందు; కీదృశం=ఎట్టి; పాపంతు=పాపము; కృతం=చేయఁబడినదీ? యేన=ఏపాపముచేత; మయా=నాచేత; ఘోరం=భయంకరమును; సుదారుణం=మిక్కిలియుభయంకరమునగు, అత్యంతభయంకరమయినయనుట; ఇదం=ఈ; దుఃఖం=దుఃఖము; ప్రాప్యతే=పొందఁబడుచున్నదో.

నేనిప్పుడిట్లు, అత్యంతభయంకరంబగుదుఃఖముననుభవించుచున్నానే; ఇట్టి దుఃఖమునకుఁ గారణ మయిన పాపము నేనేమిచేసితినీ? అని, తాత్పర్యము.

జీవితం త్యక్తు మిచ్ఛామి శోకేన మహతావృతా

టీక॥ మహతా=అధికమయిన; శోకేన=దుఃఖముచేత; వృతా=కప్పఁబడినదాననగు; అహం (అధ్యాహృతము)=నేను; జీవితం=ప్రాణంబును; త్యక్తుం=విడుచుటను; ఇచ్ఛామి=కోరుచున్నాను.

ఇట్టిమహాదుఃఖంబు ననుభవించుచు నేను బ్రతికియుండంజాలను; ప్రాణంబులు విడువఁగోరెదను. అని, తాత్పర్యము.

రాక్షసీభిశ్చ రక్ష్యంత్యా రామో నాసాద్యతే మయా. ౧౯

టీక॥ రాక్షసీభిశ్చ=రాక్షసస్త్రీలచే తను; రక్ష్యంత్యాః (రక్ష్యమాణాయాః)=రక్షింపఁబడుచున్న; మయా=నాచేత; రామః=రాముండు; నాసాద్యతే=పొందఁబడఁడు.

నాకిట్టి రాక్షసస్త్రీలు కావలియున్నారు, కావున, నేనింకనెప్పటికిని, రామునిం జేరఁజాలను.

అని, తాత్పర్యము.

ధిగస్తు ఖలు మానుష్యం ధిగస్తు పరవశ్యతామ్
న శక్యం యత్పరిత్యక్తు మాత్మచ్ఛందేన జీవితమ్. ౨౦

టీక॥ యత్=ఏకారణమువలన; ఆత్మచ్ఛందేన=నాయిచ్ఛచేత; జీవితం=ప్రాణంబు; పరిత్యక్తుం=విడుచుటకు; న శక్యం=అలవిగాదో; తత్ (అధ్యాహృతము)=అందువలన; మానుష్యం=మనుష్యత్వమునుగూర్చి; ధిగ్=దహింపఁబడుట; అస్తుఖలు=అగుఁగాక. పరవశ్యతాం=ఇతరులయధీనతనుగూర్చి; ధిక్=దహింపఁబడుట; అస్తు=అగుఁగాక.

మనుష్యులకుఁ, గోరినప్పుడుమరణంబుగలుగనేరదు, కావున, నాయిష్టముచొప్పున, నాకిప్పుడుమృత్యువురాదు; మఱియు, నగ్నిపతనాదులచేఁ బ్రాణంబులువిడువవచ్చుననచోఁ, బతియధీనురాలను, గావున, బతియాజ్ఞలేక, ప్రాణంబులువిడుచుటకు, నాకధికారములేదు; కాఁబట్టి, మనుష్యత్వమును, ఇతరుల యధీనతలోనుండుటయు దహింపఁబడిపోవుఁగాక. అని, చెప్పుచు, సీత, యేడ్చినది. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, పంచవింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండ పంచవింశసర్గ టీక,
ముగిసినది.

(౨౬)

షడ్వింశ సర్గ ప్రారంభః.

ప్రసక్తాశ్రుముఖీ త్వేవం బ్రువంతీ జనకాత్మజా
అధోముఖముఖీ బాలా విలప్తు ముపచక్రమే- ౧

టీక॥ బాలా=చిన్నదైన; జనకాత్మజా=జనకునికొమార్తెయగుసీత ; అధోముఖముఖీ= క్రింది మొగమయినముఖముగలదై; ప్రసక్తాశ్రుముఖీ = అధికముగాఁబుట్టినకన్నీరుముఖమునందుఁగలదై; ఇతి=అని; ఏవం=ఈప్రకారము; బ్రువంతీ=చెప్పుచు; విలప్తుం=ఏడ్చుటకు; ఉపచక్రమే=ప్రారంభించెను.

జనకుని కొమార్తెయగుసీత, తల వంచి, కన్నీళ్లు గాఱఁగా, సీప్రకారముచెప్పుచు, రోదనంబు సేయనారంభించెను.

అని, తాత్పర్యము.

ఉన్మత్తేవ ప్రమత్తేవ భ్రాంతచిత్తేవ శోచతీ
ఉపావృత్తా కిశోరీవ వివేష్టంతీ మహీతలే. ౨

టీక॥ సా(అధ్యాహృతము)= ఆసీత; ఉన్మత్తేవ=పిచ్చిపట్టినదియుంబోలె; ప్రమత్తేవ= మిక్కిలియుఁగైపునొందినదియుంబోలె; భ్రాంతచిత్తేవ=భ్రాంతిఁబొందినమనసుగలదియుంబోలె; ఉపావృత్తా=అలసటదీర్చుకొనుటకై పొరలింపఁబడిన; కిశోరీవ=ఆఁడుగుఱ్ఱముంబోలె; మహీతలే=నేలయందు; వివేష్టంతీ=పొరలుచు ; శోచతీ = ఏడ్చుచు ; ఆసీత్(అధ్యాహృతము)=ఉండెను.

ఆసీత, పిచ్చిపట్టినదానియట్లు, కైపునొందినదియుంబోలె, భ్రాంతినొందినదవలె, నలసటదీఱుటకై పొరలింపఁబడు నాఁడుగుఱ్ఱముచందంబున, నేలంబొరలుచు, నేడ్చుచుండెను.

అని, తాత్పర్యము.

రాఘవస్య ప్రమత్తస్య రక్షసా కామరూపిణా
రావణేన ప్రమథ్యాహ మానీతా క్రోశతీ బలాత్. ౩

టీక॥ రాఘవస్య=రాముఁడు; ప్రమత్తస్య=ఏమఱియుండఁగా; ఆక్రోశతీ=

అఱచుచున్న; అహం = నేను; కామరూపిణా = ఇచ్ఛాధీనంబగురూపముగల; రక్షసా = రాక్షసుండగు; రావణేన = రావణునిచేత; బలాత్ = బలమువలన; ప్రమథ్య = బలాత్కరించి; ఆనీతా = తేఁబడినాను.

రాముండు ప్రమాదంబున నెచ్చటికోపోయియుండఁగాఁ, గామరూపియగునీ రావణుండు, దుఃఖంబుననఱచుచున్ననన్ను, బలాత్కారంబునం, గొనితెచ్చినాఁడు. అని, తాత్పర్యము.

రాక్షసీవశమాపన్నా భర్త్స్యమానా సుదారుణమ్
చింతయంతీ సుదుఃఖార్తా నాహం జీవితు ముత్సహే. ౮

టీక॥ అహం = నేను; రాక్షసీవశం = రాక్షసస్త్రీలయధీనతను; ఆపన్నా = పొందినదాననై; సుదారుణం = మిక్కిలియుభయంకరముగా; భర్త్స్యమానా = బెదరింపఁబడుచు; చింతయంతీ = రాముని ధ్యానించుచు; సుదుఃఖార్తా = మిక్కిలియు దుఃఖముచేఁబీడింపఁబడినదాననై; జీవితుం = బ్రతుకుటకు; నోత్సహే = కోరను.

నేనీ రాక్షసస్త్రీలకుఁజిక్కి, వీరలచే భయంకరంబులయిన బెదరింపు మాటలనువినుచు, రామునింజూడనేరక ధ్యానించుచుఁ, బరమదుఃఖంబున, నిట్లు, బ్రతికియుండఁజాలను.

అని, తాత్పర్యము.

నహి మే జీవితే నార్థో నైవార్థైర్న చ భూషణైః
వసంత్యా రాక్షసీ మధ్యే వినారామం మహారథమ్. ౯

టీక॥ మహారథం = తన్నునుసారథినిగుఱ్ఱములనుగాపాడుకొనుచుఁబదునొకండు వేలమందివిలుకాండ్రతోఁబోరంగల; రామంవినా = రామునివిడిచి; రాక్షసీమధ్యే = రాక్షసస్త్రీలనడుమ; వసంత్యాః = ఉన్నట్టి; మే = నాకు; జీవితేన = ప్రాణముచేత; అర్థః = ప్రయోజనము; నహి = లేదుగదా! అర్థైః = ధనములచేత; నైవ = ప్రయోజనములేనేలేదు. భూషణైశ్చ = సొమ్ములచేతను; న = ప్రయోజనంబులేదు.

తన్నునుసారథినిగుఱ్ఱమును గాపా

దుకొనుచుఁ బదునాలుగువేలమంది విలుకాండ్రతోఁ బోరంజాలిననా పెనిమిటి రామునిం బాసి, భయంకరాకారలయిన యీ రాక్షసస్త్రీల నడుమం జిక్కి యున్నానాకు, ఇంక, బ్రతుకుచేనేమి ప్రయోజనము? ధనముతోఁగాని సౌఖ్యములతోఁగాని నాకింకేమి కార్యము?

అని, తాత్పర్యము.

అశ్మసార మిదం నూన మథవా ప్యజరామరమ్
హృదయం మమ యేనేదం న దుఃఖే నావశీర్యతే. ౬

టీక॥ యేన=ఏకారణముచేత; మమ=నాయొక్క; ఇదం=ఈ; హృదయం=మనసు; దుఃఖేన=దుఃఖముచేత; నావశీర్యతే=నశింపకున్నదో; తేన(అధ్యాహృతము)=ఆకారణముచేత; ఇదం=ఈమనసు; అశ్మసారం=ఱాతిబలము వంటిబలముగలది. నూనం=నిశ్చయము. అథవాపి=అటుగాకేని; అజరామరం=ముసలితనములేనిదియుఁ జావులేనిదియు.

నేనింత దుఃఖమునొంది యున్నను, నామనసు నశింపకున్నది, కావున, నిది, ఱాయివంటిది; నిశ్చయము; అటుకాదేని, ముసలితనముగాని మరణముగాని లేక నిత్యముగానుండునది కాఁబోలు.

అని, తాత్పర్యము.

ధిఙ్మా మనార్యా మసతీం యాహం తేన వినాకృతా
ముహూర్తమపి రక్షామి జీవితం పాపజీవితా. ౭

టీక॥ యా=ఏ; అహం=నేను; తేన=ఆరామునిచేత; వినాకృతా=విడువఁబడినదాననై; పాపజీవితా=పాపముగలిగించు బ్రతుకుగలదాననై; ముహూర్తమపి=అల్పకాలమయినను; జీవితం=ప్రాణమును; రక్షామి=కాపాడుచున్నానో; తాం (అధ్యాహృతము)=అట్టి; అనార్యాం=దుష్టురాలను; అసతీం=పతివ్రతగాని దాననగు; మాం=నన్నుఁగూర్చి; ధిక్=దహింపఁబడుటయగుఁగాక.

అట్టి రామునిం బాసి, పాపస్వభావంబు నవలంబించి, కొంచెము సేపైనను, బ్రాణమును గాపాడుచున్నానే; అట్టి నేను మిక్కిలియు దుష్టురాలను, నేను దహింపఁబడుదును గాక. అని, తాత్పర్యము.

కా చ మే జీవితే శ్రద్ధా సుఖేవా తం ప్రియం వినా
భర్తారం సాగరాంతాయా వసుధాయాః ప్రియంవదమ్. ౮

టీక॥ సాగరాంతాయాః=సముద్రములుకొనలందుఁగల ; వసుధాయాః=భూమికి; భర్తారం = ప్రభువును; ప్రియంవదం=సంతోషముగల్గునట్లు చెప్పువాఁడునగు; తం=అట్టి; ప్రియంవినా=పెనిమిటినివిడిచి; మే=నాకు; జీవితే=ప్రాణమునందుఁగాని; సుఖేవా=సుఖమునందుఁగాని; కా=ఏ; శ్రద్ధాచ=ఆసక్తియు?

నాలుగుసముద్రముల వఱకున్నభూమికంతయుఁబ్రభుండును బ్రియంవదుండునగునట్టి ప్రియుండు రాముండు లేకుండఁగా, నాకుఁబ్రాణమునందుఁగానిసుఖమునందుఁగానియాసక్తియెందుకు? అని, తాత్పర్యము.

భిద్యతాం భక్ష్యతాం వాపి శరీరం విసృజామ్యహమ్
నచాప్యహం చిరం దుఃఖం సహేయం ప్రియవర్జితా. ౯

టీక॥ అహం=నేను; శరీరం=దేహమును; విసృజామి = విడిచెదను. భిద్యతాం=పగులఁగొట్టఁబడుఁగాక. భక్ష్యతాంవాపి = భక్షింపఁబడునుగాక. అహం=నేను; ప్రియవర్జితా=పెనిమిటిచేతవిడువఁబడినదాననై; చిరం=బహుకాలము; దుఃఖంచాపి=దుఃఖమును; నసహేయం=ఓర్వలేను.

రాక్షసస్త్రీలారా! నేను దేహమును విడిచెదను; పగులఁగొట్టుకొనుఁడు; భక్షించినను భక్షింపుఁడు; నేను, బ్రియుని రామునిఁబాసి, బహుకాలంబీదుఃఖము నోర్వంజాలను. అని, తాత్పర్యము.

చరణేనాపి సవ్యేన న స్పృశేయం నిశాచరమ్
రావణం కిం పున రహం కామయేయం విగర్హితమ్. ౧౦

టీక॥ అహం=నేను; సవ్యేన=ఎడమదైన; చరణేనాపి = పాదముచేతనైనను; నిశాచరం = రాక్షసుండగు; రావణం=రావణుని; నస్పృశేయం= తాఁకను. పునః=ఇంక; విగర్హితం = నిందింపఁబడునట్లుగా ; కామయేయంకిం—

మోహాంతునావేమి?

నేను రాక్షసుండగు రావణుని, నేడ మకాలితోనైనను దాఁకను; మఱియు తని యందు మోహంబుంచుదునా? ఎన్నటికి నుంచను. అని, తాత్పర్యము.

ప్రత్యాఖ్యాతం న జానాతి నాత్మానం నాత్మనః కులమ్
యో నృశంసస్వభావేన మాం ప్రార్థయితు మిచ్ఛతి. ౧౧

టీక॥ యః=ఎవ్వఁడు; నృశంసస్వభావేన=క్రూరస్వభావముచేత; మాం=నన్ను; ప్రార్థయితుం=ప్రార్థించుటకు; ఇచ్ఛతి=కోరుచున్నాఁడో; సః=(అధ్యాహృతము) ఆరావణుఁడు; ఆత్మానం=తన్ను; ప్రత్యాఖ్యాతం= తిరస్కృతుఁడైనవానిఁగా; నజానాతి= ఎఱుంగఁడు. ఆత్మనః=తనయొక్క; కులం=వంశమును; ప్రత్యాఖ్యాతం (అధ్యాహృతము)= తిరస్కరింపఁబడినదానిఁగా; న(జానాతి)=ఎఱుంగఁడు.

ఈరావణుండు క్రౌర్యంబు నవలంబించి నన్నుఁగోరుచున్నాఁడే, ఇతనికి దీనివలనఁ, దాను జెడుటయుఁ, దనకులంబునశించిపోవుటయుఁ, దెలియకున్నది. అని, తాత్పర్యము.

ఛిన్నా భిన్నా విభక్తా వా దీప్తే వాగ్నౌ ప్రదీపితా
రావణం నోపతిష్ఠేయం కిం ప్రలాపేన వశ్చిరమ్. ౧౨

టీక॥ అహం (అధ్యాహృతము)= నేను; ఛిన్నా= నఱుకఁబడినఁగాని; భిన్నా = పగులఁగొట్టఁబడినఁగాని; విభక్తా వా = పంచుకొనఁబడినఁగాని; దీప్తే = మండిన; అగ్నౌ = నిప్పునందు; ప్రదీపితా వా=కాల్పఁబడినఁగాని; రావణం=రావణుని; నోపతిష్ఠేయం=పొగడను. వః=మీయొక్క; చిరం=బహుకాలము; ప్రలాపేన= అఱచుటచేత ; కిం=ఏమిప్రయోజనము.

మీరలు, నన్ను ఛేదింపుఁడు, పగులఁగొట్టుఁడు, పంచుకొనుఁడు నిప్పులోఁ గాల్చివేయుఁడు; ఏమిచేసినను జేయుఁడు; నేనెంతమాత్రమును, రావణుని గౌరవింపను; మీరలెంతయఱచినను బ్రయోజనములేదు. అని, తాత్పర్యము.

ఖ్యాతః ప్రాజ్ఞః కృతజ్ఞశ్చ సానుక్రోశశ్చ రాఘవః

సద్వృత్తో నిరనుక్రోశ శ్శంకే మద్భాగ్యసంక్షయాత్. ౧౩

టీక॥ ఖ్యాతః=ప్రసిద్ధుండును; ప్రాజ్ఞః=పండితుండును; కృతజ్ఞశ్చ = ఇతరులు తనకుఁ గొంచెముపకారము చేసిననుదానిని నెచ్చుగా నెఱుంగువాఁడును; సానుక్రోశశ్చ; దయతోఁగూడినవాఁడును; సద్వృత్తః= మంచియాచారముగలవాఁడునగు; రాఘవః=రాముఁడు; మద్భాగ్యసంక్షయాత్= నాభాగ్యము నశించుటవలన, నిరనుక్రోశః= దయలేనివాఁడు. ఇతి(అధ్యాహృతము)=అని ; శంకే=సందేహించెదను.

శత్రువులచేతను గూడ సద్గుణుండని పొగడంబడినవాఁడును బండితుండును దనకితరులు గొంచెముపకారము చేసినను దానినధికముగా భావించువాఁడును దయాశాలియయిన వాఁడును సదాచారుండునగు రాముండు, నాదౌర్భాగ్యంబున, నిప్పుడు, నిర్దయుండై యతిక్రూరుండుగానున్నాఁడు; అని, సందేహించుచున్నాను.

అని, తాత్పర్యము.

రాక్షసానాం సహస్రాణి జనస్థానే చతుర్దశ
యేనైకేన నిరస్తాని స మాం కిన్నాభిపద్యతే. ౧౪

టీక॥ ఏకేన=ఒకఁడైన; యేన=ఎవ్వనిచేత; జనస్థానే=జనస్థానమను ప్రదేశమునందు; రాక్షసానాం= రాక్షసులయొక్క; సహస్రాణి=వేలు; చతుర్దశ=పదునాలుగును; నిరస్తాని= చంపఁబడినవో; సః = అట్టి రాముండు; మాం=నన్ను; కిం=ఎందుకు ; నాభిపద్యతే=రక్షింపకున్నాఁడు?

ఎవ్వండొక్కఁడే, జనస్థానంబునఁ బదునాలుగు వేల రాక్షసులం జంపెనో, అట్టి రాముండు, నాయొద్దకు వచ్చి నన్నేల రక్షింపఁడు?

అని, తాత్పర్యము.

నిరుద్ధా రావణేనాహ మల్పవీర్యేణ రక్షసా

టీక॥ అహం= నేను ; అల్పవీర్యేణ=కొంచెమయినపరాక్రమముగల; రక్షసా=రాక్షసుండగు ; రావణేన= రావణునిచేత; నిరుద్ధా= అడ్డగింపఁ

బడినాను.

స్వల్పంబగు పరాక్రమంబుగల రావణుండు నన్ను నిరోధించుచున్నాఁడు. అని, తాత్పర్యము.

సమర్థః ఖలు మే భర్తా రావణం హంతు మాహవే. ౧౫

టీక॥ మే=నాయొక్క; భర్తా=పెనిమిటియగు రాముండు; ఆహవే=యుద్ధమునందు; రావణం=రావణుని; హంతుం=చంపుటకు; సమర్థః ఖలు=చాలినవాఁడుగదా!

నాపెనిమిటియగు రాముండు, యుద్ధంబున రావణుంజంపుటకు, సమర్థుండుగదా! అని, తాత్పర్యము.

విరాధో దండకారణ్యే యేన రాక్షసపుంగవః
రణే రామేణ నిహత స్స మాం కిన్నాభిపద్యతే. ౧౬

టీక॥ యేన=ఏ; రామేణ=రామునిచేత; దండకారణ్యే=దండకారణ్యమునందు; రాక్షసపుంగవః=రాక్షసశ్రేష్ఠుండగు; విరాధః=విరాధుండు; రణే=యుద్ధమునందు; నిహతః=చంపఁబడినాఁడో; సః=అట్టిరాముండు; మాం=నన్ను; కిం=ఎందుకు; నాభిపద్యతే=రక్షింపకున్నాఁడు;

ఎవ్వాఁడు, దండకారణ్యంబున రాక్షసశ్రేష్ఠుండగు విరాధుని వధించినాఁడో; అట్టిరాముండు, నన్నేల రక్షింపఁడు? అని, తాత్పర్యము.

కామం మధ్యే సముద్రస్య లంకేయం దుష్ప్రధర్షణా
నతు రాఘవ బాణానాం గతిరోధీహ విద్యతే. ౧౭

టీక॥ సముద్రస్య=సముద్రముయొక్క; మధ్యే=నడుమ; స్థితా=(అధ్యాహృతము)ఉన్న; ఇయం=ఈ; లంకా=లంక; దుష్ప్రధర్షణా కామం=ఎదిరింపఁగూడనిదే; ఇహ=ఈలోకమునందు; రాఘవబాణానాం=రామునిబాణములయొక్క; గతిరోధీతు=గమనమునడ్డగించునదిమాత్రము; నవిద్యతే=లేదు.

ఈలంక సముద్రంబునడుమ నున్నది, కావున, నెదిరింపఁగూడనిది వాస్తవమె; అయితే, రామబాణంబుల కెందునడ్డమేదియులేదు. అని, తాత్పర్యము.

కిన్ను తత్కారణం యేన రామో దృఢపరాక్రమః
రక్షసాపహృతాం భార్యా మిష్టాం నాభ్యవపద్యతే. ౧౮

టీక॥ యేన=ఏకారణముచేత ; దృఢపరాక్రమః=పొలివోవనిపరాక్రమంబు గల; రామః=రాముఁడు; రక్షసా=రాక్షసుండగు రావణుని చేత; అపహృతాం=అపహరింపఁబడిన; ఇష్టాం=ప్రియయయిన; భార్యాం=భార్యను; నాభ్యవపద్యతే=రక్షింపఁకున్నాఁడో; తత్=ఆ; కారణం=కారణము; కిన్ను=ఏది?

తనకుఁ బ్రియభార్యనగు నన్ను రావణుండపహరించియుండఁగాఁ, దాను మహాపరాక్రమశాలియయ్యు, రాముండు, నన్నురక్షింపకున్నాఁడే; దీని కేమికారణము? అని, తాత్పర్యము.

ఇహస్థాం మాం నజానీతే శంకే లక్ష్మణపూర్వజః
జానన్నపిహి తేజస్వీ ధర్షణం మర్షయిష్యతి. ౧౯

టీక॥ లక్ష్మణపూర్వజః=లక్ష్మణుని కన్నయయినరాముండు; మాం=నన్ను; ఇహస్థాం=ఇచ్చటనున్నదానిఁగాఁ; న జానీతే=ఎఱుంగఁడు. ఇతి (అధ్యాహృతము)=అని; శంకే=సందేహించుచున్నాను. తేజస్వీ=అధికమయిన తేజస్సుగల రాముండు; జానన్నపిహి=ఎఱింగినవాఁడయ్యు; ధర్షణం=తిరస్కారమును; మర్షయిష్యతి(కిం)=ఓర్చునా?

లక్ష్మణునకన్నయగు రాముండు, నేనిచ్చటనున్నానని యిదివఱకెఱుంగకున్నాఁడనితోఁచుచున్నది; రాముండు, ఎఱింగియుండునేని, మహాపరాక్రమశాలిగావున, నీతిరస్కారము నెంతమాత్రము నోర్వఁడు; తక్షణమె రావణుంజంపును. అని, తాత్పర్యము.

హృతేతి యోధిగత్వా మాం రాఘవాయ నివేదయత్
గృధ్రరాజోపి సరణే రావణేన నిపాతితః. ౨౦

టీక॥ యః=ఎవ్వఁడు; "హృతా=అపహరింపఁబడినది;" ఇతి=అని; అధిగత్వా(అధిగమ్య)=తెలిసికొని; మాం=నన్ను; రాఘవాయ=రామునికొఱకు;

నివేదయేత్ = తెల్పునో; సః = అట్టి; గృధ్రరాజోపి = గద్దలకు ప్రభుండైనజటాయువును; రణే = యుద్ధమునందు; రావణేన = రావణునిచేత; నిపాతితః = పడఁద్రోయఁబడెను, చంపఁబడెననుట.

నన్ను రావణుండపహరించుటంజూచినవాఁడు కాన, నసిసంగతిని రామునకెవ్వండు తెల్పంగలఁడో, అట్టిజటాయువునంగూడ, రావణుండు, యుద్ధంబునం జంపినాఁడు. అని, తాత్పర్యము.

కృతం కర్మ మహత్తేన మాం తథా భ్యవపద్యతా
తిష్ఠతా రావణద్వంద్వే వృద్ధేనాపి జటాయుషా. ౨౧

టీక॥ వృద్ధేనాపి = ముసలివాఁడును; రావణద్వంద్వే = రావణునితోటియుద్ధంబునందు; తిష్ఠతా = నిలుచున్నవాఁడును; తథా = అట్లు; మాం = నన్ను; అభ్యవపద్యతా = రక్షించుచున్నవాఁడునగు; తేన = ఆ; జటాయుషా = జటాయువుచేత; మహత్ = గొప్పదయిన; కర్మ = కార్యము; కృతం = చేయఁబడినది.

ఆజటాయువు వృద్ధుండైనను రావణునితో నిలిచియుద్ధముచేసి, తనచేనైనంతవఱకునన్నురక్షించి, మహాకార్యమునుజేసినాఁడు. అని, తాత్పర్యము.

యది మా మిహ జానీయా ద్వర్తమానాం స రాఘవః
అద్య బాణై రభిక్రుద్ధః కుర్యా ల్లోక మరాక్షసమ్. ౨౨

టీక॥ సః = ఆ; రాఘవః = రాముఁడు; మాం = నన్ను; ఇహ = ఇచ్చట; వర్తమానాం = ఉన్నదానిఁగా; జానీయాద్యది = ఎఱుంగునేని; అద్య = ఇప్పుడు; అభిక్రుద్ధః = కోపించినవాఁడై; బాణైః = బాణములచేత; లోకం = ప్రపంచమును; అరాక్షసం = రాక్షసులులేనిదానిఁగా; కుర్యాత్ = చేయును.

అట్టిరాముండు, నేనిచ్చట నున్నానని తెలిసికొనునేని, యిప్పుడె కోపంబున, బాణంబులు ప్రయోగించి, లోకంబులోనొక రాక్షసుండైనను లేనట్లుసమస్తరాక్షసులనుం, జంపును.

అని, తాత్పర్యము.

విధమేచ్చ పురీం లంకాం శోషయేచ్చ మహోదధిమ్

రావణస్యచ నీచస్య కీర్తిం నామచ నాశయేత్. ౨౩

టీక॥ సః(అధ్యాహృతము)=ఆరాముఁడు; లంకాం=లంకయను; పురీం = పట్టణమును ; విధమేచ్ఛ=ఊఁదివేయును. మహోదధిం=సముద్రమును; శోషయేచ్ఛ=ఎండఁజేయును . నీచస్య=నీచుండగు; రావణస్య = రావణునియొక్క; కీర్తిం=కీర్తిని; నామచ=పేరును; నాశయేచ్ఛ = నశింపఁ జేయును.

నేనిచ్చటనుండుట రాముఁడు తెలియునేని, అతండంత, మహాకోపంబున, సముద్రమునుశోషింపఁజేయును; ఈలంకాపట్టణమునూఁదివేయును; మఱియు నీచుండగు రావణునిపేరును గీర్తియు నునశించునట్లు సేయును.

అని, తాత్పర్యము.

తతో నిహత నాథానాం రాక్షసీనాం గృహేగృహే
యథాహ మేవం రుదతీ తథా భూయో న సంశయః. ౨౪

టీక॥ తతః=అటుపిమ్మట; అహం=నేను; యథా=ఎట్లు ; ఏవం=ఈప్రకారముగా ; రుదతీ=ఏడ్చుచు ; అస్మి(అధ్యాహృతము) = ఉన్నానో; తథా= అట్లు; నిహతనాథానాం=చంపఁబడిన పెనిమిటులుగల; రాక్షసీనాం= రాక్షసస్త్రీలయొక్క; గృహేగృహే= ఇంటింటియందును; భూయః = ఇంకనధికముగా; రుదంత్యః(అధ్యాహృతము)= ఏడ్చుచున్నవారలు ; భవిష్యంతి (అధ్యాహృతము) = కాఁగలరు. సంశయః=సందేహము; న=లేదు.

అంత, నేనిచ్చటనెట్లేడ్చుచున్నానో, అట్లు ఇంటింటను , దమపెనిమిటులురామునిచేఁ జంపఁబడుటం జేసి, రాక్షసస్త్రీలందఱును, ఇంతకన్న నెచ్చుగా, నేడ్చుచుండఁగలరు; ఇందును సంశయములేదు. అని, తాత్పర్యము.

అన్విష్య రక్షసాం లంకాం కుర్యా ద్రామ స్సలక్ష్మణః

టీక॥ సలక్ష్మణః= లక్ష్మణునితోఁగూడిన; రామః = రాముఁడు ; రక్షసాం=రాక్షసులయొక్క ; లంకాం= లంకాపట్టణమును; అన్విష్య= వెదకి;

శత్రునాశనం= శత్రువుల నశింపఁ జేయుటను; కుర్యాత్ — చేయును.

రాముండును లక్ష్మణుండును, ఈ లంకయంతయు వెదకి, రాక్షసులనం దఱంజంపుదురు.

అని, తాత్పర్యము.

న హి తాభ్యాం రిపు ర్దృష్టో ముహూర్తమపి జీవతి. ౨౫

టీక॥ తాభ్యాం= ఆరామలక్ష్మణులచేత; దృష్టః=చూడఁబడిన; రిపుః= శత్రువు; ముహూర్తమపి = కొంచెముసేపైనను; నజీవతిహి = బ్రతుకఁదుగదా!

ఆరామలక్ష్మణుల దృష్టిపథంబునం బడునేని, శత్రుండెంతమాత్రమునుబ్రతుకంజాలఁడు. అని, తాత్పర్యము.

చితాధూమాకులపథా గృధ్రమండలసంకులా
అచిరేణతు లంకే యం శ్మశానసదృశీ భవేత్. ౨౬

టీక॥ఇయం=ఈ;లంకా=లంక; అచిరేణతు = శీఘ్రముగానే;చితాధూమాకులపథా= చితియందలిపొగలచే వ్యాకులములయినమార్గములుగలదై; గృధ్రమండలసంకులా = గద్దలసమూహములచేనిండినదై; శ్మశానసదృశీ— శ్మశానముతో సమానమయినదిగా; భవేత్ —అగును.

ఇంక, శీఘ్రముగానే, యీలంక, మార్గములన్నియుఁబీనుంగుపొగలంగప్పఁబడఁగా,గ్రద్దలతోనిండి,శ్మశానంబువంటిదికాఁగలదు. అని, తాత్పర్యము.

అచిరేణైవ కాలేన ప్రాప్స్యామ్యేవ మనోరథమ్

టీక॥అహం(అధ్యాహృతము)= నేను;అచిరేణ = శీఘ్రమయిన;కాలేనైవ=కాలముచేతనే;మనోరథం=కోరికని;ప్రాప్స్యామ్యేవ=పొందనేపొందఁగలను.

నేనింక,శీఘ్రకాలములోనే, నాకోరికచొప్పున,లంకయంతయుశ్మశానంబువంటిదైయుండఁగాఁ, జూడఁగలను.

అని, తాత్పర్యము.

దుష్ప్రస్థానోయ మాఖ్యాతి సర్వేషాం వో విపర్యయమ్. ౨౭

టీక॥ వః=మీయొక్క; అయం=ఈ; దుష్ప్రస్థానః=దుర్మార్గప్రవృత్తి; సర్వేషాం=సమస్తరాక్షసులయొక్క; విపర్యయం=కీడును; ఆఖ్యాతి = చెప్పుచున్నది.

ఇప్పుడు మీరిట్లు దుర్మార్గంబునఁ బ్రవర్తించుటవలననె, రాక్షసులకందఱకును గీడువాటిల్లునని, తెలియవచ్చుచున్నది. అని, తాత్పర్యము.

యాదృశాని హ దృశ్యంతే లంకాయా మశుభాని వై

టీక॥ ఇహ=ఈ; లంకాయాం=లంకయందు; యాదృశాని("తాదృశాని" అనుదానియర్థమునందుఁ బ్రయోగింపఁబడినది)=అట్టి; అశుభాని=అమంగళనిమిత్తములు; ("వై" అనునది పాదపూరణార్థము); దృశ్యంతే=చూడఁబడుచున్నవి.

అట్లుఁ, గీడువాటిల్లుటకు సూచకములయిన, యమంగళనిమిత్తములును, ఈలంకలోఁ, గానంబడుచున్నవి.

అని, తాత్పర్యము.

అచిరేణతు కాలేన భవిష్యతి హతప్రభా. ౨౮

టీక॥ ఇయం (అధ్యాహృతము)=ఈలంక; అచిరేణ=శీఘ్రమయిన; కాలేనతు=కాలముచేతనే; హతప్రభా=కొట్టఁబడినకాంతిగలది; భవిష్యతి=కాఁగలదు.

అట్లుగావున, నీలంక, యింక స్వల్పకాలంబుననె, కాంతిచెడి, నాశంబునొందఁగలదు.

అని, తాత్పర్యము.

నూనం లంకా హతే పాపే రావణే రాక్షసాధమే
శోషం యాస్యతి దుర్ధర్షా ప్రమదా విధవా యథా. ౨౯

టీక॥ పాపే=పాపస్వభావుండును; రాక్షసాధమే=రాక్షసులలోఁ దక్కువవాఁడునగు; రావణే=రావణుఁడు; హతే=చంపఁబడఁగా; దుర్ధర్షా=ఎదిరింపఁగూడని; లంకా=లంక; విధవా=చనిపోయినపెనిమిటిగల; ప్రమ




దాయథా=స్త్రీయుంబోలె; శోషం= ఎండుటను, కాంతిలేకుండుట నను; యాస్యతి= పొందఁగలదు. నూనం= నిశ్చయము.

పాపిష్ఠుండును రాక్షసాధముండును గు రావణుండు రామునిచేతల జంపఁబడి, యుండఁ, బెనిమిటిచనిపోయిన వెనుకనుండు స్త్రీవలె, నీలంక, ఏమియు నలంకారమును గాంతియు లేక, యుండఁగలదు; ఇదితప్పదు. అని, తాత్పర్యము.

పుణ్యోత్సవసముత్థా చ నష్టభర్త్రీ స రాక్షసీ
భవిష్యతి పురీ లంకా నష్టభర్త్రీ యథాంగనా. ౩౦

టీక॥ నష్టభర్త్రీ=నశించిన ప్రభువుగలదియును; సరాక్షసీ = రాక్షసస్త్రీలతోఁగూడినదియు, (తాత్పర్యముచే) చంపఁబడినరాక్షస పురుషులుగలదియునగు; లంకా = లంకయను; పురీ=పట్టణము; నష్టభర్త్రీ= నశించిన పెనిమిటిగల; అంగనాయథా=స్త్రీయుంబోలె; పుణ్యోత్సవసముత్థా చ= మంగళోత్సవంబులనుండివీడినదిగాను; భవిష్యతి=కాఁగలదు.

అట్లు నాథుండగు రావణుండును రాక్షసపురుషులందఱును జంపఁబడినవెనుక, నీలంకాపురి, విధవయుంబోలె, మంగళోత్సవమేదియు లేక, కాంతిహీనయయియుండఁగలదు. అని, తాత్పర్యము.

నూనం రాక్షసకన్యానాం రుదంతీనాం గృహేగృహే
శ్రోష్యామి న చిరాదేవ దుఃఖార్తానా మిహ ధ్వనిమ్. ౩౧

టీక॥ అహం (అధ్యాహృతము)= నేను; ఇహ= ఈలంకయందు; గృహేగృహే=ఇంటింటియందును; దుఃఖార్తానాం=దుఃఖముచేఁ బీడింపఁబడినవారును; రుదంతీనాం=ఏడ్చుచున్నవారునగు; రాక్షసకన్యానాం= రాక్షసస్త్రీలయొక్క; ధ్వనిం= శబ్దమును; నచిరాదేవ=శీఘ్రముగానే; శ్రోష్యామి=వినఁగలను. నూనం=నిశ్చయము.

నేనింక, శీఘ్రముగానే, యీలంకయందింటింటను దమ పెనిమిటులు చంపఁబడుటంజేసి దుఃఖార్తలై రోదనంబు సేయుచుండు రాక్షసస్త్రీల కంఠధ్వనిని, వినఁగలను. అని, తాత్పర్యము.




సాంధకారా హతద్యోతా హతరాక్షసపుంగవా
భవిష్యతి పురీ లంకా నిర్దగ్ధా రామసాయకైః. ౩౨
యది నామ స శూరో మాం రామో రక్తాంతలోచనః
జానీయా ద్వర్తమానాం హి రావణస్య నివేశనే. ౩౩

టీక॥ శూరః=యుద్ధమునందు భయము లేనివాఁడును; రక్తాంతలోచనః=ఎఱ్ఱనికొనలుగల కండ్లు గలవాఁడు నగు;సః=ఆ; రామః=రాముఁడు; మాం=నన్ను; రావణస్య= రావణుని యొక్క; నివేశనే=ఇంటియందు; వర్తమానాంహి= ఉన్నదానిఁగానే; జానీయాద్యదినామ=ఎఱుంగునేని; లంకా=లంకయను; పురీ=పట్టణము; రామసాయకైః = రాముని బాణములచేత; నిర్దగ్ధా=దహింపఁబడినదై; సాంధకారా=పెనుఁజీకటితోఁగూడినదిగాను;హతద్యోతా=కొట్టఁబడినకాంతిగలదిగాను; హతరాక్షసపుంగవా = చంపఁబడినరాక్షసశ్రేష్ఠులు గలదిగాను; భవిష్యతి=కాఁగలదు.

ఎఱ్ఱనికొనలుగల కండ్లుగలిగి మహాశూరుండై వెలయురాముండు, నేను రావణునింటనున్నానని యెఱుంగు నేని, యాక్షణమె యీలంకాపురి,యతని బాణంబులచే దహింపఁబడును; ఈ లంకయంతయుఁ బెనుఁజీఁకట్లచేఁ గప్పఁబడి కాంతిచెడియుండును; ఈలంక లోనిమేటి రాక్షసు లందఱును హతు లగుదురు. అని, తాత్పర్యము.

అనేనతు నృశంసేన రావణే నాధమేన మే
సమయో యస్తు నిర్దిష్ట స్తస్యకాలో యమాగతః. ౩౪

టీక॥నృశంసేన=క్రూరుండును; అధమేన=నీచుండునగు;అనేన=ఈ; రావణేనతు=రావణునిచేత నే; మే=నాకొఱకు;యః=ఏ;సమయః=సంకేతము;నిర్దిష్టః=చెప్పఁబడినదో; తస్య=ఆసమయముయొక్క;అయం=ఈ; కాలస్తు=కాలమును;ఆగతః=వచ్చినది.

క్రూరుండును నీచుండునగు నీరావణుండు నాకు నిర్ణయించిన నవధియనుసమీపించినది.

అని, తాత్పర్యము.

అకార్యం యే న జానంతి నైరృతాః పాపకారిణః
అధర్మాత్తు మహోత్పాతో భవిష్యతి హి సాంప్రతమ్. ౩౫

టీక॥ పాపకారిణః= పాపమునుజేయునట్టి; యే=ఏ; నైరృతాః = రాక్షసులు; అధర్మాత్తు=అధర్మమువలననే; అకార్యం=చేయరానిదానిని; నజానంతి = ఎఱుంగరో; తైః(అధ్యాహృతము)=అట్టిరాక్షసులచేత; సాంప్రతం=ఇప్పుడు; మహోత్పాతః= గొప్పయనర్థము; భవిష్యతిహి=కాఁగలదుగదా!

పాపిష్ఠులగురాక్షసులధర్మము నవలంబించియుండువారలుగావున, "ఇది కార్యము, ఇదియకార్యము" అనియెంతమాత్రమునువిమర్శింపకయె సాహసింతురు; అట్లగుటంజేసి, యిప్పుడు, ఈరావణుండు, అనర్థంబునకు వెనుదీయక, నన్నుఁజంపిననుజంపును.

అని, తాత్పర్యము.

నైతే ధర్మం విజానంతి రాక్షసాః పిశితాశనాః

టీక॥ పిశితాశనాః = మాంసమే యాహారముగాఁగల; ఏతే=ఈ; రాక్షసాః= రాక్షసులు; ధర్మం= ధర్మమును; నజానంతి=ఎఱుంగరు.

ఈరాక్షసులు, ఎల్లప్పుడునుమాంసమును భక్షించుచుఁ గ్రూరస్వభావంబు గలిగియుండువారలు కావున, వీరలకెంతమాత్రమునుధర్మము తెలియదు.

అని, తాత్పర్యము.

ధ్రువం మాం ప్రాతరాశార్థే రాక్షసః కల్పయిష్యతి. ౩౬

టీక॥ రాక్షసః = రాక్షసుండగు రావణుండు; మాం=నన్ను; ప్రాతరాశార్థే = ప్రాతఃకాలాహారముకొఱకు; కల్పయిష్యతి = ఏర్పఱచుకొనఁగలఁడు. ధ్రువం= నిశ్చయము.

అట్లుకావున, రాక్షసుండగునీరావణుండు, నన్నుఁబ్రాతఃకాలమునందలి యాహారముగాఁగొనిభక్షింపఁగలఁడు; ఇదినిజము. అని, తాత్పర్యము.

సాహం కథం కరిష్యామి తం వినా ప్రియదర్శనమ్

రామం రక్తాంతనయన మపశ్యంతీ సుదుఃఖితా. ౩౭

టీక॥ రక్తాంతనయనం=ఎఱ్ఱనికొన లుగలకండ్లుగల; రామం = రాముని; అపశ్యంతీ=చూడకున్నదానను; సుదుఃఖితా= మిక్కిలియుదుఃఖమునొందియున్నదాననగు; సా= అట్టి;అహం= నేను; ప్రియదర్శనం= సంతోషకరంబగుచూచుటగల ; తంవినా=ఆరాముని విడిచి; కథం=ఎట్లు, కరిష్యామి = చేయగలను?

ఎఱ్ఱనికొనలుగల కండ్లుగలిగిమహాశూరుండైయున్నరాముంజూడకమిక్కిలియుదుఃఖంబునొందియున్నాను; నేనట్టిప్రియదర్శనుండగురామునివిడిచి, యేమిచేయఁగలను. అని, తాత్పర్యము.

యది కశ్చి త్ప్రదాతా మే విషస్యా ద్య భవే దిహ
క్షిప్రం వైవస్వతం దేవం పశ్యేయం పతినా వినా. ౩౮

టీక। అద్య=ఇప్పుడు; ఇహ=ఇచ్చట;కశ్చిత్ = ఒకానొకఁడైనను;మే=నాకొఱకు;విషస్య=విషముయొక్క;ప్రదాతా=ఇచ్చువాఁడు; స్యాద్యది=ఉండునేని; అహం(అధ్యాహృతము)=నేను;పతినావినా(పత్యావినా)= పెనిమిటినివిడిచి;క్షిప్రం = శీఘ్రముగా; దేవం=ప్రభుండగు;వైవస్వతం= యమునిఁ;పశ్యేయం=చూతును.

ఇప్పటిచ్చట,నాకెవ్వండైననువిషము నిచ్చునేని, నేనుదానింగ్రోలి, రామునివిడిచియుండుటకన్న,శీఘ్రముగా, యమలోకంబునకుంబోదును.

అని, తాత్పర్యము.

నాజానా జ్జీవతీం రామ స్స మాం లక్ష్మణపూర్వజః

టీక।లక్ష్మణపూర్వజః= లక్ష్మణునకుముందుపుట్టిన;సః=ఆ; రామః= రాముఁడు;మాం=నన్ను;జీవతీం = బ్రతికియున్నదానిఁగా;నాజానాత్= ఎఱుంగఁడయ్యె.

లక్ష్మణునకన్నయగురామునకు, నేనిచ్చటజీవించియున్నానని యిదివఱకుఁదెలియకుండునట్లుతోఁచుచున్నది.

అని, తాత్పర్యము.

జానంతౌ తౌ న కుర్యాతాం నోర్వ్యాం హి మమ మార్గణమ్. ౩౯

టీక॥ జానంతౌ = ఎఱింగియున్న; తౌ=ఆరామలక్ష్మణులు; ఉర్వ్యాం=భూమియందు; మమ=నాయొక్క; మార్గణం= వెదకుటను; ననకుర్యాతాం హి=చేయనే చేయుదురుగదా!

ఆరామలక్ష్మణులకు, నేనిచ్చట బ్రతికియుండుట తెలిసియుండునేని, వారలు నన్నింతమాత్రమునుపేక్షింపరు; సిద్ధముగా భూమియంతయుఁ దిరిగి నన్ను వెదకుదురు; అట్లు వెదకినట్లు లేకుండుట వలన వారలకు నాసంగతి తెలియనట్లె యున్నది. అని, తాత్పర్యము.

నూనం మమైవ శోకేన స వీరో లక్ష్మణాగ్రజః
దేవలోక మితో యాత స్త్యక్త్వా దేహం మహీతలే. ౪౦

టీక॥ వీరః=పరాక్రమశాలియును; లక్ష్మణాగ్రజః =లక్ష్మణునకన్నయునగు; సః=ఆరాముఁడు; మమ=నాయొక్క; శోకేనైవ=దుఃఖముచేతనె; మహీతలే=భూతలమందు; దేహం= దేహమును; త్యక్త్వా=విడిచి; ఇతః=ఈ భూలోకమునుండి; దేవలోకం= స్వర్గమును; యాతః=పొందినాఁడు; నూనం=నిశ్చయము.

అటుగాదేని, మహాపరాక్రమశాలియగు రాముండు, నాదుఃఖంబుననె, నేలపై దేహంబువిడిచి, స్వర్గలోకంబు నొందెనేమొ; ఇదినిశ్చయముగా నుండును. అని, తాత్పర్యము.

ధన్యా దేవా స్సగంధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః
మమ పశ్యంతి యే నాథం రామం రాజీవలోచనమ్. ౪౧

టీక॥ యే=ఎవరు; రాజీవలోచనం= తామరపూలవంటికండ్లుగలవాఁడును; మే=నాయొక్క; నాథం=పెనిమిటియునగు; రామం=రామునిఁ; పశ్యంతి=చూచుచున్నారో; తే(అధ్యాహృతము)=అట్టి; సగంధర్వాః=గంధర్వులతోఁగూడిన; దేవాః=దేవతలును, సిద్ధాః=సిద్ధులును; పరమర్షయశ్చ = మహర్షులును; ధన్యాః = పుణ్యవంతులు.

అట్లుమృతుండైన నాపెనిమిటిని దామరపూలుంబోలె విశాలసుందరంబుల

యినకండ్లుగలవాని రాముని, స్వర్గలోకంబున, నెవ్వరు, చూచుచున్నారో, ఆ దేవతలునుగంధర్వులునుసిద్ధులునుమహర్షులునుమిక్కిలియుధన్యులు.

అని, తాత్పర్యము.

అథవా నహి తస్యార్థో ధర్మకామస్య ధీమతః
మయా రామస్య రాజర్షే ర్భార్యయా పరమాత్మనః. ౪౨

టీక॥అథవా=అటుకాదేని; ధర్మకామస్య = ధర్మమునందుమాత్రమె యిచ్ఛగలవాడును;ధీమతః= అధికమయినబుద్ధిగలవాడును; రాజర్షేః= రాజునుఋషియునయినవాడును; పరమాత్మనః=ఉత్కృష్టమయినమనసుగలవాడునగు;తస్య=ఆ;రామస్య = రామునకు;భార్యయా = భార్యనగు;మయా=నాచేత;అర్థః = ప్రయోజనము;నహి=లేదాయేమి?

అటుగాక, రాముండు సులక్షణముగాజీవించియుండును;అయినను, ధర్మమునందుమాత్రమె యిచ్ఛగలిగి, రాజర్షియయి, మనస్సునిర్మలముచేసికొని, యిట్లువైరాగ్యంబునొంది, యుండుటంజేసి, రామునకు, నాపైనక్కఱలేప్పియున్నదేమొ. అని, తాత్పర్యము.

దృశ్యమానే భవేత్ప్రీతి స్సౌహృదం నాస్త్యపశ్యతః

టీక॥దృశ్యమానే= చూడఁబడుచున్నజనమునందు; ప్రీతిః=స్నేహము;భవేత్=ఉండును. అపశ్యతః= చూడకున్నవానికి;సౌహృదం=స్నేహము; నాస్తి= ఉండదు.

స్నేహంబుగలిగినవెనుక, నొకరినొకరు చూచుకొనుచుండుదురేనియా స్నేహముచెడకుండును ; అట్లుచూచుకొనకుందురేని , యాస్నేహమునశించును; కావున, నేనురాముండును, ఒకరినొకరు విడిచియున్నాము, కాఁబట్టి, నాయందురామునకుంగల్గియుండిన స్నేహము నశించినదేమొ. అని, తాత్పర్యము.

నాశయంతి కృతఘ్నాస్తు న రామో నాశయిష్యతి. ౪౩

టీక॥ కృతఘ్నాస్తు=తమకుఁజేయఁబడినయుపకారమును మఱచునట్టివారు

మాత్రము; ప్రీతిం(అధ్యాహృతము) = స్నేహమును ; నాశయంతి=నశింపఁజేయుదురు. రామః= రాముండు ; న నాశయిష్యతి=నశింపఁజేయఁడు.

ఇతరులు తమకుఁజేసిన యుపకారమును మఱచునట్టి పాపాత్ములు మాత్రమె, యట్లుపూర్వముగలిగినప్రీతిని, వియోగముగల్గినప్పుడు, మఱతురుగాని, రాముండుమాత్రము, ఎవ్వరియాందేని, మొదటందనకుఁబ్రీతిగల్గినచో, దానిమతియెన్నఁటికిని,మఱవఁడు; కావుననాతనికెప్పుడునుప్రీతితప్పియుండదు.

అని, తాత్పర్యము.

కిన్ను మే న గుణాః కేచి త్కింవా భాగ్యక్షయో మమ
యాహం సీదామి రామేణ హీనా ముఖ్యేన భామినీ. ౪౪

టీక॥ భామినీ=స్త్రీనగు;యా= ఏ; అహం=నేను; ముఖ్యేన=శ్రేష్ఠుఁడగు; రామేణ= రామునిచేత; హీనా=విడువఁబడినదాననై; సీదామి= నాశంబునొందుచున్నానో; తస్యాః (అధ్యాహృతము)=అట్టి; మే=నాకు ; నగుణాః=పాపములు; కిన్ను (సంతి)=ఉన్నవా యేమి?మమ=నాయొక్క ; భాగ్యక్షయః కింవా= భాగ్యము నశించుటయా యేమి?

ఆఁడుదాననగు నేను బెనిమిటియయిన రామునిం బాసియిట్లు దుఃఖంబుననాశంబునొందుచున్నానె; నేనింతకుముందుచేసిన పాపములవలననిట్లు నాకువాటిల్లినదా? లేక, నాదౌర్భాగ్యమేదీనికిఁగారణమా?అని, తాత్పర్యము.

శ్రేయో మే జీవితా న్మర్తుం విహీనాయా మహాత్మనః
రామా దక్లిష్టచారిత్రా చ్ఛూరా చ్ఛత్రునిబర్హణాత్. ౪౫

టీక॥మహాత్మనః= పూజ్యమయినస్వభావము గలవాఁడును; అక్లిష్టచారిత్రాత్= దోషములేనిచరిత్రముగలవాఁడును;శూరాత్ =యుద్ధమునందువెఱవనివాఁడును;శత్రునిబర్హణాత్ = శత్రువులంజంపువాఁడునగు; రామాత్= (తృతీయార్థమందుఁబంచమి) రామునిచేత;విహీనాయాః = విడువఁబడిన; మే=నాకు;జీవితాత్= బ్రతికియుండుటకన్న;మర్తుం=చచ్చుటయు, చచ్చుట

యనుట; శ్రేయః=మంచిది.

మహాత్ముండును నిర్దోషంబగు చరిత్రముగలవాండును శూరుండును శత్రులంజంపువాండునగు రాముని౦బాసి, జీవించియుండుటకన్న నాకు మరణంబు నొందుటయె, మేలు. అని, తాత్పర్యము.

అథవా న్యస్తశస్త్రౌ తౌ వనే మూలఫలాశినౌ
భ్రాతరౌ హి నరశ్రేష్ఠౌ సంవృత్తౌ వనగోచరౌ

టీక॥ అథవా=అటుగాదేని; వనే=అడవియందు; మూలఫలాశినౌ=గడ్డలను బండ్లనుదినుచుండువారలును; వనగోచరౌ=అడవియందగపడువారలును, అడవియందంచిరుగువారలనుట; నరశ్రేష్ఠౌ=పురుషశ్రేష్ఠులును; భ్రాతరౌ=అన్నదమ్ములునగు; తౌ=ఆ రామలక్ష్మణులు; న్యస్తశస్త్రౌ=విడువంబడినయాయుధముగలవారలు; సంవృత్తౌహి=అయినారా యేమి?

అటుగాదేని మూలంబులను బండ్లనుదినుచు నడవింది౦రుగుచున్న పురుషశ్రేష్ఠులగు నా రామలక్ష్మణులు, ఇద్దఱును, దుఃఖంబున, నాయుధంబులను విడిచి, మునివృత్తినవలంబించి యున్నారేమొ?

అని, తాత్పర్యము-

అథవా రాక్షసేంద్రేణ రావణేన దురాత్మనా
ఛద్మనా ఘాతితౌ శూరౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౪౭

టీక॥ అథవా=అటుగాదేని; దురాత్మనా=దుష్టబుద్ధిగలవాండును; రాక్షసేంద్రేణ=రాక్షసులకుం బ్రభుండునగు; రావణేన=రావణునిచేత; శూరౌ=యుద్ధమునందుభయపడనివారును; భ్రాతరౌ=అన్నదమ్ములునగు; రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు; ఛద్మనా=కపటముచేత; ఘాతితౌ (కిం)=చంపంబడిరా యేమి?

అటుగాదేని, దుష్టాత్ముండును రాక్షసేశ్వరుండునగు నీ రావణుండు, శూరులగు నా రామలక్ష్మణులనిద్దఱను, గపటంబునం, జంపినాండా యేమి?

అని, తాత్పర్యము.

సాహమేవం గతే కాలే మర్తుమిచ్ఛామి సర్వదా

టీక॥ కాలే=కాలము; ఏవం = ఇట్లు; గతే=కడవఁగా; సా=అట్టి; అహం=నేను; సర్వథా=అన్నివిధములను; మర్తుం=చచ్చుటకు; ఇచ్ఛామి= కోరుచున్నాను.

కాలమహిమయిట్లయినదికావున, నేను రాముని విడిచి యెంతమాత్రము బ్రతికియుండంజాలను; ప్రాణంబులు విడువఁగోరెదను. అని, తాత్పర్యము.

నచ మే విహితో మృత్యు రస్మిన్ దుఃఖేపి వర్తతి. ౪౮

టీక॥ అస్మిన్=ఈ; దుఃఖే= దుఃఖము; వర్తత్యపి(వర్తమానేపి)=ఉండినప్పటికిని; మే=నాకు; మృత్యుశ్చ=మరణమును; విహితః = సిద్ధమయినది; న=కాలేదు.

ఇట్టిమహాదుఃఖముగలిగియున్నను, నాకుమరణంబుసిద్ధింపకున్నది. అని, తాత్పర్యము.

ధన్యాఃఖలు మహాత్మానో మునయ స్త్యక్తకిల్బిషాః
జితాత్మానో మహాభాగా యేషాం న స్తః ప్రియాప్రియే. ౪౯

టీక॥ యేషాం=ఎవ్వరికి; ప్రియాప్రియే=ఇష్టమునయిష్టము; న స్తః= లేవో; తే(అధ్యాహృతము)=అట్టి; మహాత్మానః=అధికమయినస్థైర్యముగలవారును; త్యక్తకిల్బిషాః= విడువఁబడినపాపముగలవారలును; జితాత్మానః= జయింపఁబడిన మనసుగలవారలును; మహాభాగాః=పూజ్యమయినభాగ్యముగలవారలునగు; మునయః=ఋషులు; ధన్యాఃఖలు=పుణ్యవంతులుగదా!

మాకుండునట్లు, "ఇదిప్రియము, ఇది యప్రియము" అనుభేదమెవ్వరికి లేకున్నదో, అట్టియధికధైర్యము గలవారలును పాపంబులేనివారలును మనసును స్వాధీనముచేసికొని యుండువారలును మహాభాగులునగు మునులు, ఇట్టికష్టము ననుభవింపవలసినది లేదు, కావున, పుణ్యవంతులు. అని, తాత్పర్యము.

ప్రియా న్నసంభవే ద్దుఃఖ మప్రియా దధికం భయమ్
తాభ్యాం హి యే వియుజ్యంతే నమ స్తేషాం మహాత్మనామ్. ౫౦

టీక॥ ప్రియాత్ = ఇష్టమయినవస్తువు వలన; దుఃఖం= దుఃఖము; న సంభవేత్ = కలుఁగదు, సుఖముగలుఁగుననుట; అప్రియాత్ = అనిష్టమయినవస్తువువలన; అధికం= ఎక్కువైన; భయం= భయము; సంభవేత్ (అధ్యాహృతము)= కలుగును. యే= ఎవరు; తాభ్యాంహి= వానిచేతను కూడ; వియుజ్యంతే = విడువఁబడుదురో; తేషాం = అట్టి; మహాత్మనాం= అధికమయినధైర్యముగల మునులకు; నమః= నమస్కారము.

ప్రియంబగుదానివలన సుఖంబు గలుగును; అప్రియంబగు దానివలనదుఃఖముగలుగును ; అట్లుసుఖదుఃఖములుగలిగించుప్రియాప్రియంబులనువిడిచియుండు మహాత్ములగు మునులకు నమస్కరించెదను. అని, తాత్పర్యము.

సాహం త్యక్తా ప్రియార్హేణ రామేణ విదితాత్మనా
ప్రాణాం స్త్యక్ష్యామి పాపస్య రావణస్య గతా వశమ్. ౫౧

టీక॥ సా= అట్టి; అహం= నేను; ప్రియార్హేణ= సంతోషమునకుఁదగినవాఁడును; విదితాత్మనా= తెలిసికొనఁబడినపరమాత్మగలవాఁడునగు ; రామేణ= రామునిచేత; త్యక్తా= విడువఁబడినదాననై; పాపస్య= పాపస్వభావుఁడగు; రావణస్య= రావణుని యొక్క; వశం= అధీనతను; గతా= పొందినదాననై; ప్రాణాన్= ప్రాణములను; త్యక్ష్యామి= విడువఁగలను.

నేనట్టిదాననుగాను , కేవలము ప్రియపదార్థమునందే ప్రీతిగలదానను, గావున, నాకుఁబ్రియుండగు రాముని విడిచి, యప్రియుండగుపాపిష్ఠుని రావణునిస్వాధీనతకుంజిక్కి, బ్రతికియుండంజాలను; ప్రాణంబులువిడిచెదను. అని, సీతయేడ్చినది. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

సుందరకాండే, షడ్వింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, సుందరకాండ షడ్వింశసర్గ టీక, ముగిసినది.

---

(౨౭)

స ప్త విం శ స ర్గ ప్రా రం భః.

ఇత్యుక్తాస్సీతయా ఘోరా రాక్షస్యః క్రోధమూర్ఛితాః
కాశ్చిజ్జగ్ము స్తదాఖ్యాతుం రావణస్య తరస్వినః. ౧

టీక ॥ ఘోరాః = భయంకరలయిన; రాక్షస్యః=రాక్షసస్త్రీలు; సీతయా=సీతచే; ఇతి=ఇట్లు ; ఉక్తాః= చెప్పఁబడినవారలై ; క్రోధ మూర్ఛితాః= కోపముచే వ్యాపింపఁబడినవారలై; కాశ్చిత్=కొందఱు; తరస్వినః =బలవంతుండగు; రావణస్య= రావణునకు;తత్ = ఆసంగతిని;ఆఖ్యాతుం= చెప్పుటకు; జగ్ముః=పోయిరి.

భయంకరాకారలగు రాక్షసస్త్రీలు, సీతమాటలువిని , మహాకోపంబు నొంది,యందుఁ గొందఱు , అట్లుసీత ప్రాణంబులువిడువనిశ్చయించిన సంగతిని, బలవంతుండగు రావణునకుం జెప్పుటకుఁబోయిరి. అని, తాత్పర్యము.

తత స్సీతా ముపాగమ్య రాక్షస్యో ఘోర దర్శనాః
పునః పరుష మేకార్థ మనర్థార్థ మథాబ్రువన్. ౨

టీక॥ఘోరదర్శనాః=భయంకరమయినచూచుటగల;రాక్షస్యః = రాక్షసస్త్రీలు;సీతాం=సీతను;ఉపాగమ్య= పొంది;అథ=అటుపిమ్మట; పునః=మఱల;పరుషం=కఠినమును;ఏకార్థం= ఒకటేయర్థముగలదియును, ముందు చెప్పినయర్థమే కలదియుననుట ; అనర్థార్థం= అనర్థమెప్రయోజనము గాఁగలదియునగుమాటను;అబ్రువన్= చెప్పిరి.

చూపరులకుభయంబుగలిగించు నా రాక్షసస్త్రీలు,సీతయొద్దకువచ్చి,మఱల మునుపుచెప్పినట్లె , పరుషంబును అనర్థము గల్గించునదియునగు, మాటం

జెప్పిరి. అని, తాత్పర్యము.

అద్యేదానీం తవా నార్యే సీతే పాపవినిశ్చయే
రాక్షస్యో భక్షయిష్యంతి మాంస మేత ద్యథా సుఖమ్. ౩

టీక॥ అనార్యే = దుష్టురాలవును; పాపవినిశ్చయే = పాపమునందునిశ్చయముగలదానవునగు ; సీతే = సీతా ! అద్య = ఈదినమునందు ; ఇదానీం = ఈ క్షణమునందు; రాక్షస్యః = రాక్షసస్త్రీలు; తవ = నీయొక్క; ఏతత్ = ఈ; మాంసం = మాంసమును; యథాసుఖం = సుఖముగా; భక్షయిష్యంతి = తినఁగలరు.

దుష్టురాలవుఁ బాపిష్ఠురాలవునగు సీతా ! నేఁడీక్షణమునందె, రాక్షసస్త్రీలు , నీదేహమునందలి మాంసమునుద నివిదీరందినఁగలరు. అని, తాత్పర్యము.

రహస్యార్థకము.— సీతే! అద్య ; ఇదానీం; పాపవినిశ్చయే—పాపరూపమయినవిశ్చయముగల; అనార్యే = అపరాధముండఁగా ; రాక్షస్యః = రాక్షసస్త్రీలు; తవ = (తృతీయార్థమునందుషష్ఠి) = నీచే ; నిజం (అధ్యాహృతము) = తమదైన; మాంసం = మాంసమును; యథాసుఖం = సుఖముగా ; భక్షయిష్యంతి = భక్షింపఁజేయఁగలరు.

సీతా! నీకీ రాక్షసస్త్రీలేమైననపరాధముగావించినట్టు నీకుఁ దోఁచునేని, యీరాక్షసస్త్రీలు, దానినిష్కృతికై, తమదేహమాంసమును నీకారగింపఁబెట్టి, ప్రాణంబులువిడువఁగలరు.

అని, తాత్పర్యము.

సీతాం తాభి రనార్యాభి ర్దృష్ట్వా సంతర్జితాం తదా
రాక్షసీ త్రిజటా వృద్ధా శయానా వాక్య మబ్రవీత్. ౪

టీక॥ తదా — అప్పుడు; అనార్యాభిః = దుష్టలయిన; తాభిః = ఆరాక్షసస్త్రీలచేత; సంతర్జితాం = బెదరింపఁబడిన; సీతాం = సీతను; దృష్ట్వా = చూచి; శయానా = పరుండి యున్నదియైను ; వృద్ధా = ముసలియైనగు; త్రిజటా = త్రిజటయను; రాక్షసీ — రాక్షసస్త్రీ; వాక్యం — మాటను; అబ్రవీత్ — చెప్పెను.

అప్పుడట్లు, దుష్టలయినయీరాక్షసస్త్రీలు బెదరించుచుండుటం జూచి, యంతవఱకుఁబరుండినిద్రించుచుండినముసలిరాక్షసి, త్రిజటయనునది, యీరాక్షసస్త్రీలంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

ఆత్మానం ఖాదతా నార్యా న సీతాం భక్షయిష్యథ
జనకస్య సుతా మిష్టాం స్నుషాం దశరథస్య చ. ౫

టీక॥అనార్యాః= దుష్టలయినరాక్షసస్త్రీలారా!ఆత్మానం=నన్ను; ఖాదత=తినుఁడు.జనకస్య=జనకునియొక్క; సుతాం= కోడలును;దశరథస్య=దశరథునియొక్క; స్నుషాంచ= కోడలును;ఇష్టాం=ప్రియయునగు; సీతాం=సీతను; నభక్షయిష్యథ=భక్షింపకుఁడు.

దుష్టలయిన రాక్షసస్త్రీలారా! జనకునకుఁ, గొమార్తెయును దశరథునకుఁ గోడలును బ్రపంచమునకంతయుఁ బ్రియయునగు సీతను భక్షింపకుఁడు;అందుకు బదులుగా, నన్ను భక్షింపుఁడు.

అని, తాత్పర్యము.

స్వప్నో హ్యద్య మయా దృష్టో దారుణో రోమహర్షణః
రాక్షసానా మభావాయ భర్తు రస్యా భవాయచ. ౬

రాక్షసానాం=రాక్షసులయొక్క; అభావాయ=నాశముకొఱకును, నాశమునుసూచించు నదియుననుట ; అస్యాః=ఈసీతయొక్క; భర్తుః= పెనిమిటియొక్క;భవాయచ=అభ్యుదయముకొఱకును, అభ్యుదయమునుసూచించునదియుననుట; దారుణః= భయంకరమును; రోమహర్షణః=వెంట్రుకలనుగగుర్పుగొనఁజేయునదియునగు; స్వప్నః=కల; అద్య=ఇప్పుడు; మయా = నాచేత; దృష్టోహి= చూడఁబడినది గదా!

రాక్షసులకు వినాశంబును ఈసీత పెనిమిటియయిన రామునకు జయంబును సూచించునట్టి, భయంకరంబును గగుర్పాటు గలిగించునదియునగు, నొకస్వప్నంబుగంటిని. అని,త్రిజట, రాక్షసస్త్రీలతోఁ జెప్పినది.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తా స్త్రిజటయా రాక్షస్యః క్రోధమూర్ఛితాః
సర్వా ఏవా బ్రువ న్భీతా స్త్రిజటాం తా మిదం వచః. ౭

టీక॥ క్రోధమూర్ఛితాః= కోపముచేవ్యాపింపఁబడిన; రాక్షస్యః= రాక్ష

స్త్రీలు; ఏవం=ఇట్లు; త్రిజటయా= త్రిజటచేత; ఉక్తాః= చెప్పఁబడినవారలై; సర్వాఏవ= అందఱునే; భీతాః= భయముపడినవారలై; తాం=ఆ; త్రిజటాం=త్రిజటనుగూర్చి; ఇదం=ఈ; వచః=మాటను; అబ్రువన్=చెప్పిరి.

అట్లు మహాకోపంబు నొందియుండు నా రాక్షసస్త్రీలు, త్రిజట చెప్పిన మాటనువిని, యందఱును, భయంబు నొంది, యాత్రిజటంజూచి, యిట్లని, చెప్పిరి. అని, తాత్పర్యము.

కథయస్వ త్వయా దృష్ట స్స్వప్నోఽయం కీదృశో నిశి

టీక॥ త్వయా=నీచేత; నిశి=రాత్రియందు; కీదృశః=ఎట్టి; స్వప్నః=కల; దృష్టః=చూడఁబడినది? కథయస్వ=చెప్పుము.

నీవి రాత్రియందుఁ గనినస్వప్నం బెట్టిదో, మాకుఁ జెప్పుము.
అని, తాత్పర్యము.

తాసాం శ్రుత్వాతు వచనం రాక్షసీనాం ముఖాచ్చ్యుతమ్. ౮
ఉవాచ వచనం కాలే త్రిజటా స్వప్నసంశ్రితమ్

టీక॥ కాలే= ఉషఃకాలమునందు; త్రిజటా=త్రిజట; తాసాం=ఆ; రాక్షసీనాం=రాక్షసస్త్రీలయొక్క, ముఖాత్= నోటనుండి; చ్యుతం=వెడలిన; వచనం= మాటను; శ్రుత్వాతు= వినినంతనే; స్వప్నసంశ్రితం= స్వప్నమునుగుఱించిన; వచనం=మాటను; ఉవాచ= పలికెను.

ఉషఃకాలమునందు, త్రిజట, ఆరాక్షసస్త్రీలమాటనువిని, వారలకుఁ దన స్వప్నవృత్తాంతము నిట్లని, చెప్పెను.
అని, తాత్పర్యము.

గజదంతమయీం దివ్యాం శిబికా మంతరిక్షగామ్. ౯
యుక్తాం హంససహస్రేణ స్వయ మాస్థాయ రాఘవః
శుక్లమాల్యాంబరధరో లక్ష్మణేనసహ గతః. ౧౦

టీక॥రాఘవః = రాముఁడు; శుక్లమాల్యాంబరధరః= తెల్లనిపుష్పమాలిక

లనువస్త్రములనుధరించినవారలై; స్వయం= తాను; గజదంతమయీం=ఏనుంగుదంతములవికారమయినదియును; దివ్యాం=శ్రేష్ఠమును; అంతరిక్షగాం= ఆకాశమును బొందినదియును; హంససహస్రేణ=హంసపక్షులవేయింటితో; యుక్తాం=కూడినదియునగు ; శిబికాం=పల్లకిని; ఆస్థాయ=అధిష్ఠించి; లక్ష్మణేనసహ=లక్ష్మణునితోఁగూడ; లంకాం(అధ్యాహృతము)=లంకను; ఆగతః=పొందినాఁడు.

రాముండు, తెల్లనిపుష్పమాలికలును వస్త్రంబులునుం దాల్చి, యేనుంగుదంతములతోఁ జేయఁబడినదియునంతరిక్షమునందుసంచరించునదియును వేయి హంసపక్షులు గూర్పఁబడియుండునదియునగుశ్రేష్ఠమయినపల్లకినెక్కి, లక్ష్మణునితోఁగూడ, లంకకువచ్చెను.

అని, తాత్పర్యము.

స్వప్నే చాద్య మయా దృష్టా సీతా శుక్లాంబరావృతా
సాగరేణ పరిక్షిప్తం శ్వేతం పర్వత మాస్థితా. ౧౧

టీక॥అద్య= ఇప్పుడు; స్వప్నేచ= స్వప్నమునందె; సీతా=సీత; శుక్లాంబరావృతా= తెల్లనివస్త్రముచేఁగప్పఁబడినదిగాను; సాగరేణ=సముద్రముచేత; పరిక్షిప్తం=చుట్టునుజుట్టుకొనఁబడిన; శ్వేతం=తెల్లని; పర్వతం=కొండను; ఆస్థితా=అధిష్ఠించినదిగాను; మయా= నాచేత; దృష్టా=చూడఁబడినది.

ఇప్పుడు, నేను, స్వప్నంబుననె, ఈసీత, తెల్లనివస్త్రంబుగట్టుకొని, సముద్రంబునడుమనుండు శ్వేతపర్వతంబునెక్కియున్నట్టు, చూచినాను.

అని, తాత్పర్యము.

రామేణ సంగతా సీతా భాస్కరేణ ప్రభా యథా

టీక॥సీతా = సీత; భాస్కరేణ= సూర్యునితో; ప్రభాయథా=వెల్తురుంబోలె; రామేణ= రామునితో ; సంగతా=చేరినది. .

వెల్తురుసూర్యునితోఁ గూడియుండువిధంబున, ఈసీత రామునితోఁజేరియున్నట్టు, చూచినాను.

అని, తాత్పర్యము.

రాఘవశ్చ మయా దృష్ట శ్చతుర్దంతం మహాగజమ్. ౧౨
ఆరూఢ శ్శైలసంకాశం చచార సహలక్ష్మణః

టీక॥రాఘవశ్చ=రాముండును; చతుర్దంతం= నాలుగుదంతములుగలదియును; శైలసంకాశం=పర్వతముతోసమానమయినదియునగు; మహాగజం=పెద్దయేనుంగును; ఆరూఢః = ఎక్కినవాఁడై; సహలక్ష్మణః= లక్ష్మణునితోఁగూడినవాఁడై; చచార=తిరిగెను. తథా (అధ్యాహృతము)=అట్లు; మయా=నాచేత; దృష్టః=చూడఁబడినాఁడు.

రాముండు, లక్ష్మణునింగూడి, నాలుగుదంతములుగలదియుఁ బర్వతముంబోలె నుండునదియునగు పెద్దయేనుఁగునెక్కి, లంకలోసంచరించునట్లుచూచినాను. అని, తాత్పర్యము.

తత స్తౌ నరశార్దూలౌ దీప్యమానౌ స్వతేజసా. ౧౩
శుక్లమాల్యాంబరధరౌ జానకీం పర్యుపస్థితౌ

టీక॥తతః=అటుపిమ్మట; స్వతేజసా==తమకాంతిచేత; దీప్యమానౌ=ప్రకాశించుచున్నవారును; శుక్లమాల్యాంబరధరౌ=తెల్లని పుష్పమాలికలనువస్త్రములనుదాల్చిన వారలునగు; తౌ=ఆ; నరశార్దూలౌ=పురుషశ్రేష్ఠులయినరామలక్ష్మణులు; జానకీం=సీతను; పర్యుపస్థితౌ= సమీపించినారు.

అంతట, దమదేహకాంతిచే వెలుంగుచుఁ దెల్లనిపుష్పమాలికలను వస్త్రంబులనుదాల్చియున్నపురుషశ్రేష్ఠులయినయా రామలక్ష్మణులు, సీతసమీపంబునకువచ్చిరి. అని, తాత్పర్యము.

తత స్తస్య నగస్యాగ్రే హ్యాకాశస్థస్య దంతినః. ౧౪
భర్త్రా పరిగృహీతస్య జానకీస్కంధ మాశ్రితా

టీక॥ తతః=అటుపిమ్మట; జానకీ=సీత; తస్య=ఆ; నగస్య=శ్వేతపర్వతముయొక్క; అగ్రే= శిఖరమునందు; ఆకాశస్థస్య=ఆకాశమునందున్నదియును; భర్త్రా= పెనిమిటియగు రామునిచేత; పరిగృహీతస్య= స్వీక

రింపఁబడినదియునగు, అధిష్ఠింపఁ బడినదియునగుననుట; దంతినః= ఏనుఁగుయొక్క; స్కంధం=వీఁపును ; ఆశ్రితా=పొందినది.

అంత, నా శ్వేతపర్వత శిఖర సమీపంబున, నాకాశంబునందున్న, రాముండెక్కిన యేనుంగుపై సీతాదేవి, యెక్కినది. అని, తాత్పర్యము.

ఈశ్లోకంబునందు, "తత స్తస్య" అను చోటనుండు "స్య" అనునక్షరముచేత, గాయత్రిపదుమూఁడవయక్షరమగు "స్య" అనునది గ్రహింపఁబడినది. పండ్రెండు వేల శ్లోకములు ముగిసినవి. ఇది, పదుమూఁడవశ్లోకసహస్రమునకు మొదటి శ్లోకము. అని యెఱుంగునది .

భర్తు రంకా త్సముత్పత్య తతః కమలలోచనా. ౧౫
చంద్రసూర్యౌ మయా దృష్టా పాణినా పరిమార్జతీ

టీక॥ తతః=అటుపిమ్మట; కమలలోచనా=తామరపూలవంటికండ్లుగల సీత; భర్తుః=పెనిమిటియగు రామునియొక్క ; అంకాత్=తొడనుండి; సముత్పత్య=లేచి; పాణినా=చేతిచేత; చంద్రసూర్యౌ=చంద్రునిసూర్యుని; పరిమార్జతీ=తుడుచుచు, స్పృశించుచుననుట; మయా=నాచేత ; దృష్టా=చూడఁబడినది.

అంతట, దామరపూలంబోలు కండ్లుగలయాసీత, పెనిమిటియగు రాముని తొడపైనుండిలేచి, హస్తంబునఁ జంద్రసూర్యులంబట్టుచుండునట్లు, చూచినాను. అని, తాత్పర్యము.

తత స్తాభ్యాం కుమారాభ్యా మాస్థిత స్స గజోత్తమః. ౧౬
సీతయాచ విశాలాక్ష్యా లంకాయా ఉపరి స్థితః

టీక॥ తతః= అటుపిమ్మట ; తాభ్యాం=ఆ; కుమారాభ్యాం=రామ లక్ష్మణులచేతను; విశాలాక్ష్యా= వెడలుపైనకండ్లుగల; సీతయాచ= సీతాదేవిచేతను; ఆస్థితః=అధిష్ఠింపఁ బడిన; సః=ఆ; గజోత్తమః= గజశ్రేష్ఠము; లంకాయాః=లంకకు ; ఉపరి= మీఁద; స్థితః=ఉండినది.

అంత, నారామలక్ష్మణులును బెద్దకండ్లుగలసీతయును , ఎక్కియున్న

యామేసుంగు, ఆకాశంబున,లంకకుఁ బైగానుండునట్లు, చూచినాను.

అని, తాత్పర్యము.

పాణ్డురర్షభ యుక్తేన రథేనాష్టయుజా స్వయమ్. ౧౭
ఇహోపయాతః కాకుత్స్థ స్సీతయా సహ భార్యయా

టీక॥ కాకుత్స్థః=రాముఁడు ; స్వయం=తాను; భార్యయా = భార్యయయిన; సీతయాసహ= సీతతోఁగూడ; పాండురర్షభయుక్తేన =తెల్లని యెద్దులతోఁగూడినదియును; అష్టయుజా=ఎనిమిదింటితోఁగూడినదియునగు; రథేన=రథముచేత ; ఇహ=ఇచ్చటికి; ఉపయాతః=వచ్చినాఁడు.

రాముఁడు , సీతతోఁగూడ నెనిమిది తెల్లయెద్దులుగట్టంబడియుండు,రథంబు నెక్కి,యిచ్చటికవచ్చినాఁడు.

అని, తాత్పర్యము.

లక్ష్మణేన సహ భ్రాత్రా సీతయా సహ వీర్యవాన్. ౧౮
ఆరుహ్య పుష్పకం దివ్యం విమానం సూర్యసన్నిభమ
ఉత్తరాం దిశ మాలోక్య జగామ పురుషోత్తమః. ౧౯

టీక॥ వీర్యవాన్ = అధికమయినపరాక్రమముగల ; పురుషోత్తమః=పురుషశ్రేష్ఠుండగు రాముండు; భ్రాత్రా=తమ్ముఁడగు ; లక్ష్మణేనసహ = లక్ష్మణునితోఁగూడ; సీతయాసహ = సీతతోఁగూడ;దివ్యం = శ్రేష్ఠమును; సూర్యసన్నిభం=సూర్యునితోసమానమయి నదియునగు;పుష్పకం=పుష్పకమును; విమానం=విమానమును; ఆరుహ్య =ఎక్కి; ఉత్తరాం = ఉత్తరపు; దిశం = దిక్కును ; ఆలోక్య=చూచి, ఉద్దేశించియనుట; జగామ=పోయెను.

మహాపరాక్రమశాలియుఁ బురుషోత్తముండునగు నా రాముండు, తమ్ముండగులక్ష్మణుని భార్యను సీతాదేవినింగూడి, సూర్యబింబమునకు సాటియగుపుష్పకవిమానంబు నెక్కి , యుత్తరపుదిక్కునుబట్టిపోయెను.

అని, తాత్పర్యము.

ఏవం స్వప్నే మయా దృష్టో రామో విష్ణుపరాక్రమః

లక్ష్మణేన సహ భ్రాత్రా సీతయా సహ రాఘవః. ౨౦

టీక॥ఏవం=ఇట్లు;స్వప్నే = కలయందు; మయా=నాచేత; రాఘవః=రఘువంశంబునఁ బుట్టినవాఁడును ; విష్ణుపరాక్రమః = విష్ణుదేవునియొక్క-పరాక్రమమువంటిపరాక్రమము గలవాఁడునగు;రామః=రాముఁడు;భ్రాత్రా=తమ్ముఁడైన ; లక్ష్మణేనసహ=లక్ష్మణునితోఁగూడ;భార్యయా = భార్యయగు; సీతయా సహ=సీతతోఁగూడ; దృష్టః=చూడఁబడినాఁడు.

నే, నీప్రకారంబున, స్వప్నంబునందు, విష్ణుదేవునిపరాక్రమంబునకుసాటియగుపరాక్రమంబుగలరాముని, అతని తమ్ముండగులక్ష్మణుని , భార్యనుసీతాదేవిని, జూచినాను.

అని, తాత్పర్యము.

నహి రామో మహాతేజా శ్శక్యో జేతుం సురాసురైః
రాక్షసై ర్వాపిచా న్యైర్వా స్వర్గః పాపజనై రివ. ౨౧

టీక॥మహాతేజాః=అధికమయినపరాక్రమముగల; రామః=రాముఁడు;సురాసురైః=దేవతలచేతనుగాని అసురులచేతనుగాని ; రాక్షసైర్వాపిచ=రాక్షసులచేతనుగాని; అన్యైర్వా=ఇతరులచేతనుగాని ; స్వర్గః = స్వర్గము; పాపజనైరివ= పాపముచేయుజనులచేతంబోలె; జేతుం=జయించుటకు; శక్యోనహి=అలవిగాఁడుగదా!

పాపిష్ఠుఁడుస్వర్గమునుసాధింపఁజాలనట్లు, మహాపరాక్రమశాలియగురాముని, దేవతలుగాని యసురులుగానిరాక్షసులుగానివఱియితరులుగాని, యెంతమాత్రముజయింపంజాలరు. అని, తాత్పర్యము.

రావణశ్చ మయా దృష్టః క్షితౌ తైల సముక్షితః
రక్తవాసాః పిబ న్మత్తః కరవీర కృతస్రజః. ౨౨

టీక॥రావణశ్చ=రావణుండును;క్షితౌ=నేలయందు;తైలసముక్షితః=నూనెచేఁ దడుపఁబడినవాఁడై; రక్తవాసాః=ఎఱ్ఱవస్త్రములుగలవాఁడై; తైలం(అధ్యాహృతము) = నూనెను;పిబన్=త్రాఁగుచు; మత్తః=కైఁపునొం

దినవాఁడై; కరవీరకృతస్రజః = గన్నేరుపూలతోఁ జేయఁబడిన పుష్పమాలికగలవాఁడై; మయా = నాచేత; దృష్టః = చూడఁబడినాఁడు.

రావణుండు, గన్నేరుపూలమాలికనుదాల్చి, దేహమంతయును నూనెనభిషేకించుకొని, యెఱ్ఱనిబట్టలుగట్టుకొని, నూనెంద్రావుచుఁ, గైపునొంది నేలపైనుండుటఁ, జూచినాను. అని, తాత్పర్యము.

విమానాత్పుష్పకా దద్య రావణః పతితో భువి
కృష్యమాణః స్త్రియా దృష్టో ముండః కృష్ణాంబరః పునః. ౨౩

టీక॥ అద్య = ఇప్పుడు; రావణః = రావణుఁడు; పునః = మఱల; పుష్పకాత్ = పుష్పకమనెడు; విమానాత్ = విమానంబునుండి; భువి = నేలయందు; పతితః = పడినవాఁడై; ముండః = జుట్టులేనివాఁడై; కృష్ణాంబరః = నల్లనివస్త్రములు గలవాఁడై; స్త్రియా = స్త్రీచేత; కృష్యమాణః = ఈడ్వఁబడుచున్నవాఁడై; దృష్టః = చూడఁబడినాఁడు.

రావణుండు, మఱల, పుష్పకవిమానంబునుండి నేలంబడి, తలలో జుట్టులేక, నల్లనిబట్టలుగట్టుకొని, యొకయాఁడుదానిచేత నీడ్వఁబడుచున్నట్లు, చూచినాను. అని, తాత్పర్యము.

రథేన ఖరయుక్తేన రక్తమాల్యానులేపనః
పిబంస్తైలం హసన్నృత్యన్ భ్రాంతచిత్తాకులేంద్రియః. ౨౪

టీక॥ రావణః (అధ్యాహృతము) = రావణుఁడు; రక్తమాల్యానులేపనః = ఎఱ్ఱనిపుష్పమాలికలను మైపూఁతయునుగలవాఁడై; తైలం = నూనెను; పిబన్ = త్రాగుచు; హసన్ = నవ్వుచు; నృత్యన్ = ఆడుచు; భ్రాంతచిత్తాకులేంద్రియః = భ్రమమునొందిన మనసుగలవాఁడును గలఁత నొందిన యింద్రియంబులుగలవాఁడునై; ఖరయుక్తేన = గాడిదలతోఁ గూడిన; రథేన = రథముచేత; యయౌ (అధ్యాహృతము) = పోయెను.

మఱియు, రావణుండు, ఎఱ్ఱనిపూలమాలికలను రక్తగంధమునుధరించి, నూనెద్రావుచు నవ్వుచు నర్తనము సేయుచు, భ్రాంతచిత్తుండై యింద్రియం

టుల స్వాధీనతదప్పి , గాడిదలుగట్టి నరథంబునెక్కి, పోవుచుండుటం, జూచినాను. అని, తాత్పర్యము.

గర్దభేన యయౌ శీఘ్రం దక్షిణాం దిశ మాస్థితః

టీక॥ రావణః=రావణుఁడు; దక్షిణాం=దక్షిణవు; దిశం=దిక్కును; ఆస్థితః=అవలంబించినవాఁడై; గర్దభేన=గాడిదచేత; శీఘ్రం=వడిగా; యయౌ=పోయెను.

మఱియు, రావణుండు, గాడిద నెక్కి, దక్షిణపుదిక్కునుబట్టి, శీఘ్రముగాఁబోయెను. అని, తాత్పర్యము.

పునరేవ మయాదృష్టో రావణో రాక్షసేశ్వరః. ౨౫
పతితోఽవాక్ఛిరా భూమౌ గర్దభా ద్భయమోహితః

టీక॥ పునరేవ=మఱలను; రాక్షసేశ్వరః=రాక్షసులకుఁ బ్రభువైన; రావణః=రావణుఁడు; భయమోహితః=భయముచేఁ దెల్వితప్పినవాఁడై, గర్దభాత్=గాడిదనుండి; అవాక్ఛిరాః=క్రిందతలగలవాఁడై, తలక్రిందుగాననుట; భూమౌ=నేలయందు; పతితః=పడినవాఁడై; మయా= నాచేత; దృష్టః=చూడఁబడినాఁడు.

మఱల, రాక్షసేశ్వరుండగు రావణుండు, భయంబున, దేహంబుదెలియక, గాడిదపైనుండి, తలక్రిందుగా నేలంబడుటను, జూచినాను.

అని, తాత్పర్యము.

సహసోత్థాయ సంభ్రాంతో భయార్తో మదవిహ్వలః. ౨౬
ఉన్మత్తఇవ దిగ్వాసా దుర్వాక్యం ప్రలపన్బహు
దుర్గంధం దుస్సహం ఘోరం తిమిరం నరకోపమమ్. ౨౭
మలపంకం ప్రవిశ్యాశు మగ్న స్తత్ర స రావణః

టీక॥ సః=ఆ; రావణః= రావణుఁడు; సహసా=తటాలున; ఉత్థాయ=లేచి; సంభ్రాంతః=తొట్రుపాటుగలవాఁడై; భయార్తః = భయముచేతఁబీడిం

పఁబడినవాఁడై; మదవిహ్వలః=కైపుచే తనవయవంబుల స్వాధీనత దప్పినవాఁడై; ఉన్మత్తఇవ(స్థితః)= పిచ్చిపట్టినట్లున్నవాఁడై; దిగ్వాసాః= దిక్కులె వస్త్రముగాఁగలవాఁడై, వస్త్రమే లేనివాఁడై యనుట; బహు=అధికముగా; దుర్వాక్యం=చెడ్డమాటను; ప్రలపన్= వదరుచు; దుర్గంధం=చెడువాసనగలదియును; దుస్సహం = ఓర్వఁగూడనిదియు; ఘోరం=భయంకరమయినదియు; తిమిరం=చీఁకటిగలదియు; నరకోపమం=నరకముతోఁబోల్కిగలదియునగు; మలపంకం=అమేధ్యముయొక్క బురదను; ఆశు=శీఘ్రముగా; ప్రవిశ్య=చొచ్చి; తత్ర=అందు; మగ్నః=మునిఁగెను.

ఆరావణుండంత, శీఘ్రంబుగా లేచి, తొట్రుపడుచు, భయంబునొంది, మదంబున నవయవంబుల స్వాధీనత దప్పి, పిచ్చిపట్టినట్లు చెప్పరాని దుర్వాక్యంబులు విశేషంబుగాఁ బలుకుచు, శీఘ్రంబుగా, దుర్గంధంబై సహింపనలవిగాక భయంకరంబై యంధకారపూర్ణంబైన నరకంబువలెనుండు, మలపంకంబుఁ జొచ్చి, యందు మునింగెను.

అని, తాత్పర్యము.

కంఠే బద్ధ్వా దశగ్రీవం ప్రమదా రక్తవాసినీ. ౨౮
కాళీ కర్దమలిప్తాంగీ దిశం యామ్యాం ప్రకర్షతి

టీక॥ రక్తవాసినీ=ఎఱ్ఱనివస్త్రముగట్టుకొన్నదియును; కాళీ=బొగ్గువంటిదియును, నల్లనిదియుననుట; కర్దమలిప్తాంగీ= బురదచేఁబూయఁబడిన దేహముగలదియునగు; ప్రమదా=స్త్రీ; దశగ్రీవం=రావణుని; కంఠే = మెడయందు; బద్ధ్వా=కట్టి; యామ్యాం=యమునిదైన; దిశం=దక్షిణపుదిక్కునుగూర్చి; ప్రకర్షతి= (భూతార్థమునందు లట్) ఈడ్చెను.

ఎఱ్ఱబట్టలుగట్టుకొని దేహమంతయు బురదఁబూసికొనియుండు నొక్క నల్లని స్త్రీ, రావణుని, మెడకుఁద్రాడుగట్టి, దక్షిణపుదిక్కునకీడ్చుకొని పోవుచుండెను. అని, తాత్పర్యము.

ఏవం తత్ర మయా దృష్టః కుంభకర్ణో నిశాచరః. ౨౯

టీక॥ ఏవం=ఇట్లు; తత్ర=అచ్చట; నిశాచరః = రాక్షసుండగు; కుంభకర్ణః=కుంభకర్ణుండు; మయా=నాచేత; దృష్టః=చూడఁబడినాఁడు.

అచ్చటఁ, గుంభకర్ణుఁడును, ఈప్రకారముగానే, యుండఁగాఁ, జూచినాను. అని, తాత్పర్యము.

రావణస్య సుతా స్సర్వే దృష్టా స్తైలసముక్షితాః

టీక॥ రావణస్య = రావణునియొక్క; సుతాః=కొడుకులు; సర్వే=అందఱును; తైలసముక్షితాః=నూనెచేఁదడుపఁబడినవారలై; దృష్టాః= చూడఁబడినారు.

రావణునికొడుకు, లందఱు, దేహమంతయు, నూనె నభిషేకించుకొని యుండఁగాఁ, జూచినాను.

అని, తాత్పర్యము.

వరాహేణ దశగ్రీవ శ్శింశుమారేణ చేంద్రజిత్. ౩౦
ఉష్ట్రేణ కుంభకర్ణశ్చ ప్రయాతా దక్షిణాం దిశమ్

టీక॥ దశగ్రీవః=రావణుండు; వరాహేణ=పందిచేతను; ఇంద్రజిత్=ఇంద్రజిత్తు; శింశుమారేణచ= మొసలిచేతను; కుంభకర్ణః=కుంభకర్ణుఁడు; ఉష్ట్రేణచ=ఒంటెచేతను; దక్షిణాం=దక్షిణపు; దిశం=దిక్కునుగూర్చి; ప్రయాతాః=పోయిరి.

రావణుండు పందిని, ఇంద్రజిత్తు మొసలిని, కుంభకర్ణుఁడొంటెను, ఎక్కి, వీరుముగ్గురును, దక్షిణపుదిక్కునుబట్టిపోయిరి. అని, తాత్పర్యము.

ఏక స్తత్ర మయా దృష్ట శ్శ్వేతచ్ఛత్రో విభీషణః. ౩౧
శుక్లమాల్యాంబరధర శ్శుక్లగంధానులేపనః
శంఖదుందుభినిర్ఘోషై నృత్తగీతై రలంకృతః. ౩౨
ఆరుహ్య శైలసంకాశం మేఘస్తనితనిస్స్వనమ్
చతుర్దంతం గజం దివ్య మాస్తే తత్ర విభీషణః. ౩౩
చతుర్భి స్సచివై స్సార్ధం వైహాయస ముపస్థితః

టీక॥ విభీషణః= విభీషణుఁడు ; ఏకః=ఒకఁడుమాత్రము; శ్వేతచ్ఛత్రః = తెల్లనిగొడుగుగలవాఁడై ; శుక్లమాల్యాంబరధరః= తెల్ల విరుప్పమాలికలనువస్త్రములనుధరించినవాఁడై ; శుక్లగంధానులేపనః = తెల్లనిగంధము మైపూఁతగాఁగలవాఁడై; శంఖదుందుభినిర్ఘోషైః= శంఖములయొక్కయు భేరులయొక్కయు ధ్వనులచేతను; నృత్తగీతైః = ఆటలచేతను పాటలచేతను; అలంకృతః=అలంకరింపఁబడినవాఁడై; శైలసంకాశం = పర్వతముతో సమానమయినదియును ; మేఘస్తనితనిస్వనం=మేఘముయొక్కధ్వనివంటిధ్వనిగలదియును; చతుర్దంతం= నాలుగుదంతములుగలదియును; దివ్యం=శ్రేష్ఠమును; వైహాయసం= ఆకాశమునందుసంచరించు నదియునగు; గజం=ఏనుఁగును; చతుర్భిః=నలుగురైన; సచివైస్సార్ధం = మంత్రులతోఁగూడ; ఆరుహ్య=ఎక్కి ; తత్ర=అచ్చట ; ఆస్తే = (భూతార్థమందులట్) ఉండెను. తథా (అధ్యాహృతము)= అట్లు; తత్ర=ఆస్వప్నమునందు;మయా= నాచేత;దృష్టః=చూడఁబడినాఁడు.

అప్పుడు,విభీషణుండొకఁడు మాత్రము, తెల్లపూలమాలికలను ధరించి, తెల్లబట్టలంగట్టుకొని , తెల్లనిగంధంబుంబూసికొని, శంఖధ్వనులును భేరీనాదంబులును జెలంగఁగా, నృత్తగీతంబులతోనొప్పుచుఁ, గొండతోసాటియయినదియు మేఘధ్వనివంటిధ్వని గలదియును నాలుగుదంతములుగలదియు నాకాశంబున సంచరించునదియునగు, దివ్యమయినయేనుంగును,దాను, దనమంత్రులునల్వురునుంగూడి , యారోహించి, యున్నట్టు , చూచినాను.

అని, తాత్పర్యము.

సమాజశ్చ మయా దృష్టో గీతవాదిత్రనిస్స్వనః. ౩౮
పిబతాం రక్తమాల్యానాం రక్షసాం రక్తవాససామ్

టీక॥ మయా= నాచేత;పిబతాం= నూనెనుద్రాగుచుండువారును ; రక్తమాల్యానాం = ఎఱ్ఱనిపూలమాలికలుగలవారలును ; రక్తవాససాం = ఎఱ్ఱనిబట్టలుగలవారలునగు; రక్షసాం = రాక్షసులయొక్క ; గీతవాదిత్రనిస్వనః= పాటలయొక్కయు వాద్యములయొక్కయు ధ్వనిగల; సమాజశ్చ = గుంపును; దృష్టః=చూడబడినది.

మఱియు, నూనెంద్రావుచు నెఱ్ఱని

పూలమాలికలనుధరించి, వెఱ్ఱిబట్టలుగట్టుకొని, పాడుచు వాద్యంబులవాయించుచున్న, రాక్షసులఁజూచినాను.
అని, తాత్పర్యము.

లంకా చేయం పురీ రమ్యా సవాజిరథకుంజరా. ౩౫
సాగరే పతితా దృష్టా భగ్నగోపురతోరణా

టీక॥ రమ్యా=సుందరమయిన; ఇయం=ఈ; లంకా=లంకయను; పురీచ=పట్టణమును; సవాజిరథకుంజరా=గుఱ్ఱములతోను రథములతోను ఏనుఁగులతోను గూడినదై; భగ్నగోపురతోరణా=విఱిగినగవనులును బహిర్ద్వారములునుగలదై; సాగరే=సముద్రమునందు; పతితా=పడినదిగా; దృష్టా=చూడఁబడినది.

రమణీయంబగు నీలంకాపట్టణము, గవనులునుబహిర్ద్వారములును విఱిగి, గుఱ్ఱములతోను రథములతోను ఏనుఁగులతోను, సముద్రంబునందబడినట్లు, చూచినాను. అని, తాత్పర్యము.

లంకా దృష్టా మయా స్వప్నే రావణే నాభిరక్షితా. ౩౬
దగ్ధా రామస్య దూతేన వానరేణ తరస్వినా

టీ॥ రావణేన=రావణునిచేత; అభిరక్షితా=రక్షింపఁబడిన; లంకా=లంక; రామస్య=రామునియొక్క; దూతేన=రాయబారియగు; తరస్వినా=మిక్కిలియుబలముగల; వానరేణ=కోఁతిచేత; దగ్ధా=దహింపఁబడినదై; మయా=నాచేత; స్వప్నే=కలయందు; దృష్టా=చూడఁబడినది.

రావణునిచేత రక్షింపఁబడుచున్నయీలంకను రామునిదూతయయిన బలవంతుండగునొకవానరుండు, దహించినట్లు, స్వప్నంబున, గపడినది.
అని, తాత్పర్యము.

పీత్వా తైలం ప్రనృత్తాశ్చ ప్రహసంత్యో మహాస్వనాః. ౩౭
లంకాయాం భస్మరూక్షాయాం ప్రవిష్టా రాక్షసస్త్రియః

టీక॥ రాక్షసస్త్రియః=రాక్షసస్త్రీలు; తైలం=నూనెను; పీత్వా=

తాః(గిః;ప్రినృత్తాశ్చ = అధికమయిన యాటలుగలవారలై; ప్రహసంత్యః= మిక్కిలినవ్వుచు; మహాస్వనాః= అధికమయినధ్వనిగలవారలై ; భస్మరూషాయాం=భస్మమగుటచేఁ బ్రవేశింపఁగూడని; లంకాయాం= లంకయందు; ప్రవిష్టాః=ప్రవేశించిరి.

రాక్షసస్త్రీలు, నూనెద్రావి, నర్తనముసేయుచు,నవ్వుచు,గట్టిగాఁగేకలువేయుచు, భస్మమాత్రావశిష్టయయిప్రవేశించుటకలవి గాకుండు లంకలోఁ,దిరుగుచుండిరి. అని, తాత్పర్యము.

కుంభకర్ణాదయ శ్చేమే సర్వే రాక్షసపుంగవాః. ౩౮
రక్తం నివసనం గృహ్య ప్రవిష్టా గోమయహ్రదే

టీక॥కుంభకర్ణాదయః= కుంభకర్ణుఁడు మొదలుగాఁగల; ఇమే=ఈ; రాక్షసపుంగవాః= రాక్షసశ్రేష్ఠులు; సర్వేచ=అందఱును; రక్తం= ఎఱ్ఱని; నివసనం=వస్త్రమును; గృహ్య (గృహీత్వా)=గ్రహించి ; గోమయహ్రదే=ఆవుపేడ గుంటయందు ; ప్రవిష్టాః=ప్రవేశించిరి.

కుంభకర్ణుఁడు మొదలుగా మేటి రాక్షసులందఱు , ఎఱ్ఱనివస్త్రములు గట్టుకొని, పేఁడగుంటలోఁబడి మునింగిరి, అని, తాత్పర్యము.

అపగచ్ఛత నశ్యధ్వం సీతా మాప స రాఘవః. ౩౯
ఘాతయే త్పరమామర్షీ సర్వై స్సార్థంహి రాక్షసైః

టీక॥ యూయం ( అధ్యాహృతము)=మీరలు;అపగచ్ఛత=తొలఁగిపొండు;నశ్యధ్వం=నశింతురు.సః=ఆ; రాఘవః=రాముఁడు;సీతాం = సీతను;ఆప=పొందినాఁడు, పొందినట్లెయనుట. పరమామర్షీ= అధికమయినకోపముగలవాఁడై; సర్వైః= సమస్తులయిన; రాక్షసైస్సార్థం= రాక్షసులతోఁగూడ;ఘాతయేద్ధి = చంపునుగదా!

మీరలవ్వలికిఁబొండు;అట్లుచేయరేని,నాశంబునొందుదురు;రాముండు, సీతంబొంది నట్లెకాని వేఱుకాదు. రాక్షసుల యందఱితో, మిమ్ముం జంపును,

అని,తాత్పర్యము.

ప్రియాం బహుమతాంభార్యాం వనవాస మనువ్రతామ్. ౪౦

భర్త్సితాం తర్జితాంవాపి నానుమంస్యతి రాఘవః

టీక॥ప్రియాం=ప్రియురాలును; బహుమతాం = గౌరవింపఁబడినదియును;వనవాసం= అరణ్యంబులోనుండుటను;అనువ్రతాం= అనుసరించినదియునగు;భార్యాం = భార్యను; భర్త్సితాం= నిందింపఁబడినదానిఁగాఁగాని; తర్జితాంవాపి=బెదరింపఁబడినదానిఁగాఁగాని;రాఘవః=రాముఁడు; నానుమంస్యతి=ఒప్పఁడు.

ప్రియురాలును బహుమానంబు నొందియున్నదియును వనంబునకుంగూడ వెంబడించి వచ్చినదియునగు, భార్యను,నిందించినను,బెదరించినను,రాముఁడెంతమాత్రము, సహించియుండఁడు. అని, తాత్పర్యము.

తదలం క్రూరవాక్యైర్వః సాంత్వమేవాభిధీయతామ్. ౪౧

టీక॥తత్=అందువలన;వః=మీయొక్క;క్రూరవాక్యైః= కఠినములగుమాటలచేత;అలం = చాలును.సాంత్వమేవ=మంచిమాటయే;అభిధీయతాం=చెప్పఁబడుఁగాక.

అట్లుకావున, మీకఠినవచనంబులవిడువుఁడు; మంచిమాటగానే,చెప్పుఁడు. అని, తాత్పర్యము.

అభియాచామ వైదేహీ మేతద్ధి మమ రోచతే

టీక॥వైదేహీం = సీతను;అభియాచామ=ప్రార్థింపుదము.ఏతద్ధి = ఇదియే;మమ=నాకు;రోచతే = రుచించుచున్నది.

సీతను , "అభయంబొసంగు" మని ప్రార్థింపుదము; ఇదినాయభిప్రాయము. అని, తాత్పర్యము.

యస్యామేవం విధ స్స్వప్నో దుఃఖితాయాం ప్రదృశ్యతే. ౪౨
సా దుఃఖై ర్వివిధై ర్ముక్తా ప్రియం ప్రాప్నో త్యనుత్తమమ్

టీక॥యస్యాం = ఏస్త్రీ;దుఃఖితాయాం= దుఃఖమునొందియుండఁగా; ఏ

వంశధః=ఇష్టిః స్వప్నః=కల; ప్రదృశ్యతే=చూడఁబడుచున్నదో; సా=ఆస్త్రీ; వివిధైః = నానావిధంబులయిన; దుఃఖైః=దుఃఖములచేతను; ముక్తా = విడువఁబడినదై; అనుత్తమం= తనకన్నను త్తమములేని; ప్రియం=సంతోషమును; ప్రాప్నోతి=పొందుచున్నది.

ఏ స్త్రీయయిన, దుఃఖమునొందియుండఁగా, నిట్టిస్వప్నముగలుగునేని, ఆస్త్రీ, దుఃఖములన్నియువిడిచి, సరిలేని సంతోషమునొందును; కావున, ఈసీత, దుఃఖముతోనుండఁగా, నాకీస్వప్నముగలిగినది, కాఁబట్టి, ఈ, సీత, దుఃఖములన్నియుఁబోయి, పరమసంతోషమునొందఁగలదు.

అని, తాత్పర్యము.

భర్త్సితామపి యాచధ్వం రాక్షస్యః కిం వివక్షయా. ౪౩

టీక॥ రాక్షస్యః= రాక్షసస్త్రీలారా! వివక్షయా= చెప్పఁ గోరుటచేత, సందేహముచేతఁజెప్పక, చెప్పుటకుఁ గోరుచుమాత్రముండుటచేత ; కిం= ఏమిప్రయోజనము? భర్త్సితామపి= నిందింపఁబడినదైనను; సీతాం(అధ్యాహృతము) = సీతను; యాచధ్వం= ప్రార్థించుఁడు.

రాక్షసస్త్రీలారా! "మనమట్లునిందించియున్నామే, మనయందిబిడకనుగ్రహముగల్గునా" అనిసందేహించుచుండవలదు; మీరలీసీతను ప్రార్థించుఁడు; మీయందిబిడకనుగ్రహముగల్గును.

అని, తాత్పర్యము.

రాఘవాద్ధి భయం ఘోరం రాక్షసానా ముపస్థితమ్

టీక॥ రాఘవాత్ = రామునివలన; రాక్షసానాం= రాక్షసులకు ; ఘోరం=భయంకరమయిన; భయం= ఆపద; ఉపస్థితం= సమీపించినదిగదా?

ఇంక, శీఘ్రముగనే, రామునివలన, రాక్షసులకందఱకుమహాభయంబు వాటిల్లును. అని, తాత్పర్యము.

ప్రణిపాత ప్రసన్నాహి మైథిలీ జనకాత్మజా. ౪౪
అలమేషా పరిత్రాతుం రాక్షస్యో మహతో భయాత్

టీక॥ రాక్షస్యః = రాక్షసస్త్రీలారా! జనకాత్మజా = జనకుని కూఁతు

రయిన; ఏషా=ఈ; మైథిలీ=సీత; ప్రణిపాతప్రసన్నా = నమస్కారముచేత సంతసించినదై; మహతః=గొప్పదైన; భయాత్ = భయము నుండి; పరిత్రాతుం=రక్షించుటకు; అలంహి=సమర్థురాలుగదా!

రాక్షసస్త్రీలారా! జనకునికూఁతురయిన ఈసీతమాత్రమె, మీనమస్కారమునకుఁ బ్రసన్నయయి, యింకరామునివలనమీకుఁ గలుగఁబోవు భయంబుఁ, బోఁగొట్టఁజాలును.

అని, తాత్పర్యము.

అపిచాస్యా విశాలాక్ష్యా న కించి దుపలక్షయే. ౪౫
విరూప మపిచాంగేషు సుసూక్ష్మమపి లక్షణమ్

టీక॥ అపిచ=ఇదిగాక; విశాలాక్ష్యాః=వెడల్పులయినకండ్లుగలసీతాదేవియొక్క; అంగేషు = అవయవములందు; విరూపమపి= వికృతరూపమునైనను; సుసూక్ష్మం = మిక్కిలియుసూక్ష్మమయిన; లక్షణమపి=సాముద్రికలక్షణమునైనను;కించిత్ = కొంచెమైనను;నోపలక్షయే=చూడను.

ఇదిగాక, విశాలంబులగుకండ్లుగలయాసీతాదేవి యంగంబులందు, దుఃఖమునొందించునట్టి,లక్షణముగాని,అంగవైకల్యముగాని,కొంచెమయినను,నాకగపడలేదు. అని, తాత్పర్యము.

ఛాయావైగుణ్యమాత్రంతు శంకే దుఃఖ ముపస్థితమ్. ౪౬
అదుఃఖార్హా మిమాందేవీం వైహాయస ముపస్థితామ్

టీక॥ఛాయావైగుణ్యమాత్రంతు= కాంతివైకల్యమునుమాత్రము; ఉపలక్షయే(అధ్యాహృతము)= చూచుచున్నాను. అతః(అధ్యాహృతము)= దీనివలన; అదుఃఖార్హాం = దుఃఖమునకుఁదగనిదియు; వైహాయసం=విమానమును; ఉపస్థితాం=పొందినదియునగు, దివ్యభోగంబులనుభవింపఁ దగినదియునగునను ట;ఇమాం=ఈ;దేవీం = సీతాదేవిని; దుఃఖం=దుఃఖము; ఉపస్థితం=పొందినది.ఇతి(అధ్యాహృతము)=అని; శంకే=సందేహించుచున్నాను.

ఈవిడదేహంబునందలి కాంతిమాత్రముకొంచెముమాఱియున్నది; దీనిచేతనే, దుఃఖమునకుఁదగనిదియునుదివ్యభోగంబులనుభవింపందగినదియునగుసీ

తా॥ దేవి, శీఘ్రముగఁ గ్గినదనితలంచుచున్నాను. అని, తాత్పర్యము.

అర్థసిద్ధింతు వైదేహ్యాః పశ్యామ్యహ ముపస్థితామ్. ౪౭
రాక్షసేంద్రవినాశంచ విజయం రాఘవస్యచ

టీక॥ అహం=నేను; రాక్షసేంద్రవినాశంచ=రాక్షసులకుఁ బ్రభువైనరావణునివినాశమును; రాఘవస్య=రామునియొక్క; జయంచ=గెల్పును; ఏతాం=ఈ; వైదేహ్యాః=సీతయొక్క; అర్థసిద్ధిం=కార్యసిద్ధిని; ఉపస్థితాంతు = సమీపించినదానిఁగానే; పశ్యామి=చూచెదను.

రాక్షసేశ్వరుండగు రావణుండునశించుటయు, రామునకువిజయంబుగలుగుటయు, ఇట్లు, ఈసీతాదేవియభీష్టసిద్ధి, శీఘ్రముగానే, యగు, నని, తలంచెదను. అని, తాత్పర్యము.

నిమిత్తభూత మేతత్తు శ్రోతు మస్యా మహ త్ప్రియమ్. ౪౮

టీక ॥ ఏతత్తు = ఈస్వప్నమె; అస్యాః=ఈసీతయొక్క; మహత్=గొప్పదైన; ప్రియం=సంతోషమును; శ్రోతుం=వినుటకు; నిమిత్తభూతం=సూచకమయినది.

ఈస్వప్నము, ఈసీతాదేవికి మహాసంతోషంబుగలుగుటను, మనము వినంగలమని, సూచించుచున్నది.

అని, తాత్పర్యము.

దృశ్యతేచ స్ఫుర చ్చక్షుః పద్మపత్ర మివాయతమ్

టీక॥ పద్మపత్రమివ=తామరపూరేకువలె; ఆయతం = దీర్ఘమయిన; చక్షుశ్చ=కన్నును; స్ఫురత్=అదరుచు; దృశ్యతే=చూడఁబడుచున్నది.

మఱియుఁ దామరపూరేకుఁబోలె విశాలమయిన యీసీతాదేవి యెడమకన్నుస్ఫురించుచున్నది.

అని, తాత్పర్యము.

ఈషచ్చ హృషితో వాస్యా దక్షిణాయా హ్యదక్షిణః. ౪౯
అకస్మాదేవ వైదేహ్యా బాహురేకః ప్రకంపతే




టీక॥దక్షిణాయాః = సమర్థురాలయగు; అస్యాః=ఈ; వైదేహ్యాః= సీతయొక్క; అదక్షిణః=ఎడమదైన; బాహుశ్చ=భుజమును; ఏకః=ఒకటి; ఈషత్ =కొంచెము;హృషితోవ (స్థితః)=గగుర్పాటుగొనినదివలెనున్నదై; అకస్మాదేవ = కారణములేకనె ; ప్రకంపతే=వణఁకుచున్నది.

సమర్థురాలయిన , యీసీతాదేవియెడమభుజమును, గొంచెము గగుర్పాటుగొనినట్లుగనుఁపట్టుచు, నిష్కారణముగా, వడఁకుచున్నది.

అని, తాత్పర్యము.

కరేణుహస్తప్రతిమ స్సవ్య శ్చోరు రనుత్తమః. ౫౦
వేపమాన స్సూచయతి రాఘవం పురతస్స్థితమ్

టీక॥కరేణుహస్తప్రతిమః= ఆఁడేనుంగుతొండముతోఁ బోల్కిగలదియు, అనుత్తమః= తనకన్న శ్రేష్ఠములేనిదియునగు; సవ్యః=ఎడమదైన ; ఊరుశ్చ=తొడయును; వేపమానః= వడంకుచు; రాఘవం= రాముని;పురతః= ముందట; స్థితం=ఉన్నవానిఁగా; సూచయతి=తెల్పుచున్నది.

ఆఁడేనుంగు తొండమువంటిదియు నుత్తమంబునగునీసీతాదేవియెడమతొడవడఁకుచున్నది, కావున,రాముండు శీఘ్రముగానిచ్చటికివచ్చునని, తెలియవచ్చుచున్నది. అని, తాత్పర్యము.

పక్షీచశాఖా నిలయం ప్రవిష్టః
("పక్షీచశాఖా నిలయః ప్రహృష్టః" ఇతిపాఠాంతరం.)
పునఃపున శ్చోత్తమ సాంత్వవాదీ. ౫౧
సుస్వాగతాం వాచ ముదీరయానః
పునఃపున శ్చోదయతీవ హృష్టః

టీక॥పక్షీచ = పింగళపక్షియును; శాఖానిలయం=చెట్టుకొమ్మయనుస్థానంబును;ప్రవిష్టః=పొందినదై;పునఃపునశ్చ = మాటిమాటికిని;ఉత్తమసాంత్వవాదీ=మిక్కిలియునధికమయినమధురవచనమును చెప్పుచున్నదై; సుస్వాగతాం= మంగళకరమయినబంధువుయొక్కవచ్చుటనుగుఱించిన; వాచం=మా




టను; ఉదీరయానః = చెప్పుచు; పునః పునః = మాటిమాటికి, హృష్టః = సంతోషించినదై; చోదయతీవ = తెల్పుచున్నట్లున్నది.

పింగళపక్షి, చెట్టుకొమ్మపైఁ గూచుండి, పలుమాఱు మధురంబుగాఁ గూయుచు, బంధువు రాకను దెల్పుచు, "రాముండు, శీఘ్రముగా వచ్చును" అని, చెప్పనట్లున్నది. అని, తాత్పర్యము.

లేక; పక్షీచ = మంచిఱెక్కలుగల గరుత్మంతుండును; ("ఱెక్కలుగల గరుత్మండ"నుటచే, "ఱెక్కల"నుపిదిప్పుకొని ప్రదక్షిణంబుగాఁ దిరిగిన వాఁడని సూచింపఁబడుచున్నది) శాఖానిలయం, కొమ్మయనుస్థానంబును; ప్రవిష్టః = పొందినవాఁడై; హృష్టః = సంతసించినవాఁడై; పునః పునశ్చ = మాటిమాటికిని; ఉత్తమసాంత్వవాదీ = ఉత్తమమయిన మధురవాక్యమును జెప్పుచున్నవాఁడై; సుస్వాగతాం = మిక్కిలియొప్పు మంగళకరమయిన; వాచం = మాటను; ఉదీరయానః = చెప్పుచు; పునః పునః = మాటిమాటికి; చోదయతీవ = ప్రేరేపించుచున్నట్లున్నది.

గరుడపక్షియు, ఱెక్కలువిదిచుకొని, ప్రదక్షిణంబుగాఁ దిరిగి చెట్టుకొమ్మపైఁ గూచుండి, మధురంబుగాఁ గూయుచు, రాముని రాకం దెలుపుచు, నింక దుఃఖింపకుమని, ప్రేరేపించునట్లున్నది. అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఈ రామాయణము ఉత్తమకావ్యము; వ్యంగ్యము ప్రధానముగాఁ గలదియుత్తమము; వ్యంగ్యము, పదగతమనియు, వాక్యగతమనియుఁ బ్రబంధగతమనియు, మూఁడువిధములు. అందు, ఈ సుందరకాండంబను ప్రబంధంబున, సహాది భగవత్సంబంధంబుగల చేతనుని యుజ్జీవనార్థము, యాచార్యుని ప్రవృత్తి, వ్యంజితమగుచున్నది. ఈయర్థము "తతో రావణనీతాయాః" అను మొదటి శ్లోకంబునం జెప్పఁబడియున్నది. ఇచ్చట, లంకాశబ్దముచేతను, దేహము సూచింపఁబడుచున్నది. అట్లు, "ఏకాక్షీ" మొదలగు శబ్దములచేత నింద్రియంబులును, రావణకుంభకర్ణులచేత, నహంకారమమకారములును ఇంద్రజిత్తు మొదలగువారిచేత కామక్రోధాదులును సూచింపఁ బడుచున్నవి. దేహంబునందు నిరోధింపఁబడియుండు చేతనుండు, లంకయందు నిరుద్ధయైన సీతవంటివాఁడు; అతనికి జ్ఞానోపదేశంబు సేయు నాచార్యునికి సమానుండు, హనుమంతుండు. ఆయాచార్యలక్షణము, ఈశ్లోకంబుచే,

సూచింపఁబడుచున్నది. పక్షీ = పక్షములుగలవాఁడు, పక్షములు గమనసాధనములుగావున, పక్షశబ్దముచేతనిచ్చట , జ్ఞానకర్మములు చెప్పఁబడుచున్నవి ; అట్లు "ఉభాభ్యామేవ పక్షాభ్యాం యథా ఖే పక్షిణాం గతిః, తథైవ జ్ఞానకర్మభ్యాం నియతా పరమా గతిః" (ఎట్లు పక్షులకు ఱెక్కలు రెండిటిచేతనే గమనముగలుగుచున్నదో, అట్లు పురుషునకు, జ్ఞానకర్మంబులు రెండిటిచేతనే పరమగతిగలుగును) అని , చెప్పబడియున్నది; జ్ఞానకర్మంబులుగలవాఁడు, శాస్త్రార్థము దెలిసియాచరించువాఁడనుట, దీనిచేత, "ఆచినోతిహిశాస్త్రార్థానాచారేస్థాపయత్యపి , స్వయమాచరతే యస్మాత్తస్మాదాచార్యఉచ్యతే" (శాస్త్రములను దెలిసికొనును; ఆచారములో స్థాపించును, తానును; ఆచరించును, గావున, ఆచార్యుఁడనంబడును ) అను నాచార్యశబ్దార్థము , చెప్పఁబడుచున్నది. శాఖానిలయః, శాఖా— వేదశాఖలు, నిలయః— ఉనికిపట్టుగాఁగలవాఁడు , వేదతత్పరుఁడు, వేదములధ్యయనముచేసి, విడుచువానికి "అధీతమపి యో వేదం విముంచతి నరాధమః, భ్రూణహా స తు విజ్ఞేయో వియోనిమధిగచ్ఛతి" (ఏ నరాధముండు, అధ్యయనము చేసిన వేదమును గూడ విడుచునో, అతండు, భ్రూణహత్యాదోషముగలవాఁడని యెఱుంగనది, అతండు, పక్షియోనిం బుట్టును) అని, ప్రత్యవాయము చెప్పఁబడియుండుటవలన, వేదములను విడువనివాఁడనుట; మఱియు, "శాఖానిలయః" వేదతత్పరుండనుటచే , వేదములోఁ జెప్పఁబడిన యర్థము లనుష్ఠించు వాఁడనియు సూచింపఁబడుచున్నది. దీనివలన , " ఆచార్యో వేద సంపన్నో విష్ణుభక్తో విమత్సరః, మంత్రజ్ఞో మంత్రభక్తశ్చ సదా మంత్రాశ్రయస్సుచిః, గురుభక్తిసమాయుక్తః పురాణజ్ఞో విశేషతః, ఏవంలక్షణ సంపన్నో గురురిత్యభిధీయతే" (వేదములు దెలిసిన వాఁడును విష్ణుభక్తిగలవాఁడును మాత్సర్యముగలవాఁడును మంత్రంబులు దెలిసిన వాఁడును, మంత్రభక్తిగలవాఁడును మంత్రంబులనాశ్రయించినవాఁడును బరిశుద్ధుండును గురుభక్తిగలవాఁడును , విశేషించి పురాణంబులు దెలిసినవాఁడును, ఇట్టి లక్షణంబులుగలవాఁడాచార్యుఁ డనఁబడును.) అను నాచార్యలక్షణము , చెప్పఁబడుచున్నది. ప్రహృష్టః (అని, పాఠాంతరము.)— మిక్కిలియు సంతోషించినవాఁడు, ఇందుచేత, నెల్లప్పుడును సేవింపఁదగి యుండుట సూచింపఁ




బడినది. అట్లు, "ఆహ్లాదవశీతనేత్రాంబుః పులకీకృతగాత్రవాన్, సదాపరగుణావిష్టో ద్రష్టవ్యస్సర్వదేహిభిః" (సంతోషంబునఁగలిగినచల్లని కన్నీరుగలిగి, గగుర్పొడిచిన దేహంబుగలిగి, యెల్లప్పుడును త్తమగుణంబులంబొంది, యుండువాఁడు, అందఱిచేతనుం, జూడఁదగు.) అని, చెప్పఁబడియున్నది. పునఃపునశ్చ= మాటిమాటికిని; ఉత్తమసాంత్వవాది, ఉత్తమ= "ఉత్తమఃపురుషస్త్వన్యఃపరమాత్మేత్యుదాహృతః" (ఇతరుండుత్తమపురుషుండు, పరమాత్మయని చెప్పఁబడినవాఁడు) అని, చెప్పఁబడెడుపరమాత్మనుగురించిన, సాంత్వ=మంచిమాటను; వాదీ=శిష్యులకుఁ జెప్పువాఁడు. "మాటిమాటికిని" అనుటచేఁ, "కృషిసేయువాఁడుభూమిఫలింపకున్నను కృషిసివదలక, మాటిమాటికిఁ జేయుచుండునట్లు, ఆచార్యుండును, దానుజెప్పినదిశిష్యులు తెలిసికొనకున్నను, ఉపదేశించుటనువదలక, మాటిమాటికిని నుపదేశించుచునే యుండును" అని సూచితమగుచున్నది. ఇందుచేత, భగవంతునికన్న నాచార్యుండెయధికుండని చెప్పఁబడుచున్నది. భగవంతుండు, అర్జుననకుంగీతనుపదేశించి యతండు దానిమఱచిమఱలనడుగఁగా, "నూనమశ్రద్దధానోసిదుర్మేధాహ్యసిపాండవ" (సత్యముగా నీకుశ్రద్ధలేదు, దుర్బుద్ధియునీకుఁ గలిగియున్నది) అని, నిందించినాఁడు. సుస్వాగతాం=సత్సంప్రదాయానుగతమయిన; వాచం = మంత్రరూపమయిన వాక్కును; ఉదీరయానః = చెప్పుచు, శిష్యులకుపదేశించుచు "సత్సంప్రదాయానుగతమయిన" యనుటచేత, గురుపరంపరయవశ్యముస్మరింప వలసినదని సూచింపఁబడుచున్నది. పునఃపునశ్చోదయతీవ ("ఇవ" అనునది వాక్యాలంకారము)=మాటిమాటికిని ప్రేరేపించు నట్లున్నాఁడు, ఉపదేశింపఁబడిన యర్థము విడువకచక్కఁగా ననుష్ఠించుటకై, మాటిమాటికిని ప్రేరేపించువాఁడనుట. అట్లు. "స్థాలిత్యే శాసితారం" (శిష్యుండు, తనకుగురుండుపదేశించినమంత్రమునువిడిచినచో. గురునకుదోషముగల్గును) అని, శిష్యుని, ప్రేరంపవలసినట్లు చెప్పఁబడియున్నది. హృష్టః = సంతసించిన వాఁడు) ఇందుచేత, శిష్యునకు జ్ఞానసంపత్తియె యాచార్యునకుముఖ్యప్రయోజనమని సూచితమగుచున్నది.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,




సుందరకాండే, సప్తవింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర

వ్యాఖ్యానంబునందు, సుందరకాండసప్తవింశసర్గటీక,

ముగిసినది.



శ్రీ

అష్టావింశసర్గప్రారంభః.

సా రాక్షసేంద్రస్య వచో నిశమ్య
తద్రావణస్యాప్రియమప్రియార్తా
సీతా వితత్రాస యథా వనాంతే
సింహాభిపన్నా గజరాజకన్యా. ౧

టీక॥ సా=ఆ; సీతా — సీత; రాక్షసేంద్రస్య — రాక్షసులకుఁ బ్రభువైన; రావణస్య = రావణునియొక్క; అప్రియం — దుఃఖకరమయిన; తత్ = ఆ; వచనం — మాటను; నిశమ్య = విని; అప్రియార్తా = దుఃఖముచేఁ బీడింపఁబడినదై; వనాంతే — అడవినడుమునందు; సింహాభిపన్నా = సింహముచేఁబట్టుకొనఁబడిన; గజరాజకన్యాయథా — ఆఁడుగజశ్రేష్ఠముంబోలె; వితత్రాస = భయపడెను.

ఆసీత, రాక్షసేశ్వరుండగు రావణుండు చెప్పినయీయప్రియవచనంబువిని, మహాదుఃఖంబునొంది, యడవినడుమ సింహంబుచేతిలోఁ జిక్కినయాఁడేనుఁగుంబోలె, మహాభయంబునొందెను.

అని, తాత్పర్యము.

సా రాక్షసీమధ్యగతా చ భీరు
ర్వాగ్భిర్భృశం రావణతర్జితా చ
కాంతారమధ్యే విజనే విసృష్టా

బాలేవ కన్యా విలలాప సీతా. ౨

టీక॥ భీరుః = భయపడుస్వభావముగల; సా=ఆ; సీతా=సీత; రాక్షసీమధ్యగతాచ = రాక్షసస్త్రీల నడుమునొందినదియునై; వాగ్భిః = మాటలచేత; భృశం=మిక్కిలియు; రావణతర్జితాచ=రావణునిచే బెదరింపఁబడినదియునై; విజనే=జనులులేని; కాంతారమధ్యే=అడవిమధ్యప్రదేశమునందు; విసృష్టా=విడువఁబడిన; బాలా=చిన్నదగు; కన్యేవ=పడుచువలె; విలలాప=ఏడ్చెను.

భయపడు స్వభావముగల యాసీతాదేవి, రాక్షసస్త్రీల నడుమంజిక్కి, రావణుని బెదరింపులకుభయపడి, విజనంబగునడవినడుమనొంటిగాఁ జిక్కినచిన్నకన్నియయుంబోలె, నేడ్చినది, అని, తాత్పర్యము.

సత్యం బతేదం ప్రవదంతి లోకే
నాకాలమృత్యు ర్భవతీతి సంతః
యత్రాహ మేవం పరిభర్త్స్యమానా
జీవామి కించి త్క్షణ మప్యపుణ్యా. ౩

టీక॥ యత్ర=ఎందుచేత; అపుణ్యా=పుణ్యములేనిదానన గు; అహం=నేను; ఏవం=ఇట్లు; పరిభర్త్స్యమానా=నిందింపఁబడుచున్నదాననై; క్షణమపి=క్షణకాలమయినను; కించిత్ = కుత్సితముగా; జీవామి=బ్రతికియున్నానో; తేన (అధ్యాహృతము)=అందుచేత; "సంతః=పెద్దలు; అకాలమృత్యుః= అకాలమునందుమృత్యువు; నభవతి=కలుగదు; ఇతి=అని; ప్రవదంతి"=చెప్పుచున్నారు; ఇదం=ఈమాట; సత్యం= సత్యము. బత=అయ్యో!

నే, నిట్లునిందింపఁబడుచున్నాననయ్యుఁ, బ్రాణంబులువిడువలేకస్వల్పకాలమైనను, గుత్సితముగాబ్రతికి యున్నాను; గావున, నకాలంబునమృత్యువుగల్గదని, పెద్దలు చెప్పుమాటసత్యమే; అయ్యో! అని, తాత్పర్యము.

సుఖా ద్విహీనం బహుదుఃఖపూర్ణ
మిదంతు నూనం హృదయం స్థిరం మే

విశీర్యతే యన్న సహస్రధాద్య
వజ్రాహతం శృంగమివాఽచలస్య. ౪

టీక॥ యత్=ఎందువలన; సుఖాత్=సుఖమువలన; విహీనం=విడువఁబడినదియును; బహుదుఃఖపూర్ణం=అధికమైనదుఃఖముచేనిండినదియునగు; మే=నాయొక్క; ఇదం = ఈ; హృదయం తు=మనసుమాత్రము; అద్య = ఇప్పుడు; వజ్రాహతం= వజ్రముచేతఁగొట్టఁబడిన; అచలస్య = పర్వతముయొక్క; శృంగమివ = శిఖరముఁబోలె; సహస్రధా= వేయిపఱియలై; నవిశీర్యతే= పగులకున్నదో, తత్ (అధ్యాహృతము)= అందువలన; స్థిరం=చలనములేనిది. నూనం=నిశ్చయము.

ఎంతమాత్రము సుఖములేక మహాదుఃఖమునొందియుండు, నాహృదయము, ఇట్టియవస్థయందును, వజ్రాయుధము వ్రేటునకుఁ బగులుపర్వత శిఖముంబోలె, వేయిపఱియలుగాఁబగలకున్నదిగావున, ఇదిస్థిరము; ఈమాటనిశ్చయము. అని, తాత్పర్యము.

నైవాస్తి దోషం మమ నూన మత్ర
వధ్యాహ మస్యాఽప్రియదర్శనస్య
భావం నచాస్యాహ మనుప్రదాతు
మలం ద్విజో మంత్ర మివాఽద్విజాయ. ౫

టీక॥ అత్ర = ఈస్వహత్యయందు; మమ=నాకు ; దోషం (దోషః) = దోషము; నైవాస్తి = లేనేలేదు. నూనం=నిశ్చయము- యతః(అధ్యాహృతము)=ఎందువలన; అహం=నేను; అప్రియదర్శనస్య=రోఁతగలిగించుచూచుటగల; అస్య=ఈరావణునకు; వధ్యా= చంపఁదగినదాననో. అహం=నేను; ద్విజః=బ్రాహ్మణుఁడు; అద్విజాయ= శూద్రునికొఱకు; మంత్రమివ=వేదమంత్రమునుంబోలె; అస్య = ఈరావణునకు; భావం=మనసును; అనుప్రదాతుంచ= ఇచ్చుటకును; నాలం = సమర్థురాలనుగాను.

చూపరులకు రోఁతగలిగించు నట్టి రావణుండు నన్నెట్లైనను జంపుటకె

యున్నాఁడు; అవియు దుర్మరణం బెయ్యగుచున్నది; కావున నే నిప్పుడు నాప్రాణంబుల విడుచుటయందు, నాకేమియు నధికదోషంబు లేదు; ఇది నిశ్చయము; అయితే, అతని ననుసరించియే ప్రాణంబులుగా పాడుకొని దోషంబె లేకుండ నుండవచ్చునే యని యన్నచో, బ్రాహ్మణుండు వేదమంత్రమును శూద్రునికి వ్యాజాలసట్లు, నేను నామనసును, ఈ రావణునకెంత మాత్రము, నివ్వఁజాలను.

అని, తాత్పర్యము.

నూనం మమాంగాన్యచిరాదనార్య
శ్శస్త్రైశ్శితై శ్ఛేత్స్యతి రాక్షసేంద్రః
తస్మిన్ననాగచ్ఛతి లోకనాథే
గర్భస్థజంతోరివ శల్యకృన్తః. ౬

టీక॥ లోకనాథే = ప్రపంచమునకుఁ బ్రభువయిన; తస్మిన్ = ఆ రాముఁడు; అనాగచ్ఛతి = రాకుండఁగా; అనార్యః = దుష్టుఁడయిన; రాక్షసేంద్రః = రాక్షసులకుఁ బ్రభువైన రావణుండు; అచిరాత్ = శీఘ్రముగా; శల్యకృన్తః = మంగలవాఁడు; గర్భస్థజంతోరివ = గర్భములోనుండుబిడ్డయొక్క పలె; మమ = నాయొక్క; అంగాని = అవయవములను; శితైః = కఱకుగల; శస్త్రైః = ఆయుధముల చేత; ఛేత్స్యతి = నఱకును. నూనం = నిశ్చయము.

ఈ రెండుమాసంబులలోపల, లోకనాథుండగు రాముం డిచ్చటికి రాకుండునేని, గర్భంబులోఁ జచ్చిన శిశువును మంగలవాఁడు వెలికిఁ దీయుటకై తునకలుగా ఛేదించునట్లు, దుష్టుఁడగు రావణుండు, నన్ను, కఱకుగల యాయుధముల చేఁ దుండుతుండుగా, ఛేదించును.

అని, తాత్పర్యము.

దుఃఖం బతేదం మమ దుఃఖితాయా
మాసౌ చిరాయాధిగమిష్యతో ద్వౌ
బద్ధస్య వధ్యస్య తథా నిశాంతే
రాజాపరాధాదివ తస్కరస్య. ౭




టీక॥ మాసౌ=మాసములు; ద్వౌ=రెండును; అధిగమిష్యతః = కడవఁగలవు. రాజాపరాధస్య= రాజునకుఁ జేసిన యపరాధమువలన; బద్ధస్య=కట్టఁబడిన వాఁడును; తథా = అట్లు; నిశాంతే= ప్రాతఃకాలమునందు; వధ్యస్య=చంపఁదగినవాఁడునగు; తస్కరస్యేవ=దొంగకుంబోలె; చిరాయ = బహుకాలముగా; దుఃఖితాయాః = దుఃఖము నొందియున్న; మమ=నాకు; ఇదం = ఈ; దుఃఖం=దుఃఖము; ఆగతం (అధ్యాహృతము)=సంభవించినది. బత = అయ్యో!

ఇంక నీ రెండుమాసములును శీఘ్రముగా నేముగియును; అయ్యో! రాజుపట్లనపరాధంబు సేయుటవలన బద్ధుండై తెల్లవాఱినంతనె చంపఁబడుట కున్న దొంగకుం గల్గు దుఃఖమిప్పుడు నాకుఁ బ్రాప్తమయినది. అని, తాత్పర్యము.

హా రామ హా లక్ష్మణ హా సుమిత్రే
హా రామమాత స్సహ మే జనన్యా
ఏషా విపద్యామ్య హ మల్పభాగ్యా
మహార్ణవే నౌరివ మూఢవాతా. ౮

టీక॥ హా రామ = అయ్యో రాముఁడా! హా లక్ష్మణ=అయ్యో లక్ష్మణుఁడా! హా సుమిత్రే=అయ్యో సుమిత్రా! మే= నాయొక్క; జనన్యాసహ= తల్లితోఁ గూడ; స్థితే(అధ్యాహృతము)= ఉన్న; హా రామమాతః= అయ్యో రాముని తల్లి వగు కౌసల్యా! అల్పభాగ్యా=కొంచెమయిన భాగ్యము గల; ఏషా = ఈ; అహం=నేను; మహార్ణవే= గొప్పసముద్రంబునందు; మూఢవాతా=సుడిగాలి గల; నౌరివ=ఓడయుంబోలె; విపద్యామి=ఆపదనుబొందుచున్నాను.

అయ్యో రాముఁడా! లక్ష్మణుఁడా! సుమిత్రా! తల్లీ! రామునిఁగన్నతల్లివయిన కౌసల్యా! అల్పభాగ్యనగు నేను, సముద్రమధ్యంబున సుడిగాలివలన నశించు నోడయుంబోలె, ఇచ్చట నాశంబునొందుచున్నాను. అని, తాత్పర్యము.

తరస్వినా ధారయతా మృగస్య
సత్త్వేన రూపం మనుజేంద్ర పుత్రౌ
నూనం విశస్తౌ మమ కారణాత్తౌ




సింహర్షభౌ ద్వావివ వైద్యుతేన. ౯

టీక॥ మృగస్య=జింకయొక్క; రూపం=రూపమును; ధారయతా=ధరించుచున్న; సత్త్వేన=జంతువుచేత; తరస్వినౌ=బలవంతులయిన; తౌ=ఆ; మనుజేంద్రపుత్రౌ=రాచకొమరులయిన, రామలక్ష్మణులు; మమ=నాయొక్క; కారణాత్=కారణమువలన; సింహర్షభౌ=సింహములును వృషభములును; ద్వౌ=రెండు; వైద్యుతేన=పిడుగుచేతంబోలె; విశస్తౌ=చంపఁబడిరి. నూనం=నిశ్చయము.

రెండుసింహంబులుగాని రెండు వృషభంబులుగానిపిడుగుతాఁకుడుచేఁ జంపఁబడునట్లుబలవంతులగునా రామలక్ష్మణులు, నాకుఁగాజింకరూపముధరించిన రాక్షసునిచేఁ,జంపఁబడియుందురు;ఇది నిశ్చయముగానుండును.

అని, తాత్పర్యము.

నూనం స కాలో మృగరూపధారీ
మా మల్పభాగ్యాం లులుభే తదానీమ్
యత్రార్య పుత్రం విససర్జ మూఢా
రామానుజం లక్ష్మణపూర్వజంచ. ౧౦

టీక॥యత్ర=ఎప్పుడు; అహం (అధ్యాహృతము)=నేను; మూఢా=అజ్ఞానమునొందినదాననై; లక్ష్మణపూర్వజం=లక్ష్మణునియన్నయయిన; ఆర్యపుత్రం=నాపెనిమిటియగు రాముని; రామానుజంచ=రామునితమ్ముఁడైనలక్ష్మణుని; విససర్జ=విడిచితినో; తదానీం=అప్పుడు; సః=ఆ; కాలః=యముఁడు; మృగరూపధారీ=జింకరూపమునుదాల్చినవాఁడై;అల్పభాగ్యాం=కొంచెమయినభాగ్యముగల; మాం=నన్ను; లులుభే=ఆశపడునట్లు చేసెను. నూనం=నిశ్చయము!

యముండె,యప్పుడు ,జింకరూపుఁదాల్చినాకాశంబూపియుండును; యిదినిశ్చయము; కావునసె, నేను, నాపెనిమిటనిరామునిని, అతనితమ్ముఁడులక్ష్మణునిం,బొమ్మంటిని. అని, తాత్పర్యము.

హా రామ సత్య వ్రత దీర్ఘ బాహో

హా పూర్ణచంద్రప్రతిమాననవక్త్ర
హా జీవలోకస్య హితః ప్రియశ్చ
వధ్యాం న మాం వేత్సి హి రాక్షసానామ్. ౧౧

టీక॥ హా=అయ్యో! రామ = రాముఁడా! సత్యవ్రత = సత్యమే వ్రతముగాఁగలవాఁడా! దీర్ఘబాహో = పొడవులయిన చేతులుగలవాఁడా! హా= అయ్యో! పూర్ణచంద్ర ప్రతిమాననవక్త్ర= నిండుచంద్రునితో సమానమయిన ముఖముగలవాఁడా! హా=అయ్యో! జీవలోకస్య=ప్రాణిలోకమునకు ; హితః = మేలుసేయువాఁడవును; ప్రియశ్చ = సంతోషము సేయువాఁడవు నగు; త్వం (అధ్యాహృతము) = నీవు; రాక్షసానాం = రాక్షసులకు; వధ్యాం=చంపఁదగియున్న; మాం= నన్ను; న వేత్సి హి=ఎఱుంగవుగదా!

అయ్యో! రాముఁడా! సత్యవ్రతుఁడా! ఆజానుబాహుఁడా! నిండుచందురునిం బోలు ముఖముగలవాఁడా! అయ్యో! నీవు, ప్రాణిసమూహమునకంతయు మేలును సంతోషమును జేయువాఁడవే! ఇప్పుడు, నేను, రాక్షసులచేతిలోఁ జావఁబోవుట నెఱుంగవుగదా! అని, తాత్పర్యము.

అనన్యదైవత్వమియం క్షమా చ
భూమౌ చ శయ్యా నియమశ్చ ధర్మే
పతివ్రతాత్వం విఫలం మమేదం
కృతం కృతఘ్నేష్వివ మానుషాణామ్. ౧౨

టీక॥ మమ= నాయొక్క; అనన్యదైవత్వం=పెనిమిటికన్ననితర దేవుఁడు లేకుండుటయు; ఇయం= ఈ; క్షమా చ=ఓర్పును; భూమౌ= నేలయందు; శయ్యా చ=పరుండుటయును; ధర్మే= ధర్మమునందు ; నియమశ్చ = నియతియును ; ఇదం= ఈ; పతివ్రతాత్వం= పెనిమిటియొక్క వ్రతమె వ్రతముగాఁగలిగియుండుట, పెనిమిటిని బూజించుటయె వ్రతముగాఁ గలిగియుండుట యనుట; మానుషాణాం = మనుష్యులయొక్క; కృతఘ్నేషు=తమకుఁ జేయఁబడిన

యుపకారమును మఱచువారియందు; కృతమివ = చేయఁబడినయుపకారమువలె; విఫలం=ఫలములేనిది, వ్యర్థమనుట.

పెనిమిటిదప్పనితరుండగు దేవునిం గొలువకుండుటయు నీరాక్షసస్త్రీలును రావణుండును నెట్టిపరుష వచనంబులాడినను "కొంతకాలమునకైన రాముని ప్రియవచనంబులు వినంగలుగదా" యని కోరియుండుటయు, నేలంబరుండుటయును, ధర్మంబు విడువకుండుటయు, నిట్టినాపాతివ్రత్యము, రామసంగమంబు సిద్ధింపకుండుటం జేసి, కృతఘ్నునకుం జేసినయుపకారముంబోలె, వ్యర్థమయినది. అని, తాత్పర్యము.

మోఘో హి ధర్మశ్చరితో మయాయం
తథైకపత్నీత్వమిదం నిరర్థమ్
యా త్వాం న పశ్యామి కృశా వివర్ణా
హీనా త్వయా సంగమనే నిరాశా. ౧౩

టీక॥ యా (అహం)=ఏనేను; త్వయా=నీచేత; హీనా=విడువఁబడిన దాననై; కృశా=కృశించిన దాననై; వివర్ణా=తెల్లఁబాఱిన దాననై; త్వాం=నిన్ను; న పశ్యామి=చూడకున్నానో; సంగమనే=చేరికయందు; నిరాశా=ఆశలేని దాననై; అస్మి (అధ్యాహృతము)=ఉన్నానో; తయా (అధ్యాహృతము)=అట్టి; మయా=నాచేత; చరితః=అనుష్ఠింపఁబడిన; ధర్మః=ధర్మము; మోఘో హి=వ్యర్థముగదా! తథా=అట్టి; చరితం (అధ్యాహృతము)=అనుష్ఠింపఁబడిన; ఇదం=ఈ; ఏకపత్నీత్వం=పతివ్రతాత్వమును; నిరర్థం=ప్రయోజనములేనిది.

నేనింతకాలము శ్రమపడినను నిన్ను వదలి కృశించి వైవర్ణ్యము నొంది మఱల నిన్నుం జేర నాశయించుకొనుటకును దగిన యవకాశము లేకున్నాను, గావున, నేనింతవఱకనుష్ఠించినధర్మమును పాతివ్రత్యమును వ్యర్థమయినది; ఇంతకాలమిట్లు శ్రమపడక, రావణుండు నన్నపహరించినప్పుడె ప్రాణంబులు విడిచియుందునేని, ఇంతకష్టము రాకుండును. అని, తాత్పర్యము.

పితుర్నిదేశం నియమేన కృత్వా

వనా న్నివృత్త శ్చరితవ్రతశ్చ
స్త్రీభిస్తు మన్యే విపులేక్షణాభి
స్త్వం రంస్యసే వీతభయః కృతార్థః. ౧౪

టీక॥త్వం=నీవు; పితుః = తండ్రి యొక్క; నిదేశం=ఆజ్ఞను; నియమేన= నియతిచేత; కృత్వా=చేసి; చరితవ్రతః = అనుష్ఠింపఁబడినవ్రతముగలవాఁడవై; వనాత్=అడవినుండి; నివృత్తశ్చ=మఱలినవాఁడవై; కృతార్థః=నెఱవేఱినపనిగలవాఁడవై; వీతభయః= విడువఁబడినభయముగలవాఁడవై, విడువఁబడినదుఃఖముగలవాఁడవై యనుట; విపులేక్షణాభిః=విశాలములయినకన్నులుగల; స్త్రీభిస్తు=స్త్రీలతోను; రంస్యసే=క్రీడింపఁగలవు.

రాముఁడా! నీవు నియమంబునఁ దండ్రియాజ్ఞను నెఱవేర్చి వ్రతంబును గైకొని పిదప, వనంబు విడిచి, యయోధ్యకుఁబోయి, కృతార్థుఁడవై, నన్ను మఱచి, యెంతమాత్రము నుదుఃఖము లేక, విశాలంబులగు నేత్రంబులుగల స్త్రీలం గూడి క్రీడింపుచుండఁగలవు. అని, తాత్పర్యము.

అహంతు రామ త్వయి జాతకామా
చిరం వినాశాయ నిబద్ధభావా
మోఘం చరిత్వాచ తపోవ్రతంచ
త్యక్ష్యామి ధిగ్జీవిత మల్పభాగ్యా. ౧౫

టీక॥రామ=రాముఁడా! అల్పభాగ్యా=కొంచెమయినభాగ్యముగల; అహంతు=నేనుమాత్రము; త్వయి = నీయందు; జాతకామా=పుట్టినయనురాగముగలదానవై; వినాశాయ= చెడుటకొఱకు; చిరం = బహుకాలము; నిబద్ధభావా= కట్టఁబడినహృదయముగలదానవై; మోఘం=వ్యర్థమయిన; తపః= ఉపవాసమును; వ్రతంచ = నియమమును; చరిత్వాచ=అనుష్ఠించియు; ధిక్ = నిందితమయిన; జీవితం = ప్రాణమును; త్యక్ష్యామి=విడిచెదను.

రాముఁడా! అల్పభాగ్యనగు నేనుమాత్రము, నీయందనురాగంబుగల

దానవగుట యె గాక, వినాశంబునొందుటకై యె, నీయందుమహృదయంబు స్థిరంబుగానుంచి , వ్యర్థము గానియమమవలంబించి యుపవాసంబులుసల్పి, తుదకు,నిందితములయిన యీప్రాణములనిప్పుడువిడిచెదను.అని,సీతాదేవి, రామునుద్దేశించి,చెప్పినది.

అని, తాత్పర్యము.

సా జీవితం క్షిప్ర మహం త్యజేయం
విషేణ శస్త్రేణ శితేన వాపి

టీక॥ సా=అట్టి;అహం=నేను;విషేణ=విషముచేతఁగాని; శితేన=కఱకుగల;శస్త్రేణవాపి=ఆయుధముచేతఁగాని;జీవితం=ప్రాణమును;క్షిప్రం=శీఘ్రముగా;త్యజేయం=విడుతును.

అట్టిసమస్తదుఃఖంబులంబరితపించుచున్ననేను,ఇప్పుడు,విషంబుదినిగాని, తీక్ష్ణంబగునాయుధముచేఁగాని,శీఘ్రంబుగాఁబ్రాణంబులువిడిచెదను.

అని, తాత్పర్యము.

విషస్య దాతా నహి మేస్తి కశ్చి
చ్ఛస్త్రస్యవా వేశ్మని రాక్షసస్య. ౧౬

టీక॥ రాక్షసస్య=రాక్షసుండగురావణునియొక్క; వేశ్మని=ఇంటియందు; మే=నాకొఱకు ; విషస్య=విషముయొక్క-గాని;శస్త్రస్యవా=ఆయుధముయొక్క-గాని;దాతా = ఇచ్చువాఁడు;కశ్చిత్=ఒకానొకఁడును;నాస్తిహి=లేఁడుగదా!

ఈరావణునింట,నాకు, విషమును గాని,యాయుధముగాని, యిచ్చువాఁ, డెవ్వఁడునులేఁడు. అని,సీతాదేవి,విలపించినది.అని, తాత్పర్యము.

ఇతీవ దేవీ బహుధా విలప్య
సర్వాత్మనా రామ మనుస్మరంతీ
ప్రవేపమానా పరిశుష్కవక్త్రా
నగోత్తమం పుష్పిత మాససాద. ౧౭

టీక॥దేవీ=సీతాదేవి;ఇతీవ = ఇట్లు;బహుధా=అనేకవిధములుగా;విలప్య=ఏడ్చి;సర్వాత్మనా=సమస్తమయినమనసుచేతను;రామం=రాముని;అనుస్మరంతీ = ధ్యానించుచు;ప్రవేపమానా=వడంకుచు;పరిశుష్కవక్త్రా=ఎండిననోరుగలదై;పుష్పితం=పూచిన; నగోత్తమం=వృక్షములలోను త్తమమయినశింశుపావృక్షమును;ఆససాద=పొందెను.

సీతాదేవి, పెక్కువిధంబులవిలపించి,హృదయంబున రాముని ధ్యానంబు సేయుచు, దుఃఖంబునవడంకుచు, నోరెండఁగా, నాశింశుపావృక్షంబుఁజేరెను. అని, తాత్పర్యము.

శోకాభితప్తా బహుధా విచింత్య
సీతాథ వేణ్యుద్గ్రథనం గృహీత్వా
ఉద్బధ్య వేణ్యుద్గ్రథనేన శీఘ్ర
మహం గమిష్యామి యమస్య మూలమ్. ౧౮

టీక॥అథ=అటుతర్వాత;సీతా=సీత;శోకాభితప్తా= దుఃఖముచేతఁదపింపఁజేయఁబడినదై; బహుధా=పెక్కువిధంబులు;విచింత్య= చింతించి;వేణ్యుద్గ్రథనం = తలజడచే మెడకుముడివేసికొనుటను;గృహీత్వా = గ్రహించి; అహం=నేను;వేణ్యుద్గ్రథనేన= తలజడచేమెడకుముడివేసికొనుటచే ; ఉద్బధ్య=ఉరిపోసికొని;శీఘ్రం = శీఘ్రముగా;యమస్య=యమునియొక్క; మూలం=సమీపమును;గమిష్యామి=పొందెదను.ఇతి,చింతయామాస (అధ్యాహృతము)=అనితలంచెను.

అంతనాసీతాదేవి, దుఃఖంబునఁబరితపించుచుఁ దలజడను మెడకుఁగట్టుకొని, "దీనిచే నేనురిపోసికొని ప్రాణంబులు విడిచి యమలోకంబునకరిగెదను" అని, తలంచెను. అని, తాత్పర్యము.

ఉపస్థితా సా మృదుసర్వగాత్రీ
శాఖాం గృహీత్వాథ నగస్య తస్య

టీక॥అథ=అటుపిమ్మట; మృదుసర్వగాత్రీ= మెత్తనివైనయన్నియవయవ

ములుగల ; సా=ఆసీత ; తస్య=ఆ ; నగస్య=శింశుపావృక్షముయొక్క ; శాఖాం=కొమ్మను; గృహీత్వా = పట్టుకొని; ఉపస్థితా=ఉండినది.

అంత , మృదువులయినయవయవములుగలసీతాదేవి, యిట్లుమరణంబునొందనిశ్చయించి , ఆశింశుపావృక్షముకొమ్మంబట్టుకొనియుండినది.

అని, తాత్పర్యము.

తస్యాస్తు రామం ప్రవిచింతయంత్యా
రామానుజం స్వం చ కులం శుభాంగ్యాః. ౧౯
శోకానిమిత్తాని తథా బహూని
ధైర్యార్జితాని ప్రవరాణి లోకే
ప్రాదుర్నిమిత్తాని తదా బభూవుః
పురాపి సిద్ధాన్యుపలక్షితాని. ౨౦

టీక॥ తదా=అప్పుడు ; రామం = రాముని ; రామానుజం = రామునితమ్ముండగులక్ష్మణుని; స్వం=తనదైన ; కులంచ=వంశమును ; ప్రవిచింతయంత్యాః=తలంచుకొనుచున్న ; శుభాంగ్యాః=మంగళకరములయినయవయవములుగల; తస్యాస్తు=ఆసీతకును ; తథా=అట్లు; శోకానిమిత్తాని = దుఃఖమునకు నిమిత్తములుకానివియు, శుభసూచకములుననుట ; బహూని=అనేకములయినవియును; ధైర్యార్జితాని(ఆర్జితధైర్యాణి) సంపాదింపఁబడినధైర్యముగలదియు, ధైర్యము గలిగించునవియుననుట; లోకే=ప్రపంచమునందు; ప్రవరాణి=ప్రసిద్ధములును; పురాపి=ముందును; సిద్ధాని=సిద్ధించినవిగా; ఉపలక్షితాని=చూడఁబడినవియునగు; నిమిత్తాని=శుభనిమిత్తములు ; ప్రాదుర్బభూవుః=కలిగినవి.

అప్పుడు రామునిలక్ష్మణునిందలంచుకొనియట్టి పరాక్రమశాలులుండునప్పుడును నాకిట్టియవస్థగలిగిన దేయనియుఁ, దనవంశములందలంచుకొని , యిట్టిపుణ్యవంతులవంశంబులోఁబుట్టిననాకుఁబాపిష్ఠంబగునీ దుర్మరణంబు సేయవలసివచ్చెనేయనియు వగచుచున్న, శుభాంగియగునాసీతకు, శుభసూచకములును ధైర్యముగలిగించునవియును , లోకప్ర

సిద్ధములును, ఇదివఱకుఁబెక్కుమాఱు లుశుభకరంబులని పరీక్షింపఁబడినిర్ణయింపఁబడినవియునగు, నిమిత్తముల నేకములు, కనుపడినవి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, అష్టావింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు,సుందరకాండాష్టావింశసర్గటీక,
ముగిసినది.



౨౯

ఏకోనత్రింశసర్గప్రారంభః.

తథా గతాం తాం వ్యథితా మనిందితాం
వ్యపేతహర్షాం పరిదీనమానసామ్
శుభాం నిమిత్తాని శుభాని భేజిరే
నరం శ్రియా జుష్ట మివోపజీవినః. ౧

టీక॥ శుభాని=మంగళకరములయిన; నిమిత్తాని=నిమిత్తములు; శ్రియా = సంపదతో; జుష్టం=కూడిన; నరం = మనుష్యుని; ఉపజీవినఇవ = సేవకులువలె; తథా=అట్లు; ఆగతాం = శింశుపావృక్షమునొద్దకు వచ్చినదియు; వ్యపేతహర్షాం = పోయినసంతోషము గలదియు; పరిదీనమానసాం= మిక్కిలియుదైన్యము నొందిన మనసు గలదియు; శుభాం= మంగళస్వరూపిణియునగు; తాం=ఆసీతను;భేజిరే= పొందినవి.

సంపత్తు గలవాని నతనిసేవకు లాశ్రయించు లాగున,స్లుఁజెప్పనలవిగాని విధంబుననాశింశుపావృక్షంబు నొద్దకు వచ్చి యున్నదియుఁ బరమ దుఃఖిత

యు నట్టి రామవిరహ దశయందుఁదా నెట్లుండవలయునో అట్లేయుపవాసాదిపతివ్రతా ధర్మంబు లాచరించుచున్నది కావునఁ బ్రస్తుతింపఁ దగినదియును, ఎంతమాత్రమునంతోషము లేనిదియును దీనంబగు మనంబుతో నున్నదియును, మంగళరూపిణియునగు నా సీతను, ఆశ్రయించినవి.

అని, తాత్పర్యము.

తస్యాశ్శుభం వామ మరాళపక్ష్మ
రాజీవృతం కృష్ణవిశాలశుక్లమ్
ప్రాస్పందతైకం నయనం సుకేశ్యా
మీనాహతం పద్మమివాభితామ్రమ్. ౨

టీక॥ శుభం=మంగళకరమయినదియును; అరాళపక్ష్మరాజీవృతం= వంకరలయిన ఱెప్పవెండ్రుకలపఙ్క్తిచేఁ జుట్టఁబడినదియును; కృష్ణవిశాల శుక్లం= గ్రుడ్డునందుమాత్రమునల్లనిదియును విశాలమయినదియుఁ దెల్లనిదియును; అభితామ్రం=చుట్టును ఎఱ్ఱగా నుండునదియునగు, కొనల నెఱ్ఱగా నుండునదియు నగునను టు; సుకేశ్యాః= మంచివెండ్రుకలుగల; తస్యాః=ఆసీతయొక్క; వామం=ఎడమదైన; ఏకం=ఒకటి; నయనం=కన్ను; మీనాహతం= చేఁపచేఁ గొట్టఁబడిన; పద్మమివ= కమలమువలె; ప్రాస్పందత=కదలినది.

మంగళలక్షణంబులు గల్గినవంకర లయిన ఱెప్పవెండ్రుకలుగలిగి గ్రుడ్డున నల్లఁగాను ఆప్రక్క తెల్లఁగాను గొనల నెఱ్ఱగాను ఒప్పుచుండునట్టి, యాసీతాదేవియెడమకన్ను, మీనుచేఁ గొట్టఁబడిన కమలంబు కదలినట్లు, స్ఫురించినది. అని, తాత్పర్యము.

భుజశ్చ చార్వంచితః పీనవృత్తః
పరార్ధ్యకాలాగరుచందనార్హః
అనుత్తమేనాధ్యుషితః ప్రియేణ
చిరేణ వామస్సమవేపతాశు. ౩

టీక॥ చార్వంచితః పీనవృత్తః = సుందరమయినదియు నుత్తమమయినదియు బలిసినదియు గుండ్రమయి నదియును; పరార్థ్యకాలాగరు చందనార్హః = శ్రేష్ఠమయిన నల్లనియగరు గంధమునకుఁ దగినదియును; చిరేణ = బహుకాలము; అనుత్తమేన = తనకన్న శ్రేష్ఠములేని; ప్రియేణ = ప్రియుండగు రాముని చేత; అధ్యుషితః = అధిష్ఠింపఁబడినదియునగు; వామః = ఎడమదైన; భుజః = భుజమును, ఆశు = శీఘ్రముగ; సమవేపత = వడంకెను.

సుందరంబై యుత్తమంబై బలిసి గుండ్రముగా నుండునదియు, శ్రేష్ఠమయినకృష్ణాగరు గంధముచేఁ బూయఁబడునదియు, సమస్తపురుషోత్తముఁడగు రామునిచే బహుకాలము కౌఁగిలించుచుండినదియునగు, నా సీతాదేవి యెడమభుజము, గడగడవడంకెనది. అని, తాత్పర్యము.

గజేంద్రహస్తప్రతిమశ్చ పీన
స్తయో ర్ద్వయో స్సంహతయో స్సుజాతః
ప్రస్పందమానః పున రూరు రస్యా
రామం పురస్తా త్స్థిత మాచచక్షే. ౩

టీక॥ సంహతయోః = కలిసికొని యున్న; తయోః = ఆ; ద్వయోః = రెండుతొడలలోపల; గజేంద్రహస్త ప్రతిమశ్చ = ఏనుంగుతొండముతోఁబోలికగలదియు; పీనః = బలిసినదియును; సుజాతః = సుందరమయినదియునగు; వామః (అధ్యాహృతము) = ఎడమదైన; ఊరుః పునః = తొడయును; ప్రస్పందమానః = మిక్కిలియుఁగదలుచు; అస్యాః = ఈ సీతకు; రామం = రాముని; పురస్తాత్ = ముందట; స్థితం = ఉన్నవానిఁగా; ఆచచక్షే = చెప్పెను.

సమస్తశుభలక్షణములుగలిగియొకటితోనొకటిచక్కఁగాఁగలిసికొనియుండునాబిడరెండుతొడలలో, నేనుంగుతొండమునకుసాటినై, బలిసిసుందరమయిన, యెడమతొడ, మిక్కిలియుఁగదలుచు, "రాముండుముందటనేయున్నవాఁ"డనిసూచించినది.

అని, తాత్పర్యము.

శుభం పున ర్హేమసమానవర్ణ

మీష ద్రజోధ్వస్త మివా మలాక్ష్యాః
వాస స్స్థితాయా శ్శిఖరాగ్రదంత్యాః
కించి త్పరిస్రంసత చారు గాత్ర్యాః. ౫

టీక॥ పునః=ఇంకను; అమలాక్ష్యాః=స్వచ్ఛములయినకండ్లుగలదియును శిఖరాగ్రదంత్యాః=గుండ్రములయినకొనలుగలదంతములుగలదియును; స్థితాయాః=నిలచియున్నదియునగుసీతాదేవియొక్క; శుభం=మంగళకరముయినదియును; హేమసమానవర్ణం=బంగారముతోసమానమయినరంగుగలదియును; ఈషత్=కొంచెము; రజోధ్వస్తమివ (స్థితం)=దుమ్ముచేఁజెడినట్లున్నదియునగు; వాసః=వస్త్రము; పరిస్రంసత (పర్యస్రంసత)=జాఱెను.

స్వచ్ఛములయినకండ్లుగలదియును, గొనలగుండ్రములుగా నుండుదంతములుగలదియు సుందరములయినయవయవములు గలదియునిలుచుచున్నదియునగునాసీతాదేవి, కట్టుకొనియుండునట్టి, మంగళకరంబునుబంగారురంగు గదియుఁగొంచెముదుమ్ము దగిలియుండుటచేఁగాంతిదఱిగియున్నదియునగు, వస్త్రము, జాఱినది. అని, తాత్పర్యము.

ఏతై ర్నిమిత్తై రపరైశ్చ సుభ్రూః
స్సంబోధితా ప్రాగపి సాధు సిద్ధైః
వాతాతపక్లాంత మివ ప్రణష్టం
వర్షేణ బీజం ప్రతిసంజహర్ష. ౬

టీక॥ సుభ్రూః=సుందరములయినకనుబొమ్మలుగలసీతాదేవి; ప్రాగపి=మునుపును; సాధు=చక్కఁగా; సిద్ధైః=సిద్ధించినవగు; ఏతైః=ఈ; నిమిత్తైః=నిమిత్తములచేతను; అపరైశ్చ=ఇతరములచేతను; సంబోధితా=తెలుపఁబడినదై; వాతాతపక్లాంతం=గాలిచేతను ఎండచేతనువాడినదియును; ప్రణష్టం=మిక్కిలియునశించినదియునగు, మిక్కిలియుఁ గృశించినదియునగుననుట; బీజం=విత్తనము, చిన్నమొలకయనుట; వర్షేణేవ=వానచేతంబోలె; ప్రతిసంజహర్ష=మిక్కిలియుసంతోషించెను.

సుందరములయినకనుబొమ్మలుగల

యాసీతాదేవి, యిదివఱకుఁబలుమాఱు "సరియయినఫలములనిచ్చునవి" యనిపరీక్షించినిర్ణయింపఁబడినట్టి యీనిమిత్తములనుమఱియితరములనుజూచి, వానిచేరామాగమనంబుగల్గుననియెంచి, గాలియెండల తాఁకునకు వాడికృశించియుండుచిన్నమొలక, వానకురియఁగానే, మఱలఁగాంతినొందునట్లు, మిక్కిలియు సంతోషించెను. అని, తాత్పర్యము.

తస్యాః పున ర్బింబఫలాధరోష్ఠం
స్వక్షిభ్రు కేశాంత మరాళపక్ష్మ
వక్త్రం బభాసే సితశుక్లదంష్ట్రం
రాహో ర్ముఖా చ్చంద్రఇవ ప్రముక్తః. ౭

టీక॥పునః = ఇంకను; బింబఫలాధరోష్ఠం= దొండపండువంటిక్రిందిపెదవిగలదియును; స్వక్షిభ్రు= సుందరములైనకండ్లును కనుబొమ్మలునుగలదియును; కేశాంతం=కొనయందువెండ్రుకలుగలదియును, ముంగురులుగలదియుననుట; అరాళపక్ష్మ= వంకరలయినఱెప్పవెండ్రుకలుగలదియును; సితశుక్లదంష్ట్రం= (సమానార్థకములయిన "సిత, శుక్ల," ఈరెండుశబ్దములనుబ్రయోగించుట, వాచ్యమునందలియతిశయమును సూచించుచున్నది) మిక్కిలియుఁదెల్లనిపండ్లుగలదియునగు; తస్యాః=ఆసీతాదేవియొక్క; వక్త్రం = ముఖము; రాహోః=రాహువుయొక్క; ముఖాత్ = నోటనుండి; ప్రముక్తః= విడువఁబడిన; చంద్రఇవ = చంద్రుఁడుంబోలె, బభాసే=ప్రకాశించెను.

ఇదిగాక, దొండపండువంటిక్రిందిపెదవితో నొప్పుచు, సుందరములయినకండ్లునుగనుబొమ్మలునుముంగురులునువంకరలయినఱెప్పవెండ్రుకలునుగలిగి, మిక్కిలియుధవళంబులయినపండ్లచేఁజెలంగుచున్న, యాసీతాదేవిముఖము, రాహువునోటనుండివెలువడినచంద్రబింబముంబోలెఁబ్రకాశించినది. అని, తాత్పర్యము.

సా వీతశోకా వ్యపనీతతంద్రీ
శాంతజ్వరా హర్షవిబుద్ధసత్త్వా
అశోభ తార్యా వదనేన శుక్లే

శీతాంశునా రాత్రి రివోదితేన. ౮

టీక॥ఆర్యా=పూజ్యయగు;సా=ఆ సీత;వీతశోకా= విడువఁబడినదుఃఖము గలదై; వ్యపనీతతంద్రీ=పోఁగొట్టఁబడినయాలస్యముగలదై; శాంతజ్వరా=శమించిన తాపముగలదై;హర్షవిబుద్ధసత్త్వా=సంతోషము చేవికసించినమనసు గలదై; వదనేన=ముఖముచేత; శుక్లే=శుక్లపక్షమునందు;రాత్రిః=రాత్రి; ఉదితేన=ఉదయించిన; శీతాంశునేవ=చంద్రునిచేతంబోలె; అశోభత=ప్రకాశించెను.

పూజనీయయగునా సీతాదేవి, దుఃఖంబుగాని, యాలస్యంబుగాని, తాపము గాని, లేక, సంతోషంబున మనంబువికాసమునొందఁగాఁ, బ్రకాశించుచుండుముఖంబుచేత, శుక్లపక్ష రాత్రిచంద్రునిచేతం బ్రకాశించునట్లు, తేజరిల్లుచుండినది.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే,శ్రీమద్రామాయణే,ఆదికావ్యే,
సుందరకాండే, ఏకోనత్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండైకోనత్రింశసర్గ టీక,
ముగిసినది.

---

౩౦.
త్రింశసర్గప్రారంభః.

హనుమానపి విశ్రాంత స్సర్వం శుశ్రావ తత్త్వతః
("హనుమానపివిక్రాంతః" ఇతి,పాఠాంతరమ్)
సీతాయా స్త్రిజటాయాశ్చ రాక్షసీనాంచ తర్జనమ్. ౧

టీక॥ విశ్రాంతః = విశ్రమించియున్న;విక్రాంతః (అని,పాఠాంతరము)=

స ౩౦

పరాక్రమశాలియగు; హనుమానపి = హనుమంతుండు; సీతాయాశ్చ = సీతయొక్కయు; త్రిజటాయాశ్చ = త్రిజటయొక్కయు; సర్వం = సమస్తవృత్తాంతమును; రాక్షసీనాం = రాక్షసస్త్రీలయొక్క; తర్జనంచ = బెదరింపుమాటను; తత్త్వతః = సరిగా; శుశ్రావ = వినెను.

అశింశుపావృక్షంబునందు విశ్రమించియున్న హనుమంతుండు (పాఠాంతరపక్షమందు, "పరాక్రమశాలియగుహనుమంతుండు") సీతాదేవివృత్తాంతమును త్రిజట చెప్పిన స్వప్నవృత్తాంతమును రాక్షసస్త్రీలు సీతను బెదరించినవిధంబును, అంతయునుక్రమముగా, వినుచుండెను. అని, తాత్పర్యము.

అవేక్షమాణ స్తాం దేవీం దేవతామివ నందనే
తతో బహువిధాం చింతాం చింతయామాస వానరః. ౨

టీక॥ తతః = అటుపిమ్మట; వానరః = హనుమంతుఁడు; నందనే = నందనవనమునందు; స్థితాం (అధ్యాహృతము) = ఉన్న; దేవతామివ (స్థితాం) = దేవతయుంబోలెనున్న; తాం = ఆ; దేవీం = సీతాదేవిని; అవేక్షమాణః = చూచుచు; బహువిధాం = అనేకవిధములయిన; చింతాం = ఆలోచనమును; చింతయామాస = చింతించెను, చేసెననుట.

అంత, హనుమంతుండు, నందనవనంబుననుండు దేవతయుంబోలె నశోకవనంబుననున్న సీతాదేవింజూచుచు, నిట్లని, పెక్కువిధంబులం, జింతించెను.

అని, తాత్పర్యము.

యాం కపీనాం సహస్రాణి సుబహూన్యయుతానిచ
దిక్షు సర్వాసు మార్గంతే సేయ మాసాదితా మయా. ౩

టీక॥ సుబహూని = పెక్కులయిన; కపీనాం = వానరులయొక్క; సహస్రాణి = వేలును; అయుతానిచ; పదిసహస్రములును; సర్వాసు = సమస్తములయిన; దిక్షు = దిక్కులయందు; యాం = ఎవ్వతెను; మార్గంతే = వెదకుచున్నారో; సా = అట్టి; ఇయం = ఈసీత; మయా = నాచేత; ఆసాదితా = పొందఁబడినది.

వానరులు వేలుగాను బెక్కుదశస



హస్రంబులుగాను జేరిసమస్త దిక్కులందును, ఏసీతనువెదకుచున్నారో, ఆ సీతను, నేనిక్కడఁజూచుచున్నాను.

అని, తాత్పర్యము.

చారేణ తు సుయుక్తేన శత్రోశ్శక్తి మవేక్షతా
గూఢేన చరతా తావ దవేక్షిత మిదం మయా. ౪

టీక ॥ సుయుక్తేన= మిక్కిలియు నెచ్చరికగలవాఁడును; శత్రోః= శత్రువుయొక్క; శక్తిం=సామర్థ్యమును; అవేక్షతా = చూచుచున్నవాఁడును ; గూఢేన=ఎవ్వరికినిగనుపడనివాఁడును; చరతా=తిరుగుచున్నవాఁడును; చారేణ= రహస్యముగానుండిశత్రువృత్తాంతముదెలుసుకొనువాఁడునగు; మయా=నాచేత; ఇదం= ఈసమాచారము; తావత్=అంతయు;అవేక్షితం= చూడఁబడినది.

నేను , మిక్కిలియు నెచ్చరికగల్గి శత్రువుల సామర్థ్యంబును దెలిసికొనుచు చారుండనై యెవ్వరికిం దెలియకుండునట్లులంకయంతయుఁదిరిగి , వీనినంతయుఁ, దెలిసికొంటిని.

అని, తాత్పర్యము.

రాక్షసానాం విశేషశ్చ పురీచేయ మవేక్షితా
రాక్షసాధిపతే రస్య ప్రభావో రావణస్య చ. ౫

టీక॥ రాక్షసానాం = రాక్షసులయొక్క; విశేషశ్చ = అతిశయమును; అవేక్షితః (అధ్యాహృతము)= చూడఁబడినది. ఇయం=ఈ; పురీచ= లంకాపట్టణమును; అవేక్షితా= చూడఁబడినది. రాక్షసాధిపతేః= రాక్షసులకుఁబ్రభువైన;అస్య=ఈ; రావణస్య= రావణునియొక్క ; ప్రభావశ్చ=శక్తియును ; అవేక్షితః ( అధ్యాహృతము)=చూడఁబడినది.

రాక్షసులవిశేషంబుఁ జూచినాను; ఈలంకాపురివిధంబునుజూచితిని; మఱియురాక్షసులకుఁ బ్రభుండైన యీరావణుని ప్రభావంబునుంగంటిని.

అని, తాత్పర్యము.

యుక్తం తస్యా ప్రమేయస్య సర్వసత్త్వదయావతః





సమాశ్వాసయితుం భార్యాం పతిదర్శనకాంక్షిణీమ్. ౬

టీక॥అప్రమేయస్య—కొలఁత పెట్టఁ గూడనివాఁడును; సర్వసత్త్వదయావతః=సమస్తజంతువులయందును దయగలవాఁడునగు; తస్య=ఆరామునియొక్క; పతిదర్శనకాంక్షిణీం= పెనిమిటియొక్క దర్శనమునందుఁగోరికగల; భార్యాం=భార్యయగుసీతను ; సమాశ్వాసయితుం=ఊఱడించుటకు ; ఊఱడించుటయనుట;యుక్తం=న్యాయము.

కొలంతలేని ప్రభావముగలవాఁడును సమస్తప్రాణులందును దయగలవాఁడునగు నారాముని, భార్యయును పెనిమిటినిఁజూడఁగోరి దుఃఖించుచున్నదియునగు నీసీతకు రామక్షేమంబుచెప్పి, కొంతయూఱటగల్గించుటయుక్తము. అని, తాత్పర్యము.

అహ మాశ్వాసయా మ్యేనాం పూర్ణచంద్రనిభాననామ్
అదృష్టదుఃఖాం దుఃఖార్తాం దుఃఖస్యాంత మగచ్ఛతీమ్. ౭

టీక॥అహం — నేను ; అదృష్టదుఃఖాం = చూడఁబడినదుఃఖము గలదికానిదియును; దుఃఖార్తాం=దుఃఖముచేఁ బీడింపఁ బడినదియును ; దుఃఖస్య = దుఃఖముయొక్క ; అంతం — నాశమును; అగచ్ఛతీం= పొందకున్నదియును; పూర్ణచంద్రనిభాననాం = నిండుచంద్రునితోసమానమయినముఖము గలదియునగు;ఏనాం — ఈసీతను ; ఆశ్వాసయామి=ఊఱడించెదను.

ఇదివఱకెన్నఁడును దుఃఖంబుననుభవించినదికాదు, కావున, నిప్పుడుసంభవించినదుఃఖంబునోర్వలేక, దుఃఖమునకంతంబుగానక, పరితపించుచున్న,నిండుచంద్రునింబోలుముఖంబుగల, యీసీతకు, రామవార్తంజెప్పి , దుఃఖముపోవునట్లు. చేసెదను.
అని, తాత్పర్యము.

యద్య ప్యహ మిమాం దేవీం శోకోపహతచేతనామ్
అనాశ్వాస్య గమిష్యామి దోషవ ద్గమనం భవేత్. ౮

టీక॥ అహం=నేను ; శోకోపహతచేతనాం = దుఃఖముచేఁగొట్టఁబడిన బుద్ధిగల; ఇమాం=ఈ; దేవీమపి = సీతాదేవినిగూడ; అనాశ్వాస్య = ఊఱ

డింపక; గమిష్యామి యది=పోవుదు నేని; గమనం=పోవుట; దోషవత్ = దోషముగలది; భవేత్=అగును.

నేను, ఇట్లు దుఃఖసముద్రంబునము నింగిపరితపించుచున్న యీసీతాదేవి నాశ్వాసింపకయె, రాముని యొద్దకు బోవు నేని, దోషంబు సంభవించును.

అని, తాత్పర్యము.

గతే హి మయి తత్రేయం రాజపుత్రీ యశస్వినీ
పరిత్రాణ మవిందంతీ జానకీ జీవితం త్యజేత్. ౯

టీక॥ మయి=నేను; తత్ర=అచ్చటికి; గతే=పోయినవాఁడగుచుండఁగా; యశస్వినీ= అధికమయినకీర్తిగలదియును; రాజపుత్రీ=రాచకొమార్తెయునగు; జానకీ=సీత; పరిత్రాణం=రక్షణమును; అవిందంతీ=పొందకున్నదై; జీవితం=ప్రాణంబును; త్యజేద్ధి=విడుచును గదా!

నేను, ఈసీత నాశ్వాసింపక రాముని యొద్దకుఁబోఁగానే, కీర్తిమంతురాలును రాచకొమార్తెయునగు సీతాదేవి, తన్ను గాపాడువార లెవ్వరును లేరని తలంచి, ప్రాణంబులు విడుచును.

అని, తాత్పర్యము.

మయా చ స మహాబాహుః పూర్ణచంద్రనిభాననః
సమాశ్వాసయితుం న్యాయ్యః సీతాదర్శనలాలసః. ౧౦

టీక॥ మహాబాహుః=పెద్దచేతులు గలవాఁడును; పూర్ణచంద్ర నిభాననః= నిండుచంద్రునితో సమానమయిన ముఖముగలవాఁడును; సీతాదర్శనలాలసః=సీతాదేవిని చూచుటయందు మిక్కిలియునిచ్ఛగలవాఁడునగు; సచ=ఆ రాముఁడును; మయా=నాచేత; సమాశ్వాసయితుం= చక్కగా నూఱడించుటకు; న్యాయః=తగినవాఁడు.

మహాబాహుఁడును నిండుచంద్రునింబోలు ముఖంబుగలవాఁడును, సీతంజూడఁగోరి తపించుచున్న వాఁడునగు నారామునకును, నేను సీతాదేవి క్షేమవార్తం జెప్పి, యవశ్యము, కొంతయూఱటగల్గింపవలెను.

అని, తాత్పర్యము.

నిశాచరీణాం ప్రత్యక్ష మనర్హం చాపి భాషణమ్



టీక॥ నిశాచరీణాం = రాక్షసస్త్రీల యొక్క; ప్రత్యక్షం = ఎదుట; భాషణం చాపి = మాటలాడుటయును; అనర్హం = యుక్తము గాదు.

నేనెట్లయినను సీతాదేవి నాశ్వాసింపవలసినది; ఈరాక్షసస్త్రీలేమొ ఒకసీతంగని పెట్టియున్నవారు, నేను వీరలయెదుట సీతాదేవితో మాటలాడుటయు సరిగాదు.

అని, తాత్పర్యము.

కథన్ను ఖలు కర్తవ్య మిదం కృచ్ఛ్రగతో హ్యహమ్. ౧౧

టీక॥ ఇదం = ఈయాశ్వాసించుట; కథన్నుఖలు = ఎట్లు; కర్తవ్యం = చేయఁబడవలసినది. అహం = నేను; కృచ్ఛ్రగతోహి = సంకటమునొందినానుగదా!

ఇట్లున్నదే, నేనెట్లు, ఇప్పుడు సీతనాశ్వాసింపఁగలను? నాకేమియుఁదోఁచలేదు; అట్లు సీతనాశ్వాసింపక పోవుటయును యుక్తము గాదు, సీతనాశ్వాసించుటకునవకాశము లేకున్నది; ఏమిచేయవచ్చును; సంకటంబుగల్గినది.

అని, తాత్పర్యము.

అనేన రాత్రిశేషేణ యదినాశ్వాస్యతే మయా
సర్వథా నాస్తి సందేహః పరిత్యక్ష్యతి జీవితమ్. ౧౨

టీక॥ ఏషా (అధ్యాహృతము) = ఈ సీత; అనేన = ఈ; రాత్రిశేషేణ = రాత్రిలో మిగతకాలముచేత; మయా = నాచేత; నాశ్వాస్యతేయది = ఆశ్వాసింపఁబడకుండు నేని; జీవితం = ప్రాణంబును; పరిత్యక్ష్యతి = విడుచును; సర్వథా = అన్నివిధంబులను; సందేహః = సందియము; నాస్తి = లేదు.

నేను సూర్యోదయమునకు లోపల నాశ్వాసింపకుండు నేని, యీసీతాదేవి, ప్రాణంబులు విడుచును; దీనికెంత మాత్రమును సందేహము లేదు.

అని, తాత్పర్యము.

రామశ్చ యదిపృచ్ఛేన్మాం కిం మాం సీతా బ్రవీద్వచః
కిమహం తం ప్రతిబ్రూయా మసంభాష్య సుమధ్యమామ్. ౧౩



టీక ॥ రామశ్చ = రాముండును; మాం = నన్ను; "సీతా = సీత; మాం = నన్నుఁగూర్చి; కిం = ఏమి; వచః = మాటను; అబ్రవీత్ = చెప్పినది". ఇతి (అధ్యాహృతము) = అని; పృచ్ఛేద్యది = అడుగునేని; అహం = నేను; సుమధ్యమాం = సుందరమయిననడుముగలసీతనుగూర్చి; అసంభాష్య = మాటలాడక; తం = ఆరామునిఁగూర్చి; కిం = ఏమిటని; ప్రతిబ్రూయాం = బదులు చెప్పుదును?

నేనిప్పుడు, సీతతో నేమియు మాటలాడకయే, రామునొద్దకుఁ బోయినపిమ్మట, అతండు, "సీత నాకేమి చెప్పిపంపినది" అని నన్నడుగునేని, నేనతని కేమని బదులు చెప్పుదును; అని, తాత్పర్యము.

సీతాసందేశరహితం మామితస్త్వరయా గతమ్
నిర్దహేదపి కాకుత్స్థః క్రుద్ధస్తీవ్రేణ చక్షుషా. ౧౪

టీక ॥ కాకుత్స్థః = రాముండు; ఇతః = ఇచ్చటనుండి; త్వరయా = వేగముచేత; ఆగతం = వచ్చినవాఁడను; సీతాసందేశరహితం = సీత చెప్పిపంపినమాటలేనివాఁడనగు; మాం = నన్ను; క్రుద్ధః = కోపించినవాఁడై; తీవ్రేణ = తీక్ష్ణమయిన; చక్షుషా = నేత్రముచేత; నిర్దహేదపి = దహించినను దహించును.

నేనిచ్చటనుండి వేగమునఁ దనయొద్దకువచ్చి; "సీతతో నేను మాటలాడలేదు గావున నాబిడ నాతో నేమియుం జెప్పిపంపలేదు" అని చెప్పఁగానే, రాముండు, మహాకోపంబునొంది, చుఱుకుఁజూపుల, నన్ను దహించినను దహించును.

అని, తాత్పర్యము.

యది చోద్యోజయిష్యామి భర్తారం రామకారణాత్
వ్యర్థమాగమనం తస్య ససైన్యస్య భవిష్యతి. ౧౫

టీక॥ రామకారణాత్ = రాముండనుకారణమువలన; భర్తారం = ప్రభువైనసుగ్రీవుని; ఉద్యోజయిష్యామియది చ = ప్రయత్నపడునట్లు చేయుదునేనియు; ససైన్యస్య = సైన్యములతోఁగూడిన; తస్య = ఆసుగ్రీవునియొక్క; ఆగమనం = వచ్చుట; వ్యర్థం = ప్రయోజనములేనిది. భవిష్యతి = కాఁగలదు.

నేను, సీతతో మాటలాడక నేపోయి, రామునకై సుగ్రీవునిం బ్రేరేపించియిచ్చటికిందోడొని వచ్చినను, ఈసీతయింత వఱకీదుఃఖముతోం బ్రాణంబులు ధరించియుండంజాలదు, గావున, నాసుగ్రీవుండు సైన్యములతో నిచ్చటికివచ్చుటయు, వ్యర్థమగును.

అని, తాత్పర్యము.

అంతరం త్వహ మాసాద్య రాక్షసీనా మిహ స్థితః
శనై రాశ్వాసయిష్యామి సంతాపబహుళా మిమామ్. ౧౮

టీక॥ అహం = నేను; ఇహ = ఇచ్చట; స్థితః = ఉన్నవాండనై; రాక్షసీనాం = రాక్షసస్త్రీలలో; అంతరం = అవకాశమును; ఆసాద్యతు = పొందినంతనే; సంతాపబహుళాం = అధికమయినదుఃఖముగల; ఇమాం = ఈసీతను; శనైః = మెల్లంగా; ఆశ్వాసయిష్యామి = ఊఱడించెదను.

నేనిచ్చటనెయుండి, యీరాక్షసస్త్రీలు కొంచెమెచ్చరిక దప్పియుండునప్పుడుగాని, యవ్వలికింబోయి నప్పుడుగాని, కొంచెమవకాశము గలిగినంతనె, పరమదుఃఖితయయి యున్నయీసీతను, వీరలువినకుండునట్లుం మెల్లంగా, నాశ్వాసించెదను.

అని, తాత్పర్యము.

అహంత్వ తితనుశ్చైవ వానరశ్చ విశేషతః
వాచంచో దాహరిష్యామి మానుషీ మిహ సంస్కృతామ్. ౧౯

టీక॥ అహంతు = నేనును; అతితనుశ్చైవ = మిక్కిలిచిన్నదేహముగలవాండను; విశేషతః = విశేషించి; వానరశ్చ = కోంతిని. ఇహ = ఇప్పుడు; మానుషం = మనుష్యసంబంధియగు; సంస్కృతాం = సంస్కృతమయిన; వాచంచ = మాటను; ఉదాహరిష్యామి = చెప్పెదను.

నేను, మిక్కిలియు సూక్ష్మమయిన దేహమునొందియున్నవాండను; అందును, వానరుండను, గావున, సన్నీరాక్షసస్త్రీలుకనుంగొనంజాలరు; అందుకనుకూలముగా, మనుష్యులు మాటలాడునట్లు, సంస్కృతభాషనవలంబించి, చెప్పెదను; అదియు, నీరాక్షసస్త్రీలకుం దెలియదు. అని, తాత్పర్యము.

యది వాచం ప్రదాస్యామి ద్విజాతిరివ సంస్కృతామ్
రావణం మన్యమానా మాం సీతా భీతా భవిష్యతి. ౧౮
వానరస్య విశేషేణ కథం స్యా దభిభాషణం

టీక॥అహం(అధ్యాహృతము)=నేను;ద్విజాతిరివ=బ్రాహ్మణుండుంబోలె; సంస్కృతాం=సంస్కృతమయిన; వాచం=మాటను; ప్రదాస్యామియది=ఇత్తునేని;సీతా=సీత;"వానరస్య=కోఁతికి;విశేషేణ=అతిశయముచేత; అభిభాషణం=మాటలాడుట;కథం = ఎట్లు; స్యాత్=కలుగును?" ఇతి(అధ్యాహృతము)=అని;మాం=నన్ను;రావణం=రావణునిఁగా;మన్యమానా= తలంచుచు; భీతా=భయపడినది; భవిష్యతి=కాఁగలదు.

నేను, బ్రాహ్మణుండుంబోలె సంస్కృతభాషను మాటలాడుదునేని, సీతాదేవి, "కోఁతిసంస్కృతభాషతోనెట్లుమాటలాడును?" అని,తలఁచి, నన్ను రావణుండనిభ్రమించి, భయంబునొందును.అని, తాత్పర్యము.

అవశ్య మేవ వక్తవ్యం మానుషం వాక్య మర్థవత్. ౧౯

టీక॥అవశ్యం=అవశ్యముగా;అర్థవత్=అర్థముగల;మానుషం= మనుష్యసంబంధియగు;వాక్యమేవ= మాటయే;వక్తవ్యం=చెప్పఁబడవలసినది.

కావున;నవశ్యము,సాధారణమయిన మనుష్యభాషనవలంబించి నేమాటలాడవలెను; సంస్కృతభాషలోమాటలాడఁగూడదు.అని, తాత్పర్యము.

మయా సాంత్వయితుం శక్యా నాన్యథేయ మనిందితా

టీక॥అనిందితా= నిందింపఁబడనట్టి; ఇయం=ఈసీత;మయా=నాచేత;అన్యథా=వేఱువిధంబున;సాంత్వయితుం= ఓదార్చుటకు; శక్యాన=అలవిగాదు.

అట్లుగాక,మఱియేవిధంబునను, అనిందితయగునీసీత,నాశ్వాసింప, నాకలవిగాదు.అని, తాత్పర్యము.

సేయ మాలోక్య మే రూపం జానకీ భాషితం తథా. ౨౦
భి స్త్రాసితా పూర్వం భూయ స్త్రాసం గమిష్యతి

టీక॥ పూర్వం=మునుపు ; రక్షోభిః=రాక్షసులచేత; త్రాసితా = భయపఱుపఁబడిన; సా=అట్టి; ఇయం=ఈ; జానకీ=సీత; మే=నాయొక్క; రూపం=ఆకారమును; తథా=అట్లు; భాషితం=మాటలాడుటను; ఆలోక్య=చూచి; భూయః=ఇంకను; త్రాసం=భయమును ; గమిష్యతి=పొందగలదు.

ఈసీత, నేనువానరుండనై యుండుటను ; మనుష్యులుమాటలాడునట్లుమాటలాడుటనుంజూచి , పూర్వమిట్టిరాక్షసులవేషంబులంజూచి భయపడియున్నదిగావున, నినుమడిభయంబునొందును. అని, తాత్పర్యము.

తతో జాతపరిత్రాసా శబ్దం కుర్యా న్మనస్వినీ. ౨౧
జానమానా విశాలాక్షీ రావణం కామరూపిణమ్

టీక॥ కామరూపిణం= ఇచ్ఛాధీనంబగురూపంబుగల; రావణం=రావణుని; జానమానా(జానానా) = ఎఱింగినదియును; విశాలాక్షీ=వెడల్పుల యునకండ్లుగలదియును; మనస్వినీ= మంచిమనస్సుగలదియు, పతివ్రతయునగునదుట, సీత; తతః = అటుపిమ్మట; జాతపరిత్రాసా=పుట్టినమహాభయంబునొందినదై; శబ్దం=ధ్వనిని; కుర్యాత్=చేయును.

అంత, విశాలంబులగు కండ్లుగలదియునుబతివ్రతయునగుసీత, రావణుండుకామరూపియనిమెఱింగినది, కావున, నాచందంబుఁజూచినంతనే, మహాభయంబునొంది, గట్టిగానఱచును.

అని, తాత్పర్యము.

సీతయాచ కృతే శబ్దే సహసా రాక్షసీగణః. ౨౨
నానాప్రహరణో ఘోర స్సమేయా దంతకోపమః

టీక॥ సీతయా=సీతచే ; శబ్దే=ధ్వని; కృతేచ=చేయఁబడఁగానే ; రాక్షసీగణః=రాక్షసస్త్రీలసమూహము ; నానాప్రహరణః = నానావిధములయినయాయుధములుగలదై; ఘోరః=భయంకరమై ; అంతకోపమః = యమునితోఁబోలిక ; సహసా = శీఘ్రముగా; సమేయాత్= వచ్చును.

సీతగట్టిగానఱవఁగానే ; యీరాక్షసస్త్రీలందఱు , నానావిధాయుధ

బలుధరించి, భయంకరముగా, మృత్యువుంబోలె, వేగంబున, నాపైకివత్తురు.
అని, తాత్పర్యము.

తతో మాం సంపరిక్షిప్య సర్వతో వికృతాననాః. ౨౩
వధేవ గ్రహణేచైవ కుర్యుర్యత్నం యథాబలమ్

టీక॥ తతః = అటుపిమ్మట; వికృతాననాః = వికారమునొందినముఖముగల, రాక్షసస్త్రీలు; మాం = నన్ను; సర్వతః = అంతటను; సంపరిక్షిప్య = చుట్టుకొని; వధేచ = చంపుటయందును; గ్రహణేచైవ = పట్టుకొనుటయందును; యథాబలం = యథాశక్తిగా; యత్నం = ప్రయత్నమును; కుర్యుః = చేయుదురు.

అంత, నీరాక్షసస్త్రీలు, నాచుట్టు నుంజుట్టుకొని, వారలచేతనైనంతవఱకు, నన్నుఁ జంపుటకుఁగాని, లేక, పట్టుకొనుటకుఁగాని, ప్రయత్నము సేయుదురు. అని, తాత్పర్యము.

గృహ్య శాఖాః ప్రశాఖాశ్చ స్కంధాం శ్చోత్తమశాఖినామ్. ౨౪
దృష్ట్వా విపరిధావంతం భవేయు ర్భయశంకితాః

టీక॥ శాఖాః = కొమ్మలను; ప్రశాఖాశ్చ = చిన్నకొమ్మలను; ఉత్తమశాఖినాం = శ్రేష్ఠములయిన వృక్షములయొక్క; స్కంధాంశ్చ = బోదెలను; గృహ్య (గృహీత్వా) = పట్టుకొని; విపరిధావంతం = నాలుగుప్రక్కలకును బరుగెత్తుచున్న; మాం (అధ్యాహృతము) = నన్ను; దృష్ట్వా = చూచి; భయశంకితాః = భయముచేభయపడినవారలు, భయమునొందినవారలనుట; భవేయుః = అగుదురు.

చెట్టుకొమ్మలను జిన్నకొమ్మలను బెద్దచెట్లు బోదెలనుదీసికొని నాలుగుప్రక్కలకునుబరుగెత్తు నన్నుఁజూచి, మిక్కిలియు భయమునొందుదురు.
అని, తాత్పర్యము.

మమ రూపంచ సంప్రేక్ష్య వనే విచరతో మహత్. ౨౫
రాక్షస్యో భయవిత్రస్తా భవేయు ర్వికృతాననాః

టీక॥ వికృతాననాః = వికారము నొందినముఖములుగల; రాక్షస్యః = రాక్షసస్త్రీలు; వనే= అడవియందు; విచరతః=తిరుగుచున్న; మమ=నాయొక్క; మహత్=గొప్పదైన; రూపంచ= ఆకారమును; సంప్రేక్ష్య = చూచి; భయవిత్రస్తాః = భయముచే భయపడినవారలు; భవేయుః=అగుదురు.

అవికృతంబులగుముఖంబులుగల రాక్షసస్త్రీలు, అశోకవనంబునవిహరించుచున్న నామహారూపంబుఁజూచి, భయపడుదురు. అని, తాత్పర్యము.

తతః కుర్యు స్సమాహ్వానం రాక్షస్యో రక్షసామపి. ౨౮
రాక్షసేంద్రనియుక్తానాం రాక్షసేంద్రనివేశనే

టీక॥తతః=అటుపిమ్మట; రాక్షస్యః= రాక్షసస్త్రీలు; రాక్షసేంద్ర నివేశనే=రాక్షసులకుఁ బ్రభువైనరావణునింటియందు; రాక్షసేంద్రనియుక్తానాం= రాక్షసులకుఁ బ్రభువయినరావణునిచే నియోగింపఁబడియుండు; రక్షసాం= రాక్షసులయొక్క; సమాహ్వానమపి=పిలుచుటను; కుర్యుః=సేయుదురు.

అంత, రాక్షసస్త్రీలు, రాక్షసేశ్వరుండగురావణునింట, రావణునిచే నియోగింపఁబడికావలియుండు రాక్షసులంబిలుతురు. అని, తాత్పర్యము.

తే శూలశక్తినిస్త్రింశ వివిధాయుధపాణయః. ౨౯
ఆపతేయు ర్విమర్దేఽస్మి న్వేగేనో ద్విగ్నకారిణః

టీక॥ తే=ఆ రాక్షసులు; శూలశక్తినిస్త్రింశవివిధాయుధపాణయః=శూలముచిల్లకోలకత్తిమొదలగు నానావిధములయినయాయుధములు చేతులందుఁ గలవారలై; వేగేన=వేగముచే; ఉద్విగ్నకారిణః = భయముసేయువారలై; అస్మిన్=ఈ; విమర్దే=యుద్ధమందు; ఆపతేయుః=వత్తురు.

ఆ రాక్షసులు, శూలంబులుఁజిల్లకోలులుఖడ్గములు మొదలగు నానావిధాయుధములఁజేతులందాల్చి, వేగంబునఁ జూపరులకుభయంబుగలిగించుచు, యుద్ధంబునకు, వత్తురు.

అని, తాత్పర్యము.

సంరుద్ధ స్తైస్తు పరితో విధమన్ రక్షసాం బలమ్. ౩౦

శక్నుయాం న తు సంప్రాప్తుం పరం పారం మహోదధేః

టీక॥అహం=నేను; తైః= ఆరాక్షసులచేత; పరితః = చుట్టును; సంరుద్ధస్తు=అడ్డగింపఁబడినవాఁడయ్యును; రక్షసాం=రాక్షసులయొక్క; బలం=సైన్యమును; విధమన్ = ప్రహరించుచు; మహోదధేః=మహాసముద్రముయొక్క; పరం=అవ్వలి; పారం = గట్టును; సంప్రాప్తుంతు=పొందుటకుమాత్రము; న శక్నుయాం=చాలను.

ఆరాక్షసులునన్నునాలుగు ప్రక్కలంజుట్టుకొనియడ్డగింపఁగా, నేనువారలనందఱఁబ్రహరింపనైనను శక్తుండనగుదును, గాని, యీమహాసముద్రమును దాఁటియవ్వలిగట్టుఁజేరఁజాలను.

అని, తాత్పర్యము.

మాం వా గృహ్ణీయు రాప్లుత్య బహవ శ్శీఘ్రకారిణః. ౨౯

టీక॥శీఘ్రకారిణః=వేగముగాబనిఁజేయునట్టి; బహవః=అనేకములయినరాక్షసులు; ఆప్లుత్య=ఎగిరి; మాం=నన్ను; గృహ్ణీయుర్వా=పట్టుకొనినఁబట్టుకొనుదురు.

చులుకుగాఁ బనిసేయునట్టియీరాక్షసులనేకులుచేరి, యాకాశమునకెగి, నన్నుఁబట్టుకొనినఁబట్టుకొందురు.

అని, తాత్పర్యము.

స్యా దియం చాఽగృహీతార్థా మమచ గ్రహణంభవేత్

టీక॥తవా(అధ్యాహృతము)= అప్పుడు; ఇయంచ=ఈసీతయును; అగృహీతార్థా = గ్రహింపఁబడని వృత్తాంతముగలది, రామవృత్తాంతము దెలియనిదనుట; స్యాత్=అగును; మమచ= నాకును; గ్రహణం= పట్టుకొనుట; భవేత్=సంభవించును.

అట్లగునేని, యీసీతకు రామవృత్తాంతముదెలియకపోవును; నేనురాక్షసులచేతిలోఁజిక్కుదును.

అని, తాత్పర్యము.

హింసాభిరుచయో హింస్యు రిమాం వా జనకాత్మజామ్. ౩౦

టీక॥ హింసాభిరుచయః= హింసించుటయందుఁగోరికి గలవారలగురాక్షసులు; ఇమాం= ఈ; జనకాత్మజాం=జనకుని కూఁతురయినసీతను; హింస్యుర్వా=చంపిననుంజంపుదురు.

ఈ రాక్షసులు, ఎప్పుడునుజీవకోటులంజంపఁగోరుచుండు వారలుగావున, ఈసీతను, జంపినను జంపుదురు.

అని, తాత్పర్యము.

విపన్నం స్యాత్తతః కార్యం రామసుగ్రీవయో రిదమ్

టీక॥ తతః=అంత ; రామసుగ్రీవయోః=రామునియొక్కయుసుగ్రీవునియొక్కయు; ఇదం=ఈ; కార్యం=పని; విపన్నం = నాశమునొందినది ; స్యాత్ =అగును.

అట్లగునేని, రాముండునుసుగ్రీవుండును సాధింపఁగోరియుండు కార్యముంతయు, నాశమునొందును.

అని, తాత్పర్యము.

ఉద్దేశే నష్టమార్గేఽస్మిన్ రాక్షసైః పరివారితే. ౩౧
సాగరేణ పరిక్షిప్తే గుప్తే వసతి జానకీ

టీక॥ జానకీ= జనకునికొమార్తెయగుసీత; నష్టమార్గే=అగపడనిదారిగలదియును; రాక్షసైః= రాక్షసులచేత; పరివారితే=చుట్టఁబడినదియును; సాగరేణ = సముద్రముచేత ; పరిక్షిప్తే=చుట్టబడినదియును; గుప్తే=రహస్యమయినదియునగు; అస్మిన్ = ఈ; ఉద్దేశే=ప్రదేశమునందు; వసతి = ఉన్నది.

వానరులకెవ్వరికిని దెలియని దారిగలదియుఁబెక్కురాక్షసులు గావలియున్నదియుఁజుట్టును సముద్రముచేఁబరివేష్టింపఁబడియున్నదియు, నెవ్వరికిని దెలియనిదియునగు, నీస్థలంబున, సీతయున్నది. అని, తాత్పర్యము.

విశస్తే వా గృహీతే వా రక్షోభి ర్మయి సంయుగే. ౩౨
నాన్యం పశ్యామి రామస్య సహాయం కార్యసాధనే

టీక॥ మయి=నేను; సంయుగే — యుద్ధమునందు; రక్షోభిః— రాక్షసుల చేత; విశస్తేవా=చంపఁబడఁగాగాని; గృహీతేవా= పట్టుకొనఁబడఁగాఁగాని; కార్యసాధనే=పనిసాధించుటయందు; సహాయం=తోడగు; అన్యం=మఱియొకని; నపశ్యామి=చూడను.

నేను, యుద్ధంబున రాక్షసులచేఁజచ్చినను, బట్టువడినను, మఱల, రామునకుసహాయుఁడైయిట్టి కార్యముసాధింపఁగలవాఁడు, మఱియొవ్వఁడు, నాకగపడలేదు. అని, తాత్పర్యము.

విమృశంశ్చ నపశ్యామి యో హతే మయి వానరః. ౩౩
శతయోజనవిస్తీర్ణం లంఘయేత మహోదధిమ్

టీక॥మయి=నేను; హతే—చంపఁబడఁగా; యః=ఏ; వానరః=వానరుఁడు; శతయోజనవిస్తీర్ణం=నూఱుయోజనములదూరముగల; మహోదధిం=మహాసముద్రమును; లంఘయేత= దాఁటునో; తం(అధ్యాహృతము)= అతని; విమృశంశ్చ—ఆలోచించుచును; నపశ్యామి—చూడకున్నాను.

నేనిచ్చటయుద్ధంబునంజచ్చిన పిమ్మట, నూఱుయోజనంబులదూరము, ఈ మహాసముద్రమును దాఁటంజాలిన వానరుండు, మఱియొవ్వండును, ఎంతయాలోచించినను, నాబుద్ధికగపడలేదు. అని, తాత్పర్యము.

కామం హంతుం సమర్థోఽస్మి సహస్రాణ్యపి రక్షసామ్. ౩౪
నతు శక్ష్యామి సంప్రాప్తుం పరం పారం మహోదధేః

టీక॥అహం—నేను; రక్షసాం= రాక్షసులయొక్క; సహస్రాణ్యపి= వేలనైనను; హంతుం=చంపుటకు; కామం—మిక్కిలియు; సమర్థః=శక్తుండను; అస్మి=అగుచున్నాను. మహోదధేః=మహాసముద్రముయొక్క; పరం=అవ్వలి; పారం=గట్టును; సంప్రాప్తుం—పొందుటకుమాత్రము; నశక్ష్యామి=చాలను.

నే, నెన్నివేలరాక్షసులనైనను, సరకుసేయక, చంపంగలను, గాని, యట్లు యుద్ధంబున నలసిన పిమ్మట, నీమహాసముద్రమును దాఁటి, యవ్వలిగట్టును జేరఁజాలను. అని, తాత్పర్యము.

అసత్యానిచ యుద్ధాని సంశయో మే నరోచతే. ౩౫
కశ్చ నిస్సంశయం కార్యం కుర్యాత్ప్రాజ్ఞ స్ససంశయమ్
"కశ్చనిస్సంశయః" ఇతిపాఠాంతరం.

టీక॥ యుద్ధానిచ= యుద్ధములును; అసత్యాని=అవ్యవస్థితములు, జయప్రదములనునిశ్చయము లేనివనుట. మే=నాకు; సంశయః=సందేహము గల్గించు కార్యము; నరోచతే= ఇష్టముగాదు. ప్రాజ్ఞః=పండితుండు; కః= ఎవ్వఁడు; ససంశయం=సందేహముతోఁగూడిన; కార్యం=పనిని; నిస్సంశయం= సందేహములేక; నిస్సంశయః (అనిపాఠాంతరము)=సందేహములేనివాఁడై; కుర్యాత్=చేయును?

యుద్ధములో జయమే గల్గునని నిశ్చయింపఁగూడదు; అపజయము గల్గిననుగల్గును; కావున, నిట్లుసందిగ్ధంబగు కార్యము సేయుటకు నాకుసమ్మతి లేదు; పండితుండగువాఁడెవ్వఁడును, ఇట్లుసందిగ్ధంబగు కార్యమును నిస్సంశయముగాఁ జేయఁజాలఁడు. అని, తాత్పర్యము.

ప్రాణత్యాగశ్చ వైదేహ్యా భవే దనభిభాషణే. ౩౬

టీక॥ అనభిభాషణేచ=మాటలాడకుండుటయందును; వైదేహ్యాః = సీతయొక్క; ప్రాణత్యాగః=ప్రాణంబుల విడుచుట; భవేత్ (అధ్యాహృతము)= అగును.

నేనుసీతతో మాటలాడక యే పోదునేని, సీతాదేవి , తనకెవ్వరును దిక్కులేరనుకొని, ప్రాణంబులు విడుచును. అని, తాత్పర్యము.

ఏష దోషో మహాన్ హి స్యా న్మమ సీతాభిభాషణే

టీక॥ సీతాభిభాషణే= సీతతో మాటలాడుటయందు; మమ = నాకు; ఏషః= ఈ; మహాన్ =గొప్పదైన ; దోషః=దోషము; స్యాద్ధి= అగునుగదా!

సీతతో మాటలాడినను, ఇప్పుడు చెప్పినట్లు, నాకు, మహాదోషము సంభవించును. అని, తాత్పర్యము.

భూతాశ్చార్థా వినశ్యంతి దేశకాలవిరోధితాః. ౩౭
“భూతాశ్చార్థావిపద్యంతే” ఇతిపాఠాంతరం.
విక్లబం దూత మాసాద్య తమ స్సూర్యోదయే యథా

టీక॥ భూతాః = సిద్ధములయిన; అర్థాశ్చ=కార్యములును; విక్లబం= వివేకములేని; దూతం=రాయబారిని; ఆసాద్య = పొంది; దేశకాలవిరోధితాః= దేశముచేతను గాలముచేతను విరోధించినవై; సూర్యోదయే=సూర్యునియుదయమునందు; తమోయథా = చీకటియుంబోలె; వినశ్యంతి= నశించుచున్నవి. విపద్యంతే(అని, పాఠాంతరము)=నశించును.

సర్వసిద్ధములయినను గార్యములు దూతవివేకములేనివాఁడగునేని, సూర్యోదయమునందుఁ, జీకటి నశించునట్లు, నశించును. అని, తాత్పర్యము,

అర్థానర్థాంతరే బుద్ధిర్నిశ్చితాపి నశోభతే. ౩౮
ఘాతయంతి హి కార్యాణి దూతాః పండితమానినః

టీ॥ అర్థానర్థాంతరే=కార్యాకార్యవిషయమునందు; నిశ్చితాపి=నిశ్చయింపఁబడినదైనను; బుద్ధిః= యుక్తి, నశోభతే= ప్రకాశింపదు. పండితమానినః=పండితులమను నహంకారముగల; దూతాః=దూతలు; కార్యాణి=పనులను; ఘాతయంతిహి=చెఱుపుదురుగదా!

ప్రభువు, కార్యాకార్యవిషయమునందుఁ, జక్కఁగా నాలోచించి, “ఇట్లు చేయవలసిన” దని నిశ్చయించినను, కార్యమునందవివేకులగు దూతలనియోగించునేని, అది యెంతమాత్రము చక్కఁబడదు; ఈదూతలు, తమకేమియుఁ దెలియకున్నను, దమకన్నఁ బండితులు లేరని యహంకరించి, కార్యంబులం జెఱుతురు. అని, తాత్పర్యము.

నవినశ్యేత్కథం కార్యం వైక్లబ్యం నకథం భవేత్. ౩౯
లంఘనంచ సముద్రస్య కథన్ను నవృథా భవేత్

టీక॥ కార్యం=పని; కథం=ఎట్లు; నవినశ్యేత్=చెడకుండును? మమ (అధ్యాహృతము)=నాకు; వైక్లబ్యం=అవివేకము లేకుండుట: కథం= ఎట్లు; నభ

వేత్ = కలుగకుండును; సముద్రస్య = సముద్రముయొక్క; లంఘనంచ = దాఁటుటయును; కథన్ను = ఎట్లు; వృథా = వ్యర్థము; నభవేత్ = కాకుండును?

రామకార్యము జెడకుండునట్లును, ఈమహాసముద్రంబు దాఁటినది, వ్యర్థము గాకుండునట్లును, జేయవలెను ; ఆయుపాయమేది? అని, తాత్పర్యము.

కథన్ను ఖలు వాక్యం మే శృణుయా న్నోద్విజేతవా. ౪౦

టీక॥ సీతా (అధ్యాహృతము) = సీతాదేవి; మె = నాయొక్క; వాక్యం = మాటను; కథన్ను = ఎట్లు ; శ్రుణుయాత్ = వినును? వా = లేక ; నోద్విజేత = భయపడకయయిననుండును?

సీత, నేనుజెప్పుమాటను, వినునట్లుగాని , లేక, నామాటనువిని భయపడకుండునట్లుగాని, నేనుమాటలాడవలెను. అని,హనుమంతుండు , ఆలోచించెను. అని, తాత్పర్యము,

ఇతి సంచింత్య హనుమాం శ్చకార మతిమా న్మతిమ్

టీక॥ మతిమాన్ = అధికమయినబుద్ధిగల; హనుమాన్ = హనుమంతుఁడు; ఇతి = ఇట్లు; సంచింత్య = చక్కఁగానాలోచించి; మతిం = తలంపును; చకార = చేసెను.

బుద్ధిమంతుండగు హనుమంతుం డిట్లుచక్కఁగా నాలోచించి, చేయవలసినవిధము,నిట్లని, నిశ్చయించెను. అని, తాత్పర్యము.

రామ మక్లిష్టకర్మాణం స్వబంధు మనుకీర్తయన్. ౪౧
నైనా ముద్వేజ యిష్యామి తద్బంధుగతమానసామ్

టీక॥ అహం (అధ్యాహృతము) = నేను ; అక్లిష్టకర్మాణం = దుఃఖములేనికార్యములుగల, ఎవ్వారికినిదుఃఖంబుగలిగించుకార్యములు సేయనివాఁడనుట ; స్వబంధుం = తనబంధువయిన; రామం = రామునిని; అనుకీర్తయన్ = పొగడుచు; తద్బంధుగతమానసాం = ఆబంధుండగు రామునిఁబొందినమనసుగల; ఏనాం = ఈసీతను ; నోద్వేజయిష్యామి = భయపడునట్లు చేయకుండెదను.

నేను, ఈసీతకుబంధుండగు రామునిఁగీర్తించెదను; కావున,నీసీతమనస్సు రామునియందెబద్ధమయియుండుటంజే

సీయావిదెకభయంబుగలుగదు. అని, తాత్పర్యము.

ఇక్ష్వాకూణాం వసిష్ఠస్య రామస్య విదితాత్మనః. ౪౨
శుభాని ధర్మయుక్తాని వచనాని సమర్పయన్
శ్రావయిష్యామి సర్వాణిమధురాం ప్రబ్రువన్ గిరమ్. ౪౩

టీక॥అహం(అధ్యాహృతము)=నేను;ఇక్ష్వాకూణాం= ఇక్ష్వాకువంశమునందుఁబుట్టినవారలలో; వసిష్ఠస్య=శ్రేష్ఠుండును;విదితాత్మనః= తెలియఁబడినయాత్మగలవాఁడునగు; రామస్య=రామునియొక్క;శుభాని= మంగళకరములును;ధర్మయుక్తాని= ధర్మముతోఁగూడినవియునగు;వచనాని = మాటలను;సమర్పయన్=అప్పగించుచు; మధురాం=మనోహరమయిన;గిరం = వాక్కును;ప్రబ్రువన్ = చెప్పుచు;సర్వాణి=అన్నింటిని;శ్రావయిష్యామి= వినిపించెదను.

ఇక్ష్వాకువంశమునఁ బుట్టినవారలలో శ్రేష్ఠుండును బరమాత్మ వేత్తయునగు రాముండు, సీతకుఁ జెప్పుమని, చెప్పిన, ధర్మిష్ఠంబులగు మంగళవచనంబులను, మెల్ల మెల్లగా ; జెప్పుచు , నిట్లుమధురవచనంబున, రామునిమాటలనన్నింటిని; వినిపించెదను.
అని, తాత్పర్యము.

శ్రద్ధాస్యతి యథా హీయం తథా సర్వం సమాదధే

టీక॥యథా=ఎట్లు;ఇయం= ఈసీత; శ్రద్ధాస్యతి=నమ్మునో; తథా=అట్లు; హనుమాన్(అధ్యాహృతము)=హనుమంతుఁడు; సర్వం=అంతను; సమాదధే=నిశ్చయించెనుగదా!

ఎట్లుచెప్పినట్టయిన,నీసీత, భయంబునొందక, హనుమంతునిమాటపైనమ్మకముంచునో, ఆప్రకారముగానే, చెప్పునట్లు,హనుమంతుండు. నిశ్చయించినాఁడు. అని,తాత్పర్యము.

ఇతి స బహువిధం మహానుభావో
జగతిపతేః ప్రమదా మవేక్షమాణః. ౪౪

మధురమవితథం జగాదవాక్యం
ద్రుమవిటపాంతర మాస్థితో హనూమాన్

మహానుభావః= అధికమయిన ప్రభావముగల; సః= ఆ; హనూమాన్= హనుమంతుఁడు; ద్రుమ విటపాంతరం= చెట్టుకొమ్మనడుమును; ఆస్థితః= పొందినవాఁడై; జగతిపతేః (జగతీపతేః)= భూమికిఁబ్రభువైన రామునియొక్క; ప్రమదాం= భార్యను; అవేక్షమాణః= చూచుచు; ఇతి= ఇట్లు; వక్ష్యమాణప్రకారమునను; మధురం= మనోహరమయినదియును; అవితథం= వ్యర్థముకానిదియునగు; వాక్యం= మాటను; బహువిధం= పెక్కువిధములు గలుగునట్లుగా; జగాద= చెప్పెను.

మహానుభావుండగు నాహనుమంతుండు, చెట్టుకొమ్మపైసీతకగపడ కుండి, సీతంజూచుచు, మధురంబును వ్యర్థమయినసంగతిలేనిదియునగు మాట, నీప్రకారముగా, నానావిధంబులం, జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, త్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండత్రింశసర్గటీక,
ముగిసినది.

శ్రీ

ఏకత్రింశసర్గప్రారంభః.

ఏవం బహువిధాం చింతాం చింతయిత్వా మహాకపిః
సంశ్రవే మధురం వాక్యం వైదేహ్యా వ్యాజహార హ. ౧

టీక॥ మహాకపిః = పెద్దకోఁతియగుహనుమంతుఁడు; ఏవం= ఇట్లు; బహువి




ధాం=అనేకవిధములయిన; చింతాః=ఆలోచనమును ; చింతయిత్వా=ఆలోచించి, చేసియనుట; వైదేహ్యాః = సీతయొక్క-("హ" అననదిపాదపూరణార్థము); సంశ్రవే = సమీపమునందు; లేక, సంశ్రవే=వినుటయందు; మధురం= మనోహరమయిన; వాక్యం = మాటను; వ్యాజహార=చెప్పెను.

హనుమంతుండిట్లునానావిధములుగా నాలోచించి, సీతాదేవిసమీపంబున, విన్నంతనెసంతోషంబుగల్గించునట్టి మధురంబగు, మాటం, జెప్పెను.

అని, తాత్పర్యము.



రాజా దశరథో నామ రథకుంజరవాజిమాన్
పుణ్యశీలో మహాకీర్తి ఋజురాసీన్మహాయశాః. ౨

టీక॥ రథకుంజరవాజిమాన్=రథంబులు నేనుంగులు గుఱ్ఱంబులుఁ గలవాఁడును; పుణ్యశీలః=పుణ్యస్వభావము గలవాఁడును; మహాకీర్తిః=అధికమయిన దానంబునంగల్గిన కీర్తిగల వాఁడును; ఋజుః=కపటములేనివాఁడును; మహాయశాః = అధికమయిన, పరాక్రమంబునంగల్గిన కీర్తిగలవాఁడునగు ; దశరథో నామ=దశరథుం డనియెడు ; రాజా=రాజు ; ఆసీత్=ఉండెను.







రథంబులు నేనుంగులు గుఱ్ఱంబులుఁ గలిగి, పుణ్యంబులు మాత్రమె సేయుచుఁ గపటంబులేక, దానంబుల నేమి పరాక్రమంబున నేమి యధికమయిన కీర్తిఁ బొందియుండు, దశరథుండను రాజొకఁడుండెను. అని, తాత్పర్యము.

రాజర్షీణాం గుణశ్రేష్ఠ స్తపసాచర్షిభిస్సమః
చక్రవర్తి కులేజాతః పురందరసమో బలే. ౩

టీక॥ సః(అధ్యాహృతము)= ఆదశరథమహారాజు ; రాజర్షీణాం = రాజర్షులలోపల; గుణశ్రేష్ఠః = గుణంబులచే శ్రేష్ఠుండు. తపసాచ = తపస్సుచేతను; ఋషిభిః=ఋషులతో ; సమః=సమానుండు. చక్రవర్తికులే=చక్రవర్తులవంశమునందు; జాతః = పుట్టినవాఁడు. బలే=బలమునందు; పురందరసమః= ఇంద్రునితోసమానుండు .

ఆదశరథుఁడు, గుణంబులరాజర్షులలోఁగడునధికుండు , తపంబునఋషులకుసరివచ్చువాఁడు ; చక్రవర్తులగు రాజులవంశంబునం బుట్టినవాఁడు ; పరాక్రమంబున, దేవేంద్రునకుసరియగును.

అని, తాత్పర్యము.

అహింసారతి రక్షుద్రో ఘృణీ సత్యపరాక్రమః
ముఖ్యశ్చే క్ష్వాకువంశస్య లక్ష్మీవాన్ లక్ష్మివర్ధనః. ౪

టీక॥సః(అధ్యాహృతము)= ఆదశరథుఁడు;అహింసారతిః=హింసింపకుండుటయందిచ్ఛగలవాఁడు. అక్షుద్రః= దుష్టుఁడుగాఁడు. ఘృణీ=దయగలవాఁడు.సత్యపరాక్రమః= ఎప్పటికినివ్యర్థముకానిపరాక్రమముగలవాఁడు.ఇక్ష్వాకువంశస్యచ=ఇక్ష్వాకువుయొక్క-వంశమునకంతయు.ముఖ్యః=శ్రేష్ఠుఁడు. లక్ష్మీవాన్=అధికమయినసంపదగలవాఁడు.లక్ష్మీవర్ధనః=సంపదనువృద్ధిఁబొందించువాఁడు.

ఆ దశరథుఁడు, ప్రాణిలోకమును హింసింపఁడు;దుష్టుఁడుగాఁడు; దయాశాలి; దృఢమయిన పరాక్రమంబుగలవాఁడు; ఇక్ష్వాకువంశమునకంతయు ముఖ్యుఁడు; అధికమయిన సంపదగలవాఁడు; ఆశ్రితులసంపదనువృద్ధిఁబొందించువాఁడు. అని, తాత్పర్యము.




పార్థివవ్యంజనై ర్యుక్తః పృథుశ్రీః పార్థివర్షభః
పృథివ్యాం చతురంతాయాం విశ్రుత స్సుఖద స్సుఖీ. ౫

టీక॥ సః (అధ్యాహృతము)= ఆదశరథుఁడు; పార్థివవ్యంజనైః= రాజలక్షణములతోఁ; యుక్తః = కూడినవాఁడు. పృథుశ్రీః=అధికమయిన కాంతిగలవాఁడు. పార్థివర్షభః రాజశ్రేష్ఠుఁడు. చతురంతాయాం=నాలుగు కొనలుగల; పృథివ్యాం=భూమియందు ; విశ్రుతః=ప్రసిద్ధుఁడు. సుఖదః = సుఖము నిచ్చువాఁడు.

మఱియు నాదశరథుఁడు, శంఖచక్రరేఖలు మొదలగు రాజలక్షణములుగలవాఁడు; అధికమయిన దేహకాంతిగలవాఁడు; రాజులలో మేటియయినవాఁడు; చతుస్సముద్రంబుల నడుమనుండు భూమియందంతటను బ్రసిద్ధి నొందినవాఁడు; జనులకు సుఖంబుగలుగఁ జేయువాఁడు; మిక్కిలియు సుఖంబు ననుభవించువాఁడు. అని, తాత్పర్యము.

తస్య పుత్రః ప్రియో జ్యేష్ఠ స్తారాధిపనిభాననః
రామోనామ విశేషజ్ఞ శ్శ్రేష్ఠ స్సర్వధనుష్మతామ్. ౬

టీక॥ తస్య = ఆదశరథునకు; తారాధిపనిభాననః= చంద్రునితోఁ సమానమయినముఖముగలవాఁడును ; విశేషజ్ఞః=విశేషంబు నెఱింగిన వాఁడును; సర్వధనుష్మతాం = ఎల్ల విలుకాండ్రలోను; శ్రేష్ఠః = మేటియయినవాఁడును; జ్యేష్ఠః = తోఁబుట్టువులలోఁ బెద్దవాఁడును; ప్రియః=ఇష్టుండునగు; రామోనామ=రాముండనెడు; పుత్రః = కొడుకు; అస్తి (అధ్యాహృతము)= ఉన్నాఁడు.

ఆదశరథునకుఁ, జంద్రబింబముబోలు ముఖంబుగలవాఁడును ధర్మవిశేషంబుల నెఱింగినవాఁడును విలుకాండ్రందఱిలోను శ్రేష్ఠుండును, ప్రియుండునగు జ్యేష్ఠపుత్రుండు, రాముండనువాఁడు, గలఁడు. అని, తాత్పర్యము.

రక్షితా స్వస్య ధర్మస్య స్వజనస్యచ రక్షితా
రక్షితా జీవలోకస్య ధర్మస్యచ పరంతపః. ౭

టీక॥ సః(అధ్యాహృతము)=ఆరాముఁడు; స్వస్య=తనదైన; ధర్మస్య = ధర్మముయొక్క; రక్షితా=రక్షించువాఁడు. స్వజనస్యచ=తనబంధుజనముయొక్కయు; రక్షితా= రక్షించువాఁడు; జీవలోకస్య=ప్రాణిసమూహముయొక్కయు; రక్షితా = రక్షించువాఁడు. ధర్మస్యచ = వర్ణాశ్రమధర్మముయొక్కయుః రక్షితా (అధ్యాహృతము)=రక్షించువాఁడు. పరంతపః = శత్రువులఁదపింపఁజేయువాఁడు.

ఆరాముండు, తనక్షత్రియవర్ణమునకు విధింపఁబడినధర్మమును రక్షించుకొను వాఁడు; తనధర్మమునురక్షించుకొనునట్లుతనబంధుజనమును రక్షించును;తనబంధుజనమును రక్షించునట్లు సమస్తప్రాణులనురక్షించును; అట్లువర్ణాశ్రమ ధర్మమును దప్పకుండ రక్షించువాఁడు ; శత్రువులం జంపువాఁడు.

అని, తాత్పర్యము.

తస్య సత్యాభిసంధస్య వృద్ధస్య వచనాత్పితుః
సభార్య స్సహచభ్రాత్రా వీరః ప్రవ్రాజితో వనమ్. ౮

టీక॥ సత్యాభిసంధస్య=సత్యమయినసంకల్పముగలవాఁడును; వృద్ధస్య = ముదుసలివాఁడును; పితుః=తండ్రియునగు;తస్య=ఆదశరథునియొక్క; వచనాత్=మాటవలన; వీరః=పరాక్రమశాలియగురాముండు ; సభార్యః = పెండ్లాముతోఁ గూడినవాఁడై; భ్రాత్రాచసహ=తమ్మునితోనుఁగూడ; వనం=అడవిని; ప్రవ్రాజితః=పొందినాఁడు.

సత్యసంకల్పుఁడును వృద్ధుండునగు తండ్రియయినదశరథునియాజ్ఞచేఁ, బరాక్రమశాలియగురాముండు, భార్యయుఁదమ్ముండును వెంటరా, నరణ్యంబునకుఁబోయెను. అని, తాత్పర్యము.

తేన తత్ర మహారణ్యే మృగయాం పరిధావతా
రాక్షసా నిహతా శ్శూరా బహవః కామరూపిణః. ౯

టీక॥తత్ర=ఆ; మహారణ్యే=గొప్పయడవియందు; మృగయాం= వేఁటను




గూర్చి; పరిధావతా = పరుగెత్తుచున్న, తిరుగుచున్నయనుట; తేన = ఆరాముని చేత; శూరాః = యుద్ధమునందు భయంబులేనివారలును; బహవః = అనేకులును; కామరూపిణః = ఇచ్ఛాధీనంబగు రూపముగలవారలునగు; రాక్షసాః = రాక్షసులు; నిహతాః = చంపఁబడినారు.

ఆమహారణ్యంబున, రాముండు, వేటాడుచు, శూరులును గామరూపులునగు రాక్షసులనేకుల ఖరుండు మొదలగువారలం, జంపెను. అని, తాత్పర్యము.

జనస్థానవధం శ్రుత్వా హతౌ చ ఖరదూషణౌ
తతస్త్వమర్షాపహృతా జానకీ రావణేన తు. ౧౦
వంచయిత్వా వనే రామం మృగరూపేణ మాయయా

టీక॥ జనస్థానవధం = జనస్థానంబునందలి రాక్షసులవధమును; హతౌ = చంపఁబడిన; ఖరదూషణౌ చ = ఖరుని దూషణుని; శ్రుత్వా = విని; తతస్తు = అటుపిమ్మటనె; రావణేన = రావణుని చేత ("తు" అనునది పాదపూరణార్థము); వనే = అడవియందు; రామం = రాముని; మాయయా = మాయచేత; మృగరూపేణ = జింకరూపముచేత; వంచయిత్వా = మోసపుచ్చి; జానకీ = సీత; అమర్షాపహృతా = కోపముచేనపహరింపఁబడినది.

రావణుఁడు, జనస్థానంబునందలి రాక్షసులందఱును ఖరుండును దూషణుండును రామునిచేఁ జచ్చుటనువిని, యంతఁ గోపంబున, రాముని మాయామృగరూపంబున మోసపుచ్చి, సీతనపహరించినాఁడు. అని, తాత్పర్యము.

స మార్గమాణస్తాం దేవీం రామస్సీతామనిందితామ్. ౧౧
ఆససాద వనే మిత్రం సుగ్రీవంనామ వానరమ్

టీక॥ సః = ఆ; రామః = రాముఁడు; వనే = అడవియందు; అనిందితాం = నిందింపఁబడని; దేవీం = భార్యయయిన; తాం = ఆ; సీతాం = సీతను; మార్గమాణః = వెదకుచు; సుగ్రీవంనామ = సుగ్రీవుఁడనియెడు; వానరం = వానరుని; మిత్రం = స్నేహితునిఁగా; ఆససాద = పొందెను.




ఆరాముండు, పతివ్రతయయిన తనభార్యనుసీతను వనంబున వెదకుచుఁ బోఁగా, నచ్చట,సుగ్రీవుఁడనువానరుండతనికి స్నేహితుండయ్యె.

అని, తాత్పర్యము.

తత స్స వాలినం హత్వా రామః పరపురంజయః. ౧౨
ప్రాయచ్ఛ త్కపిరాజ్యం త త్సుగ్రీవాయ మహాబలః

టీక॥ తతః=అటుపిమ్మట; పరపురంజయః=శత్రువుల పట్టణంబులజయించువాఁడును; మహాబలః=అధికమయిన బలముగలవాఁడునగు;సః=ఆ; రామః=రాముఁడు;వాలినం=వాలిని;హత్వా=చంపి; తత్=ఆ; కపిరాజ్యం=వానరులదొరతనమును; సుగ్రీవాయ=సుగ్రీవునికొఱకు;ప్రాయచ్ఛత్=ఇచ్చెను.

అంత, శత్రుపట్టణంబుల జయించువాఁడునుమహాబలుండునగురాముండు, వాలియనువానరుంజంపి , యతనికుండినవానరరాజ్యంబును,సుగ్రీవున,కిచ్చెను.

అని, తాత్పర్యము.

సుగ్రీవేణాపి సందిష్టా హరయః కామరూపిణః. ౧౩
దిక్షు సర్వాసు తాం దేవీం విచిన్వంతి సహస్రశః

టీక॥ కామరూపిణః= ఇచ్ఛాధీనంబగురూపములుగల; హరయః=వానరులు;సుగ్రీవేణాపి=సుగ్రీవునిచేతను;సందిష్టాః= ఆజ్ఞాపింపఁబడినవారలై ;సహస్రశః=వేనవేలుగా;సర్వాసు=సమస్తములయిన; దిక్షు = దిక్కులందును; తాం=ఆ;దేవీం=సీతాదేవిని; విచిన్వంతి=వెదకుచున్నారు.

అంత, సుగ్రీవుం డాజ్ఞాపింపఁగాఁ, గామరూపులగువానరులువేలకొలంది, సమస్తదిక్కులందును,ఆసీతాదేవిని,వెదకుచున్నారు.అని, తాత్పర్యము.

అహం సంపాతివచనా చ్ఛతయోజన మాయతమ్. ౧౪
అస్యా హేతో ర్విశాలాక్ష్యా స్సాగరం వేగవా న్ప్లుతః

టీక॥ అహం=నేను;విశాలాక్ష్యాః=వెడలుపులయినకండ్లుగల; అస్యాః=ఈ

సీతయనెడు; హేతోః= కారణమునకు; సంపాతివచనాత్ = సంపాతిమాటవలన; వేగవాన్ = మిక్కిలియు వేగముగలవాడనై; శతయోజనం= నూఱుయోజనములు; ఆయతం=దూరముగల; సాగరం= సముద్రమును; ప్లుతః = దాటినాడను.

నేను, ఈసీతకొఱకుగానే, సంపాతిమాటప్రకారము, వేగంబున, నూఱుయోజనంబుల దూరముగల, యీసముద్రమును దాటివచ్చినాను.

అని, తాత్పర్యము.

యథారూపాం యథావర్ణాం యథాలక్ష్మీంచ నిశ్చితామ్. ౧౫
అశ్రౌషం రాఘవస్యాహం సేయ మాసాదితా మయా

టీక॥ అహం=నేను; రాఘవస్య(పంచమ్యర్థమందుషష్ఠి) రామునివలన; యథారూపాం= ఎట్టిదేహముగలదానిగాను; యథావర్ణాం=ఎట్టిరంగుగలదానిగాను; యథాలక్ష్మీంచ=ఎట్టికాంతిగలదానిగాను; నిశ్చితాం=నిశ్చయింపఁబడినదానిగాను; అశ్రౌషం=వింటినో; సా= అట్టి; ఇయం= ఈసీత; మయా = నాచేత; ఆసాదితా=పొందఁబడినది.

రాముండు, నాకుసీతదేహంబును, రంగును గాంతియును, ఎట్లుండునని, చెప్పెనో, అట్లె దేహంబునురంగును గాంతియుంగల, యీసీతను, జూచినాను. అని, హనుమంతుఁడుచెప్పెను.

అని, తాత్పర్యము.

విరరామైవ ముక్త్వా సౌ వాచం వానరపుంగవః. ౧౬

టీక॥ వానరపుంగవః = వానరశ్రేష్ఠుండగు; అసౌ= ఈహనుమంతుఁడు; ఏవం= ఇట్లు; ఉక్త్వా=చెప్పి; విరరామ= ఊరకుండెను.

వానరశ్రేష్ఠుండగుహనుమంతుండింతవఱకుఁజెప్పి, యంతనూరకుండెను. అని, తాత్పర్యము.

జానకీచాపి తచ్ఛ్రుత్వా పరం విస్మయ మాగతా

టీక॥ జానకీచాపి = సీతయును; తత్ = ఆమాటను; శ్రుత్వా=విని; పరం= అధికమయిన; విస్మయం= ఆశ్చర్యమును; ఆగతా= పొందినది.

సీతయును, హనుమంతుఁడు చెప్పిన మాటలను, విని, "ఇప్పుడికక్కడ, నట్టి మాటలం జెప్పువాఁడెవ్వఁడు!" అని, మిక్కిలియు నాశ్చర్యమునొందెను.

అని, తాత్పర్యము.

తతః స్సా వక్రకేశాంతా సుకేశీ కేశసంవృతమ్. ౧౭
ఉన్నమ్య వదనం భీరు శ్శింశుపావృక్ష మైక్షత

టీక|| తతః=అటుపిమ్మట; వక్రకేశాంతా=వంకరలయిన వెంట్రుకలకొనలుగలదియును; సుకేశీ = సుందరములయిన వెంట్రుకలుగలదియును; భీరుః = భయపడుస్వభావము గలదియునగు; సా=ఆసీత; కేశసంవృతం=వెంట్రుకలచేఁగప్పఁబడిన; వదనం=ముఖమును; ఉన్నమ్య=ఎత్తి; శింశుపావృక్షం = శింశుపావృక్షమును; ఐక్షత = చూచెను.

అంతఁ, గొనలందు వంకరకలై సుందరములయియుండు వెంట్రుకలతో నొప్పుచుండు నాసీతాదేవి, భయపడుస్వభావంబుగలదిగావునఁ గొంచెము భయంబుగదుర, నురివోసికొనుటకై వెంట్రుకలం గప్పఁబడియుండు ముఖమును బైకెత్తి, శింశుపావృక్షముం జూచెను.

అని, తాత్పర్యము.

నిశమ్య సీతా వచనం కపేశ్చ
దిశశ్చ సర్వాః ప్రదిశశ్చ వీక్ష్య ౧౮
స్వయం ప్రహర్షం పరమం జగామ
సర్వాత్మనా రామ మనుస్మరంతీ

టీక|| సీతా=సీత; కపేః= వానరుని యొక్క; వచనం=మాటను; నిశమ్య చ=వినియును; సర్వాః=సమస్తములయిన; దిశశ్చ=దిక్కులను; విదిశశ్చ=విదిక్కులను; వీక్ష్య= చూచి; సర్వాత్మనా= సమస్తమయిన మనస్సుచేత; రామం=రాముని; అనుస్మరంతీ=ధ్యానించుచు; స్వయం= తాను; పరమం=మిక్కిలియు నధికమయిన; ప్రహర్షం=సంతోషమును; జగామ=పొందెను.

సీతాదేవి, హనుమంతుని మాట విని, సమస్తములయిన దిక్కులను విది

కర్కులనుంజూచి, యెవ్వరినింగానక, నిశ్చలంబగుమనంబున, నేకాకారంబు గాధ్యానించుచుఁ, బరమసంతోషంబు నొందెను- అని, తాత్పర్యము.

సా తిర్యగూర్ధ్వంచ తథాప్యధస్తా
న్నిరీక్షమాణా త మచింత్యబుద్ధిమ్. ౧౯
దదర్శ పింగాధి పతే రమాత్యం
వాతాత్మజం సూర్య మివోదయస్థమ్

టీక॥సా=ఆసీత;తిర్యక్ = అడ్డముగాను;ఊర్ధ్వంచ=పైఁగాను; తథా= అట్లు;అధస్తాదపి=క్రిందను; నిరీక్షమాణా= వెదకుచు;అచింత్యబుద్ధిం= ఎన్నరానిబుద్ధిగలవాఁడును; పింగాధిపతేః= వానరులకుఁ బ్రభువైన సుగ్రీవునియొక్క;అమాత్యం = మంత్రియును;ఉదయస్థం= ఉదయకాలంబుననుండు;సూర్యమివ(స్థితం)= సూర్యుఁడుంబోలెనున్నవాఁడునగు; వాతాత్మజం=వాయుదేవునికొడుకైనహనుమంతుని;దదర్శ= చూచెను.

సీతాదేవి, యాశింశుపావృక్షమునకుఁ, బార్శ్వంబులను,బైగానుఁగ్రిందను వెదకుచు,అచింత్యంబగుబుద్ధిగలవాఁడును వానరేశ్వరుండగు సుగ్రీవునిమంత్రియును, ఉదయకాల సూర్యుండుంబోలెఁ జూపరులకు సంతోషంబుగలిగించువాఁడునగు వాయుకుమారునిహనుమంతునింజూచెను.అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, ఏకత్రింశస్సర్గః
ఇది,స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, సుందరకాండైకత్రింశసర్గటీక, ముగిసినది.

శ్రీః.

ద్వాత్రింశసర్గప్రారంభః.

తత శ్శాఖాంతరే లీనం దృష్ట్వా చలితమానసా
వేష్టితార్జునవస్త్రం తం విద్యుత్సంఘాతపింగళమ్. ౧

టీక॥ తతః= అటుపిమ్మట; సా(అధ్యాహృతము)=ఆసీతాదేవి; శాఖాంతరే=కొమ్మనడుమునందు; లీనం = దాఁగినవాఁడును; వేష్టితార్జునవస్త్రం= చుట్టుకొనఁబడిన తెల్లనివస్త్రముగలవాఁడును; విద్యుత్సంఘాతపింగళం = మెఱపులయొక్క సమూహమువలెగోరోజనమువంటి వర్ణముగలవాఁడునగు; తం=ఆహనుమంతుని; దృష్ట్వా = చూచి; చలితమానసా=భయంబునొందిన మనసుగలది; అభూత్ (అధ్యాహృతము)=ఆయెను.

అంత, నాసీతాదేవి, చెట్టుకొమ్మనడుమదాఁగినవాఁడై; తెల్లనివస్త్రముగట్టుకొని, మెఱపులసమూహమునకుంబోలెఁ బ్రకాశంబు గలిగియుండు, నాహనుమంతుంజూచి, కొంచెముభయంబునొందెను. అని, తాత్పర్యము.

సా దదర్శ కపిం తత్ర ప్రశ్రితం ప్రియవాదినమ్
ఫుల్లాశోకోత్కరాభాసం తప్తచామీకరేక్షణమ్. ౨

టీక॥ సా=ఆసీత; తత్ర = ఆచెట్టుకొమ్మపై; ప్రశ్రితం = వినయముగలవాఁడును; ప్రియవాదినం=సంతోషముగలిగించుమాటలం జెప్పుచున్నవాఁడును; ఫుల్లాశోకోత్కరాభాసం= వికసించిన యశోకపుష్పముల సమూహముయొక్క కాంతివంటికాంతి గల వాఁడును; తప్తచామీకరేక్షణం=ఊఁదుబంగారమువంటికండ్లుగలవాఁడునగు; కపిం= వానరుని; దదర్శ=చూచెను.

అట్లు, సీతాదేవి, చక్కఁగాఁ జెట్టుకొమ్మపైఁజూడఁగా నాబిడకు, వినయంబుగలవాఁడై ప్రియవాక్యంబులుపలుకుచు, వికసించినయశోకపుష్పంబుల కాంతియుంబోలెఁబ్రకాశించుచు, నుత్తమమయిన బంగారము వన్నెగలకండ్ల

తోనొప్పుచుండు, వానరుండొకఁడు (హనుమంతుఁడు) కనుపడెను.

అని, తాత్పర్యము.

మైథిలీ చింతయామాస విస్మయం పరమం గతా

టీక॥ మైథిలీ=సీతాదేవి; పరమం=మిక్కిలియునధికమయిన; విస్మయం=ఆశ్చర్యమును; గతా=పొందినదై; చింతయామాస=ఆలోచించెను.

అంతసీతాదేవి; పరమాశ్చర్యంబునొంది, యిట్లని, చింతించెను.

అని, తాత్పర్యము.

అహో భీమ మిదం రూపం వానరస్య దురాసదమ్. ౩
దుర్నిరీక్ష మితి జ్ఞాత్వా పునరేవ ముమోహ సా

టీక॥ సా=ఆసీత; "ఇదం=ఈ; వానరస్య=కోఁతియొక్క; రూపం=ఆకారము; భీమం=భయంకరమయినది. దురాసదం= పొందగూడనిది; మహాదుఃఖంబు సంభవింపఁబోవు సమయంబున నెదీనిఁజూడంగల్గుననుట. దుర్నిరీక్షం=చూడఁగూడనిది, చూచువారికిమహాదుఃఖంబుగలిగించునదియనుట; అహో=అయ్యో! ఇతి=అని; జ్ఞాత్వా=తలఁచి; పునరేవ=మఱలను; ముమోహ=మోహంబునొందెను.

"అయ్యో! నాకీవానరరూపంబగపడినదే! ఇదిభయంకరమయినది; మహాదుఃఖంబుగల్గుసమయంబునంగాని యగపడదు; జూచువారలకు మహాదుఃఖము గల్గించునది." అని, తలంచి, సీతాదేవి, మఱల దుఃఖంబున, మూర్ఛనొందెను.

అని, తాత్పర్యము.

విలలాప భృశం సీతా కరుణం భయమోహితా. ౪
రామరామే తి దుఃఖార్తా లక్ష్మణేతిచ భామినీ

టీక॥ భామినీ=స్త్రీయగు; సీతా=సీతాదేవి; భయమోహితా=భయముచే మోహము నొందినదై; దుఃఖార్తా= దుఃఖముచేఁబీడింపఁబడినదై;

రామరామ=రాముఁడా రాముఁడా! ఇతి=అనియును; లక్ష్మణ=లక్ష్మణుఁడా! ఇతిచ=అనియును; కరుణం=వినువారలకుదుఃఖముగల్గునట్లుగా; భృశం = మిక్కిలియు; విలలాప=దుఃఖించెను.

సీతాదేవి, భయంబునను దుఃఖంబునను గుందుచు, "రాముఁడా! లక్ష్మణుఁడా!" అని పలుకుచు, వినువారలకును దుఃఖము గల్గునట్లుగా, నానాప్రకారంబుల, దుఃఖించెను. అని, తాత్పర్యము.

రురోద బహుధా సీతా మందం మందస్వరా సతీ. ౫

టీక॥ సీతా=సీత; మందస్వరాసతీ=తిన్ననికంఠధ్వనిగలదై; మందం=మెల్లఁగా; బహుధా=పెక్కువిధంబులను; రురోద=ఏడ్చెను.

అంత, సీత, రాక్షసస్త్రీలువిందురను భయంబునఁ, దిన్ననిశబ్దంబుతో, మెల్లఁగా, దుఃఖంబుపట్టఁజాలక, యేడ్చెను. అని, తాత్పర్యము.

సా తం దృష్ట్వా హరిశ్రేష్ఠం వినీతవ దుపస్థితమ్
మైథిలీ చింతయామాస స్వప్నోయ మితిభామినీ. ౬

టీక॥ భామినీ=స్త్రీయగు; సా=ఆ; మైథిలీ=సీత ; వినీతవత్=వినయముగల్గునట్లుగా ; ఉపస్థితం=సమీపించియున్న; హరిశ్రేష్ఠం=వానరశ్రేష్ఠుఁడగు ; తం=ఆహనుమంతుని; దృష్ట్వా = చూచి; "అయం=ఇది; స్వప్నః=కల ; ఇతి=అని ; చింతయామాస=తలఁచెను.

ఆసీతాదేవి, వినీతుండై, తనసమీపంబునందుఁ జెట్టుపై నుండువానరశ్రేష్ఠుని హనుమంతుం జూచి, ఈలంకయందట్టి రామవార్తం జెప్పువాఁ డెవ్వఁడునుండఁడు, కావున, నిది స్వప్నమె గాని వేఱుగాదు" అని, తలంచెను.
అని, తాత్పర్యము.

సా వీక్షమాణా పృథుభగ్నవక్త్రమ్
శాఖామృగేంద్రస్య యథోక్తకారమ్
దదర్శ పింగాధిపతే రమాత్యం
వాతాత్మజం బుద్ధిమతాం వరిష్ఠమ్. ౭

టీక॥ సా=ఆసీత; వీక్షమాణా = చూచుచు; పృథుభుగ్నవక్త్రం = పెద్దదియునువంకరయయినదియునగుముఖముగలవాడును; శాఖామృగేంద్రస్య=వానరులకుఁబ్రభువయినసుగ్రీవునకు;యథోక్తకారం= చెప్పినట్లుచేయువాఁడును; పింగాధిపతేః=వానరులకధిపుండైన సుగ్రీవుని యొక్క; అమాత్యం=మంత్రియును;బుద్ధిమతాం=అధికమయిన బుద్ధిగలవారలలోపల; వరిష్ఠం=శ్రేష్ఠుండునగు; వాతాత్మజం=వాయువుకొడుకైనహనుమంతుని; దదర్శ=చూచెను.

ఆసీత;ఇట్టట్టుఁజూచుచుఁబెద్దవంకరముఖంబుగలవాఁడును,వానరేశ్వరుండగసుగ్రీవునకుఁజెప్పినట్లు సేయువాఁడును,మంత్రియునుబుద్ధిమంతులలోపలశ్రేష్ఠుండునగు,వాయుదేవునికుమారునిహనుమంతుం,జూచెను.అని, తాత్పర్యము.

సా తం సమీక్ష్యైవ భృశం విసంజ్ఞా
గతాసు కల్పేవ బభూవ సీతా

టీక॥సా=ఆ; సీతా=సీత;తం=ఆహనుమంతుని;సమీక్ష్యైవ=చూచినంతనే; గతాసుకల్పేవ(స్థితా)= పోయినప్రాణంబులుగలదానివంటిదివలెనున్నదై;భృశం=మిక్కిలియు; విసంజ్ఞా=తెలివిదప్పినది;బభూవ=ఆయెను.

ఆసీత, హనుమంతునిఁ బూచినంతనె,చచ్చినదానివోలె,మైమఱచియుండెను. అని, తాత్పర్యము.

చిరేణసంజ్ఞాం ప్రతిలభ్య భూయో
విచింతయామాస విశాలనేత్రా.౮

టీక॥ విశాలనేత్రా=వెడలుపులయినకండ్లుగలసీతాదేవి;చిరేణ = బహుకాలమునకు;సంజ్ఞాం=తెలివిని; ప్రతిలభ్య=పొంది;భూయః=మఱల; విచింతయామాస=చింతించెను.

విశాలంబులగునేత్రంబులుగలసీతాదేవి,యంత,బహుకాలంబునకుమూర్ఛదేఱి,మఱల,నిట్లని,చింతించెను.

అని, తాత్పర్యము.

స్వప్నే మయాయం వికృతో ద్య దృష్ట
శ్శాఖామృగ శ్శాస్త్రగణై ర్నిషిద్ధః
స్వస్త్యస్తు రామాయ సలక్ష్మణాయ
తథా పితు ర్మే జనకస్య రాజ్ఞః. ౯

టీక॥మయా=నాచేత;అద్య=ఇప్పుడు; స్వప్నే=కలయందు ; శాస్త్రగణైః=శాస్త్రసమూహములచేత; నిషిద్ధః=నిషేధింపఁబడిన; వికృతః = వికారముగల; శాఖామృగః = కోఁతి; దృష్టః=చూడఁబడినది. సలక్ష్మణాయ= లక్ష్మణునితోఁగూడిన ; రామాయ= రామునికొఱకును; తథా = అట్లు; మే=నాయొక్క; పితుః = తండ్రియగు; రాజ్ఞః=రాజయిన; జనకస్య= జనకునకును; స్వస్తి=మంగళము; అస్తు=అగుఁగాక.

నే,నిప్పుడు,స్వప్నంబున, వికృతంబగుకోఁతిని జూచినాను; శాస్త్రములయందంతటను, స్వప్నంబునఁ గోఁతి నిఁజూచువారలకు మహాదుఃఖంబు గలుగునని చెప్పఁబడియున్నది; కావున,రామాదులకేమికష్టమువచ్చినదో! రామునకునులక్ష్మణునకునునాతండ్రి జనకమహారాజునకును మంగళంబు గలుగుఁగాక. అని,తాత్పర్యము.

స్వప్నోపి నాయం నహి మేస్తి నిద్రా
శోకేన దుఃఖేనచ పీడితాయాః
సుఖంహి మే నాస్తి యతోస్మి హీనా
తేనేందుపూర్ణప్రతిమాననేన. ౧౦

టీక॥అయం=ఇది;స్వప్నోపి = కలయును;న=కాదు.శోకేన = రామవిరహంబునఁగల్గినదుఃఖముచేతను; దుఃఖేనచ= రాక్షసులనడుమనుండుటవలనఁ గలిగినదుఃఖముచేతను; పీడితాయాః= పీడింపఁబడిన;మే=నాకు; నిద్రా=నిదుర;నాస్తిహి=లేదుగదా!యతః=ఏకారణమువలన ; అహం (అధ్యాహృతము)=నేను;ఇందుపూర్ణప్రతిమాననేన (పూర్ణేందుప్రతిమాననేన)= నిండు

చంద్రునితోఁబోలిక గలముఖముగల; తేన=ఆ రామునిచే; హీనా=విడువఁబడిన దానను; అస్మి = అగుచున్నానో; తతః (అధ్యాహృతము)=అందువలన; మే= నాకు; సుఖం=సుఖము ; నాస్తిహి= లేదుగదా!

రామవిరహంబునను రాక్షసులమధ్యంబునంజిక్కియుండుటవలనను, ఇట్లురెండువిధంబులనుమహాదుఃఖంబునొందిపరితపించుచున్నాను, గావున, నాకు, నిదుర వచ్చుట కెయ్యవకాశము లేదే! స్వప్నం బెట్లుగల్గును? మఱియు, నిండుచంద్రునింబోలుముఖంబు గలరాముని విడిచియున్నానే! నాకుసుఖం బెక్కడిది? సుఖంబు లేనిచో నిదుర యెట్లువచ్చును? కావున, నిది యెంతమాత్రము స్వప్నము కాదు.

అని, తాత్పర్యము.

రామేతి రామేతి సదైవ బుద్ధ్యా
విచింత్య వాచా బ్రువతీ తమేవ
తస్యానురూపాంచ కథాం తమర్థ
("కథాంతదర్థాం" ఇతిపాఠాంతరం)
మేవం ప్రపశ్యామి తథా శృణోమి. ౧౧

టీక॥ అహం(అధ్యాహృతము) = నేను; సదైవ= ఎల్లప్పుడునె ; రామేతి=రాముఁడాయని ; రామేతి=రాముఁడాయని; విచింత్య= ధ్యానించి ; తమేవ=ఆ రామునే; వాచా=నోటిచేత; బ్రువతీ=చెప్పుచు; తథా=అట్లు; తస్య= వానికి; అనురూపాం=తగినదియును; (పాఠాంతరమందు )తదర్థాం =ఆ రాముఁడె యర్థముగాఁగలదియునగు; కథాంచ=కథను; శృణోమి= వినుచున్నాను. ఏవం=ఇట్లే; తం=ఆ; అర్థం= అభిప్రాయమును ; ప్రపశ్యామి=చూచుచున్నాను.

నేను, ఎల్లప్పుడును, రామునే, ధ్యానించుచు, నోటం జెప్పుకొనుచున్నదానను; అందుకుఁదగినట్లుగా, నా రాముని గుఱించినకథను వినుచున్నాను; ఆయభిప్రాయమును దెలుసుకొనుచున్నాను.

అని, తాత్పర్యము.

అహం హి తస్యాద్య మనోభవేన

స ౩౨

సంపీడితా తద్గతసర్వభావా
విచింతయంతీ సతతం తమేవ
తథైవ పశ్యామి తథా శృణోమి. ౧౨

టీక॥ అహం=నేను; అద్య = ఇప్పుడు; తస్య=ఆ రామునియొక్క, ఆ రామునిఁగుఱించిన;మనోభవేన = మన్మథునిచేత; సంపీడితా = మిక్కిలి యుఁబీడింపఁబడినదాననై ; తద్గతసర్వభావా=ఆరామునిఁబొందినసమస్తమయినహృదయముగలదాననై ; సతతం=ఎల్లప్పుడును; తమేవ=ఆరామునే; విచింతయంతీ=ధ్యానించుచు; తథైవ=అట్లే;పశ్యామిహి= చూచుచున్నానుగదా! తథా=అట్లు ; శృణోమి(హి)=వినుచున్నానుగదా!

నేను, రామునివిడిచినది మొదలు రామవిరహంబునమన్మథునిచేఁబీడింపఁబడి, నిశ్చలంబగుమనంబున నేకాకారముగా నారామునినే యెల్లప్పుడును ధ్యానించుచున్నానుగావున, నేనుమనంబునధ్యానించునట్లె, నాకండ్లకు నగపడుచున్నది; నాచెవులకు నట్లె వినవచ్చుచున్నది. అని, తాత్పర్యము.

మనోరథ స్స్యా దితి చింతయామి
తథాపి బుద్ధ్యాచ వితర్కయామి
కిం కారణం తస్య హి నాస్తిరూపం
సువ్యక్తరూపశ్చ వద త్యయం మామ్. ౧౩

టీక॥ అయం (అధ్యాహృతము)= ఇది; మనోరథః=కోరికి; స్యాత్=అగును. ఇతి=అని; చింతయామి= తలంచుచున్నాను; తథాపి= అట్లయినను; బుద్ధ్యాచ=బుద్ధిచేతను. వితర్కయామి=ఊహించుచున్నాను . కారణం= హేతువు; కిం=ఏది ? ఇతిచేత్ (అధ్యాహృతము)=అన్నచో; తస్య= ఆమనోరథమునకు; రూపం= ఆకారము; నాస్తి=లేదు. అయం= ఈవానరుఁడు; సువ్యక్తరూపశ్చ= మిక్కిలి యుస్పష్టమయిన రూపము గలవాఁడునై ; మాం=నన్నుఁగూర్చి ; వదతి= చెప్పుచున్నాఁడు.

నాకిదివఱకున్నట్లు, ఇప్పుడును, నాహృదయంబుననతిశయించియుండు రామవిషయకమయినమనోరథముచేత నే, యిట్లు నాకువినవచ్చులాగునఁ, గల్పితమగుచున్నది; అట్లది భ్రాంతియె కాని, వాస్తవముగా నెవ్వరుఁ జెప్పినది కాదు; అని, తలంచెదను. అయితే, బుద్ధిచే విచారింపఁగామాత్రము, అట్లుకాదని తెలియవచ్చుచున్నది; ఏలయనఁగా, మనోరథంబునకురూపములేదు, కావున, దానిచేఁ గల్పితమయినచో, నిదియు నగపడక, యూరక మనస్సునకుమాత్రమువినవచ్చులాగునఁ, దోఁపవలయు; ఇప్పుడట్లులేదు; ఈవానరునిరూపము నాకుస్పష్టముగాఁగనుపడుచున్నది; మఱియుఁ దనికంఠస్వరమును, అతఁడుచెప్పుటయును, స్పష్టముగా నాకు వినవచ్చుచున్నది; కావున, నీవానరుండెవ్వఁడో, వాస్తవముగా, నిచ్చటికి వచ్చి, నాకుఁ దెలియునట్లు చెప్పినమాటగాని వేఱుగాదు. అని, తాత్పర్యము.

నమోస్తు వాచస్పతయే సవజ్రిణే

స్వయంభువే చైవ హుతాశనాయచ

అనేన చోక్తం యదిదం మమాగ్రతో

వనౌకసా తచ్చ తథాస్తు నాన్యథా. ౧౪

టీక॥సవజ్రిణే= ఇంద్రునితోఁగూడిన; వాచస్పతయే = బృహస్పతికొఱకును; స్వయంభువేచైవ= బ్రహ్మదేవునికొఱకును; హుతాశనాయచ=అగ్నిహోత్రునికొఱకును; నమః = నమస్కారము; అస్తు=అగుఁగాక. మమ= నాయొక్క; అగ్రతః = ముందట; అనేన=ఈ ("చ" అనునది పాదపూరణార్థము); వనౌకసా=వానరునిచేత; యత్=ఏది; ఉక్తం=చెప్పఁబడినదో; తచ్చ = అది (అంత)యు, తథైవ = అట్లే; అస్తు=అగుఁగాక. అన్యథా=వేఱువిధముగా; న (అస్తు)=కాకపోవుఁగాక.

దేవేంద్రునకును బృహస్పతికిని బ్రహ్మదేవునకునుఅగ్నిహోత్రునకునునమస్కరించెదను; నాముందటనీవానరుండు చెప్పినమాటలన్నియుసత్యంబులగుఁగాక; స్వప్నంబుగానిమఱిమేదిగానియయినను బద్ధముగాకుండవలెను. అనిసీతాదేవి చెప్పినది. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, ద్వాత్రింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండ ద్వాత్రింశసర్గటీక,
ముగిసినది.



(౩౩)

త్రయస్త్రింశసర్గప్రారంభః.

సోఽవతీర్య ద్రుమాత్తస్మా ద్విద్రుమప్రతిమాననః
వినీతవేషః కృపణః ప్రణిపత్యోపసృత్య చ. ౧
తామబ్రవీన్మహాతేజా హనూమాన్మారుతాత్మజః
శిరస్యంజలి మాధాయ సీతాం మధురయా గిరా. ౨

టీక॥ విద్రుమప్రతిమాననః = పవడముతోఁ బోలికగలముఖముగలవాఁడును; మహాతేజాః = అధికమయినకాంతిగలవాఁడును; మారుతాత్మజః = వాయుదేవుని కుమారుండునగు; సః = ఆ; హనూమాన్ = హనుమంతుఁడు; తస్మాత్ = ఆ; ద్రుమాత్ = చెట్టునుండి; అవతీర్య = దిగి; వినీతవేషః = వినయముతోఁగూడినవేషంబుగలవాఁడై; కృపణః = దీనుండై; ప్రణిపత్య = నమస్కరించి; ఉపసృత్య చ = సమీపించియు; శిరసి = తలయందు; అంజలిం = చేమోడ్పును; ఆధాయ = ఉంచి; తాం = ఆ; సీతాం = సీతనుగూర్చి; మధురయా = మనోహరమయిన; గిరా = మాటచేత; అబ్రవీత్ = పలికెను.

పగడముంబోలె నెఱ్ఱనైనముఖంబుగలవాఁడును మహాతేజుండునగు వాయుపుత్రుండైన హనుమంతుండు, ఆవృక్షంబునుండి నేల కుఱికి, యుదివఱకు సీతాదేవి దుఃఖమును జూచినవాఁడగుటం జేసి, దీనుండై, వినయంబున, నమస్కరించి, కొంతసమీపంబునకుఁబోయి, శిరసునఁ జేమోడ్పు గీలించి, యాసీతంజూచి, మధురవచనంబున, నిట్లని,






చెప్పెను. అని, తాత్పర్యము.

కాను పద్మపలాశాక్షి క్లిష్టకౌశేయవాసినీ
ద్రుమస్య శాఖా మాలంబ్య తిష్ఠసి త్వ మనిందితే. ౩

టీక॥పద్మపలాశాక్షి = తామరపూరేకులవంటికండ్లుగల దానవును; క్లిష్టకౌశేయవాసినీ= నలఁగిన పట్టువస్త్రమును గట్టుకొనిన దానవును; అనిందితే= నిందింపఁబడని దానవునగు; త్వం=నీవు; ద్రుమస్య = చెట్టుయొక్క; శాఖాం=కొమ్మను; ఆలంబ్య= పట్టుకొని; తిష్ఠసి= ఉన్నావు. కాను=ఎవ్వతెవు?

తామరపూరేకులవంటి కండ్లతో నొప్పుచు నలఁగిన పట్టువస్త్రంబు గట్టుకొని, యీచెట్టుకొమ్మం బట్టుకొని యున్నావు; పతివ్రతవుగానున్నావు ; నీవెవ్వతెవు?

అని, తాత్పర్యము.

కిమర్థం తవ నేత్రాభ్యాం వారి స్రవతి శోకజమ్
పుండరీకపలాశాభ్యాం విప్రకీర్ణ మివోదకమ్. ౪

టీక॥విప్రకీర్ణం=చల్లఁబడిన; ఉదకం=జలము; పుండరీకపలాశాభ్యామివ= తెల్ల దామరపూరేకులవలనం బోలె; కిమర్థం=ఎందుకు; తవ = నీయొక్క; నేత్రాభ్యాం = కండ్లవలన; శోకజం = దుఃఖమువలనంగలిగిన ; వారి=జలము; స్రవతి=కాఱుచున్నది?

అలలచేఁ బైకెగురఁగొట్టఁబడి తెల్లదామరపూలంబడిననీళ్లు, ఆ తెల్లదామరపూలరేకులనుండి గాఱునట్లు, నీ కండ్లనుండి దుఃఖంబునంజేసి కన్నీరు కాఱుచున్నదేల? అని, తాత్పర్యము.

సురాణా మసురాణాం వా నాగగంధర్వరక్షసామ్
యక్షాణాం కిన్నరాణాం వా కాత్వం భవసి శోభనే. ౫

టీక॥శోభనే = మంగళంబు గలిగించువానా! త్వం=నీవు; సురాణాం= దేవతలలోఁగాని; అసురాణాంవా= అసురులలోఁగాని ; నాగగంధర్వరక్ష




సాం = నాగకన్యకలలోఁగాని గంధర్వులలోఁ గాని రాక్షసులలోఁగాని; యక్షాణాం=యక్షులలోఁగాని; కిన్నరాణాంవా = కిన్నరులలోఁ గాని; కా=ఎవ్వతెవు;భవసి=అగుచున్నావు?

మంగళకరివగుదానా!నీవు,"దేవతలు,అసురులు, నాగకన్యలు, గంధర్వులు, రాక్షసులు,యక్షులు, కిన్నరులు," వీరలయందు, ఎవ్వరిలోఁజేరినదానవు? అని, తాత్పర్యము.

కాత్వం భవసి రుద్రాణాం మరుతాం వా వరాననే
వసూనాంహి వరారోహే దేవతా ప్రతిభాసి మే. ౬

టీక॥ వరాననే = సుందరమయిన ముఖముగలదానా! రుద్రాణాం = రుద్రులలోఁగాని; మరుతాంవా=వాయువులలోఁగాని; వసూనాంవా= వసువులలోఁగాని; త్వం=నీవు; కా=ఎవ్వతెవు? వరారోహే =సుందరములయినపిఱుఁదులుగలదానా! మే=నాకు; దేవతా=దేవతవుగా; ప్రతిభాసి = అగపడుచున్నావు.

సుందరమయిన ముఖంబు గలదానా!నీవు, రుద్రగణంబులోఁజేరిన దానవా?వాయువులలోఁజేరినదానవా?లేక, వసువులలోఁ జేరినదానవా? నీవెవ్వతెవు?సుందరములయినపిఱుఁదులుగలదానా! నీవు దేవతవనినాకుఁదోఁచుచున్నది. అని,తాత్పర్యము.

కిన్ను చంద్రమసా హీనా పతితా విబుధాలయాత్
రోహిణీ జ్యోతిషాం శ్రేష్ఠా శ్రేష్ఠసర్వగుణాన్వితా. ౭

టీక॥త్వం=నీవు;చంద్రమసా =చంద్రునిచే; హీనా= విడువఁబడినదియును; విబుధాలయాత్ = స్వర్గమునుండి; పతితా=పడినదియును ; జ్యోతిషాం=నక్షత్రములలోపల; శ్రేష్ఠా=ఉత్తమురాలయినదియు ; శ్రేష్ఠసర్వగుణాన్వితా=ఉత్తమములయిన యన్నిగుణములతోఁగూడినదియునగు; రోహిణీకిన్ను=రోహిణివా?

నీవు , చంద్రునివిడిచి స్వర్గంబునుండిభూమికివచ్చియున్న, నక్షత్రశ్రేష్ఠయును ఉత్తమగుణంబులు గలదియు నగు, రోహిణివామేమి?
అని,తాత్పర్యము.

కాత్వం భవసి కల్యాణి త్వ మనిందిత లోచనే




టీక॥ కల్యాణి=మంగళస్వరూపిణి వగుదానా? త్వం=నీవు; కా=ఎవ్వతెవు; భవసి=అగుచున్నావు? అనిందితలోచనే=నిందింపఁబడని కండ్లుగల దానా! త్వం = నీవు ; కా (అధ్యాహృతము)=ఎవ్వతెవు?

మంగళస్వరూపిణివగుదానా! నీవెవ్వతెవు? ఎంతమాత్రమును దోషములేక సులక్షణయుక్తంబులయి సుందరంబులయిన కండ్లుగలదానా! నీవెవ్వతెవు? చెప్పుము. అని, తాత్పర్యము.

కోపాద్వా యదివా మోహా ద్భర్తారమసితేక్షణే. ౮
వసిష్ఠం కోపయిత్వా త్వం నాసి కల్యాణ్యరుంధతీ

టీక॥ అసితేక్షణే = నల్లనికండ్లుగలదానా! కల్యాణి = మంగళకరివగుదానా! త్వం=నీవు; కోపాద్వా=కోపమువలనఁగాని; మోహాద్యదివా=ప్రేమవలనగాని; భర్తారం= పెనిమిటి యయిన; వసిష్ఠం=వసిష్ఠునిగూర్చి; కోపయిత్వా=కోపించి; ఆగతా (అధ్యాహృతము)=భూమికివచ్చిన; అరుంధతీ=అరుంధతివి; నాసి (కిం)= కావా యేమి?

నల్లనికండ్లుగలదానవు మంగళకరివగుదానా! నీవు కోపమునఁగాని ప్రణయకోపంబువలనఁగాని పెనిమిటియగు వసిష్ఠునిపైఁగోపంబుపూని, భూమికి వచ్చినయరుంధతివి కావా యేమి?

అని, తాత్పర్యము.

కోను పుత్రః పితా భ్రాతా భర్తా వా తే సుమధ్యమే. ౯

టీక॥ సుమధ్యమే= సుందరమయిన నడుముగలదానా! తే=నీయొక్క; పుత్రః= కొడుకుగాని ; పితా=తండ్రిగాని; భ్రాతా=తోఁబుట్టువుగాని; భర్తా వా= పెనిమిటిగాని; కోను= ఎవ్వఁడు.

సుందరమయిననడుముగలదానా! నీకొడుకెవ్వఁడు? తండ్రియెవ్వఁడు? నీసహోదరుఁడెవ్వఁడు? నీపెనిమిటియెవ్వఁడు? నాకుఁజెప్పుము.

అని, తాత్పర్యము.

అస్మాల్లోకా దముంలోకం గతం త్వ మనుశోచసి




టీక। త్వం=నీవు; అస్మాత్=ఈ; లోకాత్=భూలోకమునుండి; అముం=ఆ; లోకం=స్వర్గమును; గతం=పొందినవానిఁగూర్చి; అనుశోచసి (కిం)=దుఃఖించుచున్నావా యేమి?

నీబంధు వెవ్వఁడైనను మరణంబు నొందఁగా, వానిఁగూర్చి నీవిప్పుడు దుఃఖించుచున్నావా యేమి? అని, తాత్పర్యము.

రోదనా దతినిశ్శ్వాసా ద్భూమిసంస్పర్శనాదపి. ౧౮
న త్వాం దేవీ మహం మన్యే రాజ్ఞస్సంజ్ఞావధారణాత్

టీక॥ రోదనాత్= ఏడ్పుటవలనను; అతినిశ్శ్వాసాత్=అధికమయిన నిట్టూర్పువలనను; భూమిసంస్పర్శనాదపి=నేలయొక్క-తాఁకుటవలనను; రాజ్ఞః= రాజుయొక్క; సంజ్ఞావధారణాత్=లక్షణములనిశ్చయము వలనను; త్వాం=నిన్ను; అహం=నేను; దేవీం=దేవతాస్త్రీనిగా; నమన్యే=తలంపను.

ఏడ్పుటవలనను, నిట్టూర్పు విడుచుట వలనను, నేలను స్పృశించుట వలనను, రాజలక్షణంబులగపడుట వలనను, నీవు దేవతాస్త్రీవికావనితలంచుచున్నాను; అయితే, రాజస్త్రీవిగానుండవచ్చునని మాత్రముతోఁచుచున్నది.

అని, తాత్పర్యము.

వ్యంజనాని చ తే యాని లక్షణానిచ లక్షయే. ౧౧
మహిషీ భూమిపాలస్య రాజకన్యా సి మే మతా

టీక॥ అహం(అధ్యాహృతము)=నేను; తే=నీయొక్క; యాని=ఏ; వ్యంజనాని= స్తనములు మొదలగునవయవములను; లక్షణానిచ=రేఖ మొదలయిన సాముద్రికలక్షణములను; లక్షయే=చూచుచున్నానో; తైః = వానిచేత; త్వం(అధ్యాహృతము) = నీవు; భూమిపాలస్య=రాజుయొక్క; మహిషీ = పట్టపురాణివి; రాజకన్యా= రాచకొమార్తెవుగా; అసి=అగుచున్నావు. ఇతి(అధ్యాహృతము)=అని; మే = (తృతీయార్థమందుషష్ఠి) నాచేత; మతా=తలంపఁబడుచున్నావు.

నీదేహంబుననుండు, స్తనజఘనాద్యవయవంబులయందునికిని మంగళకరంబులయిన సాముద్రిక లక్షణంబులనుంబట్టి, చూడఁగా, "నీవు రాజు పట్టపురాణివి, రాచకొమార్తెవు" అని, నాకుఁదోఁచుచున్నది. అని, తాత్పర్యము.

రావణేన జనస్థానా ద్బలా దపహృతా యది. ౧౨
సీతా త్వమసి భద్రం తే త న్మమా చక్ష్వ పృచ్ఛతః

టీక॥ త్వం=నీవు; జనస్థానాత్=జనస్థానమునుండి; రావణేన= రావణుని చేత; బలాత్=బలాత్కారముగా; అపహృతా=అపహరింపఁబడిన; సీతా= సీత; అసి యది=అగుదువేని; తత్=దానిని; పృచ్ఛతః=అడుగుచున్న; మమ=నాకు; ఆచక్ష్వ=చెప్పుము. తే = నీకు; భద్రం=మంగళము; అస్తు(అధ్యాహృతము)=అగుఁగాక.

నీవు, రావణుండు జనస్థానంబున బలాత్కారముగా నపహరించిన సీతాదేవివగుదువేని, ఆసంగతినే. నేనిప్పుడడుగుచున్నాను; నాకు దాని, శీఘ్రముగాఁ జెప్పుము; నీకు మంగళము గలుగుఁగాక.

అని, తాత్పర్యము.

యథా హి తవ వై దైన్యం రూపం చాప్యతిమానుషం. ౧౩
తపసా చాన్వితో వేష స్త్వం రామమహిషీ ధ్రువమ్

టీక॥ యథా=ఎట్లు; తవ = నీకు ("వై" అనునది పాదపూరణార్థము); దైన్యం=దుఃఖమును; అతిమానుషం=మనుష్యరూపంబు నతిక్రమించిన; రూపం చాపి=సౌందర్యమును; తపసా=తపసుతో; అన్వితః=కూడిన; వేషశ్చ=వేషమును; సంతి(అధ్యాహృతము)= ఉన్నవో; తతః(అధ్యాహృతము)= అందువలన; త్వం=నీవు; రామమహిషీ=రామునిభార్యవు. ధ్రువం=నిశ్చయము.

నీదుఃఖమును మనుష్యస్త్రీలకుఁగలుగనిసౌందర్యంబును, నీతాపసవేషంబునుం, జూడఁగా, నీవు రామునిభార్యవే; ఇందెంతమాత్రమును సందేహము లేదు. అని, హనుమంతుండు, సీతాదేవిం జూచి, చెప్పెను. అని, తాత్పర్యము.

సా తస్య వచనం శ్రుత్వా రామకీర్తనహర్షితా. ౧౪
ఉవాచ వాక్యం వైదేహీ హనుమంతం ద్రుమాశ్రితమ్

టీక॥ సా=ఆ; వైదేహీ=సీతాదేవి; తస్య = ఆహనుమంతునియొక్క; వచ

సం=మాటను; శ్రుత్వా = విని; రామకీర్తనసహర్షితా= రామునికీర్తించుటచేసంతసింపఁజేయఁబడినదై; ద్రుమాశ్రితం=చెట్టునాశ్రయించియుండు, చెట్టుక్రిందనుండుననుట; హనుమంతం = హనుమంతునిగూర్చి; వాక్యం = మాటను; ఉవాచ=చెప్పెను.

సీతాదేవి, హనుమంతుండుచెప్పినమాటనువిని, రామునిసంగతివినినందుకు సంతోషంబునొందినదై, చెట్టుక్రిందనుండుహనుమంతునింజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

పృథివ్యాం రాజ సింహానాం ముఖ్యస్య విదితాత్మనః ౧౫
స్నుషా దశరథస్యాహం శత్రుసైన్య ప్రతాపినః

టీక। అహం = నేను; పృథివ్యాం= భూమియందు; రాజసింహానాం=రాజశ్రేష్ఠులలో; ముఖ్యస్య=శ్రేష్ఠుఁడును; విదితాత్మనః= తెలియఁబడినపరమాత్మగలవాఁడును; శత్రుసైన్యప్రతాపినః=శత్రుసైన్యంబుల మిక్కిలియుఁ దపించునట్లుసేయువాఁడునగు; దశరథస్య=దశరథునియొక్క; స్నుషా=కోడలను.

నేను, భూమియందలిరాజశ్రేష్ఠులకందఱకును ముఖ్యుఁడై పరమాత్మ వేత్తయై శత్రుసైన్యంబులం జంపువాఁడైయుండిన దశరథమహారాజుకోడలను. అని. తాత్పర్యము.

దుహితా జనకస్యాహం వైదేహస్య మహాత్మనః. ౧౬

టీక॥అహం=నేను; మహాత్మనః=అధికమయిన పరాక్రమముగలవాఁడును; వైదేహస్య= విదేహదేశమునకధిపతియయినవాఁడును, నగు; జనకస్య= జనకమహారాజుయొక్క; దుహితా=కొమార్తెను.

మహాపరాక్రమశాలియు, విదేహదేశాధిపతియునగు జనకమహారాజుకొమార్తెను. అని, తాత్పర్యము.

సీతేతినామ నామ్నాహం భార్యా రామస్య ధీమతః

టీక। అహం=నేను; నామ్నా=పేరుచేత; సీతేతి=సీతయని; నామ=ప్రసిద్ధు

రాలను. ధీమతః=అధికమయినబుద్ధిగల; రామస్య=రామునియొక్క; భార్యా=భార్యను.

నాపేరుసీతయనిచెప్పుదురు; నేను, బుద్ధిమంతుండగు రాముని భార్యను.

అని, తాత్పర్యము.

సమా ద్వాదశ తత్రాహం రాఘవస్య నివేశనే. ౧౭
భుంజానా మానుషాన్ భోగాన్ సర్వకామ సమృద్ధినీ

టీక॥ అహం=నేను; తత్ర=ఆ; రాఘవస్య=దశరథునియొక్క; నివేశనే=ఇంటియందు; ద్వాదశ=పండ్రెండైన; సమాః=సంవత్సరములను; మానుషాన్=మనుష్యసంబంధమయిన; భోగాన్=భోగములను; భుంజానా=అనుభవించుచు; సర్వకామసమృద్ధినీ=సమస్తములయినకోరికలసమృద్ధిగలదాననై; న్యవసం(అధ్యాహృతము)=ఉంటిని.

నేను, వివాహమయినపిమ్మట, నాదశరథునింటఁ, బండ్రెండువత్సరంబులు, నిరంతరంబుగా మానుష భోగంబులను భవించుచు, సమస్తకామంబులంబొందుచుంటిని.

అని, తాత్పర్యము.

తత్ర త్రయోదశే వర్షే రాజ్యే నేక్ష్వాకునందనమ్. ౧౮
అభిషేచయితుం రాజా సోపాధ్యాయః ప్రచక్రమే

టీక॥ తత్ర=అచ్చట; త్రయోదశే=పదుమూఁడవదైన; వర్షే=సంవత్సరంబునందు; సోపాధ్యాయః=ఉపాధ్యాయునితోఁగూడిన; రాజా=దశరథమహారాజు; ఇక్ష్వాకునందనం=ఇక్ష్వాకువంశమునందుఁబుట్టినవారల సంతోషింపఁజేయునట్టి రాముని; రాజ్యేన=దొరతనముచేత; అభిషేచయితుం=అభిషేకించుటకు; ప్రచక్రమే=ఆరంభించెను.

పదుమూఁడవసంవత్సరంబున, దశరథమహారాజు, ఉపాధ్యాయుండగు వసిష్ఠుంగూడి, రామునకుఁ, బట్టాభిషేకము సేయయత్నించెను.

అని, తాత్పర్యము.

తస్మిన్ సంభ్రియమాణేతు రాఘవస్యాభిషేచనే. ౧౯

కైకేయీనామ భర్తారం దేవీ వచన మబ్రవీత్

టీక॥ తస్మిన్=ఆ; రాఘవస్య=రాముని యొక్క; అభిషేచనే=పట్టాభిషేకము నిమిత్తమయి; సంభ్రియమాణే తు=సంభారములు కూర్పఁబడుచుండఁగానే; కైకేయీనామ=కైకేయి యనెడు; దేవీ=రాజుభార్య; భర్తారం=పెనిమిటియగు దశరథునిఁగూర్చి; వచనం=మాటను; అబ్రవీత్=పలికెను.

ఆట్లు, రామునిపట్టాభిషేకమునకై, సంభారములు కూర్పఁబడుచుండఁగానే, కైకేయి యనెడు దశరథుని భార్యయొకతె వచ్చి, తన పెనిమిటిఁజూచి, యిట్లని, చెప్పినది.

అని, తాత్పర్యము.

న పిబేయం న ఖాదేయం ప్రత్యహం మమ భోజనమ్. ౨౦
ఏష మే జీవితస్యాంతో రామో యద్యభిషిచ్యతే

టీక॥ రామః=రాముఁడు; అభిషిచ్యతే యది=అభిషేకింపఁబడు నేని; మమ=నాయొక్క; భోజనం=భోజనద్రవ్యమును; నపిబేయం=త్రాగను. నఖాదేయం=తినను. ఏషః=ఈ రాముని పట్టాభిషేకము; మే=నా యొక్క; జీవితస్య=బ్రతుకుయొక్క; అంతః=తుద.

రామునకుఁ బట్టాభిషేకంబు సేయుదు చేని, నేనింతమాత్రమున్నీళ్లు త్రాఁగను, అన్నము తినను; ఈక్షణమే ప్రాణములు విడుతును.

అని, తాత్పర్యము.

యత్తదుక్తం త్వయా వాక్యం ప్రీత్యా నృపతిసత్తమ. ౨౧
తచ్చేన్న వితథం కార్యం వనం గచ్ఛతు రాఘవః

టీక॥ నృపతిసత్తమ=రాజశ్రేష్ఠుండవగు దశరథుఁడా! త్వయా=నీచేత; తత్=ఆ; యత్=ఏ; వాక్యం=మాట; ప్రీత్యా=సంతోషముచే; ఉక్తం=చెప్పఁబడినదో. తత్=ఆమాట, వితథం=వ్యర్థముగా; నకార్యం చేత్=చేయఁదగినది కాదేని; రాఘవః=రాముఁడు; వనం=అడవిని; గచ్ఛతు=పొందును గాక.

రాజశ్రేష్ఠుండవగు దశరథుఁడా! నీవు, నాకుమున్ను, సంతోషంబున, వరంబొసంగియున్నావే, ఆవరంబు వ్యర్థము గాకుండుటనీకిష్టమెయగు నేని, రా

ముండిప్పుడు, వనంబునకుఁబోవలయు నని. అని, తాత్పర్యము.

ను. అని, కైకేయి, దశరథునితోఁ జెప్పి

స రాజా సత్యవాగ్దేవ్యా వరదాన మనుస్మరన్. ౨౨
ముమోహ వచనం శ్రుత్వా కైకేయ్యాః క్రూర మప్రియమ్

టీక॥ సత్యవాక్ = సత్యవాదియయిన; సః = ఆ; రాజా = దశరథమహారాజు; దేవ్యాః = భార్యయయిన; కైకేయ్యాః = కైకేయియొక్క; క్రూరం = కఠినమును; అప్రియం = దుఃఖకరంబునగు; వచనం = మాటను; శ్రుత్వా = విని; వరదానం = వరమునిచ్చుటను; అనుస్మరన్ = తలంచుకొనుచు; ముమోహ = మూర్ఛనొందెను.

ఆదశరథమహారాజు, కైకేయి చెప్పిన క్రూరంబు నప్రియమునగుమాటనువిని, తానుమున్ను కైకేయికివరంబిచ్చియుండుటనుదలంచుకొని, సత్యవాదికావున, దానికి బదులాడంజాలక, మూర్ఛనొందెను. అని, తాత్పర్యము.

తతస్తు స్థవిరో రాజా సత్యే ధర్మే వ్యవస్థితః. ౨౩
జ్యేష్ఠం యశస్వినం పుత్రం రుద న్రాజ్య మయాచత

టీక॥ తతస్తు = అంత; సత్యే = సత్యమునందును; ధర్మే = ధర్మమునందును; వ్యవస్థితః = నియతుఁడైనవాఁడును; స్థవిరః = ముసలివాఁడునగు; రాజా = దశరథమహారాజు; రుదన్ = ఏడ్చుచు; యశస్వినం = అధికమైనకీర్తిగల; జ్యేష్ఠం = పెద్ద; పుత్రం = కొడుకైనరాముని; రాజ్యం = దొరతనమును; అయాచత = అడిగెను.

అంత, గొంచెమయినస్థాపిత్యము లేక సత్యమునుధర్మమును గాపాడుచుండుముసలివాఁడైన దశరథమహారాజు, రోదనంబు సేయుచు మహాకీర్తిశాలి యగు తన జ్యేష్ఠపుత్రుండయిన రామునింజూచి, "నేనిప్పుడు నీకిచ్చెదనని చెప్పిన రాజ్యమునునాకు మరలనిమ్ము" అని, యాచించెను. అని, తాత్పర్యము.

స పితు ర్వచనం శ్రీమా నభిషేకా త్పరం ప్రియమ్. ౨౪
మనసా పూర్వ మాసాద్య వాచా ప్రతిగృహీతవాన్

టీక॥ శ్రీమాన్=సర్వాతిశాయియైన; సః=ఆ రాఘవుడు; అభిషేకాత్=పట్టాభిషేకముకన్న; పరం=అధికముగా; ప్రియం=సంతోషకరమయిన; పితుః=తండ్రియొక్క; వచనం=మాటను; పూర్వం=ముందు; మనసా=మనసుచేత; ఆసాద్య=పొంది; వాచా=నోటిచేత; ప్రతిగృహీతవాన్=స్వీకరించినాడు, అంగీకరించినాడనుట.

అందఱికన్న నధికుండగు నా రాముండు, పట్టాభిషేకముకన్న నధికప్రియమయిన తండ్రిమాటను మనఃపూర్వకముగా నంగీకరించెను.

అని, తాత్పర్యము.

దద్యా న్నప్రతిగృహ్ణీయా న్నబ్రూయా త్కించి దప్రియమ్. ౨౭
అపి జీవితహేతోర్వా రామ స్సత్యపరాక్రమః

టీక॥ సత్యపరాక్రమః = ఎచ్చటను వ్యర్థముకాని పరాక్రమముగల; రామః=రాముడు; దద్యాత్=ఇచ్చును. జీవితహేతోర్వాపి=బ్రతుకనుకారణము వలనంగాని; న ప్రతిగృహ్ణీయాత్=పుచ్చుకొనడు. అప్రియం=దుఃఖకరమయిన మాటను; కించిత్=కొంచెమయినను; న బ్రూయాత్=చెప్పడు.

రాముడు, ఎవరు దేనిం గోరుదురో దాని వారలకిచ్చును; ప్రాణసంకటము సంభవించినను, ఎవ్వరియొద్దను దేనినిబుచ్చుకొనడు; మఱియుం గొంచెమయినను నితరులకప్రియమయిన మాటను జెప్పడు.

అని, తాత్పర్యము.

స విహాయో త్తరీయాణి మహార్హాణి మహాయశాః. ౨౮
విసృజ్య మనసా రాజ్యం జనన్యై మాం సమాదిశత్

టీక॥ మహాయశాః=అధికమయినకీర్తిగల; సః=ఆ రాముడు; మహార్హాణి=శ్రేష్ఠములయిన; ఉత్తరీయాణి=వస్త్రములను; విహాయ=విడిచి; మనసా=మనసుచేత; రాజ్యం=రాజ్యమును; విసృజ్య=విడిచి; మాం=నన్ను; జనన్యై=తల్లియయిన కౌసల్యకొఱకు; సమాదిశత్=ఒప్పగించెను.

మహాకీర్తిశాలియగు నా రాముండు, తానుగట్టుకొనియుండిన శ్రేష్ఠవస్త్రములవిడిచి, నారచీరలంగట్టుకొని, మనంబునంగూడ రాజ్యంబుగోరక, వనం

బునకుఁబోవనిశ్చయించి, నన్నుఁజూచి, "నీవుకౌసల్యయొద్దనుండుము" అనిచెప్పెను.

అని, తాత్పర్యము.

సాహం తస్యాగ్రతస్తూర్ణం ప్రస్థితా వనచారిణీ ౨౭

టీక॥ సా=అట్టి; అహం=నేను; వనచారిణీ=అడవియందుఁ దిరుగుదాననై; తస్య=ఆ రామునియొక్క; అగ్రతః=ముందట; తూర్ణం=శీఘ్రముగా; ప్రస్థితా=బయలుదేఱినాను.

పతివ్రతనగు నేనును, వనంబులో నుండ నిశ్చయించి, యా రామునకు ముందుగాఁ, బయనంబయితిని.

అని, తాత్పర్యము.

న హి మే తేన హీనాయా వాసస్స్వర్గేఽపి రోచతే

టీక॥ తేన=ఆ రామునిచేత; హీనాయాః=విడువఁబడిన; మే=నాకు; స్వర్గేఽపి=స్వర్గమునందైనను; వాసః=ఉండుట; న రోచతే హి=రుచింపదుగదా!

నేను, ఆ రాముని విడిచి, స్వర్గమునందైనను, ఉండఁజాలను.

అని, తాత్పర్యము.

ప్రాగేవ తు మహాభాగస్సౌమిత్రిర్మిత్రనందనః ౨౮
పూర్వజస్యానుయాత్రార్థే ద్రుమచీరైరలంకృతః

టీక॥ ప్రాగేవ తు=మునుపే; మహాభాగః=పూజ్యమయినభాగ్యముగలవాఁడును; మిత్రనందనః=స్నేహితుల సంతోషింపఁజేయువాఁడునగు; సౌమిత్రిః=సుమిత్రకొడుకైనలక్ష్మణుఁడు; పూర్వజస్య=అన్నయయినరామునియొక్క; అనుయాత్రార్థే=వెంబడించుటయనుప్రయోజనమునిమిత్తమయి, ద్రుమచీరైః=నారచీరలచేత; అలంకృతః=అలంకరింపఁబడినవాఁడు; ఆసీత్ (అధ్యాహృతము)=ఆయెను.

అంతకు మునుపే, మహాభాగ్యశాలియును, స్నేహితులకుసంతోషంబు గలిగించువాఁడునగు, సుమిత్రకొడుకైన లక్ష్మణుఁడు, అన్నయగు రాముని వెంబడించుటకై, నారచీరలం గట్టుకొనెను.

అని, తాత్పర్యము.

తే వయం భర్తు రాదేశం బహుమాన్య దృఢవ్రతాః. ౨౯
ప్రవిష్టా స్స్మ పురా దృష్టం వనం గంభీరదర్శనం

టీక॥ తే=ఆ; వయం=మేము; భర్తుః = ప్రభువయినదశరథునియొక్క; ఆదేశం=ఆజ్ఞను; బహుమాన్య=గౌరవించి; దృఢవ్రతాః=చలనములేని వ్రతముగలవారమై; పురా=మునుపు; అదృష్టం=చూడఁబడనిదియు; గంభీరదర్శనం= భయంకరమయినచూచుట గలదియునగు; వనం= అడవిని; ప్రవిష్టాః = ప్రవేశించినవారలము; స్మ (స్మః)=అయితిమి.

అట్లు, మేముమువ్వురము, దశరథునియాజ్ఞకుబద్ధులమై దృఢచిత్తంబున, నిదివఱకెప్పుడును మేమెఱుంగని గంభీరంబగునడవిం బ్రవేశించినాము.

అని, తాత్పర్యము.

వసతో దండకారణ్యే తస్యాహ మమితౌజసః. ౩౦
రక్షసా పహృతా భార్యా రావణేన దురాత్మనా

టీక॥ దండకారణ్యే=దండకారణ్యంబునందు ; వసతః=ఉన్న; అమితౌజసః=కొలఁదిలేని పరాక్రమముగల; తస్య=ఆ రామునియొక్క; భార్యా=భార్యనగు; అహం=నేను; దురాత్మనా= దుష్టబుద్ధిగలవాఁడైన; రక్షసా=రాక్షసుండునగు; రావణేన=రావణునిచేఁ; అపహృతా=అపహరింపఁబడినాను.

కొలందిలేనిపరాక్రమంబుగల యారాముండుదండకారణ్యంబుననుండఁగా నతనిభార్యనగునన్ను దుష్టాత్ముండును రాక్షసుండునగు రావణుండు, ఇచ్చటికిఁ గొనితెచ్చెను.

అని, తాత్పర్యము.

ద్వౌ మాసౌ తేన మే కాలో జీవితానుగ్రహః కృతః. ౩౧
ఊర్ధ్వం ద్వాభ్యాం తు మాసాభ్యాం తత స్త్యక్ష్యామి జీవితం

టీక॥ తేన=ఆరావణునిచేత; మే=నాకొఱకు; ద్వౌ=రెండైన; మాసౌ=మాసములను; కాలః=కాలము; జీవితానుగ్రహః= బ్రతుకుటకనుగ్రహము గలదిగా; కృతః=చేయఁబడినది. తతః=అందువలన; ద్వాభ్యాం=రెండై

స;మాసాభ్యాం=మాసములకన్న; ఊర్ధ్వం=తు=పిమ్మట నైన; జీవితం=ప్రాణములను; త్యక్ష్యామి=విడువఁగలను.

ఆ రావణుండు, ఇంక రెండుమాసంబులవఱకునన్ను బ్రతుకనిచ్చెదనని చెప్పియున్నాఁడు; ఆ రెండుమాసంబులపైని, నేను ప్రాణంబులవిడువఁగలను. అని, సీతాదేవి హనుమంతునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, సుందరకాండే, త్రయస్త్రింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, సుందరకాండత్రయస్త్రింశసర్గటీక, ముగిసినది.



చతుస్త్రింశసర్గప్రారంభః.

తస్యా స్తద్వచనం శ్రుత్వా హనుమాన్హరియూథపః
దుఃఖా ద్దుఃఖాభిభూతాయా స్సాంత్వ ముత్తరమబ్రవీత్. ౧

టీక॥ హరియూథపః= వానరులసమూహమును పాలించునట్టి; హనుమాన్=హనుమంతుఁడు; దుఃఖాభిభూతాయాః=దుఃఖముచేఁదిరస్కరింపఁబడిన; తస్యాః=ఆసీతయొక్క; వచనం=మాటను; శ్రుత్వా= విని; దుఃఖాత్=దుఃఖమువలన; సాంత్వం= ఊఱటగలిగించునట్టి; ఉత్తరం=బదులుమాటను; అబ్రవీత్=పలికెను.

వానర సమూహమున కధిపతియయినహనుమంతుండు, దుఃఖమునొందియున్నయాసీతాదేవిమాటనువిని, దుఃఖంబునొంది, యాసీతాదేవినూఱడించుచు, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

అహం రామస్య సందేశా ద్దేవి దూత స్తవా గతః

టీక॥ దేవి=సీతాదేవీ! అహం= నేను; రామస్య=రామునియొక్క; సందే

...త్ = ఆజ్ఞవలన ; తవ = నీకు; అగతః = వచ్చిన; దూతః = దూతను.

సీతాదేవీ! నేను రామునాజ్ఞంజేసి, దూతనై నీయొద్దకువచ్చినాను.

అని, తాత్పర్యము.

వైదేహి కుశలీ రామ స్త్వాంచ కౌశల మబ్రవీత్. ౨

టీక॥ వైదేహి = సీతా! రామః = రాముఁడు; కుశలీ = క్షేమము గలిగియున్నాఁడు; త్వాంచ = నిన్నుఁగూర్చియు; కౌశలం = క్షేమమును; అబ్రవీత్ = పలికెను.

సీతాదేవీ! రాముండు క్షేమముగానున్నాఁడు; తనక్షేమమును నీతోను జెప్పమన్నాఁడు. అని, తాత్పర్యము.

యో బ్రాహ్మ మస్త్రం వేదాంశ్చ వేద వేద విదాం వరః
స త్వాం దాశరథీ రామో దేవి కౌశల మబ్రవీత్. ౩

టీక ॥ దేవి = సీతాదేవీ! యః = ఎవ్వఁడు; బ్రాహ్మం = బ్రహ్మదేవతాకమయిన; అస్త్రం = అస్త్రమును; వేదాంశ్చ = వేదములను; వేద = ఎఱుంగునో; సః = అట్టి; వేదవిదాం = వేదములనెఱింగినవారలలో; వరః = శ్రేష్ఠుండును; దాశరథిః = దశరథునికొడుకునగు; రామః = రాముఁడు; త్వాం = నిన్నుఁగూర్చి; కౌశలం = క్షేమమును; అబ్రవీత్ = పలికెను.

సీతాదేవీ! ఎవ్వఁడు బ్రహ్మాస్త్రమును వేదములనెఱుంగునో, వేదవేత్తలలో శ్రేష్ఠుండును దశరథపుత్రుండునగు నా రాముండు, నీక్షేమము నడుగుమన్నాఁడు.

అని, తాత్పర్యము.

లక్ష్మణశ్చ మహాతేజా భర్తు స్తేనుచరః ప్రియః
కృతవాన్ శోక సంతప్త శ్శిరసా తే ఽభివాదనమ్. ౪

టీక॥ తే = నీయొక్క; భర్తుః = పెనిమిటియగు రామునకు; ప్రియః = ఇష్టుండును; అనుచరః = వెంబడించువాఁడును; మహాతేజాః = అధికమైనపరాక్రమముగలవాఁడునగు, లక్ష్మణశ్చ = లక్ష్మణుండును; శోకసంతప్తః = దుఃఖముచేనిక్క-

లియుఁదపింపఁజేయఁబడినవాఁడై; తే=నీకొఱకు; శిరసా=శిరసుచేత; అభివాదనం=నమస్కారమును; కృతవాన్=చేసినాఁడు.

నీచెనిమిటి రామునకుఁబ్రియుండును అతనివెంబడించివచ్చినవాఁడును మహాపరాక్రమశాలియునగు లక్ష్మణుఁడును, దుఃఖంబున, నీకు సాష్టాంగనమస్కారంబు గావించెను. అని, హనుమంతుండు, సీతతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

సా తయోః కుశలం దేవీ నిశమ్య నరసింహయోః
ప్రీతిసంహృష్టసర్వాంగీ హనుమంతమథాబ్రవీత్. ౫

టీక॥ సా=ఆ; దేవీ=సీతాదేవి; తయోః=ఆ; నరసింహయోః=పురుషశ్రేష్ఠులగు రామలక్ష్మణులయొక్క; కుశలం=క్షేమమును; నిశమ్య=విని; ప్రీతిసంహృష్టసర్వాంగీ=సంతోషముచేఁగగుర్పాటునొందిన సమస్తములయిన యవయవములునుగలదై; అథ=అటుపిమ్మట; హనుమంతం=హనుమంతునిగూర్చి; అబ్రవీత్=పలికెను.

ఆసీతాదేవి, పురుషశ్రేష్ఠులగు నా రామలక్ష్మణులు క్షేమంబుగ నుండుటనువిని, దేహంబంతయుఁ బులకలువొడమఁగా, నంత, హనుమంతునిం జూచి, యిట్లని, చెప్పినది. అని, తాత్పర్యము.

కల్యాణీ బత గాథేయం లౌకికీ ప్రతిభాతి మా
ఏతి జీవంత మానందో నరం వర్షశతాదపి. ౬

టీక॥ "జీవంతం=బ్రతికియున్న; నరం=మనుష్యునికి; వర్షశతాదపి=సంవత్సరములనూఱిటివలనఁగాని; ఆనందః=సంతోషము; ఏతి=పొందుచున్నది." ఇయం=ఈ; లౌకికీ=లోకమునందుఁగలిగిన; గాథా=జనవార్త; మా=నన్నుగూర్చి; కల్యాణీ=మంగళకరమయినదిగా, సత్యమయినదిగానను; ప్రతిభాతి=తోఁచుచున్నది. బత=సంతోషము!

"మనుష్యుఁడు బ్రతికియుండు నేని, నూఱుసంవత్సరములకైనను, తప్పక, ఆనందంబునొందును." అనిలోకంబునం బ్రసిద్ధికెక్కియుండునీజనవార్త నాప

ట్లు, సత్యమయినది గాఁ దోఁచుచున్నది. సంతోషము! అని, సీతాదేవి, హనుమం తునితోఁ జెప్పినది.

అని, తాత్పర్యము.

తయా సమాగతే తస్మిన్ ప్రీతి రుత్పాదితా ద్భుతా

టీక॥ సమాగతే=వచ్చిన; తస్మిన్= ఆహనుమంతునివిషయమయి; తయా= ఆసీతాదేవిచేత; అద్భుతా= ఆశ్చర్యకరమయిన; ప్రీతిః=సంతోషము; ఉత్పాదితా=కలిగింపఁబడినది.

రామునొద్దనుండివచ్చిన యాహనుమంతునివిషయమయి, యాసీతచు, అద్భుతంబగ సంతోషముగల్గినది.

అని, తాత్పర్యము.

పరస్పరేణ చాలాపం విశ్వస్తౌ తౌ ప్రచక్రతుః. ౭

టీక॥ తౌ=ఆసీతాహనుమంతులు; విశ్వస్తౌ= నమ్మకముగలవారలై; పరస్పరేణ=ఒండొరులతో; ఆలాపంచ= మాటలాడుటను; ప్రచక్రతుః=చేసిరి.

అట్లుటాసీతాహనుమంతులు; సందేహము విడిచి, యొండొరులతో మాటలాడుకొనిరి.

అని, తాత్పర్యము.

తస్యా స్తద్వచనం శ్రుత్వా హనుమా న్హరియూథపః
సీతాయా శ్శోకదీనాయా స్సమీప ముపచక్రమే. ౮

టీక॥ హరియూథపః=వానరులసమూహమును పాలించునట్టి; హనుమాన్ = హనుమంతుఁడు; శోకదీనాయాః = దుఃఖముచేదైన్యంబునొంది యుండు; తస్యాః=ఆ; సీతాయాః=సీతయొక్క; తత్ =ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; సమీపం=సమీపమును; గంతుం(అధ్యాహృతము)= పొందుటకు; ఉపచక్రమే=ఆరంభించెను.

వానర సమూహంబున కధిపతియయునహనుమంతుండు, అట్లుదుఃఖితయయియుండు నాసీతాదేవిచెప్పినమాటనువిని, మెల్లఁగానాబిడసమీపంబునకుఁబో నారంభించెను, అని, తాత్పర్యము.

యథాయథా సమీపం స హనుమా నుపసర్పతి
తథాతథా రావణం సా తం సీతా పరిశంకతే. ౯

టీక॥ సః=ఆ; హనుమాన్= హనుమంతుఁడు; యథాయథా= ఎట్లెట్లు= సమీపం=సమీపమునుగూర్చి ; ఉపసర్పతి=జరగుచున్నాఁడో ; తథాతథా=అట్లట్లు; సా=ఆ ; సీతా=సీత; తం=ఆహనుమంతుని; రావణం= రావణునిఁగా; పరిశంకతే= సందేహించుచుండినది.

ఆహనుమంతుండెంతదగ్గఱకుఁ బోవుచున్నాఁడో, అంతయధికముగ నాసీత, రావణుండెవానరవేషంబువేసికొని, వచ్చెనోయేమో, అనిహనుమంతునిపై సందేహమునొందుచుండెను.

అని, తాత్పర్యము.

అహో ధిగ్దుష్కృత మిదం కథితం హి యదస్య మే
రూపాంతర ముపాగమ్య స ఏవాయం హి రావణః. ౧౦

టీక॥ అస్య=వీనికి; మే= (తృతీయార్థమందుషష్ఠి) నాచేత ; కథితం= చెప్పఁబడిన; ఇదం=ఇది ; దుష్కృతం హి=దుష్కార్యముగదా! ధిక్=దహింపఁబడుదునుగాక! అహో= అయ్యో! అయం=వీఁడు; రూపాంతరం= మఱియొకరూపమును ; ఉపాగమ్య= పొంది; ఆగతః(అధ్యాహృతము)=వచ్చిన; సః=ఆ; రావణఏవహి = రావణుండేకదా!

అయ్యో! నేనుదహింపఁబడుదునుగాక! ఇతనియెదుట నేనిప్పుడు చెప్పరానిమాటం జెప్పితినే ! రావణుండే, యిట్లువానరరూపంబునొందివచ్చినాఁడు. అని, తాత్పర్యము.

తా మశోకస్య శాఖాం సా విముక్త్వా శోకకర్శితా
తస్యా మేవానవద్యాంగీ ధరణ్యాం సముపావిశత్. ౧౧

టీక॥ శోకకర్శితా= దుఃఖముచేఁగృశింపఁజేయఁబడినదియును; అనవద్యాంగీ=నిందింపఁబడనియవయవములుగలదియునగు; సా = ఆసీతాదేవి; అశోకస్య=అశోకవృక్షముయొక్క ; (మొదట శింశుపావృక్షమును బట్టుకొన్నట్లు చె

ప్పఁబడియున్నమ, అశింశుపావృక్షము ను అశోకవృక్షమును ఒకటిగా మొలిచి యుండుటవలన,నిష్పడిచ్చుట, నశోకవృక్షమనిచెప్పఁబడినది); తాం=ఆ; శాఖాం=కొమ్మను;విముక్త్వా(విముచ్య)= విడిచి;తస్యాం=ఆ; ధరణ్యామేవ = భూమియందే; సముపావిశత్ = కూర్చుండెను.

దుఃఖముచేఁ గృశించియున్న సర్వాంగ సుందరియగు నాసీతాదేవి, యాయశోక వృక్షముకొమ్మనువిడిచి, దానిక్రిందినేలపైఁగూర్చుండినది.

అని, తాత్పర్యము.

హనుమానపి దుఃఖార్తాం తాం దృష్ట్వా భయమోహితాం
అవందత మహాబాహు స్తత స్తాం జనకాత్మజామ్. ౧౨

టీక॥ మహాబాహుః=పెద్దచేతులు గల;హనుమానపి=హనుమంతుఁడును; దుఃఖార్తాం=దుఃఖముచేఁబీడింపఁబడినదియును;భయమోహితాం= భయముచే మోహము నొందియున్నదియునగు; తాం=ఆసీతను; దృష్ట్వా= చూచి;తతః=అటుపిమ్మట; తాం=ఆ; జనకాత్మజాం=జనకునికొమార్తెయగుసీతను;అవందత=నమస్కరించెను.

మహాబాహుఁడగుహనుమంతుండును, దుఃఖితయును, భయంబుచేఁ దన్నుం జూచిసంశయించుచున్న యాసీతాదేవింజూచి,యాదేవికి నమస్కరించెను.

అని, తాత్పర్యము.

సాచైనం భయవిత్రస్తా భూయో నైనాభ్యుదైక్షత

టీక॥ సాచ=ఆసీతయు; భయవిత్రస్తా=భయమునుచేభయము నొందినదై. మిక్కిలియుభయమునొందినదై యనుట;ఏనం=ఈహనుమంతుని;భూయః= మరల ; నైనాభ్యుదైక్షత = చూడనేలేదు.

ఆసీత,యిట్లు,మిక్కిలియు భయంబునొంది, యాహనుమంతుని మరలఁ జూడకుండినది. అని, తాత్పర్యము.

తం దృష్ట్వా వందమానం తు సీతా శశినిభాననా, ౧౩
అబ్రవీ ద్దీర్ఘ ముచ్ఛ్వస్య వానరం మధురస్వరా

టీక॥శశినిభాననా=చంద్రునితో సమానమయినముఖముగల; సీతా= సీతాదేవి=వందమానం=నమస్కరించుచున్న; తం=ఆ;వానరం= హనుమంతుని;దృష్ట్వాతు = చూచినంతనె; దీర్ఘం=అధికముగా; ఉచ్ఛ్వస్య= నిట్టూర్పువిడిచి; మధురస్వరా=మనోహరమయినకంఠధ్వనిగలదై ; అబ్రవీత్=చెప్పెను.

చంద్రునకు సరివచ్చు ముఖంబుగల యాసీతాదేవి, యట్లుతనకునమస్కారంబుసేయుచున్నహనుమంతుంజూచి, యధికముగానిట్టూర్పులువుచ్చి , మనోహరంబగుస్వరంబున,నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

మాయాంప్రవిష్టో మాయావీ యది త్వం రావణస్స్వయమ్. ౧౪
ఉత్పాదయసి మే భూయ స్సంతాపం తన్న శోభనం

టీక॥త్వం=నీవు; మాయావీ=అధికములయినమాయలుగలవాఁడవును; మాయాం=మాయను;ప్రవిష్టః = పొందినవాఁడవనగు;రావణః= రావణుండవై ; స్వయం=నీవె; మే=నాకు;భూయః=మరల;సంతాపం=దుఃఖమును; ఉత్పాదయసి యది=కలిగింతువేని; తత్=అది; శోభనం=మంచిది;న=కాదు.

నీవు, మాయావియగురావణుండవె యగుదువేని,యిప్పుడిట్లుమాయచే వానరరూపంబునొంది వచ్చినన్నుమఱల దుఃఖింపఁ జేయుట యెంతమాత్రము మంచిదికాదు. అని, తాత్పర్యము.

స్వం పరిత్యజ్య రూపం యః పరివ్రాజకరూపధృత్. ౧౫
జనస్థానే మయా దృష్ట స్త్వం స ఏవాసి రావణః

టీక॥యః=ఎవ్వఁడు; స్వం=తనదైన;రూపం=ఆకారమును; పరిత్యజ్య=విడిచి;పరివ్రాజకరూపధృత్ = సన్యాసిరూపమునుధరించువాఁడై;మయా=నాచేత;జనస్థానే=జనస్థానమునందు; దృష్టః=చూడఁబడినాఁడో;త్వం = నీవు; సః=అట్టి; రావణఏవ=రావణుండవే; అసి=అగుచున్నావు.

తనరూపంబువిడిచి సన్యాసిరూపంబునొందిజనస్థానంబుననాయొద్దకువచ్చిన,ఆరావణుండవే నీవు.

అని, తాత్పర్యము.

ఉపవాసకృశాం దీనాం కామరూప నిశాచర. ౧౬
సంతాపయసి మాం భూయ స్సంతప్తాం త న్నశోభనం

టీక॥కామరూప= ఇచ్ఛాధీనంబగు రూపముగల; నిశాచర=రాక్షసుండవగు రావణుఁడా; ఉపవాసకృశాం= ఉపవాసముచే కృశించిన దానను; దీనాం= దుఃఖమునొందినదానను; సంతప్తాం= మిక్కిలియుఁ దాపంబునొందినదాననగు; మాం=నన్ను; భూయః = మఱల; సంతాపయసి= తపింపఁజేయుచున్నావు. తత్=అది; శోభనం=మంచిది; న= కాదు.

ఇచ్ఛకువచ్చిన రూపంబుదాల్పంగల రాక్షసుండవగు రావణుఁడా! ఉపవాసములచేఁగృశించినదానను దుఃఖితురాలను ఇదివఱకె సంతాపమునొందియున్న దాననగు నన్నుమఱలసంతాపంబునొందునట్లు సేయుచున్నావు; ఇదిమంచి దికాదు. అని, తాత్పర్యము.

అథవా నైత దేవం హి య న్మయా పరిశంకితం. ౧౭
మనసోహి మమ ప్రీతి రుత్పన్నా తవ దర్శనాత్

టీక॥అథవా=అటుకాదేని; యత్= ఏది; మయా=నాచేత; పరిశంకితం=సందేహింపఁబడినదో; ఏతత్ = ఇది; ఏవం=ఇట్లు, నహి=కానేకాదు. తవ=నీ యొక్క; దర్శనాత్=చూచుటవలన; మమ=నాయొక్క; మనసః=మనసునకు; ప్రీతిః=సంతోషము; ఉత్పన్నాహి=పుట్టినదిగదా!

లేక, నేనిప్పుడుసందేహించినదిసరి కాదు; ఏలయనఁగా, నిన్నుఁజూడఁగా నామనసునకుసంతోషంబుగల్గుచున్నది. అని, తాత్పర్యము.

యది రామస్య దూత స్త్వ మాగతో భద్ర మస్తు తే. ౧౮

టీక॥త్వం=నీవు; రామస్య=రాముని యొక్క; దూతః=దూతవై; ఆగతో యది=వచ్చినవాఁడవగుదువేని; తే=నీకు; భద్రం=మంగళము; అస్తు=అగుఁగాక.

నీవు, రామునిదూతవుగానే వచ్చియుండుటయథార్థమగునేని, నీకు మంగళముగలుగుఁగాక.

అని, తాత్పర్యము.

పృచ్ఛామి త్వాం హరిశ్రేష్ఠ ప్రియాః రామకథా హి మే

టీక॥ హరిశ్రేష్ఠ= వానరశ్రేష్ఠుండవగుహనుమంతుఁడా! మే=నాకు; రామకథాః=రామునికథలు;ప్రియాహి= సంతోషకరంబులుగదా ! త్వాం=నిన్ను; పృచ్ఛామి=అడుగుచున్నాను.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! నాకు రామకథలు ప్రియంబులుగావున, వానినిన్నడిగెదను. అని, తాత్పర్యము.

గుణాన్రామస్య కథయ ప్రియస్య మమ వానర. ౧౯

టీక॥వానర=హనుమంతుఁడా! మమ=నాయొక్క; ప్రియస్య=ప్రియుండగు; రామస్య=రామునియొక్క; గుణాన్=గుణంబులను; కథయ = చెప్పుము.

హనుమంతుఁడా! నాకుఁబ్రియుండగు రామునిగుణంబులను నాకుఁ జెప్పుము. అని, తాత్పర్యము.

చిత్తం హరసి మే సౌమ్య నదీకూలం యథా రయః

టీక॥సౌమ్య=తిన్ననివాఁడవగు హనుమంతుఁడా!రయః=వేగము; నదీకూలంయథా=ఏటిగట్టునుంబోలె;మే=నాయొక్క; చిత్తం=మనసును; హరసి=హరించుచున్నావు.

తిన్ననివాఁడవగుహనుమంతుఁడా! నీళ్లవేగము,ఏటిగట్టును హరించునట్లు, నామనసును,నీవు, ఆకర్షించుచున్నావు. అని, తాత్పర్యము.

అహో స్వప్నస్య సుఖతా యాఽహ మేవం చిరాహృతా. ౨౦
ప్రేషితం నామ పశ్యామి రాఘవేణ వనౌకసం

టీక॥యా(యత్)= ఏకారణమువలన; ఏవం=ఇట్లు;చిరాహృతా= బహుకాలముగా నపహరింపఁబడి యున్న; అహం=నేను; రాఘవేణ= రామునిచేత; ప్రేషితం=పంపఁబడిన; వనౌకసంనామ=వానరునైనను; పశ్యా

మి=చూచుచున్నానో; తత్ (అధ్యాహృతము)=అందువలన; స్వప్నస్య=స్వప్నముయొక్క; సుఖతా=సుఖము గలిగించుట; అహో= ఆశ్చర్యకరము! బహుకాలముగా రామునివిడిచిదుః

ఖించుచున్న నేనిప్పుడు, స్వప్నంబునందు, రాముండుపంపినవానరునైనం జూచినాను, గావున, స్వప్నమునందుఁ గల్గినసుఖంబింతని చెప్పందరముగాదు. అని, తాత్పర్యము.

స్వప్నేపి యద్యహం వీరం రాఘవం సహలక్ష్మణమ్. ౨౧
పశ్యేయం నావసీదేయం స్వప్నోపి మమ మత్సరీ

టీక॥అహం=నేను ; స్వప్నేపి=స్వప్నమునందైనను; వీరం= పరాక్రమశాలియగు; సహలక్ష్మణం= లక్ష్మణునితోఁగూడిన; రాఘవం=రాముని; పశ్యేయంయది=చూతునేని ; నావసీదేయం=నశింపకుందును. మమ=నాకు; స్వప్నోపి=కలయును; మత్సరీ = కోపముగలది.

ఇట్లు. స్వప్నంబునందైనను, బరాక్రమశాలియగు రాముండును లక్ష్మణుండు నగుపడుదురేని , నాదుఃఖంబుపోయి, నేను నాశంబునొందకుందును; స్వప్నంబునకును నాయందుఁ గోపంబున్నది. అని, తాత్పర్యము.

నాహం స్వప్నమిమం మన్యే స్వప్నే దృష్ట్వా హి వానరమ్. ౨౨
నశక్యోభ్యుదయః ప్రాప్తుం ప్రాప్తశ్చాభ్యుదయో మమ

టీక॥అహం=నేను;ఇమం=దీని; స్వప్నం=స్వప్నమునుగా; నమన్యే=తలంపను. స్వప్నే= కలయందు;వానరం=కోఁతిని;దృష్ట్వా=చూచి;అభ్యుదయః=సంతోషము;ప్రాప్తుం=పొందుటకు; నశక్యోహి = అలవిగాదుగదా! మమ=నాకు; అభ్యుదయశ్చ=సంతోషమును; ప్రాప్తః=ప్రాప్తించినది.

నాకిదిస్వప్నంబుగాఁదోఁచలేదు;ఏలయనఁగా, స్వప్నంబునఁ గోఁతింజూచినచో, సంతోషంబునొందనేరఁడు;మఱియు నాకిప్పుడు సంతోషంబు గల్గియున్నది. అని, తాత్పర్యము.

కిన్నుస్యాచ్చిత్తమోహోయం భవేద్వాతగతిస్త్వియమ్. ౨౩

ఉన్మాదజో వికారోవా స్యాదియం మృగతృష్ణికా

టీక॥అయం=ఇది;చిత్తమోహః= చిత్తభ్రాంతి;స్యాత్కిన్ను= అగునా యేమి?ఇయం=ఇది;వాతగతిస్తు=వాతములయొక్క;ఉన్మాదజః=పిచ్చివలనఁగలిగిన;వికారోవా = వికారమా? ఇయం=ఇది;మృగతృష్ణికావా=ఎండమావులు;స్యాత్(కిం)=అగునా?

నాకిప్పుడేమైనఁజిత్తభ్రాంతిగలిగినదా యేమి? లేక, వాతప్రకోపమయి యందుచేనిట్లుదోఁచుచున్నదా? అట్లుగాక,యున్మాదవికారముచేనేమైననిట్లు గనుపడుచున్నదా? లేక,యెండమావులుంబోలె, నొకటియుండఁగామఱియొకటిగాఁజూచుచున్నానాయేమి?

అని, తాత్పర్యము.

అథవా నాయమున్మాదో మోహోఽప్యున్మాదలక్షణః. ౨౪
సంబుధ్యే చాహ మాత్మాన మిమం చాపి వనౌకసం

టీక॥అథవా=అట్లుగాక;అయం= ఇది;ఉన్మాదః= పిచ్చిగాని;ఉన్మాదలక్షణః=పిచ్చియొక్కలక్షణమువంటిలక్షణముగల;మోహోవాపి= చిత్తభ్రాంతిగాని;న=కాదు.అహం=నేను; ఆత్మానంచ=నన్నును;ఇమం=ఈ: వనౌకసంచాపి=వానరుని; సంబుధ్యే= ఎఱింగియున్నాను.

అట్లుగాదేని,ఇదిపిచ్చిగాదు, అట్లుపిచ్చివలెనే యుండునట్టి చిత్తభ్రాంతియునుగాదు;ఏలయనఁగా, నేను,నన్నును,ఈవానరునిఁ,జక్కఁగా నెఱుంగుచున్నాను.అని,సీతాదేవి,చెప్పినది.

అని, తాత్పర్యము.

ఇత్యేవం బహుధా సీతా సంప్రధార్య బలాబలమ్. ౨౫
రక్షసాం కామరూపత్వాన్మేనే తం రాక్షసాధిపం

టీక॥సీతా=సీతాదేవి;ఇతి=అని;ఏవం=ఈప్రకారముగా ; బహుధా= పెక్కువిధములుగా; బలాబలం= బలాబలములను;సంప్రధార్య=నిశ్చయించి;రక్షసాం=రాక్షసులయొక్క; కామరూపత్వాత్ = ఇచ్ఛాధీనంబగురూప

ముగలవారగుటవలన; తం= ఆహనుమంతుని; రాక్షసాధిపం= రాక్షసుల కుఁబ్రభుండగు రావణునిగా ; మేనే= తలంచెను.

సీతాదేవి,యిట్లనేకవిధంబుల బలాబల పర్యాలోచనపూర్వకంబుగా నిశ్చయించి,మఱల, రాక్షసులు కామరూపులగుటందలంచుకొని,యాహనుమంతుని రాక్షసేశ్వరుండగు రావణునిఁగానే,తలంచెను. అని, తాత్పర్యము.

ఏతాం బుద్ధిం తదా కృత్వా సీతా సా తనుమధ్యమా। ౨౬
న ప్రతివ్యాజహారాథ వానరం జనకాత్మజా

టీక॥ తదా=అప్పుడు ; తనుమధ్యమా=సన్నపడుముగలదియు;జనకాత్మజా = జనకమహారాజుకూఁతురునగు; సా=ఆ; సీతా=సీతాదేవి; ఏతాం= ఈ; బుద్ధిం=తలంపును; కృత్వా=చేసికొని; అథ=అటుపిమ్మట;వానరం= హనుమంతునిగూర్చి ; నప్రతివ్యాజహార=బదులుచెప్పలేదు.

అప్పుడు , జనకునికూఁతురయినసన్నసడుముగల యాసీతాదేవి, యీప్రకారముతలంచి, యటుపిమ్మట,హనుమంతునితోనేమియుఁ బలుకకుండినది.

అని, తాత్పర్యము.

సీతాయాశ్చింతితం బుద్ధ్వా హనుమాన్మారుతాత్మజః। ౨౭
శ్రోత్రానుకూలైర్వచనైస్తదా తాం సంప్రహర్షయత్

టీక॥మారుతాత్మజః=వాయుదేవునికుమారుండగు;హనుమాన్=హనుమంతుండు;సీతాయాః=సీతయొక్క;చింతితం=తలంపును; బుద్ధ్వా=తెలిసికొని; తదా=అప్పుడు ; శ్రోత్రానుకూలైః= చెవులకుసుఖకరంబులయిన; వచనైః= మాటలచేత; తాం = ఆసీతాదేవిని; సంప్రహర్షయత్ ( సంప్రాహర్షయత్ )=సంతోషింపఁజేసెను.

వాయుదేవునికుమారుండగు హనుమంతుండు, సీతమనంబులోనుండు తలంపునెఱింగి, చెవులకుసుఖకరంబులగుమాటలుచెప్పి, యాబిడకు సంతోషముగలుగఁజేసెను. అని, తాత్పర్యము.

ఆదిత్యఇవ తేజస్వీ లోకకాంతశ్శశీయథా। ౨౮

టీక॥ రామః (అధ్యాహృతము) = రాముఁడు; ఆదిత్య ఇవ = సూర్యుఁడుం బోలె; తేజస్వీ = అధికమయినకాంతిగలవాఁడు. శశీయథా = చంద్రుండుం బోలె; లోకకాంతః = ప్రపంచమునకు మనోహరుండు.

రాముఁడు, సూర్యుఁడువలె నధికముగాఁగాంతిగలవాఁడు; చంద్రుండుం బోలెలోకంబునకంతయు మనోహరుండైయుండువాఁడు. అని తాత్పర్యము.

రాజా సర్వస్య లోకస్య దేవో వైశ్రవణో యథా
విక్రమేణోపపన్నశ్చ యథావిష్ణుర్మహాయశాః. ౨౯

టీక॥ రామః (అధ్యాహృతము) = రాముఁడు; వైశ్రవణః = విశ్రవసునికుమారుఁడైన; దేవోయథా = కుబేరుండుంబోలె; సర్వస్య = సమస్తమయిన; లోకస్య = లోకమునకు; రాజా = ప్రభువు, విష్ణుర్యథా = విష్ణుదేవుండుంబోలె; విక్రమేణ = పరాక్రమముతో; ఉపపన్నః = కూడినవాఁడు; మహాయశాశ్చ = అధికమయినకీర్తిగలవాఁడును.

రాముండు, కుబేరుండుంబోలెరాజాధిరాజు; మహావిష్ణుండుంబోలెఁబరాక్రమశాలి, అధికమయిన కీర్తిగలవాఁడు. అని, తాత్పర్యము.

సత్యవాదీ మధురవాగ్దేవో వాచస్పతిర్యథా
రూపవాన్ సుభగశ్శ్రీమాన్ కందర్ప ఇవ మూర్తిమాన్. ౩౦

టీక॥ రామః (అధ్యాహృతము) = రాముఁడు; దేవః = దేవుఁడయిన; వాచస్పతిర్యథా = బృహస్పతియుంబోలె; సత్యవాది = సత్యమునె చెప్పువాఁడు. మధురవాక్ = మనోహరములయినమాటలుగలవాఁడు. మూర్తిమాన్ = ఆకారముగల; కందర్ప ఇవ = మన్మథుండుం బోలె; రూపవాన్ = సౌందర్యము గలవాఁడు; సుభగః = మనోహరుండు. శ్రీమాన్ = అధికమయినకాంతిగలవాఁడు.

రాముఁడు, బృహస్పతియుంబోలె సత్యవాది, మనోహరముగా మాటలాడువాఁడు; ఆకారమునొందిన మన్మథుండువలె, సౌందర్యశాలి, మనోహరుండు, కాంతిమంతుండు.

అని, తాత్పర్యము.

స్థానక్రోధః ప్రహర్తా చ శ్రేష్ఠో లోకే మహారథః

టీక॥ రామః (అధ్యాహృతము) = రాముఁడు; స్థానక్రోధః = స్థానమునం దుఁగోపముగలవాఁడు, ఏవిషయంబునం దుఁగోపంబు నొందవలయునో ఆవిషయంబునం దె కోపము నొందువాఁడనుట. ప్రహర్తా చ = కొట్టువాఁడును తనకోపమును సార్థకము సేయువాఁడనుట. లోకే = లోకమునందు; శ్రేష్ఠః = ఉత్తముండు. మహారథః = తన్నును సారథిని గుఱ్ఱములను గాపాడుకొనుచుఁ బదునొకండు వేలమందివిలుకాండ్రతోఁ బోరువాఁడు.

మఱియు, రాముండు, యుక్తవిషయంబులమాత్రమె కోపంబు నొందును; అతనికోపము వ్యర్థము కాదు; అతండు, లోకంబునందందఱికన్న నుత్తముండు; తన్నును దన సారథిని గుఱ్ఱములనుం గాపాడుకొనుచుం బదునొకండు వేలమందివిలుకాండ్రతోఁ బోరంగలవాఁడు,

అని, తాత్పర్యము.

బాహుచ్ఛాయా మవష్టబ్ధో యస్య లోకో మహాత్మనః. ౩౧
అపకృష్యాశ్రమపదా న్మృగరూపేణ రాఘవం
శూన్యే యేనాపనీతాసి తస్య ద్రక్ష్యసి యత్ఫలమ్. ౩౨

టీక॥ లోకః = ప్రపంచము; మహాత్మనః = అధికమయిన ప్రభావముగల; యస్య = ఎవ్వనియొక్క; బాహుచ్ఛాయాం = చేతినీడను; అవష్టబ్ధః = ఆశ్రయించినదో; తం (అధ్యాహృతము) = అట్టి; రాఘవం = రాముని; ఆశ్రమపదాత్ = ఆశ్రమస్థానమునుండి; అపకృష్య = తొలఁగించి; శూన్యే = లేనికాలమునందు; యేన = ఏ రావణునిచేత; అపనీతా = అపహరింపఁబడినదానవు; అసి = అగుచున్నావో; తస్య = ఆ రావణునికి; యత్ = ఏది; ఫలం = ఫలమో; తత్ (అధ్యాహృతము) = దానిని; ద్రక్ష్యసి = చూడఁగలవు.

లోకమంతయు నే మహాత్ముని బాహుచ్ఛాయ నాశ్రయించియున్నదో, అట్టి రాముని, మాయచే నాశ్రమపదంబునుండి యవ్వలికిఁ బోనిచ్చి, అతండు లేనప్పుడు, నిన్నపహరించి గొనితెచ్చినట్టి రావణునకుం గల్గుఫలంబునుం జూడఁగలవు.

అని, తాత్పర్యము.

నచిరాద్రావణం సంఖ్యే యో వధిష్యతి వీర్యవాన్
రోషప్రముక్తై రిషుభి ర్జ్వలద్భి రివ పావకైః. ౩౩
తేనాహం ప్రేషితో దూత స్త్వత్సకాశ మిహాగతః

టీక॥వీర్యవాన్ = పరాక్రమశాలి యగు; యః=ఎవ్వఁడు; జ్వలద్భిః=మండుచున్న; పావకైరివ(స్థితైః) = నిప్పులంబోలెనున్నట్టి; రోషప్రముక్తైః= కోపముచేవిడువఁబడిన; ఇషుభిః=బాణములచేత; రావణం=రావణునిని; సంఖ్యే=యుద్ధమునందు; నచిరాత్=శీఘ్రముగా; వధిష్యతి=చంపునో; తేన=అట్టి రామునిచేత; ప్రేషితః = పంపఁబడిన; దూతః=దూతనగు; అహం = నేను; ఇహ=ఇచ్చట; త్వత్సకాశం=నీసమీపమును; ఆగతః=పొందినాఁడను.

ఎవ్వఁడింక, శీఘ్రముగానే, యుద్ధంబునందు, నిప్పులంబోలెఁగ్రాలుచున్న బాణంబులచే, రావణునిఁజంపునో, అట్టి మహాపరాక్రమశాలియగు రాముండు, పంపఁగా, దూతనై, నీయొద్దకువచ్చినాను. అని, తాత్పర్యము.

త్వద్వియోగేన దుఃఖార్త స్స త్వాం కౌశల మబ్రవీత్. ౩౪

టీక॥త్వద్వియోగేన= నీవిరహముచేత; దుఃఖార్తః= దుఃఖముచేఁబీడింపఁబడిన; సః=ఆరాముఁడు; త్వాం= నిన్నుఁగూర్చి; కౌశలం = క్షేమమును; అబ్రవీత్=చెప్పెను.

నీవులేకుండుటంజేసి దుఃఖంబునం బరితపించుచుండునట్టి రాముండు, నీక్షేమమునడుగుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

లక్ష్మణశ్చ మహాతేజా స్సుమిత్రానందవర్ధనః
అభివాద్య మహాబాహు స్స త్వాం కౌశల మబ్రవీత్. ౩౫

టీక॥మహాతేజాః= అధికమయినపరాక్రమము గలవాఁడును; మహాబాహుః=పెద్దచేతులుగలవాఁడును; సుమిత్రానందవర్ధనః = సుమిత్రయొక్క సంతోషమును వృద్ధిఁబొందించువాఁడు నగు; సః=ఆ; లక్ష్మణశ్చ=లక్ష్మణుం

ణుడును; అభివాద్య = నమస్కరించి; త్వాం=నిన్నుఁగూర్చి; కౌశలం=క్షేమమును; అబ్రవీత్=పలికెను.

మహాపరాక్రమశాలియు మహాబాహుండును సుమిత్రాపుత్రుండునగు నా లక్ష్మణుండు, నీకునమస్కరించి, నీక్షేమ సమాచారమునడుగుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

రామస్య చ సఖా దేవి సుగ్రీవోనామ వానరః
రాజా వానర ముఖ్యానాం స త్వాం కౌశల మబ్రవీత్. ౩౬

టీక॥ దేవి = సీతాదేవీ! రామస్య= రాముని యొక్క; సఖా = స్నేహితుఁడును; వానరముఖ్యానాం= వానరశ్రేష్ఠులకు; రాజా = ప్రభువునగు; సుగ్రీవోనామ=సుగ్రీవుఁడనెడు; సః = ఆ; వానరశ్చ=వానరుఁడును; త్వాం= నిన్నుఁగూర్చి; కౌశలం=క్షేమమును; అబ్రవీత్= చెప్పెను.

సీతాదేవీ! రామునిమిత్రుండును వానరులకందఱకుఁబ్రభుండునగు సుగ్రీవుండను వానరుండును, నీక్షేమమునడుగు చున్నాఁడు. అని, తాత్పర్యము.

నిత్యం స్మరతి రామ స్త్వాం ససుగ్రీవ స్సలక్ష్మణః

టీక॥ ససుగ్రీవః=సుగ్రీవునితోఁగూడినవాఁడును; సలక్ష్మణః=లక్ష్మణునితోఁ గూడినవాఁడునగు; రామః = రాముఁడు; త్వాం=నిన్ను; నిత్యం=ఎల్లప్పుడును; స్మరతి=తలంచుచున్నాఁడు.

రాముండును లక్ష్మణుండును సుగ్రీవుండును, ఎల్లప్పుడును నిన్నేదలంచుకొనుచున్నారు. అని, తాత్పర్యము.

దిష్ట్యా జీవసి వైదేహి రాక్షసీవశ మాగతా. ౩౭

టీక॥ వైదేహీ=సీతాదేవీ! త్వం (అధ్యాహృతము)= నీవు; రాక్షసీవశం= రాక్షసస్త్రీలయధీనతను ; ఆగతా= పొందినదానవై; దిష్ట్యా= భాగ్యముచేత; జీవసి=బ్రతికియున్నావు.

సీతాదేవీ! నీవిట్లురాక్షసస్త్రీల చేతులలోఁజిక్కియును , భాగ్యవశముచేజీవించియున్నావుకాని, వేఱుకాదు.

అని, తాత్పర్యము.

సచిరాద్ద్రక్ష్యసే రామం లక్ష్మణంచ మహాబలం
మధ్యే వానరకోటీనాం సుగ్రీవంచామితౌజసమ్. ౩౮

టీక॥త్వం(అధ్యాహృతము)-నీవు; రామం=రామునిని;మహాబలం=అధికమయినబలముగల;లక్ష్మణంచ= లక్ష్మణునిని;వానరకోటీనాం= వానరులకోటులయొక్క;మధ్యే=నడుమునందు; స్థితం(అధ్యాహృతము)-ఉన్నట్టి;అమితౌజసం= కొలందిలేనిపరాక్రమముగల;సుగ్రీవంచ=సుగ్రీవునిని;నచిరాత్ = శీఘ్రముగా;ద్రక్ష్యసే=చూడఁగలవు.

నీవు, రామునిని, మహాబలుండగులక్ష్మణునిని, పెక్కుకోటులవానరులచేఁబరివేష్టింపఁబడియుండుసుగ్రీవునిని, శీఘ్రముగా నే,చూడఁగలవు.

అని, తాత్పర్యము.

అహం సుగ్రీవసచివో హనుమాన్నామ వానరః
ప్రవిష్టో నగరీం లంకాం లంఘయిత్వా మహోదధిమ్. ౩౯

టీక॥సుగ్రీవసచివః=సుగ్రీవుని మంత్రిని; హనుమాన్నామ=హనుమంతుఁడనిప్రసిద్ధుండగు; వానరః=వానరుండనగు; అహం=నేను; మహోదధిం= పెద్దసముద్రమును ; లంఘయిత్వా= దాఁటి;లంకాం=లంకయను;నగరీం= పట్టణమును;ప్రవిష్టః=ప్రవేశించినాను.

నేను, సుగ్రీవునిమంత్రిని,హనుమంతుండనువాఁడ ; సముద్రంబునుదాఁటి, లంకాపట్టణంబున బ్రవేశించినాను.

అని,తాత్పర్యము.

కృత్వా మూర్ధ్ని పదన్యాసం రావణస్య దురాత్మనః
త్వాం ద్రష్టు ముపయాతో హం సమాశ్రిత్య పరాక్రమమ్. ౪౦

టీక॥అహం=నేను; పరాక్రమం= పరాక్రమమును;సమాశ్రిత్య = ఆశ్రయించి;దురాత్మనః-దుష్టబుద్ధిగల;రావణస్య = రావణునియొక్క; మూర్ధ్ని=తలయందు; పదన్యాసం=అడుగునుంచుటను;కృత్వా=చేసి; త్వాం= నిన్ను;ద్రష్టుం = చూచుటకు;ఉపయాతః-వచ్చినాను.

నేను, బరాక్రమంబునవలంబించి, దురాత్ముండగురావణునితలపైఁబాదం

బుంచి, నిన్నుఁజూచుటకై యిచ్చటికివచ్చినాను. అని, తాత్పర్యము.

నాహ మస్మి తథా దేవి యథా మా మవగచ్ఛసి
విశంకా త్యజ్యతా మేషా శ్రద్ధస్వ వదతో మమ. ౪౧

టీక॥ దేవి=సీతాదేవీ! త్వం (అధ్యాహృతము)=నీవు ; యథా = ఎట్లు; మాం=నన్ను; అవగచ్ఛసి= తెలుసుకొనుచున్నావో; తథా=అట్లు; అహం= నేను; నాస్మి=కాను. ఏషా=ఈ; విశంకా=సందేహము; త్యజ్యతాం= విడువఁబడుఁగాక. వదతః= చెప్పుచున్న; మమ= (సప్తమ్యర్థమందుషష్ఠి) నాయందు; శ్రద్ధస్వ=శ్రద్ధయుంచుము.

సీతాదేవీ! నీవునావిషయమయి, భ్రమించునట్లునేనెంతమాత్రము మాయావినిగాను; ఈసందేహమునువిడువుము; నామాటలయందుశ్రద్ధయుంచుము. అని, హనుమంతుఁడు, సీతాదేవితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, చతుస్త్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండ చతుస్త్రింశసర్గటీక,
ముగిసినది.

పంచత్రింశసర్గప్రారంభః.

తాం తు రామకథాం శ్రుత్వా వైదేహీ వానరర్షభాత్
ఉవాచ వచనం సాంత్వ మిదం మధురయా గిరా. ౧

టీక॥ వైదేహీ=సీతాదేవి; వానరర్షభాత్ = వానరశ్రేష్ఠుండగుహనుమంతునివలన; తాం = ఆ; రామకథాం=రామునిచరిత్రమును; శ్రుత్వా తు=వినినంతనే; మధురయా=మనోహరమగు; గిరా=మాటచేత; సాం

త్వం=తిన్నదైన;ఇదం=ఈ; వచనం= మాటను;ఉవాచ=చెప్పెను.

సీతాదేవి,వానరశ్రేష్ఠుండగుహనుమంతుండుచెప్పినయారాముని కథను విన్నంతనే, మధురవాక్యంబునఁ, దిన్నఁగా,నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

క్వ తే రామేణ సంసర్గః కథం జానాసి లక్ష్మణం
వానరాణాం నరాణాంచ కథ మాసీ త్సమాగమః. ౨

టీక॥ తే=నీకు;క్వ=ఎచ్చట; రామేణ=రామునితో; సంసర్గః=సంబంధము॥ కథం=ఎట్లు;లక్ష్మణం=లక్ష్మణుని; జానాసి=ఎఱుంగుదువు!కథం=ఎట్లు; వానరాణాం=వానరులకును; నరాణాంచ=మనుష్యులకును ; సమాగమః=చేరిక;ఆసీత్=కల్గినది.

నీకెచ్చట రామునితోసంబంధము గల్గినది; లక్ష్మణునెట్లెఱుంగుదువు?వానరులకును నరులకునెట్లుసమాగమంబు గల్గినది? అని, తాత్పర్యము.

యాని రామస్య లింగాని లక్ష్మణస్యచ వానర
తాని భూయ స్సమాచక్ష్వ న మాం శోక స్సమావిశేత్. ౩

టీక॥వానర=హనుమంతుఁడా! రామస్య=రామునకును;లక్ష్మణస్యచ= లక్ష్మణునికిని;లింగాని=గుఱుతులు; యాని=ఏవో; తాని=వానిని;భూయః= మఱల; సమాచక్ష్వ=చెప్పుము. మాం= నన్ను; శోకః=దుఃఖము; నసమావిశేత్=పొందకుండును.

హనుమంతుఁడా! రామునకును లక్ష్మణునకును;గుఱుతులేవిగలవో, వానినిమఱల నాకుఁజెప్పుము;వానినివిందునేని నాకుదుఃఖముగలుగదు.

అని, తాత్పర్యము.

కీదృశం తస్య సంస్థానం రూపం రామస్య కీదృశం
కథ మూరూ కథం బాహూ లక్ష్మణస్యచ శంస మే. ౪

టీక॥తస్య=ఆ; రామస్య=రామునియొక్క; సంస్థానం=అవయవసన్నివేశము;కీదృశం=ఎట్టిది? రూపం=రూపము;కీదృశం=ఎట్టిది? లక్ష్మణస్యచ=

స ౩౫

లక్ష్మణునియొక్కయు; ఊరూ=తొడలు; కథం=ఎట్లు? బాహూ = చేతులు; కథం=ఎట్లు? మే=నాకు; శంస=చెప్పుము.

రాముని యవయవంబు లెట్లుండును? రూపం బెట్టిది? లక్ష్మణుని తొడలెట్లుండును? చేతులెట్లుండును? నాకుం జెప్పుము. అని, సీతాదేవి, హనుమంతునితోం జెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు వైదేహ్యా హనుమాన్మారుతాత్మజః
తతో రామం యథాతత్త్వ మాఖ్యాతు ముపచక్రమే. ౫

టీక॥ మారుతాత్మజః= వాయుదేవునికొడుకైన; హనుమాన్ తు= హనుమంతుఁడును; వైదేహ్యా=సీతాదేవిచేత; ఏవం=ఇట్లు; ఉక్తః = చెప్పఁబడినవాఁడై; తతః=అటుపిమ్మట; రామం= రామునిని; యథాతత్త్వం= నిశ్చయము నతిక్రమింపక; ఆఖ్యాతుం=చెప్పుటకు; ఉపచక్రమే=ఆరంభించెను.

వాయుదేవుని కుమారుండగు హనుమంతుండు, ఇట్లు సీతాదేవి చెప్పినమాటను విని, యంతట, రాముని రూపురేఖలను, ఉన్నదున్నట్లు, చెప్పనారంభించెను.

అని, తాత్పర్యము.

జానంతీ బత దిష్ట్యా మాం వైదేహి పరిపృచ్ఛసి
భర్తుః కమల పత్త్రాక్షి సంస్థానం లక్ష్మణస్య చ. ౬

టీక॥ కమలపత్త్రాక్షి=తామరపూరేకులవంటికండ్లుగల ; వైదేహి=సీతాదేవీ! త్వం(అధ్యాహృతము)= నీవు; మాం=నన్ను; జానంతీ=ఎఱిఁగినదానవయి; దిష్ట్యా=భాగ్యముచేత; భర్తుః= పెనిమిటియగు రామునియొక్కయు; లక్ష్మణస్యచ=లక్ష్మణునియొక్కయు; సంస్థానం=అవయవసన్నివేశమును; పరిపృచ్ఛసి=అడుగుచున్నావు. బత=సంతోషము!

తామరపూరేకులంబోలుకండ్లుగల సీతాదేవీ! నీవు, నన్ను రామదూతనుగా నెఱింగియును, నా భాగ్యవశంబునం జేసి, రామలక్ష్మణులయవయవ సన్నివేశము నడిగినావు; నాకు, రామలక్ష్మణుల నంగీకరించు పుణ్యంబు గల్గినది; సంతో

షము! అని, తాత్పర్యము.

యాని రామస్య చిహ్నాని లక్ష్మణస్యచ యానివై
లక్షితాని విశాలాక్షి వదతశ్శృణు తాని మే. ౭

టీక॥ విశాలాక్షి=వెడలుపులయిన కండ్లుగలసీతాదేవీ! రామస్య=రామునియొక్క; యాని=ఏ;చిహ్నాని=గురుతులు;లక్ష్మణస్యచ= లక్ష్మణునియొక్కయు;యాని=ఏగురుతులు ("వై" అనునది పాదపూరణార్థము); త్వయా=(అధ్యాహృతము)=నీచేత; లక్షితాని= చూడఁబడినవో; తాని=ఆగురుతులను; వదతః = చెప్పుచున్న; మే=(పంచమ్యర్థమందుషష్ఠి)నావలన;శృణు = వినుము.

విశాలములయిన కండ్లుగలసీతాదేవీ!నీవు రామునియందును లక్ష్మణునియందు నేయేగురుతులంజూచియున్నావో, ఆగురుతులం జెప్పెదను;వినుము,

అని, తాత్పర్యము.

రామః కమలపత్రాక్ష స్సర్వసత్త్వ మనోహరః
రూపదాక్షిణ్య సంపన్నః ప్రసూతో జనకాత్మజే. ౮

టీక॥జనకాత్మజే= జనకునికూఁతురవయినసీతాదేవీ!రామః = రాముండు,సర్వాంగసుందరుండనుట; కమలపత్రాక్షః= తామరపూరేకులవంటికండ్లుగలవాఁడును (సర్వాంగసుందరుండనుటచేతనే, నేత్రసౌందర్యమును జెప్పఁబడినదైనను, నేత్రములయందధికముగా విలక్షణ కాంతియున్నదని సూచించుటకై మఱలఁజెప్పఁబడినది); సర్వసత్త్వమనోహరః= సమస్తములయినజంతువుల మనంబునాకర్షించువాఁడును; రూపదాక్షిణ్యసంపన్నః = సౌందర్యముతోను, మొగమోటముతోనుగూడినవాఁడునై ;ప్రసూతః=పుట్టినవాఁడు. ఈగుణంబులన్నియుఁ బుట్టినప్పటినుండియున్నవి కానినడుమవచ్చినవికావనుట.

జనకునికూఁతురవయిన సీతాదేవీ! రాముండు, సర్వాంగసుందరుండుఁ, దామరరేకులంబోలుకండ్లుగలవాఁడు, సమస్తజంతువుల మనంబును సంతోషంబు గల్గించు వాఁడు, రూపదాక్షిణ్యాదిగుణంబులుగలవాఁడునై, పుట్టె

నాఁడు. అని, తాత్పర్యము.

తేజ సాదిత్య సంకాశః క్షమయా పృథివీ సమః
బృహస్పతి సమోబుద్ధ్యా యశసా వాసవోపమః. ౯

టీక॥ రామః (అధ్యాహృతము) = రాముఁడు; తేజసా = తేజస్సుచేత; ఆదిత్యసంకాశః = సూర్యునితో సమానుండు; క్షమయా = ఓర్పుచేత ; పృథివీసమః = భూమితో సమానుండు ; బుద్ధ్యా = బుద్ధిచేత ; బృహస్పతి సమః = బృహస్పతితో సమానుండు; యశసా = కీర్తిచేత; వాసవోపమః = ఇంద్రునితోఁబోలికగలవాఁడు.

రాముఁడు, తేజంబున సూర్యునివలె రవచ్చును;ఓర్పునభూమికిసమానుండు; బుద్ధిచే, బృహస్పతితో సరియయినవాఁడు; కీర్తియందు, దేవేంద్రునకు సాటి యగును. అని, తాత్పర్యము.

రక్షితా జీవలోకస్య స్వజనస్యాభి రక్షితా
రక్షితాస్వస్య వృత్తస్య ధర్మస్యచ పరంతపః. ౧౦

టీక॥ రామః (అధ్యాహృతము) = రాముఁడు; జీవలోకస్య = ప్రాణిలోకము యొక్క; రక్షితా = రక్షించువాఁడు. స్వజనస్య = తనబంధువుయొక్క; అభిరక్షితా = విశేషించిరక్షించువాఁడు. స్వస్య = తనదైన; వృత్తస్య = ఆచారము యొక్కయు; ధర్మస్యచ = ధర్మము యొక్కయు; రక్షితా = రక్షించువాఁడు. పరంతపః = శత్రువులదపింపఁజేయువాఁడు.

రాముండు, ప్రాణిలోకంబునవెత యుఁగాపాడువాఁడు ; విశేషించితన బంధువులంగాపాడువాఁడు; తనజాతి యిజాతికిందగిన యాచారమునువర్ణాశ్రమధర్మంబులనురక్షించుచుండువాఁడు;శత్రువులందపింపఁజేయువాఁడు.

అని, తాత్పర్యము.

రామో భామిని లోకస్య చాతుర్వర్ణ్యస్య రక్షితా
మర్యాదానాంచ లోకస్య కర్తాకార యితాచసః. ౧౧




టీక॥ భామిని=సీతాదేవీ! రామః= రాముఁడు; లోకస్య= ప్రపంచముయొక్క; చాతుర్వర్ణ్యస్య= నాలుగువర్ణములయొక్క-యు; రక్షితా = రక్షించువాఁడు. సః=ఆ రాముఁడు; లోకస్య= ప్రపంచముయొక్క; మర్యాదానాం= మర్యాదలయొక్క; కర్తా చ= చేయువాఁడును; కారయితా చ = చేయించువాఁడును.

సీతాదేవీ! రాముండు, లోకంబునందలి నాలుగువర్ణంబులను రక్షించువాఁడు; మఱియు నతండు లోకంబునందలి మర్యాదలననుష్ఠించువాఁడు. ప్రజలచే ననుష్ఠింపఁజేయువాఁడు.

అని, తాత్పర్యము.

అర్చిష్మానర్చితోఽత్యర్థం బ్రహ్మచర్యవ్రతే స్థితః
"బ్రహ్మచర్యవ్రతోదితః" ఇతి పాఠాంతరం.
సాధూనాముపకారజ్ఞః ప్రచారజ్ఞశ్చ కర్మణామ్. ౧౨

టీక॥ రామః (అధ్యాహృతము)= రాముఁడు; అర్చిష్మాన్ = కాంతిగలవాఁడు. అత్యర్థం= మిక్కిలియును; అర్చితః=పూజింపఁబడినవాఁడు. బ్రహ్మచర్యవ్రతే=బ్రహ్మచర్యవ్రతమునందు; స్థితః=ఉన్నవాఁడు. బ్రహ్మచర్యవ్రతోదితః (అని, పాఠాంతరము)= బ్రహ్మచర్యవ్రతముచేఁ బ్రసిద్ధుఁడు. సాధూనాం= పెద్దలకు; ఉపకారజ్ఞః= ఉపకరించుట నెఱింగినవాఁడు; పెద్దలకుపకారముసేయువాఁడనుట. కర్మణాం=కర్మములయొక్క; ప్రచారజ్ఞః=గతి నెఱింగినవాఁడు.

రాముండు; మిక్కిలియుఁ గాంతిమంతుండు, మిక్కిలియుఁ బెద్దలచేఁ బూజింపఁబడువాఁడు; బ్రహ్మచర్యవ్రతంబునవలంబించియుండువాఁడు; పెద్దలకుపకారములు సేయువాఁడు; కర్మగతి నెఱింగినవాఁడు. అని, తాత్పర్యము.

రాజవిద్యావినీతశ్చ బ్రాహ్మణానాముపాసితా
శ్రుతవాన్ శీలసంపన్నో వినీతశ్చ పరంతపః. ౧౩

టీక॥ రామః (అధ్యాహృతము)=రాముఁడు; రాజవిద్యావినీతశ్చ=రా




జవిద్యలయందుశిక్షితుండును. బ్రాహ్మణానాం=బ్రాహ్మణులయొక్క; ఉపాసితా= సేవించువాఁడు. శ్రుతవాన్ = విద్యలుగలవాఁడు, శీలసంపన్నః=సదాచారముతోఁగూడినవాఁడు. వినీతశ్చ= వినయముగలవాఁడును. పరంతపః=శత్రువులందపింపఁజేయువాఁడు.

రాముండు, రాజవిద్యలనేర్చినవాఁడు;బ్రాహ్మణులసేవించువాఁడు;విద్యలనేర్చినవాఁడు; సదాచారము గలవాఁడు; వినీతుండు; శత్రువులందపింపఁజేయువాఁడు. అని, తాత్పర్యము.

యజుర్వేద వినీతశ్చ వేదవిద్భి స్సుపూజితః
ధనుర్వేదేచ వేదేషు వేదాంగేషుచ నిష్ఠితః. ౧౪

టీక॥ రామః (అధ్యాహృతము)— రాముఁడు;యజుర్వేదవినీతశ్చ= యజుర్వేదమునందు శిక్షింపఁబడినవాఁడును; వేదవిద్భిః= వేదములనెఱింగినవారలచేత;సుపూజితః= చక్కఁగాఁబూజింపఁబడినవాఁడు.ధనుర్వేదేచ = ధనుర్వేదమునందును; వేదేషు=యజుర్వేదముకన్నయితరవేదములయందును; వేదాంగేషుచ = వేదాంగములయందును;నిష్ఠితః=పండితుండు.

రాముండు, యజుర్వేదంబును జక్కఁగా జదివినవాఁడు; వేదవేత్తలగు వారలచేతఁజక్కఁగాఁబూజింపఁబడువాఁడు;ధనుర్వేదమును,ఇతర వేదములును, వేదాంగంబులును,జక్కఁగాఁ దెలిసినవాఁడు. అని, తాత్పర్యము.

విపులాంసో మహాబాహుః కంబుగ్రీవ శ్శుభాననః
గూఢజత్రు స్సుతామ్రాక్షో రామో దేవి జనై శ్శ్రుతః. ౧౫

టీక॥ దేవి= సీతాదేవీ! రామః=రాముఁడు;విపులాంసః= విశాలములయిన మూఁపులుగలవాఁడు.మహాబాహుః= పెద్దచేతులుగలవాఁడు. కంబుగ్రీవః = శంఖమువంటికంఠముగలవాఁడు. శుభాననః= సుందరమయినముఖముగలవాఁడు.గూఢజత్రుః = అగపడనిమూఁపులసంధియెముకలుగలవాఁడు.సుతామ్రాక్షః= మిక్కిలియెఱ్ఱనికన్నులుగలవాఁడు.జనైః=జనులచేత;శ్రుతః=వినఁబడి

నవాఁడు.

సీతాదేవీ! రాముండు విశాలములయినమూఁపులుగలవాఁడు; పెద్దచేతులుగలవాఁడు; శంఖమువంటి మెడగలవాఁడు;మఱియు. నతనిమొగముసుందరముగానుండును; అతనిమూఁపులసంధియెముకలుమాంసముచేత మూయఁబడియగపడకుండును; అతనికంఠమెఱ్ఱఁగానుండును;అతండు, సమస్తలోకంబులయందుఁ, బ్రసిద్ధుండు.

అని, తాత్పర్యము.

దుందుభిస్వననిర్ఘోషః స్నిగ్ధవర్ణః ప్రతాపవాన్
సమస్సమవిభక్తాంగో వర్ణం శ్యామం సమాశ్రితః. ౧౬

టీక॥ రామః (అధ్యాహృతము) = రాముండు; దుందుభిస్వననిర్ఘోషః= భేరీధ్వనివంటికంఠధ్వనిగలవాఁడు. స్నిగ్ధవర్ణః= సుందరమైనరంగుగలవాఁడు ప్రతాపవాన్=పరాక్రమశాలి.సమః= అంత పొడవును బొట్టియుఁగాని దేహముగలవాఁడు.సమవిభక్తాంగః= ఎచ్చుతక్కువలులేనివియు వేఱుపఱుపబడినవియునగునవయవములుగలవాఁడు. శ్యామం=నల్లని; వర్ణం= రంగును;సమాశ్రితః=పొందినవాఁడు.

రామునికంఠధ్వని భేరీధ్వనియుంబోలెనుండును;అతనిదేహవర్ణము సుందరముగానుండును; అతనిపరాక్రమముగొప్పది; అతనిదేహము, అంతపొడవును అంతపొట్టియునుగాకసమముగానుండును;అతనియవయవంబులన్నియు, నెచ్చుతక్కువలులేక, యొకటితోనొకటిచేరక,సుందరములయియుండును; అతనిదేహమునల్లగానుండును.

అని, తాత్పర్యము.

త్రిస్థిరస్త్రిప్రలంబశ్చ త్రిసమస్త్రిషు చోన్నతః
త్రితామ్రస్త్రిషు చ స్నిగ్ధో గంభీరస్త్రిషు నిత్యశః. ౧౭

టీక॥ రామః (అధ్యాహృతము) = రాముఁడు; నిత్యశః = ఎల్లప్పుడును; త్రిస్థిరః=మూఁటియందుస్థైర్యము గలవాఁడు,"ఉరశ్చమణిబంధశ్చ ముష్టిశ్చ నృపతేస్థ్సిరాః" ( ఱొమ్మును చేతిమణికట్టును,పిడికిలియును, రాజునకుస్థిరము

లుగానుండును) అని, సాముద్రికమునందుఁ జెప్పఁబడినలాగున, ఱొమ్ము, మణిబంధము, పిడికిలి, ఈమూఁడును స్థిరములుగాఁగలవాఁడనుట, త్రిప్రలంబః=మూఁటియందు నిడువుగా నుండువాఁడు, "ప్రలంబాయస్యసధనీ త్రయో భ్రూముష్కబాహవః" (ఎవ్వనికిఁ గనుబొమ్మలును వృషణములును బాహువులును దీర్ఘములుగానుండునో, అతండు ధనవంతుఁడగును) అని చెప్పఁబడినట్లు, కనుబొమ్మలును వృషణములును బాహువులును దీర్ఘములుగాఁగలవాఁడనుట. త్రిసమః=మూఁటియందు ఎచ్చుతక్కువలు లేనివాఁడు "కేశాగ్రం వృషణం జానూ సమా యస్య స భూపతిః" (తల వెండ్రుకల కొనలును వృషణములును మోఁకాళ్లును ఎవ్వనికి సమానములుగానుండును, అతండు రాజగును.) అన్నట్లు, తల వెండ్రుకలును వృషణములును మోఁకాళ్లును సమానముగాఁగలవాఁడనుట. త్రిషు= మూఁటియందు; ఉన్నతశ్చ=పొడవైనవాఁడును, "నాభ్యంతః కుక్షివక్షోభిరున్నతః క్షితిపో భవేత్" (బొడ్డు, లోఁగడుపు, ఱొమ్ము, వీనిచే నున్నతుండైనవాఁడు రాజగును) అన్నట్లు, బొడ్డును లోఁగడుపును ఱొమ్మును, బొడవులుగాఁగలవాఁడనుట. త్రితామ్రః=మూఁటియం దెఱ్ఱనైనవాఁడు, "నేత్రాంతనఖపాణ్యంఘ్రితలైస్తామ్రైస్త్రిభిస్సుఖీ" (కనుఁగొనలును నఖములును అఱచేతులు నఱకాళ్లును ఎఱ్ఱఁగానున్నచో సుఖియగును) అనియున్నట్లు, కనుఁగొనలును నఖములును అఱచేతులును అఱకాళ్లును ఎఱ్ఱనివిగాఁగలవాఁడనుట. త్రిషు=మూఁటియందు; స్నిగ్ధశ్చ=నునుపుగలవాఁడును, "స్నిగ్ధా భవంతి వై యేషాం పాదరేఖాశ్శిరోరుహాః । తథా లింగమణిస్తేషాం మహాభాగ్యం వినిర్దిశేత్" (ఎవ్వరికి, పాదములయందలి రేఖలును తలవెండ్రుకలును లింగమును, నునుపుగలిగి యుండునో, వారలకు మహాభాగ్యము గలుగునని చెప్పవలయును) అనియున్నట్లు, పాదరేఖలును దలవెండ్రుకలును లింగమును నునుపుగాఁగలవాఁడనుట. త్రిషు= మూఁటియందు; గంభీరః = గాంభీర్యముగలవాఁడు, "స్వరే గతౌ చ నాభౌ చ గంభీరస్త్రిషు శస్యతే" (కంఠధ్వనియందును నడకయందును గాంభీర్యము గలిగి, నాభియందు లోఁతుగలవాఁడు ప్రశస్తుఁడు) అని చెప్పఁబడిన చొప్పున, కంఠస్వరంబును, నడకయును గంభీరము

దియాఱుఅంగుళముల పొడవుగలవాఁడను ట. చతుష్కలః = నాలుగువిచ్చుతెక్కు వలు లేనివి గాఁగలవాఁడు, "బాహుజా నూరుజంఘాశ్చ తత్వార్థసమానిచ" (బాహువులును మోఁకాళ్లునుదొడలు నుబిక్కలును, ఈనాలుగునుసమానము లుగానుండవలెను) అనియున్నట్లు, బా హువులును మోఁకాళ్లునుదొడలును బి క్కలునుసమానములు గాఁగలవాఁడ నుట.

రాముఁడు, కంఠమునందుమూఁడు రేఖలుగలవాఁడు; మఱియు, నతని స్త నాగ్రంబులును స్తనంబులును, రేఖలునుతు బల్లముగా నుండును; అతనికంఠమును లింగమునుబిట్టలునుబిక్కలును హ్రస్వ ములుగానుండును; అతనితలలోమూఁ డుసుళ్లుగలవు; అతనియంగుష్ఠమూలం బుననాలుగు రేఖలున్నవి; అతనినుదుట నుబాదతలంబులను అఱచేతులందును, నాలుగు రేఖలు గలవు; అతనియౌన్న త్యములొంబదియాఱు అంగుళములు; అత ని, బాహువులు మోఁకాళ్లునుతొడలు నుబిక్కలును సమానములుగానుండు ను. అని, తాత్పర్యము.

చతుర్దశసమద్వంద్వ శ్చతుర్దంష్ట్ర శ్చతుర్గతిః
మహోష్ఠ హనునాసశ్చ పంచస్నిగ్ధోష్ట వంశవాన్, ౧౭

టీక॥ రామః(అధ్యాహృతము) = రాముఁడు; చతుర్దశసమద్వంద్వః = పదునాలుగుసమానములయినజంటలు గలవాఁడు, "భ్రూనాసాపుటే నేత్రే కర్ణావోష్ఠౌచ చూచుకే, కూర్పరౌ మ ణిబంధేచ జానునీవృషణౌ కటీ, కరౌ పా దౌస్ఫిజౌ యస్య సమౌజ్ఞేయస్సభూప తిః" (కనుబొమ్మలును ముక్కురంధ్రం బులునుగండ్లును జెవులునుఁ బెదవులును స్తనాగ్రంబులును మోఁచేతులునుమణి కట్టులును మోఁకాళ్లునువృషణంబులును కటిస్థలంబులును జేతులును బాదంబులు నుపిఱుఁదులును, ఎవ్వనికి సమానములై యుండునో, అతండు రాజనియెఱుంగు నది.) అన్నట్లు, ఈపదునాలుగవయవ ములునుసమానములు గాగలవాఁడను ట, చతుర్దంష్ట్రః = నాలుగుదంష్ట్రలనంబ డుదంతములు గలవాఁడు, (పండ్ల వరుసల రెంటిలో నడుమ నాలుగు పండ్లకు రెండు ప్రక్కలనుండు పం డ్లునాలుగును దంష్ట్రలనం బడుచున్న వి) "స్నిగ్ధాఘనాశ్చదశనా స్సుతీక్ష్ణదం

ష్టౌస్సమాశ్చశుభాః" (కాంతిగలవియుఁ బెద్దవియుఁ దీక్ష్ణంబులును సమంబులునగు దంష్ట్రలు మంగళకరంబులు) అని, చెప్పంబడు లక్షణంబులుగల, నాలుగు దంష్ట్రలుగలవాఁడనుట. చతుర్గతిః= నాలుగు మృగములయొక్క నడకవంటి నడకగలవాఁడు, సింహము పెద్దపులి యేనుంగు వృషభము ఈనాలుగు మృగంబులంబోలె నడుచువాఁడనుట. మహోష్ఠహనునాసశ్చ= పెద్దదైన పెదవియును జెక్కిలిమీఁది భాగములును ముక్కునుగలవాఁడు, (ఇచ్చట, "పెద్ద పెదవి" యనఁగా, మంకెన పువ్వుంబోలె నెఱ్ఱనై మాంసము చేబలిసిన పెదవియనుట; "పెద్దహనువు" అనఁగా, మాంసము చేబలిసిన హను వనుట, "పెద్దముక్కు" అనఁగా, ఉన్నతమయినముక్కు అనుట) "బంధుజీవకుసుమోపమోష్ఠో మాంసలో రుచిరబింబరూపశ్చ, పూర్ణమాంసల హనుస్తు భూమిపస్తుంగతుండ రుచిరాకృతిస్తథా" (ఎవ్వనికి, మంకెన పువ్వుతో సమానమయి బలిసి మనోహరమయి నదొండపండువలెనుండు పెదవియును, మాంసముతో నిండిన చెక్కిలిమీఁది భాగములును ఉన్నతమైన ముక్కుయొక్క మనోహరమయిన యాకృతియు నున్నవో, అతండు రాజగును) అని యున్నట్లు, మంకెన పువ్వువలె నెఱ్ఱనై బలిసియుండు పెదవియును మాంసముతో నిండియుండు చెక్కిలిమీఁది భాగము నున్నతమయిన ముక్కునుగలవాఁడనుట. పంచస్నిగ్ధః= అయిదు కాంతిగల యవయవములుగలవాఁడు, "చక్షుస్స్నేహేన సౌభాగ్యం దంతస్నేహేన భోజనం, త్వచస్స్నేహేన శయనం పాదస్నేహేన వాహనం; స్నిగ్ధనీలమృదుకుంచితాస్తథా మూర్ధజాస్సుఖకరాః" (కండ్లయందుఁ గాంతియుండిన సౌభాగ్యము గల్గును; దంతముల యందుఁ గాంతియుండిన మంచి భోజనము గల్గును; చర్మమునందుఁ గాంతియున్నచో, మంచి పాన్పు గలుగును; పాదములయందుఁ గాంతియుండినచో, వాహనంబు గల్గును; కాంతిగలిగి నల్లనివై చుట్టలుగల వెండ్రుకలు సౌఖ్యము గలిగించును.) అని యున్నట్లు, కండ్లును దంతములును దేహచర్మమును బాదంబులును దల వెండ్రుకలును గాంతిగలవి గాఁగలవాఁడనుట. అష్టవంశవాన్= ఎనిమిది నిడుపైనవి గలవాఁడు, "బాహూ చ నలకౌ చోరూ జంఘే చేత్యష్టవంశకాః" (బాహు

వులును వ్రేళ్లును దొడలును పిక్కలును ఈ యెనిమిదియు దీర్ఘములయియుండవలెను) అన్నట్లు. బాహువులును వ్రేళ్లును దొడలును పిక్కలును దీర్ఘములు గాంగలవాండనుట.

రామునికి, కనుబొమ్మలును ముక్కురంధ్రములును కండ్లును చెవులును బెదవులును స్తనాగ్రంబులును మోంచేతులును మణికట్టులును మోంకాళ్లును వృషణంబులును కటిస్థలంబులును చేతులును బాదంబులు పిఱుందులును సమానంబులుగానుండును; అతనికి, దంష్ట్రిలనంబడు నాలుగు శుభలక్షణలక్షితంబులయిన పండ్లుగలవు; అతండు, సింహము, పెద్దపులి, యేనుంగు, వృషభంబు, ఇవినడుచునట్లు నడుచును; ఎఱ్ఱంగా బలిసియుండు పెదవులను బలిసియున్నతములయిన హనువులును న్నతంబయిన ముక్కును గలిగియుండు; అతనికి కండ్లయందును బండ్లయందును శ్లేషాచర్మమునందును పాదంబుల యందును కేశంబులయందును గాంతియుండును; అతనిబాహువులును వ్రేళ్లును దొడలును పిక్కలును దీర్ఘములయియుండును.

అని, తాత్పర్యము.

దశపద్మో దశబృహత్ త్రిభిర్వ్యాప్తో ద్విశుక్లవాన్
షడున్నతో నవతను స్త్రిభిర్వ్యాప్నోతి రాఘవః. ౨౦

టీక॥ రాఘవః = రాముండు; దశపద్మః = పదిపద్మములవంటివియగువయవములు గలవాండు. "ముఖనేత్రాస్య జిహ్వోష్ఠతాలు స్తననఖాః కరౌ, పాదౌ చ దశపద్మాని పద్మాకారాణి యస్య చ" (ఎవ్వనికి, ముఖము కండ్లును నోరును నాలుకయును బెదవులును దవుడలును స్తనములును గోళ్లును హస్తములును బాదములును, తామరపూలుంబోలె నుండునో, అతండు, రాజగును.) అనియున్నట్లు తానవియును బద్మములవంటివిగాంగలవాండనుట. దశబృహత్ = పదిపెద్దవిగాంగలవాండు; "శిరో లలాటే శ్రవణే గ్రీవా వక్షశ్చ హృత్తథా, ఉదరం పాణిపాదౌ చ పృష్ఠం దశబృహంతి చ" (తలయును లలాటంబును చెవులును కంఠమును ఱొమ్మును హృదయమును నోరును చేతులును కాళ్లును బిఱ్ఱయును, పెద్దవిగానుండవలయును ఇచ్చట, "పెద్దహృదయమనంగా, ఉదారహృదయుండనుట.) అని,

యున్నట్లు, ఈపదియవయవములును బెద్దవి గాఁగలవాఁడనుట. త్రిభిః=మూఁటిచేత; వ్యాప్తః=వ్యాపించినవాఁడు, "త్రిభిర్వ్యాప్తిశ్చ యస్యాస్త్యాత్తేజసా యశసా శ్రియా (తేజస్సుచేతను కీర్తిచేతను సంపదచేతను వ్యాప్తి యెవ్వనికిఁ గలదో అతం డుత్తముండు) అని యున్నట్లు, తేజస్సుచేతను గీర్తిచేతను సంపదచేతను బ్రపంచమునం దంతయుఁ బ్రసిద్ధి కెక్కినవాఁడనుట. ద్విశుక్లవాన్=రెండు తెల్లనివి గలవాఁడు, తెల్లనిదంతములును గండ్లును గలవాఁడనుట; లేక, "ద్వౌశుక్లౌ తు శుభౌ శుద్ధౌ వంశౌ మాతుః పితుస్తథా" (రెండు శుక్లంబులనఁగా, మంగళకరంబులును బరిశుద్ధంబులును నగు మాతృపితృవంశంబులు రెండును.) అని యున్నట్లు, పరిశుద్ధంబులయిన మాతృపితృవంశంబులు రెండును గలవాఁడనుట. షడున్నతః = ఆఱు ఉన్నతములయినవి గలవాఁడు, "కక్షః కుక్షిశ్చ వక్షశ్చ ఘ్రాణ స్కంధౌ లలాటికా, సర్వభూతేషు నిర్దిష్టా ఉన్నతాంగా శ్శుభప్రదాః" (చంకయును కడుపును ఱొమ్మును ముక్కును మూఁపును లలాటమును, ఇవి యున్నతములయినచో, సర్వప్రాణులయందును మంగళప్రదంబులని చెప్పఁబడినవి) అని యున్నట్లు, ఈయాఱును నున్నతములు గాఁగలవాఁడనుట. నవతనుః=తొమ్మిది సూక్ష్మము లయినవి గలవాఁడు, "సూక్ష్మాణ్యంగుళిపర్వాణి కేశరోమనఖత్వచః, శేఫశ్చ యేషాం సూక్ష్మాణి తే నరా దీర్ఘజీవినః. అస్ఫుటితాగ్రం సూక్ష్మం శ్మశ్రు శుభం మృదు చ సంతతం స్నిగ్ధం, సూక్ష్మదృక్ సూక్ష్మబుద్ధిశ్చ యో నరస్స సుఖీభవేత్" (వ్రేళ్లగణుపులును దలవెండ్రుకలును గోళ్లును జర్మమును, లింగమును ఎవ్వరికి సూక్ష్మములయి యుండునో, వారు దీర్ఘకాలము జీవింతురు; చిట్లని కొనలు గలిగి మృదుళమయి దట్టముగాను నున్ననై సూక్ష్మమయి యుండు మీసము మంగళకరము; సూక్ష్మదర్శియగువాఁడును సూక్ష్మబుద్ధియగువాఁడును సుఖంబు నొందును) అని యున్నట్లు, వ్రేళ్లగణుపులును తలవెండ్రుకలును గోళ్లును జర్మమును లింగమును మీసమును దృష్టియును బుద్ధియును, ఈ తొమ్మిదియును సూక్ష్మములు గాఁగలవాఁడనుట. త్రిభిః=మూఁడిటిచేత; వ్యాప్నోతి=పొందుచున్నాఁడు, మూఁడైన పూర్వాహ్ణ మధ్యాహ్నాపరాహ్ణ కాలముల చేత ధర్మార్థకామముల ననుష్ఠింపుననుట.

రాముని ముఖమును కండ్లును నోరు

నునాలుకయును బెదవులును దవుడలు స్తనములునుగోళ్లునుహస్తములును ఛాదములునుబద్మములవలెనుండును; అతనితలయునులలాటమును చెవులునుగంఠమునుఱొమ్మునుహృదయమును కడుపును చేతులునుకాళ్లునుబిఱ్ఱులునుబెద్దవి;అతండు తేజంబునను యశంబునను సంపదను బ్రసిద్ధికెక్కినవాఁడు;అతనిమాతృపితృవంశంబులు రెండును బరిశుద్ధంబులు; అతనిచంకయునుకడుపును ఱొమ్మునుముకుఁనును మూఁపును లలాటమును,ఉన్నతములుగానుండును;అతని, వ్రేళ్లగణుపులును దలవెండ్రుకలును వెండ్రుకలును గోళ్లును జర్మమును లింగమును మీసమును దృష్టియును బుద్ధియునుసూక్ష్మములు; అతండు, పూర్వాహ్ణమధ్యాహ్నపరాహ్ణకాలంబులందు, వరుసగాధర్మార్థకామంబుల ననుష్ఠించును. అని, తాత్పర్యము.

సత్యధర్మపరః శ్రీమాన్ సంగ్రహానుగ్రహే రతః
దేశకాలవిభాగజ్ఞ స్సర్వలోకప్రియంవదః. ౨౦

టీక॥ రామః (అధ్యాహృతము)= రాముఁడు; సత్యధర్మపరః=సత్యమునందునుధర్మమునందును ఆసక్తుఁడు. శ్రీమాన్ = అధికమయిన సంపదగలవాఁడు. సంగ్రహానుగ్రహే = ఆర్జించుటయందునుఇచ్చుటయందును;రతః= ఆసక్తుండు. దేశకాలవిభాగజ్ఞః=దేశములయొక్కయు కాలములయొక్కయువిభాగములనెఱింగినవాఁడు, ఏదేశంబున నేకాలంబున దేనిఁజేయవలయునో దానినంతయు నెఱింగినవాఁడనుట. సర్వలోకప్రియంవదః= సమస్తప్రాణులకును బ్రీతిగలిగించు మాటనె చెప్పువాఁడు.

రాముండు, సత్యంబునందును ధర్మంబునందునుమిక్కిలియునాసక్తిగలవాఁడు; శ్రీమంతుండు; ధనాదులనార్జించును;వానియాచకులకిచ్చును;ఏదేశంబున నేకాలంబున దేనిఁజేయవలయునో దానినంతయు నెఱుంగును; సమస్తప్రాణులకునుబ్రియముగానే మాటలాడును. అని, తాత్పర్యము.

భ్రాతాచ తస్య ద్వైమాత్ర స్సౌమిత్రి రపరాజితః

అనురాగేణ రూపేణ గుణై శ్శైవ తథావిధః. ౨౨

టీక॥తస్య = ఆరామునియొక్క; భ్రాతా—తమ్ముఁడును; ద్వైమాత్రః= ఇద్దఱు తల్లులకుఁ బుట్టినవాఁడును, (లక్ష్మణుండుసుమిత్రకుఁ బుట్టినవాఁడైనను. అతనిరామునింబోలెఁగౌసల్యయుఁ బెంచినదికావున, ఇద్దఱుతల్లులకుఁబుట్టినవాఁడని చెప్పఁబడినది);అపరాజితః= పరాజయమునొందనివాఁడునగు;సౌమిత్రిశ్చ = సుమిత్రకొడుకైనలక్ష్మణుండును; అనురాగేణ = ప్రేమచేతను, దయచేతనను;రూపేణ = సౌందర్యముచేతను;గుణైశ్శైవ=గుణములచేతను;తథావిధః=అట్టివాఁడు.

ఆరామునితమ్ముండు, రెండుతల్లులకుఁబుట్టినవాఁడుఁ బరాజయంబునొందనివాఁడునగులక్ష్మణుండును, దయయందును సౌందర్యమునందు నితరగుణంబులందును, రామునకుసరివచ్చును.

అని, తాత్పర్యము.

తావుభౌ నరశార్దూలౌ త్వద్దర్శన సముత్సుకౌ
విచిన్వంతౌ మహీం కృత్స్నా మస్మాభి రభి సంగతౌ. ౨౩

టీక॥తౌ=ఆ ; నరశార్దూలౌ= పురుషశ్రేష్ఠులగురామలక్ష్మణులు ; ఉభౌ=ఇద్దఱును ; త్వద్దర్శన సముత్సుకౌ=నీయొక్కచూచుటయందుమిక్కిలి యుఁగోరికగలవారలై; కృత్స్నాం= సమస్తమయిన; మహీం=భూమిని;విచిన్వంతౌ=వెదకుచు;అస్మాభిః = మాతోఁగూడ; అభిసంగతౌ= చేరినారు.

పురుషశ్రేష్ఠులగు నారామలక్ష్మణులునిన్నుఁజూడఁగోరినవారలై భూమియంతయు వెదకుచుండఁగా, మాకుమ వారికినిసమాగమంబుగల్గినది.

అని,తాత్పర్యము.

త్వా మేవ మార్గమాణౌ తౌ విచరంతౌ వసుంధరామ్
దదర్శతు ర్మృగపతిం పూర్వజేనా వరోపితమ్. ౨౪
ఋశ్యమూకస్య పృష్ఠేతు బహుపాదప సంకులే
భ్రాతు ర్భయార్త మాసీనం సుగ్రీవం ప్రియదర్శనమ్. ౨౫

టీక॥తౌ=ఆరామలక్ష్మణులు; త్వా=నిన్నే; మార్గమాణౌ= వెదకుచు; వసుంధరాం = భూమియంతయు; విచరంతౌ=తిరుగుచు;పూర్వజేన=అన్నయగువాలిచేత ; రాజ్యాత్=రాజ్యమునుండి ; అవరోపితం=త్రోయఁబడినవాఁడును; భ్రాతుః= అన్నవలన; భయార్తం= భయముచేతఁబీడింపఁబడినవాఁడును; బహుపాదపసంకులే=పెక్కులయినవృక్షములచే నిండిన;ఋశ్యమూకస్య= ఋశ్యమూకపర్వతముయొక్క; పృష్ఠే= నడుమునందు;ఆసీనం=కూర్చున్నవాఁడును; ప్రియదర్శనం=సంతోషకరంబగు చూచుటగలవాఁడునగు; మృగపతిం= వానరమృగములకుఁ బ్రభువైన ; సుగ్రీవం=సుగ్రీవుని;దదర్శతుః= చూచిరి.

ఆరామలక్ష్మణు, లట్లునిన్నువెదకుచు, భూమియంతయుఁదిరిగి, యన్నయగువాలిచే సింహాసనంబునుండి త్రోయఁబడి వాలివలని భయంబునఁ బెక్కు వృక్షంబులతో నొప్పుచున్నఋశ్యమూక పర్వతమధ్య ప్రదేశములో నున్నవానిఁబ్రియదర్శనుండగువాని,వానరాధీశ్వరుసుగ్రీవుంజూచిరి.

అని, తాత్పర్యము.

వయంతు హరిరాజం తం సుగ్రీవం సత్యసంగరమ్
పరిచర్యాస్మహే రాజ్యాత్పూర్వజే నావరోపితమ్. ౨౬

టీక॥వయంతు=మేమును; రాజ్యాత్=రాజ్యమునుండి; పూర్వజేన=అన్నయగువాలిచేత;అవరోపితం=త్రోయఁబడిన; సత్యసంగరం=సత్యమయినప్రతిజ్ఞగల; తం=ఆ; హరిరాజం=వానరాధిపుండగుసుగ్రీవుని; పరిచర్య= సేవించి;ఆస్మహే=ఉన్నాము.

మేము,వాలిచేరాజ్యంబునుండిత్రోయఁబడిన, సత్యప్రతిజ్ఞుండు వానరాధీశ్వరుండునగు సుగ్రీవునకు సేవ సేయుచుందుము.అని, తాత్పర్యము.

తత స్తౌ చీరవసనౌ ధనుఃప్రవరపాణినౌ
ఋశ్యమూకస్య శైలస్య రమ్యం దేశ ముపాగతౌ. ౨౭

టీక॥తతః=అటుపిమ్మట; చీరవసనౌ= నారచీరలకట్టుకొన్నవారలును;

ధనుఃప్రవరపాణినౌ (ధనుఃప్రవరపాణీ)=ధనుశ్శ్రేష్ఠములు హస్తములందుఁ గలవారలు నగు; తౌ=ఆ రామలక్ష్మణులు; ఋశ్యమూకస్య=ఋశ్యమూకమను; శైలస్య=పర్వతముయొక్క; రమ్యం=సుందరమయిన; దేశం=ప్రదేశమును; ఉపాగతౌ=పొందినారు.

అంత నారచీరలు గట్టుకొని శ్రేష్ఠంబులగు ధనువులు చేతంబూని యా రామలక్ష్మణులు, ఋశ్యమూకపర్వతములోని సుందర ప్రదేశమును జేరిరి అని, తాత్పర్యము.

స తౌ దృష్ట్వా నరవ్యాఘ్రౌ ధన్వినౌ వానరర్షభః
అవప్లుతో గిరేస్తస్య శిఖరం భయమోహితః. ౨౮

టీక ॥ వానరర్షభః=వానరశ్రేష్ఠుండగు; సః=ఆసుగ్రీవుఁడు, ధన్వినౌ=ధనుస్సుగల; తౌ=ఆ; నరవ్యాఘ్రౌ=పురుషశ్రేష్ఠులగు రామలక్ష్మణులను. దృష్ట్వా=చూచి; భయమోహితః=భయముచే మోహమునొందినవాఁడై; తస్య=ఆ; గిరేః=పర్వతముయొక్క; శిఖరం=శిఖరమునుగూర్చి; అవప్లుతః=ఎగిరినాఁడు.

వానరశ్రేష్ఠుండగు నాసుగ్రీవుండు, ధనుర్ధరులగు పురుషశ్రేష్ఠుల రామలక్ష్మణులంజూచి, భయంబున, వాలిచద న్నుఁజంపుటకై వీరలంబంపెనో యని యెంచి, యా పర్వత శిఖరంబుమీఁదికెదుమికెను.

అని, తాత్పర్యము.

తత స్స శిఖరే తస్మిన్ వానరేంద్రో వ్యవస్థితః
తయోస్సమీపం మామేవ ప్రేషయామాస సత్వరమ్. ౨౯

టీక॥ తతః=అటుపిమ్మట; సః=ఆ; వానరేంద్రః=వానరులకుఁ బ్రభుండగు సుగ్రీవుండు; తస్మిన్=ఆ; శిఖరే=శృంగమునందు; వ్యవస్థితః=ఉన్నవాఁడై; సత్వరం=వేగముతోఁగూడినట్లుగా; తయోః=ఆ రామలక్ష్మణులయొక్క; సమీపం=సమీపమునుగూర్చి; మామేవ=నన్నే; ప్రేషయామాస=పంపెను.

అంత, వానరాధీశ్వరుండగు నాసుగ్రీవుండు, ఆపర్వత శిఖరంబునసుండి. శీఘ్రముగా, నా రామలక్ష్మణుల యొద్దకు, నన్నే పంపెను. అని, తాత్పర్యము.

తావహం పురుషవ్యాఘ్రౌ సుగ్రీవవచనాత్ప్రభూ
రూపలక్షణసంపన్నౌ కృతాంజలి రుపస్థితః. ౩౦

టీక ॥ అహం=నేను; సుగ్రీవవచనాత్=సుగ్రీవునిమాటవలన; పురుషవ్యాఘ్రౌ= పురుషశ్రేష్ఠులును; ప్రభూ=రాజులును; రూపలక్షణసంపన్నౌ=రూపములోను లక్షణములోను గూడినవారలునగు; తౌ=ఆ రామలక్ష్మణులను; కృతాంజలిః=చేయఁబడినచేమోడ్పుగలవాఁడనై; ఉపస్థితః=పొందినాను.

నేను, సుగ్రీవునిమాటప్రకారము పురుషశ్రేష్ఠులును రాజులును సౌందర్యముతోను శుభలక్షణములతోను ఒప్పుచున్నవారలునగు నా రామలక్ష్మణులయొద్దకుఁబోయి, చేతులు మొగుడ్చుకొని, నిల్చినాను. అని, తాత్పర్యము.

తౌ పరిజ్ఞాత తత్త్వార్థౌ మయా ప్రీతి సమన్వితౌ
పృష్ఠ మారోప్య సందేశం ప్రాపితౌ పురుషర్షభౌ. ౩౧

టీక॥ పురుషర్షభౌ= పురుషశ్రేష్ఠులగు; తౌ=ఆ రామలక్ష్మణులు; మయా=నాచేత; పరిజ్ఞాతతత్త్వార్థౌ=ఎఱుంగఁబడినయథార్థస్థితి గలవారలై; ప్రీతిసమన్వితౌ=సంతోషముగల వారలై; పృష్ఠం=వీపును; ఆరోప్య=ఎక్కించుకొని; తం=ఆ; దేశం = ప్రదేశమును; ప్రాపితౌ=పొందింపఁజేయఁబడినారు.

నేను, పురుషశ్రేష్ఠులగు నా రామలక్ష్మణులయథార్థస్థితిం దెలిసికొని, వారలు సంతోషింపఁగా, నిరువురులవీపుపైనుంచుకొని, సుగ్రీవుం డుండుచోటికిం దీసికొనిపోతిని. అని, తాత్పర్యము.

నివేదితౌ చ తత్త్వేన సుగ్రీవాయ మహాత్మనే

టీక॥ మయా (అధ్యాహృతము)= నాచేత; తౌ (అధ్యాహృతము)= ఆ రామలక్ష్మణులు; మహాత్మనే= పూజ్యమయినస్వభావముగల; సుగ్రీవాయ= సుగ్రీవునికొఱకు; తత్త్వేన= యాథార్థ్యముచేత, నివేదితౌ చ= తెలుపఁబ

డిరియు.

నేనంత, నారామలక్ష్మణుల యథార్థస్థితిని, మహాత్ముండగు సుగ్రీవునకుం దెలిపితిని. అని, తాత్పర్యము.

తయో రన్యోన్యసల్లాపా ద్భృశం ప్రీతి రజాయత. ౩౨

టీక॥ తయోః=ఆరామసుగ్రీవులకు; అన్యోన్యసల్లాపాత్=ఒండొరులతో మాటలాడుకొనుటవలన ; భృశం=మిక్కిలియును; ప్రీతిః=స్నేహము; అజాయత=కలిగినది,

ఆరాముండును సుగ్రీవుండును బరస్పరము మాటలాడుకొనఁగానే, వారల కిద్దరకు మిక్కిలియు స్నేహంబు గలిగినది. అని, తాత్పర్యము.

తత స్తౌ ప్రీతిసంపన్నౌ హరీశ్వరనరేశ్వరౌ
పరస్పరకృతాశ్వాసౌ కథయా పూర్వవృత్తయా. ౩౩

టీక॥ తతః=అటుపిమ్మట ; తౌ=ఆ; హరీశ్వరనరేశ్వరౌ = వానరులకుఁ బ్రభువైన సుగ్రీవుండును మనుష్యులకుఁ బ్రభువయిన రాముండును; ప్రీతిసంపన్నౌ=సంతోషముతోఁ గూడిన వారలై; పూర్వవృత్తయా=మునుపుజరిగిన; కథయా=కథచేత ; పరస్పరకృతాశ్వాసౌ= ఒండొరులచేఁ జేయఁబడిన యూఱటగలవారలై; బభూవతుః(అధ్యాహృతము)=అయిరి.

అంత, వానరనాయకుండగు సుగ్రీవుండును నరనాయకుండగు రాముండును, వీరలిర్వురును, సంతోషంబునొంది, ఒకరితోనొకరు, తమకదివఱకు సంభవించినస్థితులం జెప్పుకొని, కొంత యూఱటనొందిరి. అని, తాత్పర్యము.

తత స్స సాంత్వయామాస సుగ్రీవం లక్ష్మణాగ్రజః
స్త్రీహేతో ర్వాలినా భ్రాత్రా నిరస్త మురుతేజసా. ౩౪

టీక॥ తతః= అటుపిమ్మట; లక్ష్మణాగ్రజః=లక్ష్మణునికన్నయయిన; సః=ఆ రాముఁడు; ఉరుతేజసా=అధికమయిన పరాక్రమముగల; భ్రాత్రా= అన్నయగు; వాలినా=వాలిచేత; స్త్రీహేతోః= స్త్రీయనుకారణమువలన; నిరస్తం= తి

గ్రసన్నిరింపఁబడిన; సుగ్రీవం=సుగ్రీవుని; సాంత్వయామాస=ఊఱడించెను.

అంత, మహాపరాక్రమశాలియగునగ్రజుండయినవాలిచే భార్యకుఁగానవమానింపఁబడియున్న సుగ్రీవుంజూచి,లక్ష్మణునకన్నయగు రాముండు, "వాలింజంపినీభార్యను నీకొసంగెదను" అనునది మొదలగుమాటలచే,నాశ్వాసించెను.

అని, తాత్పర్యము.

తత స్త్వన్నాశజం శోకం రామస్యాక్లిష్టకర్మణః
లక్ష్మణో వానరేంద్రాయ సుగ్రీవాయ న్యవేదయత్. ౩౫

టీక॥తతః=అటుపిమ్మట;లక్ష్మణః=లక్ష్మణుఁడు;అక్లిష్టకర్మణః=అలసటలేనికార్యములుగల, అలసటనొందకకార్యములు సేయునట్టియన్నుట; రామస్య, రాముని యొక్క;త్వన్నాశజం = నీవగపడకపోవుటవలనఁగలిగిన;శోకం=దుఃఖమును; వానరేంద్రాయ=వానరులకధిపుండగు;సుగ్రీవాయ=సుగ్రీవునికొఱకు;న్యవేదయత్=తెలిపెను.

అంత లక్ష్మణుండు, నీవగపడకపోవుటయు, దానంజేసి రామునకుదుఃఖముగలిగియుండుటయు, వానరేశ్వరుండగు సుగ్రీవునకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

స శ్రుత్వా వానరేంద్ర స్తు లక్ష్మణేనేరితం వచః
తదాసీ న్నిష్ప్రభో ఽత్యర్థం గ్రహగ్రస్త ఇవాంశుమాన్. ౩౬

టీక॥వానరేంద్రః=వానరులకుఁబ్రభువైన;సః=ఆసుగ్రీవుఁడు;లక్ష్మణేన=లక్ష్మణునిచేత;ఈరితం=చెప్పఁబడిన;వచః=మాటను;శ్రుత్వాతు = వినినంతనె;తదా=అప్పుడు; గ్రహగ్రస్తః=రాహుగ్రహముచే గ్రసింపఁబడ్డిన; అంశుమానివ=సూర్యుండుంబోలె; అత్యర్థం=మిక్కిలియు;నిష్ప్రభః=కాంతిలేనివాఁడు;ఆసీత్=అయ్యెను.

వానరనాయకుండగు నాసుగ్రీవుండు,లక్ష్మణుండు చెప్పినమాటనువిన్నంతనె, "తనకుంబోలెఁదనస్నేహితుండగు రామునకుంగూడ మహాదుఃఖముసంభవించియున్నదే" యని, రాహువుచేగ్రసింపఁబడిసూర్యుంఁడుంబోలెఁ, దెల్లఁబోయెను. అని, తాత్పర్యము.

తత స్త్వద్గాత్ర శోభీని రక్షసా హ్రియమాణయా
యాన్యాభరణజాలాని పాతితాని మహీతలే. ౩౬
తాని సర్వాణి రామాయ ఆనీయ హరియూథపాః
సంహృష్టా దర్శయామాసు ర్గతింతు న విదు స్తవ. ౩౭

టీక॥ తతః = అటుపిమ్మట; రక్షసా = రావణునిచేత; హ్రియమాణయా = అపహరింపఁబడుచున్న; త్వయా (అధ్యాహృతము) నీచేత; త్వద్గాత్రశోభీని = నీయవయవములందుఁ బ్రకాశించుచున్న; యాని = ఏ; ఆభరణజాలాని = సొమ్ములయొక్క - సమూహములు; మహీతలే = నేలయందు; పాతితాని = పడవేయఁబడినవో; హరియూథపాః = వానరులసమూహమును బాలించునట్టి మేటివానరులు; తాని = ఆయాభరణసమూహములను; సర్వాణి = అన్నింటిని; ఆనీయ = తెచ్చి; సంహృష్టాః = సంతోషంబునొందినవారలై; రామాయ = రామునికొఱకు; దర్శయామాసుః = చూపిరి. తవ = నీయొక్క; గతింతు = స్థానమునుమాత్రము; నవిదుః = ఎఱుంగరైరి.

అంత, నిన్ను రావణుండుగొనిపోవునప్పుడు, నీవు నేలంబడవేసిన సొమ్ములను, వానరశ్రేష్ఠులు సంతోషంబునంగొని తెచ్చి, రామునకుఁజూపిరి; నీవున్న స్థానముమాత్రము వారలకుఁ దెలియదయ్యెఁగావున, దానివారు చెప్పరైరి.

అని, తాత్పర్యము.

తాని రామాయ దత్తాని మన్మైవో పహృతానిచ
స్వనవంత్యవకీర్ణాని తస్మి న్విగతచేతసి. ౩౮

టీక॥ తాని = ఆయాభరణములు; రామాయ = రామునిచేత; దత్తాని = ఇయ్యఁబడినవి; తస్మిన్ = ఆ రాముఁడు; విగతచేతసి = పోయిన తెలివిగలవాఁడగుచుండఁగా, మూర్ఛనొందఁగాననుట; అవకీర్ణాని = వెదఁచల్లఁబడినవియు; స్వనవంతి = ధ్వనిగలవియునగు; తాని = (అధ్యాహృతము) ఆయాభరణములు; మయైవ = నాచేతనే; ఉపహృతానిచ = ఎత్తఁబడినవియు.

ఆయాభరణంబుల రామునకిచ్చితిరి, అతండు దానింజూచిమూర్ఛిల్లఁగా, నవి

నేలంబడి మోగుచుండినవి; అంత, నే నేవాని నెత్తిపెట్టినాను. అని, తాత్పర్యము.

తాన్యంకే దర్శనీయాని కృత్వా బహువిధం తవ
తేన దేవప్రకాశేన దేవేన పరిదేవితమ్. ౪౦

టీక॥ దేవప్రకాశేన=దేవతతోస మానుండైన; తవ=నీయొక్క; దేవేన=పెనిమిటియగు రాముని చేత; దర్శనీయాని=చూడఁదగిన, సుందరములయిన; తాని=ఆయాభరణములను; అంకే=తొడయందు; కృత్వా=చేసి; బహువిధం=పెక్కువిధంబులుగా; పరిదేవితం=ఏడ్పుటయయినది.

దేవతాసమానుండగు నీభర్త రాముండు, సుందరములయిన యాయాభరణంబులను దొడపైనుంచుకొని, నానాప్రకారంబుల, రోదనంబు చేసెను.

అని, తాత్పర్యము.

పశ్యత స్తాని రుదత స్తామ్యతశ్చ పునఃపునః
ప్రాదీపయన్ దాశరథే స్తాని శోకహుతాశనమ్. ౪౧

టీక॥ పునఃపునః=మాటిమాటికి; తాని=ఆయాభరణంబులను; పశ్యతః=చూచుచున్నవాఁడును. రుదతః=ఏడ్చుచున్నవాఁడును; తామ్యతశ్చ=పరితపించుచున్నవాఁడునగు; దాశరథేః=రామునియొక్క; శోకహుతాశనం=దుఃఖంబను నగ్నిని; తాని=ఆయాభరణంబులు; ప్రాదీపయన్=మండినట్లు చేసినవి.

రాముండు, మాటిమాటికి, ఆయాభరణంబులం జూచుచు, రోదనంబు సేయుచుఁ, బరితపించుచుండెను; అట్లు, ఆయాభరణంబులం జూఁడగానే, రాముని దుఃఖంబు వృద్ధిఁబొందినది,

అని, తాత్పర్యము.

శయితం చ చిరం తేన దుఃఖార్తేన మహాత్మనా
మయాపి వివిధై ర్వాక్యైః కృచ్ఛ్రా దుత్థాపితః పునః. ౪౨

టీక॥ దుఃఖార్తేన=దుఃఖముచేఁబీడింపఁబడిన; మహాత్మనః=పూజ్యమయిన

స్వభావంబుగలః తేన= ఆ రామునిచే త;చిరం=బహుకాలము; శయితం=పరుండుటయయినది. సః(అధ్యాహృతము)=ఆ రాముఁడు; మయాపి=నాచేతను,(అపిశబ్దముచే) లక్ష్మణసుగ్రీవాదులచేతను;వివిధైః= నానావిధములయినః;వాక్యైః = మాటలచేత;కృచ్ఛ్రాత్ =కష్టమువలన;పునః=మఱల; ఉత్థాపితః=లేపఁబడినాఁడు.

అట్లు, మహాత్ముండగు రాముండు దుఃఖితుండై బహుకాలము నేలంబడియుండెను; అంత, లక్ష్మణుండును సుగ్రీవుండును నేనును ఇతరులును నానావిధవాక్యంబులం దేర్పఁగాఁ, గష్టంబునమఱలలేచినాఁడు.

అని, తాత్పర్యము.

తాని దృష్ట్వా మహాబాహు ర్దర్శయిత్వా ముహుర్ముహుః
రాఘవ స్సహ సౌమిత్రి స్సుగ్రీవే సన్యవేదయత్. ౪౩

టీక॥మహాబాహుః=పెద్దచేతులుగలః;సః=ఆ; రాఘవః=రాముఁడు; సహసౌమిత్రిః=లక్ష్మణునితోఁగూడినవాఁడై; తాని=ఆయాభరణములను; దృష్ట్వా=చూచి;ముహుర్ముహుః=మాటిమాటికి; దర్శయిత్వా=చూపి; సుగ్రీవే=సుగ్రీవునియందు; న్యవేదయత్=ఒప్పగించెను.

మహాబాహుండగు రాముండు లక్ష్మణునితోఁగూడ, నాయాభరణంబులంబలుమాఱుఁజూచి, సుగ్రీవునకుఁజూపి, యంత, సుగ్రీవునిచేతికిచ్చినాఁడు.

అని, తాత్పర్యము.

స తవా దర్శనా దార్యే రాఘవః పరితప్యతే
మహతా జ్వలతా నిత్య మగ్ని నేవాగ్ని పర్వతః. ౪౪

టీక॥ఆర్యే= పూజ్యురాలవగు సీతాదేవీ!సః=ఆ; రాఘవః=రాముఁడు; తవ=నీయొక్క; అదర్శనాత్=అగపడకపోవుటవలన;మహతా=పెద్దదియును; జ్వలతా=మండుచున్నదియునగు;అగ్నినా=అగ్నిహోత్రముచేత; అగ్నిపర్వతఇవ= అగ్నిపర్వతమువలె; నిత్యం=ఎల్లప్పుడును; పరితప్యతే=తపించుచున్నాఁడు.

పూజ్యురాలవగుసీతాదేవి! రాముం

దు, నీవగపడకుండుటం జేసి, మండుచున్నమహాగ్నిహోత్రముచే నగ్నిపర్వతముంబోలెం, బరితపించుచున్నాఁడు. అని, తాత్పర్యము.

త్వత్కృతే తమ నిద్రా చ శోకశ్చింతా చ రాఘవమ్
తాపయంతి మహాత్మాన మగ్న్యగార మివాగ్నయః. ౪౫

టీక॥ త్వత్కృతే = నీకుఁగా; మహాత్మానం = పూజ్యమగుస్వభావముగల; తం = ఆ; రాఘవం = రాముని; అనిద్రా చ = నిదుర లేకుండుటయు; శోకః = దుఃఖమును; చింతా చ = చింతయును; అగ్న్యగారం = అగ్నిహోత్రగృహమును; అగ్నయఇవ = అగ్నులుంబోలె; తాపయంతి = తపింపఁజేయుచున్నవి.

మహాత్ముండగు నా రాముండు, నీకుఁగా, నిదుర లేక, దుఃఖంబునుజింతచేతను, అగ్నిహోత్రములచే నగ్నిహోత్రగృహముంబోలెం, దాపంబునొందుచున్నాఁడు. అని, తాత్పర్యము.

తవా దర్శన శోకేన రాఘవః ప్రవిచాల్యతే
మహతా భూమికంపేన మహానివ శిలోచ్చయః. ౪౬

టీక॥ రాఘవః = రాముఁడు; తవ = నీయొక్క; అదర్శనశోకేన = అగపడకుండుటచేఁ గలిగిన దుఃఖముచేత, మహతా = పెద్దదైన; భూమికంపేన = భూకంపముచేత; మహాన్ = పెద్దదైన; శిలోచ్చయఇవ = పర్వతముంబోలె; ప్రవిచాల్యతే = కదలింపఁబడుచున్నాఁడు.

రాముండు, నీవగపడనిదుఃఖముచేత, భూకంపముచేఁ బర్వతము చలించునట్లు, చలనంబునొందుచున్నాఁడు. అని, తాత్పర్యము.

కాననాని సురమ్యాణి నదీః ప్రస్రవణాని చ
చరన్న రతి మాప్నోతి త్వా మపశ్యన్ నృపాత్మజే. ౪౭

టీక॥ నృపాత్మజే = రాచకూఁతుంగైనసీతా! రామః = (అధ్యాహృతము)

రాముండు; త్వాం = నిన్ను; అపశ్యన్=చూడనివాఁడై; సురమ్యాణి=మిక్కిలియు సుందరములయిన; కాననాని=అడవులను; నదీః=ఏఱులను; ప్రస్రవణాని=సెలయేఱులను; చరన్=తిరుగుచు; రతిం=సంతోషమును; నాప్నోతి=పొందఁడు.

రాచకొమారితెవగు సీతాదేవీ! నిన్నుఁ జూడకున్నందున, రాముఁడు, సుందరములయిన యరణ్యంబులను నదులను సెలయేఱులను దిరుగఁగను, సంతోషంబు గలుఁగకున్నది. అని, తాత్పర్యము.

స త్వాం మనుజశార్దూలః క్షిప్రం ప్రాప్స్యతి రాఘవః
సమిత్రబాంధవం హత్వా రావణం జనకాత్మజే. ౪౮

టీక॥ జనకాత్మజే=జనకమహారాజుకొమారితెవగు సీతాదేవీ! మనుజశార్దూలః=పురుషశ్రేష్ఠుండగు; సః=ఆ; రాఘవః=రాముఁడు; సమిత్రబాంధవం=స్నేహితులతోను బంధువులతోను గూడిన; రావణం=రావణుని; హత్వా=చంపి; క్షిప్రం=శీఘ్రముగా; త్వాం=నిన్ను; ప్రాప్స్యతి=పొందఁగలఁడు.

జనకునికొమారితెవగు సీతాదేవీ! పురుషశ్రేష్ఠుండగు నా రాముండు, ఇంక శీఘ్రంబున నే రావణుని మిత్రబాంధవుల తోడం జంపి, నిన్నుఁ బొందఁగలఁడు.

అని, తాత్పర్యము.

సహితౌ రామసుగ్రీవావుభావకురుతాం తదా
సమయం వాలినం హంతుం తవ చాన్వేషణం తథా. ౪౯

టీక॥ తదా=అప్పుడు; రామసుగ్రీవౌ=రాముండును సుగ్రీవుండును; ఉభౌ=ఇద్దఱును; సహితౌ=చేరినవారలై; వాలినం=వాలిని; హంతుం=చంపుటకును; తథా=అట్లు; తవ=నీయొక్క; అన్వేషణం=వెదకుటను; కర్తుం(అధ్యాహార్యము) చ=చేయుటకును; సమయం=ప్రతిజ్ఞను; అకురుతాం=చేసిరి.

అప్పుడు, రామసుగ్రీవు లిర్వురును, చేరి, రాముండు, వాలిఁ జంపునట్లును, సుగ్రీవుండు నిన్ను వెదకునట్లును, ప్రతిజ్ఞ చేసికొనిరి. అని, తాత్పర్యము.

తతస్తాభ్యాం కుమారాభ్యాం వీరాభ్యాం స హరీశ్వరః

కిష్కింధాం సముపాగమ్య వాలీ యుద్ధే నిపాతితః. ౫౦

టీక॥ తతః=అటుపిమ్మట ; వీరాభ్యాం= పరాక్రమశాలులగు ; తాభ్యాం=ఆ; కుమారాభ్యాం= రామసుగ్రీవులచేత; కిష్కింధాం=కిష్కింధను; సముపాగమ్య=పొంది; హరీశ్వరః=వానరులకు ప్రభుండగు;సః= ఆ; వాలీ=వాలి; యుద్ధే = యుద్ధమునందు; నిపాతితః=చంపఁబడినాఁడు.

అంతట, పరాక్రమశాలులగు నా రామసుగ్రీవులు, కిష్కింధకుఁబోయి, యుద్ధంబున,వానరేశ్వరుండగు వాలిం జంపిరి. అని, తాత్పర్యము.

తతో నిహత్య తరసా రామో వాలిన మాహవే
సర్వేషాం హరి సంఘానాం సుగ్రీవ మకరోత్పతిమ్. ౫౧

టీక॥తతః=అటుపిమ్మట; రామః= రాముఁడు; ఆహవే=యుద్ధంబునందు; తరసా=బలముచేత; వాలినం= వాలిని;నిహత్య=చంపి; సుగ్రీవం=సుగ్రీవుని; సర్వేషాం హరిసంఘానాం= సమస్తములయిన యెలుఁగుగోడ్డులయొక్కయు వానరులయొక్కయు సమూహములకు; పతిం =ప్రభువునుగా; అకరోత్=చేసెను.

అంత, రాముండు, బలంబు నాశ్రయించి యుద్ధంబునవాలింజంపి,సమస్తములయినయెలుఁగ గోడ్డులకును వానరులకును సుగ్రీవుని ప్రభువుగాఁ జేసెను.అని, తాత్పర్యము.

రామ సుగ్రీవ యో రైక్యం దేవ్యేవం సమజాయత

టీక॥దేవి=సీతాదేవీ!ఏవం=ఇట్లు; రామసుగ్రీవయోః= రామునకునుసుగ్రీవునకును;ఐక్యం = సమాగమము;సమజాయత=కలిగినది.

సీతాదేవీ!ఈప్రకారముగా, రామునకుసుగ్రీవునకుసమాగమంబుగల్గినది. అని, తాత్పర్యము.

హనుమంతంచ మాం విద్ధి తయో ర్దూత మిహాగతమ్. ౫౨

టీక॥ఇహ=ఇచ్చటికి;ఆగతం = వచ్చిన;మాం=నన్ను;తయోః= ఆరామసుగ్రీవులయొక్క;దూతం= దూతనైన;హనుమంతం=హనుమంతునిఁగా; విద్ధి=ఎఱుంగుము.

నేనుహనుమంతుఁడను, ఆరామసుగ్రీవులపనుపున, దూతనై యిచ్చటికివచ్చితినని యెఱుంగుము.

అని, తాత్పర్యము.

స్వరాజ్యం ప్రాప్య సుగ్రీవ స్సమానీయ హరీశ్వరాన్
త్వదర్థం ప్రేషయామాస దిశో దశ మహాబలాన్. ౫౩

టీక॥సుగ్రీవః=సుగ్రీవుఁడు; స్వరాజ్యం=తనరాజ్యమును;ప్రాప్య= పొంది; మహాబలాన్=అధికమయినబలముగల;హరీశ్వరాన్= వానరనాయకులను;సమానీయ=రప్పించి; త్వదర్థం=నీకొఱకు;దశ = పదియయిన;దిశః=దిక్కులనుగూర్చి; ప్రేషయామాస=పంపెను.

అట్లు సుగ్రీవుండు, తనరాజ్యంబుఁబొంది,బలవంతులగువానరనాయకులనందఱరప్పించి,నిన్నువెదకుటకై,పదిదిక్కులకుఁబంపెను. అని, తాత్పర్యము.

ఆదిష్టా వానరేంద్రేణ సుగ్రీవేణ మహౌజసా
అద్రిరాజప్రతీకాశా స్సర్వతః ప్రస్థితా మహీమ్ ౫౪

టీక॥అద్రిరాజప్రతీకాశాః= పర్వతశ్రేష్ఠములతోసమానములయిన వానరులు;మహౌజసా=అధికమయినపరాక్రమముగల వాఁడును ; వానరేంద్రేణ=వానరులకుఁ బ్రభుండునగు; సుగ్రీవేణ=సుగ్రీవునిచేత; ఆదిష్టాః=ఆజ్ఞాపింపఁబడినవారలై;మహీం=(అత్యంతసంయోగమునందుద్వితీయ) భూమియందు;సర్వతః= అంతటను ; ప్రస్థితాః=బయలుదేఱిరి.

పెద్దకొండలంతటి వానరులు , మహాపరాక్రమశాలియువానరనాయకుండునగు, సుగ్రీవునియాజ్ఞను శిరసావహించి,నిన్నువెదకుటకై, భూమియంతయుఁదిరుగుచున్నారు.

అని, తాత్పర్యము.

స ౩౫

తతస్తే మార్గమాణా వై సుగ్రీవ వచనాతురాః
చరంతి వసుధాం కృత్స్నాం వయమన్యే చ వానరాః. ౫౫

టీక॥ తతః=అటుపిమ్మట; తే=అట్టి; వయం=మేమును; అన్యే=ఇతరులయిన; వానరాశ్చ=వానరులును; సుగ్రీవ వచనాతురాః= సుగ్రీవుని మాటవలన భయపడినవారమై; మార్గమాణాః= వెదకుచు ("వై" అనునది పాదపూరణార్థము); కృత్స్నం= సమస్తమయిన; వసుధాం=భూమిని; చరంతి= తిరుగుచున్నారు.

అంతట, నేను మొదలు నావానరులందఱము, సుగ్రీవుని యాజ్ఞకు భయపడి, నిన్ను వెదకుచు భూమియంతయు దిరుగుచున్నాము. అని, తాత్పర్యము.

అంగదో నామ లక్ష్మీవాన్ వాలిసూను ర్మహాబలః
ప్రస్థితః కపిశార్దూల స్త్రిభాగ బలసంవృతః. ౫౬

టీక॥ వాలిసూనుః=వాలియొక్క కొడుకును; మహాబలః=అధికమయిన బలముగలవాఁడును; లక్ష్మీవాన్ = అధికమయిన సంపద కలవాఁడు; కపిశార్దూలః=వానరశ్రేష్ఠుండునగు; అంగదః= అంగదుండు; త్రిభాగబలసంవృతః=మూఁడవ భాగమయిన సైన్యముచేఁబరివేష్టింపఁబడినవాఁడై; ప్రస్థితః=బయలుదేఱినాఁడు.

అందు, మహాబలుండును శ్రీమంతుండును వానర శ్రేష్ఠుండు నగు వాలిపుత్రుండంగదుండు, సైన్యములో మూఁడవ భాగముంగూడి, వెడలెను.

అని, తాత్పర్యము.

తేషాం నో విప్రణష్టానాం వింధ్యే పర్వతసత్తమే
భృశం శోకపరీతానా మహోరాత్రగణా గతాః. ౫౭

టీక॥ తేషాం=అట్టి; నః=మేము; పర్వతసత్తమే=పర్వతశ్రేష్ఠమయిన; వింధ్యే=వింధ్యపర్వతమునందు; విప్రణష్టానాం = నాశమునొందినవారలమయి, దారిదప్పినవారలమయియుండుట; భృశం = మిక్కిలియు; శోకపరీతానాం=

దుఃఖముచే వ్యాపింపఁబడియుండఁగా; అహోరాత్రగణాః, అహోరాత్ర= అహోరాత్రములయొక్క, గణాః = సమూహములు; గతాః=పోయినవి.

అట్లు, మేము, నిన్ను వెదకుచుఁ, బర్వతోత్తమంబయిన వింధ్యపర్వతములో నొకబిలముఁబ్రవేశించి మఱలవచ్చుటకు దారిదెలియక మిక్కిలియు దుఃఖపడుచుఁ, బెక్కహోరాత్రములు గడిపినాము. అని, తాత్పర్యము.

తే వయం కార్యవైరాశ్యా త్కాలస్యాతిక్రమేణచ
భయాచ్చ కపిరాజస్య ప్రాణాం స్త్యక్తుం వ్యవస్థితాః. ౫౦

టీక॥ తే=అట్టి; వయం= మేము; కార్యవైరాశ్యాత్ = కార్యమందాశలేకుండుటవలనను; కాలస్య = సుగ్రీవునిచేనిర్ణయింపఁబడిన, కాలముయొక్క; అతిక్రమేణచ = అతిక్రమించుటచేతను; కపిరాజస్య(పంచమ్యర్థమందుషష్ఠి)=వానరనాయకుండగు సుగ్రీవునివలన; భయాచ్చ = భయమువలనను ; ప్రాణాన్=ప్రాణంబులను; త్యక్తుం=విడుచుటకు; వ్యవస్థితాః= నిశ్చయించుకొంటిమి.

అట్లు పెక్కుదివసంబులు గడవఁగానే, మేము, సుగ్రీవుండునిర్ణయించినకాలంబతిక్రమించిపోవుటంజూచి, యింకఁ, గార్యసాధనంబున కెంతమాత్రముపాయంబుగానక, సుగ్రీవునివలనిభయంబునఁ, బ్రాణంబులవిడువ నిశ్చయించినాము. అని, తాత్పర్యము.

విచిత్య వనదుర్గాణి గిరిప్రస్రవణానిచ
అనాసాద్య పదం దేవ్యాః ప్రాణాం స్త్యక్తుం సముద్యతాః. ౫౧

టీక॥ వయం(అధ్యాహృతము)=మేము; వనదుర్గాణి — చొరరానియరణ్యంబులను; గిరిప్రస్రవణానిచ= పర్వతములను సెలయేఱులను; విచిత్య— వెదకి; దేవ్యాః=నీయొక్క; పదం=స్థానమును; అనాసాద్య=పొందక; ప్రాణాన్ — ప్రాణంబులను; త్యక్తుం—విడుచుటకు; సముద్యతాః—ప్రయత్నపడినాము.

మేము, ప్రవేశింపనలవిగాని యరణ్యంబులందును బర్వతములయందును సెలయేఱులయందును వెదకి, యట్లు సుగ్రీవుండు నిర్ణయించిన కాలంబతిక్రమిం

చుటయు, "సుగ్రీవుండైనను, తనయాజ్ఞనుల్లంఘించినందుకై మమ్ములంజంపును" అని, యెంచి, యిచ్చటనే, ప్రాణంబులువిడువనిశ్చయించినాము.

అని, తాత్పర్యము.

దృష్ట్వా ప్రాయోపవిష్టాంశ్చ సర్వాన్వానరపుంగవాన్
భృశం శోకార్ణవే మగ్నః పర్యదేవయ దంగదః. ౭౦
తవ నాశంచ వైదేహి వాలినశ్చ వధం తథా
ప్రాయోపవేశ మస్మాకం మరణంచ జటాయుషః. ౭౧

టీక॥ వైదేహి = సీతాదేవీ! అంగదః = అంగదుఁడు; ప్రాయోపవిష్టాన్ = మరణముఁగలిగించు వ్రతమునవలంబించిన; వానరపుంగవాన్ = వానరశ్రేష్ఠులను; సర్వాన్ = అందఱను; దృష్ట్వా = చూచి; భృశం = మిక్కిలియు; శోకార్ణవే = దుఃఖసముద్రమునందు; మగ్నః = మునింగినవాఁడై; తవ = నీయొక్క; నాశంచ = అగపడకపోవుటనుగూర్చియు; తథా = అట్లు; వాలినః = వాలియొక్క; వధంచ = చంపుటనుగూర్చియు; అస్మాకం = మాయొక్క; ప్రాయోపవేశం = మరణవ్రతము నవలంబించుటనుగూర్చియు; జటాయుషః = జటాయువుయొక్క; మరణంచ = చావునుగూర్చియు; పర్యదేవయత్ = ఏడ్చెను.

సీతాదేవీ! అంతనంగదుండు, ప్రాయోపవిష్టులయినవానరులనందఱంజూచి, దుఃఖసముద్రంబునమునింగి, నీవగపడకపోవుటయు, వాలిచంపఁబడుటయు, మేమందఱమును మరణవ్రతముఁబూనుటయు, జటాయువుచచ్చుటయు, వీనినన్నిటినిం బేర్కొని, దుఃఖించెను.

అని, తాత్పర్యము.

తేషాం న స్స్వామిసందేశా న్నిరాశానాం ముమూర్షతామ్
కార్యహేతోరివాయాత శ్శకుని ర్వీర్యవాన్ మహాన్. ౭౨

టీక॥ స్వామిసందేశాత్ = సుగ్రీవునియాజ్ఞవలన; నిరాశానాం = ఆశలేనివారలమును; ముమూర్షతాం = చావనిచ్ఛించుచున్నవారలమునగు; తేషాం = అట్టి; నః = మాయొక్క; కార్యహేతోరివ = కార్యమునుకారణము వలనంబోలె;

వీర్యవాన్ = పరాక్రమశాలియు; మహాన్=పూజ్యమయినదియునగు; శకునిః=పక్షి; ఆయాతః=వచ్చినది.

సుగ్రీవుండు, "నిర్ణయకాలము నతిక్రమించివచ్చినవాఁడు చంపఁబడును" అని, యాజ్ఞాపించియుండుటవలన, ప్రాణంబులపట్ల నిరాశులమయి ప్రాణంబులువిడువనున్నమాకుఁ, గార్యసిద్ధినిచ్చుటకై దైవము వచ్చెనోయని యనందగునట్లు, పరాక్రమశాలియుఁ బూజ్యుండునగు పక్షిరాజొకండచ్చటికివచ్చెను.

అని, తాత్పర్యము.

గృధ్ర రాజస్య సోదర్య స్సంపాతి ర్నామ గృధ్రరాట్
శ్రుత్వా భ్రాతృవధం కోపా దిదం వచన మబ్రవీత్. ౬౩

టీక॥ గృధ్రరాజస్య=గద్దలకు రాజయినజటాయువుయొక్క; సోదర్యః=తోఁబుట్టువగు; సంపాతిర్నామ=సంపాతియని ప్రసిద్ధుండయిన; గృధ్రరాట్=గద్దలరాజు; భ్రాతృవధం=తనతోఁబుట్టువయిన జటాయువుయొక్క చంపుటను; శ్రుత్వా=విని; కోపాత్=కోపమువలన; ఇదం=ఈ; వచనం=మాటను; అబ్రవీత్=పలికెను.

అతండు గృధ్రరాజుండగు జటాయువునకుం దోఁబుట్టువు, అతని పేరు సంపాతి; అతండు, తన తమ్ముండు జటాయువు చంపఁబడుటను విని, కోపంబునొంది, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము,

యవీయా న్కేన మే భ్రాతా హతః క్వచ నిపాతితః
ఏత దాఖ్యాతు మిచ్ఛామి భవద్భి ర్వానరోత్తమాః. ౬౪

టీక॥ వానరోత్తమాః=వానరశ్రేష్ఠులారా! మే= నాయొక్క; యవీయాన్=చిన్న; భ్రాతా= తోఁబుట్టువు; కేన=ఎవ్వనిచేత; హతః=చంపఁబడినాఁడు? క్వచ=ఎచ్చట; నిపాతితః=చంపఁబడినాఁడు? భవద్భిః=మీచేత; ఏతత్=దీని; ఆఖ్యాతుం=చెప్పుటకు; ఇచ్ఛామి=కోరుచున్నాను.

వానరశ్రేష్ఠులారా! నాతమ్ముండగుజటాయువును, ఎవ్వఁడు చంపినాఁడు? ఎచ్చటఁ జంపినాఁడు? మీరలీసంగతి నాకుఁ జెప్పవలెను; అని, సంపాతి చెప్పెను. అని, తాత్పర్యము.

అంగదోఽకథయత్తస్య జనస్థానే మహావ్వధమ్
రక్షసా భీమరూపేణ త్వా ముద్దిశ్య యథాతథమ్. ౬౫

టీక॥ అంగదః= అంగదుఁడు; తస్య=ఆసంపాతికి; జనస్థానే=జనస్థానమునందు; త్వాం=నిన్ను; ఉద్దిశ్య=ఉద్దేశించి; భీమరూపేణ=భయంకరమయిన రూపముగల; రక్షసా=రాక్షసుండగు రావణుని చేత; మహావ్వధం (మహావధం)=పెద్దచంపుటను; యథాతథం=నడిచినఁనడిచినట్టుగా; అకథయత్= చెప్పెను.

అంగదుం,డతనికి, జనస్థానంబున నీకొఱకై భయంకరాకారుండగు రావణుండు జటాయువుం జంపుట మొదలుగానావృత్తాంతమంతయుం జెప్పెను.

అని, తాత్పర్యము.

జటాయుషో వధం శ్రుత్వా దుఃఖిత స్సోరుణాత్మజః
త్వాం శశంస వరారోహే వసంతీం రావణాలయే. ౬౬

టీక॥ వరారోహే=శ్రేష్ఠములయిన పిఱుఁదులుగలసీతాదేవీ! అరుణాత్మజః=అరుణునికొడుకైన; సః= ఆసంపాతి; జటాయుషః=జటాయువుయొక్క; వధం=చంపుటను; శ్రుత్వా=విని; దుఃఖితః = దుఃఖమునొందినవాఁడై; త్వాం=నిన్ను; రావణాలయే = రావణునింటియందు; వసంతీం=ఉన్నదానిఁగా; శశంస=చెప్పెను.

శ్రేష్ఠములయినపిఱుఁదులుగలసీతాదేవీ! అరుణునికొడుకైన యాసంపాతి, రావణుండుజటాయువును చంపుటనువిని, దుఃఖితుండై, "నీవు రావణునింటనున్నావు" అని, మాకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తస్య తద్వచనం శ్రుత్వా సంపాతేః ప్రీతివర్ధనమ్
అంగదప్రముఖా స్తూర్ణం తత స్సంప్రస్థితా వయమ్. ౬౭

టీక॥ తస్య=ఆ; సంపాతేః=సంపాతియొక్క; ప్రీతివర్ధనం=సంతోషమును వృద్ధిఁబొందించునట్టి; తత్= ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; తతః=అటుపిమ్మట; అంగదప్రముఖాః = అంగదుండు మొదలుగాఁగల; వయం = మే

ము; తూర్ణం = శీఘ్రముగా; సంప్రస్థితాః — బయలుదేఱినాము.

అంతనా సంపాతిమాటను విని, అంగదుండు మొదలు మేమందఱమును బరమ సంతోషంబునొంది, శీఘ్రముగాఁ బయ నంబయితిమి. అని, తాత్పర్యము.

వింధ్యాదుత్థాయ సంప్రాప్తాస్సాగరస్యాంత ముత్తరమ్
త్వద్దర్శనకృతోత్సాహా హృష్టాస్తుష్టాః ప్లవంగమాః. ౬౮

టీక॥ ప్లవంగమాః = వానరులు; త్వద్దర్శనకృతోత్సాహాః = నీయొక్క చూచుటయందుఁ జేయఁబడిన యుత్సాహము గలవారలై; తుష్టాః = సంతోషముగలవారలై; హృష్టాః = గగుర్పాటుగలవారలై; వింధ్యాత్ = వింధ్యపర్వతమునుండి; ఉత్థాయ = లేచి; సాగరస్య = సముద్రముయొక్క; ఉత్తరం = ఉత్తరపుదిక్కునందలి; అంతం = గట్టును; సంప్రాప్తాః = పొందినారు.

అంత, వానరులందఱు, నిన్ను సందర్శింపనుత్సుకులయి, సంతోషంబున, మేనులంబులకలు వొడమ, నుత్తరపుదిక్కునందలి సముద్రపుగట్టుం జేరిరి.

అని, తాత్పర్యము.

అంగదప్రముఖాస్సర్వే వేలోపాంత ముపస్థితాః
చింతాం జగ్ముః పునర్భీతా స్త్వద్దర్శనసముత్సుకాః. ౬౯

టీక॥ త్వద్దర్శనసముత్సుకాః = నీయొక్క దర్శనమునందు మిక్కిలి యుత్సాహముగల; అంగదప్రముఖాః = అంగదుండు మొదలుగాఁగల వానరులు; సర్వే = అందఱును; వేలోపాంతం = సముద్రపుగట్టుయొక్క సమీపమును; ఉపస్థితాః = చేరినవారలై; పునః = మఱల; భీతాః = భయపడినవారలై; చింతాం = చింతను; జగ్ముః = పొందిరి.

అట్లు, అంగదుండు మున్నగువారలందఱు నిన్నుఁ జూడనుత్సాహంబున, సముద్రపుగట్టుఁ జేరి, సముద్రంబుఁ జూచి భయపడి, మఱలం జింతనొందిరి.

అని, తాత్పర్యము.

అథాహం హరిసైన్యస్య సాగరం ప్రేక్ష్య సీదతః

వ్యవధూయ భయం తీవ్రం యోజనానాం శతం ప్లుతః. ౭౦

టీక॥ అథ = అటుపిమ్మట; అహం = నేను; సాగరం = సముద్రమును; ప్రేక్ష్య = చూచి; సీదతః = దుఃఖించుచున్న; హరిసైన్యస్య = వానరసైన్యముయొక్క; తీవ్రం = తీక్ష్ణమయిన; భయం = భయమును; వ్యవధూయ = పోఁగొట్టి; యోజనానాం = ఆమడలయొక్క; శతం = నూటిని; ప్లుతః = దాఁటినాను.

అంత, నేనట్లు సముద్రంబుఁ జూచి దుఃఖించుచున్న యా వానరసైన్యంబుఁ జూచి, వారలభయంబుఁ బోఁగొట్టి, నూఱు యోజనంబులదూరంబుగల సముద్రంబును దాఁటవచ్చినాను. అని, తాత్పర్యము.

లంకాచాపి మయా రాత్రౌ ప్రవిష్టా రాక్షసాకులా
రావణశ్చ మయా దృష్ట స్త్వంచ శోకపరిప్లుతా. ౭౧

టీక॥ రాక్షసాకులా = రాక్షసులచే నిండిన; లంకాచాపి = లంకయును; మయా = నాచేత; రాత్రౌ = రాత్రియందు; ప్రవిష్టా = ప్రవేశింపఁబడినది. మయా = నాచేత; రావణశ్చ = రావణుండును; దృష్టః = చూడఁబడినాఁడు. శోకపరిప్లుతా = దుఃఖముచే వ్యాపింపఁబడియున్న; త్వంచ = నీవును; దృష్టా (అధ్యాహృతము) = చూడఁబడినావు.

రాక్షసులచే నిండియుండు నీలంకను రాత్రికాలములోఁ బ్రవేశించినాను; నేను రావణునిం జూచినాను; పరిమదుఃఖితవయి యున్న నిన్నుం జూచినాను. అని, తాత్పర్యము.

ఏతత్తే సర్వ మాఖ్యాతం యథా వృత్త మనిందితే
అభిభాషస్వ మాం దేవి దూతో దాశరథే రహమ్. ౭౨

టీక॥ అనిందితే = నిందింపఁబడనట్టి, సీతాదేవీ! ఏతత్ = ఈసమాచారము; సర్వం = అంతయును; యథావృత్తం = నడిచినట్టుగా; తే = నీకొఱకు; ఆఖ్యాతం = చెప్పఁబడినది. దేవి = సీతాదేవీ! మాం = నన్నుఁ గూర్చి; అభిభాషస్వ = మాటలాడుము. అహం = నేను; దాశరథేః = దశరథునికొడుకైన రామునియొ

కథః=దూతః=దూతను.

నిందింపఁబడనిసీతాదేవీ ! ఈవృత్తాంతమునంతయునడచినదినడచినట్టుగా, నీకుఁజెప్పినాను ; నేను రామునిచే పంపఁగావచ్చినదూతనుగాని యన్యుండఁగాను ; నాతో మాటలాడుము. అని, తాత్పర్యము.

తం మాం రామకృతోద్యోగం త్వన్నిమిత్త మిహాగతమ్
సుగ్రీవసచివం దేవి బుధ్యస్వ పవనాత్మజమ్. ౨౩

టీక॥దేవి=సీతాదేవి!తం = అట్టి; మాం=నన్ను ; రామకృతోద్యోగం=రామునిచేఁజేయఁబడినపనిగలవాఁడుగాను, రామునికార్యము సేయువాఁడుగా ననుట; త్వన్నిమిత్తం= నీకొఱకు ; ఇహ=ఇచ్చటికి; ఆగతం=వచ్చినవాఁడుగాను;సుగ్రీవసచివం= సుగ్రీవునిమంత్రినిగాను; పవనాత్మజం= వాయుదేవునియొక్క కొడుకునుగాను;బుధ్యస్వ= ఎఱుంగుము.

సీతాదేవి! నేను, రామునికార్యము సేయువాఁడను. అతండు పంపఁగా నీకై యిచ్చటికివచ్చినాఁడను , సుగ్రీవునకు మంత్రిని, వాయుపుత్రుండను, నీవు దలంచినట్లువానరయూపినిగాను; అని యెఱుంగుము. అని, తాత్పర్యము.

కుశలీ తవ కాకుత్స్థ స్సర్వశస్త్రభృతాం వరః
గురోరారాధనే యుక్తో లక్ష్మణశ్చ సులక్షణః. ౨౪

టీక॥తవ=నీయొక్క;పతిః = పెనిమిటియు; సర్వశస్త్రభృతాం= ఎల్లయాయుధధారులలోపలను;వరః=శ్రేష్ఠుండునగు;కాకుత్స్థః=రాముండు;కుశలీ=క్షేమముగలవాఁడు.గురోః=అన్నయొక్క ; ఆరాధనే=సేవించుటయందు; యుక్తః=ఆసక్తుఁడైన;సులక్షణః=మంచిలక్షణములుగల; లక్ష్మణశ్చ= లక్ష్మణుండును; కుశలీ(అధ్యాహృతము.)=క్షేమముగలవాఁడు.

ఆయుధధారులందఱిలోపలను శ్రేష్ఠుండగునీపెనిమిటిరాముండు క్షేమముగనున్నవాఁడు; అన్నయగు రామునకు శుశ్రూష సేయుచు శుభలక్షణంబులతోఁగూడియుండులక్ష్మణుండును, క్షేమముగనున్నవాఁడు. అని, తాత్పర్యము.

స ౩౫

తస్య వీర్యవతో దేవి భర్తుస్తవ హితే రతః
అహ మేకస్తు సంప్రాప్త స్సుగ్రీవవచనా దిహ. ౨౫

టీక॥ దేవి=సీతాదేవీ! అహం = నేను; ఏకస్తు=ఒకఁడనుమాత్రము; సుగ్రీవవచనాత్ =సుగ్రీవునియాజ్ఞవలన; వీర్యవతః=పరాక్రమశాలియగు; తవ=నీయొక్క; భర్తుః=పెనిమిటియయిన; తస్య=ఆ రామునియొక్క; హితే = మేలునందు; రతః=ఆసక్తుఁడనై; ఇహ=ఇచ్చటికి, సంప్రాప్తః=వచ్చినాఁడను.

సుగ్రీవునియాజ్ఞచే, పరాక్రమశాలియగు నీపెనిమిటిరాముని హితముఁగోరి, నేనొక్కఁడను మాత్రమెయిచ్చటికి వచ్చినాను. అని, తాత్పర్యము.

మయేయ మసహాయేన చరతా కామరూపిణా
దక్షిణా దిగ నుక్రాంతా త్వన్మార్గ విచయైషిణా. ౨౬

టీక॥ అసహాయేన= తోడులేనివాఁడను; కామరూపిణా= ఇచ్ఛాధీనంబగు రూపము గలవాఁడను; త్వన్మార్గవిచయైషిణా=నీమార్గమును వెదకనిచ్ఛించువాఁడను; చరతా=తిరుగుచున్నవాఁడనగు; మయా=నాచేత; ఇయం=ఈ; దక్షిణా=దక్షిణపు; దిక్ =దిక్కు; అనుక్రాంతా=పొందఁబడినది.

నేనొకఁడనై, నీవుండుచోటును వెదకఁగోరి, యసహాయుండనై, కామరూపియయి, తిరుగుచు, నీదక్షిణపుదిక్కుఁజేరినాను. అని, తాత్పర్యము.

దిష్ట్యాహం హరిసైన్యానాం త్వన్నాశ మనుశోచతామ్
అపనేష్యామి సంతాపం తవాభిగమశంసనాత్. ౨౭
"తవాధిగమ శంసనాత్" ఇతిపాఠాంతరం.

టీక॥ అహం=నేను; దిష్ట్యా=భాగ్యముచేత; తవ=నీయొక్క; అభిగమశంసనాత్ = సమీపమునకుఁబోవుటయొక్క చెప్పుటవలన ; అధిగమశంసనాత్ = (అనిపాఠాంతరము.) పొందుటయొక్క (చూచుటయొక్క యనుట) చెప్పుటవలన; త్వన్నాశం= నీయొక్క యగపడక పోవుటనుగుఱించి; అనుశోచతాం = దుఃఖించుచున్న; హరిసైన్యానాం=వానరసైనికులయొక్క; సంతాపం =

దుఃఖమును; అపనేష్యామి=బోఁగొట్టఁగలను.

నాభాగ్యవశంబున, నాకు, నీవగపడకపోవుటవలన దుఃఖించుచుండు వానరులకు నీవగపడిన సంగతిం జెప్పి, వారల దుఃఖంబుఁ బోఁగొట్టం గల్గినది. అని, తాత్పర్యము.

దిష్ట్యా హి మమ న వ్యర్థం దేవి సాగరలంఘనం

టీక॥ దేవి=సీతాదేవీ! దిష్ట్యా=భాగ్యముచేత; మమ=నాయొక్క; సాగరలంఘనం = సముద్రము దాఁటుట; వ్యర్థం=ప్రయోజనము లేనిది; నహి=కాలేదుగదా!

నాభాగ్యవశంబున, నేను సముద్రమును దాఁటి యింతదూరము వచ్చుట, వ్యర్థము కాలేదు. అని, తాత్పర్యము.

ప్రాప్స్యామ్యహ మిదం దిష్ట్యా త్వద్దర్శనకృతం యశః. ౭౮

టీక॥ అహం=నేను; దిష్ట్యా=భాగ్యముచేత; ఇదం=ఈ; త్వద్దర్శనకృతం=నీయొక్క చూచుటచేఁ జేయఁబడిన; యశః=కీర్తిని; ప్రాప్స్యామి=పొందఁగలను.

నాభాగ్యవశంబున, నిట్లు నిన్నుఁ జూచుటవలనం గలిగిన, మహాకీర్తిం బొందఁగంటిని. అని, తాత్పర్యము.

రాఘవశ్చ మహావీర్యః క్షిప్రం త్వా మభిపత్స్యతే
సమిత్రబాంధవం హత్వా రావణం రాక్షసాధిపమ్. ౭౯

టీక॥ మహావీర్యః= అధికమయిన పరాక్రమముగల; రాఘవశ్చ=రాముండును; క్షిప్రం=శీఘ్రముగా; సమిత్రబాంధవం=స్నేహితులతోను బంధువులతోను గూడిన; రాక్షసాధిపం= రాక్షసులకుఁ బ్రభుండగు; రావణం=రావణుని; హత్వా=చంపి; త్వాం=నిన్ను; అభిపత్స్యతే=పొందఁగలఁడు.

మహాపరాక్రమశాలియగు రాముండు, ఇంక శీఘ్రముగానే, రాక్షసేశ్వరుండగు రావణుని నతని స్నేహితులను బంధువులనుం జంపి, నిన్నుఁ జేకొనును.

అని, తాత్పర్యము.

మాల్యవాన్నామ వైదేహి గిరీణా ముత్తమో గిరిః
“కారంజో నామ వై దేవి” ఇతి పాఠాంతరం.
తతో గచ్ఛతి గోకర్ణం పర్వతం కేసరీ హరిః. ౮౦

టీక॥ వైదేహి=సీతాదేవీ! గిరీణాం=పర్వతములలో; ఉత్తమః=శ్రేష్ఠమగు; మాల్యవాన్నామ=మాల్యవంతమని ప్రసిద్ధమయిన; కారంజోనామ (అనిపాఠాంతరము)= కారంజమని ప్రసిద్ధమయిన; గిరిః=పర్వతము; అస్తి=(అధ్యాహృతము)=కలదు. తతః= అచ్చటనుండి; కేసరీ=కేసరియను; హరిః=వానరుఁడు; గోకర్ణం=గోకర్ణమను; పర్వతం=పర్వతమును; గచ్ఛతి=(భూతార్థమందు లట్)పొందెను.

సీతాదేవీ! పర్వతములలో శ్రేష్ఠమయినది మాల్యవంతమను (కారంజమను) పర్వతంబొకటిగలదు; కేసరియనువానరుండు, దానివిడిచిగోకర్ణమనుపర్వతమునకుఁబోయెను. అని, తాత్పర్యము.

స చ దేవర్షిభి ర్దిష్టః పితా మమ మహాకపిః
తీర్థే నదీపతేః పుణ్యే శంబసాదన ముద్ధరత్. ౮౧

టీక॥ మమ=నాయొక్క; పితా=తండ్రియయిన; సః=ఆ; మహాకపిః=పెద్దకోఁతియగు కేసరి; దేవర్షిభిః=దేవర్షులచేత; దిష్టః= ఆజ్ఞాపింపఁబడినవాఁడై; నదీపతేః= నదులకుఁ బెనిమిటియయినసముద్రముయొక్క; పుణ్యే=పరిశుద్ధమయిన; తీర్థే=రేవునందు; శంబసాదనం=శంబసాదనుండను రాక్షసుని; ఉద్ధరత్ (ఉదహరత్)=చంపెను.

ఆ కేసరియే నాతండ్రి; అతండచ్చట, దేవర్షులచేనాజ్ఞాపింపఁబడి, పవిత్రంబగుసముద్రతీరంబునశంబసాదనుండను రాక్షసుంజంపెను.

అని, తాత్పర్యము.

తస్యాహం హరిణః క్షేత్రే జాతో వాతేన మైథిలి
హనుమానితి విఖ్యాతో లోకే స్వేనైవ కర్మణా. ౮౨

టీక॥ మైథిలి=సీతా! అహం=నేను; తస్య=ఆ; హరిణః (హరేః)= కేసరియ

నువానరునియొక్క; క్షేత్రే= భార్యయందు; వాతేన=వాయువుచేత; జాతః=పుట్టినవాఁడను. స్వేన=నాదైన; కర్మణాచైవ = కార్యముచేతనే; లోకే=లోకమునందు; హనుమానితి=హనుమంతుఁడనని; విఖ్యాతః=ప్రసిద్ధినొందినాఁడను.

సీతాదేవీ! నేను, అట్లు కేసరిగోకర్ణపర్వతంబునకుఁ బోయియుండునప్పుడు, అతనిభార్యయందు, వాయుదేవునిచేఁబుట్టినాను; నేనుజేసినకార్యంబునకుగుఱుతుగానే, లోకంబున, నాకు హనుమంతుఁడని, పేరుగల్గినది.

అని, తాత్పర్యము.

విశ్వాసార్థం తు వైదేహి భర్తు రుక్తా మయా గుణాః

టీక॥ వైదేహి=సీతాదేవి! విశ్వాసార్థంతు = నమ్మకముకొఱకే; మయా=నాచేత; భర్తుః=పెనిమిటియగు రామునియొక్క; గుణాః=గుణములు; ఉక్తాః=చెప్పఁబడినవి!

సీతాదేవి! నీకునమ్మకము గలుగుటకై నీపెనిమిటియగు రామునిగుణంబులం జెప్పినాను. అని, తాత్పర్యము.

అచిరా ద్రాఘవో దేవి త్వా మితో నయితా నఘే. ౮౩

టీక॥ అనఘే=పాపములేని; దేవి=సీతాదేవీ! రాఘవః=రాముఁడు; అచిరాత్=శీఘ్రముగా; త్వాం=నిన్ను; ఇతః=ఇచ్చటనుండి; నయితా (నేతా)=తీసికొనిపోఁగలఁడు.

ఎంతమాత్రముపాపములేనట్టిసీతాదేవీ! రాముండింకశీఘ్రంబుగనే నిన్నిచ్చటనుండి గొనిపోఁగలఁడు. అనిహనుమంతుఁడుసీతతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవం విశ్వాసితా సీతా హేతుభి శ్శోకకర్శితా

ఉపపన్నై రభిజ్ఞానై ర్దూతం త మవగచ్ఛతి. ౮౪

టీక॥ శోకకర్శితా=దుఃఖముచేఁగృశింపఁజేయఁబడిన; సీతా=సీతాదేవి; ఏవం=ఇట్లు; హేతుభిః=కారణములచేత; విశ్వాసితా=నమ్మకమునొందునట్లు చేయఁబడినదై; ఉపపన్నైః= సరియైన; అభిజ్ఞానైః = గుఱుతులచేత;

తం=ఆహనుమంతుని; దూతం=దూతనుగా; అవగచ్ఛతి (భూతార్థమునందులట్)=తెలిసికొనెను.

అట్లు పరమదుఃఖితయయియుండు నాసీతాదేవికి, హనుమంతుండీప్రకారంబునగుఱుతులు చెప్పినమ్మకంబుగల్గింపఁగా, నంతనాసీతాదేవి, హనుమంతుండు చెప్పినసరియయినగుఱుతులచే, నతని రామదూతనుగానమ్మెను.

అని, తాత్పర్యము.

అతులం చ గతా హర్షం ప్రహర్షేణ చ జానకీ
నేత్రాభ్యాం వక్రపక్ష్మాభ్యాం ముమోచానందజం జలమ్. ౮౫

టీక॥ జానకీ=జనకునికొమార్తెయగుసీతాదేవి; అతులం=సరిలేని; హర్షంచ = సంతోషమును; గతా=పొందినదై; ప్రహర్షేణ=సంతోషముచేత; వక్రపక్ష్మాభ్యాం=వంకరలయినకనుఱెప్పలచేత; ఆనందజం=సంతోషమునంగలిగిన; జలం=నీటిని; ముమోచ=విడిచెను.

సీతాదేవి యంతసరిలేనిసంతోషంబునొంది, వంకరలయినకనుఱెప్పలచే, నానందబాష్పంబులవిడిచెను.

అని, తాత్పర్యము.

చారు తద్వదనం తస్యాస్తామ్రశుక్లాయతేక్షణం
అశోభత విశాలాక్ష్యా రాహుముక్త ఇవోడురాట్. ౮౬

టీక॥ విశాలాక్ష్యాః=విశాలములయినకండ్లుగల; తస్యాః= ఆసీతయొక్క; చారు= సుందరమయిన; తామ్రశుక్లాయతేక్షణం=ఎఱ్ఱనివియుఁదెల్లనివియునిడుపైనవియునగు కండ్లుగలదియునగు; తత్=ఆ; వదనం=ముఖము; రాహుముక్తః=రాహువుచేవిడువబడిన; ఉడురాడివ=నక్షత్రములకుఁబ్రభువైన చంద్రుండుంబోలె; అశోభత=ప్రకాశించెను.

అట్లుసంతోషంబున, సుందరంబయి కొనల నెఱ్ఱనివై నడుమందెల్లఁగా విశాలంబులయియుండునట్టికండ్లుగల, యాసీతాదేవిముఖంబు, రాహువుచేవిడువంబడిన చంద్రుండుంబోలెఁ బ్రకాశించినది. అని, తాత్పర్యము.

హనుమంతం కపిం వ్యక్తం మన్యతే నాన్యథేతి సా

టీక॥ సా= ఆసీతాదేవి; హనుమంతం=హనుమంతుని; వ్యక్తం=స్పష్టముగా; కపిం=వానరుని గాను; అన్యథా=వేఱువిధముగా; నేతి=కాదనియు; మన్యతే=(భూతార్థమందులట్) తలంచినది.

ఆసీతాదేవి, హనుమంతుని స్పష్టముగా, వానరుండనియు, మాయావికాదనియుఁ, దెలిసికొనినది.

అని, తాత్పర్యము.

అథోవాచ హనూమాం స్తాముత్తరం ప్రియదర్శనామ్. ౧౭

టీక॥ అథ=అటుపిమ్మట; హనూమాన్=హనుమంతుండు; ప్రియదర్శనాం=సంతోషకరంబగు చూచుటగల; తాం=ఆసీతనుగూర్చి; ఉత్తరం=ప్రత్యుత్తరమాటను; ఉవాచ=చెప్పెను.

అంత, హనుమంతుండు, చూపరులకు సంతోషంబుగల్గించునట్టి సీతంజూచి, మఱలనిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఏతత్తే సర్వమాఖ్యాతం సమాశ్వసిహి మైథిలి
కిం కరోమి కథం వా తే రోచతే ప్రతియామ్యహమ్. ౧౮

టీక॥ మైథిలి=సీతాదేవీ! ఏతత్=ఈసమాచారము; సర్వం=అంతయు; తే=నీకొఱకు; సమాఖ్యాతం=చెప్పఁబడినది; సమాశ్వసిహి=ఊఱడిల్లుము; కిం=ఏమి; కరోమి=చేయుదును? కథంవా=ఎట్లు; తే=నీకు; రోచతే=ఇష్టమగుచున్నది? అహం=నేను; ప్రతియామి=మఱలిపోవుచున్నాను.

సీతాదేవీ! నీకీవృత్తాంతమంతయుఁ జెప్పినాను; ఊఱడిల్లుము; నేనిప్పుడేమి చేయవలెను? నీకేమి దోఁచుచున్నది? శీఘ్రముగా నానతిమ్ము; నేనుమఱల రాము నొద్దకుఁబోవలయును.

అని, తాత్పర్యము.

హతేఽసురే సంయతి శంబసాదనే
కపిప్రవీరేణ మహర్షిచోదనాత్
తతోఽస్మి వాయుప్రభవో హి మైథిలి
ప్రభావతస్తత్ప్రతిమశ్చ వానరః. ౧౯

టీక॥ మైథిలి=సీతాదేవీ! మహర్షిచోదనాత్ = మహర్షుల ప్రేరణవలన; కపిప్రవీరేణ=వానరవీరునిచేత; సంయతి=యుద్ధమునందు; శంబసాదనే=శంబసాదనుఁడను; అసురే= అసురుఁడు; హతే=చంపఁబడఁగా; తతః= అందువలన; అహం(అధ్యాహృతము)=నేను; వాయుప్రభవః= వాయువె కారణముగాఁ గలవాఁడను; అస్మిహి = అగుచున్నానుగదా! ప్రభావతః= ప్రభావమువలన; తత్ప్రతిమః = ఆవాయువుతోఁబోలికఁగల; వానరశ్చ = వానరుఁడను.

సీతాదేవీ! మహర్షులు ప్రేరేపించుటంజేసి, నాతండ్రియగు కేసరి, యుద్ధంబున శంబసాదనుండను నసురుంజంపఁబోఁగా, నందువలన, నేనువాయువునకుఁబుట్టినాను; ప్రభావంబున నావాయువునకు సమానుండను. అని, హనుమంతుండు, సీతతోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, సుందరకాండే, పంచత్రింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, సుందరకాండపంచత్రింశసర్గటీక, ముగిసినది.

